మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః,
యత్ క్రౌఞ్చ మిథునాదేకమవధీః కామమోహితమ్

(రామాయణ రచనకి కారణమైన శ్రీకరమైన శ్లోకం.రామాయణము చదివినా, విన్నా, గృహంలో ఉంచినా సకలసౌభాగ్యాలూ సిద్ధిస్తాయి.)

# వాల్మీకి రామాయణము



సరళరమ్యవచనము :

మైథిలీ వెంకటేశ్వర రావు

# శ్రీనామ రామాయణము

ఓమ్ శ్రీ సీతా-లక్ష్మణ-భరత శత్రుఘ్న-హనుమత్ సమేత
శ్రీరామ చంద్రపరబ్రహ్మణే నమః

1. శుద్ధబ్రహ్మ పరాత్పర రామ
2. కాలాత్మక పరమేశ్వర రామ
3. శేషతల్పసుఖనిద్రిత రామ
4. బ్రహ్మాద్యమరప్రార్థిత రామ
5. చండకిరణకులమండన రామ
6. శ్రీమద్దశరథనందన రామ
7. కౌసల్యాసుఖవర్ధన రామ
8. విశ్వామిత్రప్రియధన రామ
9. ఘోరతాటకాఘాతక రామ
10. మారీచాదినిపాతక రామ
11. కౌశికమఖసంరక్షక రామ
12. శ్రీమదహల్యోద్ధారక రామ
13. గౌతమముని సంపూజిత రామ
14. సురమునివరగణసంస్తుత రామ
15. నావిక ధావిత మృదుపద రామ
16. మిథిలాపురజన మోదక రామ
17. విదేహ మానస రంజక రామ
18. త్ర్యంబకకార్ముకభంజక రామ
19. సీతార్పితవరమాలిక రామ
20. కృతవైవాహిక కౌతుక రామ
21. భార్గవదర్పవినాశక రామ
22. శ్రీమదయోధ్యాపాలక రామ
23. అగణితగుణగణభూషితరామ
24. అవనీతనయాకామిత రామ
25. రాకాచంద్రసమానన రామ
26. పితృవాక్యాశ్రితకానన రామ
27. ప్రియగుహవినివేదితపద రామ
28. తత్క్షాళితనిజమృదుపద రామ
29. భరద్వాజముఖానందక రామ
30. చిత్రకూటాద్రినికేతన రామ
31. దశరథసంతతచింతిత రామ
32. కైకేయీతనయార్థిత రామ
33. విరచితనిజపితృకర్మక రామ
34. భరతార్పితనిజపాదుక రామ
35. దండకవనజనపావన రామ
36. దుష్టవిరాధవినాశన రామ
37. శరభంగసుతీక్ష్ణార్చిత రామ
38. అగస్త్యానుగ్రహవర్ధిత రామ
39. గృధ్రాధిపసంసేవిత రామ
40. పంచవటీతటసుస్థిత రామ
41. శూర్పణఖార్తివిధాయక రామ
42. ఖరదూషణముఖసూదక రామ
43. సీతాప్రియహరిణానుగ రామ
44. మారీచార్తికృదాశుగ రామ
45. వినష్టసీతాన్వేషక రామ
46. గృధ్రాధిపగతిదాయక రామ
47. శబరీదత్తఫలాశన రామ
48. కబంధబాహుచ్ఛేదన రామ
49. హనుమత్సేవితనిజపద రామ
50. నతసుగ్రీవాభీష్టద రామ
51. గర్వితవాలివిమోచక రామ
52. వానరదూతప్రేషక రామ
53. హితకరలక్ష్మణసంయుత రామ
54. కపివరసంతతసంస్మృత రామ
55. తద్గతివిఘ్నధ్వంసక రామ
56. సీతాప్రాణాధారక రామ
57. దుష్టదశాననదూషిత రామ
58. శిష్టహనూమద్భూషిత రామ
59. సీతోదితకాకావన రామ
60. కృతచూడామణిదర్శన రామ
61. కపివరవచనాశ్వాసిత రామ
62. రావణనిధనప్రస్థిత రామ
63. వానరసైన్యసమావృత రామ
64. శోషితసరిదీశార్థిత రామ
65. విభీషణాభయదాయక రామ
66. పర్వతసేతునిబంధక రామ
67. కుంభకర్ణశిరశ్ఛేదక రామ
68. రాక్షససంఘవిమర్ధక రామ
69. అహిమహిరావణదారణ రామ
70. సంహృతదశముఖరావణ రామ
71. విధిభవముఖసురసంస్తుత రామ
72. ఖస్థితదశరథవీక్షిత రామ
73. సీతాదర్శనమోదిత రామ
74. అభిషిక్తవిభీషణనుత రామ
75. పుష్పకయానారోహణ రామ
76. భరద్వాజాభినిషేవణ రామ
77. భరతప్రాణప్రియకర రామ
78. సాకేతపురీభూషణ రామ
79. సకలస్వీయసమానత రామ
80. రత్నలసత్పీఠస్థిత రామ
81. పట్టాభిషేకాలంకృత రామ
82. పార్థివకులసమ్మానిత రామ
83. విభీషణార్పితరంగక రామ
84. కీశకులానుగ్రాహక రామ
85. సకలజీవసంరక్షక రామ
86. సమస్తలోకోద్ధారక రామ

రామ రామ జయ రాజా రామ
రామ రామ జయ సీతా రామ
భయహర మంగళ దశరథ రామ
జయ జయ మంగళ సీతా రామ
మంగళకర జయ మంగళ రామ
సంగతశుభవిభవోదయ రామ
ఆనందామృతవర్షక రామ
ఆశ్రితవత్సల జయ జయ రామ
రఘుపతి రాఘవ రాజారామ
పతితపావన సీతారామ
రామ రామ జయ రాజారామ
రామ రామ జయ సీతారామ

హరిః ఓం తత్సత్
ఇతి శ్రీనామ రామాయణమ్

# విషయసూచిక

# మహాబహుమతి

ఈ వాల్మీకి రామాయణమును మీ అమ్మనాన్నలకూ, అత్తమామలకూ, అన్నదమ్ములకూ, మిత్రులకూ, సన్నిహితులకూ, హితులకూ ఇవ్వండి.

శుభం.... శుభకరం...

## త్వరలో
## మహాభారతము
## మైథిలీ వెంకటేశ్వరరావు కలం నుంచి

రామాయణము చదివితే పితృ దేవతలూ, దేవతలూ సంతోషిస్తారు. మీ మీద ఆ లోకాల నుంచి మమకారం పెంచుకుంటారు. సరైన దారిలో నడిపిస్తారు. వాల్మీకి మహర్షి రాసిన రామాయణాన్ని పది మందికి పంచినవారు స్వర్గంలోనూ, ఇహంలోనూ సుఖిస్తారు.

రామాయణము ఉన్న గృహంలో విఘ్నాలు తొలిగిపోతాయి. స్త్రీలు రజస్వలులవుతారు. పెళ్ళి కావల్సిన కన్యకు ఉత్తమమైన భర్త లభిస్తాడు.

పురాతన ఇతిహాసము రామాయణము. రామాయణాన్ని చదివినా, విన్నా సీతారాములూ, లక్ష్మణ హనుమంతాదులు సంతసిస్తారు.

శ్రీరాముడు ఆదిదేవుడు. పాపాలను హరించే శ్రీమన్నారాయణుడు. అట్టి శ్రీమన్నారాయణుడి రామాయణము చదివితే, ఈ భూమిపై సమస్త సుఖాలూ, వారి వాకిటి వద్ద వేచి ఉంటాయి.

ఈ మహా సృష్టికి పూర్వము నీటిని నివాసంగా ఉంచుకున్న శ్రీమహా విష్ణువే శ్రీరాముడు. శ్రీమహాలక్ష్మే సీతాదేవి. ఆదిశేషుడే లక్ష్మణుడు. శంఖ చక్రాలే భరత, శత్రుఘ్నులు.

గొప్ప అర్థం కలదీ, శుభకరమైనదీ అయిన వాల్మీకి రామాయణాన్ని చదివినవారూ, విన్నవారూ, వ్రాసేవారూ, ఇచ్చేవారూ, అందరూ అందరికీ శుభం... శుభం... శుభం...

*వాల్మీకి రామాయణము సమాప్తం.*





శ్రీరస్తు శుభమస్తు

# బాలకాండము

## వాల్మీకి మహర్షి

వేదాధ్యయనుడు, సకలలోక సంచారి, జగన్నాటక సూత్రధారైన మహావిష్ణువు భక్తుడు అయిన నారదునితో-నిత్య తపఃశాలి, మహర్షులలో శ్రేష్ఠుడు అయిన వాల్మీకి ఇలా ప్రశ్నించాడు.

"ఓ మహామునీ... సకల సద్గుణుడూ, సకల ధర్మశాస్త్రాలను నిత్యం ఆచరించువాడూ, అరిషడ్వర్గములను జయించినవాడూ, అపార దయ గలవాడూ, కీర్తిమంతుడూ, ముల్లోకాలచే కీర్తించువాడూ, తన ఇంట లక్ష్మి స్థానాన్ని సుస్థిరము చేసుకొన్నవాడూ, ప్రశస్తమైన కాంతి కలవాడూ, కోపం వచ్చిన యుద్ధంలో దేవతలను కూడా భయకంపితులను చేయగల వీరుడూ, పరమ సాధు పుంగవుడూ, అందగాడూ, ఆజానుబాహుడూ, కోపంలేనివాడూ, ఏకపత్నీవ్రతుడూ, తల్లీ, తండ్రీ మాట జవదాటని వాడూ, శూరుడూ, వీరుడూ, శత్రువుల పాలిటి రుద్రుడూ..... సత్య పరాక్రమవంతుడు అయిన మానవుడూ, అట్టి గుణములు గల మనుజుడు వున్నాడా?...." అడిగాడు వాల్మీకి.

నారదమహర్షి చిరునవ్వుతో... “శ్రీ మహావిష్ణువు ధైర్యమూ... నిత్యం మోస్తున్న తల్లి భూదేవి శాంత స్వభావమూ, ధనంలో కుబేరునికి మించిన వాడూ.....సాక్షాత్తు బ్రహ్మనే అధిగమించినవాడూ, ఏ పరిస్థితులలోనూ చలించని వాడూ, ధర్మం, సత్యం తప్ప తెలియని వాడూ, సకల సద్గుణ సుగుణాల లక్షణాలు కలవాడూ... ఇక్కడే ఈ భూమ్మీదే మానవ లోకంలోనే వున్నాడు....

ఎవరి పేరు వినినంతనే రెండు చేతులు కలుస్తాయో, రెండు కనులు అప్రయత్నంగా మూసుకుంటాయో... ఎవరి పేరు చెబితే శత్రువుల గుండెలు వక్కలవుతాయో... అతను... అతనే రాముడు, శ్రీ రాముడు, ఇక్ష్వాకు వంశ తిలకుడు, అయోధ్యా పురి రాజు దశరథ తనయుడు, కౌసల్యా దేవి నోముల పంట..... జనప్రియుడు ఆ శ్రీ రామచంద్రుడు. అంతటి మహావ్యక్తి ఈ పధ్నాలుగు భువన భాండాల్లో ఇంతకు ముందు లేడు... ఇకపై వుండడు....” అని చెబుతూ శ్రీ రాముని దివ్య మహాగాథను సంక్షిప్తంగా చెప్పడం ప్రారంభించాడు.

సరయూ నదీ తీరం.... కోసల దేశం....అయోధ్యా నగరం ఆ దేశ రాజధాని. దానికి రాజు దశరథుడు, ఆయనకి ముగ్గురు భార్యలు. కౌసల్య, సుమిత్ర, కైకేయి. ఆ రాజుకు నలుగురు కొడుకులు.... కౌసల్య తనయుడు రాముడు, లక్ష్మణ శత్రుఘ్నులు సుమిత్రా పుత్రులు, ముద్దుల భార్య కైకేయి గారాల పట్టి భరతుడు. పెద్దకొడుకు శ్రీ రాముడిని మహారాజును చెయ్యటం కోసం.... ఉత్సవాలు జరిపిస్తున్నాడు దశరథ మహారాజు.

అంత కైక తన కొడుకు భరతుడిని రాజును చెయ్యాలని దేవాసుర యుద్ధంలో ఒకప్పుడు దశరథుడిచ్చిన రెండు వరాలను కోరింది. ‘అవే రాముడి అరణ్యవాసం, భరతుని పట్టాభిషేకం.’

దశరథుడు శోకతప్తుడయ్యాడు. ఆ కోరికలు విడ్డూరమన్నాడు. కానీ ధర్మానికి కట్టుబడ్డాడు.

తండ్రి మాట కోసం.. మిథిలా నగర రాకుమార్తె..... ఎండ కన్నెరగని సుకుమారి.... పద్మినీ జాతి లతామణి, సుందరమైనది, సుకుమారమైనది, అయిన తన సతితో అడివికి బైలుదేరాడు. సుమిత్ర పుత్రుడు ముద్దుల గారాల తనయుడు లక్ష్మణుడు, అన్న బాటే నా బాటని ఆదర్శ పురుషుడు అన్నావదిన లతో తానూ అడవికి బైలుదేరాడు. అయోధ్యా నగరంతో పాటు కోసల దేశమూ కన్నీరు కార్చింది.





గుహుడు సీతారాములను, లక్ష్మణుని గంగానదిని దాటించాడు. సుందర చిత్ర కూట పర్వతంలో పర్ణశాల కట్టుకున్నారు. దశరథుడు పుత్రశోకంతో కుమిలి కుమిలి విలపించి అస్వస్థతకు గురై స్వర్గస్థుడైనాడు. వశిష్ఠాది మహర్షులు భరతుడిని రాజును కమ్మన్నారు. భరతుడు ఇష్టపడక తల్లి కైకను ధిక్కరించి శ్రీ రాముడి కోసం అడవికి బైలుదేరాడు.

సమస్త ధర్మాలు తెలిసిన వాడవు, నీవు మాత్రమే రాజుగా అర్హుడివి... రాజ్యమే లేని నాకు రాజ్యధర్మాలు వలదని విన్నవించాడు. దయతో, క్షమించి రమ్మని వేడుకున్నాడు. రాముడు తండ్రి మాటకే కట్టుబడ్డాడు. భరతుడి కోరికపై పాదుకలు ఇచ్చాడు. అరణ్యావాసం పూర్తి చేసుకొని వచ్చే వరకూ ఇవే నాకు మార్గదర్శకాలు అన్నాడు భరతుడు. చిత్రకూటం నుంచి రఘురాముడు భార్యతో, తమ్ముడితో దండకారణ్యం చేరాడు.

ఆ అరణ్య ప్రదేశం మహారాక్షసుడూ, విష్ణు ద్వేషీ అయిన రావణాసురుడిది. చెల్లెలు శూర్పణఖకు భరణంగా ఇచ్చిన ప్రదేశం. అదే దండకారణ్యం ... తపమాచరించుకునే మునుల కోరికపై విరాధుడనే రాక్షసునితో పాటు మునుల ధర్మాలకి అడ్డు వస్తున్న రాక్షసులను శ్రీరాముడు సంహరించాడు.

ఒకానొక సమయంలో పర్ణశాలలో శూర్పణఖ... లక్ష్మణుడిని చూసింది. తన సహజ కామ వాంఛను లక్ష్మణునికి తెలియచెప్పింది. లక్ష్మణుడు కాదనటంతో ఆగ్రహించింది. అంతట లక్ష్మణుడు ఆ వికార వికృత రాకాసి ముక్కూ, చెవులూ కోసివేశాడు.

అంత శూర్పణఖ అన్న దశకంఠుడు రావణాసురుని వద్దకు వెళ్ళి లేనిపోనివి కల్పించి సీత అంద చందాలను కీర్తించి కాముకుడైన రావణాసురుడిలో పాపపు ఆలోచనలను రేకెత్తించింది. లంకా వినాశనానికి శ్రీకారం చుట్టింది.

బంగారు జింక రూపంలో మారీచుడని పంపించి, రామలక్ష్మణులను బైటికి రప్పించి పదితలల రావణాసురుడు సీత నున్నచోటి భూమిని పెకిలించుకు వెళ్ళాడు. అడ్డం వచ్చిన జటాయువును నిర్దాక్షిణ్యంగా నరికాడు.

తిరిగి వచ్చిన రామలక్ష్మణులు హతాశులయ్యారు. రాముడు అచేతనుడయ్యాడు. సీతను తలచుకొని రోదించాడు. “హా! సీతా... సీతా...” అని విలపించాడు శ్రీరాముడు. చెట్టూపుట్టనూ అడుగుతూ అడుగడుగున వెతుకుతూ సీతకై గాలించసాగినారు.

అప్పుడు హనుమ కలిశాడు. తన ప్రభువు శ్రీరాముని ముందు మోకరిల్లాడు. తమ రాజు సుగ్రీవుని పరిచయం చేసి ఆయనకి జరిగిన అన్యాయాన్ని ధర్మపరుని ముందు ఉంచాడు.

అంతట రాముడు వాలిని సంహరించాడు. ఆపై సీత జాడకై వానర సైన్యం నలుదిక్కులా కదిలింది.

సముద్రాన్ని దాటి లంకిణిని సంహరించి హనుమంతుడు సీతను కనుగొన్నాడు. లంకని కాల్చాడు. బూడిద చేశాడు. జరిగిందీ, చూసిందీ రామునికి చేరవేశాడు. రావణాసురునిపై యుద్ధభేరి మ్రోగించాడు శ్రీరాముడు.

సముద్రంపై వానరులు వారధి నిర్మించారు. ఉడుత సైతం వారధిలో పాలుపంచుకుంది. రావణాసురుడి తమ్ముడు విభీషణుడు ధర్మా ధర్మాలు తెలిసినవాడు. పరస్త్రీ తల్లిలాంటిది, చేసే పని తప్పన్నాడు. తల తెగుతుందన్నాడు.

శ్రీరామ బాణ ధాటికి ఎవ్వరూ నిలవలేరని చెప్పాడు. రావణాసురుడు వినలేదు సరికదా.... విభీషణుడిని బహిష్కరించాడు. తన నలుగురు మంత్రులతో రాముడి పక్షానికి చేరాడు విభీషణుడు. యుద్ధ భేరి మ్రోగింది. శ్రీరాముని సంధి విఫలమయ్యింది.

యుద్ధంలో లక్ష్మణుడు మేఘనాథుని బాణానికి మూర్ఛిల్లాడు. హనుమ సంజీవిని పర్వతం తెచ్చాడు. లక్ష్మణుడు తేరుకున్నాడు.

యుద్ధంలో రావణాసురుడి కొడుకులూ, హితులూ, సైన్యాధికారులూ, మంత్రులూ ఎంతోమంది చనిపోయారు. రావణాసురుడే యుద్ధానికి బైలుదేరాడు. పది తలలతో వికటాట్టహాసం చేశాడు. ఘోర యుద్ధం తర్వాత విభీషణుడు ఇంటి గుట్టు చెప్పాడు.

విభీషణుడూ, దేవతల సారథి బ్రహ్మాస్త్రాన్ని నాభికి గురిపెట్టమన్నారు. రాముడు అది తప్పని, కోదండ విద్యకే అది తలవంపన్నాడు. హనుమంతుడు తన తండ్రి వాయుదేవుడిని ప్రార్థించి రామబాణాన్ని సముచిత రీతిలో నడపమన్నాడు.

రామబాణం రావణాసురుని నాభికి చేరింది. అమృతభాండం ముక్కలైంది. రావణాసురుడు దిక్కులు పిక్కటిల్లేలా అరచి మరణించాడు. లోకం పీడ వదిలింది.

వానర సైన్యం జేజేలు చేసింది. సీత శ్రీరాముని ముందుకు వచ్చింది. అన్ని రోజులు పరాయి ఇంట వున్న స్త్రీని ఎలా ఏలుకోవాలన్నాడు రాముడు.





సీత అగ్ని ప్రవేశం చేసింది. అగ్ని భట్టారకుడు ప్రత్యక్షమై ‘సీత మహాసాధ్వి... పతివ్రత... ఆమెకి ఏ కళంకం అంటదు, అంటలేదు. ఆమె స్పర్శతో నేను పవిత్రుడనయ్యా’ నన్నాడు.

శ్రీరాముడు.... పరమపావని సీతాదేవిని అక్కున చేర్చుకున్నాడు. లంకాపురికి విభీషణుని రాజుని చేసి పుష్పక విమానంలో అయోధ్యకి బైలుదేరాడు. తమ్ముడు భరతుడ్ని చేరి అయోధ్యాపురికి రాజై భరతుడ్ని యువరాజుగా చేసి సకల జనరంజకంగా పదివేల సంవత్సరాలు పరిపాలించాడు.

అంతా వినిన వాల్మీకి, అతని శిష్యగణం తన్మయులై శ్రీరాముని గురించి స్తోత్రం చేసి అంతటి మహోత్తముడైన శ్రీరాముని గురించి చెప్పినందుకు నారదునికి అందరూ పూజలు జరిపి సంతసులయ్యారు.

అంత నారదుడు - “వాల్మీకి మహర్షీ... ఓ శిష్య తనయులారా! శ్రీరామ కథ ఆయుర్దాయం పెంచుతుంది. విన్నవారూ మహా పండితులౌతారు. వీరులౌతారు. లక్ష్మీ ప్రాప్తి కలుగుతుంది. పూజ్యులౌతారు. ఆ పైలోకాల్లో అద్భుత ఆనంద సుఖాలకి పాత్రులౌతారు” అని శెలవిచ్చి.... తిరిగి ఆ నారాయణుడైన శ్రీమహా విష్ణువును కీర్తిస్తూ తన లోకానికి బైలుదేరాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

నారదుడు వెళ్ళిన తరువాత వాల్మీకి మహర్షి తన శిష్యుడు భరద్వాజునితో తపస్సు విధులకై స్నానానికి బైలుదేరాడు.

తెల్లటి తామరలతో.... జాహ్నవీ నదీ సమీపంలోని తమసా నదీ తీరానికి వెళ్ళారు. నిద్రపోతున్న పసిపాపలా వుంది తమసా నది. “భరద్వాజా! తమసా నది ఎంత నిర్మలంగా వుందో చూడు... కలశం క్రింద ఉంచిన నారబట్ట ఇవ్వు.... ఈ తమసా నదీ తీర్థంలో స్నానమాచరిస్తాను” అని చెప్పాడు.

గురు ఆజ్ఞతో నారబట్ట అందించి వాల్మీకిని అనుసరించాడు. అప్పుడే వాల్మీకిని ఓ పక్షి జంట ఆకర్షించింది. అవి క్రౌంచ పక్షుల జంట.... మధురాతి మధురంగా పాడుతున్నాయి. ఒకదానికి మరొకటి తిండి గింజలు తినిపించుకుంటున్నాయి. అవి శ్రమ పడకూడదనేమో ప్రక్కనున్న అరిటి చెట్టు ఆకులు వాటికి వింజామరుల్లా మారి వీస్తున్నాయి. పిల్లగాలులు కూడా తోడవ్వటంతో, అవి స్వేచ్ఛగా వనవిహారానికి వచ్చిన రతీ మన్మథుల్లా ఆనందలోకాల్లో తేలిపోతున్నాయి.

మిట్ట మధ్యాహ్నం, నిప్పులు చెరిగే ఎండలో బ్రహ్మాండం బద్దలైనట్టు, ఉరిమే మేఘగర్జనలా ఓ బాణం దూసుకువచ్చింది. మగ పిట్టను కొట్టేసింది. రక్తంతో క్రౌంచ మగపిట్ట క్రిందపడింది. ఆడపిట్ట హృదయ రోదన వాల్మీకిని మనోవేదనై ఆవహించింది.

మాంసము తినుటకై జన్మించినట్టున్న ఆ క్రూర బోయవాడిని అసహ్యంగా చూశాడు వాల్మీకి. ఆడపిట్ట అవస్థ వర్ణనాతీతం.... రతి సంగమంలో వున్న ఆ పిట్టలను విడదీయటానికి ఆ పాషాణ బోయవానికి మనసెట్టుకలిగెనో కదా!

బోయవాడ్ని వాల్మీకి రౌద్రంగా "ఛండాలుడా! కరడు గట్టిన నీచుడా? మైధునంలో తన్మయులై ఇహపరులను మరిచిన ఆ క్రౌంచ పిట్టలను విడదీయటానికి నీకు మనసెలా వప్పింది.

***మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమః శాశ్వతీః సమాః,***

***యత్ క్రౌఞ్చమిథునాదేకమవధీః కామమోహితమ్.***

"నువ్వు మాత్రం బ్రతకుతావనుకుంటున్నావా? బ్రతికి వూరేగుతావను కున్నావా?" అని అరిచాడు.

అప్పుడు అవగతమయ్యింది వాల్మీకికి... తన నోటి వెంట సమానాక్షరాలతో నాలుగు పాదములతో సకల ఛందస్సు నిక్షిప్తమైనట్టు... వాగ్దేవి సరస్వతి నుంచి వచ్చినట్టు ఆ శ్లోకం.... అవును అది శ్లోకమే.... శోకార్తుణ్ణయిన నా నోట అంతటి శ్లోకమా? ఏ సంగీత వాయిద్యంతోనైనా లయబద్ధంగా పాడుటకు వీలుగా ఉన్న సమాక్షర పాద బద్ధము....

ప్రక్కనున్న శిష్యుడు భరద్వాజుడు తన గురువు అన్న పద్యాన్ని నోటితో వల్లించుకున్నాడు.

వాల్మీకి మహర్షి శిష్యుడి ద్వారా ఆ శ్లోకాన్ని విని మరింత సంతసించాడు.

ఇద్దరూ స్నానం చేసి తిరిగి ఆశ్రమానికొచ్చారు. వాల్మీకి మహర్షికి తమసానదీ ప్రాంతంలో జరిగినదే గుర్తుకొస్తోంది. ఛందో బద్ధమైన ఆ శ్లోకమే మారుమ్రోగుతోంది.

ఎందుకు? ఏ లోకకళ్యాణం ఆశించి తన నోటి వెంట ఆ శ్లోకము... అప్పుడే.....

బ్రహ్మలోక నివాసి.... సకల ప్రాణికోటికి కర్మ సిద్ధాంతాల ప్రకారం జన్మలను ఆదేశించే చతుర్ముఖుడు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనాడు.





ధర్మమూర్తి వాల్మీకి మహర్షి తేరుకొని అతిథిని ఆహ్వానించాడు. స్తోత్రము చేశాడు... ప్రదక్షిణం చేసి పాద్యమూ, అర్ఘ్యమూ, పీఠమూ ఇచ్చాడు. వాల్మీకికి మళ్ళీ ఆ శ్లోకము మీదకే మనసు పోయింది.

బ్రహ్మదేవుడు చిరునవ్వు నవ్వి- "ఓ మహర్షీ..... నీ నోట వెలువడింది శ్లోకమే... ఆ సరస్వతీ దేవి సంకల్పం వల్లే అది జరిగింది. ఉత్తమోత్తముడైన ఋషివి నువ్వు.... నువ్వే రామాయణాన్ని రాయాలి..... అంతా శ్లోకాలతోనే... రాముడి ధర్మగుణాన్నీ, దయాగుణాన్నీ, అంతటి గొప్ప సుగుణాలున్న శ్రీరాముడి గురించి నీవే చెప్పాలి...

భూమి మీద గాలి ఉన్నంత వరకూ చెట్టూ, పుట్టా, రాయీ, రప్పా... ఉన్నంత వరకూ శ్రీరామ కథ ఉంటుంది. రామాయణ గానం మాటలు రాని ప్రాణికోటికి సైతం అవగతమయ్యేలా... రాయాలి... చెప్పాలి.....

అది మహాకావ్యము..... ఆదికావ్యము..... వాల్మీకి మహర్షీ..... శాశ్వతముగా నీవు రామాయణంలో ఇమిడిపోతావు... ఈ మహత్తర పుణ్యకార్యానికి శ్రీకారం చుట్టు.... " అని చెప్పి బ్రహ్మదేవుడు అదృశ్యుడైనాడు.

వాల్మీకి పరమానంద భరితుడయ్యాడు. ధర్మ స్వభావుడూ, లోకాన ప్రశస్తమైన గుణాలు గల దశరథ తనయుడి రమ్య రామగాథ తాను రచించాలని బ్రహ్మదేవుడే దీవించాడు. శిష్యులు ఆనందంతో కేరింతలు కొట్టారు. భరద్వాజుడు శ్లోకాన్ని పాడాడు. శిష్యులు అందుకున్నారు.

చక్కటి పదాలతో, మనోహర వాక్యాలతో, సంధులతో, మధురమైన భావనలతో.... రామాయణాన్ని రాయాలని..... వాల్మీకి సంకల్పించుకున్నాడు.

## రామాయణము ప్రారంభం

వాల్మీకి దర్భాసనం మీద కూర్చున్నాడు... కనులు మూసుకొని చేతులు జోడించి ధ్యానించాడు. అతనిలో నారదుడు చెప్పిన రామకథే మెదిలింది. తన తపఃశ్శక్తితో బ్రహ్మ అనుగ్రహాన్ని జోడించాడు.

సరస్వతి దీవెనెలతో రామగాథంతా గోచరించింది.

ధర్మార్ధ కామాలతో, చెవులకు ఇంపుగా... సొంపుగా ప్రతి చిన్న సంఘటనా... మనో ఫలకంపై సాక్షాత్కరించాయి. శ్రీరాముడి పుట్టుక... రాముడు సీతను వివాహమాడుట... కైక వరాలు... దశరథుడి పుత్రశోకం... అన్న వెంట అడవులకు వెళ్ళిన లక్ష్మణుడు.... ఊర్మిళ నిద్ర... గుహుడు

సీతారామలక్ష్మణులను గంగని దాటించటం... భరద్వాజముని మాట మీద చిత్రకూటం వెళ్ళటం... కాకి మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించటం... అరణ్యా వాసం... శూర్పణఖ వికృత వికారాలు... పర్ణశాల పవిత్రత... పతివ్రత సాధ్వీమణి సీతాదేవి అపహరణ... వాలి సుగ్రీవుల కలహం... హనుమ సముద్ర లంఘణం... లంకిణి హతం... లంకా నగరం అగ్నిదేవునికి ఆహుతి... సీత జాడ... విభీషణుడి శరణు... లక్ష్మణుని మూర్ఛ... రావణ వధ... అయోధ్య తరలి వచ్చి పట్టాభిషేకం...

ధర్మమూ, అర్థమూ, కామమూ, మోక్షమూ..... ఈ నాలుగు పురుషార్థాలు.... మానవుని విలువలకు సాక్షియై.... సీతారామలక్ష్మణుల కదలికలూ, పరిసరాలూ, అందరి గుణాలూ, నవ్వులూ, బాధలూ, ఆక్రోషాలూ, ఆవేశాలూ, అనర్థాలూ, అన్నీ నిగూఢ విషయాలతో సహా.... అవగతమైంది. మహాసాధ్వి సీతను ఓ పామరుడి మాటతో అడవిలో వదిలెయ్యటానికి ముందు గాథ ఆరుకాండలలో... ఆపై మిగతా గాథ ఉత్తరకాండలో వాల్మీకి మహర్షి సప్త స్వరాలతోనూ వేణు వీణాగానాలతోనూ అభినయించుతూ, ఆలపిస్తూ... మననం చేసుకుంటూ శిష్యులు తన్మయులయ్యేలా చెప్పాడు..... శ్రీరామాయణ రచయిత శ్రీవాల్మీకి మహర్షి.....

☆☆☆ ☆☆☆ ☆☆☆

చిత్రవిచిత్ర పదాలతో... అపూర్వమైన అలంకార శాస్త్రంతో..... వీరోచితమైన పద పలుకులతో సుందర సుకుమార ధర్మ, జ్ఞాన ఆహ్లాదకరమైన సంభాషణలతో... ఏడుకాండలతో ఆరు వందల సర్గలతో ఇరవై నాలుగువేల శ్లోకాలతో ఉన్న రామాయణాన్ని ఎలా ప్రచారం చెయ్యాలో అర్థంకాలేదు, ఆ మహాప్రాజ్ఞుడైన మునివర్యునికి... ఆ భగవంతుడిని ధ్యానించాడు.

తన పాదాలను స్పృశించిన స్పర్శతో ధ్యాన భంగమై కనులు తెరిచి చూశాడు వాల్మీకి.

మునివేషధారులై వున్నారు... పసివారు. ఆ సీతా రామచంద్రులకి ప్రతిబింబాల్లా వున్నారు. గురు శుశ్రూష చేసి సమస్త విద్యల్లో ఆరితేరిన శూరత్వం వారి మోములో కానవచ్చింది. సంగీత సాహిత్య రహస్యాలను అవగతం చేసుకున్న వారి మాట తీరు వాల్మీకిని కదిలించింది. తన రామగాథను జనగాథను చేయుటకు వీరే సరైన వారని తలచాడు.





"తేనె కన్నా మధురమైంది, కోయిల గొంతు సరితూగిన రాగయుక్తం... శృంగారము, కరుణ, హాస్యము, వీరత్వం... భయంకరము, రౌద్ర బీభత్సాలతో నవరసాలు కలగలిపిన ఉత్తమోత్తమ మహాకావ్యం.... దాన్ని వినిపించి.... తరింపచేస్తారా?" అడిగాడు వాల్మీకి.

అందుకు వారు సంతసించారు. ఆ మహాకావ్యాన్ని ముఖస్థము చేసుకొన్నారు. ఆ మునీశ్వరునికి రమ్యంగా, మధురంగా పాడి వినిపించారు... రామగాథా గానంతో వాల్మీకి పరవశుడయ్యాడు.

వాల్మీకి ఆశీస్సులతో కుశలవులు గురు ఆశ్రమాలకి వెళ్ళి రామగానాన్ని వినిపించారు. రామాయణ తియ్యదనాన్ని చవి చూపారు. విన్నవారు పరమానంద భరితులయ్యారు. వారి అభినయాన్ని చూసి బ్రహ్మ కన్నులిచ్చినందుకు పొంగిపోయారు.

కుశలవులు పశుపక్షాదులను సైతం రజింపచేసారు.... భగవత్ ప్రదేశాలు... సత్ సాంగత్య సమావేశాల దగ్గర..... రామగాథను కీర్తిస్తూ ముందుకు కదులుతున్నారు. శ్లోకాలూ, పాటలూ అద్భుతంగా వున్నాయి. అందర్నీ అలరిస్తున్నాయి. సమస్త గాన పద్ధతులతో, సుందర స్వరశృతిలో మనోహరంగా ఉంది వారి గానం.

శ్రీరామునిచరితను విన్న వారికి ఆయువును వృద్ధి చేస్తుంది... సౌభాగ్యాలు వస్తాయి... ఎన్నో జన్మల పాపాలూ పోతాయి... మహర్షులు, సాహిత్య మేధావులు, కురువృద్ధులు అభినందనలతో ముంచెత్తారు కుశలవులను.

జలకలశం, వల్కలము, కృష్ణా జినము, మౌంజి, కమండలము, జందెము, పీటలను బహుమతులుగా ఇచ్చారు. వాటితో జనారణ్యములోకి వెళ్ళారు...

రామగానామృతం ఆ నోట ఈ నోట రాముని చెవిన పడింది. అప్పుడే శ్రీరామచంద్రుడు అశ్వమేధ యాగం సంకల్పిస్తున్నాడు. రాజసభలో ఎందరో కుశలవుల కమనీయ రామసుధా లీలామృత మాధుర్యాన్ని శెలవిచ్చారు.

శ్రీ రామ, లక్ష్మణ సమేతులందరికీ వినాలనిపించింది. అన్నగారి వంక చూశారు. శ్రీరాముడు వారి గానాన్ని వినాలని తలచారు. శ్రీరాముని మనోఫలకంపై కూడా అదే కోరిక ప్రత్యక్షమైంది.

కుశలవులు రాజసభకు వచ్చారు. శ్రీరామచంద్రుడు బంగారు సింహాసనంపై మిత్ర, బంధు, సన్నిహిత, మునిశ్రేష్ఠులతో, సకల సామంత

రాజులతో రివేష్టితుడై వున్నాడు. దేదీప్యమానంగా వెలిగి పోతున్నాడు. అప్పుడు కుశలవులను రాముడు పరికించి-

"మీరు మునివేషాల్లో ఉన్న రాజకుమారుల్లా ఉన్నారు. మీలో రాచరిక లక్షణాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. గాయకులైనప్పటికీ తపఃశక్తిని పొందిన వారిలా ఉన్నారు.... నేను మీ గానం వినాలని కుతూహలపడుతున్నాను.... వేగిరపడుతున్నాను చిన్నారులారా?" చెప్పాడు శ్రీరామచంద్ర ప్రభువు.

రఘురాముని ఆదేశంపై మార్గపద్ధతిన ఏక కంఠులై... యక్షగానాన్ని మరిపించేలా చెవులకి హాయిగా, కనులుకి ఇంపుగా, శరీరం పులకించేలా.. ప్రారంభించారు కుశలవులు. శ్రీరాముడు మైమరిచి ఆనందభరితుడై ఆలకించసాగాడు.

## అయోధ్యా నగరము

ఇక్ష్వాకువంశం.... దానికి ప్రథముడు మనుప్రజాపతి. ఆయన మొదలుకొని ఆ వంశరాజులు ఏకవీరులై ఎన్నో రాజ్యాలను అవలీలగా జయించారు. ఇక్ష్వాకు వంశ రాజు సగరుడు. ఆ చక్రవర్తే సముద్రాన్ని త్రవ్వించాడు. అలా త్రవ్వించడం వల్లే సముద్రుడు మహాసాగరుడయ్యాడు.

ఆ వంస్థులైన వారే ఈ సమస్త భూమండలాన్నీ పరిపాలించారు. శాసించారు... అష్టభోగాలకూ, అష్టైశ్వర్యాలకీ అధిపతులయ్యారు. సర్వ సుఖాలూ, భోగాలూ అనుభవించారు.

ఆ రాజుల్లోని శ్రీరాముని చరిత్రే రామాయణము. మహా నీతి శాస్త్రము... అద్భుత కావ్యము. ధర్మార్థ, కామ మోక్షాలకు అదే పుట్టినిల్లు. చదవండి.... వినండి.... తరించండి.... నిర్మలమైన మనస్సుతో... ఐహిక విషయాలని వదలండి. శ్రీరామచంద్రునిపై సమస్త శరీరాన్ని సంసిద్ధం చేయండి. పులకించండి.

సరయూనదీ తీర ప్రాంతం .... ఆ ప్రాంతం కోసలదేశం. ఆ దేశానికి రాజధాని అయోధ్య.... వైవస్వత మనువు కట్టిన మహానగరం.... పన్నెండు యోజనాల పొడవుతో మూడు యోజనాల వెడల్పుతో వంకర లేని ప్రదేశంలో దుర్భేద్యమైన నివాసాలు, రాజ ప్రాసాదాలు... వనాలతో, ఉద్యానవనాలతో విరాజిల్లుతున్న మహానగరము. అక్కడ రహదారుల ప్రక్కన పూలలతలు, సువాసనలు వెదజల్లే మొక్కలు... స్త్రీ సౌందర్యాన్ని సవాలు చేసే అందంతో





పూలమొక్కలు లెక్కకు మించి కానవస్తుంటాయి. ప్రతి మేడ ముందలి ప్రదేశం ముగ్గులతో శోభిల్లుతూ ఉంటుంది. నగరపు బురుజులపై ఇక్ష్వాకు వంశ జెండాలు రెపరెపలాడుతుంటాయి. శత్రు దుర్భేద్యమైన నగరాన్ని చుట్టే ప్రాకారం... దానిపైన చుట్టూ వేలాది శతఘ్నులు... అపార సైన్యం ఆయుధదారులై ఉన్నారు....

విశాలమైన రహదారులు... అంతటా ప్రశాంతమైన వదనాలతో తిరుగాడే పురజనం... అంగట్లో కుప్పలుగా పోసిన వజ్రాలూ, రత్నాలూ, వైఢూర్యాలూ ఒకటేమిటి నవరత్నాలూ వంటివి వడ్లపుగింజల్లా రాసులుగా పోసివున్నాయి. ఇరుగు పొరుగు ఊర్ల నుంచి వచ్చే జనం... వాటిని ధర్మంగా కొలిచి అమ్మే వైశ్యులు. ఆడవాళ్ళు అయితే అపరంజి బొమ్మలు. ఒకరికి మించి మరొకరు అందాల రత్నాల మణులు... కత్తులు... సంగీత సభల్లో కమనీయ శ్రావ్యమైన సంగీతం పరవళ్ళు తొక్కుతుంటుంది... నగరమంతా శాంత మూర్తులై సిద్ధులా లేక ఉమ్మడి సంసారులా అన్న మీమాంస కలిగేలా ప్రజలు ప్రవర్తిస్తుంటారు.

స్త్రీ సావాస వాటికల్లో గలగలలు.... గాజులవా? వారి నవ్వులవా? అనేట్టుగా సవ్వడి చేస్తూనే ఉంటాయి. ఉద్యానవనాలు... జలాశయాలు.... ద్రాక్షతోటలు.... కోకొల్లలు.

ప్రతి పంట సంవత్సరం పొడవునా... పండుతూనే ఉంటుంది. ప్రతి వారి ధాన్యాగారం నిండి ఉంటుంది. సమృద్ధిగా పాడి.... ఆకలన్నది తెలీదు... అడిగే వారుండరు.... ఆ పట్టణం ముందు ఇంద్రుడి అమరావతి తక్కువే. ధనం ముందు కుబేర సంపదా చిన్నబోతుంది.

రాజప్రాసాదాల ప్రధాన ద్వారాలు రత్నాలతో పొదగబడి ఉంటాయి. అక్కడి సైన్యం.... పరుగెట్టే వారిని, పెద్దవారిని కొట్టరు, వేటాడరు... పెద్ద సింహాన్ని, క్రూర మృగాల వంటి వాటిని చేత్తో ఆయుధాలు లేకుండా సంహరించగలరు. న్యాయస్థానం ఖాళీగా... అధర్మవ్యాపారస్థుని కొట్టులా... దివాళా తీసిన వ్యక్తి ఇల్లులా ఖాళీగా ఉంటుంది.

ఎవరికీ న్యాయస్థానంతో పనిలేదు. అక్కడున్న ప్రభుత్వ ఉద్యోగులకి పనిలేక... అవసరం లేక దైవస్మరణ చేసుకుంటూ కనిపిస్తారు.

అక్కడి బ్రాహ్మణులు.... ఋషి సమానులు. వేద మంత్రోచ్చాటనే వారి దినచర్య.... వైశ్యులైతే చెప్పనలవి కాదు... పొరుగు దేశాలనుంచి వచ్చిన వారికి పోటీలు పడి చేతికి ఎముక లేని విధంగా దానాలు ఇస్తారు.

క్షత్రియులు వీరులై, శూరులై సైన్యవిభాగాల్లో తమ విద్యుత్‌ధర్మానికి కట్టుబడి ఉంటారు. మిగతా వారు జనరంజకమైన ఆ ప్రభువు పాలనలో సంవత్సరానికి పన్నెండు పంటలు పండిస్తారు. అలాంటి ఆ అయోధ్యా పట్టణానికి రాజు దశరథుడు. అమరావతిని ఏలే దేవేంద్రుడిలా దశరథ మహారాజు ఆ రాజ్యాన్ని పాలిస్తున్నాడు.

## దశరథ మహారాజు

మహాపరాక్రమవంతుడు దశరథ మహారాజు. అతని పాలనలో ఈతిబాధలు లేవు. ప్రజలకి ఏ బాధలూ లేవు. ఆయన సేనలో చతురంగ బలాలు ఉన్నాయి. వారు యుద్ధంలో శత్రువులని చీల్చి చెండాడుతారు. పారిపోయే వారిపై ఆయుధం ప్రయోగించరు. శరణన్న వాళ్ళకి సమస్తము సమకూరుస్తారు. ఎందరో రాజులు దశరథునితో మిత్రత్వానికి పోటీలు పడతారు. వినయ, విధేయతలతో ఆడపిల్లనిచ్చిన వియ్యకుడింటికొచ్చిన తల్లీ, తండ్రిలా విలువైన వస్తువులను దశరథునకు సమర్పిస్తుంటారు.

దశరథుడు అత్యంత ఎక్కువ సమయాన్ని పాలనకే కేటాయిస్తాడు. ప్రజలపై పన్నుల భారం లేకుండా... ఏ భయాందోళనలు లేకుండా ఉండుటకై అన్నీ చర్యలు తీసుకుంటాడు. ఆయన రాజ్యంలో ఆకలి లేదు... ప్రతి ఇల్లు పిల్లాజెల్లాతో, వచ్చే బంధువులతో కళకళలాడుతుంటుంది. పెట్టేవారెక్కువ... అడిగేవారు తక్కువ. అతిథులకోసం రోజూ వెతుకులాటే.

పట్టణంలోని ప్రజలు ధార్మికులు... సకల శాస్త్రాలు అవపోసన పట్టిన వాళ్ళు..... సత్యవాదులు, లోభరహితులు.... ధనమూ, ఆవులూ, గుర్రాలూ, గృహాలూ... పొలాలూ లేనివాళ్ళు కనపడరు. అందరూ భక్తి పరులు... భోగపరులు.

ప్రతి నిత్యం మూడు సార్లు స్నానం చేసేవారే. మంచి గంధము, కస్తూరి, ఏడువారాల నగలతో స్త్రీలు అలంకార ప్రీతులై ఆనందిస్తుంటారు. వారికి భర్తే దైవం... భర్తకూ, అతిథులకూ, కుటుంబ అవసరాలకూ పని చెయ్యటం దైవ సేవలా భావిస్తారు.

నగరంలో మహిళలను పీడించే కాముకులు మచ్చుకు కూడా కనిపించరు. చోరపదమే నగర వాసులకు తెలీదు. ధర్మహాని జరిగితే సకుటుంబంగా ప్రాణాల్ని తృణప్రాయంగా ధర్మం కోసం సర్వం వదిలేసే మహాత్ములు, స్వకర్మనిరతులు, వేదాధ్యయన పరాయణులు అయోధ్యా పురవాసులు.





పౌరులు కుండలాలూ, కిరీటాలూ, తలపాగాలూ, ముత్యాల హారాలు ధరిస్తారు... సుగంధ ద్రవ్యాలను ఇష్టపడతారు... మంచి భోజన ప్రియులు... నవకాయ వంటకాలను ఆరగిస్తారు...

ఆ రోజుకి ఏ పని మిగల్చకుండా వాయిదా వేయకుండా తమ విధులను నెరవేర్చుకుంటారు. అబద్ధమాడేవాడూ, అసూయాపరుడూ, పరాయి స్త్రీనీ, ఇతరుల ధన ధాన్యాదులను ఆశించేవాడూ, యజ్ఞాలు చేయనివాడూ, వ్రతాలూ, నోములూ చేయని ఇల్లాలూ... ఇలాంటి వారు దశరథుని రాజ్యంలో జల్లెడ వేసి వెదికినా కానరారు.

నాస్తికత్వము లేదు. నాలుగు వర్ణాల వారు దేవతా పూజలు చేస్తారు. దానం చేయటానికీ, యుద్ధం వస్తే కత్తి దీయటానికీ, రాజాజ్ఞ నెరవేర్చటానికీ అక్కడ అందరూ సంసిద్ధులే.

అక్కడి గుర్రాలు శ్రేష్ఠమైనవి. కాంభోజ దేశంలోనివి. సింధు దేశంలో పుట్టినవి. ఏనుగులైతే పర్వతాలే. ఒక్కొక్కటీ కొండ మాదిరిగా వుంటాయి. భద్రగజాలూ, మంద్ర గజాలూ, మృగగజాలూ వాటిని పరిరక్షించే భటులూ... ఆకాశాన ఉరిమే పిడుగుల వంటివారు. మిన్ను విరిగి మీద పడుతున్నా చలించనివారు. అస్త్ర విద్యల్లో ఆరితేరిన ఆ ధీరులు అయోధ్యా నగరాన్ని వేయి కళ్ళతో జాగురూకులై ఏ రాక్షస నీడ దరిచేరకుండా పరివేక్షిస్తుంటారు.

ఆ నగరాన్ని పన్నెండు యోజనాల దూరం నుంచి చూసినా శత్రువుకి గుండెలు జారుతాయి. అలాంటి ఆ అయోధ్యా నగరానికి రాజు దశరథమహారాజు.

ఆయన రాజ్యం అపర వైకుంఠం. ఆయన రాజ్యవైభవము ఇంద్రుని అలకాపురిని సైతం చిన్నబోయేలా చేస్తుంది. కుబేరునికే అప్పు ఇచ్చేంత అపార విలువైన ధనరాశులు గల రాజ్యం. ఆ రాజ్యానికి మహారాజు భూలోక దేవేంద్రుడు దశరథ మహారాజు.

## మహామంత్రులు

దశరథ మహారాజు వద్ద వశిష్ఠుడూ, వామదేవుడూ ఇద్దరు ప్రధాన పురోహితులు. వీరే కాక ఎనిమిది మంది ముఖ్య మంత్రులు. వారిలో సుమంత్రుడికి ప్రత్యేక అధికారములున్నాయి. ఏ సమయమైనా, ఎక్కడికైనా, అంతఃపురానికైనా వచ్చే వీలు వుంది.

మిగతావారు ధృష్టీ, జయంతుడూ, విజయుడూ, సిద్ధార్థుడూ, అర్థసాధకుడూ, అశోకుడూ, మంత్రపాలుడూ, సుమంత్రుడూ వీరంతా యంత్రాంగంలో ఆరితేరిన దిట్టలు. కోసల రాజ్యానికి ఎనిమిది దిక్కులై నిత్యం పర్యవేక్షణలో వుంటారు.

ధర్మహాని జరుగనివ్వరు. అన్నీ తెలిసినవారు తప్పు చేస్తే రెండు సార్లు, ఏమి తెలియని వారు తప్పు చేస్తే ఒక్కసారి శిక్షించాలనే అపార నీతి ధర్మశాస్త్రం తెలిసినవాళ్ళు. ధృడ చిత్తములు కలవారు. భువిపై వారంత రాజనీతి యంత్రాంగము తెలిసిన వారు లేరు.

నీతిమార్గం తప్ప వేరే మార్గం తెలియని వాళ్ళు. సాధువులనూ, ఋషులనూ గౌరవించేవారు. మంత్రులంతా ఐకమత్యం కలిగి ఉంటారు.

అలాంటి వారి పర్యవేక్షణలో దశరథుడు రాజ్యాన్ని వదిలెయ్యలేదు. అనేక మంది వేగులను పెట్టాడు. అనేక రాజ్యాల రాజుల ఎత్తుగడలను ముందే పసిగట్టేవాడు. మంత్రులని హెచ్చరించేవాడు. సరిసమానమైన శత్రువుని కూడా ఉంచలేదు.

సర్వ వ్యవహార సముర్ధులైన మహామంత్రులతో, అనేక లోకాలను ఏలే సూర్య భగవానుడిలా అనంతమైన తేజస్సుతో, కాంతితో, అనేక వేలమంది భార్యలతో వెలిగిపోతూ జనప్రియరంజకంగా పాలిస్తున్నాడు దశరథుడు.

## అశ్వమేథ యజ్ఞ సంకల్పము

దశరథునికి సమస్త సంపదలూ, సకల ఐశ్వర్యాలూ... వాకిలి వద్దే వేచి వుంటాయి.... కీర్తి అయితే భూమండలం దాటి దేవేంద్ర లోకానికి సహితం ప్రాకిపోయింది. కానీ ఒక్కటే చింత... అన్నీ వున్నాయి. ముగ్గురు అపూర్వ లలనామణులైన భార్యామణులున్నారు. కానీ సంతానం లేదే?

దశరథుని అంతరంగంలో క్షోభమొదలైంది. అష్టఐశ్వర్యాలలో సంతానం కూడా ఒకటి కదా! అది లేని మిగతావన్నీ ఎందుకు? సమస్త దాసీజనం... సేవకులు.... బంధువులు.... పరివార సమేత రథాలు... వజ్ర వైఢూర్య మణి మకుటాలతో నిండిన కోశాగారం... అఖండ భూమండలానికే చక్రవర్తి... అన్నీ ఉన్నా సంతానం లేనప్పుడు ఇవన్నీ ఎందుకు? తను సాధించిందీ, అనుభవించిందీ తన వంశక్రమంలో తర్వాత వారూ చెయ్యాలి. ఇక్ష్వాకు వంశాన్ని నిలపాలి.





దశరథుడి తపన లోంచి ఆలోచన మొదలైంది. అశ్వమేథ యాగం చేయాలని సంకల్పం కలిగింది. అనుకున్నదే తడవు... మంత్రి సుమంత్రుడిని పిలిచాడు. ముందుగా మంత్రులందరినీ ఓ వద్ద చేర్చమన్నాడు. సభని ఏర్పాటు చేయమన్నాడు.

గురువరేణ్యుడు వశిష్ఠులవారిని, వేదపారంగతులు సుయజ్ఞుణ్ణీ, జాబాలినీ, కాశ్యపుణ్ణీ, ఇంకా ఉత్తమోత్తములైన అనేకమంది బ్రాహ్మణులను ఆహ్వానించమన్నాడు.

వశిష్ఠుడూ, మిగతా మహర్షులూ, సన్నిహిత పరివారమూ దశరథుని మాటకై వేచి ఉన్నారు. అప్పుడు దశరథుడు వశిష్ఠులవారితో "గురువర్యా... సంతానం కోసం అశ్వమేథయాగం చెయ్యాలని భావిస్తున్నాను. ఆ యజ్ఞం తమ చేతుల మీదుగా జరిపించాలని నా అభ్యర్ధన.." చెప్పాడు.

"ఉత్తమోత్తమమైన దైవ సంకల్పం" అని వశిష్ఠులవారు శెలవిచ్చారు.

"దివ్యమైన ఆలోచన ప్రభు" సంతోషంగా చెప్పారు మంత్రులు. తక్కిన సద్ బ్రాహ్మణులూ, మహర్షులూ, "పరమధార్మికము అయిన ఆలోచన" అని అభినందించారు.

దశరథుడు సంతోషపడ్డాడు. అప్పటికప్పుడు సమస్త సంభారాలను సిద్ధం చేయాలనీ, సరయూనదీ ఉత్తర తీరాన యజ్ఞవాటిక ఏర్పాటు చేయాలనీ, ఋత్విజులతోనూ, మన వీరులతోనూ యజ్ఞగుర్రాన్ని దేశం మీదకు విడవాలని ఆజ్ఞాపించాడు.

"మహారాజా! తమ ఆజ్ఞ ప్రకారం అన్నీ సిద్ధం చేస్తాము" చెప్పాడు సుమంత్రుడు.

"వశిష్ఠాది మహర్షుల సూచనల మేర ప్రతికార్యమును అపశ్రుతి లేకుండా చేయండి. అశ్వమేథ యాగం ఏరాజు పడితే ఆ రాజు చేసేది కాదు. ఈషణ్మాత్రం విఘ్నం కలిగినా దాని కోసమే వేచి వున్న బ్రహ్మరాక్షసులు నిర్వహణ కర్తను సర్వనాశనం చేస్తారు. భక్షిస్తారు. బ్రహ్మరాక్షసులకు అన్ని శాస్త్ర విషయములు తెలుసు... కావున జాగ్రత్త" హెచ్చరించాడు దశరథుడు.

వశిష్ఠులవారు చిరునవ్వుతో- "దశరథ మహారాజా... ఆందోళన చెందవద్దు. భగవత్ సంకల్పం కూడా నిర్విఘ్నంగా యజ్ఞం పూర్తి కావటమే. ఋత్వికుల నుంచి యజ్ఞ పరికరాల వరకూ అన్నీ నేను చూసుకుంటాను. ఈ క్రతువును నీ చేత యధావిధిగా జరిపిస్తాను" చెప్పాడు.

దశరథుడు వినయ పూర్వకంగా నమస్కరించాడు. అంతా వెళ్ళిపోయాక దశరథుడు అభ్యంతర మందిరంలో తన ప్రియ భార్యలతో సమావేశమయ్యాడు.

శుభవార్తని అందరికీ చెప్పాడు. "యజ్ఞ దీక్ష వహించాలని" భార్యలని కోరాడు. కౌసల్య, సుమిత్ర, కైకేయి వదనాలు చంద్రబింబముతో పోటీ పడి నిండు పున్నమి వెన్నలతో మిలమిలలాడాయి.

## ఋష్యశృంగుడు

ప్రత్యేక మందిరంలో దశరథమహారాజుతో సుమంత్రుడు చెప్పాడు. "మహారాజా! తమకి సంతానం ఎలా కలుగునో ఒకప్పుడు సభాప్రాంగణంలో సనత్కుమార మహర్షి శెలవిస్తుండగా నేను విన్నాను. ఏ విధంగానన్నది తమకి మనవి చేస్తాను. తమరు తప్పక వినవలెనని" దశరథుడి అనుజ్ఞతో చెప్పసాగాడు.

"కాశ్యాప మహర్షికి విభండకుడు అనే కొడుకు పుడతాడు. ఆ విభండక ముని పుత్రుడే ఋష్యశృంగుడు. బ్రహ్మచర్యము రెండు విధాలు. ఒకటి వివాహానికి ముందు గురుసేవ చేస్తూ విద్యాభ్యాసం చేయటం... రెండు వివాహానంతరం ఋతుకాలాల్లో మాత్రమే భార్యని దగ్గరకు తీసుకోవటం.

ఈ రెండు విధములైన బ్రహ్మచర్యములలోనూ ఋష్యశృంగుడు ప్రసిద్ధి. మొదటి దశలో ఆ మునికుమారుడు అటవీ ప్రాంతంలో జన్మించి అడవిలోనే పెరుగుతాడు. అడవి, తండ్రి తప్ప మరేమి తెలియనివాడు. బ్రాహ్మణ శ్రేష్ఠుడైన ముని కుమారునికి బాహ్య ప్రపంచం, ఇతరత్రా దేశాలూ, సుఖాలూ, స్త్రీ అనే పదమే తెలియదు. అతనికి తెలిసింది తండ్రికి సేవ చేయటం.... అగ్నిహోత్రాన్ని పూజించటం.

"అలా ఋష్యశృంగుడికి అడవే తప్ప బైట ప్రపంచంలో ఏముందో తెలియని ఆ సమయంలో అంగదేశాన్ని రోమపాదుడు పాలిస్తున్నాడు. రోమ పాదుడు బలవంతుడూ, వీరుడూ, పరాక్రమవంతుడే కాదు.

"ధర్మహానిలోనూ, అధర్మంలోనూ దిట్టే. తత్కారణంగా రాజ్యంలో ధర్మం నశించింది. అధర్మం పెరిగి వానలు కురవటం లేదు. ప్రజలు ఆకలితో అలమటిస్తున్నారు. ఘోరమైన కాటకం విలయతాండవం చేసింది. ప్రజలు ఆహారం కోసమూ, సుఖాల కోసమూ ఏ నీచకార్యానికైనా సిద్ధపడి చేసేస్తున్నారు. దానితో రోమపాదుడు తన మంత్రులని పిలిచి జరిగిన అనర్థానికి చింతించి "తక్షణ కర్తవ్యాన్ని తెలుపమని" మంత్రులనీ, సద్ బ్రాహ్మణులనీ అడుగుతాడు.





"రోమపాదా! లోకాచార ప్రకారం ప్రాయశ్చిత్తం తప్పదు. నీ అధర్మ పాలనకి ఇది ప్రతిఫలం. అయినా చింతించవలదు. దానికి ఒక్కటే మార్గం. ఋష్యశృంగుడని పిలిచి తమ బిడ్డ శాంతినిచ్చి కళ్యాణం చేస్తే అన్నీ చక్క బడతాయి.

"ఋతువులూ, పంచభూతాలూ శాంతించి మళ్ళీ యథా ప్రకారం రాజ్యాన్ని సుస్థిరం చేస్తాయి" చెప్పారు వేదపారంగతులైన బ్రాహ్మణులు.

రోమపాదుడు మంత్రాంగాన్ని సమావేశపరిచి "ఋష్యశృంగుని ఏ విధముగానైనా తీసుకుని రమ్మని" ఆజ్ఞాపిస్తాడు.

అందుకు అంతా ఖిన్నులై దీనమోములతో "విభండకముని గురించి తమకి తెలియనిది కాదు. ఆ చండశాసనుడితో మేము పడలేము. ఆయన పేరు వింటేనే శరీరం యావత్తు భయంతో వణికిపోతోంది. మేం పోలేము. మమ్మల్ని దయ వుంచి క్షమించవలెను.... కానీ ఋష్యశృంగుడిని తెచ్చే చక్కటి రాజనీతి ఉపాయం చెప్పగలము..."అని ఉపాయం వివరంగా చెప్పారు.

రోమపాదుడు వారు చెప్పినట్టు సౌందర్యానికి సానపెట్టినట్టుండే అంగటి స్త్రీలను ఋష్యశృంగుడి వద్దకు పంపుతాడు. వారంతా కలిసి ఋష్యశృంగుడిని అంగదేశానికి తీసుకు వస్తారు.

"అంగదేశంలో వానలు కురుస్తాయి. రోమపాదుడు తన కూతురు శాంతినిచ్చి పరిణయం చేస్తాడు. ఆ ఋష్యశృంగుడే దశరథ మహారాజు చేత యజ్ఞం చేయిస్తాడు. అప్పుడే ఆయనకు పుత్రులు కలుగుతారు..... ఈ విధంగా సనత్కుమార మహర్షి చెబుతుండగా నేను విన్నాను ప్రభు" చెప్పాడు సుమంత్రుడు.

దశరథ మహారాజు ఆసాంతం విని సంతసంగా "సుమంత్రా..... వేశ్యలు ఋష్యశృంగుని ఎలా అంగదేశం తీసుకువచ్చారో వినవలెనని కుతూహలపడు తున్నాను" అడిగాడు దశరథుడు.

## ఋష్యశృంగుడి వివాహం

"ఓ అయోధ్యా దీశా! దశరథ మహారాజా..... ఋష్యశృంగుడిని తీసుకు వచ్చిన కథనం మీకు మనవి చేస్తాను...

"ఋష్యశృంగుడు ఎప్పుడూ అడవిలోనే ఉండేవాడు. పక్షుల కిలకిలా రావాలు, పరిగెత్తే సెలయేళ్ళు... వింటి నుండి వెలువడ్డ బాణంలా వచ్చే

జలపాతాలు.... ఆకుల గలగలలు... పూల పులకరింతలు... మధుర ఫల రుచులు... తపస్సు, వేదాధ్యయనము అవే అతని ప్రపంచం. అంతకు మించి ఇంకేమి తెలియదు.

ముఖ్యంగా స్త్రీ సంబంధిత ఏ అంశం అతనే మాత్రం ఎరగడు. మగాడి మనస్సు కలత పెట్టి, ఇంద్రియలోలుడ్ని చేసే దిశగా రోమపాదునుకి మంత్రులు సలహా ఇచ్చారు.

రాజాజ్ఞపై అందమైన గణికలను.... చూడగానే మనసు వశం తప్పే అందగత్తెలను, వేశ్యా నెరజాణలను సుందరమైన దుస్తులూ, ఆభరణాలూ ధరింప చేసి అడవికి పంపారు మంత్రులూ, పురోహితులూ.

అందమైన, అపురూప లావణ్యంగల స్త్రీలు మహారణ్యంలోకి ప్రవేశించారు. విభండకముని ఆశ్రమానికి చేరువలో సుందరమైన ప్రకృతితో ఉన్న ప్రదేశంలో వేచి వున్నారు.

ఋష్యశృంగుడు ఆశ్రమపదములోని అగ్నిహోత్రాన్ని సేవిస్తూ తండ్రికి సేవ చేస్తూ ఉండటం నిత్యకృతి. తండ్రితో తప్ప బైటికి అడుగుపెట్టడు.

ఓసారి తండ్రి లేనప్పుడు ఆశ్రమ ప్రాంతం నుంచి బైటికి వచ్చాడు. వేశ్యలు మకాం చేసిన ప్రదేశానికి రానే వచ్చాడు. ఆ అవకాశం కోసమే చూస్తున్న సుందరాంగిణిలు చుట్టుముట్టారు. గలగల నవ్వారు. చుట్టూ చేరారు. స్త్రీ వాసన, ఋష్యశృంగునకు కొత్తగా తోచింది.

ఋష్యశృంగుడు ఆ గణికలను, కామ్యామాన రూపాల్ని చూస్తూ ఆశ్చర్య ఆనందచకితుడయ్యాడు. పట్టి పట్టి పరికించి చూశాడు.

“ఓ సుందర బ్రాహ్మణుడా..... ఎవరు నీవు? ఎంతో అందంగా మద్ది చెట్టువలే ఉన్నావు. ఈ ఘోరారణ్యంలో ఒంటరిగా ఎందుకు తిరుగుతున్నావు?” ప్రశ్నల వర్షం కురిపిస్తూ దరి చేరారు. ఆ స్త్రీల చిరుగాలితో ఋష్యశృంగుడి తనువూ, మనస్సూ పులకరించి పోయింది.

“ఓ చూడ చక్కని పడతులారా?.... నా తండ్రి విభండకముని. నేను ఆయన ఔరస పుత్రుడని, నన్ను ఋష్యశృంగుడంటారు. దగ్గరిలోనే ఆశ్రమపదమున్నది. నా తోడు వచ్చిన, మీకు సమస్త అతిథి సత్కారాలను చేస్తాను...” అన్నాడు.

ఋష్యశృంగుడు అడిగిందే తడవు, వేశ్యా స్త్రీలందరికీ విభండక మహర్షి ఆశ్రమము చూడాలనిపించింది. అంతా ఆశ్రమానికి పోయారు.





ఋష్యశృంగుడు వారిని తమ ఆశ్రమానికి తీసుకెళ్ళి అతిథి సత్కారాలతో రంజింపచేశాడు.... పాద్యం.... అర్ఘ్యం, కందమూలాలు, తియ్యటి పళ్ళు ఇచ్చాడు.

విభండక మహర్షి వస్తే కొంపకూలుతుందని, ఆడంగులంతా తొందరపడ్డారు. వెళతామని చెప్పారు.

“ఋషిపుత్రా! ఇంత కన్నా మధురమైనవి, తియ్యనైనవి మా వద్ద కూడా మధుర ఫలాలూ, పదార్థాలూ వున్నాయి. అవి నీ వెన్నడూ రుచి చూసి వుండవు” పెదాలు సన్నగా కొరుకుతూ చెప్పి వచ్చారు.

అంత మధురంగా ఉన్న ఆ ఫలాలను ఈ అడవిలో నేను ఎన్నడూ రుచి చూడలేదా అనుకున్నాడు ఋష్యశృంగుడు.

ఋష్యశృంగుడు ఆగలేకపోయాడు. ఆ గణికల వద్దకు వెళ్ళాడు. అనంతరం వారు అతని దరి చేరారు. స్త్రీ స్పర్శా సుఖం మూకుమ్మడిగా రుచి చూపారు. కొత్త రుచి... ఋష్యశృంగుడికి మనసు దూది పింజ అయింది. సుఖమంటే ఏమిటో తెలిసింది.

ఋష్యశృంగునికి అంతా కొత్తగా వుంది. క్రొంగొత్త లోకాలలో విహరిస్తున్నట్టు వుంది.

“ఎంతో మధురంగా వుంది.... ఈ అడవిలో ఎన్నడూ చూడలేదు..... కనలేదు.....అనుభవించలేదు.....” అనుకున్నాడు ఋష్యశృంగుడు.

విభండకుడు ఏ క్షణంలోనైనా వస్తాడనే భయంతో ఋష్యశృంగుడిని చేరి “మా వ్రతానుష్ఠానానికి వేళ అవుతోంది.... మళ్ళీ కలుస్తాం... నేస్తమా?” అని అంతా చల్లగా చెప్పి ఋష్యశృంగుడ్ని పంపేశారు.

ఋష్యశృంగునికి మనసు అదుపు తప్పింది. ఆ స్త్రీలే కనుల ముందు మెదలసాగారు. ఆ స్పర్శే మనసుకి మళ్ళీ మళ్ళీ కావాలనిపించసాగింది. అడవంతా తిరిగాడు.

మరుసటి రోజు సూర్యభగవానుని కంటే ముందే సానులున్న చోటికి బైలుదేరాడు. ఋష్యశృంగుడి రాక కోసమే వేచి వున్న స్త్రీలు అప్పటికే అందాల భరిణెల్లా తయారై వున్నారు.

ఋష్యశృంగుడిని చూస్తూనే అంతా మహదానందంతో ఎదురేగి... “మీరాక బహుదానంద” మంటూ ఆహ్వానించారు.

ఆ మనోహరాంగనలను చూస్తూనే తబ్బిబ్బయ్యాడు ఋష్యశృంగుడు.

"ఓ బుద్ధిమంతా! నీవు మా ఆశ్రమ పదానికి రావలెయును. నిన్ను నిన్నటి కన్నా ఎక్కువగా సత్కరిస్తాం, నీతో గుడుపుతాం...."

తియ్యని మాటలకీ, మనోహర వాక్కులకీ ఋష్యశృంగుడు సరేనన్నాడు.

అందరూ అంగదేశంలో అడుగుపెట్టారు. ఋష్యశృంగుడు అంగదేశంలో కాలు మోపగానే ఆకాశాన ఉరుములు... మెరుపులు... ఒక్కసారిగా వాతావరణం చల్లబడిపోయింది...

హిమాలయాల నుంచి గాలి వస్తుందా అనిపించే చల్లగాలులతో వర్షం మొదలైంది. ప్రజలు ఆనందోత్సాహాలతో గెంతులేశారు.

భూమి మీద పడ్డ వర్షపు చుక్కలు పడినవి పడినట్టే ఇంకిపోతున్నాయి. మంత్రులూ, పురోహితులూ, ప్రజలూ పూలు చల్లుతూ ఋష్యశృంగుడిని అంతఃపురానికి తీసుకు వెళ్ళారు.

రోమపాద మహారాజు ఎదురేగి... ఋష్యశృంగునికి సాష్టాంగ నమస్కారం చేశాడు.

శాస్త్రీయంగా పాద్యమూ, అర్ఘ్యమూ ఇచ్చాడు.

"తమని ఇలా రప్పించినందుకు క్షమించవలసింది. తమ తండ్రి విభండక మహర్షి కూడా మమ్మలను క్షమించి, మన్నించేలా చూడాలని" వేడుకున్నాడు... ప్రార్థించాడు రోమపాదుడు.

ఋష్యశృంగుడు తన దేశాన్ని వదిలి వెళ్ళకుండా తన కూతురు శాంతాదేవినిచ్చి బ్రహ్మాండంగా వివాహం చేసి రోమపాదుడు ప్రశాంత చిత్తుడయ్యాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"దశరథ మహారాజా.... ఇప్పుడు ఋష్యశృంగుడు, తన భార్య శాంతాదేవితో సమస్త సుఖాలు అనుభవిస్తూ రాజాంతఃపురంలో సంతోషంగా వున్నాడు..." చెప్పి సుమంత్రుడు... "ఓ రాజా! మీకు సంబంధిత విషయం ఇంతటితో అయిపోలేదు. సనత్కుమారుడు చెప్పిన మరో విషయం వుంది" అని చెప్పసాగాడు.

"ఇక్ష్వాకువంశంలో దశరథుడనే రాజు పుడతాడు. అతను అపార లక్ష్మీప్రాప్తి కలవాడు, సత్యవాక్యాపాలకుడు, ధార్మికుడు. అదే కాలంలో అంగదేశంలో రోమపాదుడు రాజ్యమేలుతుంటాడు. ఇద్దరికీ సాన్నిహిత్యం





పెరుగుతుంది. దశరథ మహారాజు రోమపాదుడు దగ్గరికి వెళ్ళి తన సంతాన లేమి విషయం చెప్పి.... అల్లుడు ఋష్యశృంగుడి చేత యజ్ఞం చేయించాలను కుంటున్నానని చెబుతాడు.

"దశరథుని మాటలని రోమపాదుడు మన్నించి అల్లుడు ఋష్య శృంగుడిని పంపుతాడు. ఋష్యశృంగుడి రాకతో దశరథుని దుఃఖం దూరమవుతుంది. ... దశరథుని చేత యజ్ఞం చేయిస్తాడు. నలుగురు కుమారులు పుడతారు.

"మహాతేజస్సుతో, మహోన్నతులైన కొడుకులవుతారు. వంశ ప్రతిష్ఠను గాలీ, వెలుతురూ ఉన్నంత వరకూ ఉంచుతారు. ఇదంతా భగవానుడైన సనత్కుమారుడు చెప్పారు... కావున ఓ మహారాజా! మనం సమస్త రాజ లాంఛనాలతో రోమపాదుడ్ని దర్శించి, అర్థించి ఋష్యశృంగుణ్ణి తీసుకువద్దాం."

సుమంత్రుడు చెప్పింది విన్న దశరథుడు వశిష్ఠాది మహర్షులతో సంప్రదించి వారి నుంచి అనుమతి తీసుకున్నాడు.

అంగదేశం బైలుదేరాడు .... మంత్రిసత్తములతోనూ, బంధుమిత్ర పరివారంతోనూ నదులూ, అరణ్యాలూ దాటి అంగదేశం చేరారు. స్నేహితుడ్ని రోమపాదుడు ఆదరించాడు.

విషయం విని వజ్ర తేజస్సుతో... అగ్నిహోత్రుడిని తలపిస్తున్న ఋష్యశృంగుడిని పరిచయం చేశాడు అంగదేశ రాజు.

దశరథుడు తన మనస్సులోని మాట ఋష్యశృంగునికి వివరించాడు. ఋష్యశృంగుడు సరేనన్నాడు. సంతోషంతో అంగీకరించాడు. అల్లుడినే కాక కూతురు శాంతాదేవిని కూడా పంపాలని కోరాడు.

రోమపాదుడు సంతోషంగా సరేనన్నాడు.

దశరథుడు త్వరిత విక్రముడు సుమంత్రుడికి ఆజ్ఞలు జారీ చేశాడు. వేగంగా నడిచే సుమంత్రుడు, దశరథుని మనోభీష్టం ప్రకారం పనులను మరింత వేగిరం చేశాడు.

దూతలు అయోధ్యా నగరానికి వార్త చేరవేశారు.

ఋష్యశృంగ దంపతులతో దశరథుడు శంఖ దుందుభుల మధ్య అయోధ్యా నగరాన ప్రవేశించాడు.

ఆ పుణ్య దంపతులను దశరథుడే సన్మానించాడు. సత్కరించాడు. అంతఃపురంలో సమస్త సపర్యలు చేసే పరివారాన్ని ఏర్పాటు చేసి తన మందిరానికి చేరాడు.

# అశ్వమేధ యాగం

సమస్త జీవకోటికి మనోహరమైన వసంతకాలం వచ్చింది. యజ్ఞకర్మను ఆరంభించాలని దశరథుడు సరయూ నది ఉత్తర దిక్కున ఏర్పాటు చేసిన యజ్ఞభూమికి వెళ్ళాడు.

వశిష్ఠుడికి నమస్కరించాడు. ఋష్యశృంగ దంపతులతో వినయ పూర్వకంగా "రఘువంశము పుత్రపౌత్ర పారంపర్యం వర్ధిల్లేందుకు తమరు నాచే అశ్వమేధ యాగం చేయించాలని ప్రార్థిస్తున్నాను. తమరే ఈ యజ్ఞానికి ఋత్విజులుగా, సాంగ్రహణేష్ఠిని ఉపక్రమించవలెను" అని ప్రార్థించాడు.

ఋష్యశృంగుడు "అలాగే... యజ్ఞోపకరణాలను అన్నీ సమకూర్చితే గుర్రాన్ని వదలవచ్చునని" చెప్పాడు.

పురోహితుడైన వశిష్ఠ మహర్షినీ, వేదశాస్త్ర పారంగతుడైన వామదేవుణ్ణీ, జాబాలినీ, కాశ్యాపుణ్ణీ ఇంకా ఇతర బ్రాహ్మణోత్తములను ఆహ్వానించవల్సిందిగా సుమంత్రుడిని ఆదేశించాడు. సుమంత్రుడు దశరథుని ఆజ్ఞని శిరసావహించాడు.

"ఓ విద్యాశాస్త్ర శ్రేష్ఠులారా! పుత్ర సంతానం కోసం అశ్వమేధయాగం చేయాలనే నా కోరిక తమకు ముందే విన్నవించాను. తమరంతా ఆశీర్వదించారు. ఋష్యశృంగ దంపతులు యజ్ఞాన్ని ఆరంభించటానికి కృతకృత్యులై ఉన్నారు. ఇక యజ్ఞ కార్య నిర్వహణకి సదాసిద్ధమై ఉండవల్సిందిగా కోరుతున్నాను" చెప్పాడు దశరథుడు.

"సంతానం కోసం ఇంత యజ్ఞం చేయటం బహు సంతోషం... తమకి తప్పక నలుగురు పుత్రులు పుడతారు" ఆశీర్వదించారు సత్యసంధులూ, సరస్వతీ పుత్రులూ, పండితులూ, సద్ బ్రాహ్మణులూ.

తన మంత్రులకీ, పరివారానికీ ఆజ్ఞాపించాడు దశరథుడు... "మంత్రి పుంగవులారా? యజ్ఞానికి కావాల్సిన సమస్త సంభారాలను సేకరించండి.. యజ్ఞానికి ఎలాంటి అపశ్రుతి పలుకకూడదు. ఇలాంటి యజ్ఞాల్లో జరగరానిది జరిగితే రాక్షసులైపోతాము. రాక్షసులు కొందరు ఇలా అయిన వారే. కావున వారికి యజ్ఞ నిబంధనలు తెలుసు. వారు అప్రమత్తులై చూస్తుంటారు. జాగ్రత్తగా వ్యవహరించండి. వృద్ధ బ్రాహ్మణులనూ, ధర్మశాస్త్ర కోవిధులనూ, శిల్పులనూ, వడ్రంగి వాళ్ళనూ, నర్తకులనూ పిలిపించండి.





"అతిథుల కోసం సర్వరుచికర పదార్థాలను తయారు చేయించండి. అడిగిన వారికి లేదనకుండా దానాలు, కోరిన వారికి కోరిన పదార్థాలతో భోజనాలు, బ్రాహ్మణులు, అతిథులు ఉండటానికి అద్భుత మందిరాలు..... అన్నీ వర్గాల వారికి సత్కారాలు చేయండి.

"కామ, క్రోధాల వల్ల ఎవ్వరూ మనస్థాపం చెందకుండా నిత్య పూజలు జరిపించండి. పుట్టింటికి వచ్చిన ఆడపిల్లని చూసుకున్నట్టు సమస్త సౌకర్యాలు చేయవలసింది."

ఆపై సుమంత్రుడితో - "మన మిత్రరాజులకి స్వయంగా ఆహ్వానాలు అందించు. మిథిలా నగర రాజు జనకుడు.... సత్య విక్రముడు, శూరుడు. ఆయన్ని నీవే గౌరవంగా తీసుకురావలయును.

నా స్నేహితులైన కాశీరాజునీ, అంగదేశ రాజు రోమపాదులవారినీ, అందరినీ బంధుమిత్ర సపరివారంగా రావలెనని నా విన్నపంగా చెప్పవలయును."

సుమంత్రుడు"తమ ఆజ్ఞ అక్షరాలా జరిగిపోతుంది మహారాజా!" చెప్పాడు.

వశిష్ఠాది మహర్షుల ఆజ్ఞ ప్రకారం రాజులందరికీ ఆహ్వానాలు వెళ్ళాయి.

రోజులు గడిచే కొద్దీ అతిథులతో అయోధ్య నిండిపోసాగింది. అందరికీ వారివారి స్థాయి కంటే ఎక్కువగానే మర్యాదలు జరిగిపోతున్నాయి. అశ్వమేధయాగ ముహూర్తానికి రోజులు దగ్గర పడుతున్నాయి. ఋష్యశృంగుడు ఎప్పటికప్పుడు సమస్త విషయాలని విశదీకరిస్తున్నాడు.

ఋష్యశృంగుడు, వశిష్ఠాది మహర్షులు నిర్ణయించిన రోజున దశరథుడు యజ్ఞశాలలో ప్రవేశించాడు. చైత్ర పౌర్ణమినాడు సాంగ్రహణేష్ఠి కర్మ..... ఆపై రోజు బ్రహ్మౌదనమూ, ఉత్తమాశ్వ బంధప్రోక్షణ విమోచనమూ చేశారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

యజ్ఞ గుర్రాన్ని వదలి సంవత్సరం అయింది. అయోధ్యా నగర సరయూ నదీతీరాన గుర్రం కనపడింది. వేదశాస్త్ర కోవిదులైన అందరూ ఋష్యశృంగుడిని యజ్ఞ పెద్దని చేసారు. సరయూనది ఉత్తర తీరాన యజ్ఞవాటికలో అశ్వమేధానికి సంబంధించిన కర్మలన్నీ దశరథునితో చేయించారు ఋష్యశృంగుడూ, ఋత్విజులూ.

వేదాల ప్రకారం ఖచ్చితంగా, మీమాంసా న్యాయాల ప్రకారం, కల్ప సూత్రాల్లో చెప్పినట్టు జరిపించారు.

బ్రాహ్మణోత్తములు ఆయా కర్మాది దేవతలను ఆరాధించారు. ప్రాతస్సవనమూ లాంటి కర్మలన్నీ యధావిధిగా పూర్తి అయ్యాయి.

ఇంద్రుడికి ఇవ్వవలిసిన హవిర్భాగాన్ని యథాశాస్త్రముగా ఇచ్చారు. సోమలతను నలగకొట్టి రసం తీశారు.

మధ్యాహ్నం చెయ్యవల్సిన సవనకర్మ, ఇంకా మూడో సవనం కూడా పూర్తి అయింది.

అంతా సక్రమమే, దేనికీ విఘ్నం లేదు. యంత్ర యుక్తం.... క్షేమ కరం.... సమస్తం సమంత్రకము... శుభం.... సమాప్తం....

వందకు మించని పరివారం కలవారు అక్కడ లేరు. పండితుడుకాని వాడూ, వేదాధ్యయనము నిత్యం చేయనివాడూ ఆ ప్రదేశంలో లేడు... జ్యోతిష్య కల్పాలు వేదాలు ఆరింటిని కరతలామలకములు చేసుకొన్నవారే!... యజ్ఞం జరిగిన అన్ని నాళ్ళూ ఆ దేశంలో ఆకలన్నవాడూ, దప్పికన్నవాడూ లేడు. అన్ని వర్గాల వారికీ, దిగంబర సన్యాసులకీ... వారి వారి ఇష్టానుసారంగా భోజనాన్ని సమృద్ధిగా పెట్టారు. నూతన వస్త్రాలు, భూదాన గోదానాలు... అడగటమే ఆలస్యం... అన్నీ సమృద్ధిగా జరిపించారు.

దశరథ మహారాజునూ, ఆయన పరివారాన్నీ పొగడని రాజు లేడు... వచ్చిన అతిథులైతే ఎలా చెప్పాలో, ఎలా వివరించాలో అర్థం కాక ఆనంద సంతసాలతో దశరథుడ్ని చూస్తుండిపోయారు. దశరథునికి శుభము కలగాలని పదే పదే వల్లించారు సమస్తం....

శాస్త్రాల్లోనూ, యజ్ఞ నిర్వహణలోనూ ఆరితేరిన మహోత్తములైన వారు చెప్పినట్టుగా ఎనిమిది అంచులు తేలేటట్టు యూప స్తంభాలను చెక్కించారు. వాటిలో ఆరింటిని మారేడు మానులతోనూ, ఇంకో ఆరింటిని చంద్ర మానుతోనూ, మరో ఆరింటిని మోదుగ మానుతోనూ, ఒక దానిని విరిగిచేవ కర్రతోనూ, దేవాదారు మానుతో రెండింటిని పిడివెలితి ఇరవై ఒక్క మూరలు ఉండేట్టుగా ధర్మశాస్త్ర బద్ధంగా చేయించి, అద్భుత శోభాయమానంగా కన్పించేలా బంగారు నగలతో అలంకరించారు. మంచి గంధాలు చల్లినారు. అద్భుతమని పించారు. ఆకాశాన ప్రకాశించే సప్తర్షులు ఆ యజ్ఞవాటికలో ఉన్నారా అన్పించేలా ఉన్నారు.

దశరథ మహారాజు పట్టపురాణి కౌసల్యాదేవి, ఇంకా సుమిత్రా, కైకేయీలు గుర్రానికి భక్తిగా ప్రదక్షిణం చేశారు.





ముగ్గురూ మూడు బంగారు సూదులతో గుర్రానికి గాట్లు పెట్టారు. కల్పసూత్ర ప్రకారం. గుర్రం పడిపోయింది. చనిపోయింది. ధర్మ బుద్ధితోనూ, స్థిరమైన మనస్సుతో ధర్మసిద్ధి కోసం ఆ రాత్రంతా గడిపింది కౌసల్యాదేవి.

దశరథ మహారాజు హోతకు తన పట్టమహిషినీ, అధ్వర్యువుకు పరి వృత్తినీ, ఉద్గాతకు భోగినీ స్త్రీవావాతనూ, పాత్ర అందించే సాలాకలని బ్రహ్మకూ యజ్ఞ దక్షిణగా ఇచ్చాడు. ఆ నలుగురు ఋత్విజులూ అశ్వమేథ యజ్ఞ కర్తా, యజమానుడూ అయిన దశరథుని నుంచి పరిగ్రహించి....

వారికి బదులుగా, వస్తువులనూ, ధనాన్నీ తీసుకొని తిరిగి ఆ నలుగురు స్త్రీలనూ రాజుకి ఇచ్చేశారు ఋత్విజులు.

ఆధ్వర్యువు ప్రయోగ చతుర సంపన్నుడు. గుర్రం మెదడు తీసి శాస్త్ర ప్రకారం అగ్నిలో పక్వం చేశాడు.

తెలిసీ, తెలియక చేసిన పాపాలకుగాను దశరథుడు గుర్రం మెదడు పొగ వాసనని - ఆఘ్రాణించాడు. మంత్ర వేత్తలైన పదహారు ఋత్విజులు గుర్రం మిగతా అవయవాలన్నీ మంత్ర బద్ధంతో అగ్నిహోత్రంలో హోమం చేశారు.

ఏ యజ్ఞంలోనైనా హవిస్సును జువ్వికట్టెలతో పాకము చేస్తారు. అశ్వమేథ యజ్ఞంలో ప్రబ్బలి తీగెలతో హోమము చేస్తారు. కల్పసూత్రాల్లోనూ, బ్రాహ్మణులు చెప్పిన ప్రకారం.... అశ్వమేథం మూడురోజులు. మొదటి రోజు చతుష్టోమము, రెండో రోజు ఉక్థ్యము, మూడో రోజు అతిరాత్రము. ఈ మూడే కాక శాస్త్ర ప్రకారం చెప్పిన క్రతువులుగా కూడా ఒక జ్యోతిష్టోమమూ, ఒక ఆయుర్యాగమూ, రెండు అతిరాత్రములూ, ఒక అభిజిద్యాగమూ, ఒక విశ్వజిద్యాగమూ, ఒక ఆప్తోర్యామమూ చేశారు.

యజ్ఞం పూర్తికాగానే యజ్ఞ శాస్త్ర ప్రకారం దశరథుడు భూమండలమును ఋత్విజులు నలుగురికి ధారపోశాడు. తూర్పు భాగాన్ని హోతకు, పడమటి భాగాన్ని ఆధ్వర్యువుకునికి, దక్షిణ భాగాన్ని అంతా బ్రహ్మకున్నూ, ఉత్తర భాగాన్ని ఉద్గాతకున్నూ దానము ఇచ్చాడు.

వారంతా "ఓ రాజా! ఈ భూదానం మేం ఏమి చేసుకుంటాము. భూమిని పరిపాలించటానికి ధర్మశాస్త్రాలు అవగతమవటమే కాదు, ఇంకా వీరత్వం, శూరత్వం అవసరం. ఆ సామర్థ్యము మాకు లేదు. ఈ భూమి మాకు వలదు. దానికి బదులు మరేదైనా ఇప్పించండి" చెప్పారు.

దశరథ మహారాజు ఆ వేద ఋత్విజులకు పదిలక్షల ఆవులూ, నూరుకోట్ల బంగారమూ, దానికి నాలుగింతలు వెండినీ దానంగా ఇచ్చాడు. వాటిని సమంగా పంచే కార్యాన్ని వశిష్ఠ మహర్షికీ, ఋష్యశృంగునికీ అప్పచెప్పాడు. ఇద్దరు శ్రేష్ఠులూ పంచి పెట్టిన ప్రకారం తీసుకున్నారు ఋత్విజులు సంతోషంగా.

ఋత్విజులకే కాక అతిథులకీ, అభ్యాగతులకీ కోట్లకొలది బంగారాన్ని పంచాడు. దశరథుడి దగ్గర సంపద అంతా దానాలకి సరిపోయింది. అందరికీ అయ్యాక ఏమీ ముట్టని ఓ బ్రాహ్మణుడు వచ్చి దానం అడిగాడు.

బ్రాహ్మణుడు అడిగిన వెంటనే తన ముంజేతి మురుగులు తీసి ఇచ్చాడు. చేతికి ఎముక లేకుండా దానాలు చేశాడు దశరథుడు. అందరినీ సంతృప్తి పరచిన దశరథుడు ఆనందపరవశుడయ్యాడు. అందరికీ సాష్టాంగ నమస్కారం చేశాడు.

ఏ రాజు చేయలేని అశ్వమేథ యాగం పూర్తి చేశాడు. అశ్వమేథ యాగం సర్వపాపాలను పోగొడుతుంది. స్వర్గం ప్రసాదిస్తుంది. మహామహా వ్యక్తులకే అసాధ్యమైన అశ్వమేథ యాగం చేశాడు దశరథుడు.

సంతుష్టుడైన మనసుతో దశరథుడు ఋష్యశృంగునితో చెప్పాడు... "మునీంద్రా! నిర్విఘ్నముగా అశ్వమేథం నాతో చేయించినారు. ఇంకా నా వంశ వృద్ధి కోసం తగిన పుణ్య కార్యాన్ని చేయించాలి. నా చేత ఇంకను ఏదైనా కర్మను చేయించమని కోరుతున్నాను. అందులకు తమరే సమర్థులు..."

"అశ్వమేథ యాగం చేసి మహాపుణ్యవ్రతుడవయ్యావు రాజా! పుత్ర సంతానం కోసం ఇప్పుడే నీచే కర్మ చేయిస్తాను. ఆ కర్మ ఫలంగా నీకు నలుగురు కులోద్ధారకులు జన్మిస్తారు" శెలవిచ్చాడు ఋష్యశృంగుడు.

## పుత్రకామేష్టి యాగం

"దశరథ మహారాజా! పుత్రోత్పత్తికి అథర్వ శిరస్సులోని మంత్రాలతో ఇష్టిని చేస్తాను. ఆ పుత్రకామేష్టి యాగము ద్వారా నీ కోరిక సిద్ధిస్తుంది" అంటూ పుత్రకామేష్టి ఆరంభించి వేదమంత్రాలతో హోమము ప్రారంభించినాడు.

## రావణవధకు శ్రీకారం

యజ్ఞప్రదేశం హోమములతోనూ, వేదమంత్రాలతోనూ ఆవరించి ఉంది. యజ్ఞ సభలో దేవతలూ, గంధర్వులూ, సిద్ధులూ, మహర్షులూ, హవిర్భాగాల





కోసం వచ్చి వున్నారు. సదస్సుకు మహా తేజస్సుతో బ్రహ్మదేవుడూ వేంచేసి ఉన్నాడు.

పూజ్యవాక్యములు పలికి దేవతలంతా భక్తిగా, వినయంగా లోకకర్త బ్రహ్మ చెంత చేరారు...అడిగారు.

"సృష్టికర్తా! మాదో విన్నపం... మీ వరాల అహంకారంతో రావణాసురుడు చేసే ఆకృత్యాలు అన్నీ, ఇన్నీ కావు. దేవేంద్రుడిని సేవకుడిలా చూస్తున్నాడు. పంచభూతాలని వాటి విధ్యుత్తు ధర్మాన్ని పాటించనీయటం లేదు. యక్ష, గంధర్వ, కిన్నెర లోకాల్లో మగువల పట్ల అరాచకాలకి అంతే లేదు. అప్సరసలను ఆటబొమ్మల్లా ఆడిస్తున్నాడు. నందనోద్యానవనము చిన్నాభిన్నం చేస్తున్నాడు. మహర్షుల యజ్ఞ యాగాదులకూ ఆటంకం కలిగిస్తున్నాడు, వారిని వేధిస్తున్నాడు. ఎంతకాలం ఈ వ్యధలూ, ఈ బాధలూ... మాకు విముక్తి లేదా?"

బ్రహ్మదేవుడు అభయం ఇచ్చేలా వారందరిని చూసి "రావణాసురునికి దేవదానవ రాక్షసులందరితోనూ చావులేదు. ఆ వర మధంతో ఒళ్ళు తెలియ కుండా ధర్మహాని చేస్తున్నాడు. తప్పు చేసిన వారికి శిక్ష తప్పదు. పుట్టినవాడు మరణించక తప్పదు. అది సృష్టి ధర్మము. ఆ ధర్మానికి అతీతుడు కాదు రావణాసురుడు.

"ప్రేమాతిశయంతో వరాలు కోరుకొమ్మన్నప్పుడు స్వజాతి విచక్షణ లేక మానవుడి ప్రస్తావన తేలేదు. తను చావు తానే తెచ్చుకున్నాడు. మానవుడే రావణాసురిడి పాలిటి మృత్యువు."

బ్రహ్మ చెప్పిన ఈ రహస్యానికి అంతా సంతోషించారు. సరిగ్గా అప్పుడే మహాతేజస్సుతో పీతాంబరములతో బ్రహ్మాండమైన వెలుగుతో శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమైనాడు. శంఖ, చక్ర గదలతో ఉన్న స్వామికి నమస్కరించారు. దేవతలు తమ గోడు విష్ణువుకు విన్నవించారు.

"వైకుంఠనాథా! లోక కంఠకుడు రావణాసురుడి వైపరీత్యాలకు తల్లడిల్లిపోతున్నాము. సూర్య, చంద్రులు జడిసిపోతున్నారు. బ్రహ్మ వరాలతో పెట్రేగిపోతున్నాడు. ఒక్క మానవుడి వల్లే అతనికి మరణం అని తమకి తెలియనిది కాదు. మాకెవ్వరికీ ఎదిరించే శక్తి లేదు సరికదా ఎదురు పడే ధైర్యం కూడా లేదు. అన్ని కష్ట సమయాల్లోలానే తమరే మాకు దిక్కు..."

శ్రీమహావిష్ణువు మధుర వాక్కులతో దేవతలతో "గంధర్వాది దేవతలారా! భయపడవద్దు. రావణుడి ఆకృత్యాలూ, ఆగడాలూ ఇక ఎన్నో రోజులు సాగవు."

"మా అందరికీ దేవదేవుడవు. నీవే మానవ జన్మ ఎత్తి శత్రుసంహారం చేసి, లోక పీడని పోగొట్టాలి..."

శ్రీ మహావిష్ణువు అభయమిచ్చాడు. బ్రహ్మాది దేవతలు సంతసించారు.

సమస్త లోకాలకీ, జీవాలకీ ఆధార భూతుడైన శ్రీ మహావిష్ణువు ఏ తల్లి కడుపు పంటగా జన్మించాలి. ఆ మహా అదృష్టం, ప్రసాదం ఎవరి ఇంట?

పుత్రసంతానం కోసం, ఋష్యశృంగుడితో పుత్రకామేష్టి యాగం చేస్తున్న దశరథుడుని చూశాడు. భూమండలమంతా ప్రాకివున్న అతని ధర్మనిరతి, సమస్త జనులందరికి సరియైన సమబుద్ధి పంచువాడూ, తేజోవంతుడూ అయిన దశరథుడు తగినవాడు.

శ్రీ మహావిష్ణువు దేవతలతో ఆ భాగ్యం దశరథుడిదేనని చెప్పాడు. దేవతలంతా ముకుళిత హస్తాలతో "స్వామీ! అయోధ్యాధి పతి దశరథ మహారాజు. ఆయన భార్యలు ముగ్గురు దక్షప్రజాపతి కూతుళ్ళు హ్రీ, శ్రీ, కీర్తి వంటివారు. తాము నాలుగు భాగాలుగా ఆ మహా ఇల్లాండ్ర కడుపున జన్మించవలసింది" అని వేడుకున్నారు.

శ్రీ మహావిష్ణువు దేవతల కోరికను మన్నించాడు. అభయం ఇచ్చాడు. బ్రహ్మాది దేవతల ఆనందానికి అవధులు లేకుండా పోయింది.

"ధర్మపరులందరికీ శుభం కలుగుతుంది. మహోత్కృష్టమైన మానవ జన్మ ఎత్తుతాను. ఆ రావణాసురుడిని పుత్ర, బంధు మిత్ర పరివార సహితంగా సంహరిస్తాను. ఈ భూమిని పదివేల సంవత్సరాలు పరిపాలిస్తాను"

దేవేంద్రుడు, గంధర్వులు, దేవతలు, మహర్షులు దివ్యమైన స్తోత్రాలతో శ్రీమహా విష్ణువుని స్తుతించారు.

దుర్మతి, దుర్మార్గుడు, స్త్రీ లోలుడు, గర్వాంధుడు, విష్ణు ద్వేషి అయిన ఆ రావణాసురుడిని, అతని పుత్ర, బంధు సమస్త పరివారాన్ని సంహరించి వైకుంఠానికి దయచేయమని ప్రార్థించారు. బ్రహ్మాది దేవతల పూజలందుకుని అంతర్ధానమయ్యాడు విష్ణువు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

పుత్రకామేష్టి యాగం పూర్తి అయ్యింది. హోమగుండంలో కదలిక వచ్చింది. ముందుగా బ్రహ్మాండమైన వెలుగు... కన్నులు చెదిరిపోయేలా తేజోవంతమైన భూతం హోమగుండం నుంచి వచ్చింది.





దివ్యాభరణాలతో సర్వ శుభలక్షణాలతో కొండంత రూపంతో ఆవిర్భ వించాడు. ఎరుపు, నలుపు బట్టలు కట్టుకొని వున్నాడు. ఒంటినిండా వెంట్రుకలు, బంగారు ఆభరణాలతో అగ్నిహోత్ర జ్వాలలా ఎగిసి వున్నాడు. ఇష్టసఖిని కౌగిలించుకున్నట్టు అతని కౌగిట్లో బంగారు కలశం. దానిపై వెండి పళ్ళెపు మూత.

దశరథుడు ఆత్రుతతో లేచి నమస్కరించాడు. "యజ్ఞ పురుషా స్వాగతం... అయోధ్య నేలే దశరథుడు తమకి నమస్కరిస్తున్నాడు"

"రాజా! నేను ప్రజాపతి అనుజ్ఞతో వచ్చాను. నీ యజ్ఞం దేవతలందరికీ సంతృప్తినిచ్చింది. ఇదిగో పాయస పాత్ర. ఇది దేవతలంతా కలిసి చేసిన పాకం. నీ కుల భార్యలకి ఇవ్వు. పుత్ర సంతానంతో పాటు ధనము, ఆరోగ్య వర్ధనము, ప్రజాక్షేమము కూడా కలిగిస్తుంది"

దశరథుడు భక్తితో, ప్రేమతో ఆ బంగారు కలశాన్ని అందుకున్నాడు. మహా పెన్నిధి దొరికిన కడు పేదవాడిలా ఉప్పొంగిపోయాడు. దివ్యపురుషునికి నమస్కరిస్తూ ప్రదక్షిణం చేసి సాష్టాంగపడ్డాడు.

ప్రాజాపత్య పురుషుడు అంతర్ధానమయ్యాడు.

దివ్యపురుషుడిచ్చిన దివ్యకలశాన్ని తీసుకొని అంతఃపురానికి వెళ్ళాడు. దశరథ మహారాజు ఆనందానికి పరిసరమంతా నిండు శరత్కాల పౌర్ణమే అయ్యింది.

దశరథుడు తన ప్రియ భార్యల చెంత చేరి "కౌసల్యా! దేవతలు వండి పంపిన పాయసం. పుత్రకామేష్టి యాగ ఫలం... "

కౌసల్యా, సుమిత్రా, కైకేయీ ముగ్గురు భక్తితో నమస్కరించారు.

దశరథుడు పాత్రలోని పాయసము సగభాగం కౌసల్యాదేవికి, మిగిలిన సగభాగంలో సగం సుమిత్రాదేవికి, మిగిలి ఉన్న పాయసంలో సగభాగం అనగా ఎనిమిదవ భాగం కైకేయీదేవికి ఇచ్చాడు. ఇంకా మిగిలిన పాయసాన్ని ఆలోచించి సుమిత్రాదేవికి ఇచ్చాడు. అమృత తుల్యమైన ఆ యజ్ఞ పాయసాన్ని ఆ ముగ్గురు ఉత్తమ ఇల్లాండ్రు స్వీకరించి భుజించారు.

ఉత్తమోత్తమమైన వెలుగు వారిని ఆవహించి వారు మెరిసిపొయ్యారు. ముగ్గురూ గర్భవతులయ్యారు.

దశరథ మహారాజు శాంత చిత్తుడయ్యాడు. అయోధ్యా నగరం దేవేంద్ర లోకంలా, దశరథుడు ఇంద్రుడిలా సంతసించాడు.

## వానరసేన

మహావిష్ణువు అభయమిచ్చి అంతర్ధానము అవ్వగానే బ్రహ్మదేవుడు దేవతలతో చెప్పాడు.

"సత్యసంధుడూ, వైకుంఠవాసుడూ, శ్రీమహావిష్ణువు భూలోకంలో జన్మించబోతున్నాడు. రాక్షస సంహారంలో చేయూతనివ్వటానికి బలవంతమైన కామరూపుల్ని సృష్టించండి. అప్సర స్త్రీలూ, గంధర్వాంగనలూ వానర రూప పుత్రులను కనేటట్టు చేయండి. ఆ పుట్టే వానరులకి అన్ని మాయలు తెలిసి ఉండాలి. శూరత్వంతో పాటు నీతిమంతులూ, బుద్ధిమంతులై ఉండాలి. వాయువేగ సమానులవ్వాలి.

"సింహబలంతో విష్ణుమూర్తి ప్రతాపాన్ని చవిచూపేలా ఉండాలి. సర్వ అస్త్రాలూ తెలిసి ఉండాలి. అమృతం పానం చేసిన వారికి మల్లే ఆకలి దప్పులు లేకుండా ఉండాలి. భూలోకంలో కోతుల్లా, భల్లూకాల్లా, గోలంగుల్లా సంచరించాలి.

"ఇంతకు ముందే సంకల్పించి ఆవులిస్తుంటే నీతిమంతుడైన జాంబవంతుడు పుట్టుకొచ్చాడు. ఇక మీ విద్యుత్తు ధర్మాన్ని నెరవేర్చండి."

బ్రహ్మ చెప్పినట్టే చేశారు దేవతలు. కోతుల్లాంటి కుమారులను కన్నారు.

దేవతలు, సిద్ధులూ, ఉరగులూ, చారణులూ వానర పుత్రులని పుట్టించారు.

దేవలోకం ఏలే దేవేంద్రుడు వాలిని పుట్టించాడు. వాలి మహా బలాఢ్యుడు, మహేంద్ర పర్వతంలాంటివాడు. భూమి మొత్తాన్నీ ముహూర్తకాలంలో తిరిగి రాగలవాడు.

ఉదయభానుడు సూర్యుడు సుగ్రీవుణ్ణి కన్నాడు.

బృహస్పతి తారుడు అనే వానరుడిని పుట్టించాడు. వాడు బహు ఉత్తమోత్తమ వీరాధి వానర వీరుడు.

కుబేరుడికి నీలుడున్నూ, అశ్వనీదేవతలు మైందుణ్ణీ, ద్వివిదులునున్నూ, వరుణుడు సుషేణుణ్ణీ, పర్జన్యుడు శరభుణ్ణీ సృష్టించారు. వాయుదేవునికి మహాబలశాలీ, వాయుగమనంలో అతనికి అతనే సాటి గల హనుమంతుడను వానర వీరుడు జన్మించాడు. హనుమ వజ్రదేహుడు. కాంతివంతుడు, వీర్యవంతుడు, గరుత్మంతుడు అంతటి వేగవంతమైన బలవంతుడు.





రాక్షస రావణ వధ కోసం ఇంకా వేలాది వానర వీరులు భూలోకాన పుట్టుకొచ్చారు.

దేవతలు, ఋషుల వల్ల కొండముచ్చు రూపాలతోనూ, కోతులు, ఎలుగుబంట్ల రూపాలతోనూ లెక్కకు తేలనంత మంది పుట్టారు.

అంతా అజేయులు, శూరులు, పరాక్రమవంతులు. ఏ దేవత వల్ల పుట్టారో ఆ రూపంలోనే వున్నారు. ఆ దేవతకున్నంత బలమూ వుంది.

వానరులు అంతా అప్సరసలకూ, గంధర్వాంగనలకూ, నాగకన్యలకూ విద్యాధరస్త్రీలకూ జన్మించారు. వేలు వేలు, లక్షల కోట్లు మహాకాయులై పుట్టారు.

బలానికి పెద్ద పులులు. రాళ్ళూ, రప్పలే ఆయుధాలు. మహావృక్షాలే వారి అస్త్రాలు, గోళ్ళే పరమ ఆయుధాలు. పిడిగుద్దుకు కొండలే విరుగుతాయి. పిప్పి అవుతాయి. సముద్రాలని అల్లకల్లోలం చేస్తారు. పరిగెత్తే మేఘాలతో ఆటలాడుకుంటారు. అరుపులతో మహా క్రూర జంతువులను జడుసుకునేలా చేస్తారు.

అలాంటి ఆ వానర వీరులు ఋక్షవంత పర్వతమూ, మరికొన్ని కొండలనూ, కికారణ్యములనూ ఆశ్రయించారు.

వానరవీరులందరూ అన్నదమ్ములైన వాలినీ, సుగ్రీవుడునీ, నలుణ్ణీ, నీలుణ్ణీ, హనుమంతుడిని సేనానాయకులుగా ఎన్నుకున్నారు.

వానర సేన యావత్తు వారి మాట జవదాటదు. వారి వాక్కే శిరోధార్యం.

అందరిలోకి బలవంతుడు వాలి. ఇంద్రుడి వజ్రాయుధాలే అతని చేతులు. ఆ మహాబాహువు వాలి వానర వీరులకి రాజు.

ఈ పృథ్వి అంతటా వ్యాపించి ఉన్నారు వానరులు. మహాబలవంతులైన పర్వత శిఖరాల్లాంటి వివిధాకారాలతో, అనేక జాతి చిహ్నాలతో వానర వీరులు అంతా ఈ భూమిపై అవతారమెత్తి, తమ స్వామి పద్నాలుగు భువన భాండాలని సంరక్షించి, రక్షించే శ్రీ మహా విష్ణువు రాక కోసం అంతా సిద్ధమై వేచి వున్నారు.

## శ్రీరామ జననం

దశరథ మహారాజు అశ్వమేథయాగం, పుత్రకామేష్టి పూర్తి అవ్వగానే దేవతలు వారి వారి హవిర్భాగాలు తీసుకుని తమ లోకాలకి వెళ్ళినారు.

దేశదేశాల రాజులు దశరథుడు బహూకరించిన అనేకానేక వస్త్ర, ఆభరణాలతో పరివార సమేతంగా వశిష్టులవారికి నమస్కరించి వారి దేశాలకి బైలుదేరారు.

దశరథుడు బహూకరించిన ధౌత వస్త్రాలను ధరించి వెళుతున్న ఆ సమూహం తెల్లని మబ్బులతో పోటీ పడుతూ కనిపించింది.

యజ్ఞ కర్త ఋష్యశృంగునికీ, ఆయన ఇల్లాలు శాంతాదేవికీ దశరథుడు అనేకానేక సత్కారాలు చేసి వీడుకోలు పలికాడు. మిత్రుడూ, హితుడూ రోమపాదుడు కూడా వెళ్ళిపోయాడు.

దశరథునికి పుత్రులు ఎప్పుడు జన్మిస్తారనే కుతూహలము క్షణక్షణానికీ పెద్దదవుతోంది.

నెలల గడుస్తున్నాయి. చైత్రమాసం. ఆరవ ఋతువు. నవమి పునర్వసు నక్షత్రం. పన్నెండో మాసం. అయిదు గ్రహాలు ఉచ్చరాసుల్లో ఉన్నాయి. ఆ రోజు శుద్ధనవమి.

కర్కాటక లగ్నములో గురువు, చంద్రుడు తూర్పున ఉదయిస్తున్నారు. ఆ పుణ్య సమయాన కౌసల్యాదేవి ప్రసవించింది. మగబిడ్డ. అతనే శ్రీరాముడు, సుగుణాభిరాముడు..... సుగుణంలో, ధర్మంలో అతన్ని మించిన వాడు ముల్లోకాల్లోనూ లేడు.

పధ్నాలుగు భువన భాండాలు నమస్కరించేవాడు. జగన్నాథుడు, ఇక్ష్వాకు వంశ తిలకుడు. శిశువు అరచేతిలో వజ్రరేఖ వజ్రాయుధాన్నే తలపిస్తోంది. కౌసల్యాదేవి ఆనందం అవధులు దాటింది. దేవేంద్రుడ్ని కన్న అదితిలా సంతోషించింది. సంబరపడింది.

శ్రీ మహా విష్ణువు అర్ధాంశ శ్రీరామ జననంతో గంధర్వులు గానము చేశారు. అప్సరసలు నాట్యం చేశారు. మంగళ, దేవ దుందుభులు మారుమ్రోగాయి.

అడవిలో జంతువులూ, నెమళ్ళూ గెంతులు వేశాయి. భూమి మీద పూల మొక్కలు సంతోషంతో వికసించాయి.

ఆకాశం నుంచి సుగంధపరిమళాలు విరజిమ్మినట్టు సువాసనల పూల వర్షం పడింది.

శ్రీ మహావిష్ణువు ఎనిమిదో అంశ పుష్యమీ నక్షత్రాన మగశిశువుకి జన్మనిచ్చింది కైకేయీదేవి. అతనే భరతుడు. సత్య పరాక్రమవంతుడైన బుద్ధిశాలి.

ఆశ్లేషా నక్షత్రాన కర్కాటక లగ్నం సూర్యభగవానుడు అయోధ్యాపురి నడి మధ్యలో నుండగా సుమిత్రాదేవి ఇద్దరు మగశిశువులకి జన్మనిచ్చింది.





పెద్దవాడు లక్ష్మణుడు, చిన్నవాడు శత్రుఘ్నుడు విష్ణు అంశలో పుట్టిన వీరాధివీరులు, సర్వశాస్త్ర నీతి కోవిదులు.

దశరథ మహారాజు నలుగురు పుత్రులు అమితమైన కాంతి నక్షత్రాలు. పూర్వాభాద్రా, ఉత్తరాభాద్రల వలే రెండేసి జంటలుగా మెరిసి పోతున్నారు.

అయోధ్య వైకుంఠమైంది. ఆనంద కేరింతలతో పౌరులు సంబరాలు జరుపుకుంటున్నారు.

రాజప్రసాదంలో ధనమూ, గోవులూ, భూములూ దానాలిస్తున్నారు.

పదకొండవ రోజున పుత్రులకి నామకరణ మహోత్సవం జరిపించాడు దశరథుడు.

వశిష్ఠుడు పెద్దవాడికి... కౌసల్యా కుమారునకు రాముడనీ, కైక కుమారుడికి భరతుడనీ, సుమిత్రాదేవి పుత్రులకు లక్ష్మణ, శత్రుఘ్నులనీ నామకరణం చేశాడు. అదే రోజు జాత కర్మలూ జరిపించాడు దశరథుడు.

బ్రాహ్మణులకూ, పౌరులకూ మృష్టాన్నదానము చేశాడు.

పెద్దవాడు రాముడు బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతున్నాడు. అందరికీ ఇష్టుడైనాడు. దశరథుడికి పంచ ప్రాణాలు రాముడే అయ్యాడు. సుమిత్రా పుత్రుడు లక్ష్మణుడు, తను పుట్టింది మొదలు రాముడితోనే చెలిమి చేయసాగాడు. రాముడికి బహిఃప్రాణం అయినాడు.

రాముడిని విడిచి లక్ష్మణుడు ఒక్క క్షణమూ గడిపేవాడు కాడు. తనకన్నా రాముడంటేనే ప్రీతి లక్ష్మణునకు. భరతుడు కూడా ఎప్పుడూ తన వెన్నంటి ఉన్న శత్రుఘ్నుడితో గడిపేవాడు.

ఆ నలుగురు అన్నదమ్ములు వేదాధ్యయనము చేసారు. పురాణాదులు ఆకళింపు చేసుకున్నారు. ధనుర్వేదము అవపోసన పట్టారు. శూరులు, లోకహితాచరణ పరాయణులు. లోకం మేలుకోరే గుణ సంపన్నులు.

పెద్దవాడు రాముడు అందరిలోకి తేజశీలి. రథాలను పరిగెత్తించడంతో పాటు గుర్రపు స్వారీలతో వీరవిహారం చేసేవాడు.

రాముడికి అన్నింటికంటే ఇష్టం తండ్రి దశరథుడు. అతనికి శుశ్రూష చెయ్యటం అన్నింటికంటే ఇష్టం.

తండ్రి ఎంత మెచ్చుకున్నా, దిక్పాలకుల వంటి ఆ నలుగురు విర్రవీగలేదు. అంతటి సుగుణ సంపన్నులను చూసి దశరథుడు సంతసించని సమయమే లేదు.

# విశ్వామిత్రుడి ఆగమనం

విశ్వామిత్ర మహర్షి అయోధ్య కొచ్చాడని తెలియటంతో దశరథుడు బ్రహ్మదేవుడిని దర్శించే దేవేంద్రుడివలే ఆగమేఘాల మీద విశ్వామిత్రుడి చెంత చేరాడు. శాస్త్రయుక్తంగా పాద్యమూ, అర్ఘ్యమూ ఇచ్చి మహర్షికి నమస్కరించాడు.

తపఃశ్శాలి విశ్వామిత్రుడు అగ్నిహోత్రుడిలా వెలిగిపోతూ ప్రకాశిస్తున్నాడు. దశరథుడు సర్వహిత కుశల ప్రశ్నలు అడిగాడు.

"కుమారుల వివాహం విషయంలో తర్జన భర్జనలు పడుతున్న సమయాన తమ దర్శన భాగ్యం దొరికింది. నా భాగ్యం పండింది. బ్రహ్మఋషి తమరు. అన్నీ విధాలా పూజ్యులు. శెలవివ్వండి. నేను చెయ్యగల కార్యం ఏదైనా ఉంటే శిరసావహిస్తాను. సంకోచించక అనుగ్రహించండి"

ఆతృత భక్తి పూర్వక వినయంతో చెప్పిన ధశరథుడితో విశ్వామిత్రుడు తన మనస్సులోని మాట వెలిబుచ్చాడు. "రాజా... అన్న మాట తప్పని సత్యసంధుడివి. నీవు ఆడి తప్పవు. నా పని నేరవేర్చి సత్యసంధవు అనే పేరు చరితార్థం చేసుకో"

ధర్మార్ధ సహితమైన ముని ఆజ్ఞ కోసం దశరథుడు సిద్ధమన్నాడు.

# యజ్ఞ సంరక్షణ

"ఓ దశరథ మహారాజా! అతి గొప్పవంశంలో పుట్టిన నీవు మాత్రమే అలా మాట్లాడగలవు. మంచిగా ఆలోచించి, మంచిగా ప్రవర్తించి, మంచిగా చేసేవాడి కంటే మంచిగా పలికేవాడే సర్వజన యోగ్యుడని నిరూపించావు."

ఇక్ష్వాకువంశ రాజు దశరథుడు మునివర్యులకు నమస్కరించాడు.

"చెయ్యగల కార్యం వుంటే చేస్తానన్నావ్! ఆడి తప్పని వంశంలో పుట్టావ్. అందుకే నీ వద్దకు వచ్చాను. సిద్ధి కోసం దీక్ష పూనాను. దాన్ని భగ్నం చేసేందుకు మారీచుడూ, సుబాహుడూ అనే ఇద్దరు రాక్షసులు సర్వప్రయత్నాలు చేస్తున్నారు. వారు కామరూపులు, అస్త్ర విద్యల్లో ఆరితేరినవారు. మాంసపు ముద్దలనూ, రక్తంనూ, వ్యర్థపదార్థాలనూ యజ్ఞవాటికపై కుమ్మరిస్తున్నారు. యజ్ఞ దీక్షలో వున్న నేను శపించకూడదు.

వ్రతం సాగటం లేదు. నా ప్రయత్నం వృధా కాకూడదు. అందులకే... శ్రీరాముడు.... నీ పెద్ద కుమారుడు రాముణ్ణి వెంట తీసుకు వెళతాను. రఘు





వంశంలో పుట్టిన రాముడు మాత్రమే వాళ్ళని సంహరించగలడు. నా తపోబలం రాముడ్ని కనిపెడుతూనే వుంటుంది. శ్రీరాముని పరాక్రమానికి వాళ్ళు ఒక్కఘడియ కూడా నిలువలేరు. పాపాత్ములు నశించక తప్పదు.

విశ్వామిత్రుని కోరికకు దశరథుడు నిర్ఘాంతపోయాడు.

"రాజా సందేహించవలదు. శ్రీరాముడి వల్ల పధ్నాలుగు భువన భాండాల్లో నీ కీర్తి వ్యాపిస్తుంది.

"వశిష్ఠ మహర్షి, మంత్రి సత్తములతో సంప్రదించి యావన్మందీ ఒప్పుకుంటేనే సరే అను...

"రాముడు జుట్టూ, జులపాలతో వున్న పిల్లవాడని భావించవద్దు. మహాత్ముడు, సత్య పరాక్రమవంతుడు, మహాతేజశ్శాలి. నీ రాముడిని నాతో పంపు...అంతా శుభమే కలుగుతుంది దశరథ మహారాజా"

ధర్మసహితమైన విశ్వామిత్రుడి సరళ సుందర వచన కోరిక దశరథుడిలో భయం కలిగింది. ఒక్కసారిగా దిగులు ఆవహించింది. మొహంలో దీన కళ ప్రవేశించింది. వికలమైన మనస్సుతో సింహాసనంలో కూర్చున్నాడు. దశరథుడి శరీరం మొత్తం వణుకుతోంది.

# శ్రీరాముడా!

ఎంతోసేపటికి గాని తేరుకోలేదు దశరథుడు. కొంతసేపటికి తెప్పరిల్లి విశ్వామిత్ర మహర్షికి చేతులు జోడించి చెప్పాడు.

"రాముడు ముక్కుపచ్చలారని పసివాడు. ఇంకా పదహారు కూడా రాలేదు. పసికూన. యుద్ధవిద్యలేల తెలుస్తాయి. అక్షౌహిణీ సైన్యము వుంది. అందరూ శూరులు, పరాక్రమవంతులు. నేనే విల్లు ధరించి వస్తాను. దేవాసుర యుద్ధంలో దేవతల పక్షాన పోరాడినట్టు రాక్షసులను హతం చేస్తాను. మీ యజ్ఞం నిరాటకంగా సాగేవరకూ వుంటాను. నాకు అనుజ్ఞ ఇప్పించండి. తక్షణం బైలుదేరుతాను.

"మహర్షీ... రాక్షసులు కపట యుద్ధంలో ఆరితేరిన వారు. రాముడికేం తెలుసు. అస్త్రబల సంపన్నుడు కాడు. యుద్ధ కుశలుడూ కాడు. అందులకే నా చతురంగ బలాలతో వస్తాను. ఇంతకు ఎవరా రాక్షసులు. ఎవరి పుత్రులు, వారి పరాక్రమం ఏ పాటిది?"

"రాజా! పౌలస్త్య వంశంలో రావణుడనే రాక్షసుడున్నాడు. బ్రహ్మ వరాల గర్వంతో అచ్చోసిన ఆంబోతు వలే లోకాలపైబడుతున్నాడు. కంటికి నచ్చిన

పడతిని వదలి పెట్టడు. కుబేరునకు సోదరుడు. విశ్రవసు మహర్షి పుత్రుడు. దశరథా! నీవు వినే వుంటావు. రావణుడు రాక్షసులకు రాజు. అన్ని యజ్ఞాలు తానే స్వయంగా భగ్నం చెయ్యలేక ఇలాంటి రాక్షసులను పంపుతుంటాడు"

"లంకాధిపతి రావణుడా!?" దశరథుడు అదిరి పడ్డాడు.

"మహర్షీ.. రావణాసురుడు దుర్మార్గుల్లో కెల్లా దుర్మార్గుడు. అతనితో యుద్ధం నేనే చెయ్యలేను. ఇక నా బిడ్డెంత? పసివాడు. ఇప్పుడిప్పుడే పటిక బెల్లము తీపి వలే పలుకుతున్నాడు. ఆ బిడ్డడు ఏం చెయ్యగలడు. దయతో మమ్మల్ని అనుగ్రహించు. నేను పంపలేను. అన్ని విధాలా అశక్తుడని. సుందోపసుందుల కుమారుళ్ళు ఆ మారీచ సుబాహులు. నా సైన్యమంతా కలిసినా వారిలో ఒక్కరితో అయినా పోరాడగలమో లేమో.... మహర్షీ. అట్టి వారితో... నా బిడ్డ... నా ఇంటి, కంటి వెలుగు... పంపలేను... మన్నించు."

విశ్వామిత్రుడి కోపం తారస్థాయికి లేచింది.

"దశరథా... యజ్ఞ కాలం అతిక్రమిస్తోంది. నీవు సత్య వాక్య ధర్మాన్ని అతిక్రమిస్తున్నావ్. నీ పూర్వికుల గౌరవాన్ని నేల రాల్చేలా మాట్లాడుతున్నావు."

భగభగమండుతున్న యజ్ఞ వాటికలో నెయ్యి కుమ్మరించినట్టు పగిలిన అగ్ని పర్వతమే అయ్యాడు విశ్వామిత్రుడు.

## వశిష్ఠ మహర్షి హితబోధ

విశ్వామిత్రుడు కమండలం పైకెత్తి నిప్పులు కక్కేలా చూస్తూ చెప్పాడు.

"చెయ్యగలిగిన కార్యం ఉంటే చేస్తానన్నావ్... ఆడి మాట తప్పుతావా? పుత్రప్రేమతో సత్యవాక్య దీక్షనే భగ్నం చేస్తావా? రఘువంశంలో పుట్టిన నీకు సమ్మతం కాదు... అసత్య దోషంతో బంధుమిత్ర సపరివార సమేతంగా సుఖంగా వుండు"

విశ్వామిత్రుడి మాటలు దశరథునికి కొండపెరియలు నేలని తాకి ముక్కలైనట్టుగా వున్నాయి. మంత్రి హితువులందరూ గడగడ వణికిపోయారు. దేవతలు భయకంపితులైయ్యారు. జగత్తు కంపించటంతో పరమ పూజ్యుడైన వశిష్ఠ మహర్షి లేచి దశరథుని చెంత చేరి -

"దశరథ మహారాజా.... నీవు ధర్మాత్ముడవు. ఇక్ష్వాకు వంశంలో పుట్టిన నీవు ఆడినమాట తప్పకూడదు. శ్రీమంతుడిగా, ధర్మనీతిపరుడిగా, ధీరోదాత్తునిగా నీకు ముల్లోకాలలోనూ పేరు వుంది. అన్నమాట నిలబెట్టు





కోకపోతే నీవు చేసిన అశ్వమేధాది సమస్త యజ్ఞాలూ, పుణ్యకార్యాలూ నిర్వీర్యమై పోతాయి. కాలం ముసుగులో కప్పివేయబడతాయి. పుత్రప్రేమతో వంశానికి అప్రతిష్ఠ తీసుకురాకు. నా మాట విను... శ్రీరాముని విశ్వామిత్ర మహర్షితో పంపు...

"మహారాజా సందేహించకు... రామునికి దివ్యాస్త్రాలు లేకపోతేనేమి... విశ్వామిత్రుడు వెంట వున్నాడు. అతని గురించి తెలియనిది కాదు. సమస్త అస్త్రాలన్నీ అతనికి తెలుసు.... ఈ జగత్తులోనే అన్ని శస్త్రాస్త్రములను తెలిసిన వాడు విశ్వామిత్రుడు.

"రాక్షసులూ, గంధర్వులూ, యక్షులూ, కిన్నెరలూ, నాగులూ ఎవరు...ఎవరికీ తెలియని శస్త్రాస్త్ర బలసంపన్నుడు విశ్వామిత్రుడు.

"భృశాశ్వుడి పుత్రుల రూపాన అవతరించిన శస్త్రాస్త్రాలను అన్నీ విశ్వామిత్రుడు రాజ్యపాలన చేస్తున్నప్పుడు శివదేవుడు ఈయనకే ఇచ్చాడు.

"దక్షప్రజాపతి ఇద్దరు కూతుళ్ళు జయ, సుప్రభ. వారే భృశాశ్వుడి భార్యలు. వారు నూరుగురు పుత్రులను కన్నారు.

"జయకు జయులు అనే యాభైమంది కుమారులు, సుప్రభకు సంహారకులూ అనే మరో యాభైమంది పుత్రులు కలిగారు. వారంతా కామ రూపులు, అస్త్ర రూపులు. అవన్నీ విశ్వామిత్రుడు వశం చేసుకున్నాడు. అవే కాదు. కాలగమనాన ఎన్నో దివ్యాస్త్రాలను ఆయన ఎరుగుదుడు.

"ఈ సమస్త జగములోని రాక్షస జాతిని మొత్తం ఆయన వంటి చేత్తో సంహరించగలడు.

"రాముని మేలు కొరకే... నీ మీద ప్రీతి కొరకే నిన్ను అడిగాడు... యాచించాడు.... అర్థించాడు...."

సావధానంగా వశిష్ఠ మహర్షి చెప్పింది విని దశరథుడు శాంతించాడు. కుదుట పడ్డాడు. సంపూర్ణ ఇష్టంతో, బుద్ధిపూర్వకంగా రాముడ్ని విశ్వామిత్రుడితో పంపటానికి దశరథుడు సమ్మతించాడు.

## రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట పయనము

వశిష్ఠుడి ప్రియ వచనాలతో సంతృప్తుడైన దశరథుడు రాముడ్ని పిలిపించాడు. కౌసల్యా, దశరథులు రాముడ్ని ముద్దాడారు. మంగళా చరణం

చేశారు. లక్ష్మణుడు అన్న పక్కనే వచ్చి నిల్చున్నాడు. తాను అన్నతోనేనన్నాడు. దశరథుడూ, ఆయన భార్యలూ, రామలక్ష్మణులను ఆశీర్వదించారు. వశిష్ఠుడు మంగళకరమైన మంత్రాలతో ఆశీర్వదించాడు. దశరథుడు రామలక్ష్మణులను విశ్వామిత్ర మహర్షికి అప్పచెప్పాడు.

ఆ శుభ సమయాన పంచభూతాలు పరవశించాయి. దేవతలు దుందుభులు మ్రోగించారు. పూల వర్షం కురిపించారు. శంఖాలూ, భేరీలూ రాజభవనంలో మారుమ్రోగాయి.

విశ్వామిత్రుడు ముందుకు నడిచాడు. అతని వెంట రామలక్ష్మణులు ధనుస్సులతో అనుసరించారు.

ఆ సుందరాకారులు మణికట్టుకూ, వేళ్ళకూ కవచాలు ధరించారు. నడుమునకు కత్తులు ధరించారు. అందంగా అలంకరించుకున్నారు. ముందు విశ్వామిత్రుడు, వెనక రామలక్ష్మణులు.

శివుడి వెంట వెళుతున్న అగ్నిహోత్రోద్భవులు అయిన స్కంద విశాఖుల వలే వున్నారు. బ్రహ్మ వెంట వెళుతున్న అశ్వనీదేవతల్లా వున్నారు.

రామలక్ష్మణులు రెండేసి అంబులపొదులతో విశ్వామిత్రుడి వెంట వెడలుతుంటే మూడు తలల పాము పడగలు విప్పి కదులుతున్నట్టుగా వుంది.

## బల అతిబల విద్యలు

ఒకటిన్నర యోజనాలు వెళ్ళాక సరయూ నది దక్షిణ తీరం వచ్చింది. నదీ తీరం మీంచి చల్లటి పిల్ల తెమ్మెరలు వారిని తాకుతున్నాయి.

"రామా... ఈ పుణ్య నదిలో ఆచమనం చేసుకో..... సమస్త మంత్రాల మూలాధారాలు, సర్వమంత్ర స్వరూపాలైన బల, అతిబల విద్యలు నీకు ఉపదేశము చేస్తాను. వాటివల్ల నీకు అలసట వుండదు. ఆకలి, దప్పికలు వుండవు. నీవే పరిస్థితుల్లో వున్నా, ఆదమరచినా, రాక్షసులు ఎదిరించలేరు.

సామర్థ్యంలో, బుద్ధి కుశలతలో, కార్యా కార్య నిశ్చయంలో, వాద ప్రతివాదంలో నీతో సరి అయిన వాడు లేడు, వుండడు. ఇది తథ్యం... సత్యం... సమస్త భూమండలంలో నిన్ను మించిన శూరుడూ, వీరుడూ వుండడు.

"ఓ రామా ఈ బల - అతిబల విద్యలు సమస్త జ్ఞానానికీ తల్లుల వంటివి. ఈ రెండు మంత్రాలను బ్రహ్మదేవుడు సృష్టించినాడు. మానవుల్లో ఉత్తముడివి. నీవు తప్ప మరెవ్వరూ దాన్ని గ్రహించుటకు అర్హులు కారు.





"నా తపో బలంతో సంపాదించిన ఈ మంత్రాలను చక్కగా జపము చేయవలెను. నీలో సుగుణ గుణాలను మరింత ప్రభావితం చేస్తాయి."

రాముడు గురు నమస్కారం చేసి సరయూ నదిలో స్నానమాడి ఆచమనం చేసి వచ్చాడు.

విశ్వామిత్రుడు బల - అతిబల మంత్రాలను ఉపదేశం చేశాడు. రాముడు పరిగ్రహించాడు.

అప్పుడు రాముడు శరత్కాలంలో భానుడి వలే సహస్ర కిరణాలతో ధగధగ లాడుతూ కనిపించాడు.

రామలక్ష్మణులు ఆ రాత్రి సరయూ నదీ తీరాన గడ్డి పక్కలు పరుచుకొని పడుకొన్నారు. విశ్వామిత్రుడు పురాణ గాథలను చెబుతుంటే అన్నదమ్ములిద్దరూ వింటూ కమ్మగా నిద్రించారు.

## కౌసల్యా సుప్రజా రామా

తెల్లతెల్లవారబోతోంది. గడ్డి పరకలు పాన్పుగా చేసుకొని నిద్రిస్తున్న రామలక్ష్మణులను విశ్వామిత్రుడు మేల్కొలుపుతున్నాడు.

"కౌసల్యాదేవి సంతానమైన ఓ శ్రీరామా! తూర్పున ఉదయభానుడు వేంచేస్తున్నాడు. నిత్య కర్మానుష్ఠానానికి వేళ అవుతోంది. దేవపూజ చేయవలెను. ఓ పురుషోత్తమా మేల్కొనుము.

"ఓ రామా... మేల్కొని ముల్లోకములకు శుభములనీయుము".

విశ్వామిత్ర మహర్షి ప్రియవాక్యాలతో రామలక్ష్మణులు నిద్ర లేచారు. స్నానాది కార్యక్రమములను పూర్తిగావించారు. గాయత్రీ మంత్రం జపించారు. అర్ఘ్యం విడిచారు. ప్రయాణానికి సంసిద్ధులై విశ్వామిత్ర మహర్షికి నమస్కరించారు.

ముగ్గురూ కదిలారు. సరయూనది గంగానదిలో సంగమించే ప్రదేశానికి చేరారు. ఆ పవిత్ర సంగమ ప్రదేశానికి అంజలి ఘటించారు.

ఆ ప్రాంతంలోనే ఆశ్రమము కనిపించింది. అతి పురాతనమైనదిగా ఉన్నది. రామలక్ష్మణులు విశ్వామిత్రుడి వంక చూశారు.

విశ్వామిత్రుడు చిరునవ్వుతో రామలక్ష్మణులకు చెప్పాడు.

మహాశివుడు పార్వతీదేవిని వివాహం ఆడక ముందు తన ప్రమథ గణాలతో ఈ ప్రదేశానికి వచ్చాడు. ఏకధృడ నియమంతో స్థాణు రూపాన

శివదేవుడు తపస్సు చేయసాగాడు. కందర్పుడు(మన్మథుడు) శరీరంలో వుండేవాడు. అతడే కాముకుడు. శివ తపస్సు ప్రాంతానికి వచ్చాడు.

తపస్సు చేస్తున్న శివుడ్ని భంగపరచినా శివదేవుడు సహించాడు. అయినా పట్టు వీడకుండా మన్మథుడు వేధించాడు. దృఢ తపస్సు నియమం చెదిరి శివుడు వీర రౌద్రరూపుడయ్యాడు. హుంకరించాడు. తన మూడో నేత్రంతో భస్మీపటలం చేశాడు.

మన్మథుడి శరీరం క్షణంలో మండి బూడిదగా మారింది. అన్ని అంగాలనూ మన్మథుడు కోల్పోయ్యాడు గాన ఆ ప్రదేశము అంగదేశమయ్యింది. ఇక్కడున్న మునులు మహా శివుడి శిష్యులు. పరమ ధార్మికులు, పాపరహితులు, పుణ్యవంతులు.

"ఓ రామా... స్నానాదికాలు పూర్తి చేసుకొని పరిశుభ్రంగా ఆశ్రమంలో ప్రవేశిద్దాం.... రేపు ఉదయం గంగానదిని దాటుదాము."

ఇలా రామలక్ష్మణ విశ్వామిత్రులు మాట్లాడుతుండగా ఆశ్రమంలోని వాసులు దివ్యదృష్టితో గ్రహించారు. పులకింతులయ్యారు. సాదరంగా ఎదురెళ్ళారు.

సమస్త సపర్యలు చేశారు. విశ్వామిత్ర మహర్షికి పాద్యాదులు, అర్ఘ్యం ఇచ్చారు. రామలక్ష్మణులకు అతిథి సత్కారాలు అందించారు. కందమూల ఫలాలనూ, పండ్లనూ ఇచ్చారు.

ఆ రాత్రి విశ్వామిత్రుడు అందరికీ పుణ్యగాథలూ, మనోహరమైన కథలూ చెప్పాడు.

## తొలి శ్రీరామ బాణ ప్రయోగానికి శ్రీకారం

తెల్లగా తెల్లవారింది. రామలక్ష్మణులు ప్రాతకాహ్నికాలను ముగించి మహర్షి విశ్వామిత్రుని వెంట బయలుదేరారు. పవిత్రంగా నది ఒడ్డుకు చేరారు.

మహామహితాత్ములైన శివాశ్రమ మునిపుంగవులు, వారి కోసం చక్కటి నావను సిద్ధంగా ఉంచారు.

"స్వామీ తమరూ, రాజకుమారులూ సుఖంగా ఈనావపై ప్రయాణించ వలసినదిగా కోరుతున్నాము. పొద్దు ఎక్కిపోతూ వుంది. ఆలస్యం చేయకండి"

విశ్వామిత్రుడు అందరినీ సాదర వాత్సల్యంతో చూశాడు.

నావకదిలిపోతూ వుంది. గంగానది పులకిస్తూ ప్రవహిస్తోంది.





సరిగ్గా వారి నావ గంగానది మధ్యలోకి రాగానే విచిత్ర చిత్రమైన ధ్వని వచ్చింది. ప్రశ్నార్థకంగా శ్రీరాముడు మహర్షి వంక చూసి "ఏమిటీ విపరీత ధ్వని?" అడిగాడు.

"శ్రీరామా! మహాప్రశాంతమైన ఈ గంగానదిలో సరయూనది వచ్చి కలుస్తుంది. చెవులు బద్దలయ్యే ధ్వని వచ్చే శబ్దమూ, అలలూ ఆ సంగమం వల్లే..." దాని గురించి వివరించాడు విశ్వామిత్రుడు.

"శ్రీరామా! పూర్వము బ్రహ్మదేవుడు తన మనోసంకల్పంచే కైలాసనాథుని పర్వతంపై ఓ సరస్సు ఉండవలెనని తలచాడు. నిర్మించాడు. ఓ సరస్సు వెలిసింది. అదే మానస సరోవరము. బ్రహ్మదేవుడు నిర్మించిన ఆ మానస సరోవరము నుంచి ప్రవహించే ప్రవాహమే సరయూనది.

"ఆ సరయూనదే అనంత వేగంతో కొన్ని యోజనాల దూరం ప్రవహించి అయోధ్యానగరాన్ని ఆసాంతము స్పృశించి ఈ గంగానదిలో లీనమవుతుంది. అంతటి పవిత్రమైన ప్రదేశంలో వున్నాము. అత్యంత భక్తి శ్రద్ధలతో ఈ పుణ్యనదికి ప్రణామం చేయండి."

అతిధార్మికులైన శ్రీరామ లక్ష్మణులు భక్తి ప్రపత్తులతో సరయూ నది సంగమ స్థానమైన గంగానదికి నమస్కరించారు.

అలా వారు గంగానదిని దాటి దక్షిణం వైపు ప్రయాణించి భయంకర కీకారణ్యంలోకి ప్రవేశించారు.

అంతయు పరికించి విశ్వామిత్రుడిని అడిగాడు శ్రీరాముడు.

"మనుష్య సంచారమే లేని ప్రదేశంలా వుంది. భయంకర ధ్వనులతో ఈల పురుగులు, పాములు, పుట్టలు... ఏదో భయంకర విపత్తు జరిగినట్టు పులులూ, సింహాలూ అరుస్తున్నాయి.

"ఎన్నో పక్షులు కూస్తూ వున్నాయి. ఏ ప్రక్క చూసినా చండ్రా, నల్లమద్దీ, ఏరుమద్దీ, మారేడూ, తుమ్మకీ, కలిగొట్టూ, రేగు పొదలు కిక్కిరిసి పోయి కకావికలంగా పెనవేసుకుపోయి వున్నాయి. దారి తెలియటం లేదు. ఈ ఘోరారణ్యం ఎవరిది స్వామి?"

"శ్రీరామా! ఒకప్పుడు ఈ ప్రదేశంలో సస్యశ్యామలమైన రెండు దేశాలు వుండేవి. అవే మలద, కరూశాలు. భూలోక స్వర్గాలు. దేవతలు సైతం నివసించటానికి ఇష్టపడే నగరాలు. ధన, ధాన్యలతో నిత్యం తూగిసలాడేవి.

“పూర్వము దేవేంద్రుడు వృత్రాసురుడనే సాధుపీడిత రాక్షసుడిని సంహరించాడు.

“దానితో బ్రహ్మహత్యా పాతకం దేవేంద్రుడ్ని ఆవహించింది. పగవాడికి కూడా రాకూడని ఆ మహా పాతకం వల్లే భయంకర ఆకలితో అలమటించాడు. దానితో పాటు అశుచి అయినాడు.

“దేవేంద్రుడి వ్యధ చూసి తాళలేక మహర్షులూ, దేవతలూ గంగానది వద్దకు తెచ్చి అందరూ కడవలతో గంగాజలాలను తీసుకొచ్చి మంత్రోచ్చాటనలతో ఆ జలాలను దేవేంద్రుడిపై కుమ్మరించారు.

“దానితో దేవేంద్రునకు బ్రహ్మహత్యాపాతకం వీడిపోయింది. దివ్య తేజస్సుతో తిరిగి ప్రకాశింపసాగాడు.

“బ్రహ్మహత్యాపాతకము ప్రక్షాళనము అయి మలము, ఆకలి తొలిగి పోవటంతో మలము పోయింది కనుక ‘మలదము’ అని కారూశము పోయినది కనుక ‘కరూశము’ అనే రెండు దేశాలు ఏర్పడి లోకము నందు ఖ్యాతిని పొందగలవని తలచాడు.

“అలా ఏర్పడిన ఆ రెండు దేశాలు నిత్య కళ్యాణం, పచ్చతోరణంగా విలసిల్లినాయి. ఆ రాజ్య పౌరులు, దేవేంద్ర లోకంలో వున్నట్టు మురిసి పోయేవారు. అలా ఎంతో కాలం నిరాటంకంగా నిత్య వృద్ధి చెందుతూ వుండేవి.

“కొంతకాలానికి తాటకి అనే యక్షస్త్రీ పుట్టింది. అది కామరూపిణి అయిన యక్షిణి. దానికి వేయి గజరాజుల బలము పుట్టుకతోనే వచ్చింది. ఆ తాటకి సుందుడి భార్య.... అతని వల్ల మారీచుడ్ని కన్నది. వాడు పరాక్రమంలో దేవేంద్రుడంతటి వాడు. వాడు తల్లి బాటలోనే నడుస్తూ పౌరులనూ, ఋషులనూ బాధిస్తూ హింసిస్తూ వేడుకతో గడుపుతున్నాడు.

“చిన్న కొండలా వుంటాడు. వికృతంగా వుంటాడు. అంతకు మించి మరింత వికృతమైన పనులు చేస్తాడు.

“ఈ రెండు దేశాలను ఇంతటి దుస్థితికి తెచ్చిన ఆ దుష్ట చారిణి తాటకిని వధించు. ఇక్కడికి ఒకటిన్నర యోజనాల దూరంలో వుంటుంది. ఈ ప్రాంతానికి వచ్చిన ఏ ఒక్కరినీ వదిలిపెట్టదు. ఆకలిలేక పోయినా చంపి సగం తిని పడేస్తుంది. ఆ రెండు దేశాలను తిరిగి నిష్కంటకం చెయ్యి. ఈ కీకారణ్యాన్ని తిరిగి జనారణ్యంలా మార్చాలంటే తాటక వధ తప్పదు. ఈ





నాటితో లోకమునకు తాటకి పీడ పోవలెను. ఇది నా ఆజ్ఞ..... శ్రీరామా.... బాణాన్ని సంధించవలసిన తరుణం ఆసన్నమైంది. సిద్ధంగా ఉండు.”

## శ్రీరామ సంశయం

“తాటకి అబల... పైగా యక్షులు అల్పబలం కలవారు. అలాంటి ఆడదానికి వెయ్యి ఏనుగుల బలం ఎలా వచ్చింది?” శ్రీరాముడు అడిగాడు.

“అదంతా వరప్రభావము. సుకేతుడనే యక్షుడు ఉండేవాడు. చక్కటి ఆచారవంతుడు, వీర్యవంతుడు. సంతానం లేదు. అందుకు సుకేతుడు బ్రహ్మదేవుడ్ని గురించి ఘోరతపం ఆచరించాడు. బ్రహ్మ సుకేతుని తపస్సుకి మెచ్చి వెయ్యి ఏనుగుల బలంతో కన్యారత్నము పుట్టే వరం ప్రసాదించాడు.

“ఆ వరప్రసాదంతో జన్మించింది తాటకి.... మంచి అందగత్తె... అబల, ఆడదైనప్పటికీ వెయ్యి ఏనుగుల బలగర్వం ఆవహించింది.

“సుకేతుడు తాటకిని సుందుడు అనే అతనికిచ్చి పెళ్ళి చేశాడు. కొంతకాలానికి తాటకి మారీచుడిని కన్నది. వాడు అతి బలశాలి. సుందుడు చేసే ఆకృత్యాలకి అగస్త్యుడు ఆగ్రహించి శాపంతో చంపేశాడు. దానితో అగ్గిమీద గుగ్గిలంలా తాటకి మండిపడింది. కొడుకుని తీసుకొని వీరావేశంతో అగస్త్యుడి మీదకి వెళ్ళింది. పగతో రగిలిపోయింది. ఉగ్రసింహుడయ్యాడు అగస్త్యుడు.

“మారీచుడుని రాక్షసుడైపోమని శపించాడు. తాటకీ నీ అందాల సుందర రూపం పోయి వికృతంగా మారి ఘోరాతిఘోరమైన వికృతా కారములో నరమాంస భక్షణ చేస్తూ రాక్షసివైపో” అని శపించాడు.

“ఆ శాపముతో తాటకి మరింత ఉగ్రురాలైయింది. అగస్త్యుడి తపఃశక్తి ముందు వెనక్కి తగ్గక తప్పలేదు. ఆ దుష్టురాలు కడు ఆక్రోషంతో, అగస్త్యుడు తిరిగిన ఈ ప్రదేశాన్ని నాశనం చేయ సంకల్పించింది. మహా భయంకరురాలిగా మారి మనిషన్నది కనపడకుండా చేసింది.

“పరమ ఆకృత్యాలకి పాల్పడి ఆ రెండు దేశాలను ఇలా చేసింది. శ్రీరామా! గోబ్రాహ్మణ హితము కోసం సంహరించక తప్పదు.

“ముల్లోకాలలోనూ తాటకిని చంపగలవాడివి నీవు మాత్రమే. సందేహించ వద్దు. స్త్రీ అని ఆలోచించవద్దు.

“తొలి బాణం ప్రయోగించేది స్త్రీ మీద కాదు... దుష్టురాలి మీద. లోకకంటకిపై. స్త్రీ వధ అసహ్యం కాదు. లోక సంరక్షణ, ప్రజారక్షణే రాజు

యొక్క ముఖ్య రాజధర్మము. ధర్మాన్ని పాటించి రాచధర్మాన్ని నిర్వర్తించు. ఇది సనాతన ధర్మము.

"ఆ తాటకి ధర్మమార్గం తప్పింది. అధర్మమార్గంలో విచ్చలవిడిగా సంచరిస్తోంది. అధర్మాన్ని ఆచరించిన వారికి అల్పాయుష్షే.

"పూర్వము విరోచనుడి కూతురు మంధర ఈ భూమండలాన్ని సర్వనాశనం చేయ సంకల్పించి భూదేవిని చంప ప్రయత్నించగా దేవేంద్రుడే స్వయంగా సంహరించాడు.

"మహామహర్షి భృగుమహర్షి సతి శుక్రుడి తల్లి ఇంద్రుడిని లేకుండా చేయాలని దృఢవ్రత అయింది. అందుకు వైకుంఠవాసుడు శ్రీమహావిష్ణువు ఆమెని సంహారము చేశాడు. ఇంకా ఎంతోమంది గాడి తప్పిన స్త్రీలను మహాత్ములూ, లోకసంరక్షకులూ అయిన మగవారు హతమార్చి లోకమున ధర్మాన్ని నిలబెట్టి లోక కళ్యాణం చేశారు."

## తాటక వధ

ఆ విధంగా విశ్వామిత్రుడి పలుకులు విన్న శ్రీరాముడు చేతులు జోడించాడు. తన తండ్రి ఆజ్ఞను గుర్తుకు తెచ్చుకున్నాడు. వశిష్ఠులూ, గురువులూ చెప్పినవి తలచాడు.

బ్రహ్మవాది అయిన విశ్వామిత్రుడికి నమస్కరించి చెప్పాడు దశరథ పుత్రుడు శ్రీరాముడు.

"గోబ్రాహ్మణ, పండిత, పామరుల సుఖం కోసం మీ ఆజ్ఞని అక్షరాలా అమలు చేయటానికి రాముడు సిద్ధంగా వున్నాడు" చెప్పాడు శ్రీరాముడు.

మహానుభావుడు, మహా ప్రభావము గల విశ్వామిత్రుడు సంతసంగా చూశాడు.

శ్రీరాముడు వింటి నడుమును పిడికిలితో పట్టుకున్నాడు. ధనుష్టంకారం చేశాడు. నాలుగు దిక్కులూ మారుమ్రోగాయి. ప్రతిధ్వనించాయి. అడవి అంతా కకావికలమైంది. జీవరాసులన్నీ ఉలిక్కిపడ్డాయి. దిక్కు తెలియకుండా పరుగులు తీశాయి. తాటక వనము తల్లడిల్లిపోయింది.

ధనుష్టంకారానికి తాటకి తుళ్ళిపడింది. క్రోధంగా గట్టిగా ఘీంకారము చేసింది. క్రోధంతో మరింత వికారంగా మారింది. నరవాసనతో ముక్కు పుటలు ఎగిరెగిరిపడ్డాయి. గుహలోంచి వచ్చిన సింహంలా తీవిగా బైటికొచ్చింది.





ఆ మహాధ్వని వచ్చిన వైపు పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ వెళ్ళింది.

వికార వికృత శరీరంతో అడుగులేసుకుంటూ వస్తున్న తాటకిని తమ్ముడికి చూపిస్తూ "చూశావా లక్ష్మణా ఎంతటి క్రూర వికృతంతో ఎగిసిపడుతోందో. సామాన్యులు చూసినంతనే గుండె ఆగి మరణిస్తారు. దీనిని ఎవరు ఎదిరింప సాహసిస్తారు.

"మాయాబలం గల ఈమె ముక్కూ, చెవులూ కోసేస్తాను. కాళ్ళూ చేతులూ విరగకొడితే చాలు. ఆడది... అంతకు మించి చేయ సంకల్పం రావటం లేదు" అని అంటుండగానే తాటకి రాముడి మీదకి దూకబోయింది.

అప్పుడు విశ్వామిత్రుడు హుమ్మంటూ తాటకిని అదిలించాడు. అన్నదమ్ములకి జయం కలగాలని ఆశీర్వదించాడు.

పెద్ద దుమారం లేపింది తాటకి, ఆకాశంలోంచి ఇసుక దిబ్బల రాసులు పోస్తున్నట్టుగా ఆ ప్రదేశం మారింది. దానికి తోడు ప్రచండగాలి. ఒకరి కొకరు కనపడటం లేదు. ఆ దుమారంలో అన్నదమ్ములు సొమ్మసిల్లారు.

వాతావరణం మామూలైన మరుక్షణమే తాటకి ప్రత్యక్షమై ఈసారి రాళ్ళవాన కురిపించింది. అన్నదమ్ములని రాళ్ళ మధ్య కప్పివేయాలని ప్రయత్నించింది.

శ్రీరాముడు ఇక సందేహించకుండా ధనుస్సుని ఎక్కు పెట్టాడు. తాటకి ప్రయోగించిన రాళ్ళ వానని నిరోధించాడు. అప్పుడది కనపడ్డది. శ్రీరాముడిని పట్టుకోవటానికి ప్రయత్నం చేసింది. ఆ క్షణమే శ్రీరాముడు ఆమె రెండు బాహువులను తెగనరికాడు.

అరణ్యం అంతా వినేలా భీకర అరుపు అరిచింది. కేకలతో ఘొల్లుమంది. ఆ క్షణమే లక్ష్మణుడు ముందుకురికి ఆమె ముక్కూ, చెవులూ కోసేశాడు.

అంత చేసినా తేరుకుంది. కామరూపిణి తాటకి మాయమై ఈసారి మరింత వేగంతో పెద్ద పెద్ద రాళ్ళవాన కురిపించసాగింది.

అది చూసి విశ్వామిత్రుడు "సందేహం వలదు శ్రీరామా! రామ బాణాన్ని సంధించు... ఆడదానిపై వుండాల్సిన దయదాక్షిణ్యమునకు ఇది అర్హురాలు కాదు.

"సంధ్యా కాలం సమీపిస్తోంది. రాక్షసుల బలం పెరుగుతుంది. మాయలూ, మంత్రాలూ పెరిగిపోతాయి. సూర్యాస్తమయము అయిన పిదప తాటక సంహారము చేయలేవు" అన్నాడు.

ఎటు చూసినా రాళ్ళు కనిపిస్తున్నాయి. తాటకి ఎక్కడున్నది కానరావటం లేదు. శ్రీరాముడు శబ్దవేధిత్వ జ్ఞానంతో తాటకి ఎక్కడుందో తెలుసుకున్నాడు. దానిపై బాణాలు వేశాడు. అది కట్టుబడిపోయింది.

పిడుగులా మీద పడటానికి చూసింది. శ్రీరాముడి బాణం ఎదురురొమ్ముకి తాకింది. తగిలీతగలంటంతోనే అగ్ని పర్వతం తనలో దూరినట్టు అరచి కుప్పకూలి పోయింది. క్రింద పడీపడక ముందే ప్రాణాలు గాల్లో కలిసి పోయాయి.

ఆ దృశ్యం చూసిన దేవతలు ఆనందంతో సంబరపడ్డారు. విశ్వామిత్రుడినీ, శ్రీరామలక్ష్మణులనూ మెచ్చుకున్నారు.

అప్పుడు దేవేంద్రుడు విశ్వామిత్ర మహర్షితో "మహర్షీ! నువ్వు తపోబలంతో సంగ్రహించిన భృశాశ్వుని సంతానం అయిన మహాస్త్రాలను రాముడికి ప్రసాదించు. లోక కళ్యాణార్థము ఈ భువిపై చెయ్యవలసిన కార్యాలకు వినియోగిస్తాడు. గొప్ప గొప్ప పనులు సాధిస్తాడు" చెప్పాడు.

విశ్వామిత్రుడు శ్రీరాముడిని దగ్గరకు తీసుకుని శిరము ఆఘ్రాణించి "రామా! మనం ఈ రాత్రి ఇక్కడే బస చేసి వేకువనే మన ఆశ్రమానికి పోదాం" చెప్పాడు.

సర్వ ఉపద్రవాలకీ కారణమైన తాటకి చనిపోవటంతో ఆ తాటక వనము కుబేరుడి చైత్రవనములా కడు రమ్యంగా రమణీయంగా మెరిసిపోసాగింది.

తమ్ముడుతో, విశ్వామిత్రుడితో ఆ రాత్రి శ్రీరాముడు సుఖంగా నిద్రించాడు. వేకువజామున విశ్వామిత్రుడు అన్నదమ్ములని నిద్రలేపాడు.

## దివ్యాస్త్రోపదేశము

విశ్వామిత్రుడు చిరునవ్వుతో శ్రీరాముడితో మాధుర్యం ఉట్టిపడే మధురవాక్కులతో "శ్రీరామా నీ అరవీర పరాక్రమానికి సంతుష్టుడినయ్యాను. నీపై నాకు ప్రీతి కలిగినది. దివ్యాస్త్రాలన్నీ నీకు ఇస్తాను.

యక్ష, గంధర్వ, కింపురుషులంతా కలిసి వచ్చినా యుద్ధంలో జయించగలుగుతావు. శత్రువులు నీ దరిదాపులకు కూడా రారు. ఇప్పుడిచ్చే అస్త్రాల ముందు దేవాసురగణాల అస్రాలన్నీ దిగదుడుపే. శ్రీరామా నీకు ప్రప్రథమంగా దండ్రచక్రాన్ని ఇస్తాను. అది చాలా శక్తికలది. ధర్మచక్రాన్నీ, కాలచక్రాన్నీ అత్యుగ్రము అయిన శ్రీమహావిష్ణు చక్రాన్నీ, ఇంద్రాస్త్రమునూ,





వజ్రాస్త్రాన్నీ, శివ సంబంధమైన మహాశూలమూ, బ్రహ్మశిరమూ, ఐషికాస్త్రమూ, సాటిలేని మేటి తిరుగులేని బ్రహ్మాస్త్రాన్ని సైతం నీకు ఇస్తాను.

"మోదకీ, శిఖరీ అనే రెండు అపూర్వగదలూ ఇస్తాను. ధర్మపాశాన్నీ, కాలపాశాన్నీ, వరుణపాశాన్నీ ఇస్తాను. శుష్కాశనీ, ఆర్ద్రాశనీ అనే పిడుగులనూ, పైనాకాస్త్రాన్నీ, నారాయణాస్త్రాన్నీ ఇస్తాను.

"అగ్నిదేవునకు ప్రియమైన ఆగ్నేయాస్త్రాన్నీ, ప్రథనము అనే వాయువ్యాస్త్రాన్నీ, హయశిరాస్త్రామూ, క్రౌంచాస్త్రమూ, విష్ణు శక్తీ, శివశక్తీ, రాక్షసులువాడే ముసలాలూ, కంకాళమూ, కాపాలమూ, కంకణమూ ఇస్తాను.

"వైద్యాధర మహాస్త్రమూ, నందనమను ఖడ్గమూ, గంధర్వాస్త్రాలూ, మానవమూ, ప్రస్వాపనమూ, ప్రశమనమూ, దర్పణమూ, శోషణమూ, సంతాపనమూ, విలాపనమూ, దుర్గర్షమూ, మన్మధాస్త్రం మదనమూ, విమోచాస్త్రం మోహనమూ ఇచ్చెదను.

"తామసాస్త్రమూ, సౌమనాస్త్రమూ, సంవర్ధనాస్త్రమూ, మౌసలాస్త్రమూ, సత్యాస్త్రమూ, మాయాధరాస్త్రమూ, తేజఃప్రభాస్త్రం, చంద్రాస్త్రమైన శిశిరాస్త్రమూ, త్వష్టాయుధం, సుదామనాస్త్రమూ, దారుణపూరితమైన భగాస్త్రమూ, మానవాస్త్రమూ ఇస్తాను.

"శ్రీరామా ఇవన్నీ ఇచ్ఛాధీనరూపాలు. మహాబలయుతాలు. శక్తివంతమైనవి. ఈ ముల్లోకాలలోకల్లా అతిశయము అయినవి. వేగిరంగా శుచి అయిరమ్మ".

శ్రీరాముడు తూర్పు ముఖంగా నిలుచున్నాడు. విశ్వామిత్రుడు అట్టి మహాశక్తివంతమైన అస్త్రమంత్రాలన్నీ రాముడికి ఉపదేశించాడు.

దేవతలకి సహితం అతి దుర్లభమైన అస్త్రాలన్నీ శ్రీరాముడికి ఉపదేశము చేశాడు. అన్నీ మహాస్త్రాలూ విశ్వామిత్రుడి జప ఉపదేశంతో శ్రీరాముడిని చేరాయి.

అన్ని అస్త్రాలూ శ్రీరాముని ముంగిట నిలిచి నమస్కరించి మేమంతా మీ కింకరులమని చెప్పాయి. శ్రీరాముడు అస్త్రదేవతలకి నమస్కరించి... "అన్నీ వేళల నాకు అనుకూలంగా వుండండి. అవసరమైనప్పుడు పిలుస్తాను. అంతవరకూ మీ స్థానాల్లో మీరు వుండండి" అనగా అంతా శ్రీరామునికి నమస్కరించి అంతర్ధానమయ్యారు. పిమ్మట శ్రీరాముడు విశ్వామిత్రునికి నమస్కారం చేశాడు.

దివ్య తేజస్సుతో, దివ్యాస్త్రాల పరిగ్రహి అయిన శ్రీరాముడిని చూసి విశ్వామిత్రుడు తరించి, పులకించి పోయాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

తిరిగి ప్రయాణానికి సిద్ధమవుతున్న విశ్వామిత్రుడితో శ్రీరాముడు "గురువర్యా...... సకల దివ్యాస్త్రాలన్నింటినీ నాకు భోదించారు. ఎంతటి వారైనా నన్ను గెలవలేని విధంగా అస్త్రాలని వశం చేశారు. అస్త్రప్రయోగంతో పాటు, ఉపసంహారము కూడా అనుగ్రహించమని మనవి."

"ఉపసంహార మంత్రాలను ఇప్పుడే ఉపదేశిస్తాను. అందులకు నీవు పరిపూర్ణ అర్హుడవు. సత్యవంతము, సత్యకీర్తి, ధృష్టము, రభసము, ప్రతిహారతరము, పరాఙ్ముఖము, లక్షాక్షము, విషమము, దృఢలాభము, మహానాభము, సునాభము, దశాక్షము, శతవక్త్రము, దశశీర్షము, శతోదరము, పద్మనాభము, మహానాభము, దుందునాభము, సునాభము, జ్యోతిషము, కృశనము, వైరాశ్యము, విమలము, యోగంధరము, హరిద్రము, దైత్యము, ప్రశమనము, సార్చిర్మాలినీ, ధృతినీ, మాలినీ, వృత్తిమంతము, రుచిరము, పితృసౌమనసము, విధూతము, మకరము, కరవీరకరము, ధనము, ధాన్యము, కామరూపము, కామరుచీ, మోహము, ఆవరణము, జృంభకము, సర్వనాభము, సంతానము, వరణము ఇవన్నీ ఉపసంహారములు. భృశాశ్వుడి కుమారులు కామరూపులు. స్వీకరించు శ్రీరామా"

"సంతోషం" అంటూ స్వీకరించాడు శ్రీరాముడు. ఉపసంహారక మంత్రార్థాలన్నీ దివ్యమైన దేహాలతో శ్రీరాముని ముందుకు వచ్చాయి. నమస్కరించాయి. అన్నీ వెలుగుతూ వున్నాయి.

వారిలో కొందరు భగభగమండే నిప్పు కణికల్లా వున్నారు. మరికొన్ని చుట్టేసుకున్న పొగలా వున్నాయి. కొన్ని సూర్యచంద్రుల్లా వున్నాయి. మరికొన్ని వినయంగా నిల్చొని వున్నాయి.

"మేము సర్వ సమయాల్లోనూ సిద్ధం. మీరు ఆజ్ఞాపించటమే ఆలస్యము" అని చెప్పారు.

"మీరంతా పిలిచినప్పుడు రండి. అప్పటివరకూ మీ చిత్తము వచ్చిన చోట వుండవచ్చును"

ఆ మంత్రాధిష్ఠాన దేవతలు శ్రీరామునికి నమస్కరించి మాయమైనాయి.





విశ్వామిత్రుడి వెంట రామలక్ష్మణులు నడిచారు. కొంత దూరం ప్రయాణించాక శ్రీరాముడు అడిగాడు.

"స్వామీ... మహారణ్యము దాటి వచ్చినాము. పక్షులతో కడు రమ్యంగా వుంది. చూడబోతే ఆశ్రమ ప్రదేశంలా వుంది. ఎవరి ఆశ్రమ ప్రదేశమో తెలుసుకోవాలని ఉంది. ఈ అడవి నామం కూడా తెలుసుకొన కుతూహల పడుతున్నాను."

"ఇదియే సిద్ధాశ్రమము. వైకుంఠవాసుడు, లక్ష్మీపతి శ్రీమన్నా నారాయణుడు అయిన ఆ శ్రీమహావిష్ణువు ఎన్నో యేళ్ళు నివశించిన ప్రాంతమిది" చెప్పాడు విశ్వామిత్రుడు.

## సిద్ధాశ్రమము

కాశ్యపుడు సిద్ధిపొందిన అమృత ప్రదేశమిది. అనంతమైన ఈ అడవిలోనే శ్రీమహావిష్ణువు ఎన్నో వందల సంవత్సరాలు అష్టాంగయోగసిద్ధి కోసం తపం ఆచరించాడు. వామన రూపంలో ఉన్నప్పుడూ, అంతకు ముందూ ఇక్కడే నివసించాడు.

శ్రీ మహావిష్ణువు తపస్సిద్ధి కోసం తపస్సు చేస్తున్న కాలంలో విరోచనుడి పుత్రుడు బలిరాజు తన సేనలతో, దేవతాలోకాలతో పాటు అమరావతీధీశుడు దేవేంద్రుడిని సైతం జయించాడు. ముల్లోకాలనూ తిరుగులేని విధంగా జయించి ఒక మహత్తరమైన యజ్ఞం ఆరంభించాడు.

అది తెలిసిన దేవతలంతా అగ్నిహోత్రుడు తోడు రాగా తపస్సు చేస్తున్న శ్రీమహావిష్ణువు వద్దకు ఈ సిద్ధాశ్రమ ప్రదేశానికి వచ్చి శరణుకోరారు.

"ప్రభూ బలిరాజు అన్ని యజ్ఞములకన్నా మహత్తర యజ్ఞాన్ని ప్రారంభించాడు. ఎవరు ఏది అడిగినా లేదనకుండా ఇస్తున్నాడు. అన్ని యజ్ఞ కర్మలు నిరాటంకంగా సాగిపోతున్నాయి. అది పూర్తి అయితే బలిరాజు మరింత విజృంభిస్తాడు. మేమంతా మరిన్ని వ్యధలకీ, బాధలకీ గురికావలిసి వస్తుంది. తమరు వామన రూపము ధరించి, ముల్లోకాలను దానమడిగి లోక కళ్యాణము చేయవలెను" శ్రీమహావిష్ణువు వారి ప్రార్థన ఆసాంతము ఆలకించాడు.

"శ్రీరామా! అప్పటికే అగ్నిహోత్రుడి వంటి ప్రకాశవంతుడు, కాంతివంతుడు కాశ్యపుడు అదితితో గూడి మహావిష్ణువు గురించి తపస్సు చేస్తున్నాడు.

వెయ్యి దివ్య సంవత్సరాలు తపస్సు పూర్తి చేసిన కాశ్యపుడి ఎదుట శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమైనాడు.

కాశ్యపుడి ఆనందం, భక్తి ప్రపత్తులు అవధులు దాటాయి. రెండు చేతులు చాచి - శ్రీమహావిష్ణువును స్తోత్రం చేశాడు.

"తపోరాశి, తపోమూర్తి శ్రీమన్నారాయణా... నిన్ను చూస్తుంటే ముల్లోకాలను చూస్తున్నట్టుంది. నిన్ను పట్టుకోలేను, నిన్ను నిర్దేశించలేను, నీ శరణును కోరుతున్నాను."

"కాశ్యపా... అడుగు, వరమడగటానికి సంపూర్ణ అర్హుడివి. సంకోచించకు"

"స్వామీ... ముక్కోటి దేవతలంతా ఏకమై వచ్చి అడిగారు. నేనూ, అదితీ ప్రార్థనతో పాటు యాచిస్తున్నాము. మాకు పుత్రుడిగా జన్మించవలెనని కోరిక... బలిరాజు చర్యలతో శోకార్తులైన లోకమున మా పుత్రుడిగా జన్మించి కాపాడవలెను"

శ్రీమహావిష్ణువు 'తథాస్తు' అని ... కాశ్యపుని కోరిక మన్నించాడు. కాశ్యపుడి వ్రతకర్మ సిద్ధించటంతో ఇది సిద్ధాశ్రమమయినది.

"శ్రీరామా! ఆపై శ్రీమహావిష్ణువు అదితి గర్భంలో వామన మూర్తి అయి జన్మించాడు. వటువుగా వామనమూర్తి బలిచక్రవర్తి వద్దకు వెళ్ళాడు.

"ముల్లోకాల కోసం మూడు అడుగుల నేల అడిగాడు. మూడు అడుగులు వేసి ముల్లోకాలను ఆక్రమించాడు.

"బలిని పాతాళానికి నొక్కిపెట్టాడు. దేవేంద్రుడికి తిరిగి ముల్లోకాలని అప్పగించాడు.

"అదిగో అప్పటి కాశ్యపుడు, అదితి, శ్రీమహావిష్ణువు వామన రూపంలో ఉన్న ఆశ్రమమే ఇది. ఇక్కడే నేను నివసిస్తున్నాను. ఈ ఆశ్రమం ఇప్పుడు నీది కూడా..."

రామలక్ష్మణులు ఆశ్రమంలోకి ప్రవేశించారు. సిద్ధాశ్రమంలోని సిద్ధులు ఎదురువచ్చారు.

విశ్వామిత్రునికి పాద్యాదులు,అర్ఘ్యం ఇచ్చారు. రామలక్ష్మణులకు అతిథి మర్యాదలు పుష్కలంగా చేశారు.

రామలక్ష్మణులు విశ్వామిత్రుడితో చెప్పారు. "మునీంద్రా! తమరు తపస్సు ప్రారంభించండి. సిద్ధాశ్రమమని చెప్పారు. ఆ పేరు ఇప్పుడు సార్థక నామధేయ మవుతుంది."





విశ్వామిత్రుడు యజ్ఞ దీక్షితుడయ్యాడు. రామలక్ష్మణులు జాగురూకతతో ఆ రాత్రి గడిపారు. వేకువనే లేచి స్నానాదులు గావించి, ప్రాతఃసంధ్యను ఉపాసించి, ఇంద్రియాలు జయించిన విశ్వామిత్రునికి నమస్కరించారు. ధనుస్సులు ధరించి ఉదయభానుడివలే వెలిగిపోతున్నారు.

## మారీచ సుబాహులు

విశ్వామిత్ర మహర్షి యజ్ఞదీక్షలో ఉండటంచే రామలక్ష్మణులు మహర్షులను ప్రశ్నించారు. "మహాత్ములారా? దుర్మార్గపు ఆలోచనలతో నిత్యం ఉండే రాక్షసులెప్పుడు వస్తారు?"

"రామలక్ష్మణులారా! వారెప్పుడైనా రావచ్చు. మీరు కనిపెట్టుకు ఉండవలెను. విశ్వామిత్రుల వారు యజ్ఞ సమాప్తి అయ్యేవరకూ మాట్లాడరు. ఈ రోజు మొదలు ఆరు అహోరాత్రములు ఎప్పుడైనా, ఏ ఘడియైనా రావచ్చు"

అది విన్న రామలక్ష్మణులు దనుర్ధారులయ్యారు. అయిదు అహోరాత్రములు నిద్ర అన్నది లేకుండా కావలి కాసారు. యజ్ఞం సాగిపోతూ ఉంది. సిద్ధాశ్రమమంతా వేదాక్షరాలతో ప్రతిధ్వనిస్తోంది.

ఆరవరోజు, యజ్ఞ పరిసమాప్తి ఆఖరి రోజు వచ్చింది.

ఋత్విజులూ, మహర్షులూ ప్రశాంత చిత్తముతో తమ తమ పనులు చేస్తున్నారు.

"లక్ష్మణా! ఏకాగ్రతతో సిద్ధంగా వుండు" అంటుండగానే ఆకాశంలో మూకుమ్మడి పిడుగులు పడిన శబ్దాలు... భయంకర వికటాట్టహాస నవ్వులు... ఆ క్షణానే యజ్ఞ వేదిక భగ్నమంది.

ఋత్విజులూ, పురోహితులూ దిగ్భ్రాంతిగా చూశారు. ఆకాశంలో రాక్షసుల వికృత గోలలూ, నవ్వులూ వికటాట్టహాసాలు.

దర్భలూ, పానపాత్రలూ, సమిధలూ, పువ్వులూ అన్నీ అలానే వున్నాయి. ఆకాశాన కారుమేఘాలు క్షణంలో కమ్మి వేశాయి. యుద్ధంలో సైనికుల్లా పోటీలు పడి పరిగెడుతున్నాయి.

మారీచ, సుబాహువులు తమ అనుచరగణంతో వస్తూనే పెద్ద కడవలతో రక్తం పోశారు.

ఆ రక్త ప్రవాహము మహాపర్వతం పైనుంచి దూకే జలపాతంలా దూకుతూ వస్తోంది. యజ్ఞ వేదిక మరోసారి భగ్నమంది.

శ్రీరాముడు ఆ రక్తప్రవాహానికి అడ్డుకట్టవేశాడు. యజ్ఞ వేదికపై చుక్క కూడా పడకుండా బాణాలతో యజ్ఞవేదిక అంతా కవచంలా నిర్మించాడు.

మారీచ సుబాహులు వికృతంగా అరిచారు. ఆకాశం చిల్లులు పడ్డట్టు పెళపెళలతో ఉరుములూ, మెరుపులూ సృష్టించారు.

సిద్ధాశ్రమాన్ని యుద్ధాశ్రమంలా మార్చి వేశారు.

శ్రీరాముడు మానవాస్త్రాన్ని తీశాడు. రాముడి నేత్రాలు తీక్షణంగా చూశాయి. ధనుస్సు నుంచి బాణాన్ని వదిలాడు. భగ భగ, తళ తళమంటూ సుడిగాలిలా కదిలింది.

వెళ్ళి మారీచుడి గుండెను తాకింది. బాధంటే ఏంటో మొదటిసారి తెలిసింది. శ్రీరాముడి బాణానికి వంద యోజనాల దూరంలో పడ్డాడు. మతితప్పి గతులేమిటో తెలియక విలవిలలాడిపోయాడు.

'దయాదాక్షిణ్యములేని దుష్టులకూ, పాపకర్మలు చేసే పాపులకూ బ్రతికే అర్హతలేదు' అంటూ ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు సుబాహుడి మీద. ఆ బాణ తాకిడికి నేలకూలి చచ్చాడు.

దాంతో మారీచ, సుబాహుల అనుచర గణం కకావికలమై పరిగెత్తింది. ప్రాణాలరిచేత పట్టుకొని పిట్టకు కూడా దొరకుండా పారిపోయారు. అయినా రామబాణం వదలలేదు. బహుక్రూరులు, రుధిరాశనులు అయిన ఆ రాక్షసులపై దివ్యమైన వాయువాస్త్రమును వేశాడు. అందరినీ సంహరించినాడు.

రాముని పరాక్రమం చూసిన మునులు ఆనందంతో తబ్బిబ్బుబ్బి బ్బయ్యారు. పూర్వము అసుర సంహారము చేసినప్పుడు దేవేంద్రుడను పూజించినట్టుగా పూజించారు. స్తుతించారు.

విశ్వామిత్రుని యజ్ఞం పరిసమాప్తి అయినది. అన్నదమ్ములతో విశ్వామిత్రుడు చెప్పాడు. "నీ తండ్రి నిన్ను పంపినందుకు నా యజ్ఞము నిరాటంకముగా జరిపించావు. కృతార్ధుణ్ణయ్యాను. నీ వల్ల ఈ సిద్ధాశ్రమనామము పరిపూర్ణ సార్ధకము అయ్యింది."

## మిథిలా దేశానికి ప్రయాణం

కృతార్ధులయ్యారు రామలక్ష్మణులు. ఆ రాత్రి మహానందంతో గడిపారు. తెల్లవారాక పౌర్వాహ్నిక కృత్యాలను ముగించుకొని మునీంద్రునకు నమస్కరించి "మీ సేవకై మేం సిద్ధము మహర్షీ" చెప్పారు.





ఆ పలుకులకు అగ్నిహోత్రుడిలా వెలిగిపోతున్న విశ్వామిత్రుడూ, మహర్షులూ సంతసించారు.

విశ్వామిత్రుడి అనుజ్ఞతో ఓ మహర్షి శ్రీరామునితో చెప్పాడు. "మిథిలాధిపతి జనక మహారాజు ఓ మహాయజ్ఞం చేయబోతున్నాడు. అందరమూ అచటికే ప్రయాణం. తమ అన్నదమ్ములూ రావలసింది. జనకుడి వద్ద పధ్నాలుగు భువనభాండాలు పూజించే శివధనస్సు వున్నది. అది మీరు తప్పక చూడవలెను. దేదీప్యమానంగా వెలిగిపోతూ వుంటుంది. ఆ ధనూరత్నముతో పాటు సీతాదేవి... జనకమహారాజు పొందిన వరప్రసాదము... ఓ రామా శివధనుస్సును తప్పక చూడాలి. ఆ విల్లు ఎక్కుపెట్టడం ఎవరికీ సాధ్యపడలేదు. కనీసం తేరిపారా కూడా కొంతమంది చూడలేకపోయారు.

"పూర్వము మిథిలను ఏలే దేవరాతుడు గొప్పయజ్ఞం చేయగా యజ్ఞఫలంగా సంపాదించిన శివధనస్సు అది. జనకరాజు ఇంటిలో వున్న ఆ ధనుస్సు గంధర్వ, గరుడ, యక్ష, రాక్షసులెవరూ ఎక్కుపెట్టలేని దృఢముష్టి.... ప్రతినిత్యం గంధ పుష్ప ధూప నైవేద్యాలతో పూజిస్తారు. మిథిలలో జరిగే ఏ కార్యమైనా ముందు ధనస్సు పూజతోనే ప్రారంభమవుతుంది. జనకుడు చేసే యజ్ఞమూ చూడవచ్చును. తప్పక రావలెను"

విశ్వామిత్రుని వంక ప్రసన్నంగా చూశాడు శ్రీరాముడు. 'శుభమస్తు' అని చేయి ఎత్తి ఆశీర్వదించాడు విశ్వామిత్రుడు. శ్రీరాముడు భక్తిగా నమస్కరించాడు.

మిథిలా నగరానికి ప్రయాణం నిశ్చయమైంది. విశ్వామిత్రుడు బైలుదేరినాడు. అతనితో పాటు రామలక్ష్మణులు, మహర్షులు.

ముందుగా వనదేవతల వద్ద శెలవు పుచ్చుకొని "మీరంతా ఇక్కడే ఉండండి. నేను సిద్ధిపొందాను. సిద్ధాశ్రమము వదిలిపెట్టి వెళుతున్నాను. ఇక గంగానది ఉత్తరంగా పవిత్ర హిమాలయాల పర్వతాల వైపుకి వెళతాము" వీడ్కోలు చెప్పాడు.

వారి వెంట ఆశ్రమ మునులే కాదు, లేళ్ళూ, జింకలూ కూడా నడిచాయి. అది చూసి ఆకాశంలో ఎగిరే అందమైన పక్షులు గుంపులు గుంపులుగా ఎగురుకుంటూ అనుసరించాయి.

విశ్వామిత్రుడు మునులకూ, లేళ్ళకూ, జింకలకూ, ఎగిరే పక్షులకూ వీడ్కోలు చెప్పి తమను అనుసరించవద్దని చెప్పాడు.

అలా నడుచుకుంటూ శోణాకూలము చేరారు. ప్రొద్దుపోయాక అగ్నిహోత్రుల్తో హోమం చేశారు. రామలక్ష్మణులు, మునులు, వినయ, విధేయతా పూర్వకంగా విశ్వామిత్రునకు అభిముఖంగా కూర్చున్నారు.

"మునీంద్రా! ఈ అడవి ఎంతో శోభాయమానంగా వుంది. ఇది ఏ దేశము? ఇంత సర్వసమృద్ధంగా వున్న ఈ ప్రాంతం గురించి తెలుసుకోవలెనని కోరిక కలిగింది"

శ్రీరాముని వంక వాత్సల్యపూరితంగా చూసి విశ్వామిత్రుడు ఆ దేశ వృత్తాంతమును చెప్పటం ప్రారంభించాడు.

## కుశనాభుడు

"మహాతపఃశ్శాలి, శౌర్యవంతుడు, బ్రహ్మమానస పుత్రుడైన కుశుడు అనే తపఃశ్శాలి పూర్వం వుండేవాడు. అతని భార్య కులీన... ఆమె విదర్భరాజు తనయ. చక్కటి అందం, సుందర అవయవాలతో అందగత్తెలకే అందగత్తె. దానికి తగ్గ వినయం... సర్వవ్రత ధర్మాలను పాటించేది.

"ఆ దంపతులకు నలుగురు సంతానము. కుశంబుడూ, కుశనాభుడూ అధూర్తరజసుడూ, వసువు. ఈ నలుగురూ... తండ్రీ, తల్లీ గుణాలతోనూ, సత్యవ్రత ధర్మాలతోనూ, శౌర్యపరాక్రమంతోనూ ఎవరికి వారే సాటి...

"నలుగురికీ క్షత్ర ధర్మ బాధ్యతలు ఇవ్వటానికి నిశ్చయించుకున్నాడు. బ్రహ్మాండమైన, అఖండమైన భూమిని నాలుగు భాగాలుగా విభజించాడు. అందరికీ పంచి-

"పుత్రులారా! మీకు పంచిన భూభాగములను మీరు ఏలండి.. ధర్మపరిపాలన కొనసాగించండి"

తండ్రి మాట ప్రకారం కుశంభుడు కౌశాంబీ నగరాన్ని రాజధానిగా చేసికొనగా, కుశనాభుడు మహోదయ నగరాన్ని, అధూర్తరజసుడు ధర్మారణ్యాన్ని, వసువు గిరివ్రజంని రాజధానులుగా చేసుకొని పరిపాలన సాగించారు.

విశ్వామిత్రుడు చెప్పటం ఆపి, శ్రీరాముని వైపు తిరిగి "రామా! చుట్టూ ఉన్న ప్రాంతం వసురాజుది... ఈ దేశము చుట్టూ అయిదు కొండలుండటంతో గిరివ్రజమని నామకరణం చేశారు.

మగధ దేశం నుంచి పారే శోణనది ఈ కొండల మధ్య ప్రవహిస్తుంది. ఈ నదిపారే ఒడ్డు ఆసాంతమూ బంగారం పండుతుంది.





కుశనాభుడు ఘృతాచిని వరించాడు. వారికి నూరుమంది సంతానం. అంతా అద్భుతమైన అందగత్తెలు....

ఉద్యానవనంలో వారంతా చేరి విహరిస్తుంటే రెండు కనులు చాలేవి కావు. పూల మొక్కల్లో పూల మొక్కల్లా ఉండేవారు. వనంలో వనదేవతల్లా ఉండేవారు.

ఉద్యానవనమంతా అపూర్వమైన పూలమొక్కలతో, సుగంధ భరిత చెట్లతోనూ నిండి ఉండేది. అక్కడ గాలి ఉరకలు వేసే నదిలా ఋషికేశ్ వద్ద గంగానదిలా పరవళ్ళు తొక్కేది.

స్వేచ్ఛగా, సంతోషంగా, కేరింతలు కొడుతున్న ఆ అతివలను, సౌందర్య రాశులను చూసి వాయుదేవుడికి మనసు చలించింది. మోహించాడు. కామించాడు.

"ఓ అందగత్తెలారా? మిమ్మల్నందరినీ మోహించాను. ఇష్టపడ్డాను. నేను వాయుదేవుడిని... సంశయించక ప్రేమించండి"

పరువంతోనూ, సౌష్టంవంతోనూ... జ్ఞానంతోనూ ఉన్న సుందరీ మణులు... "గాలిదేవా! ఇది నీకు తగదు... సృష్టిలోని ప్రాణులందరినీ తగులుతూ తిరుగుతుంటావు... మాకు తగవు... స్త్రీ వ్యామోహంతో సమస్యలు తెచ్చుకోకు. మా తండ్రి గారు కుశనాభుడు... తలుచుకుంటే నిన్నే కాదు.. నీ ప్రభువు ఇంద్రుడిని కూడా పదవీ భ్రష్టుడని చేయగలరు...."

వాయుదేవుడు పట్టరాని కోపంతో వూగిపోయాడు..

అంతట ఆ కన్యలు..."గాలి దేవా! మేం ధర్మం తప్పం. మా తండ్రి మాటే మాకు శిరోధార్యం... జాగ్రత్త..... నీ ధర్మం నీవు నడుచుకో.... లేదంటే... తప్పదు శిక్ష."

వాయుదేవుడు ఇక ఆగలేకపోయాడు. పరమ ఉగ్రరూపం ఎత్తాడు. వారందరి శరీరాల్లో అణువణువు ప్రవేశించాడు. అతలాకుతలం చేశాడు.

దానితో వారు కురూపులయ్యారు. వ్యథతో... ఏడుస్తూ తండ్రి వద్దకు పరిగుతీశారు. జరిగింది చెప్పారు.

దానితో కుశనాభుడు సావధానంగా "అమ్మలారా! మీరు మన కులగౌరవం నిలబెట్టారు. ధర్మవచనాలను దేవునికే చెప్పారు. తండ్రి చాటు బిడ్డలుగా మీ ధర్మాన్ని సవ్యంగా నిర్వర్తించారు... నాకు మహదానందంగా ఉంది.

"క్షమాగుణం మానవత్వానికి ప్రతీక... క్షమే యజ్ఞం... దానం.. సత్యం... అదే కీర్తి. ఈ చరాచర జగత్తంతా క్షమతోనే నిండి వుంది...."

కుశనాభుడు మంత్రివర్గంతో చర్చించాడు. కూతుళ్ళ వివాహ విషయంలో తాను తీసుకున్న నిర్ణయాన్ని చెప్పాడు.

మంత్రిసత్తములంతా ఆలోచించి వరుడిగా బ్రహ్మదత్తుడుని నిర్ధారించారు.

## బ్రహ్మదత్తుడు

చూళి అనే మహామునీశ్వరుడుండేవాడు. అతను సదాచార సంపన్నుడు. ఊర్మిళ తనయ సోమద చూళిమునికి శుశ్రూషలు చేసింది...

కొన్నాళ్ళకు చూళి ముని సోమద పరిచర్యలకి సంతసించి .... "నీకు ఎల్లప్పుడూ శుభం కలుగుతుంది. నీకేం కావాలన్నా సంకోచించక కోరుకో" చెప్పాడు. సోమద పరమానందభరితురాలైంది.

"ధార్మికుడా.... మీ వరమునకు పులకించిపోతున్నాను. బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోతున్నారు. ... నేను కన్యను... ఎవరినీ మోహించలేదు. ఇష్టపడలేదు... మీ తపోమహిమతో నాకు శక్తివంతుడైన, మీ అంత తేజస్సుగల పుత్రుడిని ప్రసాదించండి"

చూళి... ఆమె కోరికను మన్నించాడు. బ్రహ్మఋషి వరప్రభావంతో అతని మనసు నుండి పుట్టినవాడే బ్రహ్మదత్తుడు.

కుశనాభుడు కన్యలకై వరుడిని వెతుకుతున్న సమయానికి ఆ నగరంలోనే వున్నాడు. అంతే కుశనాభుడు బ్రహ్మదత్తుడిని పిలిపించాడు. తన మనసులోని మాటను వివరించాడు.

వివాహానికి సమ్మతించాడు బ్రహ్మదత్తుడు. రంగ రంగ వైభవంగా వందమంది కన్యలతో పెండ్లి అయింది.

బ్రహ్మదత్తుడి చేయి తగలటం ఆలస్యం అందరికీ కురూపం పోయింది. అసమాన రూపంతో ... అంతా యవ్వన సంపన్నులయ్యారు. కుశనాభుడు సంతసించాడు.

దివ్యసుందరీ మణులతో బ్రహ్మదత్తుడు తన మామగారు కుశనాభుడితో సహా కాంపిల్యా నగరానికి చేరాడు. తల్లి సోమదకు నమస్కరించాడు. ఆదరంతో సోమద కోడళ్ళనూ, కొడుకునీ అక్కున చేర్చుకుంది.





## గాధి

కుశనాభుడు తిరిగి తన రాజ్యం చేరాడు. వందమంది కూతుళ్ళతో కళకళలాడిపోయే అంతఃపురం బోసిపోయినట్లయింది. కుశనాభుడు ఒంటరివాడినైయ్యానని దిగులు పడ్డాడు.

ఆ సమయంలో కొడుకుని ఓదార్చడు కుశుడు.

"నాయనా వ్యథ చెందకు. పుత్రకామేష్ఠి యాగం చేయి. సర్వగుణ సంపన్నుడు జన్మిస్తాడు. అతని నామం గాధి. అఖండమైన కీర్తిని శాశ్వతం చేస్తాడు" అని చెప్పి బ్రహ్మలోకానికి పయనమై వెళ్ళాడు.

కుశుడు చెప్పిన విధంగా సద్గుణసంపన్నుడైన పుత్రుడు జన్మించాడు. అతనే గాధి. .... మా తండ్రిగారు... " అని ఆగి రాముని వంక ప్రసన్నంగా చూస్తూ...

"ఈ ప్రాంతం గూర్చి నీవడిగిన దానివల్ల... నీతో పాటు ... మునులకూ నా జన్మవంశం గూర్చి తెలిసింది.

"నేను కుశ వంశంలో పుట్టాను. అందుకే కౌశికుడనయ్యాను. నాకో అక్క వున్నది. ఆమె పేరు సత్యవతి. ఆమె భర్త రుచికుడు. ఆమె మహా పతివ్రత. .... సత్యశీలి... అన్ని సుద్గుణాల వల్ల బొందితో స్వర్గాన్ని చేరింది.

"అంతట తృప్తి చెందక తన పుణ్యఫలాలను పుణ్యకోటికి ఇవ్వతలచి మహానదిగా హిమపర్వత ప్రాంతంలో కౌశికీనదిగా జన్మించింది.

"మా అక్క మీద మమతానురాగాలతో ఆ కౌశికీనది ఒడ్డునే నివశిస్తుంటాను.

"ఓ రామా! యజ్ఞ తపస్సు కోసం సిద్ధాశ్రమానికి వచ్చాను. మహోన్నతమైన నీ పరాక్రమం వల్ల యజ్ఞం సఫలం అయింది. నన్ను తపఃసిద్ధుణ్ణి చేశావు..."

మహర్షులు అంతా ఆయన వంశచరిత్ర విన్నందుకు ఆనంద పరవశులైయ్యారు.

"రామా! పొద్దుపోయింది చీకట్లు గాఢంగా కమ్ముకున్నాయి. ఆకాశం, తారలతో వెలుగుతూ వుంది. చెట్టూ, చేమలూ నిశ్చలంగా వున్నాయి. వేకువనే మనం బైలుదేరవలెను. సమస్త లోకాన్నీ సంతోషపరిచే చల్లని వెన్నెలలో శయనిద్దాం..." చెప్పాడు విశ్వామిత్రుడు.

రామలక్ష్మణులు విశ్వామిత్రునికి నమస్కరించి నిద్రకు ఉపక్రమించారు.

# గంగ

తెల్లవారింది... పక్షుల కిలకిలరావాలతో ఆ ప్రాంతం ఆహ్లాద భరితమయ్యింది.

"ఓ రామా! తెలతెల్లవారి పోతోంది. నీవు వేగిరంగా నిద్రలేవవలెను. పూర్వ సంధ్యాకాలం అయిపోతూ వుంది. ప్రయాణానికి సిద్ధం కమ్మ" విశ్వామిత్రుడు చెప్పాడు.

అన్నదమ్ములు లేచి... విశ్వామిత్రడు సిద్ధమయ్యే సమయానికి ప్రయాణానికి సిద్ధమయ్యారు.

"మునీంద్రా... ఈ శోణనదము బహు సుందరంగా నున్నది. లోతు ఎక్కువ లేనట్టు నిర్మలంగా వుంది.

"ఈ నది దాటుటకు నావ అవసరం లేదని, మధ్య మధ్య కనిపిస్తున్న ఇసుకతిన్నెలు రూఢి చేస్తున్నాయి. కానీ దారే తెలియటం లేదు" చెప్పాడు శ్రీరాముడు. అంతా ముందుకు కదిలారు.

అభయారణ్యాలు చూసుకుంటూ, చాలా దూరం ప్రయాణించాక గంగానది చేరారు. రమణీయ దృశ్యాలతో, రకరకాల హంసలతో నిండి ఉన్న గంగానదిని చూసి అంతా సంతోషించారు.

మునులు పవిత్రమైన గంగానదిలో స్నానం చేశారు. అగ్నిహోత్రాలూ, హోమాలూ నిర్వహించారు.

ఆపై.... మహర్షి విశ్వామిత్రుడి చుట్టూ కూర్చున్నారు.

శ్రీరాముడు తన ఉద్దేశాన్ని విశ్వామిత్రడికి తెలియచెప్పాడు.

"స్వామీ...ఈ పవిత్ర పుణ్య గంగానది గూర్చి తెలుసుకోవాలని ఉంది. మూడు దారుల్లో ముల్లోకాల్లో ఎందుకు ప్రవహించింది. చివరకు సముద్రుడిని ఎలా చేరింది అన్న విషయాలు తెలుసుకోవలెనన్న కోరిక కలిగినది"

శ్రీరాముని వంక సాదరంగా చూశాడు విశ్వామిత్రడు. మునులందరూ తమదీ అదే కోర్కె అని చెప్పారు. అంత మహర్షి విశ్వామిత్రుడు-

"ధాతువులన్నింటికీ ఆటపట్టయిన ఘనిగా పిలిచే హిమవంతుడనే పర్వతరాజు ఉండేవాడు. ఆయన భార్య పేరు మనోరమ. మెరుపు తీగలోని మెరుపంతా కలిపి బ్రహ్మ తయారు చేసినట్టు అద్భుతంగా వుంటుంది. మేరువు కూతురైన మనోరమకి, హిమవంతునికి ఇద్దరు కూతుళ్ళు. ఇద్దరూ అప్రతిమాన





సుందరీలతాంగులు. పెద్దకూతురి పేరే గంగ.. రెండో కూతురు ఉమ. దేవలోక దేవతలంతా ఓ రోజున హిమవంతుని దగ్గరికొచ్చి దైవకార్యం కోసం గంగనిమ్మని అడిగారు.

"లోకకళ్యాణం కోసం... లోకహితం కోసం గంగను ఆనందంగా ఇచ్చాడు హిమవంతుడు.

"రెండోపుత్రిక ఉమ కన్యగానే అకుంఠిత తపస్సు చేసింది. ఆమెను మహాశివునికిచ్చి వివాహం చేశాడు హిమవంతుడు. ముల్లోకాలకు పూజ్యురాలైంది ఉమ.

"హిమవంతుడి ఇద్దరు కూతుళ్ళలో గంగ దేవలోకం చేరింది. దేవతలు తీసుకెళ్ళడం వల్ల దేవనది అయింది. రెండవకూతురు మహారుద్రడు, గరళకంఠుడైన శివుని భార్య అయింది."

అంత శ్రీరాముడు.... "మునీంద్రా! గంగాదేవి చరిత్రను సంక్షిప్తంగా చెప్పారు. గంగాదేవి మూడుపాయల్లో ఎలా ప్రవహించింది?

"స్వర్గంలోనూ, మానవలోకంలోనూ, పాతాళంలోనూ ఎలా ప్రవహించింది? తెలుసుకోవాలన్న కోర్కె క్షణక్షణానికీ పెరుగుతోంది. వెంటనే చెప్పమని కోరుతున్నాను" అడిగాడు.

"శ్రీరామా! విను... మహాశివుడు ఉమాదేవిని వివాహం చేసుకున్నాడు. అతిలోక సౌందర్యానికి ఆ మహాశివుడు ఒక్కక్షణమైనా ఆగక ఆమెతో నూరుసంవత్సరాల పాటు మోహపరవశంతో మైమరిచిపోయాడు.... అయిననూ వారికి సంతానం కలగలేదు.

"పుత్రుని కోసం దంపతులు నిమగ్నమైయున్నారు. కొంతకాలం గడిచింది. ఏ క్షణమైనా ఉమకి గర్భధారణము అయ్యేలా వుంది.

"ఇది తెలిసి దేవతలు భయకంపితులయ్యారు.... గరళకంఠునికి పుట్టిన వాడు ఏ ఉపద్రవాలు తెస్తాడోనని మహేశ్వరుడిని వేడుకున్నారు సమస్త దేవాదిదేవతలు.

"దేవాదిదేవా.... శితికంఠునికి నమస్కారములు... తమరి ఉగ్రరూపానికీ, తేజస్సుకూ జన్మించే పుత్రుణ్ణి లోకాలు భరించలేవు. దయతో ఆలకించండి. ముల్లోకాలు శలభంలా మాడిపోయే ఉపద్రవాన్నుంచి రక్షించండి"

వారి కోరికను మన్నించి పరమ శివుడు తన రేతస్సుని భూమిపైకి వదిలాడు.

హిమవంతుని పుత్రిక అగ్రహావేశురాలైంది. తనని మాతృమూర్తిని కాకుండా చేసిన దేవతలని శపించింది.

“నాకు సంతానం లేకుండా చేసిన మీకూ సంతానం కలగదు. మీ భార్యలూ గొడ్రాండ్లు అవుతారు...” అని అంతటితో ఆగక... భూమిని ఆగ్రహావేశాలతో చూస్తూ...“వసుంధరా... నీవు కూడా రకరకాల భూములకూ, రకరకాల రాజులకీ భార్యవవు...” అని శపించింది.

భూమిపై పడ్డ శివుడి రేతస్సు భూమండలం అంతా ప్రవహించటం ప్రారంభించింది. దేవతలంతా అగ్నిదేవుడితో, వాయుదేవునితో కలిసి శివతేజాన్ని దహించమని వేడుకున్నారు.

అగ్నిదేవుడు దహించి వేసిన తేజస్సు శ్వేతపర్వతమైంది. ఆ పర్వతమంతా రెల్లు పెరిగింది. సూర్యభగవానుడి తేజస్సుతో కార్తికేయుడు జన్మించాడు. జరిగినదానికి దేవతలు తలలొంచుకున్నారు.

పరమశివుడు పడమటి దిక్కుకి వెళ్ళాడు. శైలసుత హిమశిఖరంపై తపస్సు ప్రారంభించింది.”

“శ్రీరామా! ఇక పార్వతీదేవి గూర్చి చెబుతాను. గంగ సంబంధంతో కుమారస్వామి జన్మించిన విధం తెలియచేస్తాను. నీ తమ్ముడూ, మునులతో పాటు నీవూ విను....”

## కుమారసంభవం

పడమటి దిక్కుకు వెళ్ళి శిఖరంపై తపస్సు చేస్తున్న ఉమాదేవితో పాటు తానూ తపస్సు ప్రారంభించాడు శివుడు. ఆ సమయంలో దేవతలకు సేనాధిపతి కావలిసి వచ్చాడు.

అంతా లోకాల తాత బ్రహ్మ వద్దకు వెళ్ళారు. అగ్నీ, ఇంద్రుడూ, దేవతలూ అంతా బ్రహ్మదేవునకు నమస్కరించి - “బ్రహ్మదేవా! నీవే మాకు పరమగతివి... దేవాధిదేవా.. మాకు సర్వసేనానిగా ఇదివరకు రుద్రుడను నిర్ణయించావు. ఇప్పుడాయన హిమవంత పుత్రితో తపోనిష్ఠలో వున్నాడు. మాకెవరు దిక్కు..... మీరే శెలవివ్వండి”

బ్రహ్మదేవుడు శాంతంగా దేవతలతో అన్నాడు.

“ఉమాదేవి శాపం వల్ల మీ మీ భార్యలకు సంతానం కలగదు. బ్రహ్మాస్త్రానికీ, ఆమె శాపానికీ తిరుగులేదు. అదిగో స్వర్గంలో తిరుగుతున్న





గంగ... ఉమాదేవి తండ్రి హిమవంతుడి పెద్దకుమార్తె. ఆమె అందరి పాపాలను హరించగలదు.... గంగాదేవి తన గర్భంలో అగ్నిహోత్రుడి కొడుకుని కనగలదు. అలా పుట్టిన ఆ వీరుడే దేవతలకి సేనాని అవుతాడు. దేవ సేనాధిపతిగా శత్రు భీకర యుద్ధంలో విజయాన్ని మాత్రమే చవిచూస్తాడు. అగ్ని ప్రసాదించిన గర్భం గంగ భరిస్తుంది. ఉమాదేవీ సంతసిస్తుంది”

బ్రహ్మ మాటలకు దేవతలు సంబరపడ్డారు. ఆయన్ని స్తుతించారు. ఆపై కైలాస పర్వతానికి వెళ్ళారు. అగ్నిహోత్రుడితో-

“ఓ మహాతేజా! దైవకార్యార్థమై వచ్చాం... నీలో వున్న శివతేజాన్ని గంగ గర్భంలో ప్రవేశపెట్టు”

దేవతల విన్నవింపులకు అగ్ని ఆనందంతో అంగీకరించాడు. దేవతలు గంగ వద్దకు వెళ్ళి దైవకార్యం గూర్చి చెప్పారు. గంగ వారి మాటలను మన్నించి అందమైన స్త్రీ రూపం ధరించింది. ఆమె సౌందర్యానికి అగ్ని పరవశుడయ్యాడు. గంగాదేవి సర్వావయాలలో అగ్నిహోత్రుడు వ్యాపించాడు. శివతేజాన్ని ఆమెలో వదిలాడు.

గంగాదేవిలో శివతేజస్సు కలిసింది. ఆమె దేహం దహించుకుపోవటం ప్రారంభమయ్యింది. బాధతో విలవిలలాడిపోయింది.

“ఓ అగ్నిహోత్రా! గర్భము పెరిగే కొద్దీ బాధను భరించలేకపోతున్నాను. ఈ వ్యధనుంచి విముక్తి ప్రసాదించు”

“అయితే గర్భాన్ని హిమాలయ పర్వత పాదము వద్ద దించుకో” చెప్పాడు అగ్నిహోత్రుడు. అగ్నిదేవుడు చెప్పిన విధంగా గర్భాన్ని దించుకుంది.

“గంగ దించిన రేతస్సు భూమి మీద పడి స్వచ్ఛమైన కాచిన బంగారమూ, వెండీ పుట్టుకువచ్చింది. క్షారము నుండి రాగీ, ఇనుమూ పుట్టాయి. మకిలిలోంచి తగరమూ, సత్తూ పుట్టాయి. లోకానికి లోహాలన్నీ జన్మించాయి. చుట్టూ ప్రాంతం గడ్డీ, చెట్లూ, చేమలూ బంగారుమయమయ్యాయి.

“చివరగా ఆ గర్భస్రావము నుంచి అందమైన బిడ్డ పుట్టాడు. ఆ బిడ్డకు పాలు ఇవ్వటానికి దేవతలంతా ఆరుగురు కృత్తికలను పెట్టారు.

“అయితే కృత్తికలు ఆ బిడ్డను తమ బిడ్డగా గుర్తించాలని వేడుకున్నారు. అందులకు దేవతలు సరేనని... ఈ పిల్లవాడు ముల్లోకాలకి ప్రసిద్ధుడు... కార్తికేయుడిగా జగత్ విఖ్యాతి చెందుతాడని చెప్పారు.

"ఆ ఆరుగురి స్తనాలలో పాలు చేరాయి. ఆ శిశువు ఆరుముఖాలతో ఆ ఆరుగురి స్తనాలలో పాలని త్రాగాడు. ఒకరోజు పాలు త్రాగినంతనే సుకుమారమైన శరీరంతో మహావీరుడయ్యాడు. రాక్షససేనలను అవలీలగా జయించాడు.

"కృత్తికలు పాలిచ్చి పెంచినందున కార్తికేయుడనే నామధేయంతో వెలిగిపోయాడు. అగ్నిహోత్రుడు దేవసేనకు కార్తికేయుడిని అధిపతిని చేశాడు."

"ఓ శ్రీరామా! కుమారస్వామి పుట్టిన పుణ్యగాథతో పాటు స్వర్గంలో జరిగిన గంగ పుణ్యగాథా చెప్పాను"

## సగర చక్రవర్తి సంతతి

కుమారస్వామి పుట్టుక చెప్పిన విశ్వామిత్రుడు మళ్ళీ ప్రారంభించాడు. శ్రీరామలక్ష్మణులంతా శ్రద్ధగా భక్తిగా వినసాగారు.

ఒకప్పుడు అయోధ్యలో సగరుడని ఒకానొక మహారాజు వుండేవాడు. వీరుడతడు. ధార్మికుడు కూడా... ఆయనకు విదర్భరాజు  కుమార్తె కేశిని పెద్ద భార్య... ఆవిడ సత్యవాది.

రెండో భార్య పేరు సుమతి. కశ్యపుడి  కూతురామె... గరుత్మంతుడి సోదరి... సుగుణాల సౌందర్యవతి.

ఇద్దరి భార్యలతోనూ సగరుడు హిమాలయ పర్వతం వద్ద తపస్సు ప్రారంభించాడు.

భృగుమహర్షి నివశించే ప్రాంతమది. సంతానం కోసం చేస్తున్న వారి తపస్సు ఫలించింది.

భృగుమహర్షి సగరునికి ప్రత్యక్షమైయ్యాడు.

"అయోధ్యా నగర రాజు సగరా.... నీ తపస్సుకి మెచ్చాను. నీకు సుఖమిచ్చే అనేక బిడ్డలు పుడతారు.

"నీ భార్యామణులలో ఒకరికి నీ వంశ ప్రతిష్ఠను పెంచే అసమాన వీరుడూ, శూరుడూ పుడతాడు. ఇంకో భార్యకు అరవై వేలమంది పుత్రులు జన్మిస్తారు."

సగరుడూ, అతని భార్యలూ సంతోషంతో ఉప్పొంగిపోయారు. భృగుమహర్షిని వినయ, విధేయతలతో స్తోత్రం చేశారు.

అంత ఆ నారీమణులు "ఓ మహర్షీ! మాలో ఎవరికి పుత్రుడు పుడతాడు... అరవై వేలమంది ఎవరికి జన్మిస్తారో సెలవివ్వవలసింది" అడిగారు.





"మీ సందేహం తప్పక తీరుస్తాను... వంశోద్ధారకుడూ, కీర్తివంతుడూ ఎవరికి కావాలో... అరవైవేల మంది పుత్రులు ఎవరికి కావాలో నిర్ణయించుకునే స్వేచ్ఛ మీకే ఇస్తున్నాను"

ఇద్దరు భార్యలూ వెనువెంటనే తమకోరికను తెలియచేశారు. ఒక్క కొడుకే కావాలంది కేశిని. అరవైవేలమంది మగసంతానం తనకే కావలంది సుమతి.

భృగుమహర్షి ఆశీర్వాదం తీసుకుని తిరిగి నగరం చేరాడు సగరుడు. రాణులిద్దరూ గర్భం ధరించారు. తొమ్మిది నెలలూ గడిచాయి. ప్రసవించారిద్దరు.

కేశినికి బిడ్డ పుట్టాడు. ఆ బిడ్డకు అసమంజుడని నామకరణం చేశారు. రెండో భార్య సుమతికి ఓ సొరకాయవంటి గర్భపిండము పుట్టింది. దాన్ని విరగొట్టగా అందులోంచి అరవై వేలమంది పుత్రులు జన్మించారు. అలా పుట్టిన శిశువులను నేతికుండలలో పెట్టి పెంచారు దాదులు.

అంతా పెరిగి పెద్దయ్యారు. రూపలావణ్యంతో యవ్వనవంతులయ్యారు.

శ్రీరామా! కేశిని పుత్రుడు అసమంజుడు పరమ దుర్మార్గుడయ్యాడు. తమ్ములను నానా రకాలుగా హింసించేవాడు. ప్రజలను అనేక బాధలకు గురిచేసేవాడు.

అయోధ్యా నగరానికే అరిష్టుడయ్యాడు. పసిపిల్లలని కూడా  క్రూరంగా సరయూ నదిలో పడవేసి ఆనందించేవాడు.

సగరుడు కొడుకు అని చూడకుండా అడవులకి వెళ్ళగొట్టాడు.

అసమంజుని పుత్రుడు అంశుమంతుడు. అతను వీరాధివీరుడు. .... అందరితోనూ సఖ్యతగా మసలేవాడు.

అలా ఎంతోకాలాన్ని కాలం తనలో కలిపేసుకుంది.

సగరుడునకు యజ్ఞం చేయ సంకల్పం కలిగింది. వేదవేదాంగాలు తెలిసిన పండితులనూ, ఋత్విజుల్నీ సమకూర్చుకొని యజ్ఞం ఆరంభించాడు. అది కూడా "అశ్వమేథయాగం."

## శ్రీరాముని ఆనందం

విశ్వామిత్రుడు చెప్పగానే శ్రీరాముడు ఆనందభరితుడై "మునివర్యా... మా పూర్వీకులు, అశ్వమేథ యాగం చేసిన విధం తెలుసుకోవలెననే ఉత్సాహంతో నా మనస్సు వేగిరపడుతోంది" అన్నాడు.

"అవశ్యం శ్రీరామా! ఆలకించు..." చెప్పాడు విశ్వామిత్రుడు.

"హిమవంత పర్వతమూ, వింధ్యపర్వతమూ మధ్యనున్న అపూర్వమైన ఆ రెండు కొండల మధ్య సగరుడు అశ్వమేథ యాగం చేయ సంకల్పించాడు....

"శ్రీరామా... యజ్ఞ అశ్వము వెంట సగరడు మనవడు అంశుమంతుణ్ని పంపించాడు.

"ఆ మహావీరుడు యజ్ఞాశ్వము వెంట వెళ్ళాడు. భూప్రదక్షిణము చేసి వచ్చాడు. యజ్ఞం జరుగుతూ వుంది. యజ్ఞతంతులోని ఓ భాగం జరుగుతుండగా దేవతల రాజు దేవేంద్రుడు యజ్ఞ అశ్వాన్ని ఎత్తుకెళ్ళాడు.

"ఋత్విజులూ, వేదపండితులూ ఆ విఘాతాన్ని వెనువెంటనే ఆపాలన్నారు. యజ్ఞగుర్రం లేనిదే యజ్ఞం నిర్విఘ్నంగా పూర్తికాదు.. ఆ దోషాన్ని వెంటనే సరిచేయమన్నారు."

"సగరుడు అరవైవేలమంది పుత్రులని పిలిచాడు.

"యజ్ఞ అశ్వాన్ని వెనువెంటనే తీసుకురావాలి. సముద్రం సరిహద్దుగా భూప్రదేశం యావత్తూ జల్లెడవేయండి. అరవై వేలమంది అరవై వేల ఆమడలని శోధించండి... గుర్రం జాడ తెలిసేదాకా భూమంతా త్రవ్వేయండని" చెప్పాడు.

అంశుమంతుడు యజ్ఞం వద్దే ఉన్నాడు.

తండ్రిమాటతో మొత్తం పుత్రులంతా బైలుదేరారు. తలా ఒకవైపుకి వెళ్ళారు. ప్రతిప్రదేశమూ వెతికారు. గుర్రం జాడ తెలియలేదు.

దానితో వజ్రాయుధాలతోనూ, శూలాలతోనూ భూమిని బద్ధలు చేయటం ప్రారంభించారు.

శ్రీరామా! మీ పూర్వీకులు భూమిని చిద్రం చేస్తూ త్రొవ్వుతుంటే ఓ విచిత్ర ధ్వని వచ్చింది.

వారు చేసిన పనికి నాగులూ, భూమిక్రింద నివశించే రాక్షసులూ హతం అయ్యారు.

దానితో దేవతలంతా దేవాదిదేవుడు బ్రహ్మవద్దకు వెళ్ళి మొర పెట్టుకున్నారు.

"బ్రహ్మదేవా! సగర పుత్రులు భూమినంతా త్రొవ్వేస్తున్నారు. వారి చేష్టలకి భూగర్భంలో నివశిస్తున్న అనేక ధర్మపరులకు హాని జరుగుతుంది. ప్రతివార్నీ పట్టుకొని గుర్రం జాడ గూర్చి అడిగి చెప్పనందుకు, వారిని హతమారుస్తున్నారు."





దేవతలు చెప్పిన దానికి బ్రహ్మ కూడా హతాశుడయ్యాడు. సమస్తభూమండలం శ్రీమహావిష్ణువుది. అతడే భూమాత భూదేవిని భరిస్తున్నాడు.

ఆ మహావిష్ణువు భూమికేం జరిగినా సహించడు. ఆయన కోపాగ్నికి సగరుని పుత్రులు మాడిమసైపోవాల్సిందే.

బ్రహ్మమాటలకి అంతా సంతసించి వెడలిపోయారు. అక్కడ భూమంతా త్రొవ్వినా గుర్రం జాడ తెలియక అంతా దిగులుగా తండ్రి వద్దకు చేరారు.

"తండ్రీ! భూమంతా త్రొవ్వేశాం. సమాధానం చెప్పని దేవతల్నీ, నాగులనీ, కిన్నెరులనీ, దానవులనీ అందరిని చంపేశాం. అయినా జాడ తెలియలేదు... గుర్రమును తస్కరించిన వాడి గూర్చి మాత్రం తెలియడం లేదు".

సగరుడు ఉగ్రుడయ్యాడు.

"వెళ్ళండి... మళ్ళీ వెతకండి... చూడండి... భూమంతా తోడెయ్యండి. యజ్ఞ అశ్వాన్ని తీసుకువెళ్ళిన వాడ్ని పట్టుకోండి"

అరవైవేల మంది తిరిగి భూమిని త్రవ్వటం ప్రారంభించారు. అలా భుమిని తొవ్వుకుంటూ లోనికి చొచ్చుకొని పోయారు. ఒక మహాకొండలాంటి దిగ్గజాన్ని చూశారు. కొండలతోనూ, అడవులతోనూ వున్న భూమండలాన్ని తూర్పు వైపు మోస్తుంది విరూపాక్షం. అది తల విదిల్చిందో భయంకర భూకంపం వస్తుంది.

సగర పుత్రులు దానికి నమస్కరించి దక్షిణ దిక్కుకు వెళ్ళారు. అక్కడ్నించి త్రవ్వటం ప్రారంభించారు. గుర్రం జాడ తెలియక పోగా 'మహాపద్మము' అనే దిగ్గజాన్ని చూశారు.

ఆ మహా పర్వతానికి నమస్కరించి పడమటి దిక్కుకు వెళ్ళి తిరిగి త్రవ్వటం ప్రారంభించారు. వారు అక్కడ సౌమవనము అనే దిగ్గజాన్ని చూశారు. దానికి నమస్కరించి ఉత్తర దిక్కుకు వెళ్ళి హిమాలయ పర్వత ప్రదేశాన్ని తవ్వుకుంటూ ముందుకు సాగారు.

అక్కడ వారు భద్రము అనే దిగ్గజాన్ని చూసి దానికి భక్తిగా ప్రదక్షిణం చేశారు. గుర్రం జాడమాత్రం లేదు.

వారికి సహనం నశించింది... మహాబలవంతులైన వారు ఈశాన్య దిక్కుగా ప్రారంభించి త్రవ్వారు.

అక్కడ కపిల రూపంలో మహామునిగా ఉన్న శ్రీవిష్ణుమూర్తినీ, దగ్గరిలోనే గరికలు మేస్తున్న యజ్ఞ అశ్వాన్నీ చూశారు.

సగర పుత్రులు ఆనందంతో కేరింతలు కొట్టారు.

ఆ కపిల మహర్షే గుర్రాన్ని అపహరించాడని భావించారు. క్రోధంతోనూ, ఆవేశంతోనూ వారు ఊగిపోయారు. మూకుమ్మడిగా ఆయన మీద పడ్డారు. ఆయుధాలకి పని చెప్పారు.

శ్రీరామా! అప్పుడు కపిలమునికి కోపం వచ్చింది. కపిలుడు హుంకారం చేశాడు... శ్రీరామా! ఏం చెప్పను... ఆ కపిలుడి హుంకారానికి ఆ అరవై వేలమంది భగ్గున మండి బూడిదైపోయారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

శ్రీరామచంద్రా! సగర చక్రవర్తికి ఆందోళన కలిగింది. మనవడు అంశుమంతుడిని పిలిచాడు.

"నీ పినతండ్రుల జాడ తెలియరాలేదు. నాయనా మహావీరుడైన నీవు నీ శూర పరాక్రమముతో, అస్త్రవిద్యా నైపుణ్యాలతో నీ పిన తండ్రులనూ, యజ్ఞ అశ్వాన్నీ తీసుకురావల్సిందని" చెప్పాడు.

"భూగర్భంలో ఎన్నో వందల ప్రాణికోటిలున్నాయి. అందు మహా బలవంతులున్నారు. మహాఖడ్గమూ, కార్ముకమూ తీసుకొనిపో.

"శరణన్నవారికి హాని చేయకు, అడ్డు తగిలిన వారిని విడిచి పెట్టక హతమార్చుము. నీవు మాత్రమే నా చేత యజ్ఞ సమాప్తి చేయించగలవని నా విశ్వాసం"

అంత అంశుమంతుడు కార్ముకమూ, ఖడ్గమూ తీసుకొని పినతండ్రులు త్రొవ్వుకుంటూ వెళ్ళిన వైపు వెళ్ళాడు.

పినతండ్రులకు కనిపించిన దిగ్గజము అంశుమంతునకు కనిపించింది. దానికి నమస్కరించి క్షేమ సమాచారములనడిగి, తన పినతండ్రుల గూర్చి తెలియ చెప్పమని అడిగాడు.

"అంశుమంతుడా! నీకు శుభం కలుగుతుంది. మీ యజ్ఞ అశ్వాన్ని నీవు తీసుకెళ్ళగలవు. మీ పినతండ్రుల దారిలోనే ప్రయాణించుము"

అంశుమంతుడు మిగతా మూడు దిగ్గజాలను తన పినతండ్రుల గూర్చీ, యజ్ఞ అశ్వము గూర్చీ అడిగాడు.

శ్రీరామా నాలుగు దిక్కులనూ మోస్తున్న దిగ్గజాలు చెప్పిన ప్రకారం వెళ్ళిన అంశుమంతుడు ఈశాన్య భూగర్భంలోకి ప్రవేశించాడు.





పినతండ్రులంతా భస్మరాసులై ఉండటం చూసి చింతించాడు. దూరాన అశ్వము అటూ, ఇటూ తిరుగుతోంది.

తక్షణం తాను చెయ్యవలసిన కార్యం తన పినతండ్రులకు జలతర్పణము చేయాలి. ఆ ప్రాంతంలో ఎక్కడా నీటి చుక్క కానరాలేదు.

జలాశయం కోసం దృష్టి సారించి ప్రయత్నించాడు. మహావేగవంతుడైన గరుత్మంతుడు కానవచ్చాడు.

గాలివంటి వేగవంతుడైన గరుత్మంతుడు "విచారించకు అంశుమంతా. నీ పినతండ్రుల మరణం లోకసమ్మతమైంది. అట్టి వారికి మామూలు జలాలతో తర్పణం చేయరాదు.

"మహాపావని గంగా జలమే అర్హతము. ఓ అంశుమంతా... నీవు వీరుడవు..... శూరుడవు. ప్రథమ కర్తవ్యం యజ్ఞ అశ్వాన్ని మీ తాత కడకు చేర్చు" చెప్పాడు.

పినతండ్రుల ఉదక క్రియలు పక్కన పెట్టి గుర్రంతో సగరుడిని చేరాడు. జరిగినదంతా బాధాపూరిత స్వరంతో చెప్పాడు.

సగరుడు ముందు యజ్ఞం పూర్తి చేశాడు. అరవైవేలమంది ఉదక క్రియార్థం గంగని భూమిపైకి తెప్పించే ఆలోచన చేశాడు. ఆ విషయంలో సగరుడు కృతకృత్యుడు కాలేదు...

శ్రీరామా... అలా అది నెరవేర్చకుండానే సగరుడు తనువు చాలించాడు.

## భగీరథుడు

శ్రీరామా! సగర చక్రవర్తి పరమపదించగానే మంత్రివర్గమంతా అంశుమంతుణ్ణి చక్రవర్తిని చేశారు. ధర్మనిరతితో పరిపాలన చేశాడు.

అంశుమంతుని పుత్రుడు దిలీపుడు. జగద్ప్రసిద్ధుడైన కుమారునకు రాజ్యాన్ని అప్పచెప్పి, గంగని భూమిపైకి తేవటానికి అంశుమంతుడు హిమపర్వతము చేరాడు.

అక్కడ ఓ శిఖరంపై తపస్సు ప్రారంభించాడు. ముప్పయి రెండు సంవత్సరాలు ఘోర తపస్సు చేశాడు. కానీ... గంగని భూమిపైకి తేలేకపోయాడు. స్వర్గస్తుడయ్యాడు.

అది తెలసిన దిలీపుడు అమితంగా వ్యథ చెందాడు. తన పూర్వీకుల కోరికను తాను ఎలా తీర్చగలడు... గంగను భూమిపైకి ఎలా తేవాలి? జల

తర్పణాదులను తన వారికి తాను ఎలా చెయ్యాలి? ధర్మచింతనతో... యజ్ఞ యాగాదులు చేశాడు. ఆ దిగులుతోనే మంచాన పడ్డాడు.

దిలీపుడి కుమారుడు భగీరథుడు. అతనికి రాజ్యాధికారం అప్పచెప్పి దిలీపుడూ తన ముత్తాతల వద్దకే వెళ్ళాడు.

శ్రీరామా! భగీరథుడు రాజ ఋషి, తేజోసంపన్నుడు, ధార్మికుడు... అయితే సంతానం లేదు. అందుకొరకూ, తన పూర్వీకుల కొరకు తపస్సు మార్గం ఎంచుకున్నాడు.

పరిపాలనను జ్ఞాన మంత్రులకి అప్పచెప్పి గోకర్ణ క్షేత్రానికి వెళ్లి నిండు వేసవిలో పంచాగ్నుల మధ్య చేతులు పైకెత్తి నిల్చుని నెలకొక్కసారే భోజనము చేస్తూ తపస్సు చేశాడు. భగీరథుని తపస్సుకి బ్రహ్మ కదిలివచ్చాడు.

"భగీరథా! ఏం కావాలో కోరుకో. నీ తపస్సుకి మెచ్చాను" అడిగాడు.

భగీరథుడు ఆనందభరితుడయ్యాడు. బ్రహ్మదేవుడని పలుస్తోత్రాలతో స్తుతించి - "బ్రహ్మదేవా! నా పూర్వీకులకు ఉదకక్రియలు చేయుటకై పరమ పావని గంగను భూమిపైకి తేవాలి. నా ముత్తాతల భస్మరాసులు ఆ గంగాజలంతో తడిస్తే కానీ వారికి స్వర్గం లభించదు... దానితో పాటు ఇక్ష్వాకు వంశం నిస్సంతి కాకుండా రెండోవరం ప్రసాదించు" అడిగాడు భగీరథుడు.

"మహారథా! నీ కోరిక తీర్చు శక్తి నాకు లేదు. అందులకు శక్తివంతుడు శివుడొక్కడే. ఆయననే ప్రార్థించవలెను.... గంగ హిమవంతుడి పెద్ద కూతురు. ఆ నది భూమిపైకి పడితే భూమాత తట్టుకోలేదు. నీవు రాజువి, భూపాలకుడివి... భూదేవి మేలు కూడా నీ ధర్మంలో భాగం... ఇక రెండో కోరిక... నీకు సుపుత్రుడు జన్మిస్తాడు. నీకు శుభం కలుగుతుంది" చెప్పి -

గంగతో భగీరథుడి కోరిక చెప్పి "ఓ గంగా! ఈ పుణ్యవంతుడు, తపశ్శాలి భగీరథుడి కోరికను మన్నించుము" చెప్పాడు.

## గంగావతరణం

శ్రీరామా... అట్లు భగీరథునికి మంగళ, మనోహరంగా చెప్పి బ్రహ్మ తన లోకానికి వెళ్ళాడు.

భగీరథుడు ఆ వెనువెంటనే హరదేవుడు... మహాశివుడు... సర్వలోక పూజితుడు... అయిన శివుడు గూర్చి తపస్సు ప్రారంభించాడు. సంవత్సరం గడిచింది.





కాలిబొటన వేలు భూమిపై ఆనించి చేసిన తపస్సుకు కైలాసనాథుడు ప్రత్యక్షమైనాడు.

"భగీరథా! అకుంఠిత దీక్షతో నీవు చేసిన తపస్సుకు మెచ్చాను. నీ కోర్కె తీరుస్తాను. గంగానదిని నా శిరస్సుపై ధరిస్తాను"

శివ వాక్కు వెలువడినంతనే గంగ ఉవ్వెత్తున లేచింది. మహదాకారముతో, అత్యంత వేగంగా వచ్చి శివుని తలపై వాలింది.

"శ్రీ రామచంద్రా! గంగను భరించటం ఎవరి వల్ల కాదు, తలపై వాలిన గంగ మహాశివుడ్ని తనతో పాటు పాతాళానికి తీసుకెళ్ళాలనుకుంది. త్రినేత్రుడైన శివుడు గంగ ఆంతర్యము గ్రహించాడు. ఆమె అహంకారానికీ, గర్వానికీ శివదేవుడు కళ్ళెర్ర చేశాడు."

శివ శిరస్సు జడలలో గంగ ప్రవేశించింది. ఆ మహాదేవుడి జటామండలం హిమాలయ పర్వత గుహలంత అయ్యాయి.

గంగ మొత్తం జటామండలంలో వుండిపోయింది. అందునుంచి రాలేక అక్కడ తిరుగుతూ వుండిపోయింది. భూమన్నది తెలీక అక్కడ చాలాకాలం గంగ వుండిపోయింది.

భగీరథుడు తన ప్రయత్నం మానలేదు. మహాశివుడిని స్తోత్రించాడు. ఆవశ్యంగా గంగ భూమి మీదకు రావాలని కోరాడు.

భక్తుని కోరికపై తన జటామండలంలో ఉన్న గంగను, బిందు సరోవరంలోకి వదిలిపెట్టాడు శివుడు. మహాధ్వనితో ప్రవహించిన గంగతో పాటు తాబేళ్ళు, తిమింగలాలూ, చేపలూ, మొసళ్ళ వంటి ఎన్నో నీటి జంతువులు భూమి మీదకు వచ్చాయి. ఆ సరోవరం నుంచి గంగ ఏడు పాయలైంది. అపూర్వమైన ఆ అద్భుతాన్ని దేవతలంతా చిత్రంగా చూశారు.

హ్లాదినీ, నలినీ, పావనీ అనే పేర్ల పాయలు తూర్పు దిక్కుగా సాగాయి. సుచక్షువూ, సీతా, సింధువులు మంగళకరంగా పడమర వైపు సాగాయి.

ఏడోపాయ భగీరథుని వైపు సాగింది.

మహాతేజశాలి భగీరథుడైన ఆ రాజర్షి రథమెక్కి ముందుకు సాగాడు. ఆయన్ని అనుసరించింది గంగ. భగీరథుడు ఎటు వెళితే అటు అనుసరించింది గంగ.

అద్భుతాలకే అద్భుతమైన ఆ దృశ్యాన్ని వీక్షించేందుకు తరలివచ్చిన దేవతలతో... ఆకాశం నిండిపోయింది.

భగీరథుని వెంట పరుగులు పెట్టింది గంగ. ఓ చోట వేగంగా, మరోచోట సరళంగా... ఇంకో చోట ఎత్తులో, మరోచోట పల్లంలో మరోచోట వయ్యారంగా, మరోచోట తుళ్ళుతూ... మరో చోట పెళ్ళికూతురి నడకలతో భగీరథుడు వెళ్ళినంత దూరాన ముందుకు సాగింది.

శివశిరస్సు నుంచి దూకిన గంగ నిర్మలమైంది. భూమిపై ప్రవహించ సాగింది. దేవతలంతా మహాపావని గంగానదిలో స్నానం చేశారు. తెలిసి చేసిన, తెలియక చేసిన వారి పాపాలను గంగానది పోగొట్టింది.

అనేకమైన పొరపాట్లతో శాపగ్రస్తులైనవారూ, గంధర్వులూ, యక్షులూ, సాధుపుంగవులూ, ఋషులూ... ఇలా ఎందరో గంగని ముట్టుకున్నారు.

పాపపంకిలం పూర్తి అయి వారి వారి లోకాలకి తరలి వెళ్ళారు.

భగీరథుడు దివ్య రథమెక్కి వెళుతూనే వున్నాడు. గంగ అనుసరిస్తూనే వుంది. నీటిలోని జలచరాలు సైతం, గంగతో పాటు ఆ రాజర్షిని అనుసరిస్తూనే వున్నాయి.

అద్భుత కాంతులతో జన్మించిన గంగను చూసి భూమిపై ప్రజలు ఆనందపడ్డారు.

శ్రీరామా! అలా రథమెక్కి వెళుతున్న భగీరథుడు హఠాత్తుగా ఓ చోట ఆగాడు. ఆ ఆగిన ప్రదేశం జహ్ను మహర్షి ఆశ్రమం.... ఆయన యజ్ఞం చేస్తున్నాడు.

ఊహించని విధంగా భగీరథుడు ఆగేసరికి, వేగంతో అనుసరిస్తున్న గంగ ఆగలేకపోయింది. జహ్ను మహర్షి ఆశ్రమాన్ని అమిత వేగంతో ముంచి వేసింది.

ఆ మహర్షికి మండిపోయింది. యజ్ఞదీక్షలో వున్న ఆయన గంగని కోపంగా చూసి నోరుతెరిచాడు. అంతే ... సమస్త గంగానదిని అసాంతమూ త్రాగేశాడు.

భగీరథుడు, గంగను అనుసరిస్తున్న దేవతలు... జహ్ను మహర్షిని వేడుకున్నారు. ఋషులు వినమ్రతతో ప్రార్థించారు.

గంగని అతని కూతురిగా కొనియాడారు. లోక కళ్యాణం కోసం గంగను వదలమన్నారు...జహ్నువు శాంతించి, తన చెవి ద్వారా గంగను వదిలిపెట్టాడు.

అలా గంగ జహ్నుసుత అయింది. జాహ్నవి అని పిలిపించుకుంది.





భగీరథుని వెంట మరల పరుగులు పెట్టింది. ఆయన సముద్రంలోకి వెళ్ళాడు. గంగ అనుసరించింది.... సముద్రం లోంచి భగీరథుడు పాతాళంలోకి వెళ్ళాడు.

పాతాళంలోని తన ముత్తాతల భస్మరాసుల వద్దకు చేరాడు. గంగ ఆ భస్మరాసుల మీదిగా ప్రవహించింది.

సగర పుత్రులంతా స్వర్గతులు అయ్యారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

బ్రహ్మ భగీరథుడి ముందు ప్రత్యక్షమైనాడు.

"రాజర్షీ.... నీ కోర్కె తీరినది. నీ పూర్వీకులు స్వర్గమున సముద్ర జలమున్నంత కాలం స్వర్గసుఖములు అనుభవిస్తారు. గంగను నేలకు తెచ్చిన నీవు గంగకు తండ్రివి.

గంగను బాగీరథీ నామధేయంతో సర్వులు సంబోధిస్తారు. పరమ పావని గంగ స్వర్గంలోనూ, భూమిపైనా, పాతాళంలోనూ ప్రవహిస్తుంది కాన త్రిపథక అయినది.

భగీరథా.... ఈ గంగా జలంతో నీ తాతలందరికి తర్పణములు విడువుము...

మీ పూర్వీకుడు సగర చక్రవర్తీ, అంశుమంతుడూ, నీ తండ్రి దిలీప చక్రవర్తితో పాటు ఎంతో మంది పరాక్రమవంతులూ, ధర్మవాదులూ, సత్యవాదులంతా గంగను భూమిపైకి తేవటానికి ప్రయత్నించినారు. వారు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. నీ ప్రయత్నం సఫలం అయింది. యశస్వినిగా చిరకాలం వర్ధిల్లు.

దేవదేవుడు భగీరథునికి మంగళకర హితములెన్నో చెప్పి మాయమైనాడు.

భగీరథుడు బ్రహ్మ ప్రభోదించినట్టూ, తన హితము ప్రకారము గంగా జలంతో ముత్తాతలందరికీ తర్పణం వదిలాడు.

అన్నీ కార్యములు సంతృప్తిగా పూర్తి చేసి అయోధ్య చేరాడు. సకల ధర్మాలతోనూ, సకల సంపదలతోనూ భగీరథుడి పాలనలో ప్రజలు సంతృప్తిగా జీవించారు.

"శ్రీరామా... విన్నావు కదా... గంగ వృత్తాంతమంతా చెప్పి వున్నాను. ఈ గంగావతరణ గాథ మరొకరికి చెప్పినా, గానం చేసినా అతన్ని లక్ష్మీ దేవి

కటాక్షిస్తుంది. అపార కీర్తి కలుగుతుంది. ఆయుష్షు వృద్ధి అవుతుంది. పుత్ర సంతానం కలుగుతుంది. వారి వారి కోర్కెలు నెరవేరుతాయి.

"శ్రీరామా.... ఇప్పటికే కాలాతీతమౌతోంది. అదిగో చూడు సంధ్యాకాలం మించిపోతోంది....." చెప్పి మహా ఋషిపుంగవుడూ, బ్రహ్మర్షి విశ్వామిత్ర మహర్షి లేచాడు.

## విశాల పట్టణం

విశ్వామిత్రుడు చెప్పిన గంగ వృత్తాంతమంతా విన్న రామలక్ష్మణులు విస్మితులై పోయారు. గంగావతారము అత్యంత అద్భుతంగా ఉందని, అది విన్న తాము అంతా పరమ పావనులైనామని సంతసించారు.

విశ్వామిత్రుడ్ని సర్వవిధాలా స్తుతించి, ఆ రాత్రి అచటనే బస చేశారు. తెల్లవారింది. ఆహ్నికాలూ పూర్తి చేశారు. రామలక్ష్మణులు మహర్షికి వందనము చేశారు.

"మునీంద్రా... తప్పక వినవల్సిన పుణ్య గాథను చెప్పారు. రాత్రంతా క్షణములా గడిచింది. మన ప్రయాణానికి నావ సర్వ సన్నిద్ధంగా వుంది. మనం బైలు దేరటమే తరువాయి" చెప్పాడు శ్రీరాముడు.

రామలక్ష్మణులతో పాటు మిగతా మహర్షులంతా నావ ఎక్కి గంగానది దాటి ఉత్తర గట్టుకు తరలి వెళ్ళారు. అక్కడ చక్కటి ప్రకృతిని చూసి అన్నదమ్ములు మైమరిచిపోయారు.

కొంతదూరం ప్రయాణించిన తర్వాత విశాల పట్టణం కనిపించింది. "స్వామీ... కనిపిస్తున్న ఆ పట్టణం దేవేంద్రపురిని తలపిస్తోంది. దివ్యమైన స్వర్గంలా అగుపిస్తున్న ఈ పట్టణ పూర్వ చరిత్రను తెలుసుకోవాలని వుంది" అడిగాడు శ్రీరాముడు.

"శ్రీరామా! తప్పక వినవలిసిన గాథ ఇది... ఈ విశాల పూర్వ వృత్తాంతము చెబుతాను. విను. కృతయుగంలో దితి పుత్రులు మహాబలశాలులు. అదితి పుత్రులు అంతకు సరిసమానమైన ధైర్యవంతులూ, వీర్యవంతులూ. వాళ్ళందరికి ఒక ఆలోచన కలిగింది.

అనారోగ్యమూ, ముసలితనమూ, చావూ లేకుండా ఏం చెయ్యాలా అని ఎంతో ఆలోచించారు. చివరకు అంతా కలిసి పాలకడలి చిలికి అమృతాన్ని సంపాదించాలనుకున్నారు.





దితులూ, అదితులూ కలిసి మహా పర్వత రాజమైన మందర పర్వతాన్ని కవ్వంగానూ, వాసుకీ సర్పాన్ని కవ్వం త్రాడుగా చేసి చిలకసాగారు.

పాలసముద్రాన్ని వేల సంవత్సరాలు చిలికారు. ఆ చిలికనప్పుడు వాసుకీ సర్పం నుంచి భయంకరమైన విషం అన్ని ముఖాల్లోంచి వచ్చింది. అంత 'హాలాహలమను' భయంకర విషం ఉద్భవించింది.

ఆ విషమునకూ, దాని ప్రభావమునకూ... ఆ లోకమూ, ఈ లోకమూ అని కాకుండా సమస్తం దగ్ధమయ్యేలా బైటికి వచ్చింది.

ఈ సర్వ జగత్తును కాపాడటానికి మహేశ్వరుడూ, వెండి కొండ ప్రభువూ అయిన పరమశివుడిని శరణువేడారు.

శ్రీమహావిష్ణువూ వేంచేశారు...

"మహాశివా! దేవతల ప్రభువు నీవు... ఈ హాలాహలమును భరించువారూ, స్వీకరించువారూ ఎవరూ లేరు. సర్వలోకసంరక్షణ కొరకు తమరు స్వీకరించవలెను"

శ్రీ మహావిష్ణువు శంఖ చక్రధారి అయి 'మహాశివుడిని అగ్ర నైవేద్యము స్వీకరించవలెనని' అడిగాడు.

దేవతలూ, మహావిష్ణువూ చెప్పిన ప్రకారం హాలాహలాన్ని స్వీకరించాడు మహేశ్వరుడు... విషాన్ని గరళంలోనే వుంచుకుని నీలకంఠేశ్వరుడయ్యాడు.

దేవదానవులు తిరిగి పాలసముద్రాన్ని చిలకసాగారు... ఈసారి మందర పర్వతము పాతాళానికి దిగిపోయింది.

దానితో అంతా శ్రీమహావిష్ణువును అర్థించారు.

"పురుషోత్తమా... మహాబాహూ! ఈ సమస్యను నీవే మోయవలెను. మాకు నీవు తప్ప దిక్కు లేదు. ఈ మహా పర్వతాన్ని మోయగల వారెవ్వరునూ లేరు. మమ్మల్ని రక్షించవలయును"

అభయహస్తంతో వారిని ఆశీర్వదించి శ్రీమహావిష్ణువు కూర్మ రూపాన్ని ఎత్తాడు. పాలసముద్రం దిగువకు పోయి మందర పర్వతపు క్రిందకి చేరి పర్వతాన్ని పైకి ఎత్తాడు.

మళ్ళీ పాలసముద్రాన్ని చిలకటం ప్రారంభించారు. కొంత సేపటికి జ్యేష్ఠాదేవి వచ్చింది. ఆపై చల్లని వెలుగునిచ్చే నిండు చంద్రుడు ఉదయించాడు. మహా హాలాహలాన్ని గరళంలో వుంచుకున్న శివునకు స్వాంతన కొరకు

చంద్రుడిని మహాశివుడు స్వీకరించవలసినదిగా కోరాడు మహావిష్ణువు. అంతలోనే మహోన్నతమైన తరంగాల మధ్య శ్రీమహాలక్ష్మీదేవి ఉద్భవించింది.

ఆమెతో పాటు దివ్యాశ్వము, మణిరత్నమైన కౌస్తుభరత్నమూ ఉదయించాయి. సూర్య తేజస్సుతో వున్న కౌస్తుభరత్నాన్నీ, ముల్లోకాలు నమస్కరించే శ్రీమహాలక్ష్మీదేవినీ మహావిష్ణువు తన కావాసం చేసుకున్నాడు. ఉచ్చైశ్రవంను దేవేంద్రుడు దివ్యవాహనం చేసుకున్నాడు.

దితి, అదితులు చిలుకుతూనే వున్నారు. ఈసారి రసం పుట్టింది. ఆ రసం నుంచి కోట్లాదిమంది అద్భుతమైన అప్సరసలు జన్మించారు. వారితో పాటు పరిచారికలు జన్మించారు.

వివాహం చేసుకోవటానికి దితి అదితులు ఇరువురూ ఇష్టపడలేదు. దానితో వారంతా సానులయ్యారు.

ఆ అతివల తర్వాత సురాది దేవత పుట్టింది. ఈమె వరుణ కన్య. ఈ వారుణీ కన్యను ఎవరు పాణిగ్రహణం చేసుకుంటారు. దితి, అదితి పుత్రులిరువురి లోనూ ప్రశ్న వచ్చింది.

దితి పుత్రులు వరణదేవుడి కూతురిని వద్దన్నారు. అందువల్లే వాళ్ళు అసురులయ్యారు.

అదితి పుత్రులు గ్రహించారు..... వారు సురులయ్యారు..... దేవత లయ్యారు. సురను స్వీకరించటంతో వారి శరీరాలు పులకించాయి. ఆనందపడ్డారంతా.

ఓ శ్రీరామా... ఆ మహాపాలసముద్రం నుంచి కల్పవృక్షము, ఐరావతము, కామధేనువు ఎన్నెన్నో జన్మించాయి.

అలా మహాపాలజలధి మధనం కొనసాగింది. మనోహర రూపంతో ఆహ్లాదం కలిగిస్తూ ఉత్తమమైన అమృతం కూడా బైటికి వచ్చింది.

దానితో దేవదానవుల్లో అలజడి రేగింది. పాలసముద్రం నుంచి జనియించినవన్నీ మీకే ఎక్కువిచ్చామని ఈ అమృతం మాదేనని రాక్షసులన్నారు. దేవతలు మాదే అన్నారు.

దానికోసం అంతవరకూ సఖ్యతగా వున్న అందరూ యుద్ధం చేసుకో సాగారు.

లోకాలన్నీ తల్లడిల్లాయి. ఒకరినొకరు చంపుకున్నారు. ముల్లోకాలూ తల్లడిల్లిపోయాయి.





అప్పుడు శ్రీమహావిష్ణువు అమృతాన్ని మోహినీ రూపంతో ఎత్తుకెళ్ళాడు. అడ్డం వచ్చిన వారిని చెల్లా చెదురు చేశాడు. ఆ పోరాటంలో రాక్షసులను, దేవతలు సంహరించారు.

దితి కుమారులందరినీ ఇంద్రుడు చంపేశాడు. దేవేంద్రుడు అమృతాన్నీ, సర్వలోక రాజ్యాన్నీ సంపాదించి పరిపాలించసాగాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"ఓ రామా! దితి తన పుత్రులు మరణించటంతో అంతులేని వేదనకి గురి అయింది. తన పతి కాశ్యపుణ్ణి సమీపించి....'నా ప్రాణనాథా! నీ పుత్రులు నా పుత్రులను చంపేశారు.

"ఇప్పుడు నేను ఏకాకిని. నీవు తప్ప ఎవరూ లేరు... మహేంద్రుడిని జయించే శక్తి గల మహా వీరాధివీరుడూ, శూరుడూ నాకు పుత్రుడు కావాలి. దాని కోసం ఎంత తపస్సైనా చేస్తాను. ఎన్ని నిష్టలతోనైనా సిద్ధం. నన్ను అనుగ్రహించండి" అని వేడుకుంది.

"కాశ్యపుడు భార్య మనోవ్యధని అవగతం చేసుకున్నాడు. తపస్సు ద్వారానే నీకు శుభం కలుగుతుంది. శుచిగా వుండు. నీవు శుచిగా వుంటే దేవేంద్రుడని సంహరించే కొడుకు పుడతాడు. ముల్లోకాలను పాలిస్తాడు" అని ఆమెని ఓదార్చి ఆశీర్వదించి తపస్సులోకి వెళ్ళిపోయాడు.

భర్త వెళ్ళాక దితి కుశప్లవం అనే ప్రాంతానికి చేరి తపస్సు ప్రారంభించింది.

శ్రీరామా! ఇదంతా దేవేంద్రుడు గమనిస్తున్నాడు. తనను సంహరించడానికి దితి చేస్తున్న ప్రయత్నాన్ని అడ్డుకునేందుకు ఆమె వెనకే వెళ్ళాడు. ఆమె దరిని చేరాడు. ఉపచారాలు చేశాడు.

అగ్నినీ, సమిధులనూ, కందమూల ఫలాలనూ సమర్పించాడు. దితి దేవేంద్రుడిని మెచ్చుకుంది.

ఆమె ప్రసవించే సమయం రానే వచ్చింది...

"దేవేంద్రా! నిన్ను సంహరించే వాడిని కనాలని మీ తండ్రిగారిని వేడుకున్నాను. ఆయన వరం ప్రకారం నీ తమ్ముడు పుట్టబోతున్నాడు. పుట్టువాడు నిశ్చయంగా త్రిలోక విజయుడే... అయితే ... నీ తమ్ముడు నీ మీదకు యుద్ధానికి రాకుండా నేను వాడ్ని స్వాంతన పరుస్తాను. నీవూ, వాడూ కలిసి ముల్లోకాలు ఏలండి"

దేవేంద్రుడు వినయంగా తలవూపాడు. ఆ పై పరిచర్యలన్నీ చేశాడు. మధ్నాహ్నమయింది. ఆమె నిద్రపోయింది.

కాళ్ళు పెట్టుకునే దిక్కు వైపుకి తలపెట్టుకొని నిద్రిస్తున్న దితిని చూశాడు.

అవకాశం కోసం చూస్తున్న సురేంద్రుడు మాయ రూపంలో దితి గర్భంలో ప్రవేశించాడు. తన వజ్రాయుధంతో గర్భంలో వున్న శిశువును నరకసాగాడు. అంత గర్భస్థ శిశువు ఏడుస్తుండటంతో... మారుదః... మారుదః... (ఏడవకు... ఏడవకు) అని సముదాయిస్తూనే నరికాడు. దితికి మెలుకువ వచ్చింది. వద్దు... చంపకు... చంపకు... భయంకరంగా అరుస్తూనే వుంది. అప్పటికే గర్భాన్ని ఏడు ముక్కలు చేశాడు.

ఆ తర్వాత దేవేంద్రడు వజ్రాయుధంతో సహా ఆమె ముందుకు వచ్చి వియన వినమ్రతతో నమస్కరించి...

"తల్లీ మన్నించవలెను. .... నా త్రండి చెప్పిన మాట మరిచి, అశుచిగా తల విరపోసుకొని, కాళ్ళు పెట్టుకునే దిక్కు వైపు తలపెట్టుకొని నిదురించావు. దానితో నీవు అశుచివి అయ్యావు.... అవకాశం ఎవరూ వదులుకోరు... నేనూ అంతే. నన్ను చంపేవాడిని నేనెందుకు బ్రతకనిస్తాను... తల్లీ ... మరోసారి ప్రార్థనతో చెబుతున్నాను. దయతో మన్నించవలెను..."

☆☆☆ ☆☆☆ ☆☆☆

శ్రీరామా! ఆ తల్లి దుఃఖానికి అంతే లేదు...

"ఇంద్రా! నీ మరణ భయంతో నాకు గర్భశోకం కలిగించావు. నా గర్భం ఏడుముక్కలైపోయింది. నీవు నాకు మేలు చేయాలి"

"చెప్పు తల్లీ... నీ మాటను శిరసావహిస్తాను" చెప్పాడు దేవేంద్రుడు.

"వజ్రాయుధంతో నరికిన ఏడు ముక్కలూ, ఏడుగురు కొడుకులై లోకపాలకులు కావాలి. వాయు సమూహాలకు అధిపతులుగా చెయ్యాలి. ఇంద్రలోకంలోనూ, బ్రహ్మలోకంలోనూ, అంతరిక్షంలోనూ మిగిలిన నలుగురు నీవన్న బుజ్జగింపు పేరుతోనే 'మరుద్గణాలు'అనిపించుకొని నాలుగు దిక్కులా విహరించాలి. నా కోరికా, అభిలాషా అదే నాయనా..."

ఇంద్రప్రభువు దేవేంద్రుడు దితికి నమస్కరించి "అమ్మా నీవు అనుకున్నట్టుగానే జరుగుతుంది. అందు ఎట్టి సందేహమూ వద్దు... దేవతందరిలానే సంచరిస్తారు" చేతులు జోడించి చెప్పాడు ఇంద్రుడు.





"శ్రీరామా! ఆ పవిత్రమైన తపోవనమే ఇది. దితి తపస్సు చేసిన ప్రదేశం. నాటి కుశప్లవమే నేటి విశాల నగరం. ఇక్ష్వాకుకున్నూ, అలంబుసాదేవికిన్నీ విశాలుడు జన్మించాడు.

"ఆ విశాలుడే ఈ నగరాన్ని నిర్మించాడు. ధార్మికమైన వాడు విశాలుడు. అతనికి హేమచంద్రుడు జన్మించాడు. మహా బలశాలి... అతని పుత్రుడు సుచంద్రుడు. ఆయన కొడుకు ధూమ్రాశ్వుడున్నూ, ధూమ్రాశ్వుడుకి సృంజయుడున్నూ, ఆ సృంజయుడికి సహదేవుడు, అతని కొడుకు కుశాశ్వుడు. ఆ కుశాశ్వునకు తేజోవంతుడైన, పరాక్రమవంతుడైన సోమదత్తుడు జన్మించాడు. ఆ సోమదత్తునకు కాకుత్థ్సుడు జన్మించాడు. అతని పుత్రుడే సుమతి.

"ఆ సుమతి పాలనలోనే ఇప్పుడు విశాల నగరముంది. దేవతలతో సరిసమానమైన ఆయన రాజ్యపాలనలో ప్రజలంతా దీర్ఘాయుష్మంతులు గానూ, మహా ధర్మపరాయణులగానూ, వీరశూర ప్రతాపాలతోనూ వర్ధిల్లుతున్నారు.

"శ్రీరామా! ఈ పొద్దు మనమిక్కడే వుందాం. రేపటి రోజు ఉదయం ప్రయాణం ప్రారంభించి జనకమహారాజును చూద్దాం." చెప్పాడు విశ్వామిత్రుడు.

మునీంద్రులైన విశ్వామిత్రుల వారు తమ పట్టణానికి వచ్చినట్టు తెలిసింది విశాలరాజు సుమతికి.

బంధుమిత్ర సపరివారంగా విశ్వామిత్రునకు ఎదురేగి, పూజించి కుశలములు అడిగి -

"ఓ మహామునీశ్వరా! విశ్వామిత్రా! నన్నూ, నా దేశ ప్రజలనూ అనుగ్రహించి, దర్శనమిచ్చారు.... నేనూ, నా ప్రజలంతా ధన్యులం" అని ఆనందంతో పొంగిపోయాడు.

## విశాల రాజు

సుమతి రామలక్ష్మణులనుద్దేశించి -

"బ్రహ్మర్షీ... సర్వం శుభం... ఈ చిన్నవాళ్ళు ఎవరు? చూచుటకు పాలుకారే పసివాళ్ళవలె వున్నారు. అందానికి అశ్వనీదేవతలు సరికానట్టు కానవస్తున్నారు. అడవి రారాజులు వలే భయంకరంగానూ, ఏనుగుగున్నల్లాగా అగుపిస్తున్నారు. పాదాచారులై మీ వెంట వినయంగా నడుస్తున్నారు.

"కత్తులతో, అమ్ములపొదలతో, ధనుస్సులతో వీరకుమారులై ఉన్న వీరు ఎవరు?" అడిగాడు.

అంత మునీశ్వరుడు విశ్వామిత్రుడు-

"సుమతీ! రామలక్ష్మణులు వీరి నామధేయములు... నా సిద్ధాశ్రమములో యజ్ఞ సంరక్షణ కొరకై వచ్చినారు...." అని తాను పిలుచుకురావటమూ, రాక్షసాధులను సంహరించటమూ అంతయు చెప్పాడు.

దేవలోకం నుంచి వచ్చినట్టు ఉన్న వారిని గాంచి, "ఆకాశంపై సూర్య చంద్రుల్లా ఉన్నారు. మీరాక మా దేశానికే శోభ..." అని వారికి సుమతి సపర్యలను సంతోషంగా చేశాడు. ఉత్తమ అతిథులను ఉత్తమోత్తమంగా పూజించాడు.

ఆ రాత్రి అక్కడే విశ్రాంతి తీసుకున్నారు. వేకువ జామునే లేచి మిథిలకి పయనమయ్యారు.

## గౌతముని ఆశ్రమము

మిథిలా నగరాన్ని దూరం నుంచి చూస్తూనే శ్రీరాముని మోము పులకించింది... శుభ నిమిత్తాలు గోచరించాయి.

అల్లంత దూరం నుంచే మిథిలను చూసి ...."ఆహా మిథిల ఎంత బావుందో కదా?" అన్నారు మునులంతా-

మిథిలా నగర సమీపంలో నిర్జనవనాన్ని చూశారు. ఎవరూ ఉన్నట్టు జాడలు కానరాలేదు. అతి పురాతనమైన ఆశ్రమంలా అగుపించింది. పుణ్యాశ్రమమని తోచింది.

విశ్వామిత్రమహర్షితో శ్రీరాముడు ..."స్వామీ... ఈ ఆశ్రమం ఎంత పురాతనంగా అగుపిస్తున్నా రమ్యంగా వుంది.. శూన్యంగానూ వుంది. పూర్వాశ్రమంలో ఎవరి ఆశ్రమమిది... ఎందులకు వారు ఇలా వదిలేసి వెళ్ళారు... దాని కారణము తెలుసుకొన కోరుతున్నాను" అడిగాడు శ్రీరాముడు.

"రామా! నీ ఆలోచన సరి అయినది. ఇది మహాత్ముడైన గౌతమ ముని ఆశ్రమం.... ఆయన ఎందుకిలా వదిలేసి వెళ్ళిపోయాడో చెబుతాను విను...."

"మహానుభావుడైన గౌతముడిని దర్శించటానికి దేవతలు ఇక్కడి ఈ ఆశ్రమానికి వచ్చేవారు. పూజించి వెళ్ళేవారు. గౌతముని భార్య అహల్య... మహా పతివ్రత.... భర్తతో ఎన్నో సంవత్సరాలు తపస్సు చేసిన మహా తపస్వినీ.... మహా అందగత్తె కూడా.... ఆమె అందం, చందం నందనోద్యానవనంతో సరిసాటి.

"ఆ అందంపై దేవేంద్రుడి కళ్ళుపడ్డాయి.





"గౌతమ మహర్షి లేని సమయం చూసి దేవేంద్రుడు గౌతముని వేషంలో అహల్య వద్దకు చేరాడు... అహల్యతో-

"ఓ సుందరీ... ఋతు సమయం కోసం వేచి చూడరు కాముకులైన వారు... భర్తకి మనసొచ్చిన సమయమే శుభరాత్రి... పడుచు వయ్యారాలతో వున్న నీతో ఇప్పుడే సంగమించాలనుకుంటున్నాను" అన్నాడు.

అహల్య పరమానందం చెంది పరవశించి పోయింది. సుఖాల్లో ఇద్దరూ కరిగిపోయారు.

ఆమె బుద్ధి మందగించి మోహావేశంతో తన సర్వాంగాలకు దారి ఇచ్చింది. పడుచుదనాన్ని పచ్చిక బయలు చేసింది.

ఇద్దరూ సర్వం మరిచి ఆనందపారవశ్యంతో క్రీడించారు..... రమించారు.... ఆపై "దేవతల ప్రభువైన ఇంద్రా... ఇక చాలు... వెళ్ళు.... నీ మర్యాదా, నా మర్యాదా మంట గలవకముందే నీలోకం వెళ్ళు... ఎవరి కంటా పడకుండా వేగిరంగా వెళ్ళు..."

అహల్య మాటలతో దేవేంద్రడు సంతసించి ..... "నేను పరిపూర్ణ సంతృప్తుడైయ్యాను... వెళుతున్నాను" అని బైలుదేరాడు.

'అందమైన చినదానా... శెలవూ' అని చెప్పి వెనుతిరిగాడు. నదీ స్నానం చేసి సమిధలూ, దర్భలూ పట్టుకొని అగ్నిహోత్రుడిలా ప్రచండమైన ఆవేశంతో గౌతముడు ఎదురైనాడు.

దేవతలూ, దానవులూ కలిసి కూడా ఎదిరించలేని ఆ మహామునిని చూసి చేష్టలుడిగిపోయి నిల్చుండిపోయాడు.

తన వేషంలో ఉన్న దేవేంద్రుడిని చూసి సర్వమూ గ్రహించి "ఓరీ దుర్మతీ దేవేంద్రా... నా వేషంలో చేయకూడని పని చేశావు. అందుకు శిక్ష తప్పదు. ఏ అవయవాలు నీచే ఈ పని చేయించాయో అవి నీకు వుండవు.... విఫలుడివై పో... " అని శపించాడు.

అంత దేవేంద్రుడి వృషణాలు తెగిపడ్డాయి.

"యోనిలంపటుడివి కాన నీ ఒళ్ళంతా వెయ్యి యోనులైపోగాక...." గౌతముని శాపానికి ఇంద్రుడు నోటమాట రాక చేష్టలుడిగిపోయాడు.

అంత అహల్య కేసి తిరిగి - "దుష్టులకే దుష్టురాలైన అహల్యా... ఈ ఆశ్రమంలోనే శిలగా వుండు. కూడూ, నీళ్ళూ లేకుండా బూడిదలో దొర్లుతూ ఇక్కడే పడి వుండి" శపించాడు.

అహల్య హృదయ విదారకంగా రోదించింది. భర్తను ఎన్నో విధాలుగా వేడుకుంది.

గౌతముడు శాంతించి ...“అహల్యా తప్పు చేసిన వారికి శిక్ష తప్పదు... నీవు చేసిన తప్పుకు శిక్ష పూర్తిగా అనుభవించవల్సిందే. కొంత కాలం తర్వాత దశరథ రామ తనయుడు... సత్యవాక్కు పాలకుడు... ధర్మపరుడు... మహావీరుడు... తేజోవంతుడైన శ్రీరామచంద్రుడు వస్తాడు. అప్పుడు నీకు శాపవిమోచనమవుతుంది. నయవంచకీ ఓ అహల్యా.... శ్రీరాముని దర్శనం చేతనే నీలోని లోభమోహాలు తొలగుతాయి.... దేవాదిదేవునకు సపర్యలు చేయి... సంపూర్ణ స్వరూపము ధరించి నాతో సుఖంగా వుందువు గాని” చెప్పాడు గౌతముడు.

“ఓ నరశ్రేష్ఠుడైన రామా! ఆ తర్వాత గౌతముడు సిద్ధులు సంచరించే హిమపర్వత ప్రాంతానికి తపస్సుకై వెళ్ళాడు.”

## అహల్యా శాపవిమోచనం

దేవతల రాజు దేవేంద్రడు తన అండాలు తెగిపోయినందుకు విలవిల లాడాడు. అవి లేని తాను దేవతలకు రాజుగా ఉండటానికీ, ముల్లోకాలని పాలించడానికీ అర్హుడు కాడని చింతించాడు.

“దేవతలారా! గౌతముడు తన తపఃశక్తితో మనందరి పదవులకి గండం తీసుకు రాబోయాడు. ఆయన తపస్సు భంగం చేయటానికే నేను అలా చేయవలసి వచ్చింది. శాపంతో నా బీజాలు పోగొట్టాడు. ఆయన శాపం వల్ల అతని తపఃశ్శక్తి చాలా వరకూ పోయింది. అనుకున్న కార్యం సాధించాను. దైవకార్యం చేసిన నాకు ఈ శాపాన్ని పోగొట్టండి” అడిగాడు దేవేంద్రుడు.

దేవతలందరూ అగ్ని దేవుడితో కలిసి పితృదేవతల వద్దకు వెళ్ళారు.

“జరిగిందేదో జరిగింది. జరగబోయేదీ మంచికే. మీకు యజ్ఞభాగంగా దొరికిన మేషమునకు (గొఱ్ఱె) బీజాలున్నాయి. వీటి బీజాలను దేవేంద్రుడికి పెడితే దానితో దేవేంద్రుడు మేషవృషణుడవుతాడు”

పితృదేవతలు మేష కప్పూరాలను దేవేంద్రుడికి పెట్టారు. దేవతలు సంతసించారు.

“శ్రీరామా! అప్పట్నించి అహల్య కఠిన నియమాలతో, మౌన తపస్సుతో ఉండిపోయింది. దేవతారూపిణి అహల్య నీ కోసం ఎదురు చూస్తున్నది.





దేవదానవులెవరికీ ఆమె కానరాదు. పద శ్రీరామా! పుణ్యకర్ముడైన గౌతముని ఆశ్రమంలోకి” చెప్పాడు విశ్వామిత్రుడు.

ఆయన్ని అనుసరించాడు శ్రీరాముడు సోదరునితో... తపోదీప్తులతో తేజరిల్లుతున్న ఆ మహాసాధ్విని .... గౌతమ వాక్యాన్ని శిరసావహించి వున్న అహల్యని శ్రీరాముడు చూశాడు.

అహల్యా దేవి శ్రీరాముని చూసింది. శ్రీరామ పాదధూళి అహల్యని తాకింది. శ్రీరామ సందర్శన భాగ్యంతో ఆమెకి పాపవిమోచనముతోపాటు, శాపవిముక్తి కూడా కలిగింది.

అహల్య యధారూపంతో శ్రీరామచంద్రునికి శిరస్సు వంచి నమస్కరించింది.

తనను కరుణించుటకు వచ్చిన శ్రీరామునకూ, లక్ష్మణునకూ, విశ్వామిత్రునకూ పాద్యాదులు, అర్ఘ్యం ఇచ్చింది. సంపూర్ణ అతిథి సత్కారాలతోనూ, స్తోత్రాలతోనూ పూజించింది.

పూలవాన కురిసింది. దేవతలు దుందుభులు మ్రోగించారు. శ్రీరాముని రాకతో గౌతముడు వచ్చాడు.

అహల్యతో శ్రీరాముడుని సేవించాడు. ఆ దంపతుల సత్కారాలు పొంది, అంతా మిథిలకు బైలుదేరారు.

## శ్రీరాముడి మిథిలా నగర ప్రవేశం

గౌతముని ఆశ్రమం నుంచి శ్రీరామలక్ష్మణులు, విశ్వామిత్రుడు, మునులు ఈశాన్యంగా బైలుదేరారు. మిథిలా నగరం చేరి ఆ దేశ రాజు జనకుడి యజ్ఞప్రదేశానికి చేరారు.

“స్వామీ... ఈ మిథిలా నగర రాజు యజ్ఞవాటము బహు చక్కగా వుంది. ఈ ఋషివాటిక పండితులతోనూ, వేద వేదాంగాలని అభ్యసించిన వేదాధ్యయన పరులతోనూ కిటకిటలాడిపోతుంది. మనకి సరియైన విడిదిని మీరే నిర్ణయించవలెను” అడిగాడు శ్రీరాముడు.

జన సమ్మర్దం లేని ప్రదేశం..... మానవ నివాసమునకు శ్రేష్ఠమైన నీటి వసతి గల చెరువుగట్టును విశ్వామిత్రుడు చూపించాడు.

మహామునీశ్వరుడైన విశ్వామిత్రుడు వచ్చాడని జనకమహారాజుకి తెలిసింది.

ఆయన ఆగమేఘాల మీద, తన ఆస్థాన పురోహితుడు శతానందుణ్ణి తీసుకొని విశ్వామిత్ర విడిది ప్రదేశాన్ని చేరాడు.

వినయ, విధేయతలతో... సపరివారంతో ఋత్విజులతో వచ్చిన జనకుడు పాద్యాదులు, అర్ఘ్యంతోనూ, మధుపర్కాలతోనూ విశ్వామిత్రుడనూ, మునులనూ సేవించాడు. అందరినీ కుశలములనడిగాడు.

"మహర్షీ మీ రాక నాకు బహు ఆనందం. మహాత్మా! నా యజ్ఞాలన్నింటి ఫలంగా దేవతలు నాకు ఇచ్చిన ప్రసాదం... మీ దర్శన భాగ్యం. ఇంతమంది మహర్షుల రాకతో నేనూ, నా పరివారమూ, నా ప్రజలూ పరిపూర్ణ అదృష్టవంతులమయ్యాం.

"మునీశ్వరా... నా యజ్ఞం మరికొన్ని రోజులుంది. ఈ పన్నెండు రోజులు ఇక్కడే వుండమని నా వినతి...."

అందుకు విశ్వామిత్రుడు జనకుడికి సంతృప్తిగా సంకేతము ఇచ్చాడు.

"ధన్యుడిని మునివర్యా.... నవయవ్వనంతో తామరరేకుల నేత్రాలతో, దివ్యతేజ రూపంతో దేవతల వలెవున్న ఈ కుమారుళ్ళు ఎవరు? అమ్ముల పొదలూ, ధనుస్సులతో ముల్లోకాలను నుల్చున్న పళంగా ఎదురించగల సాహసం వారు నుల్చున్న తీరూ, భంగిమ వల్లా తెలుస్తోంది. నూనుగు మీసాలతో, కాలినడకన మీతో ఎందుకొస్తున్నారు. దయతో తెలియ చేయగలరు"

అంత విశ్వామిత్రుడు చిరునవ్వుతో -

"దశరథ మహారాజు తనయులు... శ్రీరామలక్ష్మణులు" అని చెప్పి తనతో వారెందుకు వచ్చారో... చెప్పాడు విశ్వామిత్రుడు.

శ్రీరామలక్ష్మణులు జనక మహారాజుకి నమస్కరించారు. అంత విశ్వామిత్రుడు -

"జనక మహారాజా! ఈ వీర పుత్రులు నీ ఇంట వున్న శివధనుస్సు చూడవలెనని వచ్చారు" చెప్పాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

గౌతమ మహర్షి జ్యేష్ఠపుత్రుడు, జనకుడి పురోహితుడైన శతానందుడికి శ్రీరామ లక్ష్మణుల పేరు వినగానే శరీరం పులకించింది.

తన తల్లి అహల్యా దేవి శాపవిమోచన కారకుడైన శ్రీరాముడా తన ఎదురుగా వున్నది. పులకింతలతో వున్న దేహంతో, వణికే కంఠంతో...





"స్వామీ... మునీంద్రా.. బ్రహ్మర్షీ... అనంతకాలం నుంచి తపస్సు చేస్తున్న మా తల్లి అహల్యాదేవిని ఈయన చూసినారా? ఈ శ్రీరామ చంద్రునికి మా అమ్మని చూపినారా? ఆమెకి శాపవిమోచనం అయినదా? నా తల్లీ, తండ్రీ కలిసే వుంటున్నారా?

"మా మాతాపిత లిరువురూ కలిసి శ్రీరామచంద్రుని సేవించారా? స్వామీ తక్షణం మీరు శెలవివ్వవలెను... క్షణమాత్రం నేను ఆగలేను" ప్రశ్నల పరంపరతో విశ్వామిత్రుడిని వేడుకున్నాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

వాక్యజుడూ, వాక్యకోవిదుడైన శతానందుడిని శాంతపరిచాడు విశ్వామిత్రుడు.

"శతానందా! లోగడ జమదగ్ని మహర్షిని రేణుక ఎలా చేరిందో... అలా నీ తల్లి గౌతముడిని చేరింది."

ఆ చల్లని పలుకులతో శతానందుడికి పన్నీరుజల్లు కురిసినట్లైయింది.

"శ్రీరామచంద్రా.... మానవులందరిలోనూ నీవు శ్రేష్ఠుడవు... పూజింపదగిన వాడివి నీవు మాత్రమే...

"శ్రీరామా! విశ్వామిత్రమహర్షి అపరాజితుడు. తపఃశక్తితో బ్రహ్మర్షి అయ్యాడు. అట్టి ఘనమైన వ్యక్తి నిన్ను తనతో తీసుకొచ్చాడంటే నీకంటే ధన్యుడు మరెవరూ లేరు.

"బ్రహ్మర్షి విశ్వామిత్రుని చరిత్ర ఎంతో జ్ఞానదాయకం. అట్టి ఆయన గాథను వినవలెను.

"మహా పరాక్రమవంతుడు విశ్వామిత్ర మహర్షి. అక్షౌహిణీ సైన్యంతో దేశమంతా చుట్టి వున్నాడు. పుణ్యప్రదేశాలూ, నదులూ, నగరాలూ, మహాపర్వతాలూ దాటుకుంటూ, చూసుకుంటూ వశిష్ఠ మహర్షి ఆశ్రమానికి చేరాడు.

"ఈ భూమండలం మీద ఎక్కడా కానరాని అనేక ఫలవృక్షాలనూ, లతా, పుష్పవృక్ష జాతులునూ అక్కడ చూశాడు. అనేక క్రూర మృగాలూ, వన్య మృగాలూ కలిసి మెలిసి వుండే ఆ ప్రాంతాన్ని చూశాడు.

"మహాత్ములూ, జలహారులూ, వాయుభక్షకులూ, రాలిన ఆకులనే తింటూ బ్రతికేవాళ్ళూ... ఇంద్రియాలూ జయించిన వాళ్ళూ.. జపాలూ హోమాలూ

చేసుకునే వాలఖిల్యులూ వున్న ఆ అనిర్వచనీయమైన పుణ్య ప్రదేశమైన వశిష్ఠాశ్రమాన్ని చూశాడు విశ్వామిత్రుడు."

## వశిష్ఠ ఆశ్రమం

విశ్వామిత్రుడు వశిష్ఠునకు వినమ్రతతో నమస్కరించాడు. సాదరంగా ఆహ్వానించి... విశ్వామిత్రునకూ, ఆయన వెంట వచ్చిన మునులకూ కందమూల ఫలాలనిచ్చాడు. సత్కరించాడు.

"తపస్సు విఘ్నం కాకుండా సాగుతున్నది కదా... అగ్నిహోత్రం నిర్విఘ్నంగా సాగుతున్నది కదా! మీ శిష్యులంతా కుశలమే కదా!" విశ్వామిత్రుని కుశలప్రశ్నలకు సంతసుడైన వశిష్ఠుడు చెప్పాడు.

"నేను కుశలమే... నీవూ, నీ పరివారమూ హాయిగా వున్నారా? రాజా నీ కోశాగారం నిండుగానే వున్నది కదా! నీ సేవకులు ప్రజల యోగక్షేమాలు చక్కగా చూస్తున్నారా? నీ పుత్రులూ, పౌత్రులూ క్షేమంగానే వున్నారా?" అడిగాడు బ్రహ్మదేవుని పుత్రుడు వశిష్ఠ మహర్షి.

ఒకొరినొకరు శుభావహమైన విషయాలన్నీ మాట్లాడుకున్నాక వశిష్ఠుడు విశ్వామిత్రునితో "విశ్వామిత్ర మహారాజా! నీకూ, నీ సమస్త సైన్యానికీ ఆతిథ్య మివ్వాలనుకుంటున్నాను. పెద్ద మనసుతో సరేనను"

"వశిష్ఠ మహర్షీ... మీ ప్రియ వచనాలతో, ఇక్కడ పండూ మొదలయిన వాటితో పాటు పాద్యాదులు, అర్ఘ్యంతో నేను సంతృప్తిడినయ్యాను. నాకు సమస్త సత్కారములు జరిగినవి. ఇక నాకు శెలవు" చెప్పాడు విశ్వామిత్రుడు.

వశిష్ఠుడు విశ్వామిత్రుడిని ఆపి...తామంతా భోజనం చేసి వెళ్ళవలెనని పట్టుబట్టాడు. భగవత్ స్వరూపుడైన వశిష్ఠ మహర్షిని కాదనలేకపోయాడు విశ్వామిత్రుడు.

వశిష్ఠ మహర్షి సంతోషంతో -

"శబలా" అని పిలిచాడు. కామధేనువు వచ్చి నిల్చున్నది.

"ఓ కామధేనూ! శబలా! ఈ విశ్వామిత్ర మహర్షికీ, ఆయన అపారసేనకూ నేను విందు ఇవ్వదలచాను. కాన నీవు అన్నీ సమకూర్చి పెట్టవలయును. షడ్రసోపేతాలతో అనేక రసాయనాలతో, భక్ష్య, పానీయాలతో, లేహ్యాలతో, చోష్యాలతో వివిధాన్నాలతో మధుర రసాలతో విందు సిద్ధం చేయి" చెప్పాడు వశిష్ఠుడు.





## శబల

"శ్రీరామా! వశిష్ఠ మహర్షి చెప్పటంతో శబల సమస్తం సిద్ధం చేసింది. రకరకాల భక్ష్యాలూ, పానకాలూ, పేలాలూ, మృష్టాన్నాలూ, వేడి వేడి అన్నాలూ, ముద్దపప్పులూ, రోటి పచ్చళ్ళూ అన్నీ సిద్ధం చేసింది.

విశ్వామిత్రుడు సంభ్రమాశ్చర్యాలతో విందు స్వీకరించాడు. వెంట వచ్చిన పరిజనం ఎన్నడూ తిన్నంత తిన్నారు. దివ్యమైన విందుతో అంతా సంతృప్తులయ్యారు.

విశ్వామిత్రుడు వశిష్ఠ మహర్షికి నమస్కరించాడు.

"మహర్షీ! నేను మిమ్మల్ని సత్కరించవలెను. కానీ నన్నూ నాసపరివారమునూ మీరు గొప్పగా సత్కరించారు. ఈ సందర్భంగా నాదో కోరిక. మీరు తప్పక తీర్చవలెను.

"ఈ శబల... ఈ కామధేనువును నాకు ఇవ్వవలెను. దానికి బదులు మీకు లక్ష ఆవులనిస్తాను. ఈ శబల జాతిరత్నం. మహారత్నం... రత్నములు రాజు వద్ద ఉండుట లోక ధర్మం. కాన నాకు ఇప్పించగలరు".

"విశ్వామిత్రా! నీకు ఈ కోర్కె తగదు. ఎన్ని కోట్ల ఆవులిచ్చినా, ధనరాసుల పోసినా ఇవ్వజాలను. దేవతలకు ఇచ్చే హవ్యాల దగ్గర్నించి, అమావాస్య పూర్ణిమల నాటి నా హోమాలకూ, నా జీవ యాత్రకూ, అగ్ని హోత్రానికీ ఇదే నా ఆధారం. నా బిడ్డ వంటిది. తండ్రి నుంచి బిడ్డను కోరటం ధర్మంకాదు.

"విశ్వామిత్రా... ఈ శబల నా సర్వస్వం. ఇంకా అనేక సేవలను శబల ద్వారా నే పొందుతున్నాను. కాన కామధేనువును ఇవ్వలేను" చెప్పాడు.

విశ్వామిత్రుడికి కోపం వచ్చింది.

"మహర్షీ... కాదని చెప్పకు నాలుగు బంగారు రథాలిస్తాను. వేలాది ఏనుగులనిస్తాను.

"జాతి గుర్రాలనిస్తాను. తరిపి ఆవులనిస్తాను. మీరడిగినంత బంగారం ఇస్తాను.... నాకు శబల కావలెను"

"విశ్వామిత్రా... ఎన్ని చెప్పినమా, మరెన్ని నాకు ఇచ్చిననూ శబలను ఇవ్వలేను.

"అతిథిగా వచ్చి.... ఇలా అడుగుట రాజధర్మం కాదు... నేను చేసే యజ్ఞాలకీ, సత్కారాలకీ ఇదే ఆధారం. దీనిని నేను ఇవ్వను గాక ఇవ్వను..."

# విశ్వామిత్రుని గర్వం

వశిష్ఠుడు కాదనటంతో విశ్వామిత్రుడు ఉగ్రుడయ్యాడు. రాజనీతి, రాజునీతి చూపించాడు. తన భటులను పిలిచి శబలను లాక్కురమ్మన్నాడు.

రాజభటులు విశ్వామిత్రుని ఆజ్ఞతో శబలను బలవంతంగా లాగసాగారు. శబల దుఃఖించింది.

'వశిష్ఠునకు అన్నీ సమకూర్చినాను. నేను ఏ అపకారం చేశాను. ఈ భటుల చేష్టలని ఆయనెలా చూస్తుండిపోయారు'.

"శబలా... నా బిడ్డ లాంటిదానవు. విశ్వామిత్రుడు ఎంత చెప్పినా వినుటలేదు. విశ్వామిత్రుడు క్షత్రియుడు. అపార సేనావాహిని వున్నది. నేను తపస్సుడని.... ఏమి చెయ్యగలను".

అంత కామధేనువు "మహర్షీ బ్రహ్మర్షీ..... బ్రహ్మ బలము ముందు క్షత్రియుల బలం ఏపాటిది. తమ తపోబలం ముందు వీరెంత?"

అందుకు వశిష్ఠుడు ......"శబలా.... శత్రువుల సంహారం చేసే సేనలను సృష్టించు" అన్నాడు.

శబల 'అంబా' అని అరిచింది.

సూర్యభగవానుడితో సమానమైన కాంభోజులు జన్మించారు. శబల పొదుగు నుంచి 'పప్లవులు' జన్మించారు. వారు విశ్వామిత్రుని సేనలపైకి ఉరికారు.

విశ్వామిత్రుడు చూస్తుండగానే చిత్తు చిత్తు చేశారు. విశ్వామిత్రుడు తట్టుకోలేకపోయాడు. కోపితుడయ్యాడు. రథమెక్కి అస్త్రాలను వదలసాగాడు. పప్లవులు కకావికులయ్యారు.

అది చూసి శబల 'అంబా' అని అరిచింది. ఈసారి యోని ప్రదేశం నుంచి యవనులూ, ఇంకా ఇతర శరీరభాగాల నుంచి శకులూ, మ్లేచ్ఛులూ పుట్టారు.

విశ్వామిత్రుడి సేనలను విరిచి పడేశారు. విశ్వామిత్రుడి చతురంగ బలాన్ని తుడిచి పెట్టారు. విశ్వామిత్రుడి నూరుగురు పుత్రులు కోపావేశంతోనూ, ఆయుధాలతోనూ వశిష్ఠిడి పైకి వెళ్ళారు.

వశిష్ఠుడు వారిని చూసి హుంకరించాడు. ఆ హుంకారంతో ఒక్కరు తప్ప మిగతావారంతా మాడిమసైపోయారు.





అది చూసి విశ్వామిత్రుడు ఖిన్నుడయ్యాడు. అశక్తుడయ్యాడు. చతురంగ బలాలూ, సేనలూ, రథాలూ... అన్నీ పోయాయి. విశ్వామిత్రుడి దర్పము అణిగిపోయింది. విపరీతమైన నిరుత్సాహము ఆయనను ముంచి వేసింది. మిగిలిన ఒక్క పుత్రుడితో నగరానికి చేరాడు.

పుత్రుడికి పట్టం కట్టాడు. రాజధర్మంతో పాలన చేయమన్నాడు. మహాతపస్సుకై భార్యతో కలిసి శరావతి నదికి వెళ్ళి ఘోరమైన తపస్సు ప్రారంభించాడు.

తపస్సు బలం ముందు క్షత్రియ ధర్మం గెలవకపోవటంతో ఆ మార్గాన్ని ఎన్నుకున్నాడు విశ్వామిత్రుడు.

శ్రీరామా! అక్కడే శివుని గూర్చి ఘోరతపస్సు చేశాడు. ఆ తపస్సునకు గరళకంఠుడు ప్రత్యక్షమైనాడు.

"మహాదేవా! అన్ని మంత్రాలతో ధనుర్వేదాన్ని అనుగ్రహించు. దేవ, దానవ, యక్ష, రాక్షస, గంధర్వులకూ, మహర్షులకూ లభ్యం కాని అస్త్రాలను ప్రసాదించు.... ఓ దేవదేవా! నా మనోరథం తీర్చు"

విశ్వామిత్రునకు ఆ మహాశివుడు 'తథాస్తు' అని వరం ఇచ్చాడు.

ఆ వెనువెంటనే వశిష్ఠుడి ఆశ్రమానికి వెళ్ళాడు. పౌర్ణమి నాటి సముద్రుడిలా లంఘించాడు.

మహాస్త్రాలను వశిష్ఠుడి ఆశ్రమం మీదకి ప్రయోగించాడు. వశిష్ఠుని ఆశ్రమం భగభగమండింది. వశిష్ఠుడి ఆశ్రమంలోని అందరూ హాహాకారాలు చేశారు. శక్తి కొలది పరిగెత్తారు. అది గాంచిన వశిష్ఠుడు కళ్ళెర్ర చేశాడు.

దగ్ధమైన తపోవనం.... అంతా నాశనం... శూన్యం....

"విశ్వామిత్రా... ఈ మున్యాశ్రమాన్ని నాశనం చేసినందుకు శిక్ష అనుభవించెదవు గాక" అంటూ బ్రహ్మ దండాన్ని చేతబూనాడు.

దానికి ప్రతిగా విశ్వామిత్రుడు ఆగ్నేయ అస్త్రాన్ని వదిలాడు. దాన్ని బ్రహ్మ దండంతో నిరోధించాడు.

విశ్వామిత్రుడు వారుణ, రౌద్ర, ఇంద్ర, ఐషికాస్త్రాలను వదిలాడు. ఇంకా అనేక అస్త్రాలను వశిష్ఠుడి మీదకు వదిలాడు.

మహర్షి వశిష్ఠుడు వాటినన్నింటినీ తన బ్రహ్మదండంతో నిలువరించాడు.

వారి యుద్ధానికి ముల్లోకాలు తల్లడిల్లిపోయాయి. ఆకాశం పొగతోనూ... మంటలతోనూ నిండిపోయింది. దిక్కులు కూడా మూసుకుపోయాయి.

విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రాన్ని తీసుకున్నాడు. ఆ అస్త్రాన్ని వశిష్ఠుడి మీదకు వదిలాడు. ముల్లోకాల దేవతలు తల్లడిల్లిపోయారు.

విశ్వామిత్రుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రం ముందు వశిష్ఠుడి బ్రహ్మదండం పనిచేయలేదు. ఆయన తన తపోబ్రహ్మ బలంతో మింగేశాడు.

వశిష్ఠుడి దేహం నుంచి పొగలూ, మంటలూ, నిప్పురవ్వలూ రాసాగాయి..... భయంకరమైన వశిష్ఠుడి రూపం చూసి దేవతలు భయపడిపోయారు.

దేవతలంతా వశిష్ఠుడి వద్దకు చేరారు.

"వశిష్ఠ మహర్షీ... ఆ బ్రహ్మాస్త్రాన్ని తమలోనే ఉంచుకొనవలెను. లేదంటే లోకాలన్నీ మాడి మసైపోతాయి.... తాము లోక క్షేమం కోసం ప్రసన్నుడవ్వ వలెనని" వేడుకున్నారు.

"శ్రీరామా! అప్పుడు బ్రహ్మర్షి నిదానించాడు. .... పరాభవంతో విశ్వామిత్రుడు వ్యథ చెందాడు."

దానితో విశ్వామిత్రుడు చింతాక్రాంతుడై వశిష్ఠుడి వలే తనూ బ్రహ్మర్షి కావాలని తలచాడు.

భార్యతో కూడి దక్షిణ దిక్కుకెళ్ళి ప్రశాంతమైన ఇంద్రియాలతో బ్రహ్మత్వం కోసం కఠిన తపస్సు చేశాడు.

కందమూల ఫలాలను తీసుకుంటూ తపస్సు చేశాడు. అక్కడే విశ్వామిత్రునకు హవిష్యందుడూ, మధుష్యందుడూ, దృఢనేత్రుడూ, మహారథుడూ జన్మించారు.

విశ్వామిత్రుడి తపస్సు రోజు రోజుకీ కఠినం అయింది. బ్రహ్మలోకానికి చేరింది. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైయ్యాడు.

"విశ్వామిత్రా! నీవు ఇక రాజర్షివి... రాజఋషీ... నీవు లోకాన్ని జయించావు" అని దీవించాడు బ్రహ్మదేవుడు. బ్రహ్మర్షిని కాలేకపోయినందుకు చింతించాడు విశ్వామిత్రుడు.

## త్రిశంకువు

మహర్షి విశ్వామిత్రుడు తపస్సు చేస్తున్న కాలంలో ఇక్ష్వాకువంశంలో త్రిశంకువనే రాజు ఉండేవాడు. అతను సత్యవాది, ఇంద్రియాలని జయించినవాడు.





త్రిశంకువునకు బొందితో స్వర్గానికి వెళ్ళాలని ఆకాంక్ష. తన పురోహితుడైన వశిష్ఠుడి వద్దకు వెళ్ళాడు. తన కోర్కె తెలియ చెప్పాడు.

వశిష్ఠుడు నిరాకరించాడు. త్రిశంకువు అంతటితో వదలక దక్షిణ దిక్కుగా తపస్సు చేస్తున్న వశిష్ఠుడి పుత్రులు నూరుగురిని అడిగాడు.

బొందితో స్వర్గానికి పోవు యజ్ఞం చేయవలెనని ప్రార్థించాడు. అందుకు వశిష్ఠ కుమారులూ కోపంతో...

"మా తండ్రి కాదన్న పని మేమెందుకు చేస్తాం... ముల్లోకాలలోనూ యజ్ఞం చేయించుటకు ఆయనకు మాత్రమే శక్తీ, సమర్ధతా వున్నాయి. ఆయన కాదు అన్న పని మేం ఎలా చేస్తాం.." చెప్పారు.

అందులకు త్రిశంకువు..."గురుదేవులు తిరస్కరించారు. గురు పుత్రులూ కాదన్నారు... కాన మా వంశానికి మరో పురోహితుడిని చూసుకుంటాను" చెప్పాడు త్రిశంకువు.

దానితో వశిష్ఠ పుత్రులు... "వశిష్ఠుడంతటివాడినీ, అనాదిగా మీ వంశానికి పౌరోహిత్యం చేస్తున్న వారిని వద్దంటావా? చండాలుడా... చండాలుడవైపో..." అని శపించారు.

త్రిశంకువు తెల్లవారేసరికి చండాలంగా మారిపోయాడు. మంత్రులూ, పురజనులూ తప్పుకు తిరగసాగారు.

త్రిశంకువు తన మనోభీష్టాన్ని మాత్రం వదలక విశ్వామిత్రుడి చెంత చేరాడు.

అతని రూపం చూసి విశ్వామిత్రుడు జాలిపడ్డాడు. అయోధ్యా మహారాజుకా ఈ దుస్థితి... "ఈ చండాల రూపం ఎలా వచ్చింది?" అడిగాడు విశ్వామిత్రుడు.

"బొందితో స్వర్గానికి వెళ్ళాలన్న నా కోర్కెను కాదన్నది వశిష్ఠుడు... శపించినది వారి కుమారులు... సత్యవాదిని నన్ను మీరు నమ్మవలెను..." అర్థించాడు త్రిశంకువు.

విశ్వామిత్రుడు చండాలుడైన త్రిశంకువుని ఓదార్చాడు....."సమస్త యజ్ఞాన్ని దగ్గరుండి చేయిస్తాను. వశిష్ఠ పుత్రులు శపించిన ఈ రూపంతోనే స్వర్గానికి వెళుదువు గాని" అని అభయమిచ్చాడు.

విశ్వామిత్రుడు తన పుత్రులను పిలిచి యజ్ఞానికి కావలసినవి సమకూర్చమని చెప్పాడు.

శిష్యులని పిలిచి, ఋత్విజులను శిష్యసమేతంగా రమ్మని చెప్పాడు. విశ్వామిత్ర శిష్యులు నలుదిక్కులకి పోయారు. గురువాజ్ఞ ప్రకారం ఋత్విజులను ఆహ్వానించారు. అన్ని వైపుల నుంచి బ్రహ్మర్షులు వచ్చారు.

విశ్వామిత్రుని శిష్యులు... "స్వామీ! తమ ఆజ్ఞతో నలుదిక్కులూ పోయి మునీశ్వరులను ఆహ్వానించాం. అంతా చెప్పినంతనే వచ్చినారు. వశిష్ఠులవారూ, ఆయన కుమారులు తిరస్కరించారు. పైగా యజ్ఞం చేయునది చెండాలుడు, చేయించేది క్షత్రియుడా...అని అవహేళన చేశారు. వారి నిష్ఠూరోక్తులు చెప్పనలవి కాదు."

శిష్యుల మాటలతో విశ్వామిత్రుడు ఉగ్రావతారం ఎత్తాడు. "నేను రాజ ఋషిని... నేను ఏ దోషమూ చేయలేదు. వశిష్ఠ కుమారులు ఈ క్షణమునే యమసదనం పోవలెను. ఏడు వందల జన్మలెత్తి హీనరూపాలతో శవభక్షకులు కావలెను. కుక్క మాంసము తింటూ తిరగవలెను. నన్ను దూషించిన మహోదయుడు దయా దాక్షిణ్యాలులేని కిరాతకుడిగా పుట్టాలి..." భీకరమైన శాపం ఇచ్చాడు విశ్వామిత్రుడు.

## త్రిశంకు స్వర్గం

"శ్రీరామా! అలా వశిష్ఠులను శపించటంతో ఊరుకోకుండా వశిష్ఠుడి నూరుగురు పుత్రులను హతమార్చాడు.

ఇక్ష్వాకు వంశ రాజు త్రిశంకుడని మహర్షులకు పరిచయం చేసి "ధార్మికుడైన ఇతన్ని బొందితో స్వర్గానికి పంపవలయును. నన్ను శరణు కోరాడు. మీరంతా తోడుండిన ఈ ధార్మికుడి కోరిక నెరవేర్చగలను.." చెప్పాడు విశ్వామిత్రుడు.

విశ్వామిత్రుల మాటలకు ఎవరూ అడ్డు ప్రశ్న వేయలేదు. కోపముతో అగ్నిహోత్రుడిలా మారే విశ్వామిత్రుడి గూర్చి తెలియనిది కాదు ఋషులకు.

మహాయజ్ఞం ప్రారంభమైంది. విశ్వామిత్రుడు ఆధ్వర్యుడై యజ్ఞ వాటిక ముందు కూర్చున్నాడు. కల్పసూత్ర ప్రకారం యజ్ఞ విధులు జరుగుతున్నాయి. మంత్ర సహితంగా యజ్ఞం నిరాటంకంగా పూర్తి అయింది.

యజ్ఞం పూర్తి అయినా దేవతలెవరూ వారి వారి హవిర్భాగాలను తీసుకోవటానికి రాలేదు. యజ్ఞ మంత్రాలతో ఎంత సేపు ఆహ్వానించినా రాలేదు.





"ఆహా! ఈ విశ్వామిత్ర మహర్షి పిలిచినా, ఆహ్వానించినా రాకపోవటమా! త్రిశంకా... నా తపోబలంతో నిన్ను స్వర్గానికి పంపుతాను..." అని ఆవేశంగా అన్నాడో లేదో....

త్రిశంకువు అందరూ చూస్తుండగానే స్వశరీరంతో స్వర్గదిశగా పైకి ఎగిరాడు.

విశ్వామిత్రుని తపోశక్తితో త్రిశంకువు స్వర్గాన్ని చేరాడు. దేవేంద్రుడు అభ్యంతరం చెప్పాడు.

"ఓయీ త్రిశంకూ... నీవు గురుదేవుల శాపానికి గురైన చండాలుడవు. స్వర్గప్రవేశానికి అర్హుడవు కాదు. వచ్చిన దారిగుండానే తలక్రిందులుగా వెళ్ళు...." ఆజ్ఞాపించాడు.

దేవేంద్రుడు దేవ వాక్కుతో త్రిశంకుడు నేలవైపుకి జారాడు. మధ్యలోనే... "మహామునీశ్వరా! విశ్వామిత్రా! రక్ష... రక్ష.." అరిచాడు.

"త్రిశంకు... నిలు... నిలు..." శాసించాడు విశ్వామిత్రుడు.

త్రిశంకుడు అక్కడే మధ్యలో ఆగాడు.

"నా తపోబలంతో పంపిన నిన్నే కాదంటారా? అందుకు నా సమాధానం ఒక్కటే... సృష్టికి ప్రతిసృష్టి చేస్తాను" అని అద్భుత దేవలోకం సృష్టించాడు. దక్షిణ దిక్కున సప్తర్షులనూ, మహా నక్షత్రాలనూ సృష్టించాడు.

తన తపో శక్తితో దేవతలను సృష్టించడం ప్రారంభించాడు. అది గమనించిన దేవతలు వణికిపోయారు. భయభ్రాంతులకి లోనయ్యారు.

తామేమాత్రం ఆలస్యం చేసినా దేవేంద్రుడిని కూడా విశ్వామిత్రుడు సృష్టించగలడని తలచి అంతా ఆయన దగ్గరికి వెళ్ళారు. శాంతించమని వేడుకున్నారు... స్తుతించారు.

"మునీంద్రా....త్రిశంకువు శాపం తమకి తెలియనిది కాదు. అట్టి శాపగ్రస్తుడు స్వర్గానికి అర్హుడు కాడు..."

"దేవతలారా! ఇతన్ని బొందితో స్వర్గానికి పంపుతానని మాట ఇచ్చాను. మాట తప్పను... మీరు స్వర్గంలో వుండటానికి ఒప్పుకోవటం లేదు. కాన.... నేను సృష్టించిన నక్షత్రాలూ, దేవలోకమూ శాశ్వతంగా ఉండాలి."

"అవశ్యము మహాముని... మీరు సృష్టించిన నక్షత్రాలు అన్నీ జ్యోతిశ్చక్రానికి వెలుపలే ఎల్లప్పుడూ ఉంటాయి. గురుశాపం వున్నందు వల్ల...

త్రిశంకువు వాటి నడుమ తలక్రిందలుగా ఉంటాడు. దేవతలతో సమానమైన కాంతితో కృతార్థుడు అవుతాడు. కాన తమరు శాంతించమని" వినమ్రతతో అడిగారు.

విశ్వామిత్రుడు శాంతించాడు. దేవతలు విశ్వామిత్రునికి నమస్కరించి అంతర్ధానమయ్యారు.

ఆపై విశ్వామిత్రుడు దక్షిణ దిక్కు విఘ్నమైనదని తలచి పడమర వైపుగా పుష్కర తీర్థం చేరి మహోగ్రమైన తపస్సును ఆరంభించాడు.

## అంబరీషుడు

"శ్రీరామా! ఆ సమయంలో అయోధ్యను అంబరీషుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడొక కార్యం కొరకై యజ్ఞం చేస్తున్నాడు. దేవతల రాజు దేవేంద్రుడు యజ్ఞ పశువుని తస్కరించాడు.

దానితో యజ్ఞానికి విఘ్నం కలిగింది....

"అయోధ్యా రాజా అంబరీషా... యజ్ఞ పశువునెవరో ఎత్తుకొని పోయినందు వల్ల దోషం కలిగింది. అది మంచిది కాదు. కాన యజ్ఞ పశువు తప్పని సరి లేదా నరపశువు అనివార్యం" చెప్పారు యజ్ఞకర్తలు.

దానితో అంబరీషుడు లక్షలాది ఆవులతో యజ్ఞ పశువు కోసం బైలుదేరాడు. కొండా, కోనా... వాగూ, వంకా... దేశాలూ, నగరాలూ.... అంతా గాలించాడు.

ఎక్కడా యజ్ఞ పశువు జాడలేదు. చివరకు భృగుతుంగ పర్వతం వద్దకు వెళ్ళాడు. ఆ ప్రాంతం ఋచీక మహర్షిది. ఆయన కుటుంబంతో ప్రశాంత చిత్తంతో తపస్సు చేసుకుంటున్నాడు.

ఆ మహనీయుడికి అంబరీషుడు నమస్కరించాడు. తానెందుకు వచ్చిందీ విన్నవించాడు.

"ఓ తపోదీప్త..... నా యజ్ఞ పశువుగాని, సర్వ అర్హత నరపశువు గాని కానరాలేదు. దయతో తాము తమ పుత్రుడను నరపశువుగా పంప ప్రార్థన. అందుకు ప్రతిగా లక్షగోవులను ఇస్తాను...." అడిగాడు.

"అంబరీషా... నా పెద్దకొడుకుని మాత్రం ఇవ్వను" అన్నాడు.

భర్త అలా అనటం ఆ మహాఇల్లాలు విన్నది. పెద్ద కొడుకంటే తండ్రికిష్టం... చిన్నకొడుకంటే తనకిష్టం... ఆ మాటే అంబరీషునికి చెప్పింది.





లోకసహజమైన ఆ మాటలకు అంబరీషుడు చిరునవ్వు నవ్వాడు. మధ్యవాడైన శునశ్శేఫుడు అంబరీషుని వద్దకు వచ్చి "నా తల్లీ తండ్రీ అన్ననూ, తమ్ముడనూ అమ్మనన్నారు. మిగిలింది నేనే... నేను సిద్ధం...." చెప్పాడు.

అంబరీషుడు లక్ష గోవులను ఋచీక మహర్షికిచ్చి శునశ్శేఫుణ్ణి తనతో పాటు తీసుకువెళ్ళాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

ఆగవేఘాల మీద అంబరీషుని రథం విశ్వామిత్రుడు తపస్సు చేసుకుంటున్న పుష్కర తీర్థం చేరింది.

ప్రయాణ బడలికితో ఆ ప్రాంతంలో ఆగాడు అంబరీషుడు. సుఖంగా విశ్రాంతి తీసుకోదలిచాడు.

శునశ్శేఫునికి దాహం వేసింది. నదీ ప్రాంతం వైపు వెళ్ళాడు. అక్కడే విశ్వామిత్రుడిని చూశాడు.

ఆవు వద్దకు దూడ వెళ్ళినట్టు వెళ్ళాడు. విశ్వామిత్రుడి పాదాల మీద పడ్డాడు.

"మునీంద్రా... పాహిమాం... పాహి... నా తల్లీ తండ్రీ యజ్ఞపశువుగా నన్ను అంబరీషునకు అమ్మి వేసినారు. నేను చావుటకు సిద్ధంగా లేను. అట్లని తల్లి తండ్రీ మాట జవదాటను. లక్షగోవులిచ్చి కొనుక్కున్న అంబరీషుడి యజ్ఞం పూర్తి అవ్వాలి... నాకు నీవే దిక్కు..." వేడుకున్నాడు.

అంత విశ్వామిత్రుడు ఓదార్చి... శునశ్శేఫునికి అభయమిచ్చి .... తన పుత్రులతో...

"పుత్రులారా! ఇతను ఈ తండ్రి మాటకు ఎంత గౌరవం ఇస్తున్నాడో లోకానికి వెల్లడవుతున్న సమయం... మీలో ఎవరైనా సరే అంబరీషుని వెంట నరపశువుగా వెళ్ళండి. తండ్రి మాట అమలు చెయ్యటమే పుత్రుల పరమధర్మం..." చెప్పాడు విశ్వామిత్రుడు. దానికి విశ్వామిత్రుని పుత్రులు నిరాకరించారు.

"తండ్రీ తమ మాటలు సరైన త్రోవన లేవు. చక్కటి ఆహారాన్ని వదిలి చెండాల మాంసాహారం కోసం తాపత్రయపడుతున్నట్టు వుంది. నీ బిడ్డ ప్రాణం కంటే పరుల ప్రాణం నీకు ముఖ్యమైనదా! తండ్రి అనవలసిన, చెప్పవలసిన పలుకులా అవి..." అడిగారు పుత్రులు పరిహాసంతోనూ, స్వాభిమానంతోనూ.

విశ్వామిత్రుడు మహోగ్ర రూపం ఎత్తాడు. నిప్పులు కురిసే కళ్ళతో "తండ్రి మాటకు ఎదురు చెప్పటమే కాక, ధర్మం తప్పి మాట్లాడారు. అందుకు ఇదే నే ఇచ్చే శిక్ష... శాపం... వశిష్ఠుడి కొడుకుల్లా మీరూ శునక మాంసం తింటూ వెయ్యేళ్ళు భూమి మీద బ్రతకండి" ఘోరంగా పలికాడు.

ఆపై శాంతించి శునశ్శేపుడిని స్థిమిత పరిచి... "మునిపుత్రా... వ్యధ చెందకు. నేను అపూర్వమైన రెండు మహామంత్రాలను బోధిస్తాను. యూపస్తంభానికి కట్టి వేయగానే నేను చెప్పిన మంత్రాలను స్తుతించి జపించు... ఇంద్రుడూ, దేవతలూ నిన్ను రక్షించి ఆశీర్వదిస్తారు" అని ఆశీర్వదించి పంపాడు విశ్వామిత్రుడు.

అంబరీషుడితో యజ్ఞ ప్రదేశానికి చేరాడు శునశ్శేపుడు. అతడికి ఎర్రటి దుస్తులను కట్టి యూప స్తంభానికి కట్టారు. యజ్ఞకర్తలు యధావిధిగా హోమాలు చేస్తున్నారు.

విశ్వామిత్రుడు చెప్పిన మహామంత్రాలను జపించాడు శునశ్శేపుడు. ఇంద్రాది దేవతలు సంతృప్తులైనారు. శునశ్శేపునకు దీర్ఘాయువునూ, అంబరీషునకు యజ్ఞ ఫలాన్ని శీఘ్రంగా అనుగ్రహించారు.

## విశ్వామిత్రుని తపస్సు భంగం

"శ్రీరామా! ఆ తర్వాత విశ్వామిత్రుడు పవిత్ర పుష్కర తీర్థంలో వేయి సంవత్సరాలు తపస్సు చేశాడు. అపూర్వమైన ఆయన తపస్సుకు బ్రహ్మాది దేవతలు వచ్చి విశ్వామిత్రుడను ఆశీర్వదించారు. మహాఋషిగా పరిగణించారు. విశ్వామిత్రునకు సంతృప్తి కలగలేదు. మరింత మహోగ్ర నియమాలతో తపస్సు ప్రారంభించాడు.

అలాంటి సమయంలో ఆ పుష్కరతీర్థంలో ఓ మెరుపు మెరిసింది. పుష్కరమే ప్రకాశించింది.... అందగత్తెలకే మహా అందగత్తె... అప్రతిమాన సౌందర్యరాశి మేనక ఆ తీర్థాన జలకాలాడవచ్చింది.

విశ్వామిత్రుడు ఆ అందాలరాశిని చూశాడు... వయసు పొంగులని చూసి వైమరచిపోయాడు. ముగ్ధుడయ్యాడు. తీవ్ర మన్మథ పరవశంతో అల్లాడిపోయాడు.

ఆమె చెంత చేరి ప్రణయ పలుకులు పలికాడు. అనుగ్రహించమని వేడుకున్నాడు.





వారిద్దరూ పది సంవత్సరాలు కాలం తెలియకుండా గడిపారు. ఓ సమయాన విశ్వామిత్రుడు వాస్తవంలోకి వచ్చాడు. మేనక మదపుటందాలను తీక్షణంగా చూశాడు. తన తపస్సునాపటానికి దేవతలు పన్నిన పన్నాగమని ఆలోచించాడు.

పది సంవత్సరాల తపస్సు కాలం వృధా అయిపోయిందని చింతించాడు. మేనక వంక చూశాడు.

భయంతో చిగురుటాకులా వణికిపోయింది. మేనకను చక్కగా మాటలతో బుజ్జగించి ఉత్తరదిశగా కౌశికీ నదీ తీరానికి వెళ్ళి ఘోరతపస్సు చేశాడు.

ఆ చండ ప్రచండ తపస్సుకు దేవతలు భయకంపితులయ్యారు. బ్రహ్మదేవుడిని శరణు వేడారు. బ్రహ్మ విశ్వామిత్రునకు ప్రత్యక్షమయ్యాడు. ఓ రామా! అప్పుడు బ్రహ్మదేవుడు విశ్వామిత్రుడిని మహర్షిగా సంభోదించాడు. దానికి విశ్వామిత్రుడు... 'నేను జితేంద్రియుణ్ణి కదా!' అడిగాడు.

"లేదు విశ్వామిత్రా! దానికింకా ఎంతో సాధన చేయవలసి వుంది' అని బ్రహ్మ అదృశ్యమయ్యాడు.

విశ్వామిత్రుడు రెండు చేతులూ పైకెత్తి ఏ ఊతమూ లేకుండా, గాలిని ఆహారంగా తీసుకుంటూ తపస్సు చేశాడు. వానా కాలంలో నీటిలో, ఎండా కాలం అగ్నికీలకాల మధ్య, చలికాలం మంచుగడ్డల మధ్య అరివీర ఘోరతపస్సు చేశాడు.

## రంభ

దేవతల రాజు దేవేంద్రుడు విశ్వామిత్రుడి ఘోరతపస్సు చూసి చలించిపోయాడు. కార్య నిమిత్తమై రంభకి ఆజ్ఞాపించాడు.

"అతిలోక సౌందర్యవతి ఓ రంభా.... దేవతల కోసం దేవకార్యం చేయవలెను. విశ్వామిత్రుడి మహోగ్రమైన తపస్సును భగ్నం చేయవలెను. నీ అందచందాల హొయలతో విశ్వామిత్రుడని మన్మథ పరవశంతో ముంచెత్త వలెను.

రంభ దేవేంద్రునకు నమస్కరించింది.

"స్వామీ... విశ్వామిత్రుడు మహర్షి. .... పైగా కోపిష్టి... ఆయన ఘోర శాపానికి నేను ఆహుతి అయిపోతాను. కాన తాము అనుగ్రహించవలెను."

"రంభా... భయం వలదు. నేనున్నాను. వసంత కాలం ఎంత మనోహరంగా వుందో చూడు. మన్మథుడు నీతో వస్తాడు. పూలచెట్లపై కోకిలగా నీ పక్కనే వుంటాను. నీ వలపులతో, వయ్యారాలతో శృంగార చేష్టలతో విశ్వామిత్రుడిని కరిగించాలి. మెప్పించాలి. సుఖాల్లో మునిగి తేల్చాలి" చెప్పాడు దేవేంద్రుడు.

దేవతల రాజు ఆజ్ఞప్రకారం రంభ మనోహరంగా మారింది. విశ్వామిత్రుడి చెంత చేరింది.

రాగాలతో నాట్యం చేసింది. వయ్యారాలు కదలించి పరిచింది. పూలు విచ్చుకున్నాయి. చెట్లూ, కోకిలలూ పులకించిపోయాయి.

విశ్వామిత్రుడు చెదిరాడు. కళ్ళు తెరిచాడు. అద్భుత సౌందర్య సాక్షాత్కారం.... మేనక గుర్తుకు వచ్చింది. దేవతల తంత్రమని గ్రహించాడు. ముక్కోపి మహోద్ర రూపాన్ని ధరించాడు.

"ఓసీ... రంభా.... ఇంద్రియాలని జయించాలన్న నన్ను ఏమార్చాలను కుంటావా? అట్టి ఘాతుకానికి పాల్పడ్డ నీవు శిలగా మారు" శపించాడు విశ్వామిత్రుడు.

రంభ తుఫానుకి అల్లాడిన పూవులా వణికిపోయింది. విశ్వామిత్రుడు శాంతించాడు. కోపాన్ని జయించలేకపోయినందుకు విచారపడ్డాడు. రంభ శిలగా మారిపోయి ఉంది.

శ్రీరామా! అప్పుడు విశ్వామిత్రుడు కోపాన్నీ, అహాన్నీ జయించాలని బ్రహ్మర్షి అయ్యేవరకూ ఊపిరి కూడా తీసుకోకుండా తపస్సు చేయాలని నిశ్చయించుకొని తపస్సు ప్రారంభించాడు.

## బ్రహ్మర్షి విశ్వామిత్రుడు

శ్రీరామా! అలా విశ్వామిత్రుడు తూర్పు దిక్కుగా ప్రయాణించాడు. ఓ ప్రాంతంలో తాను అనుకున్న విధంగా తపస్సు ప్రారంభించాడు.

వెయ్యి సంవత్సరాల తపస్సు అనంతరం ఓ రోజు విశ్వామిత్రుడు భోజనానికి ఉపక్రమించాడు.

అప్పుడు దేవేంద్రుడు బ్రాహ్మణ రూపంలో వచ్చి 'భిక్ష' అన్నాడు. మౌన వ్రతంలో వున్న విశ్వామిత్రుడు సిద్ధాన్నమంతా దేవేంద్రునికిచ్చాడు. మెతుకు లేకుండా భుజించాడు దేవేంద్రుడు.





విశ్వామిత్రుడు ఆ తర్వాత మరో వెయ్యి సంవత్సరాలు తపస్సు చేశాడు. ఆయన తపస్సుకి దేవలోకం తల్లడిల్లిపోయింది. భీకర తపస్సు చేశాడు. తలలోంచి, దేహంలోంచి పొగలు వస్తున్నాయి. ఆ వేడి లోకాన్ని ఆక్రమించి ముల్లోకాలకి ప్రాకింది.

యక్ష, గంధర్వ, కిన్నెర తదితర దేవలోక వాసులు భయంతో బ్రహ్మని వేడుకున్నారు. ముల్లోకాలూ భస్మం కాకుండా కాపాడమని అర్థించారు. భూమి కదులుతోంది. పర్వతాలు అదురుతున్నాయి. సూర్యుని శక్తి సన్నగిల్లుతోంది. ఓ దేవా... మహూర్తకాలం కూడా ఆలసించకుండా విశ్వామిత్రుడిని అనుగ్రహించవలెను.

బ్రహ్మ దేవేంద్రుడూ, దేవతల మాటలతో వారికభయమిచ్చి విశ్వామిత్రుడి ముందు ప్రత్యక్షమయ్యాడు.

"విశ్వామిత్రా... నీవు బ్రహ్మర్షివి. ఉగ్రమైన నీ తపస్సుకి అఖండమైన స్థానాన్ని పొందావు. నీకు శుభం... " ఆశీర్వదించాడు బ్రహ్మదేవుడు.

దేవతలు వశిష్ఠ మహర్షిని తీసుకువచ్చారు. విశ్వామిత్రుడూ వశిష్ఠుడూ సఖ్యత పడ్డారు.

"శ్రీరామా! అట్లా ఈ విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయినాడు. అగ్రగణ్యుడు, ధర్మపరుడు... వీరుడు" చెప్పి ముగించాడు శతానందుడు. రామలక్ష్మణులతో పాటు మిగతా వారూ విశ్వామిత్రుడి గతం తెలుసుకొని ఆనందించారు. చెప్పిన శతానందుడను అభినందించారు. జనకమహారాజు విశ్వామిత్రునకు నమస్కరించాడు.

"బ్రహ్మర్షీ! ఉత్తమోత్తమైన మీ సందర్శనంతో చరితార్థుడనయ్యాను. తమ తపస్సు గూర్చి అంతా విన్నాం. ఆనందదాయకం. ఓ మహానుభావా! సూర్యుడు అస్తమిస్తున్నాడు. సాయంకాలాహ్నికాలను నెరవేర్చాలి. రేపటి రోజున తిరిగి తమ దర్శనం చేసుకుంటాను" చెప్పి శెలవు తీసుకున్నాడు.

## శివధనుస్సు

మరుసటిరోజు బాగా తెల్లారింది. ప్రాతఃకాల కర్మలయ్యాక విశ్వామిత్ర, రామలక్ష్మణులతో సమావేశమయ్యాడు జనకుడు.

"మునీశ్వరా... తమ ఆజ్ఞ... నేనూ నా మంత్రులూ... నా సైన్యమూ సిద్ధం. నేను ఏమి చేయవలెను. తమ రాకకు ఆంతర్యం శెలవివ్వవలెను"

"జనక మహారాజా... ఈ దశరథ రాజు పుత్రులు రామలక్ష్మణులు శివధనుస్సు చూడాలని అభిలషించారు. ఆ కార్యనిమిత్తమై వచ్చాను" చెప్పాడు.

"సంతోషం మునివర్యా..." శివధనుస్సు దర్శనానికి ముందు ఆ ధనుస్సు గూర్చి చెబుతాను....

విశ్వామిత్రుడు ఆశీర్వదించాడు. రామలక్ష్మణులు ఉత్సాహంతో జనక మహారాజును చూశారు.

"మహాభాగా! పూర్వం మా పూర్వీకుల్లో నిమిచక్రవర్తి తర్వాత దేవరాతుడు రాజ్యపాలన చేస్తున్నాడు. సుప్రసిద్ధుడూ, ధర్మాత్ముడూ, నీతికోవిదుడూ ఉత్తమ క్షత్రియుడూ అయిన ఆయనకు దేవతలు ఈ శివధనుస్సునిచ్చారు.

"పూర్వం మహాశివుడు దక్షయజ్ఞాన్ని నాశనం చేసి ఆపై దేవతలపై ఆగ్రహించాడు. వింటిని ఎక్కుపెట్టాడు. యజ్ఞంలో హవిర్భాగాలలో పాలు పెట్టనందుకు ఉగ్రుడయ్యాడు. దేవతలు భయపడి స్తోత్రం చేశారు. వేడుకున్నారు. శివాజ్ఞను నెరవేరుస్తామన్నారు. పరమశివుడు శాంత పడ్డాడు. ఆ ధనుస్సుని దేవతల కిచ్చాడు. దేవతలు మా పూర్వీకుడైన దేవరాతుడికిచ్చారు. అప్పట్నించీ ఆ శివధనుస్సు మా వద్దే వుంది. ఈ సందర్భమున మరొక విషయాన్ని విన్నవించుకుంటున్నాను. నేను మహాయజ్ఞం తలపెట్టి భూమిని నాగలితో దున్నుతుండగా నాగటిచాలుకు ఏదో పెట్టె తగిలి ఆగింది. చూస్తే ఆడశిశువు. బంగారు బొమ్మ, రత్నాలరాశి. ఆమెకే సీత అని పేరు పెట్టి అల్లారు ముద్దుగా పెంచుకుంటున్నాను. సీత అయోనిజ. భూమిలో పుట్టింది. భూదేవి తల్లి. మహావీరునకిచ్చి వివాహం చెయ్యాలని నా కోరిక.

"వీరులెందరో వచ్చారు. శివధనుస్సు ఎక్కు పెట్టిన వారికే నా సౌభాగ్యలక్ష్మినిస్తానని చెప్పాను. ఎంతో మంది రాజులూ, వీరులూ, యోధులూ ప్రయత్నించారు. విఫలమైన వారు ఉక్రోషంతో నా మీదకు యుద్ధానికి వచ్చారు. నేనూ, నా సైన్యం, రాజ్యమూ ఎంతో నష్టపోయాం. సంవత్సరం పాటు సాగించారు నాపై ముట్టడిని. తపస్సు ద్వారా దేవతల అనుగ్రహం సంపాదించాను. చతురంగ బలాలను పొందాను. శౌర్యంతో దేవతల శక్తితో వ్యతిరేకించిన రాజులందరిని తరిమి తరిమి కొట్టాను.

"పరాక్రమమే కన్యాశుల్కం"..... పరమ భాస్కరమైన ఆ మహాశివ ధనుస్సును ఎక్కుపెట్టిన వీరాధివీరునకే నా కూతురు సీతను ఇచ్చి రంగరంగవైభోగంగా వివాహం చేస్తాను" చెప్పాడు జనకమహారాజు.





అంత విశ్వామిత్రుడు "జనక రాజా... తక్షణమే ఆ ధనుస్సును శ్రీరామునకు చూపించవలెను" చెప్పాడు.

విశ్వామిత్రుడి అనుజ్ఞతో జనకుడు తన సేనా నాయకునికి శివధనుస్సును తీసుకురమ్మని చెప్పాడు.

మంత్రుల సమేతంగా సైన్యాధ్యక్షుడు రాజాజ్ఞప్రకారం మిథిలకి పోయి శివధనుస్సుకి నమస్కరించారు. ఎనిమిది చక్రాల భోషాణాన్ని లాగారు. అమిత బలసంపన్నులు గొలుసులు కట్టి ఎంతోకష్టంపై లాగారు.

వేలాది మంది బలసంపన్నులు కలిసి తెచ్చిన ఆ శివ ధనుస్సును రామలక్ష్మణ విశ్వామిత్రుల వారికి చూపిస్తూ చెప్పాడు జనకుడు. "దేవరాతుడు మొదలు మా వంశస్థులమంతా అత్యంత నియమ నిష్టలతో నిత్యం పూజిస్తున్నాము. యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుషులు, రాక్షసాధములు ఎవరూ సంధించలేకపోయారు. ఎక్కుపెట్టలేకపోయారు. అల్లెత్రాడు ఎక్కించలేక పోయారు. భారాన్ని సైతం తెలుసుకొనలేకపోయారు."

విశ్వామిత్రుడు శ్రీరామునికి చెప్పాడు.

"శ్రీరామా! ఆ విల్లుని చూడు... మహాశివుని శివధనుస్సు. గంధ మాల్యాదులతో అలంకరించిన ఆ ధనుస్సును చూడు" చెప్పాడు.

శ్రీరాముడు విశ్వామిత్రునకు నమస్కరించాడు.

"మహర్షీ.... ఈ మహాధనుస్సును ఎక్కుపెడతాను. అల్లెత్రాడు లాగి, భారాన్ని పరీక్షిస్తాను" చెప్పాడు శ్రీరాముడు.

విశ్వామిత్రుడు చిరునవ్వుతో శ్రీరాముడను ఆశీర్వదించాడు.

శ్రీరాముడు వింటిని ముందుగా కళ్ళకద్దుకున్నాడు. వింటి నడుమను పట్టుకున్నాడు. అంతా విభ్రాంతిగా చూస్తున్నారు. శ్రీరాముడు సునాయాసంగా శివధనుస్సుని ఎత్తాడు. వింటితాడు ఎక్కించాడు. బాణం తొడిగాడు. వింటినారినొక్కసారి లాగాడు.

విల్లు విరిచాడు. భయంకరమైన పిడుగులు పడ్డట్టు శబ్దమయ్యింది. మహామెరుపులు మెరిశాయి. చుట్టూ వేలాదిమంది కన్నులార్పకుండా చూశారు. విల్లు విరిగినప్పుడు సామాన్యులు మూర్ఛపోయ్యారు. లక్ష్మణుడు ప్రకృతిని శాంతించమని చెప్పాడు.

విశ్వామిత్రుడు శ్రీరాముడిని అభినందనగా చూశాడు. జనకమహారాజు తేరుకొని... "మునీంద్రా... శ్రీరాముడు మహావీరుడు, శక్తిమంతుడు. నే

అనుకున్న మాట ప్రకారం... విల్లువిరిచిన శ్రీరామునకు నా బంగారు తల్లి సీతనిచ్చి వివాహం చేస్తాను. దశరథ పుత్రుడు శ్రీరాముడు నాకు అల్లుడు. నా ప్రాణంకంటే మిన్న అయిన సీతను రాముడికిచ్చి వివాహం చేసి నా జన్మని చరితార్థం చేసుకుంటాను.... తమరు అనుమతించవలెనని వేడుకుంటున్నాను"

విశ్వామిత్రడు శ్రీరాముని వైపు చూసి, ఆపై జనకమహారాజుతో 'శుభమస్తు' అన్నాడు.

"బ్రహ్మర్షీ! నేను అదృష్టవంతుల్లో కెల్లా మహా అదృష్టవంతుడను. లోకైక వీరుడైన శ్రీరాముడిని అల్లునిగా చేసుకుంటున్నాను. నా జన్మ చరితార్థమయ్యింది. తమరనుమతిస్తే మహామంత్రులు అయోధ్య కెళ్ళి దశరథ మహారాజుకు జరిగిన వృత్తాంతమంతా విన్నవించి అనుమతి కోరమని పంపిస్తాను. తమతో వచ్చిన వైనం..... శివధనుస్సు సంధించటం వివరంగా చెప్పి.... ఆయన్ని సగర్వంగా సపరివారంగా ఇక్కడికి వచ్చేలా చేస్తాను"

విశ్వామిత్రుడు శ్రీరామునివైపు తిరిగి 'వివాహమస్తు' అని చేయి ఎత్తి దీవించాడు. శ్రీరాముడు నును సిగ్గుతో తలవంచుకున్నాడు. లక్ష్మణుడు శ్రీరాముడిని చూసి సంతోషించాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

జనక మహారాజు ఆజ్ఞతో మహామంత్రులు అత్యంత వేగంగా వెళ్ళే గుర్రాలపై ప్రయాణించారు. మూడురాత్రులు దాటాక అయోధ్య చేరారు. కోట ద్వారపాలకులకు విషయం చెప్పారు.

జనకమహారాజు మంత్రులు దశరథుని అనుమతితో రాజగృహానికి చేరారు.

దశరథ మహారాజుని చూస్తూనే వారికి ప్రయాణించిన అలసట మాయమైంది. వినమ్రత నమస్కారాలు చేశారు.

"ప్రభూ! మేం జనకమహారాజు దూతలం. మా రాజు తొలిగా మిమ్మల్ని కుశలప్రశ్నలు అడిగి తెలుసుకోమన్నారు.

"మహారాజా! మా రాజు జనకమహారాజు కూతురు సీతాదేవి. దేవతలిచ్చిన శివధనుస్సుని ఎక్కు పెట్టిన వారికే సీతాదేవినిచ్చి వివాహం చేస్తానని మా రాజు ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు. ఎందరో ప్రయత్నించి విఫలమయ్యారు. కష్టగట్టిన వారిని మా రాజు తన తపఃశక్తితో చెల్లా చెదురుచేశాడు.





"విశ్వామిత్రుల వారితో శివధనుస్సు దర్శించటానికి వచ్చిన మీ కుమారుడు శ్రీరాముడు విల్లు విరిచాడు..." అంటూ జరిగినదంతా దశరథ మహారాజుకు విన్నవించారు.

"విశ్వామిత్రులవారి అనుమతితో మీ వద్దకు వచ్చాం. మహాపరాక్రమమే సీతాదేవి ఓలి... సీతాదేవికి శ్రీరాముడు వీరశుల్కము ఇచ్చినాడు... కాన మహారాజా.... మా రాజు విన్నపం విశ్వామిత్రుల వారి అభీష్టం తెలియ చెప్పాం"

అంతా విన్న దశరథుడు ఆనందంతో తబ్బిబ్బుబ్బిబ్బయ్యాడు. అనుంగులను పిలిపించాడు. అందరితోనూ విషయాన్ని చెప్పాడు.

కౌసల్యా, సుమిత్రా, కైకేయీల ఆనందానికి అవధులు లేవు.

వశిష్ఠ మహర్షి , వామదేవుడు, మంత్రులు సంతసించారు. దశరథ మహారాజు మరుసటి రోజే ప్రయాణమవ్వాలని నిశ్చయించాడు.

దశరథమహారాజు మంత్రులకి విడిది ఏర్పాటు చేయించాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

రాత్రి గడిచింది. తెల్లవారింది... ఋత్విజులతోనూ, మంత్రులతోనూ, సుమంత్రుడితోనూ దశరథుడు చెప్పాడు.

"అపూర్వ ధనరాసులనూ, రత్నాలనూ ధనాధ్యక్షులతో పంపు.... ఆపై వేగంగా ప్రయాణమునకు సన్నాహాలు చేయి. ప్రయాణానికి దూతలు ఆత్రుత పడుతున్నారు"

దశరథుడి ఆజ్ఞతో మంత్రులు ఆజ్ఞలు జారీ చేశారు. సుమంత్రుడి పర్యవేక్షణలో ప్రయాణానికి సర్వం సిద్ధమైంది. వశిష్ఠ మహర్షీ, వామదేవుడూ, జాబాలీ, కాశ్యపుడూ, దీర్ఘాయువూ, మార్కండేయుడూ, కాత్యాయనుడూ, దశరథుని ఆజ్ఞతో ముందు బైలుదేరారు.

వారి వెనుక చతురంగ బలాలతోనూ, పరివారాలతోనూ దశరథ మహారాజు కదిలాడు.

నాలుగు రోజులు ప్రయాణించారు. విదేహ రాజ్యం చేరారు. దశరథ మహారాజు రాక వర్తమానం జనకునికి తెలిసింది. విదేహ రాజ్య సరిహద్దులోనే జనకుడు ఎదురెళ్ళాడు. దశరథునికి నమస్కరించాడు. ఒకరినొకరు ఆలింగనం చేసుకున్నారు. వారినందరినీ వెంట తీసుకొని యజ్ఞవాటిక వద్దకు తీసుకువచ్చాడు. యథోచితంగా అన్ని సత్కారాలు చేశాడు జనకుడు.

"అయోధ్యా పురదీశా! దశరథ మహారాజా... చాలా సంతసిస్తున్నాను. నా భాగ్యానికి మురిసి పోతున్నాను. మహా వీరుడైన శ్రీరాముని తండ్రి దశరథ మహారాజు..... వారి పురోహితులు వశిష్ఠులు ఇంత మంది ఋత్విజులు నా రాజ్యాన్ని పావనం చెయ్యటం నా పూర్వ జన్మ సుకృతం. ఇక్ష్వాకు వంశంతో వియ్యమొందబోతున్నాను. నా వంశం మహాపూజ్య నీయమౌతోంది.....

"దశరథ మహారాజా! నా యజ్ఞం రేపటితో పూర్తి అవుతుంది. మహర్షులు.... ఋత్విజులు... ఆత్మీయులు ..... మీ సమ్మతితో వివాహం చేయదలిచాను ...." చెప్పాడు.

దశరథ మహారాజు చిరునవ్వు నవ్వాడు.

"జనక మహారాజా!... నీవు ధర్మం తెలిసిన వాడవు. ఇచ్చే వాళ్ళ ఇష్టం. పుచ్చుకునే నాదేముంది. నీవు దాతవు. దానంగా దాత ఏది ఇస్తే అది పుచ్చుకోవాలి. కాన తాము ఇచ్చింది పుచ్చుకోవటమే నా పని" చెప్పాడు.

సత్యవాది అయిన ధర్మ సమ్మతుడైన దశరథ మహారాజు మాటలకు జనక మహారాజు సంతసించాడు. ఆపై దశరథుడు పుత్రులని చూసి పరమానందం అనుభవించాడు. దశరథుడు బిడ్డలతో, సపరివారంతో ఆ రాత్రి హాయిగా గడిపాడు.

మరునాడు జనకమహారాజు యజ్ఞ కర్మలను పూర్తి చేశాడు.

జనకమహారాజు తమ్ముడు కుశధ్వజుడని అప్పటికప్పుడు రాజాజ్ఞతో పిలిపించాడు శతానందుడు. వేగులు అమిత వేగంతో పరిగెత్తే గుర్రాలపై వెళ్ళి శివధనుస్సు గూర్చీ, సీతారాములు వివాహం గూర్చీ వివరించి తమ అన్నగారు తమ రాకపై పంపారని చెప్పారు.

కుశధ్వజుడు సాంకాశ్య పట్టణం నుంచి అన్న జనకుడి అభీష్టం ప్రకారం బలగంతో బైలుదేరాడు. కుశధ్వజుడు మిథిల చేరాడు.

అన్నగారికి నమస్కరించాడు. జనకుడు విషయాలన్నీ చెప్పాడు. జనకుడు కొలువు తీరాడు.

ఆపై జనకుడు సుదామనుణ్ణి పిలిచి..."మహామంత్రీ, నీవు తక్షణమే వెళ్ళి దశరథ మహారాజునూ, బంధుమిత్ర పరివారాన్నీ ఆహ్వానించి వెంట పెట్టుకుని ఇక్కడికి తీసుకురావలెను".

దశరథుడు జనకుడి ఆహ్వానంతో మహర్షులతోనూ, బంధువులతోనూ, రామలక్ష్మణులతోనూ, పరివారంతోనూ బయలుదేరాడు.





జనకుడు దశరథుడిని ఆహ్వానించి ఉచితాసనం చూపించాడు. ఇరువైపులా సమస్త బంధు మిత్ర పరివారమూ, పూజ్యులైన ఋషులూ వున్నారు.

దశరథ మహారాజు చక్కగా సరళమైన కంఠంతో....

"జనక మహారాజా! మా ఇక్ష్వాకు వంశానికి పూజ్యనీయుడు, ఏ కార్యమైనా ఆయన చేతులు మీదగానే జరుగుతుంది. ఏం మాట్లాడినా, ఆయనే మాట్లాడతారు. ఇది సర్వులకు తెలిసిన విషయమే. ఆ మహానుభావుడు వశిష్ఠ మహర్షి.... బ్రహ్మర్షి. మా వంశక్రమాన్ని వివరిస్తారు" చెప్పాడు అయోధ్యా పురాధీశుడు దశరథ మహారాజు.

## ఇక్ష్వాకు వంశం

దశరథుని మాటతో వశిష్ఠుడు లేచాడు. అందరి వంక చూసి చెప్పటం ప్రారంభించాడు.

"పుట్టుక తెలియని వాడు... అంతం లేనివాడు, శాశ్వతుడూ, అవ్యయుడూ బ్రహ్మదేవుడు. ఆయన పుత్రుడే మరీచి... ఆ మరీచికి కాశ్యపుడూ, ఆ కాశ్యపునకు సూర్యుడూ, ఆ సూర్యుడికి మనువు జన్మించారు.

"ఆ మనువే పూర్వ ప్రజాపతి... మనువు కొడుకే ఇక్ష్వాకుడు. ఆ ఇక్ష్వాకుడే మొదటగా అయోధ్యను పరిపాలించింది.

"ఇక్ష్వాకు పుత్రునకు కుక్షి, ఆ కుక్షి పుత్రుడు వికుక్షి. వికుక్షి కొడుకు బాణుడు. అతను మహాతేజోవంతుడు, వీరుడు, శూరుడు... ఆ మహావీరబాణుడి కొడుకు అనరణ్యుడు.

"ఆ అనరణ్యునకు పృథువు, పృథువు కొడుకు త్రిశంకుడు, త్రిశంకువుకు దుంధుమారుడు, దుంధుమారుడికి యవనాశ్వుడు, యవనాశ్వుడికి మాంధాత, ఆ మాంధాతకు సునంధియు, ఆ సునంధికి ధ్రువసంధితో పాటు ప్రసేనజిత్ పుత్రులు.

"ధ్రువసంధికి భరతుడు జన్మించాడు. మహాయశస్వి భరతనకు అసితుడు జన్మించాడు. ఆ అసితుడి మీదకు హైహయులూ, తాలజంఘులూ, శశిబిందువులూ యుద్ధానికి వచ్చారు. ఆ దండ యాత్రలో అసితుడు ఓడిపోయాడు.

"తన భార్యలతో హిమవత్పర్వతానికి అసితుడు కొద్దిపాటి సైన్యంతో పలాయనము అయ్యాడు.

"భృగుతుంగం వద్ద తలదాచుకున్నాడు. ఆ భృగు శిఖరం వద్దే అతని రాణులు గర్భవతులయ్యారు.

"పట్టపురాణి అంటే చిన్న భార్య కాళిందికి పడదు. ఆమె గర్భాన్ని పోగొట్టడానికి పట్టపురాణి భక్ష్యంలో విషం కలిపి పెట్టింది.

"అది తిన్న తర్వాత గానీ ఆమెకి తెలిసిరాలేదు చిన్నరాణి కుతంత్రం. ఎంతో బాధపడింది. తన గర్భం విచ్ఛిన్నం కాకూడదని భృగువంశీయుడైన చ్యవన మహర్షిని దర్శించింది.

"ఆయనకి సత్కారాలు చేసి మెప్పించింది. అందులకు చ్యవన మహర్షి ఆశీర్వదించాడు.

"భాగ్యవతీ! వ్యధ చెందకు. నీ గర్భంలో మహాబలవంతుడు, తేజోవంతుడైన శిశువు వున్నాడు. నీవు తిన్న విషం ఏమీ చెయ్యదు. నీ దేహంలో విషం జీర్ణమైన తర్వాత నీకు పుత్రుడు జన్మిస్తాడు" అని దీవించాడు.

"ఆ తర్వాత అసితుడు కాలం చేశాడు. ఆ దుఃఖంలో ఉండగానే చ్యవన మహర్షి చెప్పినట్టు చక్కటి పుత్రుడికి జన్మనిచ్చింది. సవతి పెట్టిన గరళంతో పుట్టడంతో ఆ శిశువుకి సగరుడని నామకరణం చేసింది. ఆ సగరుడే అయోధ్య రాజ్యానికి చక్రవర్తి అయ్యాడు.

"సగరుడి పుత్రుడు అసమంజుడు. అతని పుత్రుడు అంశుమంతుడు. అంశుమంతుని కొడుకు దిలీపుడు. దిలీపునకు భగీరథుడు. దివి నుంచి భువికి గంగను తెచ్చిన భగీరథుని పుత్రుడు కకుత్స్థుడు. అతని పుత్రుడు రఘుడు. రఘువు కొడుకు ప్రవృద్ధుడు.

"ఆ ప్రవృద్ధుడే పురుషాదుడూ, కల్మాషపాదుడూ అయ్యాడు. ఆయనకు సుదర్శనుడు, ఆ సుదర్శనునకు అగ్నివర్ణుడూ, ఆ అగ్నివర్ణుడికి శీఘ్రగుడు, శీఘ్రగునికి మరువు, ఆ మరువుకి ప్రశుశ్రుకుడు, ఆ ప్రశుశ్రుకుడికి అంబరీషుడు, ఆ అంబరీషునకు నహుషుడు, ఆ నహుషునకు యయాతి, ఆ యయాతికి నాభాగుడు, ఆ నాభాగునకు అజుడు జన్మించాడు. ఆ అజుడి పుత్రుడే దశరథ మహారాజు.

"ఆయన పుత్రులు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు.... జనక మహారాజా... అది ఇక్ష్వాకువంశ క్రమం. వీరంతా ధార్మికులూ, వీరులూ. మహోన్నతమైన చరిత్రగలవాళ్ళు... వీరాగ్రేసరులు. అన్నీ లోకాల్లోనూ సాటిలేని అందగాళ్ళు. అట్టి రామలక్ష్మణులకు నీ వంశదీపాలైన ఇద్దరు కూతుళ్ళు సీతనూ, ఊర్మిళనూ





రామ, లక్ష్మణులకిచ్చి పెళ్ళి చెయ్యమని కోరుతున్నాను" వశిష్ఠ మహర్షి సావధానంగా చెప్పాడు.

## జనకమహారాజు వంశం

వశిష్ఠ మహర్షి ఇక్ష్వాకు వంశం గూర్చి చెప్పిన విషయాలన్నీ శ్రద్ధగా ఆలకించిన జనకమహారాజు సంతృప్తిగా చూశాడు.

"బ్రహ్మర్షీ... మీకు శుభం. కన్యాదానం చేయ తలపెట్టినప్పుడు తన వంశాన్ని గూర్చి చెప్పుట ఆనవాయితి. మా వంశ క్రమం గూర్చి ఆలకించండి....

"మా వంశ మూల పురుషుడు నిమి చక్రవర్తి. అతను పరాక్రమవంతుడు. వీరాధివీరుడు. ఆయన పుత్రుడు మిథి. ఆ మిథే సుందరమైన మిథిలానగరాన్ని నిర్మించాడు. మొదటి జనకుడతడే.

"మిథి కుమారుడు ఉదావసువు. ఉదావసువు పుత్రుడు నందివర్ధనుడు. అతని కుమారుడు సుకేతువు, సుకేతుడి కొడుకు దేవరాతుడు. మహాబలవంతుడు, రాజఋషి అయిన దేవరాతుడి పుత్రుడు బృహద్రథుడు. బృహద్రథుడి పుత్రుడు మహావీరుడు. పేరుకు తగ్గవాడు. అతని పుత్రుడు సుధృతి.

"సుధృతి పుత్రుడు ధృష్టకేతువు. అతని పుత్రుడు హర్యశ్వుడు. ఆయన పుత్రుడు మరువు. అతని పుత్రుడు ప్రతింధకుడు. ప్రతింధకుని కొడుకు కీర్తిరథుడు.

"ఆ కీర్తిరథుని కుమారుడు దేవమీఢుడు. అతని పుత్రుడు విబుధుడు. ఆ విబుధుడికి మహీధ్రకుడూ, మహీధ్రకుడికి కీర్తిరాతుడూ జన్మించారు.

"మహాబలశాలి, రాజర్షి అయిన కీర్తిరాతుడికి మహారోముడూ, ఆ మహారోమునికి స్వర్ణరోముడూ, ఆ స్వర్ణరోముడికి హ్రస్వరోముడూ పుట్టారు.

"ధర్మాత్ముడైన హ్రస్వరోముడు మా తండ్రిగారు. నేను పెద్దవాడ్ని. జ్యేష్ఠుణ్ణి. ఈ మహాసామ్రాజ్యానికి నన్ను పట్టం కట్టి తమ్ముడిని కుశధ్వజుడ్ని అప్పచెప్పి ఆయన తపోవనాలకి వెళ్ళారు. వయసు భారంతో తనువు చాలించారు.

"నా తమ్ముడంటే నాకు ప్రాణం తమ్ముడిని చూసుకుంటూ రాజ్యపాలన చేస్తున్నాను. ఆ సమయంలో సాంకాశ్యపురం రాజు సుధన్వుడు ఈ మిథిలను ముట్టడించాడు. ధర్మమార్గాన పరిపాలన చేస్తున్న నన్ను శివధనుస్సునూ, సీతనూ ఇమ్మని అడిగాడు.

"నిరాకరించిన నాతో యుద్ధం చేశాడు. ఆ యుద్ధంలో అతన్ని సంహరించాను. సాంకాశ్య పట్టణాన్ని స్వాధీన పరుచుకుని నా తమ్ముడు కుశధ్వజునకు పట్టం గట్టాను.

"సాంకాశ్య పట్టణం మనోహరంగా వుంటుంది. చక్కటి ఉసిరిక చెట్లతో శోభాయమానంగా వుంటుంది. దూరం నుంచి చూస్తే కుబేరుని పుష్పక విమానంలా వుంటుంది.

"బ్రహ్మర్షీ... నా ఇద్దరు పుత్రికలను ఇక్ష్వాకువంశంలో ఇవ్వమని అడిగారు. సంతోషం. సర్వం శుభం. మహదానందం. సీత దేవకన్య. పరాక్రమమే వీర్యశుల్కం.

"శ్రీరామునకు ఇచ్చి చేయాలని శివధనుస్సు విరిచిననాడే నిర్ణయమైంది. దశరథ మహారాజు పుత్రులకు సంతోషంగా, పరమానందంగా సీతను శ్రీరామునకూ, లక్ష్మణునకు ఊర్మిళనూ ఇచ్చి వివాహం చేస్తాను. త్రికరణ శుద్ధిగా మూడు పర్యాయములు నొక్కి చెపుతున్నాను."

"దశరథ మహారాజా... అంతా శుభమే. శ్రీరామలక్ష్మణులకు సమావర్తనము చేయించవలెను. వివాహానికి ముందు చెయ్యాల్సిన నాంది కార్యాదులను జరిపించాలి. నాడు మఘా నక్షత్రము. ఎల్లుండి ఉత్తరఫల్గుణి. వివాహానికి బహుమంచిది."

"ఓ జనకమహారాజా.... సత్ఫలాలు ఇచ్చే గోదానము శ్రీరాముడితో చేయించవలెనని కోరుతున్నాను....."

విశ్వామిత్రుడూ, వశిష్ఠ మహర్షీ ఆలోచించారు. ఇద్దరూ ఓ నిర్ణయానికి వచ్చారు. విశ్వామిత్రుడు ప్రసన్న వదనంతో జనక మహారాజుతో చెప్పాడు.

## కుశధ్వజుని పుత్రికలు

"మహారాజా! ఇక్ష్వాకు వంశము, విదేహ రాజు వంశమూ రెండూ బహు గొప్పవి. మీ వంశాల మూల పురుషులతో సరైనవారు పృథ్విలోనే లేరు.

"వధూవరులు సరిసమానమైన రూపసులు. శ్రీరామునకు సీతా, లక్ష్మణునకు ఊర్మిళా..... బహు చక్కటి జోడు. చూడ ముచ్చటైన జంటలు.

"ఓ జనకమహారాజా! నేనూ, వశిష్ఠిల వారు ఏకమాట మీదే అడుగుతున్నాం. మీరూ, మీ తమ్ముడు కుశధ్వజుడు మా మాటలను పాటించవలెను.





"మీ తమ్ముడితో కూడా దశరథ మహారాజుతో వియ్యం చేయటం ఉచితము. మీ సోదరుని పుత్రికలు, అసమాన సుందర కన్యామణులను భరత శత్రుఘ్నులకు నిర్ణయిస్తున్నాం.

"దశరథ మహారాజు పుత్రులు దిక్పాలకుల వంటి వారు. సద్గుణ సంపన్నులు ఈ అన్నదమ్ములు. సత్వరం ఆలోచించి తగు ఆనందమగు నిర్ణయం తీసుకొని, మీ రెండు వంశాల వారు చుట్టరికంతో కలసిపోవాలని మా కోరిక...."

విశ్వామిత్రుని మాటలకు జనకమహారాజు తమ్ముడు కుశధ్వజునితో కలిసి ఆలోచించాడు. మహర్షుల ఇద్దరికీ నమస్కరించాడు.

"రాజర్షులారా! ఈ వేళ నా ఆనందం మాటలతో చెప్పవీలు కానున్నది. మీ మాటలను మేం శిరసావహిస్తున్నాం.

"నా తమ్ముడి కూతుళ్ళని మాండవీ, శ్రుతకీర్తినీ, భరత, శత్రుఘ్నులకు ఇచ్చి వివాహం చెయ్యటానికి సిద్ధం.

"నాలుగు వివాహాలు ఒక్కనాడే మహాబలశాలులగు రాజ పుత్రులకు ఒకే మండపంలో ఒకే ముహూర్తంలో చేయించవలెను.

"ఉత్తర ఫల్గుణీ నక్షత్రానికి సంతానదాత భగుడు అధిష్ఠాన దేవత. ఆ నక్షత్రంలో పగటి వేళ వివాహం మహాప్రశస్తం అని పండితులు చెప్పినారు. దశరథ మహారాజు వలె నేనూ తమ శిష్యుడనే. మీ మాట నాకు శిరోధార్యం. మా అన్నదమ్ములకు కన్యాదాన ప్రాప్తి కలిగించి మమ్ము సంతృప్తులు చేయ ప్రార్థన...."

జనకమహారాజు చెప్పిన తీరుకి మహర్షులు ఆనందపడ్డారు. దశరథ మహారాజు పొంగిపోయాడు. జనక మహారాజును అభినందించాడు. మహర్షులతో కలిసి శెలవు తీసుకొని విడిది చేరాడు....

దశరథ మహారాజు నాందీ కార్యాదులను శాస్త్ర ప్రకారం చేయించాడు. మరుసటి రోజు ఉదయం కాళ్ళగోళ్ళ సంబరం చేయించాడు.

నలుగురు పుత్రుల కోసం నాలుగు లక్షల పాడి ఆవులను తెప్పించాడు. ఆవుల కొమ్ములకు బంగారు తొడుగులు వేయించాడు. పాలు పితుకుటకై నాలుగు లక్షల కంచు చెంబులను సిద్ధంగా వుంచాడు.

ఆవులనూ, కంచు చెంబులనూ బ్రాహ్మణోత్తములకు దానం ఇచ్చాడు దశరథ మహారాజు.

అప్పుడు దశరథ మహారాజు దిక్పాలకులతో ప్రకాశించే బ్రహ్మలా వున్నాడు. నలుగురి కొడుకుల వివాహతంతును చూసి మురిసిపోయాడు.

## శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల వివాహము

దశరథ మహారాజు దానాలు చేస్తున్నాడు. ఆ సమయాన భరతుడి మేనమామ యుధాజిత్తు వచ్చాడు.

కేకయ రాజు పుత్రుడు. కైక అన్నదమ్ముడు. దశరథుని కుశల ప్రశ్నలు అడిగాడు.

"మా తండ్రిగారు కేకయరాజు మీ క్షేమ సమాచారాలు అడిగారు. భరతుడిని చూడాలని వుందన్నారు. ఆ కారణంగా అయోధ్య వెళ్ళాను. శ్రీరాముని వివాహమై మీరిక్కడికి వచ్చినట్టు శుభవార్త తెలుసుకుని, పెండ్లి కొడుకుని చూసినట్లూ మీ దర్శనమూ అయినట్లూ వుంటుందని వేగిరంగా వచ్చాను."

బంధువుకు ఆత్మీయసత్కారాలు చేశాడు దశరథ మహారాజు.

ఆ రోజు కొడుకులతోనూ, మిత్రులతోనూ, బంధువులతోనూ సుఖంగా గడిపి మరుసటి రోజు ఉదయాన్నే సమస్త కర్మలు ముగించుకొని మహర్షుల వెంట యజ్ఞశాలకి తరలి వెళ్ళాడు.

రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకి శుభకరమైన మంగళ స్నానాలు చేయించారు. సర్వాభరణాలతో అలంకరించారు. చేతులకు మంగళ తోరణాలు కట్టారు.

విజయము అను ముహూర్తంలో మహర్షులతో నడిచాడు దశరథ మహారాజు.

"జనక మహారాజా! దశరథ మహారాజు తన నలుగురి పెండ్లికుమాళ్ళతో కన్యాదాత కోసం ఎదురు చూస్తున్నాడు. తమరు తమ ధర్మము జరుపవలసింది" చెప్పాడు వశిష్ఠ మహర్షి.

"మహర్షీ! నా పుత్రికలు సీతా-ఉర్మిళా-మాండవీ-శ్రుతకీర్తి మంగళ కార్యాలన్నీ పూర్తి చేసుకొని వెలుగుతున్న అగ్నిహోత్రాల్లా వేదిక వద్ద వున్నారు. నేనూ సిద్ధం....." అంటూ ఎదురెళ్ళి దశరథ మహారాజునూ, పెండ్లి కుమాళ్ళనూ ఆహ్వానించాడు.





వశిష్ఠ మహర్షి శతానందులతో కలిసి యథాశాస్త్రముగా అగ్నివేదిక నిర్మించారు. గంధ పుష్పములు, బంగారు పాలికలూ, అంకురములు గల రంధ్రములతో కుంభములూ, అంకురం నిండిన మూకుళ్ళు, ధూపపాత్రలూ, శంఖాకార పాత్రలూ, స్రుక్కులూ, స్రవములూ, అర్ఘ్యజలపాత్రలూ, పేలాలూ, అక్షితలు సిద్ధం చేసుకున్నారు.

వేదికలో అగ్నిహోత్రాన్ని ఉంచాడు. హెచ్చు తగ్గులు లేని దర్భలను సమంత్రకముగా పరిచాడు. వేదమంత్రాలతో హోమం చేశాడు.

## శ్రీ సీతారామ వివాహ ఘట్టం

అప్పుడు జనక మహారాజు సర్వాభరణభూషిత అయిన సీతను వెంట బెట్టుకొని అగ్నిహోత్రం దగ్గర శ్రీరాముని ఎదుట నిల్చుండబెట్టాడు.

"శ్రీరామా! ఇదిగో సీత. కౌసల్యానంద వర్ధన రామా! నా కుమార్తెయైన సీత నీకు సహధర్మచారిణి. సీతను స్వీకరింపుము. నీ హస్తముతో ఈమె హస్తమును పట్టుకొనుము. మహాభాగ్యవంతురాలగు సీత మహాపతివ్రతయై నీడవలె నిన్ను సర్వదా అనుసరించగలదు" జనకమహారాజు పలికి మంత్ర పూరితమైన జలమును వదిలాడు.

దేవతలు, ఋషులు కనులారా ఆనందకరమగు క్షణాలను వీక్షించారు. దేవ దుందుభులు మ్రోగాయి. పూలవాన కురిసింది. జనకమహారాజు ఆనందానికి అవధే లేకుండా పోయింది. ఉప్పొంగి పోయాడు.

"లక్ష్మణా! ఇదిగో ఊర్మిళ... స్వీకరించు... ముహూర్తం వేళ... పాణిగ్రహణం చేయి. భరతా! మాండవి చేతిని చేతిలోకి తోసుకో.. శత్రుఘ్నా! శ్రుతకీర్తి చేతిని నీ చేతిలోకి తీసుకో... సుముహూర్తం... శుభం...."

వశిష్ఠముని వేదమంత్రాలు పలుకుతుండగా రాజపుత్రికల చేతులు అందుకున్నారు.

శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు తమ భార్యల చేతులు పట్టుకొని అగ్నిహోత్రానికీ, జనకమహారాజుకూ, మహర్షులకూ ప్రణామాలు చేశారు. ప్రదక్షిణము కావించారు.

ఆ శుభ సమయాన అప్సరసలు ఆడారు. గంధర్వులు పాడారు.

కొత్త దంపతులు ఆనంద సంతోష తరంగాల మధ్య అగ్నిహోత్రాలకు ముమ్మారు ప్రదక్షిణం చేసి వివాహ కలాపమును పూర్తి చేశారు.

జనకమహారాజు ఏర్పాటు చేసిన విడిదికి తరలి వెళ్ళారు. దశరథ మహారాజు పుత్రుల వివాహాన్నీ, వైభవాన్నీ చూస్తూ ఆనందడోలికల్లో తేలిపోయాడు. బంధుమిత్ర పరివారంతో విడిది చేశాడు.

ఆ రాత్రి గడిచింది. .... మరుసటి రోజు..... విశ్వామిత్ర మహర్షి హిమాలయాలకు వెళ్ళేందుకు సిద్ధమయ్యాడు. నూతన దంపతులను ఆశీర్వదించాడు. హిమవత్పర్వత ప్రాంతానికి వెళ్ళిపోయాడు.

దశరథ మహారాజు సమస్త పరివారంతో అయోధ్యకి బైలుదేరుటకు సంసిద్ధుడయ్యాడు.

జనక మహారాజు తన కుమార్తెలకు అరణముగా అత్యధిక ధనాన్ని ఇచ్చాడు.

ఆ మిథిలేశ్వరుడు లక్షల కొలది ఆవులనూ, కంబళాలనూ, కోట్లకొద్ది పట్టు వస్త్రములనూ, ఏనుగులనూ, అశ్వములనూ, రథములనూ చతురంగ సైన్యమునూ, సుందరమైన దాసీలను కూడా అరణముగా పంపాడు.

దశరథమహారాజు జనకునితో హిత వాక్యాలు పలికి పుత్రులనూ, ఋషులనూ ముందు ఉంచుకొని సైన్యమూ, అనుచరులూ వెంటరాగా అయోధ్య బైలుదేరాడు.

## పరశురాముడు

దశరథుడు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులతో సమస్త పరివార సమేతుడై ప్రయాణిస్తుండగా భయంకరమైన పక్షులు భయంకర ధ్వనులు చేశాయి. ఆకాశంలో కీసర బాసరగా అరుస్తూ తిరుగుతున్నాయి. జంతువులు భయంతో ప్రదక్షిణం చేస్తున్నాయి.

"వశిష్ఠ మహర్షీ..... ఏమిటీ దుర్నిమిత్తాలు... చెడు పిట్టలు ఘోరంగా అరుస్తున్నాయి. నా మనసెందుకో వేదన పడుతోంది" - అడిగాడు దశరథుడు.

"రాజా... ఏదో భయంకర ఉపద్రవం వచ్చే సూచనలు. కానీ భూమి మీద పక్షులు మనకు ప్రదక్షిణముగా పరిగెత్తుట వల్ల ఆ ఘోరం వల్ల ఎట్టి ప్రమాదం వుండదని సూచిస్తోంది. కాన భీతి చెందకు దశరథా."

అంతలోనే పెద్దగాలి. సముద్రపు అలలు తగులుతున్నట్టు భీకరమైన గాలి. దిక్కులు కూడా తెలియటం లేదు.

ఆ భయంకర దుమారంలో చతురంగ బలాలు కూరుకుపోయాయి.





వశిష్ఠుడూ, మహర్షులూ, దశరథ మహారాజూ, ఆయన పుత్రులూ తప్ప అంతా అచేతనులయ్యారు. జగత్తు మసి పూసినట్లైయింది. మహావృక్షాలు నేలకూలాయి.

ఆ చీకటిలో కళ్ళు మిరుమిట్లు గొలిపే వెలుగు. ఆ వెలుగులో కైలాస పర్వతంలా పరుశురాముడు రౌద్రంగా ప్రత్యక్షమయ్యాడు. భుజం మీద గండ్రగొడ్డలి. చేతిలో ధనుస్సు... త్రిపురాసుర సంహారానికి పోతున్న మహాశివుడిలా ఉన్నాడు.

అగ్నిహోత్రములా జ్వలిస్తున్న భార్గవరాముడిని చూస్తూనే మునీశ్వరులూ, వశిష్ఠ మహర్షీ, దశరథుడూ....

"తన తండ్రిని ఒక క్షత్రియుడు చంపాడని లోకంలో క్షత్రియులు అందరినీ సంహారము చేశాడు... ఆపై శాంతించాడు. మళ్ళీ ఎందుకు వచ్చినట్టు ... క్షత్ర సంహారానికి కాదు గదా..!" అనుకున్నారు.

లోలోన అనుకుంటూనే భయశ్రద్ధలతో "ఓ భార్గవ రామా!...." అంటూ స్తుతించి... స్తోత్రించి అర్ఘ్యము ఇచ్చారు. క్రోధంతోనే వాటిని స్వీకరించాడు. దశరథుడి వంక నిప్పులు కక్కేలా చూశాడు.

"రాముడు... శ్రీరాముడట... ఏడీ..." గర్జించాడు పరశురాముడు. దశరథ మహారాజు మొహం చిన్నబోయింది. చిన్నారి రాముని గూర్చి పరశురాముడు ఎందుకు అడుగుతున్నాడు.

"రాముడు... మహాపరాక్రమవంతుడట... తాటకిని చంపాడట... శివధనుస్సు విరిచాడట...."

దశరథుడు దీనుడయ్యాడు.

"భార్గవ రామా... తమకు క్షత్రియుల మీద కోపం ఎప్పుడో పోయింది. మహాయశస్వివి. నా పిల్లలు పసివారు. తమరే ఆశీర్వదించవలెను"

"దశరథ మహారాజా...! రాముడు శివధనుస్సును విరిచాడట. అంతటి వీరుడా... ఇదిగో నా తండ్రి జమదగ్ని ధనుస్సు... బాణం సంధించి నీ బలం చూపించు.

"రామా... ముందుకు రా.. నీతోనే యుద్ధం చేస్తాను".

దశరథుడు కలవరపడిపోయాడు.

"భార్గవ రామా! క్షత్ర సంహారం చేసి శాంతించి, భూమినంతటిని కాశ్యపునికి దానము ఇచ్చి, శస్త్రాస్త్రాలను వదిలిపెడుతున్నానని దేవేంద్రుని ఎదుట ప్రతిజ్ఞ

చేశావు. వేదాధ్యయనము చేసుకుంటూ మహేంద్ర పర్వతముపై తపస్సు చేసుకుంటున్నావు. అట్టి నీకు పసివాడు రాముడితో యుద్ధమా...!?"

దశరథుని మాటలు పట్టించుకోకుండా పరశురాముడు నిప్పులు కురిపిస్తూ మాట్లాడాడు.

"దాశరథీ... ఇదిగో విల్లు. విశ్వకర్మ నిర్మించిన రెండింటిలో ఒకటి త్రిపురాసుర సంహారము కోసం దేవతలు శివుడి కిచ్చారు. రెండోది మహావిష్ణువుకి ఇచ్చారు...

"ఇదిగో విష్ణు చాపం. విదేహరాజు దేవరాతుడికిచ్చిన శివధనుస్సు విరిచి మహోపచారం చేశావు. విష్ణుమూర్తి ఋచీక మహర్షికి, ఆయన తన కుమారుడు జమదగ్నికి ఇచ్చిన విల్లు.... వైష్ణవ ధనుస్సు. నీవు క్షత్రియుడవు అయితే ఈ వింటిని ఎక్కుపెట్టు" చెప్పాడు పరశురాముడు.

శ్రీరాముడు ముందుకు వచ్చాడు. శాంత చిత్తముతో పరశురాముడిని చూశాడు. వింటిని అందుకున్నాడు. వింటిని వంచి అల్లెత్రాటిని ఎక్కించి బాణం సంధించాడు.

మహామెరుపు మెరిసింది. పరుశురాముడు శ్రీరాముడ్ని తేరిపార చూశాడు. వైకుంఠవాసుడు శ్రీ మహావిష్ణువు కానవచ్చాడు.

"పరశురామా! నీవు బ్రాహ్మణుడివి.... పై పెచ్చు విశ్వామిత్రుడి బంధువువి. ఎక్కుపెట్టిన బాణాన్ని దించను... సంధించవలసిందే. పూజ్యుడవైన నీపై ప్రయోగించలేను. వ్యర్థముగా నేలపాలు అవరాదు. ఈ బాణముతో పాదగమన శక్తినో, తపోబలంతో సాధించిన పుణ్యలోక ప్రాప్తినో హరిస్తాను.. ఏది చెయ్యవలెనో నీవే చెప్పు పరశురామా......" శ్రీరాముడు చెప్పాడు.

విష్ణు ధనుస్సును ఎక్కిపెట్టిన శ్రీరాముడు మహోన్నతమైన దివ్యకాంతులతో తేజరిల్లుతున్నాడు. బ్రహ్మాది దేవతలతో పాటు యక్షులు, కిన్నెరలు, గంధర్వులు, గరుడ, కింపురుషులు తన్మయంగా పైనుంచి చూస్తున్నారు.

పరశురాముడు ఆ వెలుగుని చూడలేకపోయాడు. తన ముందున్నది సాక్షాత్తు మహావిష్ణువు....

"రామా! నా అజ్ఞానాన్ని మన్నించు... ఇద్దరు రాములుండరాదన్న నా అహం తీరింది. లోకానికి పరుశురాముని అవసరం లేదు. లోకాలకి నాథుడవు. ఈ భూమంతా కాశ్యపునకు దానం ఇచ్చాను. నేను ఇచ్చిన భూమిలో





ఉండకూడదని కాశ్యపుడు శాసించాడు. రాత్రిపూట ఈ భూమిపై ఉండటం లేదు. చీకటి పడుతోంది. మనోవేగంతో మహేంద్ర పర్వతానికి వెళతాను... పాదగతిని ఖండించవద్దు" చెప్పాడు పరశురాముడు.

శ్రీరాముడు బాణం వదిలాడు. మహాతపఃసిద్ధితో సంపాదించుకున్న పుణ్య లోకప్రాప్తిని హరించి వేసిందా బాణం.

పరశురాముడు అంతర్ధానమయ్యాడు. అన్ని దిక్కుల్లో చీకట్లు తొలగిపోయాయి. దేవతలు శ్రీ కోదండరాముడిని స్తుతించారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

శ్రీరాముడు ప్రశాంత వదనంతో తండ్రి వంక చూశాడు. పరశురాముడిచ్చిన వింటినీ, అంబునూ వరుణదేవునకిచ్చాడు. వశిష్ఠ మహర్షికి నమస్కరించాడు.

"తండ్రీ! పరశురాముడు మహేంద్ర పర్వతానికి తిరిగి వెళ్ళిపోయాడు. మన సేనలను ఆజ్ఞాపించండి. చాతక పక్షులు మేఘాల నుంచి వర్షపు చినుకుల కోసం ఎదురు చూసినట్టు, సమస్త పరివారం మీ ఆజ్ఞకై వేచి వుంది" చెప్పాడు శ్రీరాముడు.

దశరథుడు తప్పిన ముప్పుతో శాంతన పడి శ్రీరాముడి తలను ప్రేమగా, ఆర్తిగా ఆఘ్రాణించాడు. సేనలను అయోధ్య వైపు పయనించమని ఆజ్ఞాపించాడు.

దశరథ మహారాజు సమస్త పరివారముతో, పుత్రులూ, కోడళ్ళతో అయోధ్య వస్తున్నాడని తెలిసి పౌరులంతా బారులు తీరారు.

శ్రీరామచంద్రుడిని చూచుటకై వార్త తెలిసిన ఉత్తర క్షణం నుంచి వేచి ఉన్నారు. నగరాన్ని అలంకరించారు. రాచవీధులన్నీ కల్లాపి చల్లి రంగురంగుల ముగ్గులేశారు. తోరణాలు కట్టారు. జెండాలు ఎగురువేశారు.

మంచి పూలతో ముగ్గులని అలంకరించారు. పురప్రముఖులు, వేద పండితులు మహారాజును స్వాగతించటానికి సిద్ధమయ్యారు.

దశరథుడు అయోధ్యలో అడుగుపెట్టగానే ప్రజలంతా పూల వర్షం కురిపించారు. మంగళ వాయిద్యాలు మారుమ్రోగాయి.

బారులు తీరిన పౌరులను చూసుకుంటూ రాచవీధిలోంచి హిమవత్పర్వత మంతటి తన రాజ భవనంలోకి ప్రవేశించాడు దశరథుడు.

అంతఃపురవాసులు సంతోష నయనాలతో ఎదురొచ్చి గంధ పుష్పాదులు ఇచ్చారు.

కౌసల్యాదేవీ, సుమిత్రాదేవీ, కైకేయీ దేవీ ఎదురొచ్చి కోడళ్ళను కనులారా వీక్షించారు. అక్కున చేర్చుకున్నారు.

సీతా, ఊర్మిళా, మాండవీ, శ్రుతకీర్తులకు అత్తలు ముగ్గురూ మంగళ కరచందన స్నానం చేయించారు. పట్టుచీరలు, నగలతో అలంకరించారు.

మంగళకరమైన నలుగురు రాజపుత్రికలను దైవమందిరంలోకి తీసుకువెళ్ళారు. అత్తగారింటి తొలి పూజను చేయించారు.

పూజాదికాలు అయ్యాక సీతా, ఊర్మిళా, మాండవీ, శ్రుతకీర్తిలు అత్తగార్లకు పాదాభివందనము చేశారు. వారి వారి మందిరాలకు తీసుకువెళ్ళారు కౌసల్యాదేవీ, సుమిత్రాదేవీ, కైకేయీదేవి.

కుబేరుడి భవనంలా వుంది ప్రతివారి మందిరము. బ్రాహ్మణులకు గోదానము, భూదానము ఇచ్చారు. వారి వారి పతులతో నలుగురు రాజ పుత్రికలు ఏకాంతమున భర్తలను కలిశారు. స్వర్గధామములాంటి మందిరంలో స్వర్గసుఖాలను చవి చూశారు.

కొంతకాలం గడిచింది. దశరథుడు ఓనాడు భరతుడిని పిలిచాడు.

“నాయనా! నీ మేనమామ యుధాజిత్తు నీకోసం వచ్చాడు. మిథిలలో ఉండగానే వచ్చాడు. ఆయన కోర్కెని మన్నించి మీ తాతని సంతోషపెట్టాలి” చెప్పాడు పుత్రుడికి దశరథ మహారాజు.

తండ్రి అనుజ్ఞతో భరతుడు ప్రయాణమయ్యాడు. తల్లులకూ, తండ్రికీ, శ్రీరామునకూ నమస్కరించాడు. లక్ష్మణుడని కౌగిలించుకున్నాడు. శత్రుఘ్నుణ్ణి తనతో తీసుకెళ్ళాడు.

శ్రీరాముడూ, లక్ష్మణుడూ తండ్రికి అన్ని విషయాల్లోనూ చేదోడుగా ఉంటూ సేవలందించారు. దశరథుని భావనలకి తగ్గట్టు శ్రీరాముడు రాచకార్యాలన్నీ చక్కపెడుతూ, అయోధ్యావాసులే కాకుండా దూరతీర వాసులూ మెచ్చుకునేలా చేశాడు.

ప్రజలంతా రాముడే తమ రాజని, తమది రామరాజ్యమని పులకించి పోయేవారు. సర్వలోకాలకి ప్రియమైన బ్రహ్మదేవుడిలా రాముడిని ఆరాధించారు.





ఎన్ని రాచకార్యాలున్నా, మరెంత రాజ్యభారాన్ని చూసుకుంటున్నా శ్రీరాముని మనసు ప్రతిక్షణం సీత మీదే ఉండేది. ఏ పని చేసినా సీత మెదులుతుండేది.

సౌజన్య సమస్త సద్గుణాల, త్రిభువన సుందరి సీతంటే శ్రీరామునకు పంచప్రాణాలు. ఆమెలోనే తానూ లీనమై ఉండేవాడు. లోకోత్తర సౌందర్యవతి సీతను శ్రీరాముడు తన హృదయమంతా నింపుకున్నాడు.

సీతకూ అంతే. శ్రీరాముడంటే అమితమైన అనురాగం. ప్రతిఘడియ రాముడినే తలుచుకునేది. శ్రీరామునిపై ఆమె ప్రేమ అపురూపమైనది. వారిరువురు హృదయాలతో సంభాషించుకునేవారు. ఒకరి హృదయంలో నున్న భావం చెప్పకనే ఒకరికొకరు గ్రహించేవారు.

సీతకు రామునిపైనున్న ప్రేమకు రెట్టింపు శ్రీరామునకు సీతపై ఉండేది. శ్రీరామునకు సీతపైనున్న ప్రేమకు రెట్టింపు సీతకు శ్రీరామునిపై ఉండేది.

సీత సౌందర్యమున దేవతా స్త్రీ. మహాలక్ష్మి. మిథిలానగర సంజాత. జనకుని కూతురు మైథిలీ. వైకుంఠంలో మహాలక్ష్మి. అనురాగవతి. ఉత్తమ రాజకన్య. విశాలాక్షీ... సకల అవయవసుందరీ...

మానవ రూపం దాల్చిన మహాలక్ష్మివలే ఉన్న ఆ వైదేహితో శ్రీ మహావిష్ణువు మానవుడైతే ఎట్లుండునో అట్లుండిన శ్రీరాముడు, వైకుంఠాన మహాలక్ష్మి సమేతుడై వుండే మహావిష్ణువులా వెలిగిపోయాడు శ్రీరాముడు.

*శ్రీమద్రామాయణములోని బాలకాండము సమాప్తము*

# అయోధ్యాకాండము





## శ్రీరాముడు యువరాజు

భరత, శత్రుఘ్నులు మేనమామ ఇల్లు చేరారు. అక్కడ అన్ని సత్కారాలు పొందారు. భరతుడూ, శత్రుఘ్నుడూ ఎన్ని సుఖాల్లో వున్నా, తండ్రి దశరథ మహారాజునే తలుచుకుంటూ గడుపుతున్నారు.

తన చెంత లేని పుత్రుల గూర్చి దశరథుడు నిత్యం తలుచుకుంటూ రామలక్ష్మణుల సేవలను అందుకుంటూ సుఖంగా వున్నాడు. కొడుకులందరిలోకెల్లా మహాతేజస్సుగల రాముడంటే దశరథుడికి పంచప్రాణాలు. ఇంద్రుడిని కన్న అదితిలా పొంగిపోయేది కౌసల్య.

దశరథ మహారాజులోని సమస్త సద్గుణాలు శ్రీరాముడిలో మూర్తీభవించేవి. ఎవరిపట్ల అనుచితంగా ప్రవర్తించక, అసూయా ద్వేషాలనూ దరిచేరనీయక సర్వ వర్ణాల పట్ల సమ భావన చూపించే శ్రీరాముడిని చూసి దశరథ మహారాజే కాదు ప్రజలంతా సాక్షాత్తు మహావిష్ణువులా తలచేవారు.

అందరితోనూ మధురంగా మాట్లాడేవాడు, సర్వధర్మాలు ఎరిగినవాడు, క్షాత్రధర్మమే పరమధర్మంగా భావించేవాడు.

క్షమాగుణానికి భూమివంటివాడు, బుద్ధికి బృహస్పతి, వీరత్వానికి దేవేంద్రుడు కూడా సరిరాడు. ప్రకాశంతో వెలుగొందే సూర్యుడిలా ఉన్న శ్రీరాముడు తమ రాజు కావాలని కోసల దేశమే కాదు భూదేవి కూడా ఉవ్విళ్ళూరింది.

లోకోత్తరగుణాలతో, వానాకాల మేఘంలా చల్లనైన శ్రీరాముడిని యువరాజు చేయాలని తలంచాడు దశరథుడు.

అనుకున్నదే తడవు రాజులనూ, సామంతులనూ పిలిపించాడు. ప్రజలూ తరలి వచ్చారు. మహాసభలో దశరథ మహారాజు దేవేంద్రుడిలా వెలిగిపోతున్నాడు.

మంచి కంఠంతో, రసయుక్తంగా, గంభీరంగా సర్వులకూ ఆనందం కలిగించేలా పలికాడు.

"ఇక్ష్వాకు రాజుల రక్షణ క్రింద ఎన్నో వందల సంవత్సరాలుగా అయోధ్యా ప్రజలు హాయిగా ఉన్నారు. మా పూర్వీకుల అడుగుజాడల్లో నేనూ నడిచాను. లోకహితం కోసం ఎన్నో యజ్ఞాలు చేసి శత్రువుల్నీ, ప్రజాపీడకుల్నీ హతమార్చాను.

"కోసల దేశాన్ని ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దాను. ఈ దేశాన్ని సర్వం సుఖప్రదము చేశాను. ఉత్తమోత్తమమైన పరిపాలనను మంత్రులు వల్ల సామంతుల వల్ల అందించాను.

"ఈ రాజ్య భారాన్ని మోసి అలిసిపోయాను. నాకు విశ్రాంతి కావాలి. రాత్రిపూట నక్షత్ర మండలంలోనూ, పగటి వేళ ఆకాశములోనూ, ఈ పృథ్వీమీదనూ నాకు అనేక ఉత్పాతాలు కానవస్తున్నాయి. నా శరీరం ఒడలిపోయింది. ధర్మపరిపాలన చేయుటకు నా శరీరం పూర్తి సంసిద్ధతతో లేదు.

"అందుకే పున్నమి చంద్రుని వంటి రఘురాముడను, ప్రజల శ్రేయస్సు కోసం అహర్నిశలు శ్రమించే కోదండరాముడను, ముల్లోకాలకే రాజుకాదగిన శ్రీరాముడను, నా జ్యేష్ఠపుత్రుడను, మహా బాహుడూ, మహాబలుడూ అయిన రఘువీరుడు శ్రీరాముడను యువరాజుగా అభిషేకింపదలిచాను...." చెప్పాడు దశరథుడు.

సభాప్రాంగణమంతా హర్షధ్వానులతో మారుమ్రోగిపోయింది. వానమేఘాలు చూసి నెమళ్ళు సంతోష పడ్డట్టు ప్రతి ఒక్కరూ సంతోషించారు. వారి ఆనంద సంతోషధ్వనులకు సభ ఊగిపోయిందా అన్నట్టు అనిపించింది.

వశిష్ఠాది మునులు దశరథుడిని ఆశీర్వదించారు. అంతా ఏకాభిప్రాయముతో సుగుణాల శ్రీరాముడిని యువరాజుని చెయ్యాలని పలికారు. దశరథుడు తన అంతరంగములోని ఆనందాన్ని నిబ్బరించుకుంటూ అన్నాడు.





"సభా సదులారా! వీరులారా.... పురప్రముఖ సామంతరాజులరా... మీరంతా ముక్త కంఠంతో శ్రీరాముడిని రాజు చెయ్యాలని పలికారు. నేను అనీ అనటంతోనే ఆమోదించారు. నాకో సందేహం. ధర్మం తప్పకుండా రాజ్యపాలన చేస్తున్నాను. ఎవరికీ ఎట్టి కొరతా లేదు. అయినా రామాభిషేకము అనగానే ప్రజాభిమతం ఉవ్వెత్తున కెరటంలా ఎగిసిపడింది. ఎందులకో నేను తెలుసుకోగోరుతున్నాను... స్పష్టంగా స్పష్టపరచండి..."

"ఓ రాజా! తమ పాలనలో అంతా సౌఖ్యంగానే ఉన్నాం. శ్రీరాముడు మీ సర్వధర్మాలనూ పుణికి పుచ్చుకున్న ఆదర్శుడు. అనంత తేజోవంతుడు, కళ్యాణ గుణ సంపన్నుడు.

"శ్రీరాముడు ఈ కోసల దేశానికే కాదు, పధ్నాలుగు భువన భాండాలను సమధర్మంతో పాలించగల శక్తివంతుడు, వివేకవంతుడు, గుణవంతుడు. మరీచికి కాశ్యపునివలే మీకు శ్రీరామచంద్రుడు జనియించాడు.

"ధర్మజ్ఞుడు, శీలవంతుడు, క్షమావంతుడు, కృతజ్ఞుడు, జితేంద్రియుడు, మృదుస్వభావ స్థిరచిత్తుడు. దినదినము కీర్తీ, శౌర్యమునూ పెంచుకునేవాడు... అన్నీ అస్త్రాలనూ ఎరిగినవాడు. వేదాలను అవపోసన పట్టినవాడు. లోకహితమే రాముడి మహదాశయము. అట్టి ఇందీవర శ్యాముడు ఎప్పుడు యువరాజు అవుతాడోనని ఎన్నో దినాలుగా ఎదురు చూస్తున్నాము.

"మీ అంతట మీరే తమకి వృద్ధాప్యము వచ్చినది, రాజ్యపాలన నుంచి దూరంగా విశ్రాంతి కోరుకుంటున్నానని శెలవిచ్చారు. తమ మాటలు శిరసావహిస్తూ మేం తమ భావాలకు అనుగుణంగా ప్రవర్తించాం.

"దేవతలూ, మహాఋషులూ, గంధర్వులూ, నాగులూ, అనేక దేశాల ప్రజలూ, అంతఃపుర ప్రజలూ, దేవదేవుడంతటి శ్రీరాముడని యువరాజుగా అభిషేకించే సమయాన్ని కనులారా వీక్షించాలని అభిలషిస్తున్నారు."

"మహాజనులారా! సంతోషం. నా జ్యేష్ఠపుత్రుడు రఘురాముడిని రాజుని చెయ్యాలనుకుంటున్నారు. ఆహా ఏమి నా భాగ్యం...ఇక సౌభాగ్యమంతా కోసల దేశానిదే...."

"వశిష్ఠ, వామదేవులారా! నా వంటి మహా అదృష్టవంతుడు మరొకరు ఉండరు. ఇది చైత్రమాసం. పరమ పావనమైనది. పుణ్యమాసం. రేపే పట్టాభిషేక ముహూర్తం. అవసరమైనవన్నీ క్షణాల్లో సిద్ధం చేయిస్తాను. సంభారాలన్నీ శెలవివ్వండి."

అంతా పెద్దపెట్టున కోలాహలం చేశారు. మహా పండుగ వాతావరణం నెలకొంది. సుమంత్రుడితో చెప్పాడు వశిష్ఠుడు.

"బంగారమూ, రత్నాలూ, సమస్త ఔషధులూ, పూలదండలూ, పేలాలూ, తేనెలతో నిండిన గిన్నెలూ, నూతన వస్త్రాలూ, అగ్నిహోత్రంలా వెలిగే నూరు కలశాలూ, పులితోలూ, వీటితోపాటు చతురంగ బలాలూ, బంగారు తొడుగులు వేసిన అంబోతూ, సర్వశుభ లక్షణ ఏనుగూ, సర్వాయుధాలతో, సర్వ పరిమళ సుగంధాలతో సిద్ధంగా ఉండవలెను.

"అంతఃపురాలనూ, పురవీధులనూ రంగ రంగ వైభవంగా అలంకరించే ఏర్పాట్లు చేయవలెను. నగరమంతా దేదీప్యమానంగా వెలిగిపోవలెను. కోసల దేశమంతా తరలి వచ్చినా ఆశ్చర్యపడనవసరం లేదు. క్షీరపక్వమూ, దధిపక్వమూ అయిన అన్నములను సిద్ధంగా వుంచవలెను. నెయ్యీ, పేలాలూ, పెరుగూ అడిగినంత పెట్టండి.

"పుష్కలంగా దక్షిణలు ఇవ్వండి. రేపు ప్రొద్దు పొడిచే సరికి స్వస్తివాచకం జరుగుతుంది. కాన ముందే బ్రాహ్మణులకి కబురు పెట్టండి. రాచమార్గాలన్నీ నీళ్ళు చల్లి ముగ్గులేసి రంగులు దిద్దించండి. మహా యోధులను కవచాలు ధరించి కోటవాకిట నిలువమని ఆజ్ఞ ఇవ్వండి."

వశిష్ఠ వామదేవులు చెప్పినవన్నీ చేయించటానికి మంత్రులంతా పరుగులాంటి నడక నడిచారు. సుమంత్రుడితో శ్రీరాముడిని పిలుచుకుని రమ్మని చెప్పాడు. తండ్రి ఆజ్ఞతో శ్రీరాముడు సుమంత్రుడితో బైలుదేరాడు.

రాచవీధిలో రథం మీద వస్తున్న శ్రీరాముడిని చూశాడు దశరథుడు. దేవతల దేవేంద్రుడిలా మెరిసిపోతూ కనిపించాడు. ఎంత చూసినా తనివి తీరని రూపం. రూపానికి తగ్గ ఔదార్యం. దానికి తగ్గ సౌశీల్యం. ఆజానుబాహుడు, లోక విఖ్యాతి అయిన వీరుడు, తన సుందర సౌశీల్యాదులతో పురుషుల చిత్తాన్ని సహితము కొల్లగొట్టే అందగాడు. మండువేసవిలో మలమలలాడే వారికి చల్లదనమునిచ్చే నీలమేఘుడి వంటి శ్రీరాముడిని తనివి తీరా చూసుకున్నాడు.

ఆ మహాప్రసాదం వద్ద శ్రీరాముడు రథం దిగి సుమంత్రుడితో కలిసి నడిచాడు. దశరథ మహారాజు వద్దకు వచ్చి వినయంగా నమస్కరించి చేతులు జోడించాడు.





దశరథుడు జోడించిన చేతులను పట్టుకున్నాడు. దగ్గరికి తీసుకున్నాడు. అక్కున చేర్చుకున్నాడు.

"శ్రీరామా! ప్రియపుత్రా! నిన్ను చూస్తుంటే యవ్వనమున నా రూపం గుర్తుకు వస్తోంది. యోగ్యురాలైన నా తొలిభార్య కౌసల్య నిన్ను కన్నది. నీ గుణాలతో మమ్మేకాదు ప్రజలందరినీ సంతోషపెడుతున్నావు. నువ్వు యువరాజు కావాలని అందరూ కోరుతున్నారు. పుష్యమీ నక్షత్రంలో నీకు యువరాజు పట్టాభిషేకం.

"నాయనా! శ్రీరామచంద్రా! పుత్రప్రేమతో చెపుతున్నాను. ఇంద్రియములను ఎప్పుడూ అదుపులో పెట్టుకో, వ్యసనాలని దగ్గరికి రానివ్వకు. సామాన్యమైన సేవకులతో ముఖాముఖి మాట్లాడకు. ధాన్యమూ, ఆయుధాలూ ఎప్పుడూ సమృద్ధిగా వుండేలా చూడు. ప్రజారంజకంగా పరిపాలన చెయ్యి. జన్మతః విషయ పరిజ్ఞానం ఉన్నవాడివి. పరాక్రమవంతుడవు. అయిననూ చెబుతున్నాను..." రాజ్యపాలన సూక్ష్మాలను చెబుతున్నాడు దశరథుడు.

ఈ సంతోషకర వార్త కౌసల్య అంతఃపురానికి చేరింది. ఆమె ఆనందానికి అవధులు లేవు. ప్రియమైన వార్త చెప్పినవారికి రత్నాలనూ, గోవులనూ, బంగారాన్నీ దానము చేసింది.

ఓ పక్క రామాభిషేకానికి ఏర్పాట్లు యుద్ధప్రాతిపదికగా జరిగి పోతున్నాయి.

"శ్రీరామా! నాకు వృద్ధాప్యము బాగా ముంచుకువచ్చింది. ఎంతో కాలం రాజ్యపాలన చేశాను. సకల శాస్త్రాలూ చదివాను. సమస్త సుఖాలు అనుభవించి దేహ, పితృ, ఋషి ఋణాల్ని తీర్చుకున్నాను. అనేక దుర్నిమిత్తాలు, అమంగళాలు నాకు కానవస్తున్నాయి. అందులకే వేగిరం చెందుతున్నాను. ఈనాడు పునర్వసు నక్షత్రం. రేపు పుష్యమీ నక్షత్రం. శుభప్రదమైనది. నీ అభిషేకం రేపు జరిగిపోవలెను.

"శ్రీరామా! ఇక నీవు నియమబద్ధుడవై ఉండవలెను. నీ భార్య సీతతో కలిసి ఉపవాసం వుండాలి. దర్భశయ్య మీద నిదురించాలి. శ్రీరామా! భరతుడు తన మేనమామ ఇంట బహు దూర దేశంలో వున్నాడు. అయిననూ సందేహించవద్దు. ఎంత దూరంలో వున్నా వారి చిత్తం ఇక్కడే వున్నది" చెప్పాడు దశరథుడు.

శ్రీరాముడు తండ్రికి నమస్కరించి తల్లి కౌసల్య అంతఃపురానికి వెళ్ళాడు. తల్లికి చెప్పాడు. కౌసల్య కొత్త పట్టు చీర ధరించి రాజ్యలక్ష్మిని ప్రార్థిస్తోంది.

శ్రీరాముని చెంతకొచ్చింది సీత. శ్రీరాముడు కళ్ళతో నవ్వాడు. సీతాదేవి భర్తని తనివితీరా చూసుకుంది. ధ్యానంలో ఉన్న కౌసల్యని చూస్తూ నిల్చున్నారు సీతారాములు.

పుష్యమీ నక్షత్రంలో శ్రీరాముడికి యువరాజ్యాభిషేకం అని తెలియగానే దానాలూ, సంభారాలూ అందరికీ ఇచ్చి, నారాయణ మూర్తిని పురుష సూక్తంతో ప్రార్థిస్తోంది.

కౌసల్య నిమీలిత నేత్రాలను తెరిచింది. సీతారాములను చూసి ఆత్మీయంగా దగ్గరికి వెళ్ళింది.

"రేపు యువరాజుగా అభిషేకమని తండ్రిగారు ఆజ్ఞాపించారమ్మా. ఈ క్షణం నుంచి నియమ, ఉపవాస దీక్ష పాటించాలని చెప్పారు"

కౌసల్య ఆనందభాష్పాలు రాల్చింది.

"ఈ క్షణం కోసమే నాయనా నేను ఎదురు చూస్తున్నది. నీకూ, సీతకూ చెయ్యాల్సిన మంగళ కార్యాలెన్నో వున్నాయి. అన్నీ చేస్తాను నాయనా, రాజ్యలక్ష్మి కళకళలాడిపోవాలి. ఇక్ష్వాకుల రాజ్యలక్ష్మి నిను చేపట్టబోతున్నది" చెప్పింది కౌసల్య.

ప్రక్కన లక్ష్మణుడు పరమానందభరితుడై చేతులు కట్టుకొని వున్నాడు. శ్రీరాముడు లక్ష్మణుడితో చెప్పాడు.

"లక్ష్మణా! ఇక్ష్వాకుల రాజ్యలక్ష్మి నిన్నూ, తమ్ముళ్ళనూ వరిస్తోంది. మీ ముగ్గురూ రాజ్యపాలనలో నాకు చేదోడుగా వుండవలెను. నీవూ, తమ్ముళ్ళూ సమస్త భోగాలూ, వస్త్రాభరణాలూ సమంగా అనుభవించవలెను. ఈ కోసల రాజ్యమూ, నా భోగభాగ్యాలూ అన్నింట్లోనూ పూర్తి హక్కు మీకూ వున్నది" చెప్పాడు లక్ష్మణుడితో శ్రీరాముడు.

"అన్నా రామన్నా! నిన్ను అనుసరించటం, నీ ఆజ్ఞను శిరసావహించటమే సమస్త భోగాలూ, రాజ్యాలూ అనుభవించిన తృప్తి" చెప్పాడు లక్ష్మణుడు.

శ్రీరాముడు తల్లికి నమస్కరించి సీతతో కలిసి తన మందిరానికి వెళ్ళాడు.

సీతారాములు మందిరం చేరిన కొద్దిసేపటికే తపోధనుడూ, ధర్మపరుడూ వశిష్ఠ మహర్షి వచ్చాడు. సీతారాములను ఆశీర్వదించాడు.





వేదాలు తెలిసిన ఉత్తముడు, వ్రతనిష్ఠాపరుడు వశిష్ఠుడు చెప్పాడు.

"శ్రీరామా! రేపటి రోజున యువరాజువవుతున్నావు. అందులకే ఉపవాస దీక్ష వ్రతము చేపట్టాలి. నహుష చక్రవర్తి తన కొడుకు యయాతికి అప్పగించినట్లు, నీ తండ్రి దశరథ మహారాజు రేపు నీకు రాజ్యపాలన అప్ప చెబుతున్నాడు" అని మంత్రకోవిదుడు వశిష్ఠుడు వ్రత దీక్షనూ, నియమాలనీ బోధించాడు.

రాచవీధులన్నీ రామాభిషేక దర్శనం కోసం కిటకిటలాడుతున్నాయి. ద్వారాలకు తోరణాలూ, పూలూ కట్టారు. అరటిచెట్లూ, పోక చెట్లూ రాజవీధి కిరువైపులా నిలబెట్టారు.

అయోధ్యా వాసులూ, ప్రక్క ప్రాంతాల నుంచి వచ్చినవారూ, ఎప్పుడు చీకటి పడి తెల్లవారుతుందా, మరెప్పుడు శ్రీరాముడి యువరాజు పట్టాభిషేకం చూస్తామా అని ఉవ్విళ్ళూరిపోతున్నారు.

దేవేంద్రుడిని దర్శించే దేవగురువు వలె వశిష్ఠుడు దశరథ మహారాజు ప్రాసాదానికి వెళ్ళాడు. సీతారాములకి ఉపదేశించిన వ్రత దీక్షను గూర్చి వివరించాడు.

ఆ తర్వాత సభ చాలించిన దశరథ మహారాజు పర్వత గుహలోకి సింహం ప్రవేశించినట్టు ఠీవిగా అంతఃపురంలోకి నడిచాడు. తన రాజభవనం దేవేంద్రుని భవనంలా వెలిగిపోతోంది. దివ్య వస్త్రాభరణ భూషితులైన స్త్రీల మధ్య కోసల దేశ మహారాజు దశరథుడు ఆకాశంలో నక్షత్రాల మధ్య పూర్ణ చంద్రునిలా ప్రకాశించాడు.

## సీతారాముల వ్రతదీక్ష

వశిష్ఠ మహర్షి వెళ్ళాక ఆయన చెప్పినట్టు సీతారాములు స్నానం చేశారు. శ్రీ మన్నారాయణునకు స్తోత్రం, పూజ చేశారు. శ్రీమన్నారాయణుని ప్రీతికై అగ్నిహోత్రంలో ఆజ్యహోమము చేశాడు.

హోమము పూర్తి చేయగా మిగిలిన హవిస్సుని శ్రీరాముడు భుజించాడు.

నారాయణుని దేవాలయంలో దర్భలు పరుచుకొని మౌనవ్రతంతో, అచంచల మనస్సుతో మిథిలా నగర రాజకుమార్తె వైదేహితో నిదురించాడు.

తెల్లవారుటకు ఇక జాము మాత్రమే వుంది. అప్పటికే సూతవంది మాగధుల స్తోత్రపాఠాలూ, మేలుకొలుపులూ వింటూ కార్యాలు ముగించాడు.

ప్రాతఃకాల సంధ్యా వందనముతో పాటు గాయత్రీని జపించాడు. విష్ణుమూర్తి పూజ కావించి, తెల్లటి పట్టు ఉత్తరీయము కప్పుకొని బ్రాహ్మణోత్తముల చేత పుణ్యాహవాచనం చేయించాడు.

సమయం దగ్గర పడుతున్నది. ఎక్కడ విన్నా రామాభిషేకం గూర్చే, పట్టణంలో సుగంధ ధూపాలు వేశారు. అయోధ్య అమరావతిలా వెలిగిపోతోంది. అయోధ్య వీధులలో ఇసుకవేస్తే రాలనంత జనం.... మండపాల్లో నటుల ఆనంద అభినయం. చెవులకి ఇంపు, కనులకు వేడుక, మనస్సునకు ఆనందం. హర్షధ్వానాలు మిన్ను అంటుతున్నాయి.

అంతా ఆనందమే .... సంతోషమే. మహా జనసముద్రంలా వుంది అయోధ్య....

## మంథర

ఎక్కడ పుట్టిందో, ఎవతో ఎవ్వరికీ తెలీదు. కైకేయి పుట్టింటి వారు దశరథునితో కైకేయిని అత్తింటికి పంపేటప్పుడు అరణంగా ఇచ్చారు. దాసీగా కైకేయి భవనంలో ఓ వెలుగు వెలుగుతూ ఉంది.

కైక దగ్గరే నిత్యం వుంటూ వుంటుంది. అలంకరించినా మంథరే... కైకమందిరంలోకి యథేచ్ఛగా వెళ్ళగలిగే దాసి మంథర ఒక్కతే. సలహా సంప్రదింపులూ మంథరతోనే. కైకకు మంథరంటే ఇష్టం. ఆ గూనిది సలహా ఇచ్చిందంటే కైక పాటించేస్తుంది. పుట్టింటి నుంచి తనతో రావటం వల్ల కైకకు మంథరంటే వల్లమాలిన అభిమానం.

తెల్లారితే రామాభిషేకం అనగా మంథర ఓ మందిర గవాక్షం నుంచి అయోధ్య ప్రజల హడావుడి చూసింది.

రాచవీధులన్నీ తోరణాలతోనూ, పూలతోనూ, కళ్ళాపి చల్లి ముగ్గులతోనూ అలంకరింపబడి సుందరంగా, భూలోక స్వర్గంలా వుంది. ప్రజలంతా తమ ఇంట్లో పెళ్ళిలా ఒకటే వేగిర పడుతున్నారు. రంగు రంగుల వస్త్రాలూ, సుందర ఆభరణాలూ ధరించి ఉన్నారు.

రంగు రంగుల జెండాలూ... అభ్యంగస్నానం చేసిన వేదపండితులూ, బ్రాహ్మణులూ, దండలూ, కుడుములూ తీసుకొని రాజప్రాసాదంవైపు వస్తున్నారు. దేవాలయాల గాలి గోపురాలు మెరిసిపోతున్నాయి. మంగళవాద్యాలు మృదుమధురంగా వినవస్తున్నాయి.





మంథర పక్కనే వున్న దాదిని అడిగింది.

"ఏమిటే ఇది? కౌసల్య తన దానాలతో ఖజానా ఖాళీ అయ్యేలా రెండు చేతులతో అడిగిన వారికి అడిగినంత ఇస్తోంది..."

ఆ దాది పట్టలేనంత సంబరంగా గూని మంథరతో చెప్పింది.

"రేపు పుష్యమీ నక్షత్రం. శ్రీరామచంద్రుని యువరాజుగా అభిషేకిస్తున్నారు మహారాజు దశరథుడు"

మంథర మొహం వివర్ణమైంది. కళ్ళు ఎరుపెక్కాయి. పళ్ళు పటపటా కొరికింది. గిర్రున వెనుతిరిగింది. మహా కైలాస పర్వతంలా ఉన్న భవంతి నుంచి చకచకా కైక అంతఃపురానికి వెళ్ళింది. పాన్పు మీద విలాసంగా పవళించిన కైకతో నిష్ఠూరంగా అంది.

"ఆహా కైకా దేవి... నిన్ను చూసి విర్రవీగుతుండే దానిని. మహారాజుకి ఇష్ట భార్యగా, సమస్త భోగాలను అనుభవించే రాత ఇక నీకు లేదు. పుట్టింటి దాసిగా నేను నీకు ఏ సేవైనా చేస్తాను. అంతేగాని అన్యులకు తల ఒగ్గి ఉండలేను. ఎండాకాలంలో ఏరు ఎండిపోయినట్లు అడుగంటి పోతోంది నీ అదృష్టం...."

కైక మొహం చిన్నపోయింది. పాపాల నీచపు పుట్ట మంథరని అడిగింది.

"ఓ మంథరా! ఇప్పుడేమైంది. నీ దుఃఖానికీ, ఆవేదనకీ కారణమేమిటి? నా క్షేమానికి భంగం కలిగే విషయమేదన్నా జరిగిందా!?"

మంథర మాటకారి. మరింత దిగులుగా, రాజ్యమే పోయినట్టు ముఖం పెట్టి...."నీ సుఖమే నా సుఖం కైకాదేవీ..... ఉత్తమ రాజవంశంలో పుట్టావు. ఉత్తమోత్తమ ఇక్ష్వాకు వంశానికి కోడలివయ్యావు. నీ భర్త నీతో ప్రేమ నటిస్తూనే నిన్ను ఇంత కాలం మోసం చేశాడు. సుఖాలు ఇక్కడ. సంబరాలూ, అధికారాలూ అక్కడ."

"మంథరా" తీక్షణ స్వరంతో పలికింది కైక.

"నీవు నన్ను ఏం చేసినా సరే... నీ రాజు దుష్టాత్ముడు. కౌసల్యకు అధికార ఐశ్వర్యాన్ని కట్టబెడుతున్నాడు. అడ్డమని భరతుడ్ని మేనమామ ఇంటికి పంపాడు. కౌసల్యా పుత్రునకు రేపు యువరాజుగా పట్టాభిషేకం. ఇక నీవూ, నీ పుత్రుడూ, నేనూ అందరూ సేవకులమే.... రాముడు యువరాజు... కౌసల్య రాజమాత.....

"కైకా... శ్రీరాముడిని ఎంత ముద్దుగా పెంచావు... వెనుకటికి నీలాంటిదే తల్లి ప్రేమతో సాటిగా ఓ పామును పెంచింది. విషజంతువు విషాన్నే కక్కింది.

అట్లే ఆ తండ్రీ కొడుకులు నీకూ, నీ పుత్రుడికీ విషాన్నే మిగిల్చారు. అరచేతిలో స్వర్గం చూపించాడు రాజు."

శ్రీరాముని పట్టాభిషేకమనే మాట మంథర నోటి నుంచి వెలువడటం ఆలస్యం పాన్పు నుంచి కైక శరత్కాల చంద్రరేఖ వలే లేచింది. మెడలోంచి ముత్యాల హారం తీసింది...

"మంథరా... ఎంతటి శుభవార్త చెప్పావు. శ్రీరామునకు.... నా రామునకు, నా బంగారు తండ్రికి యువరాజు పట్టాభిషేకమా? ఎంత చల్లని వార్త" అంటూ హారం మంథర కిచ్చి నడిచింది.

పాపదర్శిని మంథర అగ్ని మీద ఆజ్యము పోసినట్టు భగ్గుమంది. కైక ఇచ్చిన ఆభరణాన్ని విసిరి కొట్టింది.

ముత్యాల దండ తెగి చెదరి ముత్యాలు ఎగిరెగిరి పడ్డాయి. కైక విసురుగా తిరిగింది.

"మంథరా... అనవసరంగా యాగీ చేస్తున్నావు. భరతుడు ఎంతో నాకు రాముడూ అంతే. పైగా శ్రీరాముడు పెద్ద కొడుకు. భరతుడి కంటే శ్రీరామునికే నేనంటే ఇష్టం.... నాకూ అంతే..."

మంథర కైక దగ్గరికి వచ్చింది.

"ఓ వెర్రిబాగుల కైకా... మహాదుఃఖసముద్రంలో నీకు నీవుగా మునిగిపోవాలనుకుంటున్నావు. రాముడు రాజైతే... ఆ తర్వాత రాముడి కొడుకే రాజు అవుతాడు. నీ బిడ్డ భరతుడూ, నీవూ ఎప్పటికీ సేవకులుగానే మిగిలిపోతారు....

"కేకయరాజపుత్రి అయిన నీవు రాజమాత కౌసల్యకి వంగి వంగి దండం పెట్టవలసిందే. ఊడిగము చేయవలసిందే.

"ఆ తర్వాత నీ సవతి కౌసల్యా, రాముడూ భరతుని దేశాంతరమో, మరీ అవసరమైతే లోకాంతరమో పంపిస్తారు.

"కైకా దేవీ... శ్రీరాముడని కనిపెట్టుకొని లక్ష్మణుడూ, లక్ష్మణుడిని కనిపెట్టుకొని శ్రీరాముడూ వుంటారు. వారిరువురికి ఒకరిపై ఒకరి మీద ప్రేమ.

"కానీ నీ కొడుకు చిన్ననాటి నుంచి మేనమామ దగ్గరే ఎక్కువ పెరిగాడు. దానితో తండ్రికిగానీ, రామలక్ష్మణులకి గానీ ప్రియతమ్ముడు కాలేకపోయాడు...





"కైకాదేవీ... ఆలోచించు. పుట్టింటి దాసి మంచే చేస్తుంది. విశాల కోసల దేశానికి రాజు శ్రీరాముడవుతున్నాడు. ఆపై అన్ని అమంగళాలూ, అవమానాలకీ సిద్ధంగా వుండు.

"అంతెందుకు... శ్రీరామ పట్టాభిషేక వార్త నేను చెప్పేవరకూ నీకు తెలీదు. అయోధ్యలో, విశాల కోసల దేశమంతా తెలుసు. ఒక్కసారి మందిర గవాక్షం నుంచి చూడు.

"సామాన్యుడి నుంచి సామంత రాజుల వరకూ తెలిసిన విషయం .... హవ్వ... ఎవ్వరైనా వింటే నవ్వి పోతారు.

"దశరథ మహారాజు ఇష్ట భార్యకి అసలు విషయమే తెలీదు... ఇంకెందుకు ఆలస్యం. అంతఃపుర కుట్ర జరిగింది. నీ కొడుకు భరతుడిని అటునుంచి అటే అడవులకు పంపు. అదే నీ కొడుక్కి క్షేమం."

"మంథరా...." కోపంతో తోకత్రొక్కిన తాచుపాములా బుసలు కొట్టింది.

"శ్రీరామ పట్టాభిషేక వార్త నాకు కనీసం మాట మాత్రం చెప్పాలని తెలీదా ఆ ముసలి రాజుకు. కనీసం ఆ రాముడికి... శ్రీరాముడిని ఎత్తుకొని పెంచానే... గోరుముద్దలు తినిపించానే... భరతునికంటే శ్రీరాముడ్నే ఎక్కువ ఎత్తుకొని లాలించి పెంచానే... ఆ రామునకు కూడా గుర్తులేదా"

కైకేయి ఆలోచనలో పడింది. మంథర చెప్పింది నిజమే. కైక కనులు చింతనిప్పులయ్యాయి.

మంథర తేలిగ్గా ఊపిరి పీల్చుకుంది. నిప్పు రాజేశాను. మహాఅగ్ని ఆవరించటమే.

"మంథరా... చెప్పు. ఈ విషమపరిస్థితి నుంచి నా కొడుకునీ, రాజ్యాన్నీ ఎలా రక్షించుకోవాలి. ఏల నా కొడుకు భరతునకు కట్టబెట్టాలి" అడిగింది కైక.

## దేవాసుర యుద్ధము

"కైకాదేవీ... గుర్తుకు తెచ్చుకో... దేవాసుర యుద్ధంలో నీవు చేసిన సాహసం... సాయం.

"నీ భర్త దశరథ మహారాజు నిన్ను వెంట బెట్టుకుని దేవేంద్రుడికి సహాయంగా యుద్ధానికి వెళ్ళాడు.

"తిమిధ్వజుడైన శంబరాసురుడి రాజధాని వైజయంతీ పట్టణాన్ని ముట్టడించారు.

“శతమాయావి శంబరాసురుడు దేవతలని చిత్తు చేసి దేవేంద్రుడితో యుద్ధం చేశాడు. ఆ మహాసురుణ్ణి దేవేంద్రుడూ, దేవసేనలూ ఏమీ చెయ్యలేకపోయాయి.

“మహా సంగ్రామంలో బాణ శూలాదుల పోటులతో, ఒళ్ళంతా గాయాలై నిద్రలో ఉన్న సమయాన రాక్షసులు మూకుమ్మడిగా వచ్చి మీద పడ్డారు. ఎంతో మందిని చంపేశారు. దశరథ మహారాజు వారితో యుద్ధం చేశాడు.

“ఒళ్ళంతా రక్త గాయాలతో దశరథుడు తడిచిపోయాడు. తెలివి తప్పిపడిపోయాడు. రథాన్ని నడుపుతున్న నీవు భర్త స్థితి చూసి రథాన్ని ఓ రహస్య ప్రదేశానికి పెనువేగంతో తీసుకుపోయావు. రాక్షసులు అపరిమితంగా నీ భర్త మీదకు వివిధాయుధాలు ప్రయోగిస్తున్నా అత్యంత వేగంతో చాకచక్యముతో ఓ గూఢ ప్రదేశానికి తీసుకుపోయావు. దశరథుడ్ని రక్షించావు. మళ్ళీ రాక్షసులు మీ మీదకు వచ్చారు. అప్పుడు ఎంతో సాహసంతో నీవు ప్రవర్తించావు.

“దశరథ మహారాజుకి అనేక సపర్యలు చేసి బ్రతికించావు. అట్లు రెండు సార్లు ఆయన్ని కాపాడావు. దానికి ప్రతిగా దశరథ మహారాజు రెండు సార్లు తనని కాపాడినందుకు రెండు వరాలిస్తానని చెప్పాడు. కావలిసినప్పుడు కోరుకుంటానని చెప్పావు.... గుర్తుందా?”

“గుర్తుంది మంథరా... ఆ వరాలు నేటికీ కోరుకోలేదని కూడా గుర్తుంది”

“రాణీ! దశరథుడు సత్యవాది. ధర్మపరుడు. ఇచ్చిన మాట తప్పడు. అశ్వపతి గారాల పుత్రి కైకాదేవీ... ఇప్పుడు ఆ రెండు వరాలూ అడుగు... భరతుడి పట్టంతో ఒకే వరంతో సరిపెట్టుకుంటావేమో. రెండో వరంగా రాముడిని వనవాసానికి పంపేలా అడుగు.

“రాణీ! రాముడి వనవాసము ముఖ్యాతి ముఖ్యము. శ్రీరాముడు పధ్నాలుగు సంవత్సరాలు అడవిలో ఉండి మళ్ళీ అయోధ్యకొచ్చినా చేయగలిగిందిలేదు.

“నీ పుత్రుడు భరతుడు రాజుగా పాతుకొని స్థిరంగా వుంటాడు. సమస్త రాజ్య శక్తులూ, ఖజానా, మంత్రాంగమూ, బలాలూ, సైన్యమూ భరతుడి ఆధీనంలో ఉంటాయి. పధ్నాలుగేళ్ళు వనవాసము చేసిన రాముడు అరాముడు అవుతాడు.





“ఓ సుందరీ! సావధానంగా ఆలోచించు. మీ ఆయన పలకరించినా పలకకు. కన్నెత్తి చూడకు. రుసరుసలాడు. అప్పుడు నీ కోసం రాజు మంటల్లో దూకమన్నా దూకుతాడు. సమయాసందర్భంతో వరాలడుగు. సమస్త ధనరాసులు నీముందు పోస్తానన్నా వెనక్కి తగ్గకు. భయపెట్టినా, బాధ పెట్టినా కాళ్ళావేళ్ళాపడినా, ఏడ్చి రోదించినా నిర్ణయాన్ని మార్చుకోవద్దు.

“జంక వద్దు రాజు మాయమాటలకు... ఐశ్వర్య వరాలెన్నో ఇస్తాడు. కాదను. బుజ్జగించినా, బ్రతిమిలాడినా వెనక్కి తగ్గకు. మగవాళ్ళు మహా మాయగాళ్ళు. భార్యలని తమ వైపుకి తిప్పుకునే విద్య ప్రతివారికీ వుంటుంది. నీ మగనికి అది వెన్నతో పెట్టిన విద్య...”

***చతుర్దశ హి వర్షాని రామే ప్రవ్రాజితే వనమ్,***
***రూఢశ్చ కృతమూలశ్చ శేషం స్థాస్యతి తే సుతః.***

“శ్రీరాముడి పధ్నాలుగేళ్ళు వనవాస కాలంలో భరతుడు రాజ్యాన్ని సుస్థిరం చేసుకుంటాడు. ఆ వనవాసం ముగించి వచ్చినా శ్రీరాముడు రాజ్యలక్ష్మిని అందుకోలేడు.”

“చాలు మంథర... పుట్టింటి దాసివి. నీ గూర్చి నాకు తెలుసుగా... అసురుల రాజు శంబరాసురుడి వద్ద నూరు మాయలే వున్నాయి. నీ వద్ద వేలకువేలు వున్నాయి. గూని వాండ్లకు తెలివితేటలు ఎక్కువని విన్నాను. అది నిజమే. నిరూపించావు. పుట్టింటి దాసి ధర్మం పాటించావు.

“మంథరా.... శ్రీరాముడు అడవికి పోగానే, భరతునకు పట్టాభిషేకం అవ్వగానే నీకు బంగారు రవిక చేయిస్తాను. రత్నాలతో దుస్తులను ఇస్తాను. దాసదాసీలందరూ ఈర్ష్యపడేలా వైభవంగా వెలిగేలా చేస్తాను” చెప్పింది కైక.

ఆపై కైక తన సమస్త ఆభరాణాలను చెల్లాచెదరుగా పడవేసింది. దెబ్బతిన్న కిన్నరాంగనవలె నేలమీద పడుకుంది. పట్టుచీరను వదలి నల్లటి చీరను కట్టుకుంది. జుట్టు విరబోసుకుంది.

## కైక మందిరం

శ్రీరామ అభిషేకానికి చెయ్యాల్సిన విధులను మంత్రులకు అప్పగించి దశరథుడు ప్రియమైన వార్తను తనే స్వయంగా చెబుదామని కైక అంతఃపురంలోకి వచ్చాడు. రాహువు వున్నాడని తెలియక, మేఘాలు ఉన్న ఆకాశంలోకి చంద్రుడు పయనించినట్టుగా కైకేయీదేవి మందిరంలోకి అడుగుపెట్టాడు.

కైక అంతఃపురంలో చిలకలూ, కోకిలలూ, హంసలూ, నెమళ్ళూ స్వేచ్ఛగా విహరిస్తుంటాయి. అంతఃపుర గవాక్షం నుంచి సంపెంగ చెట్లూ, అశోకవృక్షాలూ కానవస్తుంటాయి.

అంతఃపుర ఉద్యానవనంలో అన్ని ఋతువులలోనూ పూలూ, కాయలూ కాసే చెట్లు మనోహరంగా కానవస్తాయి.

దాసదాసీజనం రకరకాల భక్ష్యాలూ, అన్నాలూ సిద్ధంగా వుంచుతారు. బహు చక్కగా అలంకరించుకున్న సుందర స్త్రీలతో కైకేయీ మందిరం ఉంటుంది స్వర్గధామములా.

అంతఃపుర శయ్యాగృహానికి వెళ్ళాడు. అక్కడ కైక కనిపించలేదు. కైక గూర్చి ద్వారపాలకులని అడిగాడు.

"మహారాజుల వారు మన్నించాలి. కైకాదేవిగారు కోప గృహానికి వెళ్ళారు"

దశరథ మహారాజు మనస్సు చివుక్కుమంది. కలత పడ్డాడు. వ్యథ చెందాడు. శుభవార్త చెబుదామని వస్తే ఇలా అయ్యిందేమిటి. ఈ ఆనంద సమయాన కైక అకాల అలక దేనికోనని పరిపరివిధాలుగా యోచించాడు. క్రోధా గృహములోకి వెళ్ళాడు. కైక నేలమీద పడుకొని వుంది. జుట్టు విరబోసుకుని వుంది. తెంచేసిన మల్లెచెండులా వుంది. పాదు నుంచి పీకిన మల్లె చెట్టులా వుంది. విషపుబాణం తగిలిన లేడిపిల్లలా వుంది. దశరథుడు తట్టుకోలేకపోయాడు.

ప్రేమాతిశయముతో పోతుటేనుగు ఆడ ఏనుగును తడిమినట్టు కైక దగ్గరికి వెళ్ళి నిమిరాడు. ముద్దాడాడు. పలకరించాడు. ప్రేమతో ముంగురులను సవరించాడు.

"దేవీ కైకా... ఏమిటలా ఉన్నావు. నేలకూలిన మోహినీ దేవతలా... ఆకాశం నుంచి జారిపడ్డ అప్సరసలా ఇలా పడి వున్నావు. దేవీ నా మీద ఏమన్నా కోపమా? చేయరాని పని ఏదన్నా చేశానా? చెప్పు దేవీ...."

కైక విసురుగా చేతిని త్రోసింది.

"చెప్పు దేవీ... నీకు నచ్చని పని ఏదన్నా జరిగిందా? లేక నలతగా వుందా? రాజ వైద్యులను పిలిపించనా? అయ్యో దేవీ... నీ నేత్ర ద్వయంలో కన్నీళ్ళు చూడలేకపోతున్నాను. ఏమిటో చెప్పు. ధనవంతుడిని దరిద్రుడిగా, దరిద్రుడిని ధనవంతుడిగా చేస్తాను. చంపదగ్గ వాళ్ళనయినా క్షమించి వదిలి వేస్తాను.... నీ కోసము మరో అయోధ్య కూడా నిర్మిస్తాను.





"ప్రియురాలా! నాకు సైతం ప్రాణాపాయం అయిననూ సరే నా ముద్దుల భార్య కైక కోసం దాన్ని సైతం వదిలి వేయుటకు సిద్ధం...

"నా ముద్దుల రాణి కైకా..... ప్రాచ్య, సింధు, సౌవీర్య, వంగాంగ, మగధ మధ్యదేశాలు సస్యశ్యామలంగా వున్నాయి. దాన్యమూ, ధనమూ, బహుద్రవ్యాలూ ... ఏమి కావలెనో అడుగు... దశరథుడు కాదనడు.... ముద్దుల భార్యకైక కన్నా గొప్పది నాకీ పృథ్విలో లేదు."

కైక పెదాలపై చిరునవ్వు... సర్దుకుంది... విసురుగా తల తిప్పి దశరథుని వంక చూసింది.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"కోసల రాజా! నాకేమీ అవసరం లేదు. నన్నెవరూ నిందించలేదు. నా కోర్కెలు తీర్చాలి. నా వరాల సంగతి గుర్తుందా! మరిచారా! ఇప్పుడడిగితే కాదనరుగా..."

దశరథుడు ఆర్తిగా కైక ముంగురులు సవరించాడు. దగ్గరికి వెళ్ళాడు. "దేవీ... నీ కన్నా ప్రియమైనది నాకు ఈ సృష్టిలో లేదు. అయిననూ నమ్మవా... అయితే విను.

"నా బిడ్డలలో అందరిలోనూ ప్రియము అయినవాడు శ్రీరాముడు. వాడ్ని ఒక్క క్షణం చూడక నేనుండలేను. బ్రతకలేను. ప్రాణం కంటే అధికుడైన శ్రీరాముడిమీద ఒట్టు పెడుతున్నాను. అడుగు కైకా...."

కైక విరబోసిన జుట్టును సవరించుకుంది. దశరథునితో చెప్పింది.

"అదిగో అగ్నిహోత్రుడు విన్నాడు..... ముప్పైయి కోట్ల దేవతలే సాక్షులు.... ఈ నీ మాటలు సూర్యచంద్రులూ, గ్రహాలూ విన్నాయి. సర్వభూతాలూ, పంచభూతాలే సాక్షి."

"ఓ సమస్త దేవతలారా... అంతా విన్నారుగా... మాట తప్పని మహారాజు మాటలు....." అంటూ దశరథుడి చెయ్యి పట్టుకుంది.

"నాథా... కోసలరాజులు ధర్మపరులు. ఆడిన మాట తప్పరు. దేవాసుర యుద్ధంలో రెండుసార్లు చేసిన నా సేవకిగానూ మీరు నాకు రెండు వరాలిచ్చారు. అవి ఈ నాటికీ నేను కోరుకోలేదు.

"మిమ్మల్ని మెలుకువతో రక్షించినందుకు నాకు ఇచ్చిన ఆ రెండు వరాలను నేను భద్రంగా దాచుకున్నాను.

"రాజా! మీరు భూమిపుత్రులు... ఈ పృథ్విని ఏలుతున్న ప్రభువులు. నా రెండు వరాలను నాకు ఇప్పుడు చెల్లించవలెను. అదే నా కోరిక, అభిలాష. కాదూ... కాకూడదంటే... మీ ముందే ప్రాణత్యాగం చేసుకుంటాను."

దశరథుడు నిర్ఘాంతపోయాడు. పంచభూతాలను సాక్షులుగా పెట్టవల్సిన అవసరం ఏమిటో అర్థంకాలేదు. అయోమయంలో పడ్డా తేరుకొని చెప్పాడు.

"ముద్దుల భార్య కోరికలను ఏనాడైనా కాదన్నానా? అడుగు దేవీ...." చెప్పాడు దశరథుడు.

కైక ప్రశాంతంగా దశరథుడితో చెప్పింది. దశరథుడు ఊపిరి బిగపట్టి వినటానికి సిద్ధపడ్డాడు.

"మొదటి కోరిక భరతుడు యువరాజు కావాలి. పట్టం కట్టాలి. కోసల దేశాన్ని నా పుత్రుడే ఏలాలి. ఇది నా మొదటి వరం...రెండో వరం... రాముడు జటాజినాలు ధరించి పధ్నాలుగు సంవత్సరాలు వనవాసం చెయ్యాలి.."

"కైకా!?" మొత్తం భవన పునాదులే కదిలేలా అరిచాడు దశరథుడు. వేటగాడి వలలో పడ్డ జింకలా విలవిలలాడిపోయాడు.

"నా కనుల ముందే రాముడు అడవులకి వెళ్ళాలి. ఆడిన మాట తప్పక వంశ గౌరవాన్ని కాపాడుకోండి. సత్యవాదివి. స్వర్గంలో సుఖపడాలంటే సత్యవ్రతమే మార్గమని తమరే శెలవిచ్చారు."

దశరథ మహారాజు గుండె వక్కలైనట్టు అనిపించింది. తను విన్నది నిజమేనా? కైక అడిగింది వాస్తవమేనా? లేక తన చిత్తభ్రమణమా? మూర్ఛపోయాడు. చాలా సేపటికి గానీ లేవలేదు. తెప్పరిల్లలేదు.

పెద్దపులి ఎదుటున్న జింకలా వణికిపోయాడు.

"కైకా... కైకా... నువ్వేనా ఈ మాటలన్నది. నిజమేనా? రాముడు ఏ అపరాధం చేశాడు. ఇంతటి అపకారం శత్రువు కూడా చెయ్యడే... సమస్త భూమండలం రాముడినే హర్షిస్తుంటే, నీవు మాత్రం అడవులకి సాగ నంపుతావా?

"రాముడ్ని పంపి నేను బ్రతికి వుండగలనా? నా ఐశ్వర్యమూ, రాజ్యమూ పోయినా పర్వాలేదు. రాముడు లేకుండా వుండగలనా? నీ పాదాలు పట్టుకుంటాను. రాముడి మీద కనికరం చూపించు. శ్రీరాముడు నా కంటి వెలుగు. నీరు లేకుండా పైరు వుండగలదేమో గాని రాముడు లేకుండా క్షణమన్నా జీవించి వుండలేను...





"కైకా రాజ్యమే కావాలంటే భరతుడికి పట్టం కడతాను. శ్రీరాముడిని కానలకు పంపుటదేనికి? రాముడూ, భరతుడూ ఇద్దరూ ఒక్కటే అని ఎన్నోసార్లు అన్నావు. .... అట్టి రాముడిని వనవాసానికి నువ్వే పంపుతావా? రాజులు వనవాసానికి ముని సేవకే వెళతారు"

"అయితే ఆ ముని సేవ చేస్తూనే పధ్నాలుగు యేళ్ళు వనవాసం చెయ్యమనండి" కైక నిష్ఠూరంగా చెప్పింది.

"శ్రీరాముడు పురుషోత్తముడు. దీనులనందరినీ దానాలతో జయించినవాడు. పండితులందరినీ విషయజ్ఞానంతో మెప్పించినవాడు. శుశ్రూష చేసి గురువుల్ని మెప్పించినవాడు. సత్యంలో లోకాలన్నింటిలో ఆదర్శమైనవాడు. ప్రియవాది రాముడికి అప్రియం చేస్తావా....

"కైకా... నేను వృద్ధుడనయ్యాను. దయ చూపించు. నీ విపరీత బుద్ధి వీడు. కుసుమకోమలుడు శ్రీరాముడు. పసివాడు. ఇంకా ముద్దుమాటలతో అలరించేవాడు. నీకు ఎంత సేవ చేశాడో... మననం చేసుకో....

"ఈ రాచ నగరంలో ఎంతోమంది వున్నారు. మరెంతోమంది స్త్రీలున్నారు. ఎవ్వరైనా ఏ ఒక్కరైనా శ్రీరాముడిలో చిన్న తప్పు అయినా పట్టినారా? పరనింద చేశాడా? పెద్దలనీ, గురువుల్నీ నొప్పించాడా? ఆలోచించు... సావధానంగా నా మాట విను. నీ కోర్కెలు ఉపసంహరించుకో" అడిగాడు దశరథుడు. అర్థించాడు... కైక వినకపోవటంతో కంపించిపోయాడు.

"కైకా... రాముడు అడవులకి వెళితే భరతుడు యువరాజుగా పట్టాభిషేకం చేసుకుంటాడనుకుంటున్నావా? అది కల్ల. భరతుడు రాముని ధార్మికాన్ని పుణికి పుచ్చుకున్నవాడు. భరతుడు మెచ్చడు. శ్రీరాముడిని అడవికి వెళ్ళమని నేనేల చెప్పగలను. అది విన్న సీత తట్టుకొనగలదా?

"కైకా నీ రూపం ఎంతో చక్కనిది. నిన్ను పరమ యోగ్యురాలిగా ఇప్పటికీ తలచుతున్నాను. విషము కలిపిన మద్యాన్ని నాకు అందిస్తావా? దశరథుడు కాముకుడని, భార్య కోసం కొడుకుని అడవులకి పంపాడని లోక నిందలకు గురి చేస్తావా? చరిత్ర హీనుడని చేస్తావా?"

కైక మాట్లాడలేదు. దశరథుడినే చూస్తోంది....

"మహారాజా! కోరిన కోర్కెలు తీరుస్తానని పంచభూతాల సాక్షిగా చెప్పి వున్నారు. శ్రీరాముడి మీద ఒట్టు పెట్టారు. సత్యమే పరమ ధర్మం.

"రాజా! పూర్వం శైబ్యుడు అనే రాజు పావురాన్ని కాపాడతానని మాట ఇచ్చాడు. ఇచ్చిన మాట కోసం తన శరీరంలోని మాంసాన్నే కోసి డేగకు ఇచ్చాడు.

"ఆ సత్య ధర్మంతోనే అలర్క మహారాజు అడిగింది ఇస్తానని చెప్పాడు. మాట ఇచ్చిన బ్రాహ్మణుడికి అతను అడిగినట్టు తన రెండు కనులు పీకి ఇచ్చాడు.

"రాజా అన్ని నదులకూ రాజు సముద్రుడు. అతనూ సత్యవ్రతం వల్లనే తన గీతను దాటి ఈ భూమండలాన్ని ముంచి వేయుటలేదు. రాజా సత్యమే ఓంకారం. సత్యమే ధర్మం. ధర్మమే సత్యం."

దశరథుడు కొరడా దెబ్బలు తిన్నట్టు విలవిలలాడిపోయాడు. పుణ్యం తరిగిపోయి, దేవలోకం నుంచి క్రింద పడ్డ యయాతిలా వున్నాడు. మండుటెండలో, ఎడారిలో నీటి కోసం తపించి దారి తప్పిన యాత్రికుడిలా ఉన్నాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

అప్పుడే తెలతెల్లవారుతోంది. పట్టాభిషేకం ముహూర్తం దగ్గర పడింది. వశిష్ఠుడూ, అతని శిష్యులూ సరయూనదిలో స్నానం చేశారు. రాచవీధుల్లోంచి రాచనగరు చేరారు.

వీధులన్నీ కోలాహలంగా వున్నాయి. నగరమంతా చందనాగరు ధూపాలతో గుబాళిస్తోంది. తండోపతండాలుగా ప్రజలు ఎక్కడెక్కడినించో అయోధ్య చేరారు. స్త్రీలంతా తమ ఇంటి పెళ్ళిలా ఉన్న నగలన్నీ ధరించారు.

అయోధ్యా నగరం బంగారు నగరంలా కానవస్తోంది.

బ్రాహ్మణోత్తములు వేదపారాయణం చేస్తున్నారు. అంతా సిద్ధం అయింది.

వశిష్ఠ మహర్షి చెప్పాడు.

"ఓ సుమంత్రా! వెనువెంటనే మీరు మహారాజును తీసుకురావాలి. సుమూహూర్తం దగ్గర పడుతోంది. తొందరగా మీరు వెళ్ళి తీసుకురావాలి"

☆☆☆ ☆☆☆ ☆☆☆

వశిష్ఠ మహర్షి ఆదేశానుసారం సుమంత్రుడు కైక మందిరానికి వచ్చాడు. దూరం నుంచి చెప్పాడు.





"మహారాజుల వారికి శుభం. అంతా ఎదురు చూస్తున్న మహాశుభసమయం ఆసన్నమవుతోంది. ఇట్టి సమయానే మాతలి దేవేంద్రుడిని మేలుకొలిపి లేపినాడు.

"పట్టాభిషేకం కోసం గంగాజలం సిద్ధం. మేడికర్ర పీఠ తయారుగా వుంది. అన్నీ ధాన్యాలూ, రత్నాలూ తెచ్చి వుంచాం. ఎనమండుగురు కన్యలూ, పేలాలూ, నెయ్యీ, దర్భలూ, పూలూ... సర్వం సిద్ధం...

"రాజా! మంగళాలంకారాలు పూర్తి చేసుకోవలెయును. సూర్యుడిలా తేజరిల్లుతూ తమరు కదిలిరావలెయును.

"బంగారుపాత్రలూ, తెల్ల ఆంబోతూ, పెద్ద పులి చర్మమూ, సమస్తద్రవ్యాలూ అన్నీ వశిష్ఠుల వారు ఆదేశించినట్టు పూర్తి చేయటమైనది" సుమంత్రుడు చెబుతున్నది దశరథుడు విన్నాడు.

"సుమంత్రా! ఆపు .... నీ స్తోత్ర పాఠము... కర్ణకఠోరంగా వున్నది"

సుమంత్రుడు ఆ మాటలు విన్నాడు... దశరథ మహారాజును దర్శించాలని లోనికెళ్ళాడు.

దశరథుడు ఉన్న పరిస్థితి చూసి ఆగిపోయాడు. అమంగళమేదైనా అయినదా అని శంకించాడు.

కైక సుమంత్రుడితో చెప్పింది.

"శ్రీరాముడు గూర్చి మహారాజా వారు జాగరణ చేశారు. వెళ్ళి శ్రీరాముడిని తీసుకురండి..."

కైకాదేవి చెప్పటంతో సుమంత్రుడు రాజాజ్ఞగా స్వీకరించి బైటికొచ్చాడు. జనాలతో కిటకిటలాడుతోంది అంతఃపుర వాకిలి.

☆☆☆ ☆☆☆ ☆☆☆

పుష్యమీ నక్షత్రాన శ్రీరామడి జన్మలగ్నము కర్కాటక లగ్నములో ధర్మాత్ముడూ, వీరుడూ, సర్వజన ఆమోదయోగ్యుడైన శ్రీరాముడి పట్టాభిషేక ముహూర్తం.

వేదవేదాంగాలు చదివిన పండితులు వశిష్ఠ మహర్షిని సందర్శించారు.

అభిషేకం కోసం భద్రపీఠాల్ని సిద్ధంగా వుంచారు. నాలుగు గుర్రాల రథమూ, గంగా, యమునా సంగమ స్థానం నుంచి తీసుకువచ్చిన పుణ్యజలాలూ, తూర్పు దిక్కుగా ప్రవహించే నదులనుంచీ, ఊర్ధ్వముఖం

నుంచి పారే నదుల నుంచీ, దక్షిణంగా ప్రవహించే నదులలోంచీ, నిశ్చలంగా నిలిచి వుండే పుణ్యసరస్సుల నుంచీ, పుణ్యమైన బావుల నుంచీ సమస్త సముద్రాల నుంచీ తెచ్చిన నీటిని బంగారు బిందెలతో నింపారు. ఆ బిందెల మీద మూతలుగా తామరాకులూ, కలువలూ వుంచారు.

కోసల దేశ యువరాజు పట్టాభిషేక సమయాన తమ తమ ఆచారాలను బట్టి వజ్ర, వైఢూర్య, రత్న కానుకలతో సామంత రాజులు దశరథ మహారాజు అంతఃపుర ప్రధాన ద్వారం వద్ద వేచి వున్నారు.

తమరాక రాజుకు తెలుపుటకై ఆదుర్దాగా వున్నారు. ఆ సమయాన సుమంత్రుడు బైటికొచ్చాడు.

"రాజులారా! శ్రీరాముడిని తీసుకు రమ్మని ఆజ్ఞ... మీరంతా వచ్చినట్టు వేచి వున్నట్టు ఇప్పుడే మహారాజులవారికి తెలుపుతాను" అని మళ్ళీ లోనికెళ్ళాడు. తెరకి దూరంగా వుండి చెప్పాడు.

"రాజా! సామంత రాజులందరూ కానుకలతో తమ దర్శనార్థం వేచి వున్నారు. అమాత్యులూ, సేనానాయకులూ మీరాకకై, దర్శనంకై చూస్తున్నారు"

"సుమంత్రా! శ్రీరాముడిని తీసుకు రమ్మని కైక చెప్పింది. రాజాజ్ఞ నెరవేర్చటమంటే ఇదేనా?"

ఆ మాటతో సుమంత్రుడు వంగి నమస్కరించి బైటికొచ్చాడు. రథం ఎక్కాడు. దారిలో జనమంతా రామాభిషేకం గూర్చే మాట్లాడుకుంటున్నారు. రాజ చిహ్నాలతో రంగు రంగుల జెండాలతో దేవేంద్ర భవనంలా వున్న రామభవనం చేరాడు.

పెద్ద పెద్ద తలుపులతో, బంగారు గుమ్మటాలతో పగడాలు చెక్కిన ద్వారాలతో సర్వసంపన్న కుబేర గృహం లాంటి భవనం ముందు అంకుశానికి వంగని శత్రుంజయము అనే మదపుటేనుగు శ్రీరాముడిని ఎక్కించుకొని రాచవీధుల్లోంచి సభామండపానికి చేరటానికి సిద్ధంగా వుంది.

నదీ గర్భంలోకి పోయే మొసలిలా ఏ జంకూ లేకుండా, సుమంత్రుడు రామ భవనంలోకి ప్రవేశించాడు.

బల్లెములతో, ఈటెలతో కాపలాకాస్తున్న వారికి తన రాక గూర్చి శ్రీరాముడికి చెప్పమని చెప్పాడు. ద్వారపాలకులు సుమంత్రుడికి వినయంగా వంగి నమస్కరించి రామమందిరంలోకి వెళ్ళారు.





సుమంత్రుడికి ఏ భవనంలోకైనా నిర్భయంగా వెళ్లే అధికారం దశరథుడిచ్చినా, సదాచార సంపన్నుడూ, శాంత స్వభావి అయిన సుమంత్రుడు రాచమర్యాదను పాటిస్తూనే తన ధర్మాన్ని నిర్వర్తిస్తాడు.

శ్రీరాముడు భార్యాసమేతుడై వున్నాడు. సుమంత్రుడి రాక వార్త విని తక్షణమే సగౌరవంగా తీసుకురమ్మని చెప్పాడు. దశరథుడి ఆంతరంగికుడైన సుమంత్రుడు కుబేర భవనాన్నీ, మహేంద్రుని ప్రాసాదాన్నీ తలదన్నేలా ఉన్న శ్రీరామ మందిరంలోకి వచ్చాడు.

శ్రీరామచంద్రుడు కుబేరునిలా వున్నాడు. తెల్లటి దుప్పటి కప్పిన బంగారు పాన్పు మీద కూర్చున్నాడు. ఉదయించిన సూర్యుడిలా వెలిగిపోతున్నాడు.

"రామచంద్రా! తమ వంటి పుత్రుడిని కన్న కౌసల్యాదేవి మహా పుణ్యవతి. ధన్యురాలు. కైకేయీ దేవీ, మీ తండ్రి దశరథ మహారాజు గారు మిమ్ము తీసుకు రమ్మని ఆజ్ఞాపించారు. మీరు దయతో బైలుదేరవలెను."

శ్రీరాముడు సీతతో వెళ్ళివస్తానని చెప్పాడు. పతి ప్రేమకు పాత్రురాలూ, నల్లని నేత్రములూ, పొడుగుకాళ్ళ సుందరీ అయిన సీత భర్తను సాగనంపుతూ చెప్పింది.

"నాథా! తూర్పున దేవేంద్రుడూ, దక్షిణ ఉన్న యముడూ, పడమరనున్న వరుణుడూ, ఉత్తర దిక్కునున్న కుబేరుడు సర్వదా మిమ్మూ, కోసల దేశాన్నీ కాపాడవలెనని ప్రార్థిస్తున్నాను. రాజసూయ యాగ దీక్షలో మీరు కృష్ణా జినము ధరించి, లేడికొమ్ము ధరించి ఉండగా మిమ్ము పూజించవలెనని కోరు కుంటున్నాను..."

శ్రీరాముడు తన ఏకాంత గృహం నుంచి బైటికొచ్చాడు సుమంత్రుడితో. బైట లక్ష్మణుడు చేతులు జోడించి వున్నాడు. సుమంత్రుడూ, శ్రీరాముడితో అనుసరించాడు లక్ష్మణుడు-

సూర్యబింబంలా మెరుస్తున్న రథం ఎక్కారు. మహేంద్ర పర్వతం మీద నుంచి చంద్రుడు బైలుదేరినట్టు శ్రీరామ భవనం నుంచి బైలుదేరింది రథం. మేఘాలు వురిమినట్టు శబ్దం చేస్తూ నడిచింది.

లక్ష్మణుడు శ్రీరామునకు ఒక చేతితో గొడుగు పట్టుకొని, మరొక చేతితో తామరం పట్టుకొని రథం వెనుక భాగంలో నుల్చున్నాడు. రథము ముందు కవచాలూ, కత్తులూ, ధనుస్సులూ ధరించిన వారు పరుగు తీస్తున్నారు.

వందిమాగధులు శ్రీరామునికి స్తోత్ర పాఠాలు వినిపిస్తున్నారు. దారి పొడవునా జనం కేకలు వేస్తున్నారు. జయ జయధ్వనులు చేస్తున్నారు. ఆడ ఏనుగులతోనూ, మగ ఏనుగులతోనూ, గుంపులు గుంపులుగా ఉన్నట్టు జనంతో వుంది రాచనగరు. శ్రీరాముడు అన్నీ, అందరినీ చూస్తూ వెళుతున్నాడు.

★★★ ★★★ ★★★

శ్రీరాముడు ఒంటరిగా కైక అంతఃపురంలోకి ప్రవేశించాడు. దశరథుడు క్రుంగిపోయిన రథంలా వున్నాడు. దీనంగా వున్నాడు. ముందుగా తండ్రికి పాదాభివందనం చేశాడు. ఆపై కైక పాదాలకు నమస్కరించాడు.

"శ్రీరామా!" పిలిచాడు... దుఃఖం గొంతును నొక్కేసింది. సూటిగా శ్రీరాముడిని చూడలేకపోయాడు. పున్నమి నాటి సముద్రంలా వున్నాడు. రాహువు పట్టిన సూర్యుడిలా వున్నాడు. శ్రీరాముడు తండ్రిని చూశాడు.

"తల్లీ! తండ్రిగారు ఏల అట్లున్నారు. వారి మనస్సుకి కష్టం వాటిల్లినదా? అమ్మా ..... అజ్ఞానంతో నేనమీ అపరాధం చేయలేదుకదా!..... తల్లీ నాకు చెప్పు"

"రామా! మీ తండ్రిగారికి ఎట్టి కష్టమూలేదు... దిగులూ లేదు. లోగడ నాకు రెండు వరాలిస్తానని మాట ఇచ్చారు. అవి చెల్లించవలసి వచ్చినందుకు వ్యథ చెందుతున్నారు. సత్యమే ధర్మానికి మూలమని చెప్పిన మీ తండ్రిగారు ఆ సత్య ధర్మానికీ, పుత్ర ప్రేమకీ మధ్య కొట్టుమిట్టాడుతున్నారు.

"శ్రీరామా! దేవాసుర యుద్ధములో మీ తండ్రిని రెండుసార్లు రక్షించాను. అందులకు ఆయన రెండు వరాలిచ్చారు. ఆ రెండు వరాలనీ నేను ఇప్పుడు కోరుకున్నాను.

"ఒకటి భరతుడి పట్టాభిషేకం. రెండు నీవు పధ్నాలుగు సంవత్సరాలు వనవాసం చెయ్యటం... నీవు ఇప్పుడే దండకారణ్యానికి పోవలెను. నీ తండ్రి నీకు చెప్పలేకపోతున్నాడు. దుఃఖపడుతున్నాడు."

శ్రీరాముడు వినయంగా కైకకూ, తండ్రికీ నమస్కరించాడు. దశరథుడికి మాత్రం పుత్రశోకంతో గుండె నిండిపోయింది.

★★★ ★★★ ★★★

"అమ్మా! తండ్రి ఆజ్ఞ వెనువెంటనే ఆచరిస్తాను. తండ్రీ ఊరడిల్లు.... సంతోషంగా వనవాసం చేస్తాను" చెప్పి నడిచాడు.





కైక అంతఃపురం నుంచి రాముడు వెళ్ళగానే అంతఃపుర స్త్రీలంతా చాటుకెళ్ళి ఏడ్వసాగారు. శ్రీరాముడు కౌసల్యా మందిరానికి వెళ్ళాడు.

కౌసల్య ఆ రాత్రి ఉపవాసం వుండి జాగారం చేసింది. ఉదయాన్నే మహా విష్ణువుకి పూజ చేసింది. బ్రాహ్మణుల చేత హోమం చేయించింది. పట్టుచీరతో మంగళకరంగా శ్రీరామునికి ఎదురొచ్చింది.

పూర్ణ కుంభాలూ, అక్షింతలూ, పాలూ, పెరుగూ, నెయ్యీ, పేలాలూ, హవిస్సులూ, చక్షులూ, పాయసమూ, నువ్వులూ, బెల్లమూ లాంటి పట్టాభిషేక సంభారాలని చూస్తూ తల్లిని సమీపించాడు.

ఆ తల్లి బిడ్డను చూసుకొని మురిసిపోయింది.

"రామచంద్రా! నీ యువరాజ పట్టాభిషేకమునకు సమయము ఆసన్నమైనది. రాత్రంతా ఉపవాసదీక్షలో వున్నావు. ఏమైనా తిను" అడిగింది ఆప్యాయంగా.

"అమ్మా.... నీ మనోరథం నెరవేర్చలేకపోతున్నాను. తండ్రికి ఇచ్చిన మాట కోసం దండకారణ్యం పోవలెను. ఇరవై అయిదు దర్భలతో అల్లిన దర్భాసనము మీద నేను కూర్చుండవలెను. మాంసాహారాన్ని విడవాలి. తేనె, పండ్లూ, దుంపలూ తింటూ పధ్నాలుగు సంవత్సరములు వనవాసం చెయ్యవలెను... భరతునికి పట్టం.... నాకు వనవాసం. ఇది తండ్రి నిశ్చయము...."

***చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనే వనే,***
***మధుమూల ఫలైర్జీవన్ హిత్వా మునివదామిషమ్.***

శ్రీరాముడు చెబుతున్నాడు. కౌసల్య ఉలుకూ, పలుకూ లేకుండా నిశ్చేష్టతతో వుండిపోయింది. గొడ్డలితో తెగేసిన మద్దికొమ్మవలె, అరటి చెట్టువలే వాలిపోయింది.

శ్రీరాముడు తల్లికి సపర్యలు చేశాడు. ఆమెని లేపి కూర్చుండబెట్టాడు.

కౌసల్య శ్రీరాముడిని దగ్గరికి తీసుకుంది. తనివి తీరా చూసింది.

"రామా... నీకోసం దేవతారాధనలు చేశాను. దానాలిచ్చాను. నోములు పట్టాను. వ్రతాలు చేశాను. వాటి ఫలము ఇదా రామా! నా తపస్సు అంతా చవిటి నేల మీద పడ్డ విత్తనమేనా? ఎండాకాలం వేసిన పంటేనా?"

"అమ్మా! తండ్రి మాట నెరవేర్చుటకన్నా సృష్టిలో గొప్ప కార్యమేమున్నదమ్మా... నన్ను ఆశీర్వదించమ్మా"

"అయ్యో రామా! నా గుండె రాయిగానున్నదేమో. ఇంత వార్త విని కూడా ముక్కలవ్వలేదు. రామా... నేనూ నీ వెంట వస్తాను. దూడ వెంట పోయే ఆవులా వస్తాను. నిన్ను చూసుకొని బ్రతుకుతాను...." ఆమె రోదిస్తూనే వుంది.

★★★ ★★★ ★★★

"అమ్మా! నీకు దుఃఖహేతువైనా సరే నేను అరణ్యానికి వెళ్ళుట తథ్యం. అమ్మా.... 'యయాతి స్వర్గాన్ని విడిచి మళ్ళీ స్వర్గానికి వచ్చినట్టు నా వనవాసానికి అడ్డు చెప్పవద్దు' వనవాసం పూర్తి చేసి అయోధ్య వస్తాను" చెప్పి తల్లికి ప్రదక్షిణం చేశాడు.

"నాయనా! నీ కోసం నిత్యం పూజలు చేస్తాను. దేవతలని ఆరాధిస్తుంటాను. అరణ్యవాసమున నీకు ఎట్టి ఇబ్బందీ రాదు. విశ్వామిత్రుల వారు ఉపదేశించిన సమస్త మంత్రాలూ నిన్ను సదా రక్షిస్తుంటాయి.

"శ్రీరామా..... నీ శిరస్సును ఆకాశమూ, నీ శ్రోత్రేంద్రియాన్ని దిక్కులూ, నీ ముఖాన్ని ఇంద్రాగ్నులూ, నీ కనులను సూర్యుడూ, నీ హృదయాన్ని చంద్రుడూ, నీ ప్రాణాన్ని వాయువూ, నీ నాభిని గ్రహమండలమూ, నీ పాదాలను భూమీ సర్వదా రక్షించుగాక...." ఆ తల్లి మంగళప్రదంగా దీవించింది.

హోమకర్మలన్నీ చేసింది. పుణ్యాహము చేసింది. స్వస్త్యయన మంత్రాలు చదివించింది.

"నాయనా శ్రీరామా! వృత్తాసుర సంహారానికి పోయే దేవేంద్రుడికి దేవతలు చెప్పిన మంగళకరమైన ఆశీర్వాదమూ, గరుత్మంతుడు అమృతం కోసం వెళ్ళినప్పుడు వినతాసతి చెప్పిన మంగళ ఆశీర్వాదమూ, పాలసముద్రంలోని అమృతాన్ని సంపాదించటానికి వెళ్ళే దేవేంద్రుడికి అదితి చెప్పిన మంగళ ఆశీర్వాదమూ, బలిచక్రవర్తిని అణగదొక్కి ముల్లోకాలను ఆక్రమించడానికి పోయే తేజోమూర్తి మహావిష్ణువుకు దేవేంద్రుడి తల్లి చెప్పిన మంగళ ఆశీర్వాదము నేను నీకు చెబుతున్నాను" అని మంత్రం పఠించి శ్రీరామునిపై అక్షితలు వేసింది.

"శ్రీరామా! పోయిరా! నీ కోసం నేనూ, నా కోడలు సీతా రోజులు లెక్కపెట్టుకుంటూ వుంటాము. సర్వ దేవతలు ఎప్పుడూ నీకు మేలు చేస్తారు" అని దగ్గరికి తీసుకుంది. కొడుకుని మళ్ళీ మళ్ళీ కౌగిలించుకుంది.





# సీత అరణ్యవాస నిర్ణయం

మహాసాధ్వి సీత అభిషేకం కోసం వ్రతనిష్ఠలో వుంది. పట్టాభిషేక అనంతరము చెయ్యాల్సిన పూజ గూర్చి సంభారాల గూర్చి సమాయత్త మవుతోంది. శ్రీరామ పట్టాభిషేక అనంతరము పట్టమహిషిగా తాను చెయ్యాల్సిన పాదపూజ కోసం వెండిపాత్రా, వెండికంచమూ సిద్ధం చేసుకొని శ్రీరాముని రాకకై ఎదురుచూస్తోంది.

గంధం, పుష్పాలు చేత పట్టుకొని మహదానందంతో మాటిమాటికీ శ్రీరామునికొరకై వాకిలి వైపు చూస్తోంది.

దివ్యంగా అలంకరించిన మందిరంలోకి వచ్చాడు శ్రీరాముడు. వైదేహి శ్రీరాముడిని చూడగానే ఏదో జరగరానిది జరిగిందని భావించింది. ఎప్పుడు మృదుస్వభావంతో, చెదరని చిరునవ్వుతో ఉండే శ్రీరాముడు కలత చెంది వున్నాడు.

సీత అవయవాలన్నీ కంపించాయి. ఇద్దరూ ఒకరినొకరు చూసుకున్నారు.

"ప్రభూ! ఈ శుభ సమయాన ఆ విచార వదనమేమిటి? తామర రేకుల కన్నుల మొహం చిన్నపోయింది. మంగళవచనాలతో స్తోత్రపాఠాలు వినపడుటలేదు. దివ్యసుందర రూపమైన మీ తలపై తేనె, పెరుగూ చల్లలేదేమి...

"ముఖ్యమైన హితులూ, సన్నిహితులూ, రాజోద్యోగులూ తమ వెంట రాలేదే... శుభ ముహూర్తం అత్యంత సమీపంలో కొచ్చిననూ బంగారు సింహాసనము రాజవీధిలో ఊరేగించటంలేదే... ఆ కోలాహలం ఏ మాత్రం వినరావటం లేదు...."

"సీతా..." అనునయించాడు శ్రీరాముడు.

సీత ముఖం వివర్ణమైంది. చిరు చెమట పట్టింది.

"వైదేహీ.... నా తండ్రి దశరథుడు ఆడి తప్పడు. సత్యసంధుడు. ఇక్ష్వాకు వంశానికి తలమానికం. దేవాసుర యుద్ధంలో తండ్రిగారు కైకమ్మకి రెండు వరాలిచ్చారు. ఆ రెండు వరాలు ఇప్పుడు కోరింది...

"అందు ఒకటి భరతుడు యువరాజు అవ్వటం. రెండు నేను పధ్నాలుగు సంవత్సరాలు వనవాసం చెయ్యటం. నీవు గొప్ప వంశంలో పుట్టావు. ధర్మరక్షణే క్షత్రియ ధర్మం. ఆ ధర్మంతోనే తండ్రి మాట ప్రకారం అడవులకి వెళుతున్నాను. నువ్వు నిలకడగా వుండు.

"నా తండ్రి దశరథునికి ప్రతిరోజు వందనం చేయి. కౌసల్యని కుశలాలడుగుతూ వుండు. లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను బిడ్డలుగా చూసుకో... సత్యవ్రతం మీరకుండా వుండు సీతా! పరమ ధర్మపరుడు జనక మహారాజు కూతురివి.

"ఓ మైథిలీ... ఈ కోసల రాజ్యాన్ని నా తమ్ముడికిచ్చాడు నా తండ్రి. వ్రత పూజలతో కాలం గడుపు. ఇట్టే పద్నాలుగు సంవత్సరాలు గడిచిపోతాయి. ఈలోగా అయోధ్యలో ఎవ్వరి మనసు నొప్పించకు.

"సీతా! మంగళప్రదురాలవు నీవు. దోష రహితపు దానవు. నా సహధర్మచారిణిగా నీ గూర్చి తెలుసు. అయినా భర్తగా చెప్పాను. ఎంతటి స్థితిలోనూ నీవు అప్రియము ఆడకు..... ఎవ్వరి మనస్సు నొప్పించకు..... ప్రియమైన ప్రియురాలా సీతా.... నేను మహారణ్యమునకు వెళుతున్నాను."

జానకీదేవికి ప్రణయ కోపం వచ్చింది. శ్రీరామునితో వినయంగా అణుకువతో చెప్పింది.

"స్వామీ!.... ఇదంతా పరిహాసం కాదుగా"

"కళ్యాణీ! కన్నతండ్రీ, కన్నతల్లీ, తోబుట్టువులూ, అన్నదమ్ములూ అంతా వారి వారి కర్మలని బట్టీ, పుణ్యఫలాలని బట్టీ జీవిస్తారు.

"కానీ భార్య మాత్రం అలా కాదు. భర్త అనుభవించే సుఖ, దుఃఖాలను సమంగా అనుభవించవలసి వస్తుంది. స్త్రీకి భర్తే సర్వస్వము. ఆనందమైనా, దుఃఖమైనా భర్తే. భువిలోనే కాదు దివిలోనూ అంతే.

"వనవాసం గూర్చి నాకు ఎట్టి చింతా లేదు. తండ్రి మాట నెరవేర్చిన పుత్రుడిగా పుత్ర ధర్మం నిర్వర్తిస్తున్నాను. నీ గూర్చే నాకు చింత..."

సీత శ్రీరాముని చెంతచేరి చెప్పింది.

"స్వామీ... మీరు అరణ్యావాసం చేస్తుంటే ఈ బంగారు బంధిఖానాలో ఈ అయోధ్యలో ఎలా వుంటాను. మీ ధర్మమే నా ధర్మం. భర్త ఎక్కడుంటే అక్కడే స్వర్గధామం. ఆర్యపుత్రా! భార్య ఒక్కతే భర్త భాగ్యమును పంచుకుంటుంది. అరణ్యావాసమునకు పోవలెనని మీ తండ్రిగారు చెప్పిన నన్నూ కానలకి పొమ్మన్నట్టే. నేనూ మీరూ ఒక్కటే.

"అగ్నిసాక్షిగా మీరూ నేనూ ప్రమాణం చేశాము. కష్టమైనా, సుఖమైనా కలిసే వుంటామని. ఆ ధర్మాన్ని నేను ఎలా వీడను. కీకారణ్యమైనా సరే...





పర్వత గుహలైనా సరే... మీతోనే ఈ సీత. సర్వకాలసర్వావస్థలలో భర్తతో వుండటమే భార్యకి ధర్మం... సుఖం... ఆదర్శం.

"భర్త సమక్షంలో ఏ భార్య అయినా కన్నవారింట వున్నట్టు కలత లేకుండా వుండగలదు. సమస్త లోకాలని రక్షించే నాథుడివి నీవు. సర్వధర్మాలకీ తలమానికం... నేనూ మీ నీడలోనే నడుస్తాను. నా ప్రార్థన మన్నించు నాథా.... నీవు లేని త్రిలోక ఆధిపత్యము కూడా నాకు అసమ్మతమే."

శ్రీరాముడు సీత ధృడ నిశ్చయం విన్నాడు.. ఎండ కన్నెరగని రాకుమారి... అడవిలో ...  క్రూరమృగాల మధ్య... మండుటెండల్లో, ముళ్ళకంపల దారిలో... శ్రీరాముడు సీతని అనునయించాడు.

"సీతా! వనవాసం బహుకష్టం. రాళ్ళ గుట్టల మీద నడక... ఘోర క్రూరమృగాలు ఆకలి శబ్దాలతో అరిచే భీకర అరుపులు... తటాకాల్లో, నదుల్లో కొండంత ప్రాణిని లాగేసే మొసళ్ళు... మదపుటేనుగులు ఒక్కసారిగా పిచ్చిపట్టినట్టు కర్షకుడు పొలం దున్నినట్టు కనిపించిన మేర స్వైర విహారం చేస్తాయి.

"సీతా! ఆభరణాలూ, పట్టువస్త్రాలూ వదలి నారబట్టలు ధరించాలి. ఊపిరాడనీయని మహాగాలి, గాడాంధకారమైన చీకటి. దొరికిన దుంపా, కాయలనే తినాలి.. వానప్రస్థ నియమాలతో నిత్యం పూజ చేయాలి.

"సీతా! అనేక కాలసర్పాలు మన అంతఃపురంలో తిరిగే దాసదాసీ జనంలా తిరుగుతుంటాయి. ఒక్కొసారి నిశ్చలంగా వుండి అవి కదలక మనల్ని కదలనీయవు. సుకుమారివి, సున్నితమైన దానివి.

"వద్దు సీతా... వద్దు. భర్త అనువాడు భార్యకి సుఖమును మాత్రమే ఇవ్వవలెను" ధర్మవత్సలుడూ, ధర్మజ్ఞుడూ శ్రీరాముడు సీతకు నచ్చ చెప్పాడు.

★★★ ★★★ ★★★

"నాథా! మీరు చెప్పినవి కష్టాలే కావు. భర్త అనురాగం ముందు, తోడు ముందు అవన్నీ అల్పమైనవి. మీరు మహావీరులు. దేవేంద్రుడు కూడా మీతో యద్ధానికి సాహసించడు. భర్త లేని ఆడది బ్రతకడం బహు కష్టం.

"ప్రభూ! ఇహలోకంలోనైనా, మరణాంతరమైనా భర్త ఒక్కడే స్త్రీకి ఉత్తమ గతి. మిథిలలో నా జాతకం చూసిన పండితులు నాకు వనవాసయోగం వుందని ఎప్పుడో చెప్పారు. అది ఇలా వాస్తవమైంది.

"మహాప్రభూ! కేవలం పండితులు మాత్రమే కాదు. ఒకానొక తాపసి నన్ను చూసి... ఈ పడతి భర్తతో వనవాసం చేస్తుందని కూడా చెప్పింది. ఎన్నోసార్లు గంగాతీరాన కొంతకాలం గడుపుదామని మిమ్ము అడిగాను. ఇదిగో ఇప్పుడు ఇలా అవకాశం వచ్చింది. కాదనకండి. మీకు పరిచర్యలు చేస్తాను. భర్తే దేవుడు. భక్తునికి దేవుడిని దూరంగా ఉంచరాదు. నా దేవుడితోనే నేనూ...

"స్వామీ! జలపాతాల శబ్దాలూ, పర్వతాల అందాలూ, పక్షుల కిలకిలారావాలూ, మృగాలూ, లేళ్ళూ, ఆ యా కాలాల్లో పూచే పూలూ, పండ్లూ, కాయలూ.... ప్రభూ! శ్రీరామా! వనవాస ఆనందాన్ని తమతో పంచుకుంటాను.

"స్వామీ! ఈ జగత్తుకు వెలుగునిచ్చే సూర్యుని వంటివారు. మీరు నన్ను వదిలి వనవాసానికి వెళితే నన్ను గాఢమైన చీకటిలో వుంచినట్టే. భర్తని భార్య అనుసరించాలన్నది మీకు తెలియని ధర్మం కాదు.

"నా మీద మీకున్న ప్రేమ అపారమైనది. ఆ అనురాగ బంధంతో మీకు అడ్డుపడుతున్నాను. నాథా! నన్ను వదిలి అడవికి వెళితే నాకు గౌరవం కాదు. మా తండ్రి జనకునకు ఏ సమాధానం చెప్పగలను. భర్త ఆక్షేపిస్తుంటే ఏ స్త్రీ తట్టుకొనలేదు. నన్ను వద్దంటే అగ్నిహోత్రమే నాకు దిక్కు... సావిత్రి సత్యవంతుని వదలనట్టు, తమరి చరణాలను నేను వదలను..."

శ్రీరాముడు సీతను హృదయానికి హత్తుకున్నాడు.

"సీతా... నీ ధృఢ నిశ్చయంతో నారీలోకానికే ఆదర్శవంతమైనావు. పూర్వులందరూ తమ సతులతోనే వనవాసం చేశారు. సూర్యుడ్ని అనుసరిస్తూ తిరిగే సువర్చలలా నాతోనే వుంటావు. ధీరుడు కష్టాల్లో కీర్తిని వదలనట్టు నిన్ను వదలి నేను వెళ్ళను. నాతో దండకారణ్య వనవాసంతో నా వంశ ప్రతిష్ఠనూ, నీ వంశ గౌరవాన్నీ ద్విగుణీకృతం చేయుచున్నావు.

"సీతా! తల్లీ, తండ్రీ, గురువూ ఈ ముగ్గురూ మూడు లోకాలు. వీర్ని పూజిస్తే ముల్లోకాలను జయించినట్టే. సత్యమూ, దానమూ, యజ్ఞాలూ ఏమీ పితృసేవకన్నా గొప్పవి కావు.

"తల్లీ, తండ్రినీ సేవించే ఉత్తములు దేవ, గంధర్వ, గోలోక, బ్రహ్మలోకము సంపాదిస్తారు. అడవికి సిద్ధమవు. విలువైన ఆభరణాలు సేవకులకీ, ఆప్తులకీ, ఇష్టులకీ ఇవ్వు..." చెప్పాడు శ్రీరాముడు.





మహాస్వర్గం అందినట్టు సీత ఆనందించింది... మహాసాధ్వి... మనస్విని సీతాదేవి శ్రీరాముడు చెప్పిన విధంగా చేయటానికి అంతఃపురంలోకి వెళ్ళింది.

## లక్ష్మణ వనవాసం

సీతారాముల సంభాషణ ఆసాంతమూ విన్నాడు లక్ష్మణుడు. కన్నీరు కార్చాడు. ఒక్క ఉదుటున శ్రీరాముడి కాళ్ళ మీద పడ్డాడు. గద్గద కంఠంతో చెప్పాడు.

"అన్నా! నీతోనే నేనూ. ధనుస్సూ, కత్తీ పట్టుకొని మీకు అరణ్యంలో త్రోవ చేస్తాను. శ్రీరామా నీవు లేకుండా దేవలోకంలో వుండమన్నా నేను వుండను. పధ్నాలుగేళ్ళు నిదురించాలని నా భార్య ఉర్మిళకు శాపముంది. కాన శ్రీరామా కాదనకు.

"చిన్ననాటి నుంచీ, ఊహ తెలిసిన నాటినుంచి నీతోనే నేనూ..."

"లక్ష్మణా! నా ప్రాణం ఒకటీ నీవొకటీ కాదు. నాతో అడవికి వస్తే కౌసల్యాదేవినీ, సుమిత్రాదేవినీ ఎవరు ఊరడిస్తారు. వద్దు నాయనా! వద్దు. అశ్వపతి కూతురైన కైక తనయుడు భరతుడి చేతిలో రాజ్యముంటుంది.

"రాజ్యపాలనలో భరతుడుంటాడు. తల్లులనూ, తండ్రి దశరథుడని శత్రుఘ్నుడు ఒక్కడే ఎలా చూసుకొనగలడు. ... భరతునకు శత్రుఘ్నునిలా నీవు రాజ్యపాలనలోనూ, అంతఃపుర నియమాలలోనూ సేవకుడిగా వుండు. మాతృ పూజ చేసి సుకృతము సంపాదించు" అనునయంగా చెప్పాడు శ్రీరాముడు.

"అన్నా! నీ పరాక్రమానికీ, శూరత్వానికీ భయపడి భరతుడు కౌసల్యనీ, సుమిత్రనీ పువ్వుల్లో పెట్టి చూసుకుంటాడు. నేను నీ కింకరుడిగా నీతోనే వుంటాను. కాయా, పండూ తెచ్చిపెడతాను. నువ్వూ, సీతమ్మ తల్లీ హాయిగా కొండశిఖరాల మీద, చెరియల మీద స్వేచ్ఛగా విహరించండి. మీరు నిద్రించేటప్పుడు రక్షణగా నేను మేలుకొంటాను...."

ఎన్ని విధాలుగా చెప్పినా లక్ష్మణుడు వినలేదు. శ్రీరాముడు తమ్ముడిని దగ్గరికి తీసుకున్నాడు.

"లక్ష్మణా! నీవు ధార్మికుడవు. వీరుడవు. నా ప్రాణ సమానుడవు. నా తమ్ముడవు. నన్ను ఎప్పుడూ సుఖసంతోషాలతో ఉంచటమే పనిగా పెట్టుకున్నవాడివి.

"లక్ష్మణా! నీ హితులకూ, సన్నిహితులకూ వీడ్కోలు తెలియచేయి. వరుణదేవుడిచ్చిన రెండు కవచాలూ, అక్షయ తూణీరాలతో ఉన్న రెండు ధనుస్సులూ, మహాతేజోవంతమైన బంగారు పిడులు రెండూ వశిష్ఠుల వారి నుంచి స్వీకరించు. వారి వద్ద భద్రపరిచినందుకు కృతజ్ఞతలు తెలియచెయ్యి.

"సౌమ్యుడైన ఓ లక్ష్మణా! నీ ఆర్జిత ధనాన్ని ఆశ్రితులకూ, అర్హులకూ దానమియ్యి.

"రాజర్షి... మన కుల గురువు వశిష్ఠ మహర్షి పుత్రుడూ, పరమ పూజ్యుడూ అయిన సుయజ్ఞుణ్ణి తీసుకురావలెయును. వారిని సత్కరించి ఆశీర్వాదం స్వీకరించి అరణ్యావాసానికి తరలి వెళదాం" చెప్పాడు శ్రీరాముడు.

## శ్రీరాముని దానధర్మాలు

శ్రీరాముని ఆదేశంతో లక్ష్మణుడు సుయజ్ఞుడి వద్దకు వెళ్ళాడు. శ్రీరామ సందేశాన్ని తెలిపాడు. సుయజ్ఞుడు అగ్నిహోత్ర గృహం నుంచి లక్ష్మణుడి వెంట బైలుదేరాడు.

లక్ష్మీ సంపన్నమైన శ్రీరామ మందిరాన్ని చేరారు. ఆ మహాత్మునకు సీతారాములు నమస్కరించారు. బంగారు బాహుపురులూ, మణులూ, కంకణాలూ, మణిహారాలూ ఇచ్చి పూజించారు.

సీత కోరిక ప్రకారం రాముడు చెప్పాడు.

"నా ఇల్లాలు సీత నాతో పాటు కానలకు వస్తోంది. తన ఆభరణాలను మీ భార్యకి ఇవ్వవలెనని ఆమె కోరిక" చెప్పాడు శ్రీరాముడు.

సీతాదేవి మణులు పొదిగిన తన కంఠాభరణాన్నీ, బంగారు బాహుపురులనూ ఇచ్చింది.

అన్నీ స్వీకరించాడు సుయజ్ఞుడు. సీతారామ లక్ష్మణులను ఘనంగా ఆశీర్వదించాడు.

లక్ష్మణుడు విశ్వామిత్రుడనూ, అగస్త్యుణ్ణీ పిలుచుకువచ్చాడు. వారికి ఎన్నో వేల ఆవులనూ, బంగారాన్నీ ఇచ్చి సంతృప్తులని చేశాడు.

శ్రీరాముడు తైత్తిరీయశాఖాధ్యాయులకు పట్టుబట్టలూ, దాసీజనాన్నీ దానం ఇచ్చాడు.

దశరథ మహారాజుకు సచివుడు, తనకు సారథి అయిన చిత్రరథుడు అనే సూతునకు వెయ్యి ఆవులనూ, వస్త్రాలనూ దానంగా ఇచ్చాడు.





బ్రహ్మ దేవేంద్రుడిని ఆదేశించినట్టు శ్రీరాముడు లక్ష్మణునకు అనేక ఆదేశాలు ఇస్తూనే వున్నాడు. శ్రీరాముడు చెప్పినట్టు కుబేరునిలా దానాలు ఇస్తూనే వున్నాడు లక్ష్మణుడు. సేవకులు ధనం మోసుకు వస్తూనే వున్నారు. తీసుకు వచ్చింది తీసుకువచ్చినట్టు ఇస్తూనే వున్నాడు లక్ష్మణుడు. బ్రాహ్మణులు వస్తూనే వున్నారు. పంచుతూనే వున్నాడు లక్ష్మణుడు.

అయోధ్యా నగరంలో త్రిజటుడు అనే ముసలి బ్రాహ్మణుడు వున్నాడు. పడుచు భార్యతో, సంతానంతో అడవిలో కాయా దుంపా తెచ్చుకొని జీవిస్తుంటాడు.

త్రిజటుడు భార్యతో, పిల్లలతోనూ రామదానాలకై వచ్చాడు. శ్రీరాముడు ఆ వృద్ధుడనూ, పడుచు పెళ్ళాన్నీ, కోడిపిల్లల లాంటి పిల్లలను చూశాడు.

"రఘురామా! శ్రీరామా.... తమ కటాక్షం కొరకై కుటుంబసమేతంగా వచ్చినాను. ఏ లోటూ లేదు... అయిననూ భార్య కోరికతోనూ, నీ దర్శన భాగ్యం మళ్ళీ ఎప్పుడవుతుందోనని నీ కడకు వచ్చాను."

శ్రీరాముడు చిరునవ్వు నవ్వాడు.

"బ్రాహ్మణోత్తమా.... అదిగో కనిపిస్తున్న ఆవుల మంద. అంతా నాదే. అందులోంచి ఓ వెయ్యి ఆవులు నీకివ్వాలనుకుంటున్నాను. ఎందుకో అలా చెయ్యి బుద్ధి కావటం లేదు. ఇదిగో కర్ర. విసురు... అది పడినంత మేర గోవులను నీకు దానం ఇస్తాను..." చెప్పాడు శ్రీరాముడు.

త్రిజటుడు నవయవ్వన యువకుడిలా నడుంకి గుడ్డ బిగించి కర్ర అందుకొని విసిరాడు. సరయూనది దాటి పడింది. ఆ వృద్ధుడు అంత దూరం కర్ర విసిరినందుకు అంతా ఆశ్చర్యపోయారు.

శ్రీరాముడు ఆ కర్ర పడ్డ వరకూ వున్న ఆవులన్నీ అతడి ఆశ్రమ పదానికి తోలించాడు.

"ధనము మీ బోటి వారికే కూడబెట్టాను. సద్గుణాలు గల మహాను భావులకు ఇచ్చిన దానమే సద్వినియోగం అవుతుంది" చెప్పాడు శ్రీరామడు.

సీతారామలక్ష్మణులను ఆ దంపతులు స్తుతించారు.

అయోధ్యా నగరంలోని ప్రతి బ్రాహ్మణునకు దానం ఇచ్చాడు శ్రీరాముడు. ప్రతి భిక్షకుడు సీతారాములను కొనియాడారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

సీతారామ లక్ష్మణులు బైలుదేరారు. సీతాదేవి రామలక్ష్మణ ధనుస్సులను చందనముతో అలంకరించింది. ఆయుధాలు ధరించి రాచవీధిలోకి వచ్చారు.

అయోధ్య ప్రజలు హాహాకారాలు చేశారు. ప్రాసాదాలనూ, గృహ శిఖరాలనూ ఎక్కారు.

శ్రీరాముడి వెంట చతురంగ బలాలు లేవు. బంగారు రథం లేదు. గొడుగు లేదు... సీతారామలక్ష్మణులను చూసి ప్రజలు శోకించారు. ధర్మ గుణం గల శ్రీరాముడునూ, అన్న కోసం అడవులకెళ్తున్న లక్ష్మణుడునూ, సమస్త భూత కోటికీ కనిపించక అంతఃపురంలో శ్రీరామసేవ చేసుకునే సీతమ్మనూ చూసి అంతా ఏడుస్తున్నారు. తమ వారికే ఆ కష్టం వచ్చిందని కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నారు.

దశరథ మహారాజును శాపనార్థాలు పెట్టారు. సమస్త సద్గుణమైన ఆరుగుణాలు శ్రీరాముడిలో సంపూర్ణంగా వున్నాయి. ఎండాకాలం ఏరు ఎండిపోయి విలవిలలాడిన నీటి, అడవి జంతువుల్లా రోదించారు ప్రజలు.

శ్రీరాముడు ధర్మాత్ముడు. శ్రీరాముడు మహావృక్షం. దాని కొమ్మలూ, ఆకులూ, పూలూ, కాయలూ మనం... కాన లక్ష్మణుడి దారే మన దారి. శ్రీరాముడు లేని అయోధ్య మనకొద్దు.

ప్రజలు ఒకరి కొకరు చెప్పుకున్నారు. తోటలూ, మిద్దెలూ, ఆస్తులూ, ధనమూ అన్నీ వదిలెయ్యటానికి నిశ్చయించుకున్నారు. శ్రీరాముడితో అడవికి వెళితే అయోధ్యే అడవవుతుంది.

అడవిలో శ్రీరాముడితోనే అయోధ్యని సృష్టించుకుందాం. మనుష్యులు లేని అడవివంటి అయోధ్యను దశరథుడూ, భరతుడూ, శత్రుఘ్నుడూ ఏలుకుంటారు. కైక ప్రజలులేని అడవిని కొడుక్కి కట్ట బెట్టుకోనీ.

'మనమంతా అడవిలోకి వెళితే క్రూరజంతువులూ, పాములూ, సమస్త జంతువులూ అయోధ్యని చేరుతాయి'

ప్రజలంతా అదే అనుకున్నారు. సీతారామలక్ష్మణులని అనుసరించారు.

శ్రీరాముడు నిశ్శబ్దంగా నడుస్తున్నాడు. తండ్రి భవనాన్ని చూశాడు. కైలాస పర్వతంలా వుంది. భవనానికి నమస్కరించాడు. దశరథుని దగ్గర వీడ్కోలు కొరకై భవనంలోకి వెళ్ళాడు.

సుమంత్రుడు కానవచ్చాడు. శ్రీరాముడను చూసి భోరున విలపించాడు.





"తండ్రిగారి ఆశీర్వాదం కోసం రాముడు సీతా, లక్ష్మణ సమేతంగా వచ్చాడని చెప్పు సుమంత్రా" చెప్పాడు శ్రీరాముడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

సుమంత్రుడు లోనికెళ్ళాడు. శ్రీరాముడ్ని తలుచుకుంటూ దుఃఖిస్తున్నాడు దశరథుడు. ఎండిపోయిన సరస్సులా వున్నాడు. లంకణాలు చేసిన రోగిలా ఉన్నాడు. మహాప్రాజ్ఞుడు సుమంత్రుడు శ్రీరామ రాక గూర్చి చెప్పాడు.

"పురుషోత్తముడూ, సత్యపరాక్రమవంతుడూ, శ్రీరాముడు తన ధనాన్ని బ్రాహ్మణులకు దానం ఇచ్చి తమ దీవెనలకై సీతా, లక్ష్మణ సమేతంగా వచ్చాడు ప్రభు..."

"రామా... రామా... నా రాముడొచ్చాడా!? అయ్యో ఎట్లా చూడగలను. మహాకిరణాలతో తేజరిల్లే నా పుత్రుడని అడవులకు పంపుతున్న కఠినుడను.

"సుమంత్రా! నా భార్యలకు కబురు పంపు... అందరితోనూ కలిసి నా రాముడిని చూసుకుంటాను" చెప్పాడు దశరథుడు.

దశరథుని ఆజ్ఞ ప్రకారం భార్యలు కౌసల్యా, సుమిత్రాదేవిలతో పాటు మూడు వందల యాభైమందీ వచ్చారు. అందరి కళ్ళు రోదిస్తున్నట్టు ఎర్రగా వున్నాయి.

శ్రీరాముడు సీతా లక్ష్మణ సమేతుడై లోనికి వచ్చాడు. తండ్రినీ, తల్లులనూ చూశాడు. తండ్రికి నమస్కరించారు రామలక్ష్మణులు. దశరథుడు లేచాడు. శ్రీరాముడి వద్దకు నడవబోయి తూలిపడ్డాడు.

శ్రీరామలక్ష్మణులు పట్టుకొని లేవనెత్తారు. అంతఃపుర స్త్రీలు గొల్లుమన్నారు. చేతులను తలకేసి కొట్టుకున్నారు. వారి శోకాలకీ, ఏడుపుకీ భవనం మారుమ్రోగిపోయింది.

☆☆☆ ☆☆☆ ☆☆☆

సుమంత్రుడు కోపంతో కైకకి చెప్పాడు.

"ఓ రాణీ...ఈ కోసల దేశానికి రాజు దశరథ మహారాజు. దేవేంద్రుడంతటి వాడు. పరాక్రమవంతుడు. ఎవ్వరినీ ఏనాడూ బాధపెట్టని సజ్జనుడు. అట్టి దశరథుడని మహా దుఃఖసాగరంలోకి నెట్టి వేశావు.

"అయోధ్యకి మహారాజును లేకుండా చేస్తారేమోనని అనిపిస్తోంది. కోరినవన్నీ ఇచ్చారు రాజు.... అడిగిందల్లా చేశాడు. అట్టి పతిని

అనుసరించవలెను. పూజించవలెను. భర్తను బాధ పెట్టిన ఇల్లాలికి తుదకి అదే శాశ్వతమౌతుంది.

"ఓ కైకేయీ దేవీ... పెద్ద కొడుకు రాజు అవ్వుట లోకసంప్రదాయము. ఆ ధర్మం ప్రకారమే దశరథుడు శ్రీరామునకు పట్టాభిషేకము చేయదలిచాడు.

"ఎప్పుడో ఇచ్చిన వరాలనడిగి దశరథ మహారాజును దుఃఖాల పాలు చేశారు. ఆయన్నే కాదు.. కోసల మొత్తాన్నీ...

"రాణీ... ఈ రాజ్యం మీదే... భరతుడిదే... నేనూ శ్రీరాముడని అనుసరిస్తూ వనవాసం చేస్తాను. నాతో పాటు అయోధ్య ప్రజలంతా సిద్ధమై వున్నారు. అదిగో బైటి కెళ్ళి చూడు. ప్రజలు ఇళ్ళూ, ఆస్తులూ, అన్నీ వదలి సీతారామలక్ష్మణులను అనుసరిస్తున్నారు. అయోధ్యలో ఉండనంటున్నారు.

"రాణీ... పూర్వం ఒక్కప్పుడు ఒక మహానుభావుడు సర్వప్రాణికోటి భాషలు అర్థమయ్యేలా మీ తండ్రిగారికి వరమిచ్చారు.

"ఆ మహాత్ముడి వరప్రభావం వల్ల, ఓనాడు మీ జనకులు విశ్రాంతి తీసుకుంటున్న సమయాన ఓ చీమల గుంపు మాటలు విన్నారు.

"ఆ చీమల గుంపు జృంభం అనే చీమ ఒక మాట అంది. ఆ మాటలకు ఆయనకు నవ్వు వచ్చింది. హాయిగా నవ్వారు. ఆ నవ్వు విని మీ తల్లిగారు ఎందుకు నవ్వారని అడిగింది.

"మీ తండ్రిగారికి ఏం చెప్పాలో అర్థం కాలేదు. మీ తల్లిగారు రెట్టించి అడిగారు. తనకి అన్ని భాషలూ తెలుస్తాయని చెబితే మరణిస్తాడు. అందుకే చెప్పలేదు.

"దానితో మీ తల్లి గారు ఏమైనా సరే చెప్పాల్సిందేనంది. చెబితే మరణిస్తానని వారించినా వినలేదు. తను పోతానన్నా కూడా సాధించే భార్యని తన్ని తరిమేశాడు మీ తండ్రి. ఇప్పుడు కుబేరుడిలా వున్నాడు మీ తండ్రి గారు....

"కైకాదేవీ... ఇప్పుడు నువ్వూ నీ తల్లిలానే ప్రవర్తించావు. కొడుకులకి తండ్రి గుణం వస్తుంది... కూతుళ్ళకి తల్లి గుణం అబ్బుతుంది. ఇది లోకోక్తి... నిజం... దాన్ని మరోసారి నిజం చేశారు. మీ తల్లిగారిలా భర్తకి ఏమైనా పర్వాలేదు. నేను అనుకున్నది జరగాలన్న తీరూ మీరు పాటిస్తున్నారు.

"ఎవరైనా మామిడి పండ్ల చెట్టుని కొట్టి, వేప చెట్టు వంక మామిడి పళ్ళ కోసం చూస్తారా? నీవూ అంతే. మధురమైన జీవితాన్ని చేదు చేసుకుంటున్నావు.





"పాపాత్ములెవరో పాడు బోధ చేసి వుంటారు. దేవేంద్రుడంతటి నీ భర్తకు అధర్మం అద్దవద్దు. శ్రీరాముడు సత్యసంధుడు. ఉదారుడు. స్వధర్మం తప్పని వాడు. జ్యేష్ఠుడు.

"సదాచార సంపన్న లోక రక్షకుడు శ్రీరాముడు. అయోధ్యని వీడితే ధర్మం కుంటుపడుతుంది. శ్రీరాముడే వనవాసానికి వెళితే అయోధ్యే కాదు కోసల దేశమూ అరణ్యాలకి వెళుతుంది.

"అయోధ్య యోగ్యులు లేని మహారణ్యం అవుతుంది. అడవిలోని జంతువులన్నీ అయోధ్యలోకి వస్తాయి. నా మాట విను... మహారాజు సమక్షమున ఇంత పెద్దగా మాట్లాడినది ఇదే మొదలు... ఇక్ష్వాకు వంశానుసారంగా, శ్రీరాముడునకు పట్టాభిషేకం చేసి దశరథుడు వానప్రస్థం స్వీకరిస్తాడు" చెప్పాడు సుమంత్రుడు.

కైక సుమంత్రుడిని కోపంగా చూసింది. నిప్పులు కురిపించింది. మనస్సు కరగలేదు సరికదా... మహాసర్పంలా చూసింది సుమంత్రుడి వైపు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"సుమంత్రుడా! రాచ ధర్మములూ, అంతఃపుర ధర్మములూ తెలిసిన వాడివి... రాజు ఇష్టాన్ని బట్టే పలుకవలెను. రాజు అంటే తండ్రి, రాణి అంటే తల్లి. తల్లీ, తండ్రికీ ధర్మ నీతులు చెప్పుట సరికాదు... ఇదేనా నీవు నేర్చుకున్న ధర్మం. ముందు స్వధర్మం నిర్వర్తించాలి. ఆపై ధర్మబోధ చేయాలి" చెప్పాడు దశరథుడు.

సుమంత్రుడు తలవంచుకున్నాడు.

"సుమంత్రా! రత్న రాసులతో..... చతురంగబలాలనూ సిద్ధంచేయ్. కవచాలూ, ఆయుధాలూ ధరించిన వారిని శ్రీరామునితో పంపు. ఆహారబళ్ళూ... అడవిలో దారి చూపించేవారిని కూడా జతచేయి.

"నా రాముడు అడవిలో ఎట్టి కష్టాలు పడకూడదు. తేనె తాగుతూ, పళ్ళు పూలూ తీసుకుంటూ ఆనందంగా ఆహ్లాదంగా ఉండాలి. ధనాగారంలోని ధనాన్ని బోయలతో మోయించి రాముడితో పంపు. పుణ్యకారక ప్రదేశాల్లో యజ్ఞాలు చేస్తూ, దానాలు చేస్తూ శ్రీరాముడు వనవాసం ముగించాలి.

"భరతుడు అయోధ్యని పాలించనీ, శ్రీరాముడు సకల సంపదలతో, మందీమార్బలంతో అడవికి వెళ్ళనీ" ఆజ్ఞాపించాడు దశరథుడు.

కైక మొహం వెల వెల పోయింది. ఎండిపోయింది. ఏడుపు తన్నుకు వస్తున్న మొహంతో దశరథమహారాజుని అడిగింది.

"నాథా! శ్రీరాముడి వెంట ధనమునూ, పౌరులనూ, సైన్యమునూ పంపించి వేస్తే అయోధ్యలో ఏలటానికి ఇంకేముంది. వరమిచ్చినట్టే ఇచ్చి, భరతునకూ, నాకూ ఫలము లేకుండా చేస్తారా?"

"కైకా! మాట్లాడవద్దు. నీవు పాముని. తెలియక ఇంతకాలం మహాశివుడిలా భ్రమపడుతూ మెడలో వేసుకున్నాను. చుట్టుకున్న మెడకే ఉరిబిగించావు.

"నీ వడిగిన వరాలు ఇచ్చి వేశాను. ఇంకనూ నియమములెందుకు. మోయరాని బరువుని కూడా ధర్మం కోసం, నా పూర్వీకుల కోసం ఎత్తుకున్నాను" చెప్పాడు నీతిమంతుడూ, ధర్మపాలకుడూ అయిన దశరథుడు.

కైక తన పెద్ద కనులును మరింత పెద్దవి చేసి చెప్పింది.

"రాజా! తమ పూర్వీకుడైన సగర చక్రవర్తి తన పెద్దకొడుకును అసమంజుణ్ణి అయోధ్యా నగరం నుంచి వెళ్ళగొట్టాడు. అట్లే ఆ పద్ధతిలోనే శ్రీరాముడను ఒంటరిగానే కానలకి పంపవలెను."

దశరథుడు ఏవగింపుగా చూశాడు. ఆ సమయాన మహాత్ముడూ, వృద్ధుడూ అయిన సిద్ధార్థుడు కలగ చేసుకున్నాడు.

"కైకేయీదేవీ అసమంజుడు లోకకంటకుడు. దుష్టుడు. చిన్న పిల్లలని జాలీ కరుణా లేకుండా తీసుకెళ్ళి సరయూనదిలో పడతోసి రాక్షస ఆనందాన్ని అనుభవించేవాడు. అట్టి వాని బాధలు పడలేక నగర ప్రజలు అయోధ్య రాజు సగర చక్రవర్తికి మొరపెట్టుకుంటే పుత్రుడని కూడా చూడకుండా ప్రజారక్షణ కోసం అడవులకు సాగనంపాడు. అట్టి వానికీ... శ్రీరాముడికీ పోలికా...

"మహారాజా! అసమంజుడి విపరీత ధోరణిని సగర చక్రవర్తి భరించలేక కట్టుగుడ్డలతో భార్యతో సహాపంపి, తిరిగి అయోధ్యలోకి రాకూడదని శాసించాడు. అసమంజుడు చేసిన పాపాలకు కందమూలాలు తింటూ అడవిలో అనుక్షణం భయం, భయంగా గడిపాడు.

"రాణీ! అపరాధము చేసినందుకు అంతటి శిక్ష విధించాడు. మరి శ్రీరాముడు ఏ అపరాధం చేశాడు. తల్లికీ, తండ్రికీ, ప్రజలకీ, మంత్రులకీ ప్రియమైన వాడు అగుటే అతని దోషమా, అపరాధమా?





"శ్రీరాముడు చంద్రుడంతటి నిర్మల హృదయుడు. దోషం లేని వాడ్నీ, మహాత్ముడనీ, అడవులకి వెళ్ళగొడితే దేవేంద్రుడికైనా సరే మహాపాపమూ, అపకీర్తీ నిండుగా చుట్టుకుంటుంది" చెప్పాడు సిద్ధార్థుడు.

దశరథుడు శోకతప్తుడయ్యాడు. 'రామా! రామా!' అంటూ కలవరిస్తున్నాడు. "నేనూ కూడా రాముడి వెంటవెళతాను. ఈ రాజ్యమునూ, ధనాన్నీ మీ తల్లీ కొడుకులే అనుభవించండి" చెప్పాడు దశరథుడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"పెద్దలు మన్నించాలి... ఈ రాజ్యాన్ని ఏలేది నా తమ్ముడు భరతుడే. ధర్మం తప్పక పరిపాలించగల సమర్థుడు. అక్షయమైన ఈ రాజ్యము భరతునిదే. నేను సీతతోనూ, లక్ష్మణుడుతోనూ వనవాసము వెళుతున్నాను. కందమూల ఫలాలను తింటూ వనవాసాన్ని ఆనందంగా ముని సేవ చేస్తూ పూర్తి చేస్తాను. నాతో సంపదలూ, సేవకులూ, రథాలూ, గుర్రాలూ, ప్రజలూ ఎవరూ రావద్దు. అవన్నీ భరతునితో ఉండవలెను.

"నాకు కావలిసింది తండ్రి గారి ఆశీర్వాదం. తల్లుల దీవెనలు. వాటితో పాటు నియమానుసారంగా ఓ గొడ్డలీ, తట్టా, నారబట్టలూ అంతే..." చెప్పాడు శ్రీరాముడు.

కైక సిద్ధంగా ఉంచిన నార బట్టలు ఇచ్చింది. శ్రీరాముడు ఆనందంగా తల్లి నుంచి స్వీకరించాడు. శ్రీరామలక్ష్మణులు కైక ఇచ్చిన వల్కలాలు ధరించారు. ముని కుమారులవలె ఉన్నారు. విల్లంబులు ధరించి రాజపుత్రులని తెలుపుతున్నారు.

సీతకే కష్టంగా ఉంది. నారబట్టలు స్పర్శించుట అదే ప్రథమము. ఎంత ప్రయత్నించినా ఆ బట్టలు ఎలా కట్టుకోవాలో అర్థం కాలేదు. అంతఃపుర స్త్రీల సహాయం కోరింది.

అంతా ఆ దుస్థితి చూసి ఘొల్లుమన్నారు. రాజర్షి వశిష్ఠి మహర్షి మౌనంగా వుండిపోయాడు. తలొంచుకొని వ్యథ చెందాడు.

జనకరాజ సుత... వైదేహి... హరిణాక్షి... మృదుశీల... ముద్దరాలు... సీతాదేవి నారచీర ధరించి శ్రీరాముని వద్దకు వచ్చింది.

కైకేయీదేవి నిశ్చలంగా చూసింది. సీతను చూసి ఇసుమంత కూడా జాలిపడలేదు.

వశిష్ఠుడు సీతను చూసి కలతపడ్డాడు. నారచీరలు కట్టుకోనవసరం లేదని చెప్పాడు. నగలూ, పట్టు బట్టలూ ధరించవచ్చని చెప్పాడు. సీత మాత్రం శ్రీరామ మార్గాన్నే అనుసరించింది.

★★★ ★★★ ★★★

ముని వేషధారియై ఉన్న సకల సద్గుణ సంపన్నుడైన శ్రీరాముడిని దశరథుడు చూశాడు. "రామా! పూర్వజన్మలో ఆవుల నుంచి దూడలను వేరు చేసి ఉంటాను. దూడల తల్లుల స్తనములు ఛేదించి ఉంటాను. లేదా తల్లిదండ్రుల నుంచి బిడ్డలను విడదీసి ఉంటాను. ఆ పాపం ఇలా...

"అయ్యో ఇంత జరుగుతున్నా నా ప్రాణం పోదే... అవసానకాలం ఆసన్నమవ్వదే... ఈ బొందిలో ప్రాణం పంచభూతాల్లో కలవదే... ఇంతమందిని బాధ పెట్టిన నేను ఎంతటి పాపినో కదా! ఎన్ని యజ్ఞాలూ, యాగాలూ, సమస్త భూమినీ దానమిచ్చినా ఈ పాపఫలం నాకు పోదు...

"అయిననూ పర్వాలేదు. నా పాపం నాతోనే పోవలెను. సుమంత్రా! బంగారు రథమును సిద్ధంచేయి. నీవే స్వయంగా జనపదాలకు అవతల వదలి పెట్టిరా" చెప్పాడు దశరథుడు మనసు రాయి చేసుకొని...

రాజాజ్ఞ ప్రకారం సురక్ష రత్న రథాన్ని సిద్ధం చేశాడు సుమంత్రుడు. దశరథుడు కోశాగార పర్యవేక్షకుడిని పిలిపించాడు. సువర్ణ మణి భూషణాలను తెప్పించాడు.

"అమ్మా! ఈ ఆభరణాలు ధరించవలెను" ఇచ్చాడు. దశరథుని కోరికపై కొన్ని తీసుకొని అలంకరించుకుంది. అప్పుడే ఉదయించిన సూర్యుడితో గగన తలం ప్రకాశించినట్టు మెరిసిపోయింది.

కౌసల్య కోడలిని దగ్గరికి తీసుకుంది.

"మహాసాధ్వీ... లోకంలో కొందరు స్త్రీలు భర్తకు కష్టం వస్తే చులకన చేస్తారు. విమర్శిస్తారు. భర్త సుఖాలిచ్చేటప్పుడు పరమానందంగా అనుభవించిన స్త్రీలు ధనమూ, కీర్తీ దూరమవ్వగానే అతన్ని వీడతారు. స్త్రీ స్వభావమే చంచలం. అట్టి స్త్రీలు భర్తకు అబద్ధాలే ఎక్కువ చెబుతారు. లేశమాత్రాన విరుచుకు పడతారు. కలహిస్తారు. అట్టి వారికి గౌరవము ఉండదు.

"సీతా! లోకములోని అందరూ అట్లే ఉంటే ఈ భూమి ఎప్పుడో అంతరించిపోయేది. నీలాంటి సాధ్వీమణుల వల్ల భూమిపై వర్షాలు పడు





తున్నాయి. పంటలు పండుతున్నాయి. సమస్త ప్రాణకోటికీ ఆహారం అందు తోంది. సూర్య చంద్రులు ధర్మాన్ని పాటిస్తున్నారు. వందమంది పుత్రులతో ఉండుటకన్నా స్త్రీకి భర్తతో ఉండుటే శ్రేయస్కరం. సుఖం. తల్లీ, తండ్రీ, కొడుకూ, అంతా ప్రేమాభిమానాలు స్త్రీకి మితంగా ఇస్తారు. అగ్నిసాక్షిగా పెండ్లిచేసుకున్న పెనిమిటి మాత్రమే అన్నీ ఇస్తాడు" చెప్పింది కౌసల్య.

విదేహరాజ పుత్రి సీత కౌసల్యాదేవికి వినయంగా చెప్పింది.

"పూజ్యురాలా! మిథిల నుంచి అయోధ్యకి వచ్చే ముందే నా తల్లీ, తండ్రీ నాకు భర్త విషయంలో ప్రవర్తించవల్సిన ధర్మాలన్నీ విడమర్చి చెప్పారు. నేను నా ధర్మాన్ని వీడను. తీగలు లేని వీణ మోగదు.

"భర్తకు దూరంగా ఉన్న భార్య వీణ లేని తీగే. చక్రాలు లేని రథము ఎలా నడవదో భర్తకు దూరంగా ఉన్న స్త్రీ ముందుకు సాగలేదు. నాకు నా భర్తే దైవం. సర్వం. సర్వకాల సర్వావస్థలందు నా దైవాన్నే అంటిపెట్టుకుని ఉంటాను" చెప్పింది సీత.

కౌసల్యాదేవి సీతను ఆలింగనము చేసుకుంది. కన్నీరు కార్చింది. శ్రీరాముడు తల్లికి నమస్కరించాడు. దశరథుని భార్యలు మూడు వందల యాభై మందికినీ.

శ్రీరాముడు నమస్కరించి...

"తెలియకగాని, తెలిసిగాని, తప్పులు చేసి ఉంటే క్షమించవలెను. సెలవు ఇప్పించండి" చెప్పాడు శ్రీరాముడు.

అందరూ ఒక్కపెట్టున రోదించారు. నిత్యచందనధారుడై, ఉత్తమ స్త్రీలు వింజామరలు వీస్తుంటే కనక సింహాసనంపై కూర్చోవల్సిన రాముడు అడవిలో చెట్టు నీడని ఆసరా చేసుకొని దర్భలు పరుచుకొని నిద్రించవలెనా! తలుచుకోగానే దుఃఖం తన్నుకు వచ్చింది. నిత్యం మృదంగాలూ, ఉడుకలూ, జంత్రవాద్యాలూ మ్రోగే ఆ భవనం ఏడుపులతో, పెడబొబ్బలతో ప్రతిధ్వనించింది.

క్రౌంచ పక్షులు మూకుమ్మడిగా ఏడుస్తున్నట్టు శోక శబ్దాల మధ్య శ్రీరాముడు సుమిత్రాదేవికి నమస్కరించాడు. ఆమె దీవెనలందుకున్నాడు.

లక్ష్మణుడు కౌసల్యాదేవికి నమస్కరించి తల్లి సుమిత్రాదేవి వద్దకు వచ్చాడు. లక్ష్మణుడిని చూసి ఆ తల్లి దుఃఖం ఆపుకోలేకపోయింది. బిడ్డను పట్టుకొని భోరుమంది.

"లక్ష్మణా! లోకరక్షణ కోసం కౌసల్యాదేవి శ్రీరాముడిని కన్నది. శ్రీరామచంద్రుడి కోసం నేను నిన్ను కన్నాను. నిరంతరమూ శ్రీరాముడినే కనిపెట్టుకో. ఏమరుపాటు వలదు. ఇక్ష్వాకువంశంలో జ్యేష్ఠుడి సేవ కనిష్ఠుని ధర్మము. సీతారాములే నీ తల్లీ, తండ్రీ అనుకో... దండకారణ్యమే ఇక నీకు అయోధ్య. సుఖంగా వనవాసము పూర్తి చేసి రండి నాయనా" చెప్పింది సుమిత్రాదేవి.

## సీతారామలక్ష్మణుల వనవాసం

మాతలి దేవరాజు దేవేంద్రునకు చెప్పినట్టు సుమంత్రుడు శ్రీరామునకు చెప్పాడు. "శ్రీరామా! ఉత్తమ జాతులతో పుట్టిన గుర్రాలతో పూనిన రథం సిద్ధంగా ఉంది. తాము ఇష్టం వచ్చినకడ రథమును ఆపెదను. ఇప్పుడే ప్రయాణమైన, ఈ క్షణం నుంచి వనవాసకాలం ప్రారంభమగును."

చక్కని చుక్క సీతాదేవి ముందుగా రథమెక్కింది. యశోవంతుడు శ్రీరాముడు ఆ తర్వాత లక్ష్మణుడు రథాన్ని ఎక్కారు. అగ్నిహోత్రంలా వెలిగిపోతూ రథం కదిలింది. గాలితో పోటీపడి ప్రయాణించే అశ్వాలు కదిలాయి.

పట్టాభిషేక సంబరాల్లో పాల్గొనాలని వచ్చిన పౌరులు మోయలేనంత దుఃఖభారంతో వెనుతిరిగారు. గుర్రాలూ, ఏనుగులూ ఏదో ఆవహించినట్టు పిచ్చిపిచ్చిగా తిరుగుతూ అరిచాయి. అల్లకల్లోలమైన సముద్రంలా ఉంది అయోధ్య. పక్షులూ, చెట్లూ, సర్వభూతములూ కన్నీరు కార్చాయి.

పౌరులంతా శ్రీరాముడి రథాన్ని అనుసరించారు. పరిగెత్తారు. దాహంతో సెలయేరు వద్దకు వెళ్ళినట్టు శ్రీరాముడి రథం పట్టుకున్నారు.

"సుమంత్రా జాగ్రత్త. పగ్గాలు లాగి పట్టు. మెల్లగా రథాన్ని పోనీయ్" చెబుతున్నాడు శ్రీరాముడు.

"శ్రీరామా! సీతమ్మా..." అంటూ పౌరులు దీనంగా అరిచారు. పుత్రుడిని అడవికి పంపి భవంతిలో ఉండలేకపోయాడు దశరథుడు. రామా... రామా... అంటూ బైటికొచ్చాడు. గ్రహణం పట్టిన చంద్రుడిలా ఉన్నాడు. శ్రీమంతుడు శ్రీరాముడు చూశాడు. సుమంత్రుడిని రథాన్ని పోనిమ్మన్నాడు.

స్త్రీలందరి కన్నులలో కన్నీళ్ళు... చెరువులో చేపలూ, ఆకాశంలో పక్షులూ భూమి మీద జంతువులూ విలపించాయి. దశరథుడు అయోధ్య పరిస్థితిని చూశాడు. తల్లడిల్లిపోయి వేళ్ళు నరికిన చెట్టులా అయిపోయాడు. సుఖం





తప్ప కష్టం తెలియని కౌసల్యా, సుమిత్రాదేవీలు రోదిస్తూ ఉన్నవాళ్ళు ఉన్నట్టు బైటికొచ్చారు. కొడుకుని కనపడే వరకూ చూసుకుంటున్నారు.

రామా! సీతా! లక్ష్మణా!... హాహాకారాలతో అయోధ్య తల్లడిల్లి పోయింది. "సుమంత్రా ఈ జనసమూహం నుంచి రథాన్ని వాయువేగంతో పోనీయ్. తండ్రినీ, తల్లులనూ, వీరులనూ చూస్తుంటే నా మనస్సు కదిలిపోతోంది."

సుమంత్రుడు గుర్రాలని అదిల్చాడు. అశ్వాలు మహావేగంతో కదిలాయి.

చేతులు జోడించి నమస్కరించారు శ్రీరాముని రథంనకు పౌరులు. కోపంలేనివాడు శ్రీరామచంద్రుడు. అనాథలకీ, ఆర్తులకీ, తాపసులకీ ఆధారం శ్రీరాముడు. ఆ రాముడు అడవులపాలయ్యాడు.

ప్రజలంతా దిగాలు పడి కూర్చున్నారు. పొయ్యి వెలగలేదు. జంతువులూ, పక్షులూ తిండి తినలేదు. బిడ్డలు దగ్గరికొస్తే తల్లులు ప్రేమగా దగ్గరకు తీసుకోలేదు. చీకట్లు కమ్ముకున్నాయి. చంద్రుడూ కదలనంటూ నిల్చున్నాడు. గ్రహాలూ, నక్షత్రాలూ వెలుగు తగ్గాయి. దిక్కులు తెలియరాలేదు. చల్లగాలి వీచుటలేదు. అశ్విన్యాది తారల ధగధగ కానరాలేదు. సప్తర్షుల కాంతి తగ్గింది.

భార్యల మీద భర్తలకి ఆ క్షణంలో అనురాగం పోయింది. దేవతల రాజు దేవేంద్రుడు తన ఇంద్ర పదవి వదిలేసినట్టు, భూమండలంలో శ్రీరాముడు అయోధ్యని వదలగానే ప్రకృతి సహితం స్థంభించింది.

## దశరథుని దుఃఖం

శ్రీరాముని రథం దుమ్మురేపుకుంటూ వెళుతోంది. కనుమరుగయ్యే వరకూ దశరథుడు చూస్తూనే ఉన్నాడు. ధూళి కూడా కానరాలేదు. శ్రీరాముడు ఎంతో దూరం వెళ్ళిపోయాడు.

దశరథుడు క్రిందకు వాలిపోయాడు. కౌసల్య లేవనెత్తింది. కైక తృప్తిగా ఊపిరి పీల్చుకుంది. దశరథుని వద్దకు రాబోయింది.

"ఓ కైకేయీదేవి నా వద్దకు రావలదు. అగ్నిసాక్షిగా పెళ్ళాడాను. దానికి సంబంధించిన ఇహపరాలన్నీ వదిలేస్తున్నాను. ఇహలోక సౌఖ్యాన్నిచ్చే అన్నింటినీ వదిలేస్తున్నాను.

"నీ ఆశ్రితులకూ, నీకూ, నాకూ ఎట్టి సంబంధం లేదు. నీవు కానీ, నీ పుత్రుడు కానీ నేను మరణించిన తర్వాత కూడా నా శవాన్ని తాకరాదు" రోదిస్తూ రోషంతో చెప్పాడు దశరథుడు.

మునివేషంలో ఉన్న పుత్రుడే కళ్ళ ముందు మెదులుతున్నాడు. వరాలోహ భూతనయ వైదేహి సీతాదేవి మెదిలింది. అగ్నిహోత్రంలా మండే దనుర్ధరుడు లక్ష్మణుడూ తలంపుకు వచ్చాడు.

కౌసల్య, సుమిత్రలతో దశరథుడు కౌసల్య మందిరానికి నడిచాడు. నడుస్తున్నంతసేపు వెనక్కి చూస్తునే ఉన్నాడు.

దశరథుడు కౌసల్యా మందిరానికి పోయి పట్టు పాన్పు మీద పడుకున్నాడు. సీతారామలక్ష్మణులు మెదిలారు.

అయ్యో ఇంతకన్నా మెత్తని పరుపుల మీద చందనచర్చ వేసి వింజామరులు విసురుతుంటే నిదురించే రాముడు, కానల్లో, రాయీ, రప్పలను తల వొత్తుగా చేసుకొని నిదురించవలిసినదేనా! కనులు మూసుకున్నాడు. సొమ్మసిల్లి పోయాడు. ఎప్పుడో మధ్యరాత్రిలో పీడకల వచ్చింది. దిగ్గున లేచాడు.

శ్రీరామా! మళ్ళీ నిన్ను చూడగలనా? నాకా అదృష్టం ఉందా! లేదు. నీవు వచ్చే వరకూ జీవించే సుందరభాగ్యం లేదు.

"రామా!" అరిచాడు. కౌసల్య స్వాంతన పరుస్తూ పక్కన కూర్చుంది.

"కౌసల్యా... నాకు ఏమీ కానరావటం లేదు. నా దేహం నుంచి ఏదైనా వేరైనదా.... శ్రీరాముడిని లాలించి, పెంచిన ఈ చేతులతో నన్ను తాకు.. ఉపశయనము అవుతుందేమో..." అడిగాడు దశరథుడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"ప్రభూ! నాకన్నా లాలించి, పెంచిన కైకలో ఇంతటి విషం ఇంత వరకూ ఎచ్చట ఉన్నది. ఇంతటి కుటిలత్వముతో అడవులకు పంపుటకు ఎట్లా మనసొప్పేను.

"రాజా! భరతుని పట్టాభిషేకము చేయమని అడుగుట తల్లి మనసు. కానీ శ్రీరాముని వనవాస ఆంతర్యమే బోధపడుట లేదు. రెండో వరంగా భరతునకు దాస్యము చేయమని అడిగినా బిడ్డ కళ్ళ ముందు ఉండేవాడు. కూతురు లేని లోటు తీర్చిన కోడలు సీత దూరమయ్యేది కాదు. సుమిత్రకు పుత్రశోకమూ తప్పేది.

"ప్రభూ! ఏ జన్మలోనో పాలు తాగుతున్న బిడ్డను లాగేసి ఉంటాను. సకల సద్గుణ సంపన్నుడు. శాస్త్రవిశారదుడు. దేవతల వయస్సువలె పాతిక సంవత్సరాలవాడు, యవ్వనవంతుడు, అయిన శ్రీరాముడు సమస్త భోగాలు





అనుభవించాల్సిన వయస్సులో అడవుల్లో కందమూల ఫలాలను తింటూ గడపవల్సిందేనా!

"స్వామీ! యజ్ఞాయాగాదుల్లో దేవతలకి ఇవ్వాల్సిన హవిర్భాగాన్ని రాక్షసులకి ఇచ్చినట్టు కైకకు వరాలిచ్చారు. దాని పర్యవసానం ఎంతటి ఘోరశోకాన్ని మిగిల్చిందో గ్రహించారా! పధ్నాలుగు సంవత్సరాలు ఎప్పటికి గడుస్తాయి.

"మళ్ళీ సీతారాములు అయోధ్య రాచ వీధిలో ఎప్పుడు ప్రవేశిస్తారు. అయోధ్య పున్నమి నాటి సముద్రంలా ఎప్పుడు సంతోషంగా ఉప్పొంగిపోతుందో...

"రాజా... నా బాధ వర్ణింపనలవి కానిదిగా ఉన్నది. రోహిణీకార్తెలో భూమిలా తాపముతో నిండిపోయి ఉన్నది. ఈ తాపం సప్త సముద్రాలలో మునిగననూ పోదేమోననిపిస్తోంది."

☆☆☆ ☆☆☆ ☆☆☆

కౌసల్యాదేవి దుఃఖం చూసి సుమిత్రాదేవి కౌసల్యని ఊరడించింది. "కౌసల్యా... దుఃఖాన్ని దిగమింగుకో... శ్రీరాముడు సమస్త సద్గుణవంతుడు. మహాబలవంతుడు.

ఐహిక సుఖాల కోసం ఆశపడడు. ధర్మాన్ని మాత్రమే శిరసావహిస్తాడు. నీ బిడ్డ సత్యసంధుడు. రాజ్యాన్ని త్యజించి కానలకి భార్యతోనూ, తమ్ముడితోనూ వెళ్ళాడు.

"లోకానికి ఆదర్శప్రాయమైన ఆ ముగ్గురి గూర్చి దుఃఖించుట తగదు. శ్రీరాముడు కొడుకు ధర్మాన్ని పాటించాడు. శ్రీరాముడి భార్య సీత పతివ్రతా ధర్మాన్ని పాటించింది. అన్నదమ్ముల ధర్మాన్ని పాటించాడు లక్ష్మణుడు.

"కౌసల్యా.... శ్రీరామునకు సత్యవ్రతమూ, ధర్మమూ ధనంతో సమానం. సూర్య భగవానుడు తన వాడి అయిన కిరణాలతో శ్రీరాముడను తాకడు. వాయువు వన్యసుగంధాలను రంగరించి వీస్తాడు.

"పున్నమి చంద్రుడు తన అపూర్వమైన వెన్నెలతో శ్రీరాముడ్ని తండ్రివలె అక్కున చేర్చుకుంటాడు. శ్రీరాముడు సూర్యునికే ప్రభువు. అగ్నికే అగ్నిహోత్రుడు. వీరాధివీరుడు. శ్రీరాముడి వీరత్వంతో సమానమైనవాడు ఈ పృథ్విలోనే లేడు. అడవిలో ఉన్నా అయోధ్యలో ఉన్నా రామునకు ఒక్కటే.

"మంగళకరమైనవాడు శ్రీరాముడు. పధ్నాలుగు యేళ్ళు ఇట్టే గడిచిపోతాయి. శ్రీరాముడు వస్తాడు. సీతాదేవిని పట్టమహిషిగా మనం చుస్తాం. వారిద్దరూ బ్రాహ్మణులకు దానాలిస్తుంటే మురిసిపోతూ చూస్తాం" అంటూ అనేక రకాలుగా కౌసల్యాదేవిని సముదాయించింది సుమిత్రాదేవి.

## తమసా నది

శ్రీరాముడి రథం పరుగులు తీస్తూనే ఉంది. దానికి తగ్గట్టే పరిగెడుతూ పౌరులు వెంటపడ్డారు. అంతమంది ప్రజలు పట్టు వీడకుండా వస్తుండటంతో శ్రీరాముడు రథాన్ని మెల్లగా పోనిమ్మన్నాడు. ఆగినా, వెనక్కి మళ్ళినా వ్రత భంగం అవుతుంది.

"అయోధ్యా పురప్రజలారా! మీ ప్రేమాభిమానాలకు ధన్యులము. నాపై చూపిస్తున్న ఈ అభిమానం భరతుని మీదా ఉండాలి. ధర్మం తెలిసినవాడు, కష్టం తెలిసినవాడు మిమ్ము కన్నబిడ్డలవలె చూసుకుంటాడు. ప్రజారంజకంగా పాలించగల రాజవిద్యా పారంగతుడు.

"వయస్సులో చిన్నవాడు. జ్ఞానంలో కురువృద్ధుడు. చక్కటి ఆదర్శ స్వభావి. రాజుకు ఉండాల్సిన గుణాలన్నీ ఉన్నవాడు. రాజాజ్ఞ నెరవేర్చటం ప్రజల విధి. కాన పుర ప్రజలారా... దయతో మీరంతా వెడలిపోవలెను. అయోధ్య చేరి మహారాజు సూచన మేర నడువవలెను. అదే నాకు సంతోషం, ఆనందం" చెప్పాడు శ్రీరాముడు.

ఈ భూమికి పూర్ణచంద్రుడు ఎట్లానో శ్రీరాముడు అయోధ్యా వాసులకు అట్టివాడు. వారు శ్రీరాముడిని చూస్తూ 'వద్దు పోవద్దు...' అని అరిచారు.

"వెళ్ళండి... అయోధ్యకు వెళ్ళండి. దశరథ మహారాజు నాతోపాటు, మీ గూర్చి కూడా పరితపించేలా చేయకండి" చెప్పి రథాన్ని వేగంగా పోనిమ్మన్నాడు. రథం వేగంగా కదిలింది. దుమ్ములేపుకుంటూ గుర్రాలు పరిగెత్తాయి.

"ఓ అశ్వములారా! మీ చెవులు బహు శక్తికలవి. ప్రాణకోటిలో ఏ జీవికీ లేనంత గ్రహణశక్తి కలవి. మా మాటలు శ్రీరామునకు మీరన్నా విన్నవించండి. శ్రీరాముడు పరమ ధార్మికుడు. ధృడవ్రతుడు. వీరుడు. అట్టి శ్రీరాముడిని చూడకుండా ఉండలేం. మా కంటి వెలుగుని దిగిపొమ్మని చెప్పండి. వెనక్కి మరల మనండి" అరుస్తున్నారు.





ఆ విన్నపాలు శ్రీరాముడు విన్నాడు. కొంత దూరం ప్రయాణించి రథం ఆగింది. శ్రీరాముడు దిగాడు. సీతా, లక్ష్మణుడూ రథాన్ని దిగారు. నెమ్మదిగా నడువుట ప్రారంభించారు.

వెనుకున్న పౌరులు వచ్చి శ్రీరాముడిని కలుసుకున్నారు. "శ్రీరామా! ధర్మపరాయణుడవు నీవు. మేం బ్రాహ్మణులం. మా మాట వినవలెను. హంసల రంగువలె మారిన మా జుత్తును చూడు. అంతటివారం ప్రార్థిస్తున్నాము. అయోధ్య తిరిగిరా.

"నీవు లేని అయోధ్యలో యజ్ఞాలూ, పూజలూ చేయలేం. అదిగో చూడు ఆ చెట్ల మీద పక్షులను.... అవి కూడా ఎంత దీనంగా నిన్ను చూస్తున్నాయో. చెట్లూ, చేమా, పక్షులూ, జంతువులూ అన్నీ నిన్ను అయోధ్యకే మరలమని చెబుతున్నాయి" వేడుకున్నారు శ్రీరాముడిని. శ్రీరాముడను తమసా నది ఆపింది. అడ్డంగా ఉండటంతో అలసిన గుర్రాలను విప్పాడు సుమంత్రుడు.

గుర్రాలు మధురమైన వృక్షాలతోనూ, సుందర పచ్చిక ప్రదేశాలతో నిండిన తమసా నదిలో స్నానం చేసి కడుపారా నీళ్ళు త్రాగాయి. సుమంత్రుడు వాటికి లేత మేతను వేశాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

తమసానదీ తీరం పక్షుల కిలకిలారావాలతో రమ్యంగా ఉంది.

"లక్ష్మణా! వనవాసకాలంలో ఇది తొలి రాత్రి. తమసానదీ తీర ప్రాంతం మనకు మధురంగా గుర్తుండిపోతుంది. సుకుమారి సీత గూర్చి ఆలోచించ వలదు. ఆమె నడవగలదు. సాయం సమయం అవుతోంది. పక్షులన్నీ గూటికి చేరుతున్నాయి.

"లక్ష్మణా! ఈ పురజనులు గూటికి చేరు విధంగా చేయవలెను. అయోధ్య ప్రజలకు ఇక్ష్వాకు వంశస్థులపై అపారమైన మమకారం. ఆ దుఃఖంతోనే మనతో ఎంతవారించినా వస్తున్నారు. ఏదో విధంగా వారిని వెనక్కి మళ్ళించవలెను.

"లక్ష్మణా! ఇది మన వనవాస ఆరంభం. కాన ఈ రోజు నేను ఉపవాసం. ఉదకమును మాత్రమే స్వీకరిస్తాను. ఈ తమసానదీ తీరంలో మధురఫలాలు లభిస్తాయి" అని చెబుతూ సాయంకాలాహ్నికాలను నిర్వర్తించాడు.

సాయంకాలం దాటి చీకటి పడింది. సుమంత్రుడు గుర్రాలకు కావలసినంత మేతవేశాడు. అవి ప్రశాంతంగా విశ్రమిస్తూ ఆహారాన్ని

తీసుకుంటున్నాయి. లక్ష్మణుడు సీతారాములకు పండిన ఆకులతో పాన్పు సిద్ధంచేశాడు.

చల్లని తమసానదీ తీరాన సీతారాములు హాయిగా నిద్రించారు. లక్ష్మణుడూ సుమంత్రుడూ మాటల్లో పడ్డారు. ఆ మాటల్లోనే తెల్లవారింది.

తమసానదీ తీరాన ఉన్న ఆవుల మందలు నీళ్ళు త్రాగడం కోసం వస్తున్న గిట్టల చప్పుళ్ళు వినిపించాయి. మహాతేజశ్శాలి శ్రీరాముడు మేల్కొన్నాడు.

శ్రీరాముడి కోసం రథాన్ని వెంబడించిన పౌర ప్రజలు ఆదమరచి నిద్రిస్తున్నారు.

"లక్ష్మణా! చూడు ఎలా నిద్రిస్తున్నారో..... ఎంతో దూరం పరిగెత్తి అలసిసొలసి నిద్రిస్తున్నారు. ఇంత కమ్మటి నిద్రను ఎప్పుడూ పోయి ఉండరు. వీరు మనల్ని వీడిపోయేటట్టులేరు. మనమే వారు నిద్రలేచేలోపు వెళ్ళవలెను. అంతకు మించి దారి లేదు" చెప్పాడు శ్రీరాముడు.

సుమంత్రుడు రథాన్ని సిద్ధం చేశాడు. సీతారామలక్ష్మణులు రథాన్ని అధిరోహించారు. మహావేగంతో సుడులు తిరుగుతున్న తమసానదిని దాటింది రథం. సుమంత్రుడు శుభసూచకంగా ఉత్తరాభిముఖముగా తోలి ఆపై తపోవనాల వైపు మళ్ళించాడు రథాన్ని.

తూర్పు నుంచి బాలభానుడు ఉదయించాడు. తమసానది ఒడ్డున హాయిగా నిద్రించిన ప్రజలు మేల్కొన్నారు. సీతారామలక్ష్మణులు రథం అగుపించలేదు.

దూడలు పోయిన ఆవుల్లా రోదించారు. కొంతమంది తమసా నదంతా వెతికారు. ఏ వైపు వెళ్ళిందో కూడా జాడలులేవు. ఎన్నో విధాలుగా శోధించారు. కన్నీళ్ళతో దుఃఖితులైయ్యారు. ఎంత వెదికినా శ్రీరాముని జాడకానరాలేదు.

అయ్యో అయోధ్యలో వారికేం చెప్పం. శ్రీరాముడిని అడవుల్లో వదిలేసి ఎందుకొచ్చారంటే ఏం సమాధానం చెప్పగలం. ఇంతకంటే తమసానదీ తీరంలో ఎండు కట్టెలు పేర్చుకొని బ్రతికుండగానే కోరి మరణించటం ఉత్తమం అనుకున్నారు.

వారిలో వారే మళ్ళీ శ్రీరాముడు హర్షిస్తాడా! లేదు. ఆత్మహత్యలాంటి మహాపాపం చేసిన తమని శ్రీరాముడు ఆ లోకాల్లోనూ కన్నెత్తైనా చూడడు అనుకొని అయోధ్యకి మరలారు.





అయోధ్య చంద్రుడు లేని ఆకాశంలా ఉంది. ఎవరింటి ముందు వారు కూలబడిపోయారు. వచ్చి పలకరిస్తున్న వారిని గుర్తుపట్టలేనంతగా శ్రీరాముడి గూర్చే ఆలోచిస్తున్నారు.

వర్తకులు అంగళ్ళు తీయలేదు. బ్రాహ్మణులు అగ్ని హోత్రాలు ఆపివేశారు. కొడుకుల్ని చూసి తల్లులు మరింత తల్లడిల్లిపోయారు. అంకుశంతో ఏనుగుని పొడిచినట్టు సూటిపోటి మాటలతో భర్తలని సాధించారు స్త్రీలు.

ఏ ఇంటిలోనూ పొయ్యి వెలగలేదు.

శ్రీరాముడుని వెనక్కి తీసుకురాకుండా, మరలి ఎలా వచ్చారు. అంత చేత కాని వారు ఎందుకు వెళ్ళారు. మమ్మల్ని పంపినా వెనక్కి తెచ్చేవాళ్ళం. అయోధ్యకి మగవాడు లక్ష్మణుడొక్కడే. అందుకనే శ్రీరామునితో తరలి వెళ్ళాడు. మీరు మగవాండ్లు కారు. ఆడంగులు.

"ఆహా శ్రీరాముడు అరణ్యావాసం చేస్తుంటే అనేక నదుల్లో స్నానం ఆడుతుంటే ఆ ప్రదేశాలన్నీ పుణ్యావంతమైపోతాయి కదా! ఆ మహనీయుడని ప్రతి నిత్యం దర్శించవచ్చు కదా!

"మహావృక్షాలే శ్రీరామునకు గొడుగులవుతాయి. శ్రీరాముడొచ్చాడని చూసిన వెంటనే అకాలమైనా పూల చెట్లు పూలు పూస్తాయి. కాయల చెట్లు కాయలను కాస్తాయి. మధుర ఫలాల చెట్లు, గుత్తులు గుత్తులుగా ఫలాలను అందిస్తాయి.

శ్రీరాముడులేని అయోధ్య నివాసయోగ్యం కాదు" అంటూ ఆడంగులంతా మాట్లాడుకున్నారు.

నీలమేఘశ్యాముడు, సౌమ్యస్వభావుడు, పద్మపత్రాయతాక్షుడు, ఆజానుబాహుడు, మహావీర బలవంతుడు, మోకాళ్ళకి అందే చేతులుకలవాడు, అందగాడు అయిన శ్రీరాముడు దండకారణ్యామున సంచరిస్తుంటే ఇంద్రుడి నగరం అమరావతి కూడా శోభించనంత శోభతో వెలిగిపోతుంది కదా!

అయోధ్య స్త్రీలు మదగజం లాంటి విక్రమశాలి, మహారథుడైన శ్రీరాముడి గూర్చి వ్యథచెందుతూ చెప్పుకుంటున్నారు. సత్కాలక్షేపాలులేవు. వేదాధ్యయనము లేదు. అగ్నిహోత్రాల వైపు వెళ్ళటం లేదు బ్రాహ్మణులు. అయోధ్య నగరము నక్షత్రాలు లేని గగనంలా ఉంది. నీళ్ళంతా ఇంకిపోయిన సముద్రంలా ఉంది నగరం.

# కోసల దేశము

ఉత్తమాశ్వాలు సీతారామలక్ష్మణ సహితంగా ప్రయాణిస్తున్నాయి. సుమంత్రుడు రథాన్ని తోలుతున్నాడు. పొద్దుపోయేసరికి ఎంతో దూరం సాగిపోయాడు. పెద్ద పెద్ద గ్రామాలూ, పల్లెలూ దాటిపోయారు.

ఆ యా గ్రామల్లో ప్రజలు శ్రీరాముని చూసి దుఃఖించారు. ప్రజలంతా బారులు తీరి నుల్చుండిపోయారు. సీతను చూసి వ్యథ చెందారు. జనకరాజ తనయ, భాగ్యశాలి సీతకా ఈ కష్టాలు... ప్రజారంజకుడు శ్రీరామునికా వనవాసం. ముక్కున వేలేసుకున్నారు కైక ఆకృత్యానికి.

విశాలమైనది కోసలదేశం. కోసల దేశ పొలిమేరలోని వేదశ్రుతి నది వరకు వచ్చేశారు. రథము అగస్త్యుడు ఉండే దక్షిణ దిక్కుగా ప్రయాణించింది. మందలు మందలుగా గోవులు కానవచ్చాయి. గోమతీ నది వద్దకు చేరారు. పుణ్యోదకాలతో సముద్రానికి పోతున్న గోమతీని దాటారు. మరికొంత ప్రయాణించగానే హంసలు విహరించే స్యందిని నది వచ్చింది.

స్యందిని నదిని చూసి సీత సంతోషపడింది. ఆ నది ఒడ్డున అందమైన నెమళ్ళు మధురంగా కూస్తున్నాయి. సీతారాముల రథాన్ని చూడగానే పురివిప్పి ఆడాయి. స్వాగతం చెప్పాయి. సీత శ్రీరాముడి వంక చూసి "చూడండి ఆ నెమళ్ళు... ఎంతో బాగున్నాయో" సంబరపడింది. సీత ఆనందాన్ని చూసి శ్రీరాముడు సంతోషించాడు.

ఇక్ష్వాకువుకు వైవస్వత మనువుకి ఇచ్చిన కోసల దేశం పూర్తికావొచ్చింది. సీతకు ఆ విశేషాలను చెప్పాడు శ్రీరాముడు.

★★★ ★★★ ★★★

విశాల కోసల దేశం కడు రమ్యమైనది. నగరాన్నీ, దేశాన్నీ వదిలి పెట్టేటప్పుడు కార్య సిద్ధి కోసం నగరాధి దేవతలకి నమస్కరించటము విధి. శ్రీరాముడు వెనక్కి తిరిగి నిండు మనస్సుతో చేతులు జోడించాడు.

"మహామహులైన పుణ్య పురుషులు పాలించిన నగర రాజమా! నీకు శ్రీరాముడు భార్యా సమేతుడై, సోదర సమేతుడై నమస్కరిస్తున్నాడు. తండ్రి ఆజ్ఞతో పధ్నాలుగేళ్ళు వనవాసం చేయుటకు కృతనిశ్చయుడనై ఉన్నాను. మళ్ళీ నీ దర్శనం చేసుకుంటాను" శ్రీరాముడి కనులే కాదు సీతా, లక్ష్మణుల కనులూ చెమ్మగిల్లాయి.





మహామహా రాజులు మాత్రమే అనుభవించ తగ్గది విశాల కోసల రాజ్యం. భూలోక వైకుంఠము. అట్టి కోసల దక్షిణం వైపు గంగ ప్రవహిస్తోంది. ఋషులు సేవించే దివ్యనది. గంగానది దేవతల కోసం స్వర్గంలో పారుతుంది.

స్వర్గ, మర్త్య పాతాళంలోనూ ప్రవహించే గంగానదిని చూసినంతనే శుభాలు చేకూరుతాయి. ఆ గంగాతీరానంతా ముని ఆశ్రమాలు వెలిశాయి. నదిమడుసల్లో అప్సరసలు జలక్రీడలాడుతుంటారు.

నదీ తీరాన గంధర్వులూ, కిన్నెరలూ విహరిస్తుంటారు. గంగానది అక్కడక్కడ ఎగిరెగిరి పడుతుంది. ఒక్కచోట పెళ్ళికూతురిలా నడుస్తుంది. మరోచోట ఆదిశక్తి విశ్వరూపంతో పారుతూ కనిపిస్తుంది.

నదిలో హంసలూ, సారసపక్షులూ, చక్రవాకాలూ, ఎన్నో రకాల పక్షులూ మధురంగా కూస్తూ గంగా ప్రవాహ పరిప్రాంతమంతా ఇష్టారాజ్యంగా తిరుగుతుంటాయి.

తీర ప్రాంత ఒడ్డంతా ఆకాశానికంటేలా చెట్లు బారులు తీరి ఉంటాయి. చెట్లన్నీ పూత పట్టి ఉంటాయి. అభిషేకం చేస్తున్నట్టు పూలు చెట్ల కొమ్మల నుంచి ఒక్కొక్కటీ రాలుతుంటే దూరం నుంచి మహాఋషి ఎవరో మంత్రోచ్చాటన చేస్తూ పూలతో గంగను పూజిస్తున్నాడనిపిస్తుంది.

అడవుల్లోని దిగ్గజాలు ఏనుగులు, ఆడ ఏనుగులతో కలసి అత్తింటికి వచ్చిన అల్లుడిలా ఒక్కొక్కటీ రెచ్చిపోతుంటాయి.

మంచి నగలతో ముస్తాబైన ముత్తైదువులా ఉన్న గంగ అందాలను చూసుకుంటూ రథం పరుగులు తీస్తోంది.

పాపం అంటని నది. భగీరథుని తపస్సుతో భువిని తాకిన గంగ, మహారుద్రుడు, కైలాస వాసుడు శివుని జటాజూటాల నుంచి అవతరించిన గంగ, నేలని తాకి సముద్రుడి గుండా పాతాళంలోకి వెళ్ళిన గంగ, సుళ్ళు తిరుగుతూ, పరుగులు తీస్తూ ప్రవహిస్తోంది. శ్రీరాముడు శృంగిబేర పురము పోతూ ఆగాడు.

"సుమంత్రా! ఈ గంగా తీరప్రాంతన కొద్దిసేపు విశ్రమిద్దాం. అదిగో పెద్దగార చెట్టు చూడు. దాని నిండా మంచి పువ్వులున్నాయి. పైగా విరగ పూసి ఉంది. ఆ చెట్టు క్రింద ఆగుదాం.

"దేవతలూ, దానవులూ, గంధర్వులూ, మనుషులూ, మృగాలూ, పక్షులూ, సమస్త ప్రాణులూ పూజించే గంగానదిని మనమూ సేవిద్దాం. నదులన్నింటిలోనూ

తలమానికం అయిన ఈ నదీ జలాలలో స్నానమాచరిద్దాం" చెప్పాడు శ్రీరాముడు.

సుమంత్రుడు రథాన్ని గార చెట్టు వద్దకు తోలుకుపోయాడు. సీతారామ లక్ష్మణులు దిగారు. గుర్రాలను విప్పేశాడు సుమంత్రుడు. వాటికి మేత చూపించాడు.

ఇంగుదీ వృక్షము క్రింద కూర్చుని పరవళ్ళు తొక్కుతున్న గంగానదినీ, వృక్షముపై ఎగురుతూ కూస్తున్న పక్షులనూ, దూరంగా కనిపించే మహా వృక్ష వరుసల అందాలనూ తిలకిస్తూ మైమరుస్తున్నాడు శ్రీరాముడు.

## గుహుడు

సీతారామలక్ష్మణులు వచ్చిన ఆ ప్రాంతం గుహుడి రాజ్యపరిధి లోనిది. గుహుడు మహాబలవంతుడు. స్థపతి బిరుదుతో రాజ్యాన్నేలుతున్న వీరుడు. బోయల జాతివాడు. శ్రీరాముడు గంగాతీరానికి వచ్చినట్టు తెలిసింది.

తన మంత్రులనూ, మిత్రులనూ వెంటబెట్టుకొని వచ్చేశాడు. కనుచూపు దూరంలోనే నిషాదరాజు గుహుడ్ని చూశాడు శ్రీరాముడు.

ముని బట్టలు ధరించి, ధనుస్సు చేతబూనిన శ్రీరాముడికి చేతులు జోడించి నమస్కరించాడు.

"శ్రీరామా! మీరంతా నా అతిథులు" అని ఆనందంగా పలకరించి పాద్యమూ, అర్ఘ్యమూ ఇచ్చాడు. మా పూర్వ జన్మఫలం వల్లే మా దేశం వచ్చావని చెప్పాడు.

భక్ష్య, భోజ్య, పేయాలన్నీ సమకుర్చాడు. "రామయ్యా... నీ రాకతో బోయరాజ్యము పవిత్రం అయినది. మేం అంతా మీ సేవకులం. మా ప్రభువు నీవే" చెప్పాడు భక్తిగా గుహుడు.

"శృంగిబేరపుర రాజా! గుహుడా! నీ ఆతిథ్యమే చాలును. నాకు సంతోషంతో, స్నేహంతో చేయి అందించావు. అంతే చాలును."

"శ్రీరామా! అయోధ్య కుశలమే కదా! మీ తండ్రి దశరథమహారాజు క్షేమమే కదా!" అని కుశల ప్రశ్నలడిగాడు. గుహుడు ప్రియాతిశయంతో గుర్రాలకు పచ్చిమేత సిద్ధం చేశాడు.

శ్రీరాముడు వల్కలాలతో పశ్చిమ సంధ్య ఉపాసించి లక్ష్మణుడు తెచ్చిన గంగాజలాన్ని ఆహారంగా స్వీకరించాడు.





చీకట్లు ముసురుకున్నాయి. కాళ్ళు కడుక్కుని నిద్రకు ఉపక్రమించాడు. వనవాస దీక్ష ప్రకారం నేల మీద పడుకున్నాడు.

లక్ష్మణుడూ, సుమంత్రుడూ ఏమరుపాటుగా రాత్రంతా కావలి కాశారు. ఆ ప్రయత్నంగా గుహుడూ వారితో ఉన్నాడు. సుఖమేగాని కష్టం తెలియని సీతాదేవీ, యశస్వి, దశరథమహారాజు పుత్రుడు అయిన శ్రీరాముడు నేల మీద పడుకున్నారు. ఆ రాత్రి భారంగా గడిచింది. మధ్యరాత్రి కావొస్తుంది. గుహుడు లక్ష్మణుడితో చెప్పాడు.

"లక్ష్మణా! బాగా కాలాతీతమౌతోంది. నీ కోసం చక్కటి ఆకులతో శయ్యని ఏర్పాటు చేశాను. అలసి సొలసిన నీవు విశ్రాంతి తీసుకో. సీతా రాముల కావలి నేను చేస్తాను.

"శ్రీరామ సోదరా! నాకు శ్రీరాముడంటే ప్రాణం. శ్రీరాముడు లాంటి మిత్రుడు నాకు ఎవరూలేరు. శ్రీరాముడి వల్లే ధనాన్నీ, ధర్మజ్ఞానాన్ని సంపాదించాను.

"ఈ అడవంతా నాకు ఆటపట్టు. ఎక్కడ ఏమున్నదో అంతా క్షుణంగా తెలుసు. చతురంగ బలాలతో ఎవరొచ్చినా ఎదురు చెప్పగలను."

"గుహుడా! నీ అభిమానానికి ధన్యవాదములు. శ్రీరాముడు దశరథ మహారాజు జ్యేష్ఠ పుత్రుడు. లక్ష్మీ వల్లభుడు. అట్టి శ్రీరాముడు కానల్లో చెట్టు క్రింద నిద్రిస్తుంటే, నాకు నిద్రెలా పడుతుంది. యుద్ధంలో దేవతలూ, రాక్షసులూ కలిసి వచ్చినా శ్రీరాముడి పరాక్రమం ముందు నిలవలేరు. అట్టి శ్రీరాముడు కటికనేల మీద నిదురిస్తున్నాడు.

"స్థపతీ... మమ్మ్మ వీడి మా తండ్రి దశరథుడు ఎట్లున్నాడో... కౌసల్యమ్మ ఏకధాటిగా విలపిస్తుంటుంది. నా తల్లి సుమిత్ర కౌసల్యనూ, నా తండ్రినీ ఓదారుస్తూ ఉంటుంది. అది చూసి అంతఃపుర స్త్రీలంతా రోదిస్తుంటారు. ఆ రోదనలు అంతా ప్రాకి అయోధ్య ప్రజలు కూడా రోదిస్తుంటారు.

"అంతటి శోకంతో వారు ఎక్కువ కాలం బ్రతకగలరా? జరగరానిది జరిగితే తట్టుకునే శక్తి ఈ వనదేవతలే ప్రసాదించవలెను. మేం ముగ్గురమూ ఉత్తమమైన మా తండ్రిగారినీ, ఉత్తమమైన వ్రతాలను పాటించు మా తల్లులనూ మరల చూడగలమా" లక్ష్మణుడు చెబుతున్నాడు. సుమంత్రుడు కన్నీరు కార్చాడు.

గుహుడు జ్వరం వస్తే బాధపడే గున్న ఏనుగులా శోకించాడు. లక్ష్మణుడి దీనా తాపములతో రాత్రి గడిచింది.

ఉదయభానుడు తనలేత కిరణాలతో భూమండలాన్ని తాకాడు. శ్రీరాముడు లేచి లక్ష్మణుడితో చెప్పాడు.

"లక్ష్మణా! గంగానది సముద్రుడి వైపు పరుగులు తీస్తోంది. అడవిలో నెమళ్ళు బాగా తెల్లవారిందని కేకలు పెడుతున్నాయి. నల్లటి కోకిలలు అప్పుడే మధురంగా కూయుట ప్రారంభించినవి. మనం సుడులు తిరుగుతూ ప్రవహించే ఈ గంగను దాటవలెను."

లక్ష్మణుడు గుహునికి విషయం చెప్పాడు.

గుహుడు చక్కటి నావను సిద్ధం చేశాడు. చక్కటి ఆకులతోనూ, పూలతోనూ నావను అలంకరించాడు. చుక్కాని అమర్చాడు.

"శ్రీరామా! నావ సిద్ధంగా ఉంది. సాక్షాత్తు దైవ సమానుడివి. పురుషుల్లో పెద్ద పులివి. ఈ గుహుడు మరేం చెయ్యవలెనో శెలవివ్వు."

శ్రీ సీతారామలక్ష్మణులు విల్లంబులు ధరించి నడిచారు. సుమంత్రుడు చేతులు జోడించి నమస్కరించాడు. ఇంత వరకే నా భాగ్యమన్నట్టు చూశాడు.

"శ్రీరామచంద్రా! నీవు పడుతున్న కష్టం లోకంలో ఎవరూ పడలేదయ్యా. మహారాజు పుత్రుడివి. సామాన్యంగా నడిచి వెళుతున్నావు. వేదాలు చదివావు. అన్ని విద్యలూ అభ్యసించావు. ధర్మరక్షణ కోసం ఎన్నో చేశావు. దయాగుణం, క్షమాగుణంతో కోసల ప్రజల్లో దేవుడిగా ఉన్నావు. అట్టి నీకా ఈ కష్టం...

"అయిననూ పర్వాలేదు రామా! ముల్లోకాలనూ జయించిన మహావిష్ణువు వలె నీవెక్కడ ఉంటే అదే వైకుంఠము. భృత్తుల యందు ప్రేమగల రామా! నీ భక్తుడను, భృత్యుడను నేనూ నీతోనే. పాపి అమరావతిలో ఎట్లు ప్రవేశింపలేడో నేనూ అయోధ్యలోకి వెళ్ళలేను" శోకిస్తూ చెప్పాడు.

"సుమంత్రా! అయోధ్యలో చాలా కార్యాలు చేయవలసి ఉన్నది. తండ్రిగారిని దుఃఖం నుంచి మళ్ళించి రాచ వ్యవహారాల్లో నిమగ్నమయ్యేలా చేయవలెను. నీ ధర్మం నీవు చేయవలెను. నీవు అనవల్సిన మాటలు కాదు. రాజధర్మం పూర్తి చేసి తిరిగి అయోధ్య వెళ్ళుట రాజధర్మం.

"భరతునికి రాజ్యపాలనలో తగు సలహా సంప్రదింపులిస్తూ కంటికి రెప్పలా కాపాడవలెను. చిన్నవాడు. లోకం తెలియనివాడు భరతుడు. తమ్ముడినీ





శత్రుఘ్నుడనీ రాజ్యపాలనలో రాణించేలా తగు జాగ్రత్తలు ఎప్పటికప్పుడు తీసుకోవలెను.

"సుమంత్రా! పద్నాలుగేళ్ళు పూర్తి అవ్వగానే ఆగమేఘాల మీద వచ్చి తండ్రి, తల్లుల సేవ చేసుకుంటామని సీతారామలక్ష్మణుల మాటగా చెప్పవలెను. మేం పాదాభివందనము చేసినట్టు చెప్పు.

"మా అమ్మ కైకేయిని ఎవరూ నిందించరాదు. అట్లా నిందించినచో నేను బాధపడతాను" చెప్పి సుమంత్రుడిని అయోధ్యకు వెళ్ళేలా ఒప్పించాడు.

"మిత్రమా గుహుడా! అరణ్యంలో వనవాసం చెయ్యవలెనని తండ్రి ఆజ్ఞ. జనసంచార ప్రాంతమున ఉండరాదు. కందమూల ఫలాలు తీసుకుంటూ తాపసుల బట్టలు ధరించి, నేల మీద శయనించవలెను... కాన గుహుడా! మర్రిపాలు తెప్పించవలెను."

పురుష శ్రేష్ఠుడు శ్రీరాముని కోర్కెపై గుహుడు మర్రిపాలు తెప్పించాడు. ఆ క్షీరమును రామలక్ష్మణులు తలకు పట్టించారు. జుట్టు జడలు కట్టింది. ముని బట్టలతో, ధనుస్సులతో రామలక్ష్మణులు మహామునులవలె శోభించారు.

విఖనస్సు మునీశ్వరుడు చెప్పినట్టు శ్రీరాముడు లక్ష్మణుడితో వానప్రస్థవ్రతం పూనాడు.

"మిత్రుడా! గుహుడా! రాజ్యాన్ని భద్రంగా చూసుకో. ధనాన్నీ, చతురంగ బలాలనీ ఎప్పటికప్పుడు బేరీజు వేసుకో. ధర్మబద్ధంగా రాజ్యాన్ని ఏలు. పుణ్యలోకాల్లోనూ నీ స్థానం పదిలంగా ఉంటుంది" చెప్పి లక్ష్మణుడని నావ ఎక్కించాడు.

ఉత్తమమైన మనస్సు గల సీత నావ ఎక్కగానే శ్రీరాముడు నావలోకి వచ్చాడు. గుహుడు తెడ్డు వేయమని నావికులకి ఆజ్ఞాపించాడు. నావ ఎక్కగానే శ్రీరాముడు సర్వంశుభం కోసం మంత్రం చదివాడు.

సుమంత్రుడికీ, గుహుడికీ వీడ్కోలు చెప్పాడు. భార్యా, లక్ష్మణ సమేతుడై నావను పోనిమ్మని చెప్పాడు.

***తతస్తం సమనుజ్ఞాయ గుహమిక్ష్వాకునన్దనః,***
***జగామ తూర్ణమవ్యగ్రః సభార్యః సహ లక్ష్మణః.***

చుక్కాని పట్టువాడు చుక్కాని పట్టగా, నావ నడిపేవారు తెడ్లు వేశారు. నావ గంగ మధ్యలోకి వచ్చింది. గంగాదేవికి వైదేహి నమస్కరించింది.

"ఓ గంగాదేవీ! దశరథమహారాజు పుత్రుడు శ్రీరాముడు నాతోనూ, తమ్ముడితోనూ వనవాసం చేస్తున్నాడు. ఆపై మరల తిరిగి వచ్చి నిన్ను పూజించెదము. ఓ గంగా! వనవాసకాలం ఇట్టే అయ్యేలా దీవించు. బ్రహ్మలోకం నుంచి భూమి మీదకూ, పాతాళమునకూ వచ్చిన దానవు. మూడు లోకాల్లోనూ ప్రవహించే నీకు అంజలి ఘటిస్తున్నాను.

"అయోధ్యా నగరం చేరాక వెయ్యి పెద్ద బానల మద్యముతోనూ అనేక రుచికర మాంసాన్నములతోనూ నియమవంతురాలినైయి అఖండ పూజ చేస్తాను. నీ తీర్థములలోని సమస్త దేవతలనీ, దేవాలయాల్నీ పూజిస్తాను.

"ఓ గంగా! శ్రీరాముడు కళంకం లేనివాడు. అట్టి రాముడు నాతోనూ తమ్ముడితోనూ వనవాసానికి వచ్చాడు. మేము సుఖంగా ఉండేలా అనుగ్రహించవలెను" సీత గంగను ధ్యానించింది.

***సురాఘటసహస్రేణ మాంసభూతోదనేన చ,***
***యక్ష్యే త్వాం ప్రయతా దేవి పురీం పునరుపాగతా.***

నావ దక్షిణ ఒడ్డుకు చేరింది. నరశ్రేష్ఠుడు శ్రీరాముడూ, సీతా, లక్ష్మణుడూ నావని విడిచారు. నడిచి ముందుకు సాగారు.

"లక్ష్మణా! దట్టమైన అడవిలోకి పోతున్నాము. ముందు నీవు నడవవలెను. నీ వెనుక సీత, ఆ వెనుక నేను నడుస్తూ ఇద్దరినీ గమనిస్తుంటాను" చెప్పాడు శ్రీరాముడు.

"సీతా! ఈ మహారణ్యమున జన సంచారం ఉండదు. చక్కటి ఉద్యానవనాలూ, పంట పొలాలూ కానరావు. ఎగుడు, దిగుడు నేల, రాయీరప్పా చెట్టూ చేమా. ఇది అడవి ప్రారంభం మాత్రమే" చెప్పాడు.

అవతల ఒడ్డున సుమంత్రుడూ, గుహుడూ శ్రీసీతారామలక్ష్మణులు కానవచ్చేంత వరకూ చూస్తునే ఉన్నారు. చూపు నుంచి దూరమయ్యాక దుఃఖించారు. సీతారామలక్ష్మణులు సస్యసముదాయములతోనూ, ఐశ్వర్యము తోనూ నిండిన వత్సదేశంలోకి ప్రవేశించారు.

ప్రయాణ బడలికతో బాగా ఆకలి వేసింది. లక్ష్మణుడు వేటాడి అడవి పందినీ, పోతునూ, దుప్పినీ తెచ్చాడు. వాటి శుద్ధ మాంసాన్ని స్వీకరించి ఆకలి తీర్చుకొని విశ్రమించటానికి ఓ చెట్టు మొదలు చూసుకున్నారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆





ఆ రాత్రి విశ్రమించటానికి పెద్ద మర్రిచెట్టును ఆశ్రయించారు.

"లక్ష్మణా! కోసలదేశం దాటి వచ్చేశాం. సుమంత్రుడను వెనక్కి పంపివేశాం. రాక్షసులకూ, క్రూర మృగాలకూ నిలయమైన అరణ్యానికి దగ్గరగా వచ్చేశాం. ఏమరుపాటుతో ఉండరాదు.

"సౌమిత్రీ! ఇచ్చట మెత్తటి ఆకుల శయ్యలు ఏర్పాటుచేయు అవకాశంలేదు. పండిన ఆకులన్నీ ఏరి శయ్యగా చేసుకుందాం. మనం ఈ వనవాసమున సుఖంగానే ఉండి ఉన్నాం. అక్కడ తండ్రిగారూ, తల్లులూ ఎలా ఉన్నారో... వృద్ధాప్యముతో ఉన్న తండ్రికి రాకూడని కష్టం...

"నాయనా! నీవు అయోధ్యలో ఉన్నా నాకు వారి గూర్చి స్థిమితంగా ఉండేది. తెల్లవారుజామున లేచి అయోధ్యకి బైలుదేరి వెళ్ళగలవా... నేను ఒక్కడినే సీతతో కూడి దట్టమైన దండకారణ్యమున ప్రవేశిస్తాను. బిడ్డలు దూరమైన కౌసల్యా, సుమిత్రా దేవీలను ఓదార్చుటకు నీవు అయోధ్య వెళ్ళుటే ఉత్తమమని భావిస్తున్నాను."

"అన్నా శ్రీరామా! అంత మాట అనవద్దు. నీవు లేని నేను చంద్రుడు లేని రాత్రిలాంటి వాడిని. నీవు కాదన్ననాడు నీటి నుంచి బైట పడ్డ చేప పరిస్థితి నాది. సీతమ్మ నిన్ను విడిచి ఎలా ఉండలేదో నేనూ అంతే.

"అయోధ్యకే కాదు స్వర్గానికి పొమ్మన్నాపోను. నీవున్నదే నాకు స్వర్గం. పధ్నాలుగేళ్ళు ఇట్టే గడిచిపోతాయి. మీ ఇద్దరితోనే అయోధ్యలో కాలు పెడతాను. సోదర ప్రేమతో నన్ను ఆజ్ఞాపించవద్దు.

"నీతోనే ఉంటాను. కష్ట సుఖాలన్నీ తమతోనే... ఒకే ఒక్క బాణంతో సమస్త పృథ్విని అతలాకుతలం చెయ్యగల ఓ వీరుడా, సర్వకాలసర్వావస్థలలో ఈ లక్ష్మణుడు నీతోనే..." చెప్పాడు.

హంసతూలికా తల్పాల మీద పవళించే సీతారాములు ఆ జన శూన్య అడవిలో ఆ చెట్టు క్రింద పర్వతాల్లో తిరిగే సింహాల్లా నిశ్చింతగా నిదురించారు.

## భరద్వాజాశ్రమం

మంగళకరమైన రాత్రి మర్రిచెట్టు క్రింద గడిచింది. తెల్లవారింది. నిశ్శబ్దం చెదిరింది. అడవి మేల్కొంది. పక్షుల కిలకిలా రావాలూ... జంతువుల ఆకలి అరుపులూ... వేటాడుతున్న జంతువుకి చిక్కకుండా పొదలను దాటుతూ, గుబురు చెట్లను దాటుతూ వెళ్ళే సాధు జంతువులు.

సీతారామలక్ష్మణులు నడుస్తున్నారు. దారిలో చక్కటి పూల చెట్లనూ, తీగ చెట్లనూ, అందమైన పూలనూ చూసుకుంటూ గంగా, యమునా సంగమ స్థానం దిశగా వెళుతున్నారు. సాయం సమయానికి ప్రయాగ దివ్యక్షేత్రం సమీపంలోకి ధనుర్ధారులైన రామలక్ష్మణులు వచ్చారు.

"లక్ష్మణా! ఆ దిశగా చూడు. పొగ ఎంత ఎత్తుగా లేచిందో... వినపడుతున్నదా గంగా, యమునా సంగమస్థానం వద్ద ఏర్పడిన ధ్వనులు. ఎక్కువ ఫల వృక్షాలూ, పూల చెట్లూ కానవస్తున్నాయి.

"భరద్వాజుని ఆశ్రమ ప్రాంతంలోకి వచ్చినట్లున్నాము. అటు చూడు అడవుల్లో బ్రతికేవారు నరికి పడేసిన చెట్ల మాన్లు.

"మరి కొంతసేపటికి పొద్దు గూకింది. ఆ సమయానికి గంగా, యమున సంగమ స్థానానికి వచ్చేశారు. ఆ దగ్గరిలోనే భరద్వాజుని ఆశ్రమం కానవచ్చింది.

సీతాలక్ష్మణులు ధనుస్సులు ధరించి సమీపించారు. సీతతో కూడి పర్ణశాలలోకి వెళ్ళారు. ఆశ్రమ పదంలోని అనేక జంతువులు భయంతో భరద్వాజుని వద్దకు పరుగు తీశాయి. దృఢవ్రతుడూ, తపశ్శాలీ, ఏకాగ్రచిత్తుడూ, మహాభాగుడూ అయిన భరద్వాజుని చుట్టూ అనేక మంది శిష్యులున్నారు. అగ్నిహోత్రము పూర్తి చేసుకొని శ్రీరాముని వంక చూశాడు.

"తపోలబ్ధ దివ్యనేత్రునకూ, నిత్యాగ్నిహోత్రియైన భాగ్యవంతునకూ శ్రీరాముని అభివాదం. మేము దశరథ మహారాజు పుత్రులం. ఆమె కళ్యాణీ, జనక రాజపుత్రి సీత... నా సహధర్మచారిణి. తండ్రి మాటతో వనవాసము చేస్తూ కందమూల ఫలాలను స్వీకరిస్తూ ధర్మబద్ధంగా ఈ అరణ్యాన ఉండుటకే వచ్చినాము. ఇతను నా తమ్ముడు లక్ష్మణుడు. దృఢమైన నిశ్చయం గలవాడు. నన్ను అనుసరించి అరణ్యమునకు వచ్చినవాడు."

భరద్వాజుడు సాదరంగా ఆహ్వానించాడు. అర్ఘ్య జలాన్నిచ్చాడు. అనేక ఫలాలనూ, మధుర పువ్వులనూ, అన్నరసాలనూ ఇచ్చాడు. ఈ రాత్రి తన ఆతిథ్యాన్ని స్వీకరించమని అడిగాడు.

సీతారామలక్ష్మణులతో భరద్వాజుడు ఆశీనుడయ్యాడు. వారి చుట్టూ శిష్యులతో పాటు అనేక పక్షులూ, జంతువులూ, క్రూరమృగలూ ఉన్నాయి.

"శ్రీరామా! మనోనేత్రంతో జరిగింది తెలుసుకున్నాను. ఇది పవిత్ర ప్రదేశం. గంగా, యమున సంగమస్థానం. సుందరమైనది. సుఖమైన ప్రదేశం. ఎప్పుడో కాని కానరాని జనం. ప్రశాంతంగా నివశించవచ్చును."





"సంశ్రితవ్రతా భరద్వాజా! దగ్గరిలో అనేక గ్రామాలూ, పల్లెలూ, పట్టణాలూ ఉన్నాయి. సీతతోనూ, లక్ష్మణుడితోనూ నే ఇక్కడ ఉన్నానని తెలిస్తే ఈ ప్రాంతం జనసమూహంతో నిండిపోతుంది. తర్వాత మీ తపస్సుకూ విఘ్నం కలుగుతుంది. అన్యధా భావింపక చక్కటి నిర్జీవ సుందర ప్రదేశం సూచించమని మనవి."

"సంతోషం రామా! ఇక్కడికి పదిక్రోసుల దూరంలో చిత్రకూట పర్వతం ఉంది. పవిత్రమైనది. మహాతాపసులు వందల కొలది సంవత్సరములు తమ శిరస్సులు కపాలములుగా ఎండిపోయే వరకూ తపమాచరించి స్వర్గానికి పోయిన పుణ్య ప్రదేశము.

సుందరమైనది. మహా పురుషులు సేవించే ప్రాంతం. గంధ మాదనంతో సరితూగేలా సుందరంగా ఉంటుంది. కోతులూ, ఎలుగ్గొడ్లూ ఎక్కువగా ఉంటాయి. అల్లరి చేస్తుంటాయి. దుర్మార్గులూ, దుష్టులూ కూడా ఆ పర్వత దర్శనంతోనే పుణ్యాత్ములుగా మారిపోతారు.

"ఎంతో మంది తాపసులు ఆ పర్వత సానువుల్లో తపస్సు చేస్తూ ఉంటారు. మనుష్య సంచారమన్నదే కానరాదు"

శ్రీరాముడు భరద్వాజుని సూచిక ఆమోదించాడు. భరద్వాజుడు వారికి తగు విధంగా అతిథి సత్కారాలు చేశాడు. రాత్రి బాగా పొద్దు పొయ్యేవరకూ పుణ్య గాథలు చెప్పాడు భరద్వాజుడు.

సీతారామలక్ష్మణులు ఆ రాత్రి చక్కగా సుఖంగా నిదురించారు. తెల్లవారుజామున లేచారు. తేజంతో వెలిగిపోతున్న భరద్వాజునకు శ్రీరాముడు నమస్కరించాడు.

"ధర్మవేత్తా! భరద్వాజా! మహాత్మా! మాకు శెలవు ఇప్పించవలెను. తమరు సూచించినట్టు చిత్రకూట పర్వతానికి వెడలుతాము"

"మంచిది శ్రీరామా! చిత్రకూట పర్వతాన మంచి తేనె, మధుర ఫలాలూ, కందమూలలూ, బాగా పండిన పండ్లూ సమృద్ధిగా లభిస్తాయి.

"గంధర్వులూ, యక్షులూ ఆస్వాదించే ప్రాంతం. నెమళ్ళతోనూ, ఏనుగులతోనూ, సుందర జింకలతోనూ, పోటీపడి పరిగెత్తే జలపాతాలతోనూ, నదులతోనూ, సెలయేళ్ళతోనూ, కొండ గుహలతోనూ అద్భుతంగా ఉంటుంది.

"స్త్రీకి సౌందర్యమంటే ప్రీతి. చక్కంటి రంగురంగుల పూల చెట్లు కన్నుల పండుగగా దర్శనమిస్తాయి. ఆ ప్రాంతాన సుఖంగా జీవించవలసింది. నిర్మల

జలాలను సేవిస్తూ, మధుర ఫలాలను ఆరగిస్తూ చిలకలూ, కోమష్టిక పక్షులూ, కోకిలల గానాలనూ ఆస్వాదిస్తూ హాయిగా గడపవలెను" చెప్పాడు భరద్వాజుడు. సీతారామలక్ష్మణులకు మంగళకర ఆశీర్వాదములతో పాటు మధుర ఫలాలనూ ఇచ్చాడు.

"శ్రీరామా! తొలుత గంగా, యమున సంగమ స్థానం వస్తుంది. అక్కడ పవిత్ర స్థానం చేసి పడమర వైపుగా ప్రవహించే యమునా నదిని అనుసరించండి. అత్యంత దూకుడుగా ప్రవహించే యమునా నదీ తీరంలో అప్రమత్తులై మెలగండి.

"చక్కటి తెప్ప నిర్మించుకొని, భూదేవి సహనంలా ఉండే యమున ప్రవాహ ప్రాంతమెంచుకొని దాటండి.

"యమునా నది దాటగానే ఓ పెద్ద మహావృక్షమైన మర్రిచెట్టు కాన వస్తుంది. ఆ చెట్టు పవిత్రమైనది. అనేక తాపసులు అక్కడ తపస్సు వేల సంవత్సరాలు చేసి ఉన్నారు. దానికి శ్యామము అని పేరు.

"ఆ చెట్టుని ప్రార్థించండి. సర్వశుభాలనీ ప్రసాదిస్తుంది. కొంత సేపు విశ్రమించి బైలుదేరండి. దట్టమైన అడవి వస్తుంది. మోదుగు చెట్లూ, రేగుచెట్లూ, వెదురు పొదలూ కానవస్తాయి. ఆ మార్గమే చిత్రకూట పర్వతానికి వెళ్ళే దారి. చక్కటి దారి... ఆ దారినే చిత్రకూటానికి నేను చాలా సార్లు వెళ్ళాను" చెప్పాడు భరద్వాజుడు.

## చిత్రకూట పర్వతము

సీతారామలక్ష్మణులు శెలవు తీసుకొని మహర్షి చెప్పిన విధంగా వెళ్ళారు. దూకుడుగా లేని నదీ పరివాహక ప్రాంతాన్ని ఎంచుకొని ఎండిన కర్రలతోనూ, వెదుళ్ళతోనూ, వట్టివేళ్ళతోనూ చేసిన తెప్పతో నదిని దాటసాగారు. నది మధ్యలో సీత యమునకి నమస్కరించింది.

"యమునా నదీ దేవి! నీ నదిని దాటుతున్నాము. వనవాస కాలం అయ్యాక వెయ్యి ఆవులతోనూ, వెయ్యి కల్లు కడవలతోనూ నిన్ను సేవించుకుంటాను."

సీతారామలక్ష్మణులు ఎక్కిన తెప్ప దక్షిణం ఒడ్డుకి వచ్చింది. భరద్వాజుడు చెప్పిన 'శ్యామము' మర్రిచెట్టు వద్ద ఆగారు. పచ్చటి ఆకులతో చల్లటి నీడను ఇచ్చే ఆ మహావృక్షానికి వైదేహి నిండు మనుస్సుతో అంజలి ఘటించింది.





"ఓ మహా వృక్షమా! జనక రాజపుత్రి సీతాదేవి నమస్కారాలు. వనవాస కాలం సుఖంగా పూర్తి చేసుకొని అయోధ్య వెళ్ళి అత్తమామలనూ, మరుదులనూ చూసే భాగ్యన్ని ప్రసాదించవలెను" అని వేడుకుంది.

ఆ మర్రిచెట్టు నుంచి చిత్రకూట పర్వత దిశగా నడవసాగారు.

"లక్ష్మణా! నీవు ముందు నడువు. నీ వెనక సీతా, ఆ వెనుక నేనూ నడుస్తాము. మార్గ మధ్యన ఫలమూ కానీ, పండు కానీ, పుష్పం కానీ సీత చూసి ముచ్చట పడితే మీరిరువురూ అక్కడనే ఉండవలెను. నేనే వెళ్ళి తీసుకొచ్చి సీత ముచ్చటను తీరుస్తాను" చెప్పాడు శ్రీరాముడు.

సీత తను ఎన్నడూ చూడని, కానని వృక్షాలనూ, పూల చెట్లనూ చూపుతూ శ్రీరాముడిని అడిగి వాటి గూర్చి తెలుసుకుంది.

సీత అడుగుట ఆలస్యం శ్రీరాముడు చకచకా వెళ్ళి పండ్లనూ, పూలనూ కొమ్మలతో విరిచి తెస్తున్నాడు. సీతకి అందిస్తున్నాడు. అవి చూసి మురిసిపోయింది జనకరాజ పుత్రి సీత.

కొంతదూరం ప్రయాణించారు. రమ్యంగా పాడే హంసలూ, సారస పక్షులూ కనిపించాయి. వాటి మధుర స్వరరాగాలను వింటూ నడిచారు. మరి కొంత దూరం పోగానే గుంపులు గుంపులుగా నెమళ్ళు కానవచ్చాయి. అలికిడి అవ్వగానే సీతారామలక్ష్మణులను చూడగానే కూడబలుక్కున్నట్టు ఒకేసారి పురి విప్పి నాట్యం చేశాయి.

సీత అది చూసి ఉప్పొంగిపోయింది. సీత సంతోషం చూసి శ్రీరాముడు సంతృప్తుడయ్యాడు. ఆహారానికి యోగ్యమైన మృగాలను వేటాడారు. ఆరగించారు. కిచకిచమంటున్న కోతుల మధ్య... ఘీంకారాలు చేస్తున్న ఏనుగుల మధ్య ప్రయాణించి ఆ రాత్రికి పల్లపు ప్రదేశంలో పవళించారు సీతారాములు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

తెల్లవారిందన్నట్టు అడవి పిట్టలు రమ్యంగా కూశాయి. సీతారామలక్ష్మణులు పవిత్ర యమునా స్నానాలు చేశారు. ఇంకా ఎండరాలేదు. అలుపు రాకుండా ఉండుట కోసం నెమ్మదిగా నడుస్తున్నారు. నింగినంటిన చెట్ల మధ్యలోంచి సూర్య కిరణాలు తళుక్కున మెరుస్తున్నాయి.

తామర రేకుల వంటి కన్నుల గల సీతాదేవితో మురిపెంగా చెప్పాడు శ్రీరాముడు.

"సీతా ఇది వసంత కాలం. ఆ మోదుగలు చూడు ఎలా పూశాయో.... ధనవంతుడికి పుట్టిన గంపెడు పిల్లల్లా ఉన్నాయి. ఏ చెట్టు చూసినా, ఆ చెట్టు పూలు తనే ధరించినట్టు, శుభకార్యానికి తయారైన కన్యామణుల్లా ఉన్నాయి కదూ! ఆ జీడి చెట్లు చూడు విరగకాయటంతో కొమ్మలు వృద్ధాప్యమొచ్చినట్టు వంగి ఉన్నాయి. ఆ తేనె తుట్టెలు చూడు ఎంత పెద్దవో... ఒక్కదానిలో మధురమైన తేనె కడివెడు ఉంటుందేమో..

"లక్ష్మణా! అదిగో చిత్రకూట పర్వతం. ఎంత రమణీయంగా ఉందో, పూలపాన్పు పరిచినట్టుగా ఉంది. అదిగో ఏనుగు మందలు... రంగు రంగుల పక్షులు. ఏ రంగు పక్షి ఆ రంగు జుట్టుతోనే ఉన్నాయి. అన్ని రంగుల పక్షులూ గుంపులుగా ఎలా చెక్కర్లు కొడుతున్నాయో" చిత్రకూట పర్వత సౌందర్యాన్ని చూస్తూ పర్వతం మీదకు వెళ్ళారు.

చక్కటి ప్రదేశాన్ని ఎంచుకున్నారు. సమానమైన చదును ప్రదేశాన్ని ఎంచుకున్నారు. పూలూ, పండ్లూ, జలాలూ దగ్గరగా ఉండే ప్రదేశం. అక్కడికి దగ్గరిగా ముని ఆశ్రమాలు కనిపించాయి.

సీతారామలక్ష్మణులు ఓ ఆశ్రమంలోకి వెళ్ళారు. అది మహాత్ముడూ, సరస్వతీ మానస పుత్రుడూ అయిన వాల్మీకి మహర్షిది. వెళ్ళి ఆయన దర్శనం చేసుకున్నారు.

అతిథులకి స్వాగత సత్కారాలు చేశాడు వాల్మీకి. తమరాక కారణం చెప్పాడు శ్రీరాముడు. వాల్మీకి ముగ్గురినీ ఆశీర్వదించాడు. వాల్మీకి మహర్షి నుంచి శెలవు తీసుకొని బైటికొచ్చారు.

"లక్ష్మణా! కడురమ్యంగా ఉన్నది చిత్రకూట పర్వతం. ఇక్కడనే నివశిద్దాము" చెప్పాడు శ్రీరాముడు. లక్ష్మణుడు అడవిలోకి వెళ్ళి దూలాలూ, గుంజలూ తీసుకొచ్చాడు. రెల్లు గడ్డి మోపులనూ తీసుకొచ్చి పర్ణశాలని నిర్మించాడు. వాస్తుశాంతి కోసం నల్ల లేడి తెచ్చాడు. దాని మాంసాన్ని పక్వం చేశాడు.

ఆ రోజు చైత్రశుద్ధదశమి. శుభముహుర్తం. అగ్ని రాజేసి, నల్లలేడి మాంసము బాగా కాల్చి, లక్ష్మణుడు పక్వము చేశాడు.

శ్రీరాముడు గృహప్రవేశ మంత్రాలను జపించాడు. వాస్తు పూజతో వాస్తు దేవతలకి ఫల పుష్ప మంత్రాలతోనూ, నైవేద్యంతోనూ సంతృప్తులను చేశాడు.





ఆ పై వైశ్వదేవబలీ, రుద్రబలీ, విష్ణుబలీ చేశాడు. నదిలోకి వెళ్ళి స్నానమాచరించాడు. పువ్వులతోనూ, రుచికరమైన దుంపలతోనూ లేడి మాంసముతోనూ భూతశాంతి చేశాడు.

సుందరమైన పర్ణశాల... చుట్టూ రంగురంగుల పూల చెట్లు... ఆకాశాన సుందర రాగాలు వినిపిస్తూ తిరిగే పక్షులు. దగ్గరలోనే నిర్మలముగా ప్రవహించే మాల్యవతీ నది. హిమలయాల నుంచి వీస్తున్నట్టు చల్లటి గాలి.

మాల్యవతీ నదిలో స్నానాలు చేస్తూ... తనవి తీరా పూల చెట్లను చూస్తూ కోకిలలూ, చిలకలూ చేసే మధురమైన కూతలు వింటూ, తేనెతో సమానమైన రుచి గల ఫలాలూ, పండ్లూ సేవిస్తూ చిత్రకూట పర్వతంపై ఆనందంగా ఉన్నారు సీతారామలక్ష్మణులు.

చిత్రకూట పర్వత సౌందర్యానికి ఆ ముగ్గురూ అయోధ్యని విడిచిన దుఃఖాన్ని మరిచారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

గుహుడూ, సుమంత్రుడూ శ్రీరాముడెక్కిన నావ అవతల ఒడ్డుకు చేరటమూ, వారు కనుమరుగవ్వటమూ చూశారు. ఆ తర్వాత సుమంత్రుడు గుహుడి ఆతిథ్యంలో శృంగిబేరపురంలో నాలుగు రోజులున్నాడు.

ఐదో రోజు గుహుడి చారులు వచ్చి, సీతారామ లక్ష్మణులు ప్రయాగ చేరటమూ, భరద్వాజాశ్రమంలో ఓ రాత్రి గడుపటమూ, చిత్రకూట పర్వత దిశగా వెళ్ళటమూ చెప్పారు.

గుహుడి వద్ద శెలవు తీసుకొని సుమంత్రుడు వాయువేగ రథం మీద పట్టణాలూ, గ్రామాలూ, పల్లెలూ దాటి అయోధ్యా నగరాన్ని చేరాడు. పట్టణమంతా నిశ్శబ్దంగా ఉంది. అలికిడిలేదు. గుర్రాలూ, ఏనుగుల ఘీంకారాలు వినపడలేదు.

అంగళ్ళు ఇంకా మూసినవి మూసినట్టే ఉన్నాయి. స్త్రీలు అలంకరించుకోకుండా అటూ, ఇటూ తిరుగుతున్నారు. వృద్ధులు ఏదో దీర్ఘాలోచన చేస్తున్నారు. రాజోద్యోగులు నిరాసక్తంగా కనిపించారు.

బ్రహ్మణుల యజ్ఞా వాటికల్లో చడీ చప్పుడు లేదు. సంగీత శాలల్లో చడీ చప్పుడు లేదు. సుమంత్రుడు రాగానే గుంపులుగా కదలి వెళ్ళారు. శ్రీరాముడ్ని గూర్చి అడిగారు. తను నిర్వర్తించిన ధర్మాన్నీ, జరిగిందీ చెప్పాడు.

కులస్త్రీలు కిటికిలోంచి సుమంత్రుడి రథాన్ని చూసి శ్రీరాముడు లేకపోవటంతో దుఃఖం ముంచుకు వచ్చి భోరుమన్నారు.

సుమంత్రుడు మౌనంగా రాజభవనం వైపు నడిచాడు. పుత్రశోకంతో నిండిన దశరథుడ్ని దర్శించాడు. బంగారంతో సమంగా ప్రకాశించే దశరథుని భవనంలో అమావాస్య నాటి గాఢాంధకార చీకటి ఆవహించి ఉంది.

దగ్గరికి వెళ్ళి శ్రీరాముడు చెప్పినవన్నీ చెప్పాడు. దశరథుడు వినలేనట్టు కూలాడు. కౌసల్యాదేవీ, సుమిత్రాదేవీ వచ్చి పట్టుకున్నారు.

"సుమంత్రా... శ్రీరాముడను ఎంత వరకూ వెళ్ళి దింపినావు? దారిలో రాత్రి పూట నా రాముడు ఎట్లా నిద్రించాడు. ఏమి భుజించాడు.

"కోడలు సుకుమారి పువ్వులాంటి సీత ఎలాంటి ఇబ్బందులు పడింది. లక్ష్మణుడు అన్నా, వదినలను బాగుగానే సేవిస్తున్నాడు కదా...

"అశ్వనీ దేవతలు, మంథర పర్వతానికి పోయినట్టు రామలక్ష్మణులు అడవిలోకి పోయినారు కదా! నా రాముడేమి చెప్పాడు" అడిగాడు ఆత్రుతగా, ఆందోళనగా దశరథుడు.

సుమంత్రుడు గుహుడి నుంచి ఏకధాటిగా ప్రయాణించి అయోధ్య చేరిన వెంటనే దశరథుడ్ని కలిశాడు. అతని ఒళ్ళంతా దుమ్ము పట్టి ఉంది. ఆ దుమ్ముతోనే కన్నీళ్ళను తుడుచుకున్నాడు.

"రాజా! మీకూ, తల్లులకూ నమస్కారాలు చెప్పమన్నాడు. తన గూర్చీ, కోడలి గూర్చీ ఆలోచించకుండా, దుఃఖించకుండా నిత్య పూజలూ, హోమాలూ చేయమన్నాడు.

"పధ్నాలుగేళ్ళు పూర్తి కాగానే అయోధ్య వచ్చి సంతోషపెడతానని చెప్పాడు. భరతుడికి రాజ్యపాలనలో సాయంగా ఉండమన్నాడు నన్ను" సుమంత్రుడు కన్నీరు కారుస్తూ చెబుతున్నాడు.

"లక్ష్మణుడు కోపంతో నిట్టూరుస్తున్నాడు. బంగారు తల్లి సీతమ్మ అత్తగార్లనందరినీ కుశలంగా ఉండమంది" చెప్పాడు సుమంత్రుడు.

"కౌసల్యరాజా... నార బట్టలు ధరించారు. మర్రిపాలతో తమ శిరోజాలను జడలు జడలుగా చేసుకున్నారు రామలక్ష్మణులు. లక్ష్మణుడు ముందు నడిచాడు. వెనుక జనకరాజ పుత్రి, కళ్యాణీ, సీత... ఆ తల్లి వెనుక శ్రీరాముడు, ముగ్గురూ ప్రయాగ క్షేత్రం వైపు వెళ్ళారు.





"అయోధ్య మాత్రమే కాదు రాజా... దారిపొడవునా, కోసల దేశంలో చెట్లూ చేమా వాడిపోయాయి. రోజా పూల చెట్లు పూలను పూయటం లేదు.

"లతలు చెట్లని పెనవేసుకు ప్రాకుటలేదు. జంతువులు మేత తినటంలేదు. శ్రీరాముడు అడవుల్లోకి వెడలుతుంటే మీ ప్రియమైన రథ అశ్వాలూ కన్నీరు కార్చినవి ప్రభూ."

"అయ్యో.... పృథ్విన ఏ తండ్రి చెయ్యని పాపం చేశాను. శ్రీరాముని ఎడబాటు భరించలేను. ఈ దుఃఖ సముద్రాన్ని భరించలేకున్నాను" అంటూ శయ్య మీద వాలిపోయాడు.

కౌసల్య, సుమిత్రలు ఆందోళనగా దశరథుడ్ని పట్టుకున్నారు.

"ఓ కౌసల్యాదేవీ.... చింతించవలదు. సీతారామలక్ష్మణులు హాయిగా ప్రశాంత చిత్తముతో కానలకి వెళ్ళారు. మార్గ మధ్యమున ఎవరూ కించిత్తు బాధ పడినట్టు నేను గాంచలేదు.

"మహాసాధ్వి సీత శ్రీరాముడి మీద మనస్సు లగ్నము చేసింది. లక్ష్మణుడు అన్నగారి సేవ చేస్తూ మైమరిచిపోతున్నాడు.

"రాణీ... నాకునూ వారిని చూస్తే చెట్టూ పుట్ట క్రింద ఉన్నట్టు లేదు. అయోధ్యలోనే ఉన్నట్టుగా అనిపించింది.

"గంగానదిని దాటి వారు ముగ్గురూ వెళ్తున్నప్పుడు నేను గాంచాను. చెట్ల గూర్చీ, పువ్వుల గూర్చీ, వింత పక్షుల గూర్చీ శ్రీరాముడిని అడిగి తెలుసుకుంటూ నడిచింది సంతోషంగా సీతాదేవి.

"శ్రీరాముడితో నడుస్తున్న ఆ తల్లికి తాను అడవిలో ఉన్నానని క్రూర జంతువులుంటాయనీ, విష సర్పాలుంటాయనే ధ్యాస కూడా లేనట్టు తామర మొగ్గలవంటి కాళ్ళతో ఠీవిగా శ్రీరాముడినే చూస్తూ నడిచింది.

"శ్రీరామచంద్రుడు చెప్పినట్టు మనమెవరం దుఃఖించవలదు. అరణ్యాలలో మహాపర్వతాల మీద కందమూల ఫలాలు తింటూ, మహర్షులనూ, తాపసులనూ కలుస్తూ, ముని సేవ చేస్తూ పధ్నాలుగేళ్ళ వనవాసం పూర్తి చేసి అయోధ్య వస్తారు. అది సత్యం..." చెప్పాడు సుమంత్రుడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"కౌసల్యాదేవీ నన్ను క్షమించు. నీకు గర్భశోకం కలిగించాను. బిడ్డకు దూరమైన తల్లీ, తల్లికి దూరమైన బిడ్డ. వారి వ్యధ అలవి కానిది. పరమ

ధార్మికుడూ జ్యేష్ఠుడైన శ్రీరాముడని అడవికి వెళ్ళగొట్టాను. గండు చేప తన బిడ్డల్ని తానే తిన్నట్టు నా రాముడ్ని నేనే మింగేశాను.

"మహావీరుడు, తన బంగారు ములుకుల బాణాలతో మంథర పర్వతాన్ని తుక్కు తుక్కు చెయ్యగల వీరాధివీరుడు శ్రీరాముడు. గ్రహనక్షత్రాలనీ, దేవతలనీ, రాక్షసులనీ, స్వర్గాన్నీ శాసించగలడు. విశ్వలోకాలన్నీ ఏకమై వచ్చినా ఎదురించి పోరాడి విజయం పొందే నా రాముడు అడవికి వెళ్ళాలనగానే మారుమాట్లాడక కదలి వెళ్ళిపోయాడే.

"హా...శ్రీరామా! కనులు మూసినా, తెరిచినా, నా రాముడే గుర్తుకు వస్తున్నాడు. నా రాముడిని చూడని నా కనులు కూడా లోకాన్ని చూడుటకు ఇష్టపడుట లేదు.

"ఇంత మహా నరకాన్ని నాకెందుకు దేముడు వ్రాశాడు. నేను ఏ జన్మలో ఏ పాపం చేశాను. కాదు... కాదు... ఈ జన్మలోనే... గుర్తుకు వస్తోంది...." అంటూ పైకి చూశాడు. దశరథునకు తన యవ్వనదశ గుర్తుకు వచ్చింది. సన్నగా వణికిపోయాడు. అప్పటి శాపం. నిండు యవ్వనంలో చేసిన తప్పిదము. ఈ వృద్ధాప్యంలో నన్ను వెంటాడుతోందా!

"ప్రభూ! శోకము ధైర్యాన్ని నాశనము చేస్తుంది. జ్ఞానాన్నీ, వివేకాన్ని మరుగున పడవేస్తుంది. ఊరడిల్లండి" వేడుకుంది కౌసల్య.

## ముని కుమారుని గాథ

శ్రీరాముడు వనవాసానికి వెళ్ళిన ఆరవ రోజు. అయోధ్యలో దశరథుడు ఉలిక్కిపడి లేచాడు. దశరథుడు తాను చేసిన అజ్ఞానమైన పని గూర్చి కౌసల్యకి చెప్పవలెననుకున్నాడు.

"దేవీ... ఈ శోకము వెనుక ఓ శాపము ఉన్నది. నే చేసిన మహాపచారము ఉన్నది. పండు ముసలి దంపతుల నుంచి ముక్కు పచ్చలారని వైశ్య కుమారుడిని విడతీసిన మహాఘోర నీచమున్నది. కర్మఫలమును బట్టి ఎవ్వరైనా అనుభవించవలిసిందే. శబ్దవేధి కౌశలముతో నేను విర్రవీగే సమయమది. చాలా యేళ్ళక్రితం, నీతో వివాహం కూడా కాలేదు. ఆ రోజుల్లో చేసిన దుష్కృతము చెబుతాను విను కౌసల్యా."

కౌసల్య కళ్ళు పెద్దవి చేసి దశరథుడ్ని పట్టుకుంది. ధర్మపరుడైన దశరథుడు, నీతి కోవిదుడు అపచారం చెయ్యుటమా అని ఆశ్చర్యపోయింది.





"దేవీ పసివాడు తెలియక విష పదార్థం తిని నెత్తి మీదకు తెచ్చుకున్నట్టు పాపాన్ని కోరితెచ్చుకున్నాను. అహంకారంతో శబ్దవేధి విద్య వల్ల కొనితెచ్చుకున్నాను.

"కౌసల్యా! ఆ విద్యలో నాకు నేనే సాటి, చూడకుండా శబ్దాన్ని బట్టి ఎంత దూరంలో ఉన్న దానినైనా కొట్ట గల విల్లు కాడిని నేను. వానాకాలం.. మదమూ, కామమూ పెంచేకాలమది. పెళ్ళికాలేదు. మంచి వేడి మీద ఉన్నాను.

"దేవీ వేటకు బైలుదేరాను. చల్లని మేఘాలు ఉరిమాయి. నెమళ్ళు ఆడుతున్నాయి. పక్షులు నదీ జలాల్లో జలక్రీడలాడి తడిసిన రెక్కలని పూల చెట్ల కొమ్మల మీద కూర్చొని విదిలించుకుంటున్నాయి. ధనుస్సూ, బాణాలూ ధరించాను. సరయూనది తీరానికి వెళ్ళాను. దూరంగా ఉండి నీటి కోసం వచ్చే జంతువుని వేటాడదామని కాచుకు కూర్చున్నాను. చీకటి పడింది. రాత్రి బాగా పొద్దుపోయింది.

"అడవి దున్నలు గానీ, వన్యమృగాలు కానీ రాలేదు. చాలా సేపటికి నీటి దగ్గర శబ్దమయ్యింది. 'బుడ బుడ' మని నీళ్ళ శబ్దం స్పష్టంగా వినిపించింది.

"నా శబ్దవేధి విద్యని తలుచుకున్నాను. ధనుస్సు నుంచి బాణాన్ని శబ్దం వచ్చిన దిశగా వేశాను. అలా ఒక క్రూర మృగాన్ని, వన్య మృగాన్ని సంహరించాను.

"ఇంతలో దూరంగా మళ్ళీ శబ్దమయ్యింది. ఈ సారి కడవ నీటిలో ముంచినట్టుగా వినవచ్చింది. ఏనుగు తొండంతో నీళ్ళుత్రాగుతుందని భావించాను.

"శబ్దవేధి బాణాన్ని వింటికి సంధించి వదిలాను. భయంకరమైన ఘీంకారానికి బదులు "హా....హా!" అని అరుపు దీనంగా వినవచ్చింది. వన నివాసి గొంతు... పిల్లవాని గొంతు...

"నేను చప్పున వెళ్ళి చూశాను. ఎవరో తాపసి.... పైగా బాలుడు. నార బట్టలు కట్టుకొని ఉన్నాడు. బాణం అతని మర్మస్థానాన్ని చీల్చి వేసింది. ఆ బిడ్డ బాధతో విలవిలలాడిపోతున్నాడు.

"ఎవ్వరికీ అపకారం చెయ్యనివాడిని, అడవిలో దుంపా, కాయా తినే నా మీద ఎవరికి కోపం... ఈ దారుణం చెయ్యటానికి మనసెలా ఒప్పింది." జటా వల్కలాలతో విలవిలలాడుతున్న ఆ బాలుడి వద్దకు వెళ్ళి జరిగింది దీనంగా చెప్పాను. తప్పు చేశానని రోదించాను.

"రాజా! విచారించవలదు. నార బట్టలు కట్టుకొని, ముని సేవనం చేస్తున్న నా వంటి బాలుడ్ని చంపినందుకు లోకులు నిన్ను గురుపత్నితో పోయిన వాడివలే చూస్తారే... నా ప్రాణం గూర్చి నాకు దిగులు లేదు. ముసలి తనంతోనూ, దాహంతోనూ అల్లాడుతున్న నా తల్లీ, తండ్రీ గూర్చే నా బాధ... పైగా గ్రుడ్డివాళ్ళు"

దేవీ నా శరీరం జలదరించింది. భయంతోనూ, జలదరింపుతోనూ నా ధనుస్సూ, బాణాలూ నేలజారాయి.

"రాజా! నా తల్లి దండ్రులు అంధులు. నా కోసమూ, దాహం కోసమూ అలమటించుపోతుంటారు. అదిగో కానవస్తున్న ఆ దారి గుండా వెళ్ళు. నా తల్లీ, తండ్రికీ దాహం తీర్చు రాజా... కనీసం అదన్నా చేయి రాజా....."

నేను కదలక, మెదలక చూస్తుండిపోయాను. ఆ పిల్లవాడిని అలా వదలి వెళ్ళాలో, వెళ్ళకూడదో, అక్కడే ఉండాలో అర్థంకాలేదు.

అట్టి సమయంలోనూ ఆ బాలుడు "విచారించకు రాజా. మర్మస్థానంలో గుచ్చుకున్న బాణాన్ని లాగు. సందేహించకు. నీకు బ్రహ్మహత్యాపాతకం అంటదు. నేను బ్రాహ్మణుడని కాను. వైశ్యునికీ, శూద్ర స్త్రీకీ పుట్టిన వాడను. లాగు రాజా..." చెప్పాడు.

నేను బాణాన్ని లాగి వేశాను. తన తల్లి, తండ్రి గూర్చి చెబుతూనే ప్రాణం వదిలాడు ఆ బాలుడు. మహాపాపం చేశాను దేవీ... ఏడ్చాడు దశరథుడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"దేవీ! అంత మహాపాపం చేసిన నేను నీరు తీసుకొని ముని బాలుడు చెప్పిన దారి గుండా వెళ్ళాను.

"కొంత దూరంలో ఇద్దరు వృద్ధులు కానవచ్చారు. చూడలేరు. నడవలేరు. రెక్కలు తెగిన పక్షుల్లా ఉన్నారు. కావడిలో ఉన్నారు. మనస్సు స్థిరం చేసుకున్నాను. నాకు నేను ధైర్యం చెప్పుకొని వారిని సమీపించాను.

నా అడుగుల చప్పుడు విన్నారు.

"నీళ్ళు నాయనా! దాహం... దాహం... త్వరగా రా నాయనా..." ఆ తల్లి చెబుతోంది

"ఈ వృద్ధాప్యంలో మా కాళ్ళూ, కళ్ళూ అన్నీ నీవే నాయనా..." చెబుతున్నాడు తండ్రి.





నేను గొంతు పెగుల్చుకొని "నేనూ... నేను మీ బాలుడ్ని కాదు. అయోధ్యరాజు దశరథుడని, క్షత్రియుడను" చెప్పాను.

"మీరు నన్ను క్షమింపవలెయును. సరయూ నదిలో నీరు త్రాగుతున్న జంతువుగా భావించి నా బాణంతో మీ బిడ్డను బలి తీసుకున్నాను. స్వర్గస్తుడు అయినాడు. బాణము గుచ్చుకొన్న మీ బాలుడు విలవిలలాడుతుంటే బాణాన్ని నేను మర్మస్థానం నుంచి లాగి విముక్తుడని చేశాను. ప్రాణాలు పోతున్నా, మీ బిడ్డడు మీ గూర్చే చెప్పాడు. దాహానికి నీళ్ళు తీసుకెళ్ళమన్నాడు."

"హయ్యో" రోదించారు ఆ పండు వృద్ధులు.

"ఓయీ దశరథమహారాజా! ఎంత పని చేసితివి. చేసిన పాపం నీవే వచ్చి చెప్పుట వల్ల నీ శిరస్సు లక్ష ముక్కలు కాకుండా ఉంది. తాపసినీ, ముని కుమారుడనీ చంపిన పాతకం వల్ల దేవేంద్రుడు కూడా పదవీ భ్రష్టుడు అవ్వవలసిందే. నిన్నూ ఈ మహాఘోరం వెంటాడుతుంది. మావలే చిత్రవథ అనుభవిస్తావు.

"రాజా... మా బిడ్డ వద్దకు తీసుకుపో" అని అడిగారు.

"కౌసల్యా! నేను వారిని వారి బిడ్డ వద్దకు తీసుకు వెళ్ళాను. ఆ తల్లి పిల్లవాడి దేహమంతా నిమిరి నిమిరి ఏడ్చింది.

"ఆ తండ్రి శోకంతో గుండెలు బాదుకున్నాడు. బిడ్డని గూర్చి పదేపదే వల్లిస్తున్నాడు. తెల్లవారు ఝామున వేదాలను ఎవరితో వల్లె వేయించను. మాకు దాహాన్నీ, ఆహారమునూ ఇచ్చేదెవరు.

"నిన్ను మాకు దూరం చేసిన దశరథునకు అధోగతి తప్పదు. మహాపాతకము తప్పదు. రాజా ఎన్నో దానాలిచ్చి ఉంటావు. ఈ వయసులో మాకు పుత్రశోకమును దక్షిణగా, దానంగా ఇచ్చావు.

"ఇచ్చిన దానం, దక్షిణ వృధాపోదు. మావలే నీవు పుత్రశోకంతో కృంగి కృంగి నశించి మరణించెదవు గాక..." అంటూ ముని కుమారునికి తమ తపో శక్తితో చితిని పేర్చి అగ్నిని వెలిగించి, ఆ మంటల్లోనే వారూ పడి మరణించారు.

"కౌసల్యా... వారి శాపం ఇప్పుడు వాస్తవ రూపం దాల్చింది. బిడ్డలే లేరు నాకు. నేను పుత్రశోకంతో మరణించుటయా... అని నేను ఆనాడు అనుకున్నాను. కానీ ఇప్పుడు తెలుస్తుంది. బిడ్డను దూరం చేసుకున్న ఆ ముసలి

వాళ్ళ బాధ... కౌసల్యా.. కౌసల్యా... ఎక్కడ ఉన్నావు. నాకు కానరావటం లేదు" చెప్పాడు దశరథుడు.

కౌసల్యాదేవి అతన్ని పట్టుకుంది.

"అదిగో కౌసల్యా యమదూతలు వచ్చేస్తున్నారు. యముడి మహిశపు గంటలు వినవస్తున్నాయి. ఇక రాముడ్ని చూడలేను. వనవాసం ముగించి వచ్చిన శ్రీరాముడ్ని చూసేందుకు పుణ్యఫలం ఉండాలి. నాకు లేదు. నేను పాపిని.

"సర్వ పుణ్యాల పుణ్యఫలం అనుభవించేశాను. ఇక తెలిసీ తెలియక చేసిన పాపాల ఫలమే ఉంది. ఆ ఫలమే అనుభవిస్తున్నాను. కౌసల్యా... చక్కటి కళ్ళు రాముడివి. తీర్చిదిద్దిన కనుబొమ్మలు. ధన్యులైన వారు మాత్రమే చూడగలరు. నా రాముడి అందం ముందు శరదృతువు పూర్ణ చంద్రుడు కూడా తీసికట్టే. వనవాసం పూర్తి చేసి వస్తాడు రాముడు.

"మౌఢ్యం పోయిన తర్వాత ఉచ్ఛదశలోకి వచ్చిన శుక్రుడిలా బ్రహ్మాండంగా వెలిగిపోతాడు. మెరిసిపోతాడు.

"కౌసల్యా... నా గుండె పగిలిపోతోంది. నేను బ్రతకను. నాకు తెలుస్తోంది. ఓ రామా... శ్రీరామా... నీ తండ్రి దశరథుడని వినపడుతుందా..

"రామా అనగానే పరిగెత్తుకు వచ్చేవాడివే. ఇంకా రాలేదే రావా... రామా... శ్రీరామా... ఒక్కసారి కనిపించు నాయనా... ఈ వృద్ధుడి మీద కరుణ లేదా... కరుణాల రాముడంటారే... నీ కరుణ నా మీదెందకు కలుగుట లేదు నాయనా....

"కౌసల్యా... నూనె అయిపోయింది కౌసల్యా. దీపం ఆరటానికి సిద్ధంగా ఉంది. కొట్టుకుంటోంది కౌసల్యా. మహావరద గట్టును తెంపినట్టు పుత్రశోకం నా ప్రాణాన్ని హరించి వేస్తోంది" 'రామా... రామా... పితృప్రియా... కౌసల్యారామా... శ్రీరామచంద్రా...' మూగగా రోదిస్తూ కనులు మూసుకొని నిద్రలోకి జారిపోయాడు.

కౌసల్య భర్త స్థితి చూసి కన్నీరు కారుస్తూనే ఉంది.

## దశరథ మహారాజు మరణం

రాత్రి గడిచింది. తెల్లవారింది. ఎప్పటిలానే మేలుకొలుపుకై కీర్తనలూ, మంగళ గానము చేసేవారు దశరథమహారాజు శయ్యామందిరం వద్దకు వచ్చారు. తెల్లటి తెరల మధ్య ఐరావతములా ఉన్నాడు దశరథుడు.





ఇక్ష్వాకు వంశాన్ని కీర్తించారు. దశరథుని రాజ్య పరిధినీ, ఆయన వీరత్వాలనీ స్తుతించారు. జంత్రగాయకులు వీణాధ్వనులు చేస్తూ మొదలు పెట్టారు.

మహారాజు మందిరంలోని పెంపుడు పక్షులూ నిద్ర లేచాయి. అంతఃపుర స్త్రీలు వారి వారి పనుల్లో నిమగ్నమయ్యారు. మహారాజు పడతులు చీరలూ, నగలూ, పువ్వులూ ధరించారు.

దశరథమహారాజు లేవలేదు. మంత్రులూ, సేనా నాయకులూ వేచి ఉన్నారు. సంగీత ధ్వనులకు రాజభవనము ఆవరణలో కాపురముంటున్న పక్షులు కిలకిల మంటున్నాయి. దశరథడు పడుకున్నవాడు పడుకున్నట్టే ఉన్నాడు.

అంతఃపుర లలనామణులు వచ్చారు. తెరలు తొలగించారు.

"నాథా... వేళయ్యింది. బాలభానుడు ఉదయించి చాలా సేపయ్యింది." దశరథుడు కదలలేదు. పట్టుకొని చూశారు. కళ్ళు పెద్దవి చేసి భయంతో వెనక్కి తూలారు. అనుమానమొచ్చి చూశారు. నిజమే.

ఇక్ష్వాకు వంశాన్ని ఏకచక్రాధిపత్యంగా ఏలిన దశరథమహారాజు మరణించాడు. ఘొల్లుమన్నారు. ఒకరి మది కదిలింది. వక్కలైంది. భవంతి గోడలు పగిలేలా అరిచింది. రాణులంతా చేరారు. చేతులతో తలలు బాదుకున్నారు.

ఒకరి మీద ఒకరు పడి ఏడ్చారు. మహాసముద్రం ఉప్పెనలా మారి అయోధ్యను ముంచి వేసినట్టు సేనానాయకులూ, మంత్రులూ వణికి పోయారు.

మహా మధగజం చనిపోతే ఆడ ఏనుగులు అరిచినట్టు గగ్గోలు పెట్టారు. భయంకరంగా శోకాలు పెట్టారు. కౌసల్యా, సుమిత్రాదేవీలు వచ్చారు. బాణాలు మూకుమ్మడిగా వచ్చి తమకి తగిలినట్టు ఆర్తనాదాలు చేశారు.

నిద్రలోనే ప్రాణం పోయింది. పొగకప్పిన నక్షత్రాలవలే అయ్యారు కౌసల్యా, సుమిత్రాదేవీలు.

"నాథా..." అంటూ వెర్రికేక వేసింది కౌసల్యాదేవి.

"ప్రభూ! మమ్ము అన్యాయం చేశావు" అంటూ నెత్తి కొట్టుకుంది సుమిత్ర. దశరథుడు మరణించాడని వార్త దావానంలా వ్యాపించింది. అయోధ్య తల్లడిల్లి పోయింది.

"అయ్యో... కైకను నమ్మాడు. ప్రేమించాడు. పండు అనుకొని విషముష్టి ఫలాన్ని ఆరగించాడు. ఇక్ష్వాకు వంశాన్ని అనాథని చేసి వెళ్ళిపోయాడు."

వశిష్ఠుడూ, మంత్రులూ వచ్చారు. మహారాజుని చూసి దుఃఖితు లైయ్యారు. “శుభాలే తప్ప అశుభాలు తెలియని అయోధ్యలో ఇన్ని అమంగళాలా” వాపోయారు ప్రజలంతా...

శ్రీరాముడూ, లక్ష్మణుడూ లేరు. భరత, శత్రుఘ్నులూ లేరు. అంతా సంప్రదించారు. పుత్రులు లేకుండా ఎట్లు కార్యాన్ని నడిపించవలెను. అంతః పుర స్త్రీలు నెత్తి, నోరూ బాదుకుంటూ ఏడుస్తున్నారు.

“ఓ కైకా... ఎంత పని చేశావే... భర్త కంటే నీకు రాజ్యమే ఎక్కువై పోయింది. నిశ్చింతంగా ఏలుకోవే....” రోదిస్తూ అరిచింది సుమిత్రాదేవి.

“కైకేయీ చూడు, ఎంతటి వినాశనము తెచ్చావో... నీ వరాలు ఇవే ఇవ్వాలని నియమం లేదు. జానకీదేవి తండ్రి జనకుడు వచ్చి అడిగితే ఏం సమాధానం చెబుతావు. నీ వరాల కోసం మన పెనిమిటే లేకుండా పోయాడు.” కౌసల్యాదేవి వాపోయింది.

రాజ మిత్రులూ, బంధువులూ, దశరథుని దహన సంస్కారాదులు గూర్చి చర్చించారు. పుత్రులు లేకుండా చేస్తే దశరథునకు స్వర్గతులు లభించవు. ఏక నిర్ణయంపై నూనె కుండలో దశరథుని పార్థివ శరీరాన్ని ఉంచటానికి నిశ్చయించారు.

అయోధ్య రాజ్యాలక్ష్మి వీడిపోయింది. అయోధ్య అంతా దుఃఖం ఆవరించింది. స్త్రీలు రాత్రి నిద్దురపోయి లేచినట్టు ఉన్నారు. స్నాన పూజాదికాలు లేవు. ఇంటి ముందు కసువు కూడా ఊడ్చలేదు. కైకని ఘోరంగా శాపనార్థాలు పెడుతూ... దశరథుని గూర్చి వ్యధ చెందుతూ ఉన్నారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

దశరథుని మంత్రులైన వామదేవుడూ, కాశ్యపుడూ, కాత్యాయనుడూ, మార్కండేయుడూ, జాబాలీ వంటి అందరితో వశిష్ఠుడు సమావేశమయ్యాడు. రాజపురోహితుడైన వశిష్ఠిలవారితో అంతా వేరువేరుగా చెప్పారు.

“మహర్షీ! దశరథమహారాజు చనిపోయారు. ఇట్టి స్థితి పగ వారికి కూడా రాకూడదు. పుత్రులు దగ్గరలేరు. ముందుగా మన తక్షణ కర్తవ్యము రాజ్యానికి రాజు. ఇక్ష్వాకు వంశంలో ఒకరిని రాజుగా చెయ్యటం అత్యవసరం. రాజులేని రాజ్యం మగతోడు లేని స్త్రీ వంటిది. ప్రతి వారికీ చులకనవుతుంది. లేవలేనివాడు కూడా ఓ రాయి వేస్తాడు.





“రాజ్యము అరాచకము అవుతుంది. ధర్మం గాడి తప్పుతుంది. పెద్దల పై గౌరవము ఉండదు. శిక్షించేవాడు లేకపోవటంతో సమస్త దుర్గుణాలతో మనిషి రాక్షసుడవుతాడు. తండ్రి మాట కొడుకు... కొడుకు మాట వారి భార్య వినదు. కామాంధులు చెలరేగి కుల స్త్రీలను చాటుకు ఎత్తుకుపోతారు. చేతకాని వారికీ, ముసుగులో ఉన్న వారికీ కోరికలు పడగ విప్పి ఆడుతాయి.

“అంతటి అరాచక దేశంలో వరుణదేముడు ఉరుములూ, మెరుపులతో వర్షించడు. పంటలు పండవు. తిండిలేక మరింత అరాచకం ప్రారంభమవు తుంది. లోక కళ్యాణం కోసం సద్ బ్రాహ్మణులు యజ్ఞాలు చెయ్యరు.

“కన్నె పిల్లల పరిస్థితి వర్ణణాతీతం. వారి సొమ్ములకూ, అంతకు మించిన వారి కన్యత్వానికీ రక్షణ లేకుండా పోతుంది. దైవభక్తి పోయి పాపభీతి పోయి అసురులువలె మారుతారు.

“మంచివాడూ, పుణ్యాత్ముడూ, ధర్మపరుడూ లాంటి వాడు కూడా సర్వసద్గుణాలను వదలి అసురడవుతాడు. రాజులేని రాజ్యము వట్టి పోయిన నది. పచ్చిక లేని వనము.

“ఆవు మందకు గోరక్షకులు లేని విధంగా పౌరులు చెల్లాచెదురవుతారు. ప్రజలంతా ఒకరినొకరు చంపుకు తింటారు. మహర్షీ మీకు తెలియనిది కాదు. ప్రాణాలు తీసే యముడి కన్నా, ధన మిచ్చే కుబేరుడి కన్నా, లోకాలని పాలించే దేవేంద్రుని కన్నా, ప్రజలు రాజుకే భయపడతారు. చట్టానికి లొంగుతారు. ఆ చట్టమే లేకపోతే అయోధ్య రాక్షస రాజ్యం అవుతుంది.

“కనిపించే రాజంటే భయపడతారు. మంచి, చెడ్డ విచారించి చెప్పేవారు లేనినాడు రాజ్యము పగలే చీకట్లు కమ్ముకుంటుంది. పగలూ, రాత్రీ తేడా లేకుండా చంద్రుడి మీద పగటి పూట ఉన్న వేడి కంటే రెండురెట్లు అధికంగా ఉంటుంది రాజ్యంలో...

“క్రూరమృగ, సర్ప జంతువులుండే అరణ్యానికీ, జనసంచారమైన రాజ్యానికీ అట్టే తేడా ఉండదు. ఆటవిక న్యాయం. బలమున్న వాడిదే భోజ్యం. అంతటి ఉత్పాతాలను విద్రోహులు సృష్టించకముందే మనం నిర్ణయం తీసుకోవలెను” చెప్పారు.

వశిష్ఠి మహర్షి సాలోచనగా తలపంకించి చెప్పాడు.

“మంత్రులారా! శ్రేయోభిలాషులారా! మహారాజే కర్తవ్య బాధ్యతను చేసి వెళ్ళారు. భరతుడే రాజు. వెంటనే కబురు పెట్టవలెను” చెప్పాడు.

సిద్ధార్థుడూ, విజయుడూ, జయంతుడూ, అశోకుడూ, నందుడూ అనే దూతలను రప్పించాడు.

"దూతలారా! మనోవేగంతో పోయే గుర్రాలు అధిరోహించండి. విపత్కర పరిస్థితిలో మార్గ మధ్యాన క్షణమైనా వృధా చెయ్యరాదు. రాజ పుత్రులు భరతశత్రుఘ్నులను చేరండి. వశిష్ఠ మహర్షి వెనువెంటనే రమ్మన్నారని చెప్పండి.

"విచారమూ, దిగులూ కానరానీయవద్దు. అయోధ్య సంఘటనలు వారికి తెలియనీయవద్దు. ఎంతో ముఖ్య కార్యం.

"భరతుడూ, శత్రుఘ్నుడూ రావాలనీ వెనువెంటనే బైలుదేరాలనీ నా మాటగా చెప్పండి. కేకయ రాజు కోసం ధనమూ, బట్టలూ, కానుకలూ అపారంగా తీసుకెళ్ళండి" ఆజ్ఞాపించాడు వశిష్ఠ మహర్షి.

## అపరతాల పర్వతం

మహర్షి చెప్పినట్టే దూతలు వాయువేగ గుర్రాలు మీద వెళ్ళారు. అయోధ్య నగరం నుంచి పడమర వైపు అపరతాల పర్వత ప్రాంతానికి వెళ్ళారు. ఆ పర్వత దక్షిణ ఉత్తరంగా ప్రలంబ పర్వతాలున్నాయి.

ఆ రెండు పర్వతాల మధ్య ప్రచండ వేగంగా ప్రవహిస్తున్న మాలినీ నదిని దాటారు. ఆ నదీ తీరాన ప్రయాణించి ఉత్తర దిక్కుగా వెళ్ళి, మళ్ళీ పడమరవైపు తిరిగి హస్తినాపురం వద్ద గంగానదిని దాటారు.

నదిని దాటి కురుజాంగల దేశాల మీదుగా ప్రయాణించి పాంచాల దేశాన్ని చేరారు.

ఆ దేశం నుంచి పడమర దిక్కుగా వెళ్ళారు. శరదండా నదిని దాటి సత్యోపయాచనము అనే పుణ్య వృక్షం వద్దకు వెళ్ళారు. దానికి నమస్కరించి అక్కడ నుంచి కుళింగాపురము వెళ్ళారు.

కుళింగాపురము నుంచి అభికాలము అనే గ్రామాన్నీ, ఇక్షుమతీ నదీ తీరాన్నీ, ఆ నదిని దాటి బాహ్లీక దేశమూ, సుదామ పర్వతానికీ మధ్యనున్న విష్ణుపాదాంకితము అయిన పుణ్యభూమి మీదుగా, విపాశానదిని దాటారు.

గుర్రాలు అలసిపోయినా, ఆకలి దప్పులు విడనాడి, నది దాటేటప్పుడు జలాన్ని మాత్రము తీసుకుంటూ, ఫల, పుష్ప వృక్షలనూ, అనేక గ్రామాలనూ, పవిత్రస్నానాలు చేస్తున్న జనసందోహాలనూ చూసుకుంటూ చేరవల్సిన గిరివ్రజపురం చేరారు దూతలు.





## భరతుని కల

దశరథమహారాజు ఔర్ధ్వదైహిక క్రియల కోసం భరతుడ్ని వెనువెంటనే తీసుకురావలెనని సంకల్పముతో దూతలు గిరివ్రజపురం చేరిన రాత్రి భరతునకు అప్రియమైన కల వచ్చింది.

అది తెల్లవారుజామునే రావటంతో నిద్ర మేల్కొన్న భరతుడు దాని ఫలం గూర్చి ఆలోచించాడు. విచారంతోనే నిద్ర నుంచి లేచాడు. మిత్రులు భరతుని దరిచేరారు.

ఎప్పటిలానే కమ్మటి కబుర్లతో, వీణాగానములతో ఆహ్వానించారు. వేశ్యలతో నాట్యము చేయించారు. అయినా భరతుడిలో కల గూర్చిన దిగులు పోలేదు.

"సఖుడా! నీ మోములో ఉత్సాహంలేదు. కారణం తెలుసుకొనవచ్చునా" అడిగాడు ఓ మిత్రుడు.

"మిత్రమా! తెల్లవారు జామున నాకు ఓ కల వచ్చింది. భయంకరమైనది. అదే నన్నింత కలతకి గురిచేస్తోంది. ఆ క్షణం నుంచి నా మనసు కలవర పడుతోంది. సముద్రం ఎండిపోయి కనపడింది. చంద్రుడు నేలజారాడు. రణ చీకటి. కళ్ళు పొడుచుకున్నా కానరాని చీకటి. గాఢాంధకారం. అంతలోనే ఓ ఏనుగు అదీ పట్టపుటేనుగు. దాని దంతాలు ముక్కలై క్రింద పడ్డాయి.

"నల్లటి స్త్రీలు, మరింత నల్లటి చీరలు ధరించి మా తండ్రి దశరథ మహారాజును చూసి నవ్వుతున్నారు. మా తండ్రిగారు వికారంగా ఉన్నారు. ఎదురున్న నూనెని దోసిళ్ళతో త్రాగుతున్నారు.

"నువ్వుల అన్నం తింటూ, నూనె వంటికి రాసుకుంటూ, తలక్రిందులుగా మారుతూ వికటంగా నవ్వుతున్నారు. మా తండ్రిగారు ఎర్రటి పూల దండాలు ధరించారు. గాడిదలు కట్టిన రథం మీద దక్షిణ దిక్కుగా వెళ్ళాడు. అలా వెళ్ళినవాడు తిరిగి కనిపించలేదు.

"ఆ కల ఫలం నాకు కలవరం తెప్పిస్తోంది. కలలో గాడిదల రథం ఎక్కి వెళ్ళినవాడు త్వరలోనే మరణిస్తాడు. కలకన్నవాడు రథం ఎక్కి వెళ్ళిన వాడి చితి పొగ చూస్తాడని శాస్త్రాలు చెబుతున్నాయి. ఎందుకో నాకు భయంగా ఉంది. మా తండ్రిగారినీ, మా అమ్మలనూ, శ్రీ సీతారామ లక్ష్మణులనూ వెంటనే చూడాలని ఉంది" చెప్పాడు భరతుడు.

## అయోధ్యకి ప్రయాణం

కేకయ మహారాజునీ, యువరాజు యుధాజిత్తును దూతలు కలిశారు. వశిష్ఠ మహర్షి చెప్పిన విషయాన్ని వివరించారు. విన్నవించారు.

"ప్రభూ! ఈ ఇరవై కోట్లు విలువ చేసే వస్త్రాభరణాలు మీ తాతగారికీ, మీ మేనమామగారికి పదికోట్లు విలువచేసే ఆభరణాలూ, వస్త్రాలూ మీచే ఇప్పించమని చెప్పారు" దూతలు చెప్పిన విధంగా ఆభరణాలనూ, వస్త్రాలనూ వారికిచ్చాడు భరతుడు.

"దూతలరా! అయోధ్యా వాసులూ, తండ్రిగారూ, తల్లులూ, సీతారామలక్ష్మణులూ, మంత్రులూ, సామంతులూ, అందరూ కుశలమే కదా! కోపదారి, జ్ఞానము అంతా తనకే తెలుసునని భ్రమించి, ఆనందించే మా తల్లిగారు కైకేయీదేవీ అంతా కుశలమే కదా!"

"అంతా కుశలమే ప్రభూ" వినయంగా తలవంచి చెప్పారు.

"రాజా! నేను వెంటనే అయోధ్య బైలుదేరుతాను. నాకునూ అయోధ్య వెళ్ళవలెనని మనస్సైనది. మళ్ళీ మీరు తలుచుకున్నప్పుడు కబురు అందగానే గిరివ్రజపురం వచ్చేయగలవాడను."

కేకయ రాజు భరతుడ్ని కౌగిలించుకొన్నాడు.

"భరతా! అవశ్యంగా పోయిరా నాయనా! మీ తండ్రిగారిని కుశలం అడిగానని చెప్పు. ధర్మనిరత గల ధర్మజ్ఞ కౌసల్యాదేవిని క్షేమము అడిగానని చెప్పు. మీ అన్న శ్రీరామచంద్రుడనూ, బలవంతుడైన లక్ష్మణుడనూ అడిగినట్టు చెప్పు. లక్ష్మణ శత్రుఘ్నులను కన్న సుమిత్రాదేవిని అడిగినట్టు చెప్పు.

"రాజర్షి వశిష్ఠుల వారికి నా నమస్కారాలు తెలియచేయి" చెప్పి భరతునితో రెండువేల కంఠహారాలూ, పదహారువందల ఉత్తమజాతి గుర్రాలూ, ఏనుగులూ, కంబళ్ళు, పులి తోళ్ళతోపాటు ఎంతో ధనాన్నీ, రత్నాల్నీ ఇచ్చి సాగనంపాడు.

వీరులనూ, శూరులనూ, స్వామిభక్తి పరాయణులనూ భరతునితో పంపాడు కేకయ రాజు. యుధాజిత్తు మేనల్లుడికి ఏనుగులనూ, మహా బరువులను అవలీలగా మోసే కంచర గాడిదలనూ, అంతఃపురంలో పెంచిన పెద్ద పులులవంటి కుక్కలనూ ఇచ్చాడు. శత్రుఘ్నుడూ, భరతుడూ రథం ఎక్కారు.





భరతుడూ, శత్రుఘ్నుడూ ధనంతోనూ, గుర్రాలు కట్టిన రథాలతోనూ, ఉత్తమ అశ్వాలతోనూ, కంచర గాడిదలతోనూ, కుక్కలతోనూ, బంట్లూ, ఏనుగులతోనూ, వస్త్రాలతోనూ, ఆభరణాలతోనూ బైలుదేరారు. భరతుని మనస్సు అయోధ్యమీదే ఉంది. ఎప్పుడెప్పుడు అయోధ్య వెళ్తానా అని ఉవ్విళ్ళూరసాగాడు. దేవసేనలతో దేవలోకం వెళ్ళే దేవేంద్రుడిలా ఉన్నాడు భరతుడు.

## భరత, శత్రుఘ్నులు అయోధ్యా ప్రవేశము

శ్రీమంతుడూ, కాంతిమంతుడూ అయిన భరతుడు కేకయ రాజు రాజగృహం నుంచి తూర్పు దిక్కుగా ప్రయాణించి సుదామా నదిని దాటాడు. ఆ దిక్కునే ముందుకు సాగి హ్లాదినీ నదిని దాటాడు.

విశాలమైన హ్లాదినీ నదినీ పశ్చిమాభిముఖంగా ప్రవహిస్తున్న శతద్రూ నదిని దాటి అపరపర్వట దేశం మీదుగా శిలావహా నదినీ దాటి, ఆ నది నుంచి చైత్రరథము వనం గుండా సింధు, సరస్వతీ నదులు సంగమించే పుణ్య ప్రదేశానికి వెళ్ళి ఆ నదులను దాటి వీరమత్స్య దేశాలకు ఉత్తరం వైపున్న భారుండ వన పర్వతాల మధ్య ప్రవహించే యమునా నదిలో కలిసే కుళింగా సంగమ ప్రదేశం చేరాడు.

గుర్రాలూ, ఏనుగులూ, గాడిదలూ, కుక్కలూ అక్కడ సేద తీరాయి. సేవకులు వాటికి స్నానం చేయించి నీళ్ళు మేత పెట్టారు. ఎంతో దూరం నుంచి ఏకధాటిగా ప్రయాణించటంతో కొంత విశ్రాంతి కోరుతున్నారు అంతా....

భరతుడూ, శత్రుఘ్నుడూ ఆ పుణ్యనదిలో స్నానం చేశారు. పవిత్రమైన యమునా జలాన్ని తీసుకొని కొంతసేపు విశ్రమించి నదిని దాటారు.

భరతుడు అంత వరకూ ప్రయాణించిన రథాన్ని వదిలి భద్రజాతి ఏనుగును అధిరోహించాడు. అంశుధానము అనే గ్రామాన్ని చేరాడు.

అక్కడ గంగానది ఉరకల పరుగులతో యవ్వనంలో ఉన్న కన్నె పిల్లలా ఎగిరెగిరి పడుతోంది. అంత వేగం కల ఆ నదిని దాటుట సాధ్యం కాదని, ప్రాగ్వట్ట నగరం వద్ద గంగను దాటాడు.

గంగానదిని దాటిన తర్వాత కొంత ప్రయాణించి కుటికోష్ఠికా నదినీ కూడా దాటి ధర్మవర్ధనము గ్రామానికి దక్షిణ దిక్కుగా ప్రయాణించి, జంబూ ప్రస్థము అనే గ్రామం మీదుగా వరూథాన్ని చేరాడు.

వరూథ గ్రామం అత్యంత సుందరంగా ఉంటుంది. పూలతోనూ పండ్లతోనూ అనేక సుందర ఉద్యానవనాలతోనూ కడురమ్యంగా ఉంటుంది.

మనోహరమైన ఆ గ్రామాన్నీ, ఉద్యానవనాలనీ చూసుకుంటూ ఉజ్జిహాన గ్రామాన్ని చేరాడు. కోసలదేశ సరిహద్దు గ్రామమది.

భరతుడు మద్ది చెట్లూ, కడిమి చెట్లూ ఉన్న తోపులో విశ్రమించాడు. భరతునకు అయోధ్య గుర్తుకు వస్తోంది. కల గుర్చే ఆలోచిస్తున్నాడు. శత్రుఘ్నుడితో తాను ఒక్కడే వేగంగా అయోధ్య చేరుతానని చెప్పాడు. ఆ పై పర్వతాల్లోనూ, సన్నదారులలోనూ వాయువేగంతో ప్రయాణించే గుర్రాలు పూంచిన రథాన్ని ఎక్కి, శత్రుఘ్నుడను నెమ్మదిగా సేవకులతో, కానుకలతో రావలసింది అని చెప్పి సారథికి కదలమని ఆజ్ఞాపించాడు.

భరతుడు మహావేగంగా ఉత్తానికా నదిని దాటాడు. అనేక గ్రామాల మీదుగా కుటికా నదినీ, సికతావతీ నదినీ, స్థాణుమతీ నదినీ, గోమతీ నదినీ దాటి కళింగ నగరం చేరాడు. అక్కడ కొంతసేపు విశ్రాంతి తీసుకొని అయోధ్యా నగరానికి ఆనందంగా బైలుదేరాడు.

అయోధ్య దగ్గరిలోకి వచ్చేశానని అనుకోవటంతోనే భరతుడు పులకించి పోయాడు. మనస్సు దూది పింజలా మారింది. తాను కొద్ది సేపటిలో శ్రీరాముడిని, లక్ష్మణుడనూ, తండ్రినీ, తల్లులనీ చూడబోతున్నాడు. భరతుడు ప్రయాణ బడలిక మరచిపోయాడు.

అప్పటికే ఏడు రోజులైంది. కేకయరాజు భవనం నుంచి బైలుదేరిన ఎనిమిదవ రోజు ఉదయం కనుచూపులో అయోధ్యా నగరం అగుపించింది. సాయంకాలానికి దగ్గరికొచ్చాడు. అయోధ్యని చేరింది భరతుని రథం.

వైవస్వత మనువు నిర్మించిన మహానగరం అయోధ్య. కళాకాంతులు కానరాలేదు. పుణ్యోద్యానవనాలతోనూ, తెల్లమట్టితోనూ ఉండే అద్భుత నగరం. మహాయజ్ఞవేత్తలూ, రాజర్షులూ పాలించిన మహాపట్టణం. మహాధ్వనులతో ఉండే నగరం ఇంత మౌనంగా ఉందేమి. ఉద్యానవనాలు అంత నిశ్శబ్దంగా ఉన్నాయి. పూలూ, చెట్లూ అలా వాడిపోయి ఉన్నాయే. శృంగార జంటలు కానరావుట లేదే.

ఎవరూ ఉన్నట్టు జాడలేదు. పౌరులేమిటి అంతా ఇంట్లోనే ఉన్నారు. వీధిలో ఎవరూ కానరావటం లేదు. కాన వచ్చిన వారు ఏదో దీర్ఘాలోచనలో





ఉన్నట్టు పైకి చూస్తున్నారు. స్త్రీలు అంతా అపరిశుభ్రంగా జట్టు విరబోసుకొని ఉన్నారు.

భరతుడు గుర్రాన్ని పోనిస్తూ చూస్తున్నాడు. తన కెదురుగా రథంగానీ, గుర్రాలు గానీ రాలేదు. రాకపోకలు కూడా మాని ప్రజలంతా ఏం చేస్తున్నారు.

యజ్ఞశాలలు ఏమిటి చడీచప్పుడు లేకుండా ఉన్నాయి. వేదమంత్రాల ఘోష వినపడదే... గుండు కోకిలలు కూడ కూయుట లేదు. శృంగార సంయోగం కోరేవారికి ఎంతో రమ్యంగా ఉండే పూల ఉద్యానవనాల్లో ప్రేమికులూ, కాముకులూ కానరారే... మృగాలూ, పక్షులూ సందడి చేయుట లేదు.

చందన ధూప వాసన లేకుండా గాలి వీస్తోంది.

"సారథీ! ముఖ్య రాజోద్యోగుల వినోద భవనాల్లోంచి మృదంగనాదాలూ, వీణానాదాలూ వినపడుటలేదు. కనిపించిన వారంతా శుచిగాలేరు. కళాకాంతులు లేవు."

మంగళాకారుడు భరతునకి ఆందోళన కలిగింది. "సారథీ! ఏమిటీ అనిష్ట సూచకాలు, నా మనస్సు ఎందుకో సరిగాలేదు. ఎవరూ ఇంటి ముందు చిమ్మలేదు. ముగ్గు కూడా పెట్టలేదు. దిగులు నన్ను పూర్తిగా ఆవహిస్తోంది..." చెప్పాడు. సారథీ కూడా అన్యమనస్కంగా చూశాడు అయోధ్య వీధులను.

భరతుడు ఎక్కిన రథం వైజయంతమును ద్వారం నుంచి ముందుకు వెళ్ళింది. ద్వారపాలకులు దిగ్గున లేచారు. భరతుని చూసి వినయంగా తల వంచారు.

"ఓ సారథీ... రాజ దూతలు నాకు సరైన కారణం చెప్పకుండానే రమ్మన్నారు. ఏదో జరిగింది. దేవతార్చనలు కూడా చేయుట లేదు ఎవరూ... దారిలో ఏ పూల అంగడిలోనూ దండలూ, పూలూ కానరాలేదు.

తెల్లవారకుండానే దుకాణాలు తెరిచి, అర్థరాత్రి వరకూ విక్రయాలు సాగించే వర్తకుల దుకాణాలన్నీ మూసి ఉన్నాయి. వాటి ముందు ఆంబోతులు హాయిగా నిదురిస్తున్నాయి" అడిగాడు భరతుడు.

సారథి కూడా ఆందోళనగా రథాన్ని తోలాడు.

దశరథమహారాజు భవనం వచ్చింది. వికల మనస్సుతో భరతుడు రథం దిగాడు. తండ్రి గృహం వైపు నడిచాడు. దశరథుడులేడు. కానరాలేదు. నేరుగా తల్లి కైకేయీదేవి మందిరానికి వెళ్ళాడు.

కైకేయీదేవి బంగారు ఆసనం మీద కూర్చొని ఉంది.

"అమ్మా" పిలిచాడు భరతుడు.

కైకేయీదేవి కొడుకు పిలుపు విని దిగ్గున లేచింది. దగ్గరకొచ్చింది. ఎన్ని రోజులైంది నాయనా నిన్ను చూసి అని శిరస్సు నిమిరింది. తాతగారింటి విషయాలని అడిగింది. తల్లి అడిగిన దానికి ముక్తసరిగా సమాధానమిచ్చి అడిగాడు.

"ఏడు రాత్రుళ్ళు ప్రయాణించి వచ్చాను. తాతగారూ, మామయ్య కులసాగా వున్నారు. ధనమూ, కానుకలూ, వాహనాలూ ఇచ్చి పంపారు. అవి తెస్తున్న సేవకులూ, మోస్తున్న గుర్రాలూ అలిసిపోయాయి. శత్రుఘ్నుడు ధనాన్నీ, రత్నాల్నీ మోసుకువస్తున్న సేవకులతో వెనుక వస్తున్నాడు. నేను వాయువేగ రథం మీద వచ్చా! అమ్మా... దేవేంద్రుని అమరావతికి ధీటైన మన అయోధ్య ఇలా ఉందేమిటి.

"తల్లీ... పుర ప్రజలూ, రాజోద్యోగులూ, ఎవరూ దండిగా కానరాలేదు. తండ్రిగారెక్కడా, ఆయనకు నమస్కరిద్దామని వెళితే లేరేమి. కౌసల్యాదేవీ మందిరంలో ఉన్నారా? అమ్మా నేను వెళ్ళి ముందు తండ్రిగారి పాదాలకు నమస్కరించవలెను" అని తిరిగాడు.

"అగు నాయనా! మీ తండ్రిగారు అక్కడలేరు" చెప్పింది కైక.

"మరి శ్రీరామమందిరంలో ఉన్నారా" అడిగాడు.

"మీ తండ్రిగారు సత్పురుషులు. మహానుభావుడు. ఎన్నో యజ్ఞాలు చేసిన మహాత్ముడు, తేజోవంతుడు. రాత్రిపూట చంద్రునిలా చల్లనివాడు.

"అయిననూ... సమస్త సృష్టిలోని ప్రాణకోటివలె మానవ ధర్మం ప్రకారం స్వర్గతులు అయ్యారు. నిన్నూ, నన్నూ, అయోధ్యనీ విడిచి పుణ్యలోకాలకి వెళ్ళారు."

"అమ్మా" బావురమన్నాడు భరతుడు. నేలకొరిగాడు.

"పూర్ణచంద్రుడి వంటి తండ్రిగారు, దేవతలవంటి ధీమంతుడు మరణించినారా? ఈ శయ్య మీద తేజరిల్లే తండ్రిగారు లేరా! గొడ్డళ్ళతో నరికిన మద్దిమానువలె నేలకొరిగెనా" రోదించాడు. చిన్న పిల్లాడిలా వెక్కి వెక్కి ఏడ్చాడు.

"నాయనా! భరతా! శోకించవలదు. అన్నీ తెలిసినవాడవు. మంథర పర్వతము మీద సూర్యుడివలే వెలిగే బుద్ధి సంపన్నుడవు. యశస్వివి... రాచ బిడ్డవి. ఏడ్వకూడదు. నాయనా లే" అంటూ భరతుడ్ని లేపింది.





"ఉన్నపళంగా రమ్మంటే ఎంత పెద్ద శుభకార్యం తలపెట్టారోనని భావించాను. రామన్న పట్టాభిషేకం అనుకున్నాను. మహాయజ్ఞమేదో ఆరంభించారేమోనని తలచాను. ఇదా జరిగింది. ఇంతటి అనర్థాన్ని వినుటకా నేను ఆగమేఘాల మీద వచ్చింది.

"నా ఆశలు వమ్ము అయ్యాయి. ఎలా జరిగిందమ్మా ఈ ఘోరం. రాముడూ, లక్ష్మణుడూ ఈ శోకాన్ని ఎలా దిగమింగారు.

"చివరిసారి వారిలా తండ్రికి నమస్కరించలేకపోయిన దురదృష్ట వంతుడను. తండ్రిని కడసారి దర్శించి రామలక్ష్మణులు ధన్యులయ్యారు. నేనూ, శత్రుఘ్నుడు ఆ అదృష్టానికి నోచుకోలేక పోయాము.

"అమ్మా... సత్యసంధుడు, పూజ్యుడు, పరాక్రముడు మా తండ్రిగారు చివరదశలో ఏం చెప్పారమ్మా." అడిగాడు భరతుడు.

"నాయనా! మీ తండ్రిగారు ఉత్తములు. ఉత్తములు ఎప్పుడూ ఉత్తమ గతినే పొందుతారు. శ్రీరాముడనీ, సీతనూ, లక్ష్మణుడనూ తలుచుకుంటూ పరలోకానికి వెళ్ళారు.

"ఆయన చివరన్నది ఒక్కటే నాయనా, తిరిగొచ్చిన సీతారామ లక్ష్మణులను ఎవరు చూస్తారో వారు ధన్యులు అని చెప్పారు."

భరతుడు అవాక్కయిపోయాడు.

తండ్రి మరణవార్త ఒక్కటే కాదు.

శ్రీరాముడు అయోధ్యలో లేడు. సీత కూడా... లక్ష్మణుడు కూడా... భరతునకు మింగుడు పడలేదు. అమృతమైన వాక్కు అనుకుంది కైక... భరతునికి విషవాక్కు అయింది.

"సీతారామలక్ష్మణులు నారబట్టలు ధరించి కానలకి వెళ్ళారు. దండకారణ్యంలో పధ్నాలుగేళ్ళు వనవాసం చేసి తిరిగివస్తారు" చెప్పింది కైక.

"అన్నయ్య అపరాధం" విసురుగా అడిగాడు. తోక తొక్కిన కోడెత్రాచు అయ్యాడు.

కైక మాట్లాడలేదు. భరతుడి దగ్గరికొచ్చింది. ప్రేమగా చూసింది.

"చెప్పమ్మా... అన్నయ్య అపరాధమేమిటి? కాముకుడిలా పరస్త్రీని కోరడే... అబద్దాలు చెప్పడే... వేదపండితుడి నుంచి ఆశీర్వాదమే తప్ప మరేమి ఆశించడే... సాధుజనాలని ప్రేమిస్తాడే... అట్టి రాముడు ఏ అపరాధం చేసాడు.

శ్రీరాముడే అపరాధం చేస్తే ఈ భూమే పగలిపోతుందమ్మా. సూర్యచంద్రులు గతి తప్పుతారు" చెప్పాడు భరతుడు.

"నాయనా! నీవు చిన్నవాడివి. నీకేమి తెలియదు. శ్రీరాముడు ఎట్టి అపచారం చేయులేదు. సాధు పుంగవుల ఏ ధనాన్నీ శ్రీరాముడు అపహరించలేదు. ఇక స్త్రీ అంటవా, శ్రీరాముని గూర్చి ఆ మాట అనుటయే మహాపాపం.

"నాయనా! విను. మీ తండ్రిగారు శ్రీరామునికి పట్టాభిషేకం నిర్ణయించారు. నేను భరించలేకపోయాను. నీ తల్లిని. అన్నీ తెలిసిన దానిని. దేవాసుర యుద్ధంలో మీ తండ్రిగారిని రెండు సార్లు రక్షించాను. దానికి ప్రతిగా రెండు వరాలిచ్చారు.

"నాయనా! భరతా! ఆ రెండు వరాలు ఇప్పుడు కోరుకున్నాను. తొలి వరం భరతునకు పట్టాభిషేకం చెయ్యాలి. రెండోవరం శ్రీరాముడు వనవాసాలకి వెళ్ళాలి.

"అయోధ్య రాజా భరతా! మీ తండ్రిగారు సత్యవ్రతులు. ఆడి తప్పరు. వరాలిచ్చారు.

"శ్రీరాముడు తండ్రి మాట కోసం అడవులకి బైలుదేరాడు. భర్తను సీత అనుసరించింది. అన్నని లక్ష్మణుడు అనుసరించాడు.

"భరతా! ఈ కార్యం చెయ్యటానికి ఎంతో కష్టపడ్డాను నాయనా... విచారం మాను. రాజువై కోసల దేశాన్ని పాలించు. ఆ చంద్రార్కమూ కీర్తిని గడించు. ఇక్ష్వాకు వంశాన్ని తరింపచేయి నాయనా...

"నాయనా! ముందు వశిష్ఠ మహర్షి, బ్రాహ్మణులు చెప్పినట్టు తండ్రిగారికి దహన సంస్కారాదులు కావించు. ఆ పై సస్యశ్యామలమైన సువిశాల కోసల దేశానికి ప్రభువివి నీవే నాయనా..." చెప్పింది కైక.

★★★ ★★★ ★★★

"అమ్మా... నీవు చెబుతున్నది నిజమేనా? తండ్రిలాంటి రాముడిని అడవులకి పంపావా? పుండు మీద కారం చల్లినట్టు తండ్రిపోయిన బాధతో పాటు శ్రీరాముడని అడవులకి పంపావా?

"దుఃఖం మీద దుఃఖము మహా దుఃఖమంటే ఇదేనమ్మా. అమ్మా... ఛీ... ఆ పేరుతో నిన్ను పిలువరాదు. తల్లులందరూ సిగ్గుపడే విషయం చేశావు.





"ఈ రాజ్యం కావాలని నేను అడిగానామ్మా. ఇక్ష్వాకు వంశానికి నీవు కాళరాత్రివి. వంశనాశనానికి అయోధ్యకి కోడలిగా వచ్చితివి. హయ్యో కౌసల్యా, సుమిత్రలకి తీరని శోకాన్ని మిగిల్చావు.

"శ్రీరాముడు ధర్మాత్ముడు. శ్రీరాముడు నీ ముద్దుల కొడుకు కదామ్మా. ఎలా మనసొప్పింది నీకు. నీ వరాలు చెల్లించి, తండ్రిగారు మనోవేదనకి గురి అయి మరణించి ఉంటారు.

"కట్టుకున్న మెగుడ్ని చంపుకున్న పాతకీ... తండ్రీపోయి, తండ్రంత శ్రీరాముడు అడవికి పోయి, ఈ రాజ్యమెందుకు... ఈ ప్రాణమెందుకు...

"అగ్నిగుండమని తెలుసుకోలేక తండ్రిగారు కౌగిలించుకున్నారు. మహాబరువులని ఎద్దు మోస్తుంది. వీరుడూ, శూరుడూ, సకలగుణ సంపన్నుడూ, శత్రువుల పాలిటి పగటి పూట సూర్యుడి వేడితో సమాన మైనవాడు శ్రీరాముడు.

"ఆయన మోసే రాజ్యాభారం నేను మొయ్యగలనా? ఎలా అనుకున్నావు. నేను సేవకుడను. శ్రీరామునకు సేవకుడను. కింకరుడను. నిన్ను కన్నతల్లిలా చూసుకున్నాడే... దానికి ప్రతిఫలమా అడవులకి పంపుట. దుష్టచారిణీ నీవు మృత్యురూపంలో ఉన్న శత్రువువి.

"అన్నగారు రాజ్యము పాలించటమూ, తమ్ముళ్ళు అన్నయెడల సదాభక్తి కలిగి ఉండుట ధర్మం కదా... సంప్రదాయం కదా. ఇక్ష్వాకు వంశస్థుల సనాతన సంప్రదాయము" భరతుడు అరుస్తున్నాడు. ఏడుస్తున్నాడు. తల్లిని నిందిస్తున్నాడు. శపిస్తున్నాడు.

"భ్రుణహత్యాపాతకం చేశావు. స్వర్గానికి చేరిన తండ్రిగారిని నీవు ఎన్నటికీ చేరవు. నరకానికే పోతావు. నీవు తల్లివి కాదు. ఆ రూపంలో ఉన్న భయంకర రాక్షసివి. మహాత్ముడు, జ్యేష్ఠుడైన శ్రీరాముడు, కనిష్ఠుడైన లక్ష్మణుడు నన్ను వదలి పెట్టి వెళ్ళేలా చేశావు. తండ్రిని చంపావు. పుత్రులని అడవికి పంపావు. ఆఖరికి అన్నదమ్ములను విడదీశావు.

"లోకంలో ఇన్ని పాపాలు చేసిన స్త్రీలలో మొదటి దానివి, చివరి దానివి నీవే అవుతావు... ధీమంతుడూ, ధర్మాత్ముడూ అయిన అశ్వపతి వంశ ప్రతిష్ఠను సర్వనాశనం చేశావు.

"శ్రీరాముడు నిత్య సత్య పరాయణుడు. సర్వలోకప్రియుడు. కౌసల్యాదేవికి జన్మించిన పవిత్రుడు. తండ్రికి జ్యేష్ఠపుత్రుడు, తమ్ముళ్ళకు తండ్రితో సమానమనే శుక్రనీతి కూడా మరిచావా...

"నీది పుత్రప్రేమకాదు. రాక్షస ప్రేమ. పుత్ర ప్రేమంటే ఏమిటో తెల్సా? కోరిన కోరికలు తీర్చే కామధేనువు గూర్చి తెలుసా?

"అంగప్రత్యాంగాలలోనే కాదు హృదయం వల్ల కూడా జన్మిస్తాడు పుత్రుడు.

"ఓ రైతు పొలంలో శక్తికి మించిన బరువును మధ్యాహ్నం దాకా ఎండలో లాగాయి ఎద్దులు. సమస్త కోరికలు తీర్చే కామధేనువు ఆకాశ మార్గాన వెళుతూ చూసింది.

"ఎద్దుల తల్లి కామధేనువుకు కడుపుతరుక్కు పోయింది. బిడ్డలు పడుతున్న కష్టం చూసి దేవతలూ, లోకాలూ పూజించే కామధేనువు వలవలా ఏడ్చింది.

"ఆమె కనుల నుంచి కారిన కన్నీరు, క్రింద నుంచి వెళ్తున్న దేవతలు రాజు దేవేంద్రుడి మీద పడ్డాయి. దేవరాజు ఆ కన్నీళ్ళు కామధేనువువని గుర్తించాడు.

"ఆ కన్నీళ్ళు వచ్చిన దిశగా చూశాడు. కామధేనువు చెంత చేరాడు. తనూ బాధపడి ఎందుకమ్మా రోదిస్తున్నావు" అడిగాడు.

"నాకెవ్వరూ కష్టం కలిగించలేదు. అదిగో చూడు ఆ కాపు నా బిడ్డలైన ఎద్దులని ఎండలో ఎంత కష్టపెడుతున్నాడో" వ్యధ చెందుతూ చెప్పింది సద్గుణరాశి... కోట్లాది ఎద్దులని లోకం కోసం కన్నది.

రెండు ఎద్దుల కోసం ఆ తల్లి కన్నీరు కార్చింది. పుత్రుల కన్నా ప్రియమైన వారు తల్లికి ఉండరని దేవేంద్రుడు తెలుసుకున్నాడు.

"కామధేనువు తన సంతతిలో రెండు ఎద్దుల కోసమే అంతలా విలపిస్తే, కన్నతల్లి కౌసల్య పరిస్థితి ఏంటి? తల్లివి, స్త్రీవి. సాటి తల్లి బాధ, స్త్రీ వ్యధ నీకు తెలీదా! 'హు' అసలు స్త్రీ వయితే కదా! రక్కసివి.

"పుణ్యసాధ్వి కౌసల్యకి ఎన్నో నోములూ, వ్రతాలూ, నిష్ఫల తర్వాత జన్మించాడే. ఆ బిడ్డను అడవులకి నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొట్టావు. కౌసల్య దుఃఖాన్ని కొలవగలమా... ఆపగలమా...

"ఈ జన్మపాపాలు మరోజన్మలోనో, ఈ జన్మలోనో అనుభవించా లంటారు. ఈ పాపానికి ఎన్ని జన్మలెత్తినా నీ నుంచి ఈ పాపకర్మ వీడదు. తాపసులు నివశించే వనాలకి వెళ్ళి శ్రీరాముడని సగౌరవంగా తీసుకు వస్తాను.





ఎందరినో బాధపెట్టి, ప్రాణాలు తీసి నాకు మూట గట్టి ఇచ్చిన అపకీర్తిని తొలగించుకుంటాను.

"వెళ్ళు... అయోధ్యని విడిచి వెళ్ళు... నీవే వనవాసాలకి పో... లేదా అగ్నిలో దూకు. కంఠానికి తాడు వేసుకో" ఏనుగులని తోమరాలతో కొట్టి, అంకుశానితో గుచ్చితే పడే వ్యధలా భరతుడు ఆక్రోశించాడు.

భరతుడు వచ్చాడని తెలిసి మంత్రి పుంగవులు కైకేయీదేవి మందిరానికి వచ్చారు.

"మహామంత్రివేత్తలరా! ఈ అయోధ్య శ్రీరాముడది. జ్యేష్ఠుడది. ఈ పాప కార్యలతో నాకు ఎట్టి సంబంధంలేదు. రెండువరాల గూర్చీ, సీతారామలక్ష్మణుల వనవాసం గూర్చీ, తండ్రిగారు పరమపదించటం కూడా నాకు ఇప్పుడే తెలిసింది. శత్రుఘ్నుడికి తెలీదు. రాగానే విషయం తెలిసి నాలా కూలిపోతాడు, వాలిపోతాడు." చెప్పాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

భరతుడు శత్రుఘ్నుడితో కలిసి కౌసల్యాదేవి మందిరానికి వెళ్ళాడు. ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎర్రగా ఎండిపోయి ఉన్నాయి. దగ్గరకెళ్ళి భరత, శత్రుఘ్నులు వలవలా ఏడ్చారు.

"అమ్మా... అన్న శ్రీరాముడంటే మాకు ఎంత భక్తో, వాత్సల్యమో నీకు తెలియదా! జరిగిన దానిలో లవవేశమూ నాకు తెలీదు. సత్యసంధుడూ, శ్రేష్ఠుడు శ్రీరాముడు. అట్టి వాడ్ని నేను తెలిసి అడవికి పంపి వుంటే సూర్య, చంద్రుల కెదురుగా మలమూత్రాలు విడిచిన భయంకర పాపం నన్ను చుట్టుకుంటుంది. ఉదయం నుంచి చాకిరీ చేయించుకొని సాయంత్రం ధనమివ్వని పాపంతో సమంగా నాకు తగలాలి.

''అమ్మా... శ్రీరాముడని అడవులకి పొమ్మని, యుద్ధంలో ప్రాణభయంతో ఇంటి కొచ్చినలాంటివాడు చెబుతాడు. భర్త కనుగప్పి తన ధనాన్నే దుర్వినియోగం చేసే జాణ చెబుతుంది.

"మేత మేసి నీళ్ళు త్రాగి నిద్రిస్తున్న ఆవును తన్నిన వాడు.... అలాంటి వాడు శ్రీరాముడిని కానలకి వెళ్ళమని చెబుతాడు. పండిన పంటలో ఆరోవపాలు తీసుకొని కూడా ప్రజారంజకంగా పాలించని రాజులాంటి వాడు చెబుతాడు.

"మహాదక్షిణలు ఇస్తానని, అంతా చేయించుకొని ఆపై భోక్తలకూ, యజ్ఞ నిర్వహణ బ్రాహ్మణులకూ మొండి చేయి చూపిన నికృష్టుడు లాంటివాడు మాత్రమే శ్రీరాముడని అడవులకి వెళ్ళమంటాడు.

"పితృదేవతలకు నైవేద్యం పెట్టకుండా తినేవాడు, స్త్రీనీ, పసివారినీ వృద్ధులనీ చంపినవాడూ, భయంతో పారిపోతున్న వాడ్ని పట్టుకు చంపినవాడూ, నిషిద్ధ వస్తువులు అమ్మేవాడూ, మహా పవిత్రమైన నదీ జలాలని పాడు చేసినవాడూ, లేగ దూడకు పాలు లేకుండా పాలుపిండుకునే వాడూ, దప్పికతో దాహం అడిగితే ఉంచుకొని వెళ్ళగొట్టేవాడూ, భార్యని వదలేసి వేరే పడతులతో అనుభవించేవాడూ, వాళ్ళు... పాపులూ... మహాపాపులు. వారుమాత్రమే చెబుతారు... అంగీకరిస్తారు.

"తల్లీ కౌసల్యాదేవీ... పితృ వియోగానికీ, జ్యేష్ఠభ్రాతృ వియోగానికీ ఇసుమంత కూడా నేను కారణం కాదు తల్లీ" భరతుడు చేతులు జోడించి ఏడుస్తూ కౌసల్యాదేవి పాదాల మీద పడ్డాడు.

ఆ తల్లి మనసు కలవరపడింది. భరతుడి శిరస్సు నిమిరింది.

"లే నాయనా! లక్ష్మణుడివలే ధర్మానికి కంకణ బద్ధుడవు. నీ గూర్చి నాకు తెలుసు నాయనా! అంతటి ప్రమాణాలు చేస్తుంటే నేను భరించలేకున్నాను. సత్యప్రజ్ఞుడవి. సత్పురుషుల లోకాలలో నీ స్థానం పదిలంగా ఉంటుంది నాయనా" చెప్పింది కౌసల్యాదేవి.

## దశరథమహారాజు అంత్యక్రియలు

"భరతా! శోకించకు. గుండె రాయి చేసుకో... రాజు కాలం తీరిపోయింది. ప్రాణులకి ముసలితనమూ, చావూ సృష్టి ధర్మం" చెప్పాడు వశిష్ఠుడు. భరతుడు దశరథునకు చెయ్యాల్సిన ప్రేతకార్యాలు చేయుటకు ఉపక్రమించాడు.

దశరథుని మృతదేహాన్ని తైలద్రోణము నుంచి తీశారు. నిద్రపోతున్నట్టుగా ఉన్న దశరథుడ్ని రత్నాలూ, మణులూ పొదిగిన శయ్య మీద పరుండబెట్టారు. తండ్రిని ఆ స్థితిలో చూసి విలపించారు భరత, శత్రుఘ్నులు.

"నీవు స్వర్గమునకు పోయావు. రాముడు అడవులకి వెళ్ళినాడు. అయోధ్యా, కోసల దేశమూ భర్త పోయిన ఆడదానివలే ఉంది. ఇక ఈ రాజ్యక్షేమాలను ఎవరు చూస్తారు. 'నాయనా...' అని మా శిరస్సులను ఎవరు నిమురుతారు."





భరత, శత్రుఘ్నులకి ధైర్య, హితవచనాలు చెబుతూ, ఊరడిస్తున్నాడు వశిష్ఠుడు. ఋత్విక్పురోహితులు చెప్పిన ప్రకారం కర్మ చేశాడు భరతుడు.

దశరథమహారాజు కళేబరాన్ని పల్లకీలోకి చేర్చారు. మహాప్రస్థాన దిశగా కదిలింది పల్లకి. అశేష జనవాహిని వెనుకా, ముందూ నడిచారు. దారిపొడవునా, బంగారమూ, బట్టలూ, వెండీ, వెదజల్లుతూ తీసుకువెళ్ళారు. గుగ్గిలపు ధూపాలుతో, పద్మరాగ చూర్ణమూ, దేవదారు పొడులూ కూడా చల్లుతూ తీసుకెళ్ళారు.

సరళమూ, పద్మకమూ, దేవదారూ వంటి సుగంధమైన కట్టెలతో చితిపేర్చారు. ఋత్విజులు పైతృమేథిక మంత్రాలు జరుపుతూ అగ్నిలో హోమములు వేసి జపించారు. చితి వెలిగించాడు. సానుగులు సామగానం చేశారు.

దశరథుని భార్యలు దశరథుని చితి చుట్టూ అప్రదక్షిణం చేశారు. కీడు వచ్చిన క్రౌంచపిట్టల వలే ఏడ్చారు. ఏడ్చి ఏడ్చి, విలపించి విలపించి, అలసి సొలసి మిగిలిన ఉత్తర క్రియల కోసం సరయూనది తీరానికి భరత, శత్రుఘ్నులు వెళ్ళారు.

నదిలో భరతుడు దశరథునకు ఉదకక్రియలు నిర్వర్తించాడు. అయోధ్యకి తిరిగి వచ్చి, నియమం ప్రకారం పదిరోజులు నేల మీద పడుకున్నారు. పదిరోజులు గడిచాయి.

అశౌచము వదిలింది. పదకొండొవ రోజు, పన్నెండొవరోజు చెయ్యాల్సిన కర్మలన్నీ పూర్తి చేశాడు. అన్నదానములూ, వస్త్రదానములూ, బంగారమూ, మణులూ, భూములూ విరివిగా దానం ఇచ్చాడు.

దశరథమహారాజు కర్మక్రియలను జరిపిన బ్రాహ్మణులకు అనేక ధనాలతోపాటు, మేకల మందలనూ, ఆవుల మందలనూ, దాసదాసీ జనులనూ, భవనాలనూ, ప్రయాణసాధనాలనూ ఇచ్చాడు.

పదమూడవరోజు దశరథుని చితి వద్దకు వెళ్ళాడు. అక్కడ బూడిద మిగిలింది. భరతుడికి ఉద్వేగం తన్నుకు వచ్చింది.

"తండ్రీ... ఇది చూడటానికా నేను అంతదూరం నుంచి వచ్చింది. నీవు దక్కక, రాముడు లేక ఏమిటి నా ఖర్మ. కౌసల్యాదేవినీ, రాజ్యాన్నీ, మమ్మూ అనాథలను చేశావు. శోక సముద్రంలో ముంచి వెళ్ళిపోయావు. దాటించే నావను శ్రీరాముడను దగ్గర లేకుండా చేశావు."

భరతుడితో పాటు శత్రుఘ్నుడు చింతిస్తున్నాడు.

"మంథర వల్ల మహా వినాశనం జరిగింది. కైక మొసలిగా మారింది. అయోధ్య వైభవాన్ని పట్టింది. దాని ఫలం అంతా నాశనం.

"రాముడు వనాలకి వెళ్ళేదారి, నీవు స్వర్గం దారి చూసుకున్నావు. మాకేమిటి దిక్కు. మాకేది దారి."

భరత, శత్రుఘ్నులు ఘోరంగా విలపించారు. రోదించి, రోదించి కొమ్ములు విరిగిన ఆంబోతుల్లా నేల మీద కూలిపోయారు.

వశిష్ఠ మహర్షి భరత, శత్రుఘ్నులను ఓదార్చాడు.

"తండ్రిగారు కాలం చేసి పదమూడొవ రోజు. అస్థిసంచయనము మిగిలి ఉంది. ఆ ధర్మాన్ని పూర్తి చేయాలి. శోకమూ, మోహమూ, పుట్టుకా, మరణమూ అనివార్యం" చెప్పాడు వశిష్ఠుడు.

భరత, శత్రుఘ్నులు ఎండకు ఎండుతూ, వానకు తడిసే ఇంద్ర ధ్వజంలా ఉన్నారు. భరత, శత్రుఘ్నుల కనులు ఎర్రబడి ఉన్నాయి. వాచిపోయి ఉన్నాయి. అస్థిసంచయనాదికాలు పూర్తి చేయమని పండితులు చెప్పారు.

★★★ ★★★ ★★★

దశరథుని అంత్యక్రియలన్నీ పూర్తయిపోయాయి. భరతుడు శ్రీరాముడి వద్దకు వెళ్ళుటకు సిద్ధమవుతున్నాడు.

"అన్నా... సమస్త ప్రాణకోటికీ కష్టకాలంలో తానే దిక్కు అయ్యే శ్రీరాముడు, తండ్రి మాటతో అడవులకి వెళ్తుంటే, బలవంతుడూ, ఆవేశపరుడూ అయిన లక్ష్మణుడు తండ్రిని మెప్పించి ఆపి ఉంటే బాగుండేది. నీతికీ, అవినీతికీ తేడా తెలియని స్థితిలో ఉన్న తండ్రిగారిని అడ్డగించవలసింది" శత్రుఘ్నుడు చెబుతున్నాడు.

"ధర్మమార్గాన్ని ఎంచుకున్న శ్రీరాముడు, అకార్యాన్ని సహించగలడా! లక్ష్మణుడు రాముని మనస్సెరిగి ఆ పని చెయ్యగలడా" చెప్పాడు భరతుడు. అంతలో అలికిడి అయింది ద్వారం వద్ద. ద్వారపాలకులు గూని మంథరనూ, కొందరు దాసీ జనాన్నీ ఈడ్చుకు వచ్చారు.

"ప్రభూ! ఇదియే కారణం. మంచి దుస్తులతో, బంగారముతో, రత్నాలతో అలంకరించుకున్న ఈ గూని దాని వల్లే ఇంతటి ఉపద్రవం వచ్చింది. తాము చిత్తంతో చెబితే చెయ్యగలవారము" చెప్పారు.





"ఓసీ క్రూరురాలా! కోసల దేశానికి తీరని దుఃఖము తెచ్చిపెట్టావు. నీవు చేసిన పాపాలకు ఇప్పుడే, ఇక్కడే అనుభవించవలెను" అని విసురుగా తోశాడు శత్రుఘ్నుడు.

మంథర గగ్గోలు పెట్టింది. దాసీ జనం శత్రుఘ్నుడని చూసి ప్రాణాల మీద ఆశ వదులుకున్నారు. పరుగు పరుగున కౌసల్యాదేవి మందిరం వైపు పరిగెత్తారు. ఆమె పాదాలను ఆశ్రయించారు.

మంథరని నేల మీద ఈడ్చుకు వస్తూ దాసీ జనాన్ని వెంబడించాడు శత్రుఘ్నుడు. దాసీ జనాల అరుపులకు కైకేయీదేవి పరుగెత్తుకు వచ్చింది. కైకేయీదేవి భరతునితో చెప్పింది. మంథరని వదిలెయ్యమని. భరతుడు ఉగ్రుడయ్యాడు.

"పాపిష్ఠురాలివి. నిన్ను చంపినా మాతృ ఘాతుక పాపం కూడా అంటదు. కానీ నా రాముడు తల్లిని కడతేర్చినందుకు పెడముఖమవుతాడని వదలిపెడుతున్నాను" అని శత్రుఘ్నుడు వైపుకి తిరిగి "నీవు మంథరను సంహరించవద్దు. రాముడు హర్షించడు. నిన్నూ నన్నూ మన్నించడు" చెప్పాడు భరతుడు.

మంథర కైకేయీదేవి పాదాల మీద పడి వలలో చిక్కిన పెంటి క్రౌంచమువలే ఏడ్చింది.

"పో! మా రాజ్యం విడిచిపో... లేదంటే..." అరిచాడు భరతుడు.

## శ్రీరాముడి వద్దకు భరతుడు

పధ్నాల్గవరోజు తెల్లతెల్లవారుతుండగానే రాజ్యమంత్రులు భరతుడ్ని కలిశారు.

"ప్రభూ... రాజులేని రాజ్యం ఇన్ని దినాలైనా శాంతిగా, ఎట్టి దుష్కార్యాలు జరగకుండా ఉంది. దైవం కోసల దేశాన్ని రక్షిస్తున్నాడు.

"ఇక ఆలస్యం చెయ్యకుండా పట్టాభిషేకితుడివై ప్రజలకు పాలన అందించవలెను. కోసల దేశానికి రాజువై, రాజ్యభారం వహించి మీ తండ్రిగారిని ఆనందింప చేయవలెను. సమస్తం సిద్ధంగా ఉంది" చెప్పారు.

"మంత్రులారా! హితులారా! మీ మాటలకు ధన్యవాదములు. ఇక్ష్వాకు వంశానికి రాజు జ్యేష్ఠుడే. శ్రీరాముడే. వేదాలూ, ధర్మాలూ చదివిన వారు మీరు. అట్టి మీరు నన్ను రాజు అనుట సముచితము కాదు.

"చతురంగబలాలతో శ్రీరాముడి వద్దకు వెళ్ళి, శ్రీరాముడ్ని తీసుకు వస్తాను. సిద్ధం చేసిన పట్టాభిషేక సంభారాలన్నీ శ్రీరాముడి కోసం తీసుకు వెళతాను. యజ్ఞం నుంచి అగ్నిహోత్ర ఫలాన్ని ఇంటికి తెచ్చినట్టు శ్రీరాముడని తీసుకు వస్తాను. అయోధ్యకి శ్రీరాముడే రాజు. అడవికి సిద్ధం కండి. వెళ్ళేదారి మట్టి పెల్లలు లేకుండా కర్మకారులతో సరిచేయించండి.

"గంగానది వరకు బ్రహ్మాండమైన బాటను వేయించండి. దుర్గమ ప్రదేశాలు తెలిసిన రక్షకూటములను పంపండి. ఈ క్షణమే నా ఆజ్ఞను అమలు చేయండి."

భరతుడు మంత్రులకూ, సేనలకూ ఆజ్ఞాపించాడు. వారంతా భరతుడ్ని అభినందించారు. స్తోత్రించారు. ఆనంద పడ్డారు. లక్ష్మీదేవి చల్లని చూపులు నీ మీద సదానిల్చి ఉంటాయని పలికారు.

భరతుని ఆజ్ఞప్రకారం ప్రదేశాలు తెలిసిన వారు తమ పనులను ప్రారంభించారు. పదిమందితో ఒక్కరోజు అయ్యే పనిని వందమందిని పెట్టి గంటలో చేయించారు.

దారంతా వేలకొద్ది గజాలు చదును చేశారు. నీళ్ళు చల్లారు. అడ్డం వచ్చిన చెట్లనూ, పుట్లనూ తొలగించారు. మధ్య మధ్యలో బావులు తవ్వి, వంట శాలలు నిర్మించారు.

మహాసముద్రంలాంటి సేవకులు అహర్నిశలు శ్రమించారు. దారి కిరువైపులా చెట్లు నాటారు. నరకటానికి వీలుకాని వాటిని నిప్పుపెట్టి బూడిద చేసి తొలగించారు.

అడ్డం వచ్చిన కొండలను పెద్ద పెద్ద గుదిమలతో పిండి చేశారు. నదుల మీద వంతెనలు కట్టారు. అడ్డం వచ్చిన చెరువులకు గట్లు పగలకొట్టి జనవాసాల వైపుకి ప్రవహించకుండా కట్టుదిట్టం చేశారు.

సున్నం గచ్చుతో రథాలు వేగంగా వెళ్ళేలా బాటవేశారు. సువాసనలు గల పూలు చల్లారు. దేవేంద్రుడు నడిచే దారిలా, రమ్యంగా సుందరంగా మలిచారు. శోభాయమానంగా వెలిగిపోయింది భరతుడు వెళ్ళే దారి.

బాటతో పాటు అక్కడక్కడ మజిలీలు ఏర్పాటు చేశారు. చలువరాతి గదులను నిర్మించారు. పండ్లూ, ఫలాలూ దొరికే ఉద్యానవనాల్లో విశ్రాంతి మందిరాలు నిర్మించారు. దేవతార్చన కోసం దేవాలయాలు నిర్మించారు. గంగానది వరకూ బహు చక్కటి రహదారి, ఇరువైపులా చెట్లు, మార్గమధ్యాన





విశ్రాంతి భవనాలు ఒక్కటేమిటి అన్నీ సంపూర్ణంగా పూర్తి చేశారు. జ్యోతిష్య శాస్త్ర కోవిదులు ముహూర్తం నిర్ణయించారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

గంగానది వరకూ బాట వేయమని ఆజ్ఞాపించి భరతుడు తన భవనం కేగి ఆ రాత్రి నిదురించాడు. తెల్లవారింది.

వందిమాగధులు స్తోత్రాలు చేస్తూ నిద్రలేపారు. మంగళగానం చేశారు. కనకదండాలతో మధురంగా మ్రోగించారు.

భరతుడు లేచాడు. బాధగా చెప్పాడు.

"ఎందులకు ఇవన్నీ... నేను రాజును కాదు. రాజుకి మాత్రమే చెయ్యవలసిన విధులు నాకు చెయ్యరాదు" చెప్పాడు.

వశిష్ఠుడు ఆ సమయాన దూతలని పిలిపించాడు. తన శిష్యగణాలతో సువర్ణమైనది, రమ్యమూ, మనోజ్ఞమూ అయిన ఇక్ష్వాకు భవనంలో ఉన్నాడు.

"దూతలారా! భరత, శత్రుఘ్నులనూ, బ్రాహ్మణులనూ, క్షత్రియులనూ, వైశ్యులనూ, గణాధ్యక్షులనూ, సుమంత్రుడూ, విజయుడూ, వీరితోపాటు మహామంత్రి పుంగవులనూ, కోసల శ్రేయోభిలాషులనూ తీసుకురావలెను" చెప్పాడు.

దూతలు పరుగు పరుగున వెళ్ళారు. అందరికీ వశిష్ఠుల వారి నిర్ణయాన్ని చెప్పి సగౌరవంగా తీసుకు వచ్చారు.

వశిష్ఠులవారు చెప్పినట్టు అంతా వచ్చేశారు. భరత, శత్రుఘ్నులు ఆశీనులయ్యారు. బంగారు కుంభాలతో రమ్యంగా ఉంది సభ. మణులతో, రత్నాలతో దేవేంద్రుడి సభలా ఉంది.

దశరథుడు ఉన్నప్పుడు ఎంత నిండుగా ఉందో అంత నిండుగా ఉంది సభ.

గ్రహ నక్షత్రాలతో ఉన్న రాత్రిని చూసినట్టు సభనంతా కలియచూశాడు భరతుడు. పున్నమి నాటి రాత్రిని గుర్తుకుతెస్తోంది సభ..

వశిష్ఠులవారు లేచారు. భరతుని వంక చూశారు.

"నాయనా భరతా! మీ తండ్రి దశరథమహారాజు ఎన్నో యేళ్ళు ధర్మంగా పాలించారు కోసల దేశాన్ని. దేశాన్ని ధనంతోనూ, ధర్మంతోనూ, ధాన్యంతోనూ నింపి ఇచ్చాడు.

"శ్రీరాముడు సత్యధర్మం కొరకై వనాలకి వెళ్ళాడు. కాన తప్పక ఈ రాజ్యాన్ని పాలించి అనుభవించవలెను. పట్టాభిషేకం చేసుకో. ఉత్తర, పడమటి, తూర్పు, దక్షిణాది రాజుల నుంచి రత్నాల రాసులను కానుకులుగా స్వీకరించు."

వశిష్ఠుల వారి పలుకులకి భరతుడి మొహం చిన్నపోయింది. కలహంస స్వరంతో చెప్పాడు. వినయంగా, విధేయంగా నమస్కరించాడు.

"మహర్షులు మీరు. శ్రీరాముడి రాజ్యాన్ని అపహరించమంటున్నారు. దశరథమహారాజు పుత్రుడను. అన్యుల ఆస్తిని ఆశించను. ఈ రాజ్యము శ్రీరాముడిది. శ్రీరామచంద్రుడు జ్యేష్ఠుడు. ఉత్తముడు. పధ్నాలుగు భువన భాండాలను ఏక బాణంతో శాసించ గల వీరుడు. ఆ రాముడే కోసల దేశానికి ప్రభువు.

"అదీ కాక నేను ఏం చేసినా, ఇక్ష్వాకు వంశంలో చెడపుట్టిన వాడినే అవుతాను. శ్రీరామునకు ఇక్కడ్నించే చేతులు జోడించి నమస్కరిస్తున్నాను. రాముడు పురుషోత్తముడు. కోసల దేశానికే కాదు. ముల్లోకాలకే రాజు అవ్వదగ్గ ధర్మపురుషుడు. దుష్టులు చేసే పని నేను చేయను. నరకానికి వెళ్ళను.

"రాముడి వద్దకు వెళతాను. అర్థిస్తాను. ప్రాధేయపడతాను. గంగానది వరకూ రమ్యమైన బాట వేయించాను. నదిని దాటి అడవుల్లోకి వెళ్ళి శ్రీరాముడిని వెనక్కి తెస్తాను.

"కాదంటే తనతోనే వనాల్లో ఉండిపోతాను. అయోధ్య కన్నా నాకు శ్రీరాముడే ముఖ్యం. ఆయన సేవే నాకు లక్ష్యం. మార్గం. మీరంతా రండి. సాధువులూ, సద్గుణవంతులూ, మహాజనులూ అంతా రండి. ప్రార్థించి, బలవంతము చేద్దాం" చెప్పాడు భరతుడు.

వశిష్ఠుడు, మిగతా మంత్రి పుంగవులూ భరతుని ధర్మ నిరతిని కొనియాడారు.

"సుమంత్రా! రథాన్ని సిద్ధంచేయి. చంతురంగబలాలనూ, సేనాధ్యక్షులనూ సిద్ధంగా ఉంచాలి. లోకహితం కోసం ఉదయాన్నే ప్రయాణం" చెప్పాడు భరతుడు.

భరతుడ్ని అనుసరించటానికి నాలుగు వర్ణాల ప్రజలు సంసిద్ధమయ్యారు. గుర్రాలనీ, ఏనుగులనూ, ఎద్దులనూ, ఒంటెలనూ, కంచర గాడిదలనూ సిద్ధం చేసుకున్నారు.





## భరతుడు అరణ్యానికి పయనము

భరతుడు ప్రాతఃకాలాన్నే లేచాడు. స్నానాదికాలన్నీ పూర్తి చేశాడు. అస్తగిరి మీద సూర్యుడిలా వెలిగిపోతూ రథాన్ని అధిరోహించాడు. రథానికి ముందు మంత్రులూ, పురోహితులూ బైలుదేరారు. తొమ్మిది వేల గజసాదులూ, అరవై వేల రథాలతో, లక్ష గుర్రాలతో, అశ్వికులతో, ఆయుధాలు ధరించిన వారూ అనుసరించారు.

శ్రీ సీతారామలక్ష్మణుల కోసం కైకేయీదేవీ, సుమిత్రాదేవీ, కౌసల్యాదేవీ మేనాలలో భరుతుని వెంట అనుసరించారు. సమస్త లోకాలకీ వెలుగు ప్రసాదించేవాడూ, మహానుభావుడూ, దర్శనంతోనే దుఃఖాలను పారద్రోలే వాడూ అయిన శ్రీరాముడిని ఎప్పుడు చూస్తామా అని అయోధ్యపౌరులూ పరుగులాంటి నడక నడిచారు.

వర్తకులూ, పాలు అమ్మేవాళ్ళూ, పంటలు పండించే వాళ్ళూ, ఆయుధాలను తయారు చేసేవాళ్ళూ, ఇళ్ళూ, మిద్దెలూ, భవంతులూ కట్టేవారూ అలా అందరూ అన్ని వర్ణాల వారూ శ్రీరాముని దర్శనంకై వేగిర పడ్డారు.

బ్రాహ్మణులూ, ఋత్విజులూ, చక్కటి తెల్లటి వస్త్రాలు ధరించి ఎద్దుల బళ్ళను బాగా అలంకరించి మరీ బైలు దేరారు.

రాత్రి గడిస్తే వెలుగొస్తుంది. మేఘశ్యాముడూ, మహాబాహుడూ శ్రీరాముడని చూడగానే వెలుగొస్తుంది. శక్తి వస్తుంది. ఎప్పుడెప్పుడా అని కాపురానికి వెళ్ళిన కూతురిని చూసేందుకు వెళ్ళే తల్లీ, తండ్రీలా వేగిర పడుతున్నారు.

అంతా వారివారి వాహనల మీద గంగానది ఒడ్డు చేరారు. పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తోంది గల గలమని గజ్జల శబ్దాలు చేస్తూ... గంగానది.

సైన్యాన్నీ, పురప్రజలనూ, మంత్రులనూ గంగానది ఒడ్డున మజిలి చెయ్యమని ఆజ్ఞాపించాడు భరతుడు.

భరతుని కోసం బ్రహ్మాండమైన గుడారాన్ని సమస్త సదుపాయాలతో సిద్ధంచేశారు.

## గుహుడి అనుమానం

గంగానది ఒడ్డున వేసిన గుడారాన్నీ, చతురంగ సేననూ గుహుడు చూశాడు. అపార సైన్యాన్ని చూసి భయపడ్డాడు.

అడవికి వెళ్ళినా శ్రీరాముడని వదిలి పెట్టే ఉద్దేశ్యము కైకకూ, భరతునకూ లేదా! ఆ చల్లని తండ్రిని అక్కడ కూడా ప్రశాంతంగా ఉండనీయ దలచలేదా!

"అహో రాజుల గుండెలు శిలలా? రాజ్యం ముందు రక్త సంబంధాలు అల్పమా?"

గుహుడు తన మంత్రులతో చర్చించాడు.

"భరతుడి ఉద్దేశ్యం అదే అయితే గంగను దాటనీయకుండా పోరాడుదాం. సదుద్దేశ్యమే అయితే ఆహ్వానిద్దాం. శ్రీరాముడు నాకు ప్రభువే కాదు. ఆప్తుడు కూడా.

"అంతా యుద్ధానికి సిద్ధంకండి. మాంసాన్నీ, కాయలనీ, దుంపలనీ అందుబాటులో ఉంచుకొని గంగ ఒడ్డున కావలి కాయండి. ఐదువందల నావలను సిద్ధం చెయ్యండి. అందులో ఒక్కొక్క నావలో వందమంది వీరాధివీరులను ఆయుధాలతో ఉంచండి. తొందరపడి యుద్ధతంత్రాన్ని నడపకండి.

"రాజు బలవంతుడు. మన లాంటివార్ని సునాయాసంగా సంహరించ గలడు కూడా. నిషాద రాజ్యాన్ని నేల మట్టం చేయగలడు. అయిననూ, ఫర్వాలేదు. దుర్బుద్ధితో వచ్చి ఉంటే అడ్డు పడక తప్పదు" చెప్పాడు గుహుడు.

ఆ తర్వాత గుహుడు రుచికరమైన చేపలూ, మాంసాలూ, తేనె... మధుర ఫలాలూ, కాయలూ తీసుకొని భరతుని గుడారం వైపు వెళ్ళాడు.

దూరం నుంచి సుమంత్రుడు గుహుడ్ని చూశాడు. విషయాన్ని భరతునకు విన్నవించాడు.

"రాజా! నిషాదరాజు గుహుడు వస్తున్నాడు. బోయజాతివాడు. అరణ్యాలలో అతనికి తెలియనిది ఏమీ లేదు. శ్రీరామునకు పరమ ఆప్తుడు. శ్రీరామ జాడ అతనికి తెలుసు. ఇతడి నావలోనే సీతారామలక్ష్మణులు నదిని దాటి దండకారణ్యంలోకి వెళ్ళారు."

భరతుడు సంతోషించాడు. గుహుడికి ఎదురెళ్ళి తోడ్కొని రమ్మన్నాడు. సుమంత్రుడు సాదరంగా ఆహ్వానించాడు గుహుడినీ, అతనితో వచ్చిన అమాత్యులనీ...

"రాజా! మీరాక మాకు ఆనందదాయకం. అడవిలో దొరికే ఫలాలూ, మాంసమూ, రకరకాల ధాన్యాలనూ తమరు స్వీకరింపవలెను. మీ దాసులం.





తమకీ, తమ అపార సేనలకూ ఆహారాన్ని సమకూర్చుతాం. ఈ రాత్రి మీరూ మీ పరిజనులూ మా విందు స్వీకరించవలెను" చెప్పాడు గుహుడు.

గుహుడి ఆహ్వాన ఆతిథ్యానికి భరతుడు సంతోషించాడు.

"గుహుడా! నాకే కాదు నా సమస్త బలగాలకీ, సేనలకూ, పౌరులకీ సత్కారాలు చేస్తానన్నావు. ఆ మాటే చాలు. అదే పరమానందం.

"నాకు కావలసింది మీ అన్నరసాలు కాదు. భరద్వాజాశ్రమము పోవాలి. చూడబోతే భయంకరమైన అడవి కానవస్తోంది. దారితెన్నూ తెలియదు. పైగా మహా ప్రవాహమైన గంగానదిని ఇంత సైన్యంతో దాటుట ఎట్లో తెలియుటలేదు." చెప్పాడు భరతుడు.

గుహుడు భరతునకు వినయంగా నమస్కరించి...

"కోసల రాజా... శ్రీరాముడు క్షత్రియుడైనా సాధు జీవి. అపకారం ఎవ్వరికీ తలపెట్టనివాడు. ఇంత సైన్యముతో, ఆయుధాలతో శ్రీరామ దర్శనం ఎందులకో ఈ భృత్యుడు తెలుసుకొనగోరుతున్నాడు" అడిగాడు గుహుడు.

భరతుడు గుహుడ్ని చూసి నవ్వాడు. నిర్మలమైన చిరునవ్వుతో మృదువుగా చెప్పాడు.

"గుహుడా! సందేహం వలదు. నా రాముడు నాకు అన్న, దైవం, తండ్రి. నా తల్లి చేసిన పొరపాటును సరిదిద్దవలెనని శ్రీరాముని వద్దకు బైలుదేరాను. తిరిగి అయోధ్యకి రమ్మని వేడుకొనుటకే ఈ ప్రయత్నము. నేనూ, నాతోపాటు నా తల్లులూ, పౌరులూ అందరూ కలిసి అడిగితే శ్రీరాముడు కాదనడనే నమ్మకంతో బైలుదేరాము."

గుహుడు సంతృప్తుడయ్యాడు.

"రాజా! నీవు మహానుభావుడవు. అధర్మంగా వచ్చిన ఆస్తిని తృణీకరిస్తున్నావు. నీ కీర్తి దిగంతాల వరకూ వ్యాపిస్తుంది" చెప్పాడు గుహుడు.

రాత్రి అయింది. గుహుడు అందరికీ చక్కటి వసతినీ, ఆహారాన్నీ అందించాడు. భరత, శత్రుఘ్నులు విశ్రమించారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

నిషాదరాజు గుహుడు భరత, శత్రుఘ్నులతో చెప్పాడు.

"రాజా! ఆ రోజు సీతారాములు వృక్షం క్రింద నిదురిస్తుంటే లక్ష్మణుడు ధనుస్సూ, బాణాలూ ధరించి రాత్రంతా మేలుకొనే ఉన్నాడు. చక్కటి శయ్యని

సిద్ధం చేసి నిదురించమన్నాను. సీతారామ రక్షణ మా కొదిలెయ్యమన్నాను. సుఖం తప్ప కష్టం తెలియనివాడివి హాయిగా నిదురించమని ఎంతో నచ్చచెప్పాను."

"ఆప్పుడవు. నీవుండగా మాకేల చింత. సీతారాములు నేల మీద నిదురిస్తూంటే నాకెలా నిదుర పడుతుంది. దేవతలూ, రాక్షసులూ కూడబలుక్కొని వచ్చినా శ్రీరాముని ధనుస్సు శబ్దం చాలు అంతా తోక ముడవటానికి, అంతటి పరాక్రమశాలి.

"చూడు! ఎలా నేల మీద పడుకున్నాడో... ఎంత బాధపడుతున్నడో... అడవికి వచ్చినందుకు కాదు శ్రీరాముడు వ్యథ చెందేది. అయోధ్యలో తల్లులెలా ఉన్నారో, తండ్రి తన గూర్చి ఎంత దిగులు పెట్టుకున్నాడోనని చింతతో...

"శ్రీరాముడంటే తండ్రిగారికి ప్రాణం. దూరమయ్యాడంటే, వనాలకి వెళ్ళాడంటే తండ్రిగారు బ్రతుకుతారా! అన్న సందేహం కలుగుతోంది. గుణవృద్ధుడూ, శీల వృద్ధుడూ, కురు వృద్ధుడూ, పైగా అనంతమైన దిగులుతో ఉన్నాడు.

"ఏదన్నా జరిగితే కౌసల్యాదేవి దుఃఖాన్ని ఎవ్వరు అపుతారు. మరెవ్వరు ఓదారుస్తారు. పధ్నాలుగేళ్ళు వనవాసం చేసి అయోధ్య చేరి మా తండ్రిని చూడగలమా... అదే మా బాధా... దిగులూ...

"అయోధ్య భూలోక స్వర్గం. చక్కటి భవనాలు. వేదాల ఘోష... ఉద్యానవనాలు... రథాలతోనూ, గుర్రాలతోనూ అయోధ్య ఉంటుంది.

"రత్నాలూ, మణులూ సోలలలో కొలిచే వర్తక వీధులు. సమృద్ధిగా ధన ధాన్యాలూ, రాజు దానం తప్ప వేరే వారి దానం అవసరంలేని పౌరులు. మళ్ళీ అయోధ్యనీ, మా తండ్రిగారినీ, తల్లులనూ ఎప్పుడు చూస్తామో. ఆ అదృష్టం మాకుందో లేదో..." గుహుడు లక్ష్మణుడు అన్న మాటలు చెబుతుంటే భరతునకు కన్నీళ్ళు ఉబికి వచ్చాయి.

భోరున ఏడ్చాడు. శత్రుఘ్నుడు విలపించాడు. పుత్రుల శోకాలు విని తల్లులూ పరిగెత్తుకు వచ్చారు. ముగ్గురిలో మరీ దైన్యంగా ఉంది కౌసల్యాదేవి. శోకదేవతలాఉంది.

"గుహుడా! వివరంగా చెప్పు అన్న శ్రీరాముడు, వదినమ్మ సీత... లక్ష్మణుడు ఎక్కడున్నారు. ఫలహారంగా ఏం తీసుకున్నారు" అడిగారు.





"రాజా! శ్రీరాముని కోసం అనేక ఫలాలూ, కాయలూ, మధుర రసాలు గల మాంసాన్నీ, రుచి గల చేపలనూ, అన్న రసాలనూ, భక్ష్యాలూ, చోష్యాలూ, లేహ్యాలూ ఎన్నో తీసుకువచ్చాను. కానీ శ్రీరాముడు వాటిని ముట్టలేదు. క్షత్రియ ధర్మం పాటించాడు. లక్ష్మణుడు తెచ్చిన గంగాజలాన్ని మాత్రమే స్వీకరించాడు. వనవాస దీక్ష రోజు కావటంతో సీతారాములు ఉపవాసం చేశారు.

"సీతారాములు జలాన్ని త్రాగిన తర్వాత లక్ష్మణుడూ అదే చేశాడు. సంధ్యోపాసన చేశారు. లక్ష్మణుడు పండుటాకులతో పక్క ఏర్పాటు చేశాడు. కొద్దిగా దూరంగా వచ్చి రాత్రంతా నాతోనే మాట్లాడాడు.

"అదిగో సీతారాములు నిదురించిన గార చెట్టు. ధనుస్సూ, బాణాలూ ధరించి లక్ష్మణుడు రాత్రంతా కాపలా కాశాడు. నేను నా బోయవీరులతో కత్తులూ, ధనుస్సులూ, బాణాలతో, దేవతలరాజు దేవేంద్రుడి కంటే వీరుడైన కోసలరాజు శ్రీరాముడిని అంటిపెట్టుకొని కావలి కాశాం."

☆☆☆ ☆☆☆ ☆☆☆

గుహుడు చెప్పటం ఆలస్యం భరతుడు మంత్రులతో గార చెట్టు వద్దకు వెళ్ళాడు. ఆ ప్రదేశాన్ని తనవి తీరా చూశాడు. నిమిరాడు.

"ధీమంతుడూ, దశరథరాజు పుత్రుడూ అయిన శ్రీరాముడు కటిక నేల మీద పండుటాకుల మీద నిదురించాడు.

"బంగారపు పాన్పులపై మెత్తటి పక్కల మీద నిదురించిన సీతారాములు నేల మీద, ఆకుల మీద... భరతుడు కళ్ళు చెమ్మగిల్లాయి.

"చిలకల పలుకులూ, వీణా ధ్వనులూ, సుందర రాగయుక్తమైన పాటలూ, సుగంధము వీచే చోట నిదురించే రాముడు తృణశయ్యపై నిదురించాడా!"

తల్లులకు భరతుడు ఆ ప్రదేశం చూపి భోరుమన్నాడు.

"ఇక్ష్వాకువంశంలో పుట్టిన పరమ పూజ్యుడు. మేరు పర్వతమంతటి భవనాల్లో నివశించిన శ్రీరాముడు. ఇక్కడ ఈ గడ్డిలో ఈ ఆకుల్లో నిదురించాడు.

"జనకరాజ తనయ, మిథిలా నగర రాణి, దశరథమహారాజు కోడలు, ఉత్తమ స్త్రీ, భర్త చెంతే స్వర్గ సుఖాలని తలిచే మహా ఇల్లాలు, నారీమణీ, శ్రీరామచంద్రుని భార్య సీతాదేవి ఎత్తు పల్లాల గడ్డి మీద ఎలా నిదురించినదో కదా...

"అదిగో ఆభరణాలతో నిద్రించినట్టు ఉంది. ఆమె ఆభరణాల బంగారు రేణువులు గడ్డికి అంటి ఎలా మెరుస్తున్నాయో...

"ఇందీవరశ్యాముడూ, ప్రియదర్శనుడూ, అసత్యమాడని వాడూ, పురుష శ్రేష్ఠుడూ అయిన శ్రీరాముడునకు నా వల్ల ఇంత కష్టం వచ్చిందా... లేదు. నేనే నారబట్టలు ధరించి, కందమూల ఫలాలు తింటూ ముని సేవ చేసుకుంటూ వనవాసం చేస్తాను. సీతారామలక్ష్మణులను అయోధ్యకి పంపుతాను.

"శ్రీరాముడు కాదంటే నేనూ అడవిలోనే అన్నతోనే ఉంటాను. ప్రార్థిస్తాను. వేడుకుంటాను. అర్థిస్తాను. శ్రీరాముడు తప్పక నన్ను దయ చూస్తాడు. మన్నిస్తాడు" చెప్పాడు భరతుడు.

## భరత శత్రుఘ్నులు గంగానదిని దాటుట

ఆ రాత్రి గంగ ఒడ్డునే గడిపాడు భరతుడు. తెల్లవారుతుండగానే భరతుడు లేచాడు.

"తమ్ముడూ శత్రుఘ్నా, ఇంకా నిదురిస్తున్నావా? గుహుడ్ని తీసుకురా మనం బైలుదేరాలి"

"లేదు అన్నయ్య శ్రీరాముడి గూర్చి ఆలోచిస్తున్నాను. నిద్ర కూడా పోలేదు. అడవి కాలిపోయినప్పుడు శుష్కించిన వృక్షము లోపలి అగ్ని ఇంకా కాలుతున్నట్టు నా మది రగిలిపోతోంది. శ్రీరాముడు వెళ్ళిన దిశనే చూస్తూ ఉన్నాను" చెప్పాడు. ఇంతలో గుహుడు వచ్చాడు.

భరతునకూ, శత్రుఘ్నునకూ నమస్కరించాడు.

"ప్రభువులారా! రాత్రి శుభదినంగా గడిచినదా! ప్రశాంతంగా నిదురించారా! మీ సైన్యమూ, మీ పరిజనమూ సుఖంగానే ఉన్నారా" అడిగాడు గుహుడు. గుహుని కుశల ప్రశ్నలకు సంతసించారు భరత శత్రుఘ్నులు.

"నిషాదరాజా! అంతా సవ్యంగానే ఉన్నది. శ్రీరామ దర్శనము కోసం నా మనసు ఉవ్విళ్ళూరుతోంది. కాన మమ్ము గంగానదిని దాటించవలెను" చెప్పాడు భరతుడు.

గుహుడు భరతుడి ఆజ్ఞతో ఐదు వందల నావలను సిద్ధం చేశాడు. స్వస్తికము అను బ్రహ్మాండమైన, వైభవోపేతమైన సకల సదుపాయలూ గల నావను భరత, శత్రుఘ్నులకు ఇచ్చాడు. అందులో భరత, శత్రుఘ్నులతో పాటు రాజమాతలూ, ముఖ్యమంత్రులూ ఎక్కారు.





మిగతా వారి కోసము నావలను సిద్ధం చేసి అందరినీ ఎక్కించాడు. భరత శత్రుఘ్నులతో వచ్చిన రథములూ, అనేక వస్తువులూ, వాహన జంతువులూ అన్నింటినీ మరికొన్ని నావలలో ఎక్కించాడు.

నావలన్నీ గంగానది దాటుతున్నాయి. ఏనుగులతోనూ, సైన్యం తోనూ, పరిచారిక పుర జనులతోనూ నిండిన నావలు... దూరం నుంచి చూస్తుంటే గంగానదిలో కొండలు కదులుతూ వెళుతున్నట్టుగా ఉంది. స్త్రీల నావలు స్త్రీలవే. పురుషుల నావలు పురుషులవే. సేవకుల నావలు సేవకులవే. అన్నీ గంగానది దాటాయి.

భరత, శత్రుఘ్నులతోపాటు అందరూ పవిత్ర గంగానదిలో స్నానం చేశారు. ఆపై అంతా ప్రయాగ వనాన్ని చేరారు.

సమస్త వేదాలు తెలిసినవాడు, మహాఋషి, దేవపురోహితుడి పుత్రుడు భరద్వాజుడు నివశిస్తున్న ప్రాంతము.

## భరద్వాజుడను భరతుడు దర్శించుట

ఆ మహాఋషి ఆశ్రమం చక్కటి వృక్షాలతోనూ, పూలూ, కాయలూ, లతలూ, చెట్లతోనూ నిండి ఉంది.

భరతుడు తన మీద ఉన్న ఆభరణాలన్నీ తీసివేశాడు. వశిష్ఠ మహర్షిని తీసుకొని భరద్వాజుని ఆశ్రమానికి వెళ్ళాడు.

వశిష్ఠ మహర్షిని చూడగానే భరద్వాజుడు దర్భాసనము మీద నుంచి లేచి ఆహ్వానించాడు. అభిమాన పాత్రంగా కుశల ప్రశ్నలు వేసుకున్నారు. భరతుడు భరద్వాజునకు సాష్టాంగ ప్రణామం చేశాడు. తన గూర్చి చెప్పుకున్నాడు భరతుడు.

దశరథ పుత్రునకూ, వశిష్ఠ మహర్షికీ పాద్యమూ, అర్ఘ్యమూ ఇచ్చాడు.

"అయోధ్య పురమంతా కుశలమే కదా? మంత్రులూ, సామంతులూ ధనాగారమూ సురక్షితమే కదా!"

ఆకాశము వంటి నిర్మలమైన భరతుడు వినయంగా తలవూపి అడిగాడు.

"మహర్షీ! మీ తపస్సు నిరాటంకంగా సాగుతున్నది కదా! అగ్నిహోత్రాలు సాగుతున్నాయా! కందమూల ఫలాలు సమృద్ధిగా దొరుకుతున్నాయా" అడిగాడు భరతుడు.

"భరతా! రఘువంశంలో జన్మించావు. యోగ్యుడవు. ఇంద్రియాలను అదుపులో ఉంచుకొన్నవాడివి. అన్నియూ నేను నా తపసిద్ధితో తెలుసుకున్నాను.

నీ సుగుణాల వల్ల నీ కీర్తి లోకంలో శాశ్వతముగా ఉంటుంది. నీ కోరిక తీరుతుంది. శ్రీరాముడిని అతిత్వరలోనే దర్శిస్తావు. సీతారామలక్ష్మణులు చిత్రకూట పర్వతం మీద ఉన్నారు.

"నాయనా! రేపు బైలుదేరవచ్చును. భరతా! బుద్ధిశాలివి, కామార్థములు తెలిసిన వాడవి. ఉత్తమమైన ఆలోచనలు కలవాడివి. ఈ రోజు నీవూ నీ సమస్త పరివార జనమూ ఇచ్చట ఉండి వెళ్ళవలిసినది. ఈ రోజు నా ఆతిథ్యాన్ని స్వీకరించవలెను" చెప్పాడు భరద్వాజుడు.

ప్రాజ్ఞుడైన భరతుడు మహర్షి మాటలకి నమస్కరించాడు.

"స్వామీ! మీరు పాద్యమూ, అర్ఘ్యమూ, మంచి ఫలాలనూ ఇచ్చారు. ఇంకా ఆతిథ్యమేమిటి" అడిగాడు భరతుడు.

"నాయనా! నీవు నీ మంత్రులనూ, పరిజనాన్నీ దూరంగా ఉంచి వచ్చావు. నేను మీ అందరికి విందు సత్కారము చేయవలెనని అనుకుంటున్నాను."

"క్షమించండి మునివర్యా! తాపసుల ఆశ్రమం వైపు వెళ్ళేటప్పుడు రాజుల బలమూ, బలగాల వల్ల ఆశ్రమవనాలూ, ఫలవృక్షాలూ, పూల చెట్లూ, ఉదకములూ కొంత పాడుఅవుతాయి.

"రాజులు చతురంగ బలాలతో ప్రయాణించేటప్పుడు ఆశ్రమ పదాల నుంచి తప్పించి పోవలెనన్న శుక్రనీతితోనే అలా చేయవలసి వచ్చినది" చెప్పాడు భరతుడు.

"భరతా! నీ భక్తీ, గౌరవమూ అపారం. నీ చతురంగ బలాల వల్ల ఆశ్రమ పదం చెక్కుచెదరదు. మృగాలూ, పక్షులూ భయపడవు. కాన అందరినీ రమ్మను. అతిథి సత్కారము ద్వారా వచ్చు ఆనందాన్ని నేను పొందగోరుతున్నాను" చెప్పాడు భరద్వాజుడు.

మహర్షి ఆజ్ఞ మీద చతురంగ సేనలన్నింటినీ రమ్మన్నాడు. రాజు ఆజ్ఞ కాగానే ఏనుగులూ, గుర్రాలూ, పల్లకీలూ, పరిజనమూ మహాసముద్రంలా కదిలారు.

★★★ ★★★ ★★★

భరద్వాజుడు అగ్నిహోత్రగృహంలోకి వెళ్ళాడు. ఆచమనం చేసుకున్నాడు. అవయవములు పరిమార్జనము చేసుకొని అతిథి సత్కారం కోసం విశ్వకర్మని ఆహ్వానించాడు.





"భరతునకూ, ఆయన సేనలకూ ఆతిథ్యమివ్వదలచాను. యమ, వరుణ, కుబేరులైన ముగ్గురు లోకపాలకులారా! నా ఆతిథ్యంలో పాలు పంచుకోవలెను. అగ్నిహోత్రుడా నీవే సర్వకార్యాన్ని నిర్వహించవలెను.

"సమస్త లోకాల్లో ప్రవహించే నదుల్లారా! మీరూ ఇటు రావలెను. కొన్ని నదుల్లో మైరేయము, మద్యము ప్రవహించాలి. మరికొన్ని నదుల్లో చెరుకు రసం ప్రవహించాలి. ఇంకొన్ని నదుల్లో చల్లటి ఉదకము ప్రవహించాలి.

"చక్కటి అప్సరసలనూ, గంధర్వజాతి నాట్యకత్తెలనూ హాహా, హూహూలనీ, గంధర్వ జాతి అప్సరసలనూ, ఘృతాచీ, విశ్వాచీ, హేమా, అలంబుస, నాగదంతాలని రావలెనని కోరుతున్నాను.

"దేవేంద్రుడి కొలువూ, బ్రహ్మకొలువూ అప్సరసలనీ రమ్మని ఆహ్వానిస్తున్నాను. వారి గురువు తుంబురుడను రమ్మని ఆహ్వానిస్తున్నాను.

"మంచి పట్టు బట్టలూ, ఆభరణాలూ, పండ్లూ ఉత్తర కురుదేశంలో ఉన్న కుబేరుడి చైత్రవనం నుంచి పంపించాలని కోరుతున్నాను.

"ఓ చంద్రుడా! నీవూ రావలెను. చక్కటి అన్నాలనూ, రసాలనూ భక్ష్య, భోజ్య, లేహ్యాలనూ, మాంసాహారాలనూ నీవు సిద్ధం చేయవలెను. సమస్త ఔషధులకూ అధిపతివి నీవు. సుగంధ పరిమళాలు వచ్చే పూలూ, పూలదండలు నీవే ఏర్పాటు చేయవలెను."

భరద్వాజుడు తూర్పు దిక్కుగా తిరిగి, నమస్కరిస్తూ పేరు పేరునా ఆహ్వానిస్తూ ధ్యానించాడు.

ఆ మహాతేజోవంతుడూ, ఋషీశ్వరుడైన భరద్వాజుడు పిలువగానే ఎవరికి వారు వచ్చేశారు. మహర్షి కోరినట్టు చేయుట ప్రారంభించారు.

దివ్యమైన మేఘములు వచ్చి పుష్ప వర్షములు కురిపించాయి. చక్కటి దుందుభుల ధ్వని చేశాయి.

దేవగంధర్వులు గానం చేశారు. చంద్రుడు పరిమళాల సుగంధ భరితమైన పూలను కురిపించాడు. గాలి సుగంధాలలో కలిసి మలయ దర్దుర పర్వతాల మీదగా వచ్చింది. ఆ చల్లని గాలి హాయికి అంతా శ్రమని మర్చిపోయారు.

భరతుడి సైన్యమూ, పరిజనమూ ఆశ్చర్యంతో చూస్తుండిపోయారు. దివ్య దుందుభులు రమ్యంగా వినసొంపుగా, మృదువుగా వీణాది ధ్వనులలా మ్రోగుతున్నాయి.

ఏ వైపుకి చూసినా అయిదు యోజనాల వరకూ నేల సమంగా ఉంది. చక్కటి పూల తోటలతో, పనస, వెలగ, మామిడి చెట్లు కానవచ్చాయి.

మధ్య మధ్యలో అపూర్వమైన గృహాలు వెలిశాయి. బ్రహ్మాండమైన ఆసనాలు. దాని ప్రక్క దివ్యనదులు ప్రవహిస్తున్నాయి.

చక్కటి శయ్యలు... సింహాసనాలు... ఛత్ర తామరములు... స్నానాల కోసం చిన్న చిన్న సరస్సులు. ఆ ప్రక్క సేద తీరటానికి ఆసనాలు. బ్రహ్మ పంపిన ఇరవై వేల మంది అప్సరసలూ, కుబేరుడు పంపిన ఐదు వేల మంది అప్సరసలూ వచ్చారు. మహామహా మగవాండ్లకు మతి పోగొట్టే దేవేంద్రుడు పంపిన ఇరవై వేల మంది అప్సరసలు భరతుడి సైన్యం ఎదుట నాట్యం చేశారు. పురుషుడు ఉన్మత్తుమ్మడై మైమరచిపోయే అప్సరస స్త్రీలు నందనోద్యానము నుంచి వచ్చారు.

భరతుని ఎదుట అలంబుస, మిశ్రకేసి, పుండరీక, వామన అప్సరసలు నాట్యం చేశారు. నారదుడూ, తుంబురుడూ, గోపుడూ మహాకాంతి వంతమైన గంధర్వులూ సంగీతము ఆలాపించారు. అపురూప సంగీతమూ, దేవేంద్రుడి ఉద్యానవనంలోనూ, కుబేరుడి వనంలోనూ కాన వచ్చే పరిమళ పుష్పాలతోనూ అంతా ఉక్కిరి బిక్కిరయ్యారు.

దేవదారు వృక్షాలూ, కానుగ చెట్లూ, మల్లెలూ, జాజులూ, సన్నజాజులూ, విరజాజులూ స్త్రీలగా మారిపోయాయి. భరతుడి సైన్యం వద్దకు వచ్చాయి. మారేడు చెట్లు మృదంగాన్ని వాయించాయి. తాండ్ర చెట్లు తాళమును వేశాయి. రావి చెట్లు నర్తకులయ్యాయి.

*వాప్యో మైరేయపూర్ణాశ్చ మృష్టమాంసచయైర్వృతాః,*
*ప్రతప్తపిటరై శ్చాపి మార్గమాయూరకౌక్కుటైః.*

"సుర కావాలా! ఇదిగో, కావలిసినంత పాయసం కావాలా! అదిగో పాయస నది. వేడి వేడి మాంసాహారాలు, లేడి మాంసమూ, నెమలి మాంసమూ, కోడి మాంసమూ" అంటూ తినిపించాయి.

మద్యముతో నిండిన బావులూ, పరిశుభ్రమైన కుండలలో వేడి వేడి మాంసాహారాలు రాసులగా ఉన్నాయి. కొందరికి నలుగు పెట్టారు. మరి కొందరికి స్నానం చేయించారు. ఒక పురుషునకు ఏడు లేదా ఎనిమిది మంది తక్కువ కాకుండా నలుగు పెట్టి స్నానం చేయించారు.





అందమైన నేత్రములు గల అప్సరసలు ఒళ్ళు పట్టారు. వయసు కత్తెలు వయ్యారాలతో, మధుర రసాలతో, ఫల రసాలతో సైన్యం యావత్తును ఉక్కిరిబిక్కిరి చేశారు.

*తర్పితాః సర్వకామైస్తే రక్తచన్దనరూషితాః,*
*అప్సరోగణసంయుక్తాః సైన్యా వాచముదైరయన్.*

సమస్త భోగాలు రుచి చూసారు. ఎర్రచందనము పూసుకొని అప్సరసల తోటి ఉన్నారు.

దండకారణ్యమూ వద్దు, అయోధ్యా వద్దు. ఇక్కడే ఉంటాము. శ్రీరాముడూ, భరతుడూ హాయిగా ఉండాలి అనుకుంటూ, ఎగురుకుంటూ, తుళ్ళుతూ, త్రాగుతూ సుఖపడ్డారు అంతా. గంధం రాసుకొని మరీ సుఖించారు.

అప్సరసల మెత్తని చేతులతో ఎర్రగంధం అద్దించుకున్నారు. ధగధగలాడే వస్త్రాలను ధరించారు. ఏది ముందో ఏది వెనుకో చూడలేదు. దొరికింది దొరికినట్టు అనుభవించారు.

భరతుడి సైన్యంలో అంతా పరిమళ భరితమైన వస్త్రాలు ధరించారు. బాగా వండిన మేక మాంసమూ, వరాహ మాంసమూ, పంచదారతో చేసిన ఫలరసాలూ, నెమలి మాంసమూ, వాటికి చేరువులో కల్లు బావులూ, మద్యపు నదులూ, మత్తెక్కిపోయారు.

పాయస నదుల వద్ద నున్న ఆవులను అడుగుట ఆలస్యం కోరినవన్నీ ఇచ్చేస్తున్నాయి. ఒక సైనికుడు అనేక మంది అప్సరసలతో ఒక అప్సరస అనేక మంది సైనికులతో నృత్యం చేశారు.

మరోప్రక్క వేలకొద్దీ అన్నపు బానాలూ, శొంఠి వేసిన పెరుగు కుండలూ, వెలగ పండు వాసన మజ్జిగా, తేనెలో మాగేసిన పండ్లూ, వ్యంజనాలూ, చక్కెరతో పక్వమైన ఫలరసాలూ ఘుమఘుమలాడి పోతున్నాయి. వేల కొలది పాత్రలూ, లక్షలాది గిన్నెలూ, పది కోట్ల బంగారు పాత్రలూ చిన్న కుంభములు అన్నింటి నిండా హ్రదములు.

భరతుని పరిచారికుల కోసమూ, దాసీజనము కోసమూ, స్త్రీల కోసమూ పట్టుచీరలూ, అలంకార వస్తువులూ, కాటుక భరిణలూ, చక్కటి మెత్తటి శయ్యలూ. వాటన్నింటినీ అంతా అనుభవించారు.

వలపు చూపు వన్నెకాండ్లతో సైన్యం ఒళ్ళు తుడిపించుకున్నారు. కల్కములు, చూర్ణములు, కషాయములు లాంటి ఎన్నడూ చూడని స్నాన

ద్రవ్యములను చూశారు. అనుభవించారు. ఏకాంతంగానూ, బహిరంగంగానూ కలిసి సురాపానము చేసి మైమరచిపోయారు మరికొందరు...

గలాటా చేశారు. సమస్త భోగాలతో సంతృప్తులైయ్యారు.

మరోప్రక్క ఏనుగులకీ, అశ్వాలకీ చక్కటి మేతా, నీరూ పెట్టారు వాహనపాలకులు. ఎప్పుడూ తినని ఆ రుచికరమైన మేతను మామూలుకంటే రెండింతలు తిన్నాయి జంతువులు. స్వర్గమంటే ఏమిటో ఆ రోజు భరతుని సైనికులకు తెలిసింది. నందనోద్యాన వనంలో దేవేంద్రుడిలా ఆ రాత్రి క్రీడించారు.

తెల్లవారింది. అప్సరసలూ, దేవతలూ, గంధర్వులూ నదీ నదులూ, అన్నీ భరద్వాజుని వద్ద శెలవు తీసుకున్నాయి.

భరతుడి సైనికులు ఇంకా మత్తులోనే ఉన్నారు. నిదురిస్తూనే ఉన్నారు. వారి శరీరాలకి ఇంకా సుగంధ భరిత పూలదండలున్నాయి. అయితే అవి బాగా నలిగిపోయి ఉన్నాయి.

## భరద్వాజుడు నుంచి శెలవు

తెల్లవారింది. శ్రీరాముడి దర్శనానికై భరతుడు సిద్ధమయ్యాడు. భరద్వాజుని వద్దకు వచ్చాడు. అగ్నిహోత్ర కార్యం ముగించి కనులు తెరిచాడు. ముకుళిత హస్తాలతో నమస్కరించాడు భరతుడు.

"నాయనా భరతా! రాత్రి సుఖంగా సాగిందా! నీవూ నీ పరిజనమూ, దాసీ జనమూ, సైన్యమూ, నా అతిథ్యంతో సంతృప్తులైనారా!"

"మహర్షీ... రాత్రి అంతా ఓ ముహూర్తకాలంలా గడిచిపోయింది మా సైన్యానికి. అమృతం లాంటి పానీయలూ, దేవతల గృహాల్లో లభించే విందూ, సుఖమూ మా చతురంగ బలాలు అనుభవించాయి. ఆఖరకు గుర్రాలూ, ఏనుగులూ కూడ పూర్ణతృప్తిని పొందాయి.

"ధర్మం తెలిసిన ఓ మహామునీ... మీ అతిథ్యానికీ, అభిమానానికీ ధన్యవాదములు. నాకూ, నా పరివారమునకూ శెలవిస్తే సీతారామలక్ష్మణ దర్శనార్థమై సాగుతాం" చెప్పాడు భరతుడు.

"భరతా! శ్రీరాముడు చిత్రకూట పర్వతంపైనున్నాడు. ఇక్కడ్నించి రెండు అమడల దూరం. అదిగో ఆ దారిన ముందుకు వెళ్ళు. రమ్యమైన పర్వత శిఖరాలు కనిపిస్తాయి. ఆ చిత్రకూట పర్వతానికి ఉత్తర దిశగా పవిత్ర





మందాకినీ నది ఉత్తర పార్శ్వమున ప్రవహిస్తూ ఉంటుంది. చక్కటి రమణీయ మైన వృక్షాలు పువ్వులతోనూ, కాయలతోనూ కొమ్మలు వంగి పోయేలా విరగకాసి ఉంటాయి.

"ఆ నదికి అవతలి వైపున చిత్రకూట పర్వతాల సానువుల్లో ఓ పర్ణశాల నిర్మించుకొని ఉన్నాడు శ్రీరాముడు. కనిపించే మందాకినీ నది రమణీయ ప్రకృతి గల ఆ ప్రాంతంలోనే సీతారామలక్ష్మణులున్నారు.

"భరతా! ఆ ప్రదేశానికి దక్షిణ దిక్కునుంచి, లేదా నైఋతి దిక్కు నుంచి పోవచ్చు. నీ అపార సైన్యస్థితిని బట్టి ఏ బాటనో నీవు నిర్ణయించుకోవాలి" చెప్పాడు భరద్వాజుడు.

భరతుడు భరద్వాజునికి వంగి నమస్కరించాడు. భరతుని తల్లులు ముగ్గురూ రథం దిగారు. మహర్షికి నమస్కరించారు. శెలవిమ్మని కోరారు. పాదచారిణులై వచ్చిన వారిని భరద్వాజుడు ఆశీర్వదించాడు. భరద్వాజుని కోరికపై భరతుడు చెప్పాడు.

"మహానుభావా! ఉపవాసాలతోనూ, దుఃఖంతోనూ కృంగి సగమైన ఈ తల్లి శ్రీరాముడి మాతృమూర్తి కౌసల్యాదేవి. అయోధ్య పట్టపురాణి. అదితి కడుపున శ్రీమహావిష్ణువు వలే రఘురాముడు ఈ తల్లి కడుపునే జన్మించాడు.

"పూలు రాలిన చెట్టువలె.. శోక దేవతవలె ఉన్న ఈమె సుమిత్రాదేవీ అశ్వనీ దేవతల వంటి లక్ష్మణ శత్రుఘ్నులని కన్నది.

"ఇక ఈమె నా తల్లి. పురుషోత్తముడూ, లోకంలో ఎవ్వరి మనస్సు నొప్పించనివాడూ, లోకైక వీరుడూ, సత్యసంధుడైన శ్రీరాముడిని వరాల పేరుతో అడవులకి పంపిన క్రోధావతరం. సర్వ అనర్థాలకూ కారణభూతురాలు.

"సౌందర్యవతిననే అహంతోనూ, ఐశ్వర్యమధంతోనూ కట్టుకున్న భర్తని పరలోకానికి పంపిన పాపి. కేకయరాజు కూతురు కైక... నా అమ్మ..." కోపంతో పాముబుస కొట్టినట్టు చెప్పాడు భరతుడు. పుత్రుడు పలుకుల్లోని కోపానికి కైక విలవిలలాడిపోయింది.

"నాయనా భరతా! నీ మాటలు అన్న శ్రీరాముడు హర్షించడు నాయనా" చెప్పింది భరతునితో కౌసల్య.

భరద్వాజుడు ఆశీర్వదించాడు.

"నాయనా భరతా! నీ తల్లిలో దోషం ఉందని మరిచిపో... శ్రీరాముడు అడవికి వెళ్ళుటలో ఏ లోకకళ్యాణం దాగుందో... కాన నాయనా! శ్రీరాముడి

వనవాసం... దండకారణ్య మునులకూ, తాపసులకూ, దేవతలకూ మంచే చేస్తుంది. జగత్తుకు సుఖమే మిగులుస్తుంది."

భరతుడు భరద్వాజునికి ప్రదక్షిణం చేశాడు. సేనలకి ఆజ్ఞాపించాడు. పరివారం కదిలింది. సమస్తమూ దక్షిణం వైపు సాగాయి. కొండలూ, మృగాలూ, సర్పాలూ నిండిన అడవిని దాటారు. వారి చప్పుళ్ళకూ, మోతలకూ అడవిలో జంతువులూ, పక్షులూ భయపడ్డాయి.

ఉత్తర సముద్రం దక్షిణ దిక్కుగా వస్తున్నట్టు ఉంది భరతుని సేన.

☆☆☆ ☆☆☆ ☆☆☆

ఏనుగుల ఘీంకారాలకీ, రథఘోష ధ్వనులకూ గుహల్లోని ఎలుగు బంట్లూ, సెలయేరు దాపుల్లోని జింకలూ, దుప్పులూ భయంతో పరుగులు తీశాయి. వర్షాకాలంలో ఆకాశము మేఘాలతో నిండినట్టు, భరతుని సేన వస్తున్న ప్రాంతమంతా దుమ్మురేగి మొత్తం పరిసరాలే మసకబారి ఉన్నాయి.

భరతుని సైన్యం ఎంతో దూరం ప్రయాణించింది. రథ అశ్వాలూ, ఏనుగులూ, పెంటి ఏనుగులూ, మావటి వాళ్ళూ, సైన్యమూ, పరిజనమూ అలసిపోయారు. చిత్రకూట పర్వతమూ దగ్గరికొచ్చింది. నెమళ్ళు పురివిప్పుకొని బెదిరిపోవటం చూశాడు భరతుడు.

"శత్రుఘ్నుడా! మహర్షి భరద్వాజుడు చెప్పిన ఆనవాళ్ళూ అన్నీ సరిపోయాయి. అదిగో అదియే చిత్రకూట పర్వతము. దూరంగా కాన వస్తున్నది మందాకినీ నది.

"వర్షాకాలపు చినుకుల్లా ఆ పూల చెట్లు చూడు ఎలా పూలు రాలుస్తోందో... ఆ ఆడ జింకల గుంపు వెనుక మగ జింకల గుంపు ఎలా వెంటపడుతుందో.

"నాకు దేవతా సమానుడూ, గిరిలందూ, వనములందూ ప్రీతి కలవాడూ అగు శ్రీరాముణ్ని చూడవలెనన్న ఆత్రుత ఎక్కువవుతున్నది. అశ్వాలను వేగంగా కదిలించమని చెబుతాను" చెప్పాడు భరతుడు.

మరికొంత దూరం సాగిపోయారు. భరతుడు శత్రుఘ్నుడితో చెప్పాడు.

"శత్రుఘ్నా! ఈ ప్రాంతం రమణీయంగా ఉన్నది. ఇక్కడ విడిది చేద్దాం. ఈ లోగా ఈ ప్రక్కనెవరన్నా తాపసులు ఉంటే వార్ని విచారించి శ్రీరాముడున్న ప్రాంతాన్ని తెలుసుకోవాలి."





శత్రుఘ్నుడు కొంతమంది యోధులకి ఆ కార్యాన్ని అప్ప చెప్పాడు. వారు ఆయుధాలూ, కవచాలూ ధరించి అరణ్యంలోకి వెళ్ళారు. కొంతసేపటి తర్వాత భరతుని వద్దకు వచ్చారు.

"ప్రభూ! అడవిలో ఇక్కడ్నించి కనిపిస్తున్న ఆ దట్టమైన ప్రాంతానికి వెళ్ళాం. అక్కడ్నించి చూస్తే పొగలు పైకి లేవటం చూశాం. మీకు విన్నవిస్తున్నాం."

"తమ్ముడూ శత్రుఘ్నా! ఖచ్చితంగా అక్కడ తాపసులు అగ్నిహోత్రం చేస్తుండి ఉంటారు. నేను వశిష్ఠుల వారినీ, సుమంత్రుడ్నీ తీసుకొని వెళ్ళి వస్తాను. మేము వచ్చే వరకూ అందరూ విశ్రాంతి తీసుకొండి" చెప్పాడు భరతుడు. రాజు ఆజ్ఞ ప్రకారం చతురంగ సేనలు ఆగాయి.

## చిత్రకూట పర్వత సౌందర్యం

సీతారామలక్ష్మణులు చిత్రకూట పర్వతంపై ఆశ్రమం నిర్మించుకొని మాసం అయింది. శ్రీరాముడికి కొండలూ, శిఖారాలంటే మక్కువ. సీతాదేవితో కలిసి శిఖరాల మీద నుంచి వస్తున్న గాలిని ఆస్వాదిస్తున్నాడు.

"మంగళప్రదురాలగు సీతా! చిత్రకూట పర్వత అందాలను చూస్తుంటే అయోధ్య కూడా గుర్తుకు రావటంలేదు. ఈ పర్వతం ఎన్నో గైరికాది ధాతువులతో నిండి ఉంది. ఆకాశాన్నంటే శిఖరాలు. దూరం నుంచి ఆ శిఖరం కైలాసనాథుని వెండి శిఖరంలా అగుపిస్తున్నది కదూ!

"మరోశిఖరం పాదరసం రంగుతోనూ, ఇంకో శిఖరం బంగారు రంగుతోనూ మొగలి పువ్వు రంగుతోనూ కనులకు ఎంతటి ఆనందాన్ని ఇస్తోందో కదూ...

"వైదేహీ! అటు చూడు. పెద్ద పులులూ, చిరుత పులులూ గుహలోంచి ఎంత ఠీవిగా వస్తున్నాయో... అదిగో ఎలుగుబంట్లు పేరంటానికి వెళుతున్నట్టు ఎంత వడివడిగా వెళ్తున్నాయో...

"ఆ మామిడీ, నేరేడూ, వేగిస, పనస.. చంద్రా, ఊడుగూ... మోరటి, వెదురూ, గుమ్ముడూ, రేగూ, ఉసిరి, పేమూ, ఏరుమద్ది, నేరేడూ, వొద్దుగూ, తుమ్మికి చెట్లూ, ఇప్ప, పేము, దానిమ్మ లాంటి చెట్లకు లతలు ఎలా పెనవేసుకు పోయాయో... ఆషాఢం తర్వాత భర్తని చేరిన భార్యలా ఎంత బలంగా పెనువేసుకుపోయాయో కదూ! వాళ్ళ అనురాగంలా లతలకున్న పూలు చూడు. భర్త పరిష్వంతో పులకరించిన లలన శరీరాన్ని గుర్తుకు తెస్తోంది.

"గలగలసెలయేర్లతోనూ, పూటలతోనూ, సుగంధాలు వెదజల్లే పూలతోనూ గాలి కలిసి మెలిసి వీస్తున్నట్టు ఎంత హాయిగా తగులుతుందో చూడు. గుహల్లోంచి వస్తున్న గాలి, జాతి వైరం మరచి తిరుగుతున్న జంతువులూ ముద్దొచ్చే చిన్న చిన్న రంగుల పిట్టలూ, పూలు పూసేవి పూలూ, కాయలు కాసే చెట్లు కాయలూ, ఈ చిత్రకూట పర్వత శోభతో రెట్టింపు కాస్తున్నాయి. ఏ ప్రక్క చూసినా చల్లటి నీడనిచ్చే వృక్షాలు... ఆహా చిత్రకూట పర్వత సౌందర్యం అనుభవ పూర్వకంగా తెలుసుకొనవలిసినదే...

"సుందరీ! అదిగో అటుచూడు. కిన్నెర దంపతుల సయ్యాటలు. పర్వత నెత్తాలలో జంటలు జంటలుగా తిరుగుతున్నారు. ఈ ప్రక్కచూడు కళ్యాణీ ఆయుధాలనూ, ఆభరణాలనూ ప్రక్కనుంచి విద్యాధరులు ఎంత యథేచ్ఛగా విహరిస్తున్నారో...

"గుహలలోంచి వచ్చేగాలి, వింత వాసనతో మత్తెక్కిస్తున్నది కదూ... సీతా ఈ పర్వతంపై అనేక చోట్ల జలము ప్రవహిస్తుంటుంది. మరి కొన్ని చోట్ల నేలను చేధించుకొని జలము వస్తుంది. అందువల్లే ఈ చిత్ర కూట పర్వతము మదోకము స్రవించుచున్న ఏనుగులా మెరిసిపోతుంటుంది.

"సీతా! ఈ వనవాస కాలంలో రెండు పనులు పూర్తి అవుతాయి. ఒకటి తండ్రి మాట నిలబెట్టడం. రెండు భరతుడు సంతోషంగా రాజ్యం ఏలటము. రెండు చక్కటి ఫలాలు ఈ వనవాసం వల్ల నాకు లభించాయి.

"రాణీ! మనోవాక్కాయములకు అనుకూలమైన నీలమూ, పసుపూ, తెలుపూ, ఎరుపూ, రంగులలో వందల కొలది రాళ్ళు... ఈ చిత్రకూట అందాన్ని రెట్టింపు చేస్తున్నాయి.

"సీతా! పర్వత శ్రేష్ఠమైన ఈ చిత్రకూట పర్వతం ఔషధులు రాత్రి యందు తమ కాంతితో అగ్ని శిఖల్లా మెరుస్తుంటాయి. నల్లకలువలూ, పద్మదళాలూ, పద్మమాలికలూ, దుంపలూ,సెలయేళ్ళూ, మహావృక్షాలూ, పూల వనాలూ, ఆహా అలకా పట్టణాన్నీ, సౌగంధిక సరస్సునీ, మానససరోవరాన్నీ ఈ చిత్రకూట పర్వత శోభ మైమరిపిస్తోంది.

"కాముకులు ఈ పర్వతంపై కుష్ఠ, స్థగర, పున్నాగ, భూర్జ వృక్షముల ఆకులనూ, పద్మములనూ పరిచి చక్కటి శృంగార శయ్యలు ఏర్పరుచుకుంటారు. అదిగో ఆ ప్రక్క చూడు. కాముకులు నలిపిన పద్మములూ, మాలలూ...





"వనవాసం వల్ల దేహాంతాన స్వర్గసుఖము అన్నారు రాజర్షులు... భామినీ... ఇక్కడ పూసే పూలు పెట్టుకుంటూ, ఫలాలు ఆరగిస్తూ మందాకినీ నదిలోనూ, సెలయేరుల్లోనూ స్నాన జపాలు చేస్తూ... నీతోనూ, లక్ష్మణుడితోనూ పధ్నాలుగేళ్ళు పధ్నాలుగు క్షణాల్లా గడిచిపోతాయనిపిస్తోంది. పంచేంద్రియాలనూ పరమానందభరితం చేస్తున్న చిత్రకూట పర్వతం రమణీయం. సుందరం. మనోహరము" దేవేంద్రుడు శచీదేవికి చెబుతున్నట్టు శ్రీరాముడు వైదేహికి చెప్పాడు.

★★★ ★★★ ★★★

పద్మమువంటి నేత్రములు కల శ్రీరాముడు సీతాదేవికి చిత్రకూట పర్వత శోభను చెబుతూ కొండని దిగుతున్నాడు. మందాకినీ నదిని సమీపించారు. కలువరేకుల వంటి కన్నులతో, చందమామలాంటి ముఖముతో ఉన్న సీతతో చెప్పాడు.

"సఖీ! సీతా! ఈ మందాకినీ నది ఇసుక తెన్నెలు చూడు. నీ నితంబాల వలె ఉన్నాయి. ఆ హంస, సారస కూజితాలు విను, నీ పలుకులవలే శ్రావ్యంగా ఉన్నాయి. సుందర కమలాలు చూస్తుంటే నీ వదనమే కానవస్తోంది.

"సీతా! ఈ మందాకినీ నది కిరువైపులా ఉన్న చెట్లు ఎలా పూలు రాలుస్తున్నాయో చూడు.... మందాకినీ నది ప్రవాహపు నాట్యం చేస్తుంటే పూల చెట్లు మైమరచి హర్షధ్వనులతో పూలును నదిలో రాలుస్తున్నట్టుగా ఉంది.

"ఫల, వృక్ష, పూల, సెలయేర్లతో కుబేరుడి సౌగంధిక సరస్సు వద్ద ఉన్నట్టు అనిపిస్తోంది.

"సీతా! ఇప్పుడే ఎన్నో జంతువులు స్నానం చేసి, నీళ్ళు త్రాగి వెళ్ళి ఉంటాయి. కొబ్బరినీరులాంటి మందాకినీ నది ఇక్కడ ఎలా బురదగా మారిందో...

"సీతా! ఇది స్నాన సమయం. అదిగో మునులు సూర్యునికి నమస్కరిస్తున్నారు. ఋషులు అవగాహన స్నానం చేస్తున్నారు. ఇంతటి రమ్యదృశ్యాన్ని చూసి అక్కడి చెట్లు చూడు. ఆ పర్వత శిఖరాన ఉన్న చెట్లు పై నుంచి ఈ చిత్రకూట పర్వత అందాలని చూసి తన్మయంతో నాట్యం చేస్తున్నట్టు ఎలా ఊగుతున్నాయో...

"సీతా! నదిలో పడ్డ పూలు అన్నీ ఒక్కటిగా చేరి, నీటి మీద పూల తెప్పవలే ఎలా ముందుకు సాగుతున్నాయో... ఆ దృశ్యాన్ని చూస్తుంటే ప్రియుడ్ని అతుక్కుపోతూ ప్రియురాలు చీరని దూరంగా విసిరేసినట్లుంది కదూ...

"సీతా! మందాకినీ నది పవిత్రమైనది. పుణ్యమైనది. ఈ నదిలో స్నానమాచరిద్దాం. నీ నెచ్చెలితో ఉన్నట్టే నాతోనూ జలకమాడవలెను. బెదురు వద్దు. నీ కన్నుల వంటి తామరలు గల అక్కడ స్నానం చేద్దాం. ఎర్రతామరలు వంటి నీ చేతులతో నా పై నీళ్ళు చిమ్మవలెను. అది చూసి తెల్లతామరలూ, ఎర్రతామరలూ సిగ్గుపడాలి.

"జానకీ! చిత్రకూటమే అయోధ్య. మందాకినీ నదే సరయూ నది. ఈ చెట్లూ, చేమలే మన సేవకులు. జంతువులే అయోధ్యా వాసులు. సీతా! రోజూ మూడుసార్లు స్నానం చేస్తూ ఈ మధుర ఫలాలను ఆరగిస్తూ, చిత్రకూట పర్వతం మీదే నీవూ, నేనూ, లక్ష్మణుడూ హాయిగా గడుపుదాము" సీతాదేవితో చెప్పాడు శ్రీరాముడు.

★★★ ★★★ ★★★

సీతారాములు చాలాసేపు మందాకినీ నదిలో స్నానం చేసి పర్ణశాలకి వచ్చారు. శిఖరం మీద కూర్చున్నారు. శ్రీరాముడు సీతాదేవికి ప్రేమగా, ఆర్తిగా అందించి చెప్పాడు.

"జానకీ, నిప్పులతో కాల్చిన లేత మాంసం. చాలా రుచిగా ఉంటుంది.

***తాం తథా దర్శయిత్వా తు మైథిలీం గిరినిమ్నగామ్.***

***నిషసాద గిరిప్రస్థే సీతాం మాంసేన ఛన్దయన్.***

సీత ఆప్యాయంగా తీసుకుంది. లక్ష్మణుడు ఆశ్రమం బైట నుల్చొని చుట్టూ పరికిస్తున్నాడు.

ఆకాశంలో దుమ్ము రేగింది. ఆ క్షణంలో ఏనుగుల అరుపులు, వాటితో పాటు అడవిలో జంతువులు పిచ్చి పట్టినట్టు కదిలినట్టు, అక్కడక్కడా పొదలు ఊగిపోయాయి.

శ్రీరాముడు ఆ ధ్వనులు విన్నాడు. శ్రీరాముడు పర్ణశాల నుండి బైటికొచ్చాడు.

"లక్ష్మణా! ఏమిటా గర్జనలు. జింకలూ, దుప్పులూ, అన్నీ ఎందుకలా భయంతో పరుగులు తీస్తున్నాయి" అడిగాడు శ్రీరాముడు.





లక్ష్మణుడు సమాధానంగా దగ్గరిలోని ఆకులు లేని పెద్ద వృక్షాన్ని ఎక్కాడు. పరికించాడు. ఉత్తర దిక్కున అపార సైన్యము కనిపించింది. ఏనుగుల మీద, రథాల మీద జెండాలని చూశాడు. ప్రాను కొమ్మలు గల కోవిదార వృక్షము రథ జెండాలపై రెపరెపలాడుతూ ప్రకాశిస్తోంది.

కోపంతోనూ, రోషంతోనూ శ్రీరాముడికి చెప్పాడు.

"భరతుడు! చతురంగ బలాలతో వస్తున్నాడు. రాజ్యాన్ని నిష్కంటకము చేసుకోవటానికే సైన్యంతో వస్తున్నాడు. భరతుడు క్షమార్హుడు కాదు. వనవాసంలో ఉన్నా విడిచిపెట్టుట లేదు. ఆజ్ఞ అయితే సైన్యం సర్వాన్నీ సమూలంగా నాశనం చేస్తాను. నీవూ, సీతమ్మ గుహలోకి వెళ్ళండి.

"తన రాజ్యాము పధ్నాలుగేళ్ళ తర్వాత కూడా వీడిపోగూడదని భరతుడు రథికులతోనూ, గుర్రాల మీద రౌతులతోనూ, పదాతులతోనూ వస్తున్నాడు. నా బాణాలకూ, ధనుస్సుకూ పనిపెడతాను. వాయువేగంతో వచ్చే గుర్రాల కన్నా వేగమైన నా బాణ పరంపరతో చిందరవందర చేస్తాను.

"అన్నా! రామా! ఆజ్ఞాపించు. వధ్యుడూ, శత్రువూ, అధర్ముడూ అయిన భరతుడ్ని సంహరిస్తాను. తన కుంభ స్థలంతో మహా వృక్షాన్ని ఏనుగు పడగొట్టినట్టు భరతుడ్ని కూలుస్తాను. అగ్గి ఎండు గడ్డిని ఆవహించినట్టు, భరతుడి రక్తం, అపారసైన్య రక్తంతో చిత్రకూట పర్వత రూపు రేఖలని మారుస్తాను. ఈ అడవిలోని జంతువులకి ఎన్నో రోజుల ఆహారాన్ని అందిస్తాను" చెప్పాడు భరతుడు.

"లక్ష్మణా! ఆవేశంలో యుక్తాయుక్తులు మరిచిపోతున్నావు. వచ్చేది మన సోదరుడు. నాకు ప్రియ తమ్ముడు. నీవూ, భరతుడూ, శత్రుఘ్నుడూ నా ప్రాణములు. గిరివ్రజపురం నుంచి అయోధ్య వచ్చి జరిగింది తెలుసుకొని దుఃఖంతో కైకని నిందించి ఇక్కడికి వస్తుండుంటాడు.

"భరతుడు మనసులో కూడా అప్రియము తలపెట్టడు. ఎన్నో సంవత్సరాలు భరతునితో, శత్రుఘ్నునితో కలిసి ఉన్నాం. ఆడాం. పాడాం. ఏనాడైనా భరతుడు పౌరుషంగానూ, ఆవేశంగానూ ప్రవర్తించడా! ధనుర్ధరుడూ, బుద్ధిశాలీ అయిన భరతుడిని మనం ఆహ్వానించవలిసినది ఆయుధాలతో కాదు."

శ్రీరాముని మాటలతో లక్ష్మణుడు సిగ్గుపడ్డాడు. "తండ్రిగారు వస్తున్నారేమో. అన్నా రామా! అదిగో తండ్రిగారి శత్రుంజయము. వాయువేగంతో

పరిగెత్తే అశ్వాలు. శ్వేతచ్ఛత్రము కనిపించుటలేదు" చెప్పాడు లక్ష్మణుడు. భరతుని సేన దగ్గరికి వచ్చింది.

భరద్వాజుడు చెప్పిన ఆనవాళ్ళు, పొగ వస్తున్న ప్రాంతం పరిశీలించాడు. సరిపోయాయి. వెనక్కి వచ్చి చతురంగ బలాలని బైలుదేరమని ఆజ్ఞాపించాడు.

## శ్రీరాముని దర్శనం

సీతారామలక్ష్మణుల పర్ణశాలకి ఒకటిన్నర యోజనల దూరంలోనే భరతుడు ఆగాడు. చతురంగ సేనలతో పర్వతం ఎక్కరాదని చెప్పాడు. వార్ని అక్కడే ఉండమన్నాడు.

"శత్రుఘ్నూ! ఆ పర్వతాలు బహు విశాలంగానూ, కిక్కిరిసి ఉన్నాయి. శ్రీరాముని పాద స్పర్శతో చిత్రకూట పర్వతం భాగ్యము అయినది" చెప్పి నడిచాడు తన మంత్రులతో... కొంత దూరం వెళ్ళాడు. పొగ కనిపించింది. సాల వృక్షాన్ని ఎక్కి చూశాడు. ఈశాన్యము పల్లంగా విశాలంగా ఉంది. ఆ ప్రదేశంలో శ్రీరాముని పర్ణశాల అగుపించింది. వంట కోసం తెచ్చిన వంట చెరకూ, పూజ కోసం తెచ్చిన పూలు ఉన్నాయి. ఆవరణలో ఆశ్రమం అగ్నిహోత్రం నుంచి పొగ వస్తోంది. తన తల్లులనూ, మంత్రులనూ వెనుక రమ్మని వశిష్ఠ మహర్షిని వెనక్కి పంపాడు. వడివడిగా వెళ్ళాడు.

భరతుడికి శ్రీరాముడని చూస్తాననుకోగానే ఒళ్ళు పులకరించింది. నది అవతలి ఒడ్డు చేరిన ఈతగాడివలే సంతసించాడు. తాటి, మద్ది ఆకులతో ఉన్న ఆశ్రమం. దర్భాసనాలున్నాయి. వజ్రాయుధం లాంటి ధనుస్సులున్నాయి. సూర్యుని తేజస్సుతో తూగేలా ఉన్నాయి. ఈశాన్యంలో అగ్నిహోత్రం మండుతోంది. మందాకినీ నది నిశ్శబ్దంగా ప్రవహిస్తోంది. సింహం గుహని గుర్తుకు తెస్తోంది. శ్రీరాముడ్ని చూడాలని పరిగెత్తే నడక నడిచాడు. శత్రుఘ్నుడూ, సుమంత్రుడూ భరతుడ్ని అనుసరించారు.

ద్యుతిమంతుడు భరతుడు శ్రీరాముడ్ని చూశాడు.

ఆ తేజోవంతుడూ, మహర్షి సదృశుడూ, విశాలాక్షుడూ, ధర్మపరాయణుడూ నల్ల జింక తోలును ఉత్తరీయంగా కప్పుకున్నాడు. వల్కలాలు ధరించాడు. దర్భలు పరిచిన వేదిక మీద సీతా లక్ష్మణులు సేవిస్తుంటే సాక్షాత్తు బ్రహ్మ దేవుడిలా కూర్చొని ఉన్నాడు.

దుఃఖంతో పరుగున వచ్చి శ్రీరాముడి పాదాల మీద పడ్డాడు.





"అన్నా! శ్రీరామా! జరిగిన ఘోరంలో నా పాలు ఏమీ లేదు. ప్రతి విషయము నాకు కోసల ప్రజలందరికీ తెలిసిన తర్వాతే తెలిసింది. నా తల్లి చేసిన దానికి నన్నూ, కోసల దేశాన్నీ దండించకు. నీవు అయోధ్యకి రావాలి. నేనూ, తల్లులమూ, అపార సైన్యమూ, పురజనమూ ఒక్కమాటతో వచ్చాం..."

శ్రీరాముడు భరతుడ్ని లేవనెత్తి కౌగిలించుకున్నాడు. శిరస్సు నిమిరాడు. శత్రుఘ్నుడు రాముడి పాదాలకి నమస్కరించి, లక్ష్మణుడను కౌగిలించుకొని కన్నీరు పెట్టాడు. శ్రీరాముడు తమ్ములని ఓదార్చాడు.

తండ్రిగారి గూర్చి, తల్లుల గూర్చి కుశలం అడిగాడు శ్రీరాముడు.

"భరతా! నిన్ను చూశాను సంతోషంగా ఉంది. అశ్వమేథయాగాలు చేసిన తండ్రిగారిని బాగా సేవిస్తున్నావా? వశిష్ఠ మహర్షులవారు కుశలమే కదా! అమ్మ కౌసల్యా, సుమిత్రా సుఖంగా ఉన్నారా. అనురాగవతి కైకా మాత క్షేమమే కదా! పురోహితుడి పుత్రుడు సుయజ్ఞుడూ, మహాశాస్త్రాలు తెలిసిన సుధన్వుడూ కుశలమే కదా! రాజ్యపాలన బాగా చేస్తున్నావా!

"అర్హతలున్న వారికే అధికారాలు అప్పగిస్తున్నావా? చేతకాని వారిని ఎంతమందిని వదులుకున్నా పర్వాలేదు. సమర్థుడ్ని ఒక్కడ్ని కూడా వదలకూడదనే రాజనీతిని పాటిస్తున్నావా?

"ఎవరి స్థాయికి తగ్గ కార్యాలు వారికే అప్పగిస్తున్నావా? సైన్యానికి ఇవ్వవలిసిన వసతులూ, జీతాలూ, సరైన సమయానికే ఇస్తున్నావా? వ్యవసాయం చేసేవారూ, గోరక్షణ చేసేవారూ, వైశ్యలూ సుఖంగా ఉన్నారు కదా.

"ప్రజలకి కఠిన శిక్షలు విధించి రాజ్యంపైన ద్వేషం కలిగించుట లేదు కదా! పన్నులన్నీ సరళంగానే విధిస్తున్నావా! పన్నులు అధికంగా వేస్తే పడతి అనుమతి లేకుండా మీద పడ్డ పురుషుడిగా చూస్తారు రాజుని ప్రజలు.

"కుటిలత్వం కలవారినీ, నిందించేవారినీ, ఐశ్వర్యకామంతో ఉన్న వారినీ దూరంగా ఉంచుతున్నావా? శూరులనూ, వీరులనూ, యుద్ధాల్లో ఆరితేరిన వారికి సైన్యంలో తగు అధికారమిచ్చి గౌరవిస్తున్నావా?

"సామంతరాజులందరినీ ఓ కంట కనిపెడుతున్నావా? అన్నీ శాఖలకి ముగ్గురు రహస్య గుఢచారులని నియమించి ఎప్పటి కప్పుడు మంచి చెడులను కనుక్కుంటున్నావా? నీ నుంచి దూరంగా పారిపోయిన శత్రువులు మళ్ళీ తిరిగి వస్తున్నారేమోనని చూసుకుంటున్నావా!

"బ్రాహ్మణులని అర్హతకి మించి సేవించవద్దు. పండితులనే అహం కారంతో ధర్మశాస్త్రాలనూ వదిలేసి తర్కంతో కాలాన్ని మింగేస్తారు. వారిని యజ్ఞాలకీ, యాగాలకీ, దానాలకీ పరిమితం చేస్తున్నావా?

"అంతఃపుర మర్యాదలు పాటిస్తూ, అంతఃపుర స్త్రీలు మర్యాదగా ఉంటున్నారో లేదో గమనిస్తున్నావా? స్త్రీలతో మంచిగా ప్రవర్తిస్తున్నావు కదా! వారి మాటలను నమ్మట, రహస్యములు చెప్పుట చెయ్యటలేదు కదా! అట్టివారి మాటలు నమ్మరాదు. విశ్వసించరాదు.

"ఏనుగుల పుట్టినిల్లు నాగవనం. అక్కడ మగ ఏనుగులని ఆకర్షించే ఆడ ఏనుగులు పుష్కళంగా ఉన్నాయా.... ఉన్నవి చాలునని తృప్తి చెందుట లేదు కదా! మంత్రులందరూ పక్షపాతం లేకుండా ప్రజల్ని చూస్తున్నారా! సుఖానికీ, కామానికీ లొంగేవాళ్ళని మంత్రాగం నుంచి దూరంగా ఉంచుతున్నావా? ఉదయము ధర్మం, మధ్యాహ్నం అర్థం, రాత్రికి కామం అనుసరిస్తున్నావా!

"వేటా, జూదమూ, పగలు నిద్రా, పరులపై నిందలూ, స్త్రీ కోరికలూ, అహం, నృత్యమూ, గీతమూ, వాద్యమూ, పనులొదిలేసి తిరగటమూ, వీటికి దూరంగా ఉంటున్నావా?

"భరతా! ధర్మం వదలి అర్థం... అర్థం వదిలి ధర్మం ఆర్జించవలదు. అర్థం, కామం, ధర్మం... ఆయా కాలాల్లోనే అనుభవించాలి. మంత్రులందరితో కలిసి చర్చించి, ఆపై విడివిడిగా అభిప్రాయాలను తీసుకొని రాజ్యపాలన చేస్తున్నావు కదా! మృష్టాన్నం ఒంటరిగా తినవుకదా? మధురమైన పదార్థములను నీ మిత్రులతో కలిసి భుజించుచున్నావు కదా?

"భరతా! ఇవన్నీ కీర్తి, దీర్ఘాయువు కలిగించేవి. మన ముందు తరపు యశస్సులు రాజ్యాన్ని జనరంజకంగా పాలించారు. ఎనలేని కీర్తి సంపాదించారు. అన్నీ ధర్మగుణాలతో పరిపాలించిన రాజు ఈ లోకానికి రాజాధిరాజు. సర్వ సుఖాలు అనుభవించి స్వర్గానికి వెళతాడు."

"అన్నా రామన్నా! ధర్మానికి దూరమైన నాకు, ధర్మ విహీనమైన నాకు రాజ ధర్మములెందుకు... నేను అయోధ్య రాజుని కాదు...

"అన్నా రామన్నా! జ్యేష్ఠపుత్రుడే రాజు. ఆ ధర్మం ప్రకారం నీవు అయోధ్య రావాలి. రాజ్యం ఏలాలి. ఇది నా మాట, కోసల దేశపు పౌరులందరి మాట. మన్నించి అయోధ్య రావాలి.





"కేకయ దేశంలో మేం ఉండగా నీవూ, లక్ష్మణుడూ అడవులకి వెళ్ళినప్పుడు అనేక యజ్ఞాలు చేసిన పూజ్యుడు మన తండ్రిగారు స్వర్గస్థుడైనారు. దశరథుడు లేని రాజ్యం ఇప్పుడు ఏకాకిలా ఉంది. దివంగతుడైన తండ్రిగారి ఆత్మశాంతి కోసం అయోధ్య వచ్చి పట్టాభిషేకం చేసుకోవాలి. వరాలడిగిన నా తల్లి మాట కూడా ఇదే"

"తండ్రిగారు దివంగతులయ్యారా!" శ్రీరాముడు మొహంలో కాంతి మాయమైంది. బాధా వీచికలు తాండవం చేశాయి. లక్ష్మణుడు దిగ్భ్రాంతి చెందాడు. సీత మనసు విలవిలలాడింది. శ్రీరాముడి వద్దకు వచ్చి చేయి పట్టుకుంది.

"రామన్నా! తండ్రిగారికి మీరిరువురూ జల తర్పణాలు వదలవలెను. పితృలోకములలో ఫలప్రదాలు అయ్యేలా చూడాలి. అన్నా శ్రీరామా! నీ గూర్చి అడిగి, విలపించి, కృంగి, కృశించి మరణించారు. చివర క్షణాన కూడా రామా! రామా! అంటునే కాలం చేశారట" చెప్పాడు భరతుడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

శ్రీరాముడు దశరథుని మరణ వార్తతో దిగాలు పడి ఉన్నాడు. మహా పిడుగువలె విన్పించిన ఆ మాటను తలుచుకొని దుఃఖిస్తున్నాడు. గుండెల మీద ఆటాడించుకున్న తండ్రి లేడని తెలిసి చింతా సాగరంలో పడ్డాడు.

శ్రీరాముడి స్థితి చూసి సీతాదేవి కన్నులలో నీళ్ళు తిరిగాయి. సుమంత్రుడు కదిలి రామలక్ష్మణులను అపరక్రియల కోసం మందాకినీ నదీ తీరానికి తీసుకెళ్ళాడు.

శ్రీరాముడు దక్షిణం వైపు ఉండి దోసిళ్ళతో నీళ్ళు తీసుకున్నాడు.

"తండ్రీ! ఆ లోకాల్లో ఉన్న నీకు ఈ తర్పణాలు తృప్తిని అక్షయ సుఖాన్ని కలిగించాలి" అంటూ నీళ్ళు విడిచాడు. నది ఒడ్డుకు వచ్చి గారచెట్టు తెలగ పిండిని, రేగుపండ్లుతో ముద్దలు చేశాడు. దర్భలు పరిచి పిండాలు పెట్టాడు.

"తండ్రీ! ఇదే నా ఆహారం... ఎవరికి ఏది ఆహారమో అదే అర్పించాలి" అని పిండప్రదానము చేసి పర్ణశాల చేరాడు. భరతుడ్నీ, లక్ష్మణుడ్నీ, శత్రుఘ్నుడ్నీ అక్కున చేర్చుకున్నాడు.

భరతుడి వెంట వచ్చిన జనులు రాముడుని సముదాయించారు. శ్రీరాముడు బంధువులనూ, సన్నిహితులనూ పలకరించాడు.

## కౌసల్యాదేవి శ్రీరాముని వద్దకు వచ్చుట

వశిష్ఠమహర్షి కౌసల్యాదేవినీ, సుమిత్రాదేవినీ, కైకేయీదేవినీ తీసుకొని శ్రీరాముని వద్దకు బైలుదేరాడు. దారిలో శ్రీరామలక్ష్మణులు స్నానం చేసే మందాకినీ నది ఒడ్డుకు వచ్చారు.

విశాల కోసల దేశపురాజు, అడవిలో ఆ పరిసరాల్లో తాపసులవలే జీవిస్తుండటం చూసి కౌసల్య కన్నీళ్ళు పెట్టుకుంది. దశరథ పత్నులు శ్రీరాముడు పెట్టిన గారచెట్టు తెలగపిండి పిండాలు చూశారు.

“దేవేంద్రుడి సంపదతోనూ, ఐశ్వర్యంతోనూ తులతూగిన చక్రవర్తి దశరథుడు. ఆయనకి పెట్టిన గారపిండి పిండాలు చూడు. మహా సముద్రాల మధ్య నున్న భూమి మొత్తాన్నీ ఏలాడు. చివరకు గారపిండి తినాల్సివచ్చింది. ఆ లోకాన ఉన్న ఆయన ఎలా తిన్నారో” బాధపడింది కౌసల్య. సుమిత్రా, కైకేయీ దేవీలు కళ్ళు ఒత్తుకున్నారు.

తల్లులను చూడగానే శ్రీరాముడు లేచాడు. మాతలకు వందనము చేశాడు. సీతాదేవి అత్తలకు నమస్కరించింది. అశ్రువులు కారుస్తూ నిల్చుంది. లక్ష్మణుడి శిరస్సును ముద్దాడింది సుమిత్ర.

“అమ్మా సీతా! జనక మహారాజు కూతురివి. దశరథ మహారాజు కోడలివి. సాక్షాత్తు లక్ష్మీదేవివి. ఎంత కష్టం వచ్చిందమ్మా. ఇది చూడటానికా నేను ఇంకా జీవించి ఉంది. అగ్ని రెల్లుగడ్డిని కాల్చినట్టు దుఃఖం నన్ను దహించి వేస్తోంది” కౌసల్య సీతను కూతుర్ని కౌగిలించుకున్నట్టు కౌగిలించుకొని అంది.

శ్రీరాముడు వశిష్ఠమహర్షికి నమస్కరించాడు. మునివేష రూపంలో ఉన్న సత్యమైన ధర్మం గల శ్రీరాముడు వద్ద వినయంగా బ్రహ్మదేవుడి ముందు నుల్చున్న దేవేంద్రుడిలా భరతుడున్నాడు.

రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులని చూసి బంధువులూ, పుర ప్రముఖులూ, మంత్రులూ ఆనందభాష్పాలు రాల్చారు. యజ్ఞగుండంలోని అగ్ని తేజస్సుతో వెలిగిపోతున్నారు అన్నదమ్ములు.

## భరతుని విన్నపము

ఆ రాత్రి క్షేమసమాచారాలతో అతిభారంగా గడిచింది. తెల్లవారింది. హోమ జపాదులు పూర్తి అయ్యాయి. శుభలక్షణములు గల మహాత్ముడైన భరతుడు శ్రీరాముని వద్దకు వచ్చాడు.





“అన్నా! శ్రీరామా! మన తండ్రిగారు నీవు కానలకు వెళ్ళావన్న శోకంతోనే పరలోకాన్ని చేరారు. దేవతల రాజు దేవేంద్రుడివలే నీవూ ఈ భూమండలానికి పట్టాభిషిక్తుడవ్వాలి. నా తల్లి కైకేయీదేవి కోసం, అపకీర్తి కలుగకుండట కోసం తండ్రిగారు తలవంచారు. అందరినీ అన్యాయం చేసి వెళ్ళిపోయారు. శ్రీరామా! నేను నీ దాసుడను.

“ఇంతమంది ఇంత దూరం వచ్చినది దానికోసమే. కాన అనుగ్రహించు. మన వంశ గౌరవాన్ని కాపాడు. దశరథుడు లేని కోసల రాజ్యము మళ్ళీ శరద్రాత్రివలే ప్రకాశించాలంటే నీ పట్టాభిషేకం జరగాలి. ఈ భూమండాలన్ని శోభింప చేయాలి.

“రామా! ఇది నా మాట. అమ్మల మాట. తరతరాలుగా ఇక్ష్వాకు వంశాన్ని సేవిస్తున్న మంత్రుల మాట. పురజనుల కోరిక... పెక్కు్రరకు ఇష్టమైన కార్యం... కాదనరాదు” అంటూ శ్రీరాముడి పాదాలు పట్టుకున్నాడు.

శ్రీరాముడు భరతుడ్ని లేపి చెప్పాడు.

“భరతా! ఇందు నీ ప్రేమేయము ఏమీ లేదు. అట్లే తల్లి కైకేయీదేవిది కూడా. మహాప్రాజ్ఞుడవు. సౌమ్యుడవు. వల్కలాలు ధరించి వనవాసము చెయ్యాలని తండ్రి ఆజ్ఞ. నీవు పట్టాభిషిక్తుడవు కావాలన్నది అభిమతం. తండ్రి మాటంటే ఎంత గౌరవమూ, భక్తో అట్లే నా తల్లుల ఆజ్ఞలు కూడా... కోసల రాజు నా భాగంగా అడవులకి వెళ్ళమన్నాడు. ఆజ్ఞాపించాడు.

“ధర్మాత్ముడు. రాజు... అంతకు మించి తండ్రిగారు. తండ్రిగారు చెప్పినట్టు పధ్నాలుగు సంవత్సరాలు వనవాసం చెయ్యవలిసినదే నాయనా” చెప్పాడు శ్రీరాముడు.

శ్రీరాముడు కాదనటంతో భరతుడు దుఃఖం పట్టలేకపోయాడు.

“భరతా! అంతా దైవికం. పండిన పండు నేలరాలక తప్పదు. మహాభవనాలు కూడా కాల గర్భంలో కలిసిపోవాల్సిందే. సముద్రాన్ని చేరిన నీరు మళ్ళీ వెనక్కి రాదు. కాన నాయనా తల్లిపై కోపం తగదు. ఎంత గొప్పవారికైనా చివరకు మరణం తప్పదు. మన తండ్రిగారూ అంతే మృత్యువుకి కారణం కావాలి. అంతే...

“భరతా! కోసల వెళ్ళు. యాథేచ్ఛగా ధర్మాపాలన కావించు. తండ్రీ, తల్లీ కోర్కె తీర్చుట కన్నా సృష్టిలో పరమ ధర్మము లేదు. ఓ చిన్న మొక్క

నాటితే అది పెరిగి పెద్దదవుతుంది. కొమ్మలొస్తాయి, చిగురిస్తుంది. విశాల వృక్ష మౌతుంది. పూలూ, కాయలూ కాయకపోతే ఫలమెందుకు. మొక్క నాటిన వారి కష్టమూ, సంతోషమూ, బాధా ఆలోచించు.

"తల్లి కైకేయీదేవి కోర్కె తీర్చు. తండ్రి గూర్చి దుఃఖం మాను. రోజు గడిచే కొద్ది రాత్రి అవుతుంది. మళ్ళీ పగలవుతుంది. కానీ ఎవరూ మృత్యువుకి దగ్గరవుతున్నామని అనుకోరు. రాత్రి అయితే భోగాలు, తెల్లారితే బాధ్యతలు. మనిషిగా జన్మించాక ధర్మం పాటించక తప్పదు.

"శరీరం ముడతలు పడి, పళ్ళు ఊడిపోయి, వెంట్రుకలు తెల్లబడి ముసలి తనం వచ్చాక చూడాల్సింది మృత్యువు కోసమే. పొద్దుగూకితే సూర్యుడు అస్తమిస్తాడు.

"మనిషీ అంతే, ఎవరి పొద్దు పూర్తి అయితే వాళ్ళు అస్తమిస్తారు. నాయనా భరతా! దారి చెప్పటానికే మన పూర్వీకులున్నది. వారిని ఆదర్శంగా తీసుకొని రాజ్యాన్ని పాలించు.

"మన తండ్రిగారు రాజ్యాల్ని జయించారు. భోగాలూ, సుఖాలూ అనుభవించారు. యజ్ఞాలూ, యాగాలూ చేసి అక్కడ కూడా కీర్తి సంపాదించుకున్నారు. భూమి మీద చెయ్యాల్సినవి, అనుభవించాల్సినవి అన్నీ రుచి చూశారు. ఇక్కడ చెయ్యటానికి ఏమిలేక దేహాన్ని వదిలేశారు. ఆయన గూర్చి దిగులు మాను. ఆ లోకాలలో సుఖంగా ఉన్నాడు. అక్కడ్నించే అందరినీ దీవిస్తున్నాడు." చెప్పాడు శ్రీరాముడు.

"శ్రీరామా! ధర్మం తెలిసినవాడవు. తాపస ధర్మం క్షత్రియులు ధరించరాదు. ధర్మపరిపాలనే చేయాలి. గృహస్థాశ్రమాన్ని వదులుట క్షత్రియ ధర్మంకాదు. ఇక్కడే ఇప్పుడే నీవు పట్టాభిషేకం చేసుకో. దేవతలు దేవేంద్రుడికి చేసినంత వైభవంగా చేస్తాం. అయోధ్య మొత్తం ఇక్కడే ఉంది" భరతుడు మళ్ళీ ప్రయత్నించాడు.

"భరతా! రోహిణీ కార్తెలో బండ పగలటం ఎంత సత్యమో శ్రీరాముడు తండ్రి మాటకే నిలబడుట అంతటి సత్యము."

"శ్రీరామా! సర్వజ్ఞుడవు. గుణసంపన్నుడవు. సత్యప్రతిజ్ఞుడవు. నీకు తెలియనిదికాదు. స్త్రీ కోసము చేసిన ధర్మహీనమైన పని, అర్థహీనమైన పని తప్పినా, తప్పులేదని నీతి శాస్త్రము చెబుతోంది. పైగా నా తల్లి వరాలు ఉపసంహరించుకుంటోంది. కాన శ్రీరామా... కాదనకు."





"భరతా! తల్లి కైక వరాలు ఉపసంహరించుకున్నా, తండ్రిగారి మాటను నేను జవదాటను. పద్నాలుగు సంవత్సరాలు దండకారణ్యమే నా నివాసం...

"తమ్ముడా! గయుడి గూర్చి నీకు తెలుసు కదా! అతడు పితృయజ్ఞము చేస్తూ చెప్పిన సూక్తి 'పుత్' అనగా నరకంలో పడకుండా రక్షించువాడు పుత్రుడు. కొడుకు.

"కాన భరతా! అందులకనే పుత్రుల కోసం భూమి మీద మానవులు తహతహలాడుతారు. కావున మన తండ్రి దశరథ మహారాజు నరకంలో పడకుండా నీవు ఆయన కోర్కెని ఆచరించవలెను. అయోధ్యకి నీవు రాజు అయితే ఈ దండకారణ్యానికి రాజును నేను.

"తమ్ముడు శత్రుఘ్నుడితో రాజ్యాపాలన చేయి. అందరినీ సుఖపెట్టు. దశరథ మహారాజు నలుగురి పుత్రులు తండ్రిమాట జవదాటని వారిగా లోకానికి చాటుదాం. శాశ్వతమైన కీర్తిని ఇక్ష్వాకు వంశానికి కలిగిద్దాము."

## జాబాలి వాదము

శ్రీరాముడూ, భరతుడూ సంభాషించుకుంటుంటే జాబాలి అడ్డు వచ్చాడు. వైదికధర్మ వ్యతిరేకంగా పలికాడు.

"శ్రీరామచంద్రా! నేను బ్రాహ్మణుడను. శాస్త్రాలు చదివిన వాడిని, పెద్దవాడిని, నా మాట దయతో ఆలకించు...

"రాజా పుట్టినప్పుడు ఎవ్వరూ తోడు రారు. పోయేటప్పుడూ అంతే. ఇక్కడికి వచ్చే వరకూ ఎన్నో చోట్ల ఆగాము. ఆ తర్వాత వదిలేశాము. అంతే సంబంధం.

"అట్లే తల్లీ, తండ్రీ, ధనమూ, వాటితో సంబంధం ఉన్న వరకే. సంబంధం తెగిపోయాక మాటలలో కాని బాసలలో కాని సంబంధం ఉండదు.

"ధర్మం కోసం దేవేంద్రుడి అమరావతి వంటి రాజ్యాన్నీ, భోగాలనూ వదులుకోకు. ఎంత ధర్మంగా ప్రవర్తించినా, మరెన్ని సత్యవ్రతాలు చేసినా చివరకు కోరుకునేది స్వర్గసుఖాలే.

"ఎప్పుడో దక్కేవి ఇప్పుడే ఎదురుగా ఉన్నాయి. ప్రత్యక్ష స్వర్గమైన రాజ్య భోగం అనుభవించు. అందరినీ సంతోషపెట్టు. తండ్రిలేని నాడు ఆయన ఆజ్ఞ కూడా ఉండదు. పాటించాల్సిన పనిలేదు" చెప్పాడు జాబాలి.

శ్రీరాముడు చిరునవ్వుతో చెప్పాడు.

"బ్రాహ్మణోత్తమా! నీవు చెప్పేది అకార్యము. ఎంతో ప్రియముగా వినిపించే విషయము. ఎంతో మధురఫలమైన మామిడి పండ్లకి సరి సమానంగా కనిపించే మహా విష ఫలాలున్నాయి. రెండూ ఒకేలా ఉన్నా, ఎంతో వ్యత్యాసముంది. అట్లే నీ మాటలు కూడా. ధర్మం, న్యాయం అనేది శాశ్వతము. పుడతారు, పోతారు. కాలగర్భంలో ఎన్నో కోటాను కోట్ల ప్రాణాలు జన్మించింది బ్రహ్మకూ, మరణించింది యముడికీ తప్ప తెలియదు.

"కానీ ఎందరో మహాత్ములను నేటికి స్మరించుకుంటున్నాము. ధర్మవేషం ధరించి అధర్మములు చేయలేను. నీతులు చెప్పి అవినీతి చేయలేను. నీతి శాస్త్రాన్ని నాకు అనుగుణంగా నీవు చెప్పినంత మాత్రాన అసత్యం సత్యమవదు.

"ప్రపంచమంతా నీవు చెప్పినట్టుగానే సంచరిస్తే భార్య భర్తతో ఉండదు. పుత్రుడు తండ్రి మాట వినడు. అన్న మాట తమ్ముడు వినడు. రాజు మాట ప్రజలు వినరు. అప్పుడేమౌతుంది. ఈ భూమి నరకం. సింహం సాధు జంతువుని తిన్నట్టు బలవంతుడు బలహీనుడ్ని వశపరుచుకుంటాడు. వాడి మీదెక్కి రాజ్యం చేస్తాడు. స్త్రీ మాన, ప్రాణాలకు భద్రత ఉండదు.

"లోకాన కొందరు సుఖిస్తారు. మరికొందరు దుఃఖిస్తారు. ఇంకొందరు కష్టాలు పడతారు. మళ్ళీ రోజులు మారుతాయి. వారు వీరు అవుతారు. అప్పుడే కష్టసుఖాల అర్థాలు తెలుస్తాయి. మానవ జన్మ సార్థకత తెలుస్తుంది.

"బ్రాహ్మణుడా! అసత్యవాది, స్థిర చిత్తము లేనివాడి పూజలు దేవతలు కూడా స్వీకరించరు. పితృదేవతలు ముట్టరు. నీ పరిజ్ఞానంతో నీవు చెప్పినది అయుక్తమూ, అయోగ్యమూ, అనుచితమూ, కాన శ్రీరాముడు చేయడు.

"బ్రాహ్మణుడా! ఈ భూమి మీద ఉండి ఎన్నో ధర్మకార్యాలు చేయుట వల్లే ఒకడు చంద్రుడయ్యాడు. ఒకడు అగ్ని అయ్యాడు. ఒకడు వాయువు అయ్యాడు. నూరు యజ్ఞాలు చేసి ఒకడు దేవేంద్రుడయ్యాడు.

"ధర్మం అంత గొప్పది. కీర్తి, భూమీ, స్వర్గలోకాలూ ధర్మాత్ముడిని వరిస్తాయి. వైదిక ధర్మాన్ని మార్చి చెప్పుట బ్రాహ్మణోత్తమం కాదు. నేను అయోధ్యకు వచ్చుటకై శాస్త్రాన్ని తిప్పి చెప్పుట ధర్మసమ్మతం కాదు.

"నీ వంటి వారు మంత్రాంగంలోనూ, అనుచరగణంలోనూ ఉండరాదు. రాజు నెప్పుడు సరైన దారిలోనే నడిపించేలా మాట్లాడాలి" శ్రీరాముడు జాబాలికి కూడా మృదు స్వరంతోనే చెప్పాడు.





# వశిష్ఠ మహర్షి ప్రయత్నము

"శ్రీరామా! లోకనాథా! నా మాటలు వినుము. సృష్టి ప్రారంభానికి ముందు బ్రహ్మ జలం నుంచి జన్మించాడు. విష్ణువు వరాహవతారమెత్తి భూమిని కాపాడాడు. బ్రహ్మ ప్రపంచాన్ని సృష్టించాడు.

"ఆ బ్రహ్మ పుత్రుడు మరీచి. అతని పుత్రుడు కశ్యపుడు. కశ్యపుని కొడుకు సూర్యుడు. సూర్యుని పుత్రుడు వైవస్వత మనువు. అతనే మొదటి ప్రజాపతి. అతనికి ఇక్ష్వాకువు జన్మించాడు. భూమి మొత్తాన్నీ వైవస్వత మనువు కొడుకు ఇక్ష్వాకుడికిచ్చాడు. అయోధ్య తొలిరాజు అతనే.

"ఆ ఇక్ష్వాకు పుత్రుడు కుక్షి, కుక్షి కొడుకు వికుక్షి, వికుక్షి కొడుకు మహాతేజుడు బాణుడు. బాణుడి కొడుకు అనరణ్యుడు. ఆయన కొడుకు పృథువు. పృథువు కొడుకు త్రిశంకుడు.

"ఇతడే విశ్వామిత్రుడి శక్తితో స్వర్గానికి వెళ్ళాడు. త్రిశంకుడి కొడుకు యవనాశ్వుడు. దుంధుడనే రాక్షసుడ్ని సంహరించటంతో దుందుమారు డయ్యాడు. ఆయన పుత్రుడు శ్రీమంతుడు మాంధాత. ఆ మాంధాతకు సుగంధి, సుగంధికి ధ్రువసంధితోపాటు ప్రసేనజిత్తూ జన్మించారు.

"ధ్రువ సంధికి భరతుడు ఆ భరతునకు అసితుడు. ఆ అసితుడు హైహయులూ, కాలజంఘులూ, శశిబిందులతో పోరాడి ఓడిపోయి అడవికి పోయాడు.

"అతనికి ఇద్దరు భార్యలు. చిన్న భార్య పెద్ద భార్యగర్భం పోగొట్టాలని, కాళిందికి విషం పెట్టింది. ఇది తెలిసిన కాళింది చ్యవనమహర్షి వద్దకు వెళ్ళి సేవలు చేసి మెప్పించింది. చక్కటి పుత్రుడు జన్మిస్తాడని చెప్పాడు.

"అలా కాళిందికి విషముతో పుట్టుట చేత అతడు సగరుడయ్యాడు. బ్రహ్మ తేజస్సుతో వెలిగిపోయే ఆ సగరుడు అశ్వమేథ యాగం చేస్తుండగా, గుర్రం కానరాలేదు.

"పుత్రుల చేత భూమి మీదంతా వెదికించాడు. సముద్రాన్ని భూమిని వదలకుండా త్రవ్వించాడు. ఆ సగర చక్రవర్తి వల్లే సాగరుడు మహా సముద్రుడయ్యాడు. సగరుడునకు అసమంజుడు పెద్ద కొడుకు. వాడి పాపాలు భరించలేక అడవులకి పంపించాడు. ఆపై అసమంజుడి కొడుకు అంశు మంతుడు పరిపాలన చేశాడు.

“అంశుమంతునకు దీలిపుడు. దీలిపుడు కొడుకుగా భగీరథుడు జన్మించాడు. ఆ మహాతాపస్వి వల్లే దేవలోకంలోని గంగ భూమి మీదా, పాతాళంలోనూ ప్రవహిస్తోంది.

“భగీరథునకు కాకుత్స్థుడు జన్మించాడు. ఆయనకు రఘువు జన్మించాడు. రఘువుకు ప్రవృద్ధుడు జన్మించాడు. కల్మాషపాదుడనీ, పురుషాదకుడనీ, ఇతడు ప్రసిద్ధుడు. ఇతనికి శంఖణుడు జన్మించాడు. ఆ శంఖణుణ్ణి కల్మాషపాదుడే చంపేశాడు. ఆ పై శంఖణుడి కొడుకు సుదర్శనుడు పరిపాలించాడు. శూరుడైన వీరుడైన సుదర్శనుడి కొడుకు అగ్నివర్ణుడు. అగ్నివర్ణుడనకు శీఘ్రగుడు. శీఘ్రగుడనకు మరువు. మరువుకు ప్రశుశ్రుకుడు.

“ప్రశుశ్రుకుడికి అంబరీషుడు. ఆ అంబరీషునకు నహుషుడు. నహుషుడికి నాభాగుడు. నాభాగుడికి ఆజుడూ, సువ్రతుడూ జన్మించారు.

“ఆజునకే మీ తండ్రి దశరథమహారాజు జన్మించాడు. నీవు జ్యేష్ఠ పుత్రుడవు. కావున శ్రీరామా రాజ్యపాలన చేయుటకు నీకు మాత్రమే అర్హత ఉంది. వంశ మర్యాదనూ, వంశస్థులనూ గౌరవించి అయోధ్యను ఏలవలెను” చెప్పాడు వశిష్ఠుడు.

“శ్రీరామచంద్రా! తండ్రీ, తల్లీ జన్మకారకులు. ఆ తర్వాత విద్యతోపాటు, జ్ఞానాన్ని బోధిస్తాడు గాన గురువు అన్నారు. అందులకే తల్లీ, తండ్రీ, గురువు ముగ్గురూ నమస్కరించదగ్గవారు. ఆజ్ఞాపించదగ్గవారు. చెప్పదగ్గవారు.

“నేను నీకునూ, నీ తండ్రికినీ గురువును. గురువు మాట పాటించుట వల్ల సత్యదోషం అంటదు. సత్పురుషుల మార్గాన్ని తప్పినట్టు అవదు. వృద్ధురాలు, ధర్మశీల మీ తల్లి కోరిక తీర్చు. ఇక్ష్వాకు వంశంలో అడిగింది ఇవ్వటమే తెలుసు. వారిలానే అడిగింది కాదనకు” చెప్పాడు వశిష్ఠుడు మృదు మధురంగా...

“మహాత్మా! మీరు చెప్పినది సత్యం. చిన్ననాటి నుంచి గోరు ముద్దలు తినిపించి, లాలించి, స్నానం చేయించి, నలుగు పెట్టి, కోరినది ఇస్తూ, వారి సుఖాలను మరచి బిడ్డల సుఖాలు చూసే తల్లీ, తండ్రీ కనిపించే దైవాలు.

“అట్టి దేవతామూర్తుల ఋణం తీర్చుకోలేనది. నూరు యజ్ఞాలు చేసినా తల్లి ఋణం, తండ్రి ఋణం తీరదు. అట్టి వారికిచ్చిన మాట నేనెలా తప్పగలను. తల్లి కైకేయీ నన్ను అడగలేదు. వనవాసం వెళ్ళమని చెప్పలేదు.





తండ్రి చెప్పారు. ఆచరించాను. కావున అమ్మ మాట అతిక్రమించటం క్రిందరాదు” చెప్పాడు శ్రీరాముడు.

వశిష్ఠుడు చెప్పినా శ్రీరాముడు కాదనటంతో భరతుడు దర్భలు తానే తెచ్చుకొని పరిచి దాని మీద పడుకున్నాడు.

“అన్నా శ్రీరామా! నీవు రానంటే కాదంటే ప్రాయోపవేశమే నాకు దారి. అంత వరకూ పచ్చి నీళ్ళైనా ముట్టను” అన్నాడు.

శ్రీరాముడు మదించిన హంస స్వరంతో భరతునికి చెప్పాడు.

“తప్పు నాయనా! క్షత్రియులం మనం. ఇట్టి కార్యం చేయరాదు. బ్రాహ్మణుడు మాత్రమే ఈ కార్యం చేయుటకు అర్హుడు. ఇట్టి వ్రతము నీ అన్న రాముడు ఇష్టపడడు.”

భరతుడు లేచాడు. శ్రీరాముడి పాదాలు పట్టుకున్నాడు.

“రామా! తండ్రి మాట ప్రకారం నేను నీ బదులు అరణ్యావాసం చేస్తాను. మీరంతా అయోధ్య వెళ్ళండి. నా మాట మన్నించు. తండ్రిమాట కోసం పుత్రులలో ఎవరు చేసినా ఒక్కటే. నేను అవశ్యముగా అడవిలో ఉంటాను.”

భరతుడి నిర్ణయంపై అంతా ఆశ్చర్యపోయారు.

“రాజ్యము రాజుది. ఆయనకు సమస్తంపై అధికారమున్నది. ఆయన చెప్పినట్టు జరుగవలెను. లేనిచో రాజాజ్ఞని ఉల్లంగించటమే అవుతుంది.

“తండ్రిగారు నాకు వనవాసము, నీకు రాజ్యము ప్రసాదించారు. అది రాజు నిర్ణయం. మన తండ్రి గారి నిర్ణయం మార్చుట, కాదనుట ఆజ్ఞను అతిక్రమించుటే. కాన భరతా! నీ సోదర ప్రేమ నాకు తెలియనది కాదు. తండ్రి కోరికను ఇద్దరం తీరుద్దాం. పాటిద్దాం” చెప్పాడు శ్రీరాముడు స్థిరంగా.

దివ్యదృష్టితో చూస్తున్న మునులూ, సిద్ధులూ, చారణులూ, దేవఋషులూ ఆ అన్నదమ్ముల సంభాషణ విని వారు స్వయంగా వచ్చి రామలక్ష్మణులను దీవించారు.

పద్మపత్రాక్షుడైన భరతునితో చెప్పాడు శ్రీరాముడు.

“భరతా! ఈ భూమండాలన్ని ఏలే శక్తి నీలో ఉంది. జన్మతః యోగ్యుడవు. మహోత్తర కార్యాలన్నీ చెయ్యగలవు. మన వంశప్రతిష్ఠని నిలిచేలా పాలించగలవు. సముద్రం ఇంకిననూ, చంద్రుడిలో కాంతి పోయిననూ, హిమ పర్వతము కరిగిననూ, ప్రకృతి తన ధర్మాలను పాటించకున్ననూ నేను ఆడి తప్పను.

"నీవు రాజ్యాన్నీ, తల్లులనూ, తమ్ముడు శత్రుఘ్నుడనూ బాగుగా చూసుకోవలెను. తల్లి కైకేయీ దేవిని ఎట్టి సందర్భంలోనూ నిందించరాదు.

"తల్లిని నిందించినవాడికి ఆ లోకంలో సర్వశిక్షలూ అమలుపరుస్తారు" చెప్పాడు శ్రీరాముడు.

పాడ్యమినాటి చంద్రుడిలా వెలిగిపోతున్న శ్రీరాముడితో చెప్పాడు భరతుడు.

"అన్నా శ్రీరామా! అయితే నీవు ధరించిన ఈ పాదుకలే నాకు మార్గదర్శకాలు. సరిగ్గా పధ్నాలుగేళ్ళు గడువు. గడువు తీరిన తర్వాత ఒక్కక్షణం కూడా ఈ భరతుడు ప్రాణాలతో ఉండడు. అగ్ని ప్రవేశం చేస్తాను.

"నేనూ నీవలే జటా జినాలు ధరించి, ఫలాలు తింటూ నీ పాదుకలు సింహాసనము మీద వుంచి రాజ్యపాలన చేస్తాను."

సూర్యసమాన కాంతిమంతుడు శ్రీరాముడు భరతుడ్ని అక్కున చేర్చుకున్నాడు.

భరతుడు ఆ పాదుకలకు ప్రదక్షణం కావించి, శత్రుంజయము అను పట్టపుటేనుగుపై రాజలాంఛనాలతో ఉంచాడు. బాధా పరితప్త హృదయాలతో వెళ్తున్న తన వారినందరిని చూశారు సీతా, రాముడూ, లక్ష్మణుడూ.

శ్రీరామ పాదుకలతో భరతుడు బైలుదేరాడు. చిత్రకూట ధాతువులను చూసుకుంటూ వెళ్ళాడు. భరద్వాజుని ఆశ్రమం వద్ద ఆగి పాదచారుడు అయ్యి నమస్కరించాడు. భరతుడ్ని ఆశీర్వదించాడు మునిపుంగవుడు.

"మునివర్యా! శ్రీరాముడు ఎంత చెప్పినా వినలేదు. పధ్నాలుగు సంవత్సరాలు వనవాసం చెయ్యాల్సిందేనన్నాడు. మంగళకరమైన శ్రీరాముని పాదుకలే ఇక నా దైవము" చెప్పాడు భరతుడు.

"భరతా! పల్లంలో నీళ్ళవలే నీలో ధర్మగుణాలు స్థిరంగా ఉన్నాయి నాయనా" చెప్పాడు భరద్వాజుడు. ఆయనకి ప్రదక్షిణం చేసి శెలవు తీసుకున్నాడు.

అలలతో నిండి ఉన్న యముననూ, గంగానదినీ భరతుడు తన చతురంగ బలాలతో దాటాడు. అయోధ్య చేరారు.

## నంది గ్రామము

భరతుడు తన గుర్రాలతోనూ, బలగాలతోనూ అయోధ్య చేరాడు. రాజ వీధులన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. అంగళ్ళు తెరవలేదు. పూల దుకాణాల్లో





పూలు వాడేవారు లేక వాడిలిపోయి ఉన్నాయి. ఉద్యానవనాల్లో పూలు కోసే వాళ్ళు లేక చెట్టుకే ఒడలిపోయి ఉన్నాయి.

రథ ఘోషలేదు. అంతా మౌనం. అంగారక గ్రహం పట్టి పీడించిన రోహిణిలా వుంది నగరం. శత్రురాజుల వీరవిహారంతో భయకంపితులైన పౌరులు ఇళ్ళల్లో దాక్కున్నట్టు రహదారులపై మనుష్య సంచారమే లేదు.

వీధులలో విరిగిపోయిన పాత్రలు... ఎప్పుడో వేసిన ముగ్గు అనవాళ్ళు అక్కడక్కడ కనపడుతున్నాయి. ఆంబోతు వెళ్ళిపోతే ఆవులు దిగులు పడినట్టు... పెంటి ఏనుగు కోసం పిల్ల ఏనుగులు దిగులు పెట్టుకున్నట్టు...

భూమి మీద పుణ్యం నశించి, ఆకాశంలో నక్షత్రాలు నేలరాలి పృథ్వి సమస్తాన్నీ చీకటి చేసినట్టు, అయోధ్య గాఢాంధకారమైన నిశ్శబ్ద అడవిలా ఉంది.

భర్త దూరమైన స్త్రీలా ఉంది. నగలూ, గంధమూ, పువ్వులూ లేని పడతిలా ఉంది. వానాకాలంలో మేఘాలు కమ్మేసిన ఆకాశంలా ఉంది అయోధ్య.

వాయిద్యాల ఘోష లేదు. ధూపాలూ, అగరొత్తుల వాసనా లేదు. రథాల ధ్వని, ఏనుగుల ఘీంకార జాడలూ లేవు.

భరతుడు తల్లులను అంతఃపురంలో వదలి చెప్పాడు.

"అన్నలేని అయోధ్యలో నేను ఉండలేను. ప్రజలంతా నిశ్శబ్దాన్ని పాటిస్తున్నారు. మళ్ళీ పూర్వ వైభవం శ్రీరాముడు అయోధ్యకి వస్తేనే. అప్పటి వరకు అయోధ్య వానకాలం కృష్ణ పక్షం రాత్రే. నందిగ్రామం వెళ్ళిపోతాను" చెప్పాడు భరతుడు.

వశిష్ఠిడూ, మంత్రులూ మౌనం వహించారు. దేవాసుర యుద్ధంలో సూర్యుని రాహువు కొట్టటంతో పృథ్వి అంతా పగలూ రాత్రి తేడా తెలియ కుండా పోయింది. ప్రస్తుతము అయోధ్య అలా ఉండటం చూసి వశిష్ఠిడు వ్యధ చెందాడు.

భరతుడు రథాన్ని సిద్ధం చేసుకున్నాడు. పాదుకలు దాని మీద ఉంచాడు. మంత్రులంతా అనుసరించారు. శత్రుఘ్నుడితో కలిసి తూర్పువైపుగా వెళ్ళి నందిగ్రామం చేరారు.

"ఇక కోసల రాజ్య యోగక్షేమాలన్నీ ఈ పాదుకలే చూస్తాయి" చెప్పాడు. పాదుకలకి భక్తిగా నమస్కరించాడు.

భరతుడు నారబట్టలు ధరించాడు. శ్రీరాముడి పాదుకలకి పట్టాభిషేకం చేశాడు. సామంతులు కానుకలను పాదాలకే సమర్పించారు. ఏ రాచ కార్యమైనా శ్రీరామ పాదుకలకి చెప్పి నిర్ణయాన్ని అమలు పరచాలని మంత్రులకు సూచించాడు.

విచారంతో, దిగులుతో పధ్నాలుగేళ్ళు ఎప్పుడవుతుందా అని ఎదురు చూస్తూ పరిపాలనా బాధ్యతను నెత్తికెత్తుకున్నాడు భరతుడు.

★★★ ★★★ ★★★

భరతుడు వెళ్ళిపోగానే శ్రీరాముడు దండకారణ్యాము వెళ్ళిపోవాలను కోలేదు. మరికొంత కాలం అక్కడే గడుపుదామనుకున్నాడు. అక్కడి మునులూ, తాపసులూ ఏదో తర్కించుకోవటంతో శ్రీరాముడికి సందేహం కలిగి మహా వృద్ధుడూ, తాపస్వి అయిన కులపతిని దర్శించాడు.

"మునీశ్వరా! మహానుభావా! నా వల్ల ఏదైనా అపరాధం జరిగిందా? మునులందరూ ఏదో చర్చించుకుంటున్నారు. లేక మరేదైనా కారణమా" అడిగాడు.

"శ్రీరామా! వీరుడవు. క్షత్రియుడవు. నీవు ఇక్కడున్నావని తెలిస్తే రాక్షసులు మీద పడతారేమోనని భయం చెందుతున్నారు. రావణుడి తమ్ముడు ఖరుడు మహాభయంకరుడు.

"పాపిష్ఠివాడూ, క్రూరుడూ. నరమాంసమంటే ప్రీతి. వాడికి చిత్తం వచ్చినపుడు ఈ ప్రాంతానికి వచ్చి సర్వమూ నాశనం చేసి భయభ్రాంతులకు గురి చేస్తుంటాడు.

"ఆశ్రమ వాసాల్లో అమంగళ పదార్థాలను వేస్తాడు. యజ్ఞ వేదికల్లో రక్తాన్ని పోస్తాడు. ఫలవృక్షలను పెకిలించి ఆశ్రమాల మీద వేస్తాడు.

"వాడూ, వాడి అనుచరగణమూ చేయాల్సిన పాపకార్యాలన్నీ చేస్తారు. సీతాదేవి మహాసాధ్వి... మంగళ స్వరూపిణి. ఆమెతో, తమ్ముడితో వచ్చిన నీవు ఆ రాక్షసులతో ఎన్ని బాధలు పడతావోనని చర్చించుకుంటున్నారు.

"నాయనా శ్రీరామా! మేమంతా ఇక్కడికి దగ్గరిలోని సురక్షతమైన మా పూర్వవనానికి పోతున్నాము. అక్కడ కందమూల ఫలాలు సమృద్ధిగా దొరుకుతాయి. నీవునూ మాతో రావచ్చును" చెప్పాడు కులపతి.

శ్రీరాముడు స్థిరంగా చెప్పాడు.





"స్వామీ! ఈ భూమి భరతునది. ఎక్కడ అన్యాయం జరిగినా రాజు వూరుకోడు. ప్రతినిధులూ వూరుకోరు. రాక్షసులను రానీయండి. మళ్ళీ వచ్చే స్థితి రాకుండా చేస్తాను"

కులపతిగానీ, మునులుగానీ శ్రీరాముడు ఎంత చెప్పినా వినలేదు. తిరస్కరించారు. పూర్వవనానికి అంతా తరలిపోయారు.

శ్రీరాముడు చిత్రకూట సౌందర్యాన్ని వదలలేక దండకారణ్య ప్రవేశం వాయిదా వేసుకొని చిత్రకూట అందాలను తిలకిస్తూ భార్యతోనూ, తమ్ముడితోనూ ఆనందంగా ఉన్నాడు.

అయితే చిత్రకూట పర్వతంపై ఆపై ఎక్కువ కాలం ఉండలేక పోయాడు. ఆ పర్వతం మీద జరిగిన సంఘటనలన్నీ గుర్తుకొస్తున్నాయి. భరతుడూ, శత్రుఘ్నుడూ, తల్లులూ, వశిష్ఠి మహర్షీ, పౌర జనులూ, మంత్రులూ అంతా జ్ఞప్తికి రాసాగారు.

ఏ వైపు వెళ్ళినా, ఏనుగులవి, గుర్రాలవి, లద్దెలు కానవస్తున్నాయి. రథ చక్రాల గుర్తులతో పాటు ఏనుగులవి గుర్రాలవి కాలి గుర్తులు కానవస్తున్నాయి. అవి చూసినప్పుడల్లా సీతాదేవి కూడా అన్యమనస్కురాలవుతోంది. లక్ష్మణుడు గంభీరుడవుతున్నాడు.

ఇక అక్కడ ఉండలేక చిత్రకూటం వదిలి అత్రిమహాముని ఆశ్రమానికి వెళ్ళారు.

## సీతారామలక్ష్మణులు అత్రి అనసూయలను దర్శించుట

చిత్రకూట పర్వతం నుంచి బైలుదేరి అత్రి మహాదంపతుల ఆశ్రమానికి వెళ్ళారు.

అత్రి మహర్షికి నమస్కరించారు శ్రీరామలక్ష్మణులు.

శ్రీరాముడిని పుత్రుడిలా ఆహ్వానించి అభిమానించాడు అత్రిమహర్షి. సీతా, లక్ష్మణులను కుశల ప్రశ్నలు వేసి పలకరించాడు.

సీతారాములను తన భార్య అయిన అనసూయ వద్దకు తీసుకెళ్ళాడు.

"ఓ సీతా, సాధ్వీమణీ! ఈ ధర్మాత్మురాలు, వృద్ధురాలు నా భార్య అనసూయ. నా ఇల్లాలు, నా సహధర్మచారిణి" చెప్పాడు అత్రిముని. ఆపై శ్రీరాముడితో చెప్పాడు.

"రఘువీరా! ఒకప్పుడు భూమిపై పది సంవత్సరాలు వర్షాలు పడలేదు. మహాకరువు పృథ్విని పట్టి పీడించింది. అప్పుడు ఈ అనసూయ కందమూల ఫలాలను సృష్టించి ఋషి లోకాన్ని కాపాడింది. గంగానది ఎండిపోకుండా ప్రవహించేలా చేసింది. సస్యశ్యామలం చేసింది.

"పదివేల సంవత్సారాలు తపస్సు చేసింది. తాపసుల తపస్సులకు ఏ విఘ్నం రాకుండా చూసింది. దేవకార్యము కోసం పదిరాత్రులను ఏకరాత్రిగా చేసింది.

"అనసూయ జగత్ప్రసిద్ధురాలు. అమ్మా సీతా నీకు తల్లి వంటిది. పూజించు. నీకు శుభం కలుగుతుంది" చెప్పాడు అత్రిమహాముని.

శ్రీరాముడి అనుజ్ఞతో సీతాదేవి దేహమంతా ముడతలు పడిపోయిన ఆ వృద్ధురాలికి ప్రదక్షిణం చేసింది. తన పేరు చెప్పుకొని నమస్కరించింది.

అనసూయాదేవి సీతను ప్రసన్నంగా చూసింది.

"వైదేహీ! నీవు మహాసాధ్వివి. బంధువులనూ, అనుబంధాలనూ, భవనాలనూ, ధనాన్నీ అన్నీ సర్వం వదిలేసి భర్తే అన్నీ అనుకొని ఆయనతో అడవులకు వచ్చావు.

"ధర్మాపథాన్ని అనుసరించావు. భర్త భవంతిలో ఉన్నా పాకలో ఉన్నా ధార్మికుడైనా, దుష్టుడైనా, స్త్రీకి భర్తే దైవం. పూజ్యనీయము. అప్పుడే స్త్రీకి ఇహమూ... పరమూ... గౌరవమూ...

"మహాతపస్సు మునులను కాపాడినట్టే, భర్తే స్త్రీని ఎల్లవేళలా కాపాడే దైవం. స్త్రీకి ఆత్మబంధువు భర్తే. కామంతో కళ్ళుకానక పరాయి మగవాళ్ళకోసమూ, ఆస్తిపాస్థుల కోసమూ తిరిగే చెడ్డ స్త్రీలు అపకీర్తితోపాటు నరకానికి వెళతారు.

"అమ్మా సీతా! నీ దారి నారీ లోకానికంతటికీ ఆదర్శవంతమైన దారి... నీ ధర్మపథము వల్ల కీర్తీ, ధర్మమూ రెండూ కలుగుతాయి."

సీతాదేవి వినయంగా చెప్పింది.

"పెండ్లినాడు మా తల్లీ, తండ్రీ చెప్పినది, అడవులకు వెళ్తునప్పుడు అత్తగార్లు చెప్పిన ఉపదేశాలు మళ్ళీ నాకు మననం చేశావు. స్త్రీ లో ఉత్తమమైన రోహిణి చంద్రుడితో ఆకాశంలోనే ఎప్పుడూ ఉంటుంది."

అనసూయ సీత మాటలకు ఆనందించింది. శిరస్సు నిమిరింది.





"సీతా! ఏం కావాలో కోరుకోమ్మా... నా తపఃశక్తితో నీకేం కావాలన్నా ఇస్తాను" అడిగింది అనసూయ.

సీత వినయంగా నమస్కరించి "మీ అభిమానమే నాకు వరం" చెప్పింది. అనసూయకు సీతపై మరింత మమకారం పుట్టింది.

"తల్లీ! ఇదిగో దివ్య పుష్పమాలిక, చీరా, ఆభరణాలూ, అంగరాగమూ, అనులేపనము, సీతా ఈ దండ ఎప్పుడూ వాడిపోదు. ఈ సుగంధము ఎన్నటికీ వాసన పోదు. ఈ అనులేపనము దేహానికి రాసుకో... శ్రీమహా విష్ణువూ, లక్ష్మీదేవిలా మీరిరువురూ సుఖంగా ఉంటారు" చెప్పింది అనసూయ.

సీత అవి తీసుకొని తపోధన అనసూయకు వినమ్రంగా నమస్కరించింది. అప్పుడు అనసూయ అడిగింది.

"జనకరాజ పుత్రీ, నీవు శ్రీరాముడిని పెళ్ళాడావు. అదంతా ఆ కళ్యాణ వైభోగమంతా ఆ నోటా, ఈ నోటా విన్నాను. తరించాను. నీవు చెప్పితే వినవలెనని ఉంది. కళ్ళకు కట్టినట్టు వినాలని ఈ ముదుసలి ఆశపడుతోంది."

వైదేహి అనసూయ ముందు కూర్చొంది.

"నా తండ్రి మిథిలాపతి జనకమహారాజు. ఆయన ఓ యజ్ఞాన్ని తలపెట్టాడు. ఆ యజ్ఞభాగంలో భాగంగా నాగలితో పొలాన్ని దున్నుతుంటే భూమి నుంచి ఛేధించుకొని నేను బైటపడ్డాను. అప్పటికి నా తండ్రికి సంతానము లేదు. భగవంతుడు ప్రసాదించిన బిడ్డలా భావించాడు.

"జనక మహారాజా! ఈ శిశువు నీ కూతురు అనడము ధర్మ యుక్తముగా ఉంది" అని ఆకాశము నుంచి అసదృశము అయిన వాక్కు వినిపించింది.

"జనకుడు నన్ను ఎంతో అల్లారు ముద్దుగా పెంచారు. నాకు వివాహ వయస్సు వచ్చింది. దేవేంద్రుడంతటివాడు నా తండ్రి. అయినా ఆడపిల్ల తండ్రి కావటంతో చింతాక్రాంతుడయ్యాడు.

"అయోనిజనైన నాకు తగు వరుడుని నిర్ణయించుట ఎటుల అన్న ఆయన చింతకు పరిష్కారంగా దేవాసుర యుద్ధంలో దేవతలు వరుణ దేవుడిచే ఇప్పించిన శివధనుస్సూ అంబుల పొది పరిష్కారం చూపింది.

"ఆ ధనుస్సు మహాపర్వతాలకన్నా బరువైనది. బలమైనది. ఆ ధనుస్సును ఎత్తి అల్లెత్రాటిని బిగించి బాణాన్ని ఎవరు ఎక్కుపెడతారో అతనే నాకు భర్త అని నిర్ణయించారు.

"ఎందరో రాజులు వచ్చి ప్రయత్నించి విఫలమై ధనుస్సుకూ, అంబుల పొదికీ దండాలు పెట్టి వెళ్ళారు.

"ఆ తర్వాత చాలా కాలానికి విశ్వామిత్ర మహర్షి యజ్ఞ సంరక్షణకై వచ్చిన రామలక్ష్మణులు శివధనుస్సు చూడాలని భావించారు.

"విశ్వామిత్రుడు వారిని తీసుకొని మిథిలానగరానికి వచ్చారు. మా తండ్రిగారు అన్నీ విషయాలతో పాటు ఆ విషయాన్నీ చెప్పారు.

"తాము వచ్చిన పని కూడా శివధనుస్సు కాంచుట కొరకే అని చెప్పారు విశ్వామిత్రుడు.

"మా తండ్రిగారు అనేక మందితోనూ, ఏనుగులతోనూ ధనుస్సును విశ్వామిత్రులవారి దగ్గరికి చేర్చారు.

"అంత నా ప్రభువు, అరవింద దళాక్షుడు, సుందరాకారుడు, సుగుణాభి రాముడు, శ్రీరాముడు సునాయాసంగా విల్లు ఎత్తి అల్లెత్రాడు లాగాడు. శ్రీరామ స్పర్శకో, వేగానికో గాని ధనుస్సు విరిగింది. నడుమకి విరిగింది. పంచభూతాలు కల్లోల పడ్డాయి. లక్ష్మణుడు శాంతించమని... విల్లువిరిచింది అయోధ్యా పుత్రుడు శ్రీరాముడని చెప్పాడు.

"నా తండ్రి దశరథునకు కబురు పంపి ఆహ్వానించాడు. నన్ను శ్రీరాముడనకూ, నా చెల్లి ఉర్మిళను లక్ష్మణుడనకూ, మాండవిని భరతునకూ, శ్రుతకీర్తిని శత్రుఘ్నునకూ ఇచ్చి వైభవంగా వివాహం జరిపించారు.

"అది మొదలు శ్రీరాముని నీడే నా మార్గం..." చెప్పింది సీత కొంత సిగ్గుపడుతూ...

★★★ ★★★ ★★★

అనసూయాదేవి సంతోషించింది. వైదేహి శిరస్సు నిమిరింది.

"తల్లీ! సూర్యుడు యామినీ దేవిని కలుసుకోవటానికి ఉవ్విళ్ళూరు తున్నాడు. చీకటి పడబోతున్నది. పక్షులు కూడా గుటికి చేరుతున్నాయి. ఆవు మందలు వస్తున్న గిట్టల చప్పుడు వినవస్తుంది.

"చెట్లు గుబురు చెట్ల వలె కానవస్తున్నాయి. మృగాలన్నీ తమ స్థావరాలను చేరుకుంటున్నాయి.

"సీతా! ఆకాశం కూడా అలంకరించుకుంటోంది నక్షత్రాలతో... నీవు చక్కగా అలంకరించుకో తల్లీ. నీ శోభను చూచి తరిస్తాను" చెప్పింది అనసూయ.





అనసూయ చెప్పినట్టు సీత చక్కగా అలంకరించుకొని ఆశీర్వాదం తీసుకొంది. శ్రీరాముడ్ని చేరింది. అనసూయ ఇచ్చిన ఆభరణాలూ, చీరా, సుగంధము ఇత్యాదివన్నీ చూపించింది. మురిసిపోయింది.

## దండకారణ్యానికి ప్రయాణం

శ్రీరాముడు సీతాదేవి ఆనందాన్ని చూసి సంతోషించాడు. ఆ పుణ్యరాత్రి అక్కడ గడిచిపోయింది. తెల్లవారింది.

మునుల స్నాన హోమలు పూర్తి అయ్యేసరికి సీతారామాలక్ష్మణులు సిద్ధంగా ఉన్నారు. శెలవు ఇప్పించమని అడిగాడు శ్రీరాముడు అత్రి మహామునిని. తపస్విద్దులంతా శ్రీరాముడికి చెప్పారు.

"రామా! దండకారణ్యం రాక్షస ప్రాంతం. నరమాంసాన్ని తినే రాక్షసులు తిరిగే అరణ్యం. కామ రూపులూ, భయంకర ఆకారులూ, శాపగ్రస్తులైన వారందరితో నిండిన ఘోరారణ్యము.

"వారితో పాటు భయంకర విషసర్పాలూ, ఘోర మృగాలూ ఎన్నో ఉన్నాయి. రాక్షసుల మాయోపాయంతో ఆ అరణ్యాన ఎందరో రాజులు హతమైపోయారు.

"కాన శ్రీరామా! ఏమరుపాటుగా ఉండవలెను. మునులకూ, తాపసులకూ, ధర్మపరులకూ, సత్యసంధులకూ కీడు చేసే రాక్షసులను హతమార్చవలెను.

"శ్రీరామా... అది దండకారణ్యం... ఇదిగో కనిపిస్తున్న దారి గుండానే దండకారణ్యం వెళ్ళి కందమూల ఫలాలు తెచ్చుకుంటాము. తమరూ ఈ దారినే వెళ్ళవలిసింది" చెప్పారు.

సీతారామలక్ష్మణులు అందరి వద్ద శెలవు తీసుకొన్నారు. మేఘాల్లో దూరిన మధ్యాహ్న సూర్యుడిలా ప్రకాశిస్తూ దండకారణ్యంలోకి నడిచారు సీతారామలక్ష్మణులు.

*శ్రీమద్రామాయణములోని అయోధ్యాకాండము సమాప్తము*

# అరణ్యకాండము





## దండకారణ్య ప్రవేశము

సీతారామ లక్ష్మణులు మహారణ్యమైన దండకారణ్యంలోకి ప్రవేశించారు. తపస్సుల ఆశ్రమాలు బ్రహ్మ తేజస్సుతో విలసిల్లి కనిపించాయి. ఆశ్రమాల ముంగిళ్ళు అలికి ముగ్గులు వేసి ఉన్నాయి. ముగ్గుల గళ్ళల్లో రంగులతో అద్దారు. పూల రేకులతో అలంకరించారు.

సాధు మధుర ఫలాలిచ్చే చెట్లు నిశ్శబ్దం పాటిస్తున్నాయి. రకరకాల పక్షుల సంతతి ముచ్చట్లు ఆడుకుంటున్నట్టు మూకుమ్మడిగా ఉన్నాయి.

జింకలతోపాటు అనేక వన్య మృగాలూ, క్రూర మృగాలూ జాతి వైరం మరిచి యథేచ్ఛగా తిరుగుతున్నాయి.

ఆశ్రమాలు ఆకాశంలో సూర్యమండలంలా అగుపిస్తున్నాయి. ఆ ఆశ్రమపదాలకి నిత్యం దేవతలొచ్చి పూజలు చేస్తారు. నాట్యం చేస్తారు. ఆశ్రమాలన్నింటిలోనూ అగ్నిహోత్ర గృహాలున్నాయి. యజ్ఞపాత్రలూ, కృష్ణాజినాలూ, ఉదక కలశాలూ, సమిధలూ, పళ్ళూ, కందమూలాలు కనిపిస్తున్నాయి.

బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణోత్తములతో ఆ ప్రాంతం వేదఘోషతో నిండి వుంది. బలిహోమాదులతో, నిత్యదేవతా పూజలు జరిగే పుణ్యప్రాంతం. ప్రశాంత ప్రాంతం.

వినయంగా, ఆ ఆశ్రమాల్లోకి ప్రవేశించాడు శ్రీరాముడు. ఆ ఆశ్రమాల్లోని మునీశ్వరులు పుణ్యవంతులూ.... దివ్య జ్ఞానం కలవారు.

చల్లని వెన్నలని లోకానికంతటికీ ఇచ్చే చంద్రునిలా వింటి అల్లెత్రాడు విప్పి దీసి ఆశ్రమాల వైపు వస్తున్న శ్రీరాముడిని చూశారు. సమస్త ప్రపంచాన్నీ రక్షించే ఆ వీరుడినీ, ముగ్ధమనోహరమైన సీతాదేవినీ, లక్ష్మణుడనూ చూసి పరమానందభరితులైనారు.

ఆ మనోహరమైన దృశ్యాన్ని మునీశ్వర కుటుంబాల సమేతమే కాదు, పశు పక్షాదులు సైతం అబ్బురంగా.... కనులార్పకుండా చూశాయి. మునులందరూ వారికి ఆనంద స్వాగతం చెప్పారు. పాద్యమూ, అర్ఘ్యమూ ఇచ్చారు.

అడవిలో కాచిన సుమధుర ఫలాలనూ, కందమూలాలనూ ఇచ్చారు. అన్నీ ఆశ్రమాలనీ చూపించి... ఇవన్నీ తమరివేనని... అయోధ్య రాజువైన నీవు మాకూ ప్రభువేనని శెలవిచ్చారు.

“ధర్మాచరణతత్పరుడైన శ్రీరామచంద్రా! ధర్మపరిరక్షకుడవైన నీకు మా అందరి నమస్కారములు. నీవు పూజ్యనీయుడవు. దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించే వీరాధివీరుడవు. మాకు తండ్రితో సమానం.

“మహారాజా... శ్రీరామా... ధర్మపాలకుడవు నీవు. దేవేంద్రుడి నాలుగో అంశమే ప్రజాసంరక్షణ చేస్తోంది. అందువల్లే ఉత్తమ భోగాలన్నీ అనుభవిస్తున్నా డతడు. లోకాలన్నీ అతనికి నమస్కరించాలి. మేము మీ దేశంలో ఉన్నాం...

“అయోధ్యలో ఉన్నా కారడవిలో ఉన్నా నీవే మాకు శరణ్యం... ముక్కుమూసుకొని నిట్టడివిలో తపస్సు చేసుకుంటున్నాం. కోపోద్రేకాలను విడనాడాం.

ఇంద్రియాలన్నింటినీ అదుపాజ్ఞలలో ఉంచుకున్నాం. సదా మమ్ము రక్షించే బాధ్యత నీదే రామా...”

మధురమైన వాక్కులకు శ్రీరాముడు మృదుమధురంగా తలవూపాడు. అగ్నిహోత్రులతో సరిసమానమైన మునీశ్వరులూ, మహాతపో సౌభాగ్య సంపన్నులైన ఇతర తపస్సిద్ధులూ సీతారామలక్ష్మణలను స్తోత్రాలతో సేవించారు.

రూప లావణ్యంతో మెరిసిపోతున్న సీతారామలక్ష్మణులను కన్నులార్ప కుండా చూశారు. దగ్గరుండి ముందుకు సాగనంపారు.





# విరాధుడు

ఆ రాత్రి అక్కడ శయనించి... ముని పుంగవుల వద్ద సెలవు తీసుకున్నారు సీతారామలక్ష్మణులు. ఆశ్రమాలని దాటి దుర్భేధ్యమైన అడవిలోకి ప్రవేశించారు.

చూడటానికి భయంకరంగా కనిపిస్తున్న దారిలో... సమస్త క్రూర మృగాల ఘీంకారాల శబ్దాలని వింటూ నడుస్తున్నారు. చెట్లు నిశ్శబ్దంగా ఉన్నాయి. చెట్ల పొదలు చిందర వందరై కనిపిస్తున్నాయి. ఈల పురుగులు మాత్రం రొదపుట్టేలా అరుస్తున్నాయి.

వాటినన్నింటినీ దాటి ఇంకా ముందుకు వెళ్ళారు. అప్పుడెదురొచ్చాడు. ముళ్ళ పొదలతో పెరిగిన కొండలా ఉన్నాడు. వర్షం, గాలీ లేనప్పుడు ఉరిమే ఉరుములా ఉంది వాడి గొంతు. వ్యాఘ్ర చర్మము ధరించాడు. శరీరమంతా రక్తంతో తడిసింది. మహా మృత్యుదేవతలా నోరు తెరిచాడు.

కళ్ళు పెద్ద గుంటల్లా ఉన్నాయి. కడుపు లోపల నుండి ఎవరో బాగా ఊదినట్టు పొట్ట ముందుకొచ్చింది. శరీరంలో ఏ భాగం సమంగా లేదు.

వాడి చేతినున్న శూలానికి... అనేక జంతు తలలున్నాయి. శరీరమంతా అడవి మృగాల రక్తంతోనూ, క్రొవ్వుతోనూ నిండి ఉంది. ఆ వికారుడైన రాక్షసుడు సీతారామలక్ష్మణులని చూసీ చూడటంతోనే భయంకరమైన క్రోధంతో మండి పడ్డాడు. భూమిని పాదంతో తన్నాడు. రాళ్ళూ, రప్పలూ నుగ్గు నుగ్గు అయ్యేలా నేలను తన్నుతూ సీతారామలక్ష్మణుల వద్దకు వచ్చి, సీతకు అడ్డుగా నిల్చున్నాడు పర్వతం వలే...

“ఎవరు మీరు? నార బట్టలు కట్టుకొని, ధనుస్సులు చేతబూనిన మీరు ఎవరు? ఒక స్త్రీని వెంట బెట్టుకుని వచ్చారు. మీకు ఆయువు మూడింది. నా పేరు విరాధుడు. నా నిత్యకృత్యం మునుల భక్షణ. వారి రక్తమాంసాలను ఆనందంగా ఆరగిస్తాను. ఈ పిల్ల నాతో ఉంటుంది. అంతకు ముందు మిమ్మల్ని చంపి మీ రక్తం త్రాగుతాను.”

యముడిలా ఉన్న ఆ రాక్షసుడిని చూసి సీత భయపడింది. వణుకుతూ శ్రీరాముడిని పట్టుకుంది.

సీతాదేవి పరిస్థితి చూసి శ్రీరాముడు చలించిపోయాడు. సుకుమారి... పతివ్రత...మిథిలానగరరాజు జనక మహారాజు కూతురు మైథిలీ.

శ్రీరాముని వ్యధని చూసి లక్ష్మణుడు... “కైక మన గూర్చి ఏం ఆశించి వరమడిగిందో... అది నెరవేరబోయేటట్టుంది. భరతుడికి రాజ్యం ఇప్పించటంతో

తృప్తిపడక అడవికి ఎందుకెళ్ళమందో... ఆమె ఉద్దేశ్యం ఏమిటో ఇప్పటికి అర్థమైంది."

శ్రీరాముడు మాత్రం... ప్రచండగాలిలో ఊగిపోతున్న అరటి చెట్టువలే విలవిలలాడుతున్న సీతనే చూస్తున్నాడు. అంతకు మించి కదిలిపోతున్నాడు. అన్నగారి దుఃఖం గాంచిన లక్ష్మణుడు...

"అన్నా... శ్రీరామా... సమస్త ప్రాణికోటికీ ప్రభువువి... ఎందులకీ ఆలస్యం... నీ కింకరుడను నేనున్నాను. వాడి నెత్తురును భూమికి అర్పిస్తాను.

"దేవతల రాజు దేవేంద్రుడు పర్వతాల పైకి వజ్రాయుధాన్ని వదిలినట్టు వీడి విశాల వక్షస్థలాన్ని నా శరసందాణంతో వచ్చెలు చేస్తాను. ప్రాణతీపితో వాడు అరిచే కేకలు ఈ అడవిలోని ప్రాణికోటి అంతటికీ విన్పిస్తాను."

శ్రీరామునికి చెప్పి... "ఎవడ్రా నువ్వు... ఈ అడవి నీదన్నట్టు తిరుగుతున్నావు".

"మీరెవరో చెప్పండి... ఎక్కడికి వెళుతున్నారు? ఈ దారిన ఎందుకు ప్రయణిస్తున్నారు?" రాళ్ళు డబ్బాలో వేసి గులకరించినట్టు మాట్లాడుతున్న వాడి మాటలకి శ్రీరాముడు "ఇక్ష్వాకు వంశ దశరథ రాజు పుత్రులం. ఈమె నా భార్య సీత. ఇతను నా తమ్ముడు లక్ష్మణుడు. క్షత్రియధర్మంతో అడవిలోకి వచ్చాం. ఈ దండకారణ్యంలో ఇన్ని పాపకార్యలెందుకు చేస్తున్నావు. నీవెవరివి?"

"హో... అయితే నా గూర్చి కూడా వినండి. భూమి మీద రాక్షసులంతా నన్ను విరాధుడని సంభోదిస్తారు. బ్రహ్మవర ప్రసాదిని, ఏ ఆయుధంతోనూ చావులేదు. చూడబోతుంటే మిమ్మల్ని చంపబుద్దికావటం లేదు. అయినా ఈ పిల్ల మీద ఆశ వదులుకోండి ఎక్కడ్నించి వచ్చారో అక్కడికే పోండి..."

శ్రీరాముడి రెండు కళ్ళు అగ్నిగుండాలయ్యాయి.

"నీచుడా! పరస్త్రీ వ్యామోహం ప్రాణాంతకం... నీకు చావు తథ్యం. నేటితో నీ ఆయువు మూడింది" అంటూ ధనస్సుని ఎక్కుపెట్టి గరుత్మంతుడి వలే, వాయుదేవుని వలే వేగంగా వెళ్ళే బంగారు పొన్నులు గల ఏడు బాణాలు వదిలాడు. అవి వెళ్ళి విరాధుడని తాకాయి. వాడి దేహానికి కొద్ది హాని చేశాయి. విరాధుడి రక్తం కొద్దిగా నేల మీద పడి అగ్నిహోత్రం వలే ప్రకాశించింది.

ఆ బాణ పరంపరకు విరాధుడు చలించి ఒళ్ళు విరుచుకున్నాడు. శ్రీరాముని బాణాలన్నీ విరాధుడి కాయం నుంచి విడివడి క్రిందపడ్డాయి.





బ్రహ్మ వర గర్వంతో విరాధుడు వికటాట్టహాసం చేశాడు. తన చేతిలో నున్న శూలంతో రామ,లక్ష్మణుల మీదకు దూకాడు. శ్రీరాముడు సంధించి వదిలిన బాణానికి వాడి చేతిలో నున్న శూలం ఇంద్రుడి వజ్రాయుధం తగిలి ముక్కలైన మేరు పర్వతంలా ముక్కలైపోయింది. అన్నదమ్ములిద్దరూ వాడి మీద విరుచుకుపడ్డారు. కత్తులతో దాడి చేశారు. పిడి గుద్దులు కొట్టారు. ఎంత చేసినా వాడికి చీమకుట్టినట్టైనాలేదు.

రాముడ్నీ! లక్ష్మణుడ్నీ! ఒడిసి పట్టుకున్నాడు. గబాగబా కదిలాడు. వాడి సంకల్పం గ్రహించి శ్రీరాముడు "వీడు పట్టుకుపోవాలనుకున్న దగ్గరికే మనం వెళ్ళవలసిందని చెప్పి వీడిని మనం వాడి ఇష్టానికి పొయ్యేలా పోనిద్దాం" అని చెప్పాడు. పసి పిల్లలను భుజాల మీద ఎక్కించుకున్నట్టు ఎక్కించుకొని పెద్ద ధ్వనులు చేస్తూ... రంకెలు పెడుతూ... అడ్డం వచ్చిన వృక్షాలను విరగకొడుతూ పరిగెత్తాడు.

అంత సీత....

"అయ్యో... అయోధ్యా రాజకుమారుడూ, సచ్ఛీలుడూ, పరిశుద్ధుడూ, సత్యవాదీ, శీలవంతుడైన శ్రీరాముడనూ... ఆయన తమ్ముడు లక్ష్మణుడనీ ఆ రాక్షసుడు ఎత్తుకొని వెళుతున్నాడు. ఇక నన్ను తోడేళ్ళూ, పులులూ, చిట్టేళ్ళూ తినేస్తాయి. ఓ రాక్షసోత్తమా వారిని విడువుము... నన్నూ వారితో తీసుకెళ్ళి సంహరించుము."

రామలక్ష్మణులు వైదేహి మాటలు విన్నారు. సీతాదేవి చాలా భయపడుతోందని గ్రహించారు. విరాధుడని వెనువెంటనే చంపెయ్యాలనుకున్నారు. లక్ష్మణుడు విరాధుడి కుడి భుజాన్ని నరికేశాడు. అదే సమాయనికి శ్రీరాముడు ఎడమ భుజాన్ని నరికాడు.

రెండు కొండలు ఒకేసారి నెత్తిమీద పడ్డట్టు అడవంతా వినేలా అరిచాడు. రెండు బాహువులూ పోయిన విరాధుడని మోకాళ్ళతో నొక్కుతూ, పిడి గుద్దులు కురిపించారు. ఎముకలు విరిగేలా దేహశుద్ధి చేశారు.

ఎన్ని చేసినా వాడు చావలేదు.

ఏ ఆయుధంతోనూ వాడు మరణించడని నిర్ధారించుకున్నారు.

"తమ్ముడూ తపస్సు వర ప్రభావంతో వీడు చావడు. దానికి ఒకటే దారి. పెద్ద గొయ్యి తీసి పాతిపెడదాం. పైగా రాక్షస ధర్మం ప్రకారం పూడ్చి పెట్టాలి" చెప్పాడు శ్రీరాముడు.

అది విన్న విరాధుడు-

"మహావీరా... శ్రీరామా... నీవు దేవేంద్రుడంతటి వీరుడవి. నీ చేతిలో నా చావు మూడిందని అవగతమైంది. నా అజ్ఞానం వల్ల మిమ్ము తెలుసుకోలేక పోయాను. నేను తుంబురుడనే గంధర్వుడును. రంభాసక్తుడినై కుబేరుడి కొలువుని అశ్రద్ధ చేశాను. అందులకు ఆయన శపించాడు. ఎన్నో విధాలుగా వేడుకోగా... దశరథ పుత్రుడు రాముడు... శ్రీరాముడు అరణ్యానికి వచ్చి నిన్ను చంపినప్పుడు శాపవిమోచనం అవుతుందని శెలవిచ్చారు. ఓ పురుషోత్తమ నేటికి నీ వల్ల నాకు శాపవిమోచనం అవుతోంది.

"శ్రీరామా... ఇక్కడికి ఒక్కటిన్నర యోజన దూరంలో శరభంగుడు అనే మహా మునీశ్వరుడు నివసిస్తున్నారు. సూర్యునితో సమ తేజస్సుగలవాడు. ఆయన మీకు సరైన దారి చూపిస్తాడు. అంతకు ముందు నన్ను గొయ్యి తీసి పాతిపెట్టు. కళేబరాన్ని పాతిపెట్టడం వల్ల పుణ్య లోకాలకు పోతాను."

శ్రీరాముడి బాణాలకి విలవిలలాడిపోయాడు. "లక్ష్మణా ఏనుగు పట్టేంత గొయ్యి త్రవ్వు..." అని చెప్పి విరాధుడి పీక మీద కాలు ఉంచి బలంగా వత్తాడు. అడవి దద్దరిల్లేలా అరిచాడు విరాధుడు.

లక్ష్మణుడు గొయ్యి తీశాడు. రాముడితో పోరాడుతున్న విరాధుడిని పిడి గుద్దు గుద్దాడు లక్ష్మణుడు. ఆ పై మహా పర్వతం లాంటి విరాధుడ్ని ఇద్దరూ కలిసి గోతిలోకి నెట్టారు.

బాధతో పెడబొబ్బలు పెడుతూ వెళ్ళి అందులో పడ్డాడు. గుంటలోంచి లేవకుండా అనేక రాళ్ళు వాడి మీద వేశారు. ఆ నీచుడూ, వనచరుడూ అయిన విరాధుడి పీడ పూర్తిగా విరగడయ్యిందని తలచి సీతను ఓదార్చి ప్రయాణించారు. ఆ దండకారణ్యంలో ఆ అన్నదమ్ములిద్దరూ ధనుర్బాణాలతో సూర్య, చంద్రుల్లా శోభించారు.

## శరభంగు మునీశ్వరుడు

తపోవంతుడు శరభంగుడు. దేవతలకున్నంత శక్తి ఉన్నవాడు. బ్రహ్మసాక్షాత్కారము పొందిన పుణ్యాత్ముడు. శరభంగుని ఆశ్రమ దరిదాపుల్లో ఓ అద్భుత దృశ్యం అగుపించింది.

బ్రహ్మాండమైన తేజస్సు... దగ్గరికి వెళ్ళేసరికి స్పష్టంగా కనిపించింది దేవేంద్రుడి రథం. ఆకు పచ్చని గుర్రాలతో ఉంది. ముదిరిన సూర్యుడిలా,





తెల్లని మేఘసముదాయమువలే, చంద్ర మండలమువలే వెలిగిపోతోంది. అగ్నిహోత్రుడు వంటి వ్యక్తి అగుపించాడు. ఆయనపై గొడుగు చంద్రమండలంలా అగుపించింది. దేవేంద్రుడు రథం దిగి శరభంగుడి ఆశ్రమంలోకి వెళ్ళాడు.

ఆయన చుట్టూ దేవతలున్నారు. ఎవరి కాళ్ళు భూమిని తాకటంలేదు. దివ్యవస్త్రాలతో... మెరిసే ఆభరణాలతో వైభవపూరితులై ఉన్నారు.

దేవేంద్రుడి రథం లక్ష్మణునికి చూపించాడు.

"తమ్ముడూ లక్ష్మణా... అదిగో చూడు... దేవేంద్రుడి రథం గూర్చి మనం విన్నది విన్నట్టు ఉందికదూ... ఆ గుర్రాలూ అలానే ఉన్నాయి కదూ... చుట్టూ ఉన్న వాళ్ళని చూడు... చక్కటి సుందరమైన హారాలు ధరించి ఉన్నారు. అందరిదీ యుక్త వయస్సే.... దేవతల వయస్సు ఎప్పుడూ పాతిక లోపే...

"అయినా మీరొక్క ముహూర్తం పాటు వేచి ఉండండి. శరభంగుడి ఆశ్రమంలోకి వెళ్ళి ఆ రథం మీద వచ్చిన ద్యుతి మంతుడెవరో తెలుసుకొని వస్తాను" అని శ్రీరాముడు ఆశ్రమం వైపు వెళ్ళాడు.

ఎదురుగా వస్తున్న శ్రీరాముడిని చూసిన ఇంద్రలోక ప్రభువు దేవేంద్రుడు...

"అదుగో... శ్రీరాముడు వస్తున్నాడు... నాతో కలవటానికి ముందు రావణవధ జరగాలి. ఆ తర్వాతనే నేను కలవాలి. ఎవ్వరికీ సాధ్యం కాని ఆ మహాకార్యం శ్రీరాముడే సాధించాలి. అది అయ్యాకే ఆయన దర్శనం చేసుకుంటాను" అని చెప్పి శెలవు తీసుకున్నాడు.

రథంపై తిరిగి ఆ తేజోవంతుడు వెళ్ళిపోవటం చూసి, తిరిగి వెనక్కి వచ్చి సీతా, లక్ష్మణులను కూడా తీసుకొని శరభంగుమహర్షి ఆశ్రమములోనికి వచ్చాడు. సీతారామలక్ష్మణులు మునిపుంగవునికి నమస్కరించారు. ముగ్గురికీ అసనాలిచ్చాడు. ఆతిథ్యం ఇచ్చాడు.

"మునిపుంగవా! వెళ్ళింది దేవేంద్రుడేనా?" ప్రశ్నించాడు శ్రీరాముడు.

"అవును... రామా... ఆత్మసాక్షాత్కారము కానివారు బ్రహ్మలోకానికి పోవుట సాధ్యంకాదు. మహోగ్రతపస్సుతో దాన్ని నేను సాధించాను. నన్ను బ్రహ్మలోకం తీసుకొని వెళ్ళుటకు స్వయంగా దేవేంద్రుడే వచ్చాడు. అయిననూ అతనితో బ్రహ్మలోకం వెళ్ళలేదు. నిన్ను చూడాలనుకున్నాను.... నిన్ను కలుసుకున్న తర్వాతే బ్రహ్మలోకం వస్తానని చెప్పాను.

“శ్రీరామా! నా ఆశ్రమానికి వచ్చినందుకు నేను ధన్యుడనవుతున్నాను. బ్రహ్మలోక భోగ భాగ్యాలను జయించాను. వాటిని స్వీకరించు” అన్నాడు శరభంగుడు.

“మన్నించాలి మునివర్యా... జయించినది మీరు. కాన వాటిని అనుభవింప అర్హత మీకు మాత్రమే ఉన్నది. దానికి తోడు నేను క్షత్రియుడను. ఇవ్వటమే కాని తీసుకొనటం ధర్మ సమ్మతం కాదు. నాకు నేనుగా ఆయా లోకాలను స్వయంగా సాధిస్తాను. తమరిని కలిసిన కారణం ఈ అడవిలో మా నివాసస్థానం చూపించవలెనని అడుగుతున్నాను.”

శరభంగుడు రామలక్ష్మణులతో చెప్పాడు.

“రమణీయం, పరిశుద్ధం అయిన చక్కటి ప్రదేశాన్ని ... ఇక్కడికి దగ్గరలో ఉన్న సుతీక్ష్ణుడనే ముని మీకు సెలవిస్తాడు. ఆయన ధర్మాత్ముడు. మహాప్రభావం కలవాడు...

“శ్రీరామా! ఆ మందాకినీ నదీ ప్రవాహానికి ఎదురు గుండా వెళ్ళవలెను. అనగా ఇచ్చట నుంచి పశ్చిమాభిముఖంగా ప్రయాణించాలి. దారిలో పూల తెప్పలు అగుపిస్తాయి. ఆ దారిన ప్రయాణిస్తే ధర్మాచరణ పరాయణుడు సుతీక్ష్ణుడు ఉన్న ప్రదేశానికి చేరుతారు.”

శ్రీరాముడు మహర్షికి నమస్కరించాడు.

“నాయనా... శ్రీరామా... కొద్దిసేపు ఆగు కుబుసం విడిచిన పాము వలే నా జీర్ణదేహాన్ని వదలి వెళతాను. నీవు చూస్తుండగానే ఆ లోకాలకి వెళతాను. అది నా కోరిక” చెప్పాడు శరభంగుడు.

మహా తేజశ్శాలి అయిన శరభంగుడు అగ్ని ముట్టించాడు. ఆజ్యమును పోశాడు. మంత్రపూర్వకం చేశాడు. అందులోకి ఆనందంగా నడిచివెళ్ళాడు. వెంట్రుకలు, ముడతలు పడ్డ శరీరం, లోపలి మాంసం... అన్నీ... అన్నీ దగ్ధమైపోయాయి.

సీతారామలక్ష్మణులు ఆశ్చర్యచకితులై చూస్తుండిపోయారు. అంత ఆ అగ్ని శిఖరం నుంచి ఇరవై అయిదేళ్ళ యువకుడిగా శరభంగుడు అగ్ని గుండం నుంచి వెలుగిపోతూ బైటికి వచ్చాడు.

మహామహులైన ఋషుల లోకాలనూ, దేవతల లోకాలనూ దాటి బ్రహ్మలోకాన్ని చేరాడు. బ్రహ్మదేవుడు శరభంగుడిని స్వాగతించాడు.





# మునీశ్వరుల ప్రార్థన

శరభంగుడు బ్రహ్మాండలోకమైన బ్రహ్మలోకము చేరాడు. అంత భువి పై మునులందరూ ఒక్కచోట చేరి ఆదర్శప్రాయుడైన శ్రీరాముని దర్శనం కోసం బైలుదేరారు.

వైఖానసులూ, వాలిఖిల్యులూ, శ్రీపాదప్రక్షాళులూ, మరీచిపాయులూ, అశ్మకుట్టులూ, పత్రాహారులూ, దంతోలూఖలినులూ, ఉన్నజ్జకులూ, గ్రాతశయ్యులూ, అశయ్యులూ, అభ్రావకాశులూ, సలిలాహారులూ, వాయుభక్షకులూ, ఆకాశ నిలయులూ, స్థండిలశయ్యులూ, వ్రతోపవాసకులూ, దాంతులూ, ఆర్ద్రవస్తులూ, సజపులూ, తపోనిత్యులూ, పంచతపోన్వితులూ అయిన మహా మునీశ్వరులైన తేజోమూర్తులైన సమాధినిష్ఠులూ అయిన మహాతాపసులందరూ శరభంగుడి ఆశ్రమానికి వెళ్ళారు. శ్రీరాముని చుట్టూ అంతా చేరారు. అనేక విధాలుగా స్తుతించారు.

“శ్రీరామా! మహావీరుడవు నీవు. దేవతలకి దేవేంద్రుడి వలె ఈ భూలోకానికి రాజువు. ఇక్ష్వాకు వంశానికే నీవు శ్రేష్ఠుడవు. ధర్మనిరతిలో నీకు నీవే సాటి... నీ పితృభక్తి అసమానమైనది. ప్రజల ఆదాయంలో పన్ను రూపేణా ఆరో భాగం పుచ్చుకున్న రాజు సర్వధర్మ రక్షణ చేయకపోతే ధర్మం అథోగతి పాలు తప్పదు.

“ప్రజలందరినీ తన బిడ్డలుగా, మాన, ప్రాణ, భోజ్య రక్షణాది విషయాలతో పాలించిన నాడే ఆ భూపతికి భూమి ఉన్నంత కాలం కీర్తి ఉంటుంది. బ్రహ్మలోకంలో శాశ్వత స్థానం ఉంటుంది. అట్టి రాజుకి మాత్రమే. కందమూల ఫలాలను తింటూ తపస్సు చేసే మా వంటి తాపసుల తపో బలంలో నాలుగో శాతం రాజుకి దక్కుతుంది.

“ఒక్కసారి దీక్షగా మమ్ము గమనించు... ఘోరమైన పనులతో ఘోరాతిఘోరమైన చర్యలతో రాక్షసులు మమ్ము పెట్టు తిప్పలు అన్నీ ఇన్నీ కావు.

“వానప్రస్థులైన మా మీద, మందాకినీ నది నుంచి పంపానది వరకూ... ఇలా ఒకటేమిటి ఎక్కడ మునీశ్వరులు ముక్కుమూసుకొని తపస్సు చేసుకుంటున్నారో... అందరినీ నానా రకాల యాతనలూ, స్త్రీల మానాలనూ హరిస్తున్నారు. హత్యలూ చేస్తున్నారు.

"సమయ సందర్భాలతో పని లేకుండా అనేక రాక్షస కృత్యాలనూ, మునుల భక్షణలనూ రాక్షసులు చేస్తున్నారు. మేం ఎవరికి చెప్పుకొనగలం మీకు తప్ప...

"భూమిని పాలించి రక్షించే మీకు మొరపెట్టుకొనుచున్నాం. నీవే మా నాథుడవు. దయతో బాధ్యతతో మమ్ము రక్షింపుము" మహర్షులంతా శ్రీరాముడను వేడుకున్నారు. ప్రార్థించారు. విన్నవించారు.

సౌమ్య వదనంతో విన్న శ్రీరాముడు అభయహస్తంతో మృదుమధురమైన పలుకులను పలికాడు.

"తాపసులారా! మీ రక్షణ నా బాధ్యత. నా ధర్మం కూడా. మహర్షులారా... మీరు నన్ను ఆజ్ఞాపించాలి. వేడుకొనట తగదు. తండ్రి మాట కోసం అడవులకి వచ్చాను. రాజధర్మం ఎలా మరుస్తాను. మరెలా వీడుతాను. దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయటం నా విధి. రాకాసుల బారి నుంచి మిమ్మల్ని రక్షించితేనే నా రాజధర్మం నేరవేర్చుటతో పాటు మహాఫలం మా వంశానికి వస్తుంది. ఋషులను నానా తిప్పలు పెడుతున్న అందరినీ శిక్షిస్తాను. మీరు నా తమ్ముడి వీరపరాక్రమంతోపాటు నా ప్రతాపమూ చూస్తారు" చెప్పాడు శ్రీరాముడు.

అంత మునిజన పూజ్యుడు, వీరాధివీరుడైన శ్రీరాముడి మాటలకు మునులంతా సంతసించారు. ఆ మహా తపస్సంపన్నులకు అభయమిచ్చి శ్రీ సీతారాములు లక్ష్మణ సమేతంగా మునులతో పాటు సుతీక్ష్ణుడి ఆశ్రమం వైపు కదలి వెళ్ళారు.

## సుతీక్ష్ణుని ఆశ్రమం

శ్రీ సీతారాములు మునిపుంగవులతోనూ, తమ్ముడుతోనూ సుతీక్ష్ణుడి ఆశ్రమానికి కదలి వెళ్ళారు. దారిలో జలప్రవాహాలను దాటారు. ఎత్తైన పర్వతాల గుండా ప్రయాణించారు. భయంకరమైన అరణ్యాన్ని దాటారు.

అలా ప్రయాణించగా పూవులతోనూ, లతలతోనూ, అనేక మధుర ఫలాలతోనూ ఉన్న ఓ ఆశ్రమం కనిపించింది. అదే సుతీక్ష్ణుడి తపస్సు ఆశ్రమం.

ఓ చోట సుతీక్ష్ణుడు ఏకాంతవాసుడై ఉన్నాడు. అనేక సంవత్సరాల నుంచి తపస్సు చేయటం వల్ల శరీరమంతా మట్టితో నిండి ఉంది. జట్టు జడలు కట్టి వేలాడుతున్నాయి. ఆయన చెంత చేరాడు శ్రీరాముడు.

"మహామునీశ్వరునకు శ్రీరాముని ప్రణామాలు. భార్య, సోదర సమేతంగా... వేదవేదాంగ పారాయణులైన తాపసులతో మీ ఆశీర్వాదానికి వచ్చాము."





ఆ పలుకులతో సుతీక్ష్ణుడు కళ్ళు తెరిచాడు.

ధర్మవేత్తలలో శ్రేష్ఠుడూ, పరమ ధార్మికుడూ, మహా పరాక్రమ వీరుడూ అయిన శ్రీరాముడని చూస్తూనే రెండు చేతులతో పట్టుకొని ఆనంద పరవశంతో చెప్పాడు.

"శ్రీరామా! నా ఆశ్రమంలోకి వచ్చినందుకు నాతోపాటు ఈ ఆశ్రమ పరిసరాలు ధన్యమైనాయి. చిత్రకూటం వదలింది మొదలు నీ కోసమే ఎదురు చూస్తున్నాను. దేవేంద్రుడు శరభంగుడి కోసం వచ్చినప్పుడు నా దగ్గరికీ వచ్చాడు. పుణ్య లోకాలకు ఆహ్వానించాడు. జీవిత పర్యంతమూ సాధించిన నా తపోఫలాన్ని నీకు అర్పిస్తాను స్వీకరించు. సీతా, లక్ష్మణుడితో ఆ పుణ్య లోకాలలో విహరించు."

అంత శ్రీరాముడు తపశ్శాలిని, మునీంద్రుడైన సుతీక్ష్ణమునితో "స్వామీ మన్నించాలి. రాజ ధర్మం తీసుకోదు. ఇస్తుంది. సాధిస్తుంది. ఆ పుణ్యలోకాలను నా ధర్మనిరతితో సాధించుకుంటాను. ఈ మహారణ్యంలో మేం నివసించటానికి అనువైన ప్రదేశాన్ని చూపించమని మనవి. సమస్త ప్రాణకోటికి మేలు చేసే మహానుభావుడవని శరభంగుమహర్షి మీ గూర్చి చెప్పటం జరిగింది."

శ్రీరాముడు అలా చెప్పగానే సుతీక్ష్ణుడు సంతోషించాడు.

"శ్రీరామా! మీరు ఈ నా ఆశ్రమంలో ఉండవచ్చు. ఎంతో తపసిద్ధి గల ఆశ్రమం. అనేక సాధుసిద్ధులు వచ్చే ఆశ్రమం. కందమూల ఫలాలు సమృద్ధిగా దొరుకుతాయి... కానీ శ్రీరామా... అనేక క్రూర జంతు జాలం ఈ ఆశ్రమ ప్రాంతంలో తిరుగుతూ ఏకాంతానికీ, తపస్సుకీ విఘాతం కలిగిస్తుంటాయి."

శ్రీరాముడు ప్రశాంత చిత్తంతో విన్నాడు. వింటిత్రాటిని మ్రోగించాడు.

"మన్నించాలి మహర్షీ... వచ్చిన జంతువులని వచ్చినట్టే నేను సంహరించగలను. అది చూసి మీరు వ్యథ చెందుతారు. మిమ్మల్ని కష్టపెట్టే పని నేను చేయను. కాన ఈ ఆశ్రమంలో చిరకాలం ఉండలేను" చెప్పాడు శ్రీరాముడు.

మునీశ్వరుడు చెప్పిన ధర్మసూక్ష్మలన్నీ శ్రద్ధగా విన్నాడు. సాయం సంధ్య అవ్వటంతో సంధ్యోపాసన కోసం శ్రీరాముడు సరస్సుకు బైలు దేరాడు. సంధ్యోపాసన పూర్తి చేసుకొని ఆ రాత్రి సుతీక్ష్ణుడి ఆశ్రమంలోనే గడిపాడు.

మునులు తినే ఆహారాన్ని శ్రీసీతారామలక్ష్మణులకు అందించాడు సుతీక్ష్ణుడు. చక్కగా తనే స్వయంగా సత్కరించాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

తెల్లవారింది. కలువ పూవుల వాసనల గల చల్లని నీటిలో శ్రీరాముడు సీతాదేవితో స్నానం చేశాడు. అగ్నిహోత్రులనూ, దేవతలనూ ఆరాధించారు. యథావిధిగా అగ్నిహోత్ర కార్యాలన్నీ అయ్యాక శ్రీరాముడు సుతీక్ష్ణుడితో-

"పరమపూజ్యా... మహాత్మా... మీ సత్కారములకు ధన్యులం. సూర్య భగవానుడి ఎండ వేడికి చిక్కకుండా ఈ మహర్షులతో నేను పయనమవ్వాలి. అనేక తాపసుల ఆశ్రమాలను సందర్శించాలి. తమకు వీడ్కోలు చెపుతున్నాను. శెలవు మహర్షీ" అని ఆ మహర్షికి అనేక వందనములు చేశారు.

రామలక్ష్మణులను సుతీక్ష్ణుడు దగ్గరికి తీసుకొని చెప్పాడు.

"శ్రీరామా... నీ భార్యతోనూ, తమ్ముడితోనూ, మునిశ్వరులతో వెళ్తున్న మీకు ఏ ఉపద్రవం రాదు. ఈ దండకారణ్యంలో ధ్యాన పరుల ఆశ్రమాలన్నింటినీ దర్శించు. కందమూలఫలాలూ, పళ్ళూ సమృద్ధిగా దొరుకుతాయి. అన్ని రకాల జంతువులు జాతి వైరం మరిచి స్నేహంగా ఉంటాయి. దారిలో అనేక జలాశయాలు నిర్మలమైన నీటితో ఉంటాయి. అవశ్యంగా వెళ్ళు శ్రీరామా. మళ్ళీ నా ఆశ్రమానికి రావాలి శ్రీరామా" చెప్పాడు.

సీతారామలక్ష్మణులు అంగీకరించి ఆ మునిశ్వరునికి ప్రదక్షణం చేశారు. సీతాదేవి భర్తకు విల్లూ, అమ్ములపొదులూ అందించింది.

ధనస్సులూ, బాణాలూ పట్టుకొని వాటితో ధ్వనులు సృష్టిస్తూ బయలు దేరారు శ్రీరామలక్ష్మణులు.

వారిని ముని పుంగవుడైన ధర్మభృత్తుడూ, తాపసులూ అనుసరించారు.

## సీతాదేవి పలుకులు

సుతీక్ష్ణుడి నుంచి శెలవు తీసుకొని బయలు దేరాక... సీతాదేవి అనురాగయుక్తమైన మాటలతో శ్రీరామునితో చెప్పింది.

"స్వామీ మీరు పూనిన ధర్మం ఎంతో గొప్పది. అలాంటి ధర్మదీక్షలో ఉన్న మీరు అధర్మ నిరతితో సాగుతారేమోనని చింతగా ఉంది. స్వామీ తమరు ఇంద్రియాలని గెలిచిన వారు. అబద్ధమన్నది తెలీదు. ఇక ముందు అంతే. అందు ఎట్టి సందేహంలేదు.





"ఓ మహాభాగా! కామంతో పుట్టిన వ్యసనాలు మూడు. అబద్ధ మాడటమూ, పరస్త్రీ పొందు కోరటమూ, ఎట్టి కారణం లేకుండా కోపం తెచ్చుకోవటమూ, ఈ మూడు తమరింత వరకూ మీరలేదు. ఇక ముందు మీరరు.

"ధర్మ నాశనహీనులైన పరస్త్రీ అభిలాష మీకు ఏ కోశానాలేదు. సత్యసంధుడవు... తండ్రి ఆజ్ఞతో అడవులకి వచ్చిన ధర్మమూర్తివి... పితృ భక్తి పరాయణుడవు... అట్టి మీకు చెప్పతగిన దానని కాదు.

"కామంతో పుట్టిన గుణాల్లో మూడోది అనవసరంగా కోరి కోపం తెచ్చుకోవటం. విరోధులను తయారు చేసుకోవటం. అది రౌద్ర వ్యసనం. మహా మునీశ్వరులతో తమరు రాక్షస సంహారం చేస్తానని శపథముతో పాటు, అభయమూ, వరమూ ఇచ్చి ఉన్నారు.

"ధనుస్సులతో దండకారణ్యంలోకి ప్రవేశించింది వనవాసం కోసం. రాక్షసులతో పోరాడుట కోసం కాదు.

"వనవాస దీక్షలో ధనస్సూ, బాణాలూ ఎందుకు? ఆయుధాలు రౌద్రాన్ని ప్రేరేపిస్తాయి. క్షత్రియుడి చేతిలో ధనస్సుంటే అగ్నిహోత్రుడి వద్ద ఎండిన కర్రలున్నట్టే...

"ప్రభూ... తమకి ఉన్నన్ని సమస్త సద్గుణాలు మహామహులైన జితేంద్రియలకు తప్ప ఉండవు. సత్య ప్రతిజ్ఞతో పాటు ఏక పత్నీవ్రతమూ అనన్య అద్భుత రీతిలో ఉన్నాయి.

"నాథా! సావధానంగా అలకించుము. పూర్వము ఒక ఋషి అకుంటిత దీక్షతో తపస్సు చేసుకొనుచున్నాడు. అది దేవరాజు దేవేంద్రుడికి కంటగింపైంది. అతడు భటుడి వేషంలో ఆ మునీశ్వరుని చెంత చేరి-

"మహోగ్ర తపస్సు పుంగవునకు నమస్కారములు. ఓ చిన్న సాయం చేయవలెను" అని అడిగాడు.

"భటుని వేషంలో ఉన్న దేవేంద్రుడను అడగమన్నాడు ఆ ముని. ఓ ఆయుధాన్ని ముని పుంగవనికి ఇచ్చి దీన్ని భద్రంగా దాయమన్నాడు. ఆ చిన్న కోరికను కాదనలేకపోయాడు ముని. ఇచ్చిన మాట కోసం భటుడిచ్చిన ఆయుధాన్ని సర్వకాలసర్వావస్థలలో వదలకుండా ఉండేవాడు.

"ప్రతిక్షణం దాని గూర్చే ధ్యాస. మాటి మాటికీ చూసుకుంటూ ఉండేవాడు. అలా ఆయుధాన్ని చూసి చూసి తపస్సు లక్షణాలు కనుమరుగై పోయాయి.

రౌద్రతత్వం వచ్చేసింది. ధర్మబుద్ధి కరిగిపోయింది. ఆయుధ సహకారంతో రాక్షస ప్రవృత్తి ప్రవేశించి హింసకు పూనుకున్నాడు. చివరకు నరకానికి వెళ్ళాడు.

"నాథా... నేను చెప్పిన మాటలు ఆలకించు... ఆయుధం ఉందంటే అగ్ని ఉన్నట్టే అని పెద్దలు పూరికే చెప్పలేదు. మీ మీద అపార ప్రేమా, గౌరవముతోనే ఇది చెప్పుటకు సాహసించాను. మీకు తెలియని ధర్మ సూక్ష్మం కాదు.

"నేను మీకు ధర్మభోధ చేయటంలేదు. మీరు ధనుస్సు చేతపట్టి రాక్షసులని సంహరించటం అకార్యం. ఆయుధ కారణం రౌద్రబుద్ధిని పెంచుతుంది. ధర్మం సన్నగిల్లుతుంది. ధర్మము వల్ల సుఖమొస్తుంది. ధర్మము వల్ల అర్థం సమకూరుతుంది. ధర్మము జగత్తుకు మూలం. ఋషులను రక్షించండి. విరోధ కారణం లేకుండా రాక్షస సంహారం కొరకై ధనస్సును వినియోగించకండి.

"ఆయుధం... అడవి... క్షాత్రము... తపస్సు... పరస్పర విరుద్ధాలు. అడవిలో తపస్సుకై వచ్చాం. తపస్సు అయ్యాక అయోధ్య వెళ్ళాలి. అప్పుడు క్షత్రియ ధర్మం అవలంబిద్దాం. స్వామీ ఆలోచించండి. ఈ తపోవనంలో తపస్సు చేసి పుణ్యం సంపాదిద్దాం. స్త్రీ చాపల్యంతో ఇదంతా చెప్పాను. మీ తమ్ముడితో కూడా సంప్రదించి మీకు ఏది ఇష్టమైతే అది చెయ్యండి..."

★★★ ★★★ ★★★

జనకమహారాజు కూతురు, ఉత్తమ వంశంలో పుట్టి ధర్మం తెలిసిన సీత చెప్పినదంతా సావధానంగా విన్నాడు శ్రీరాముడు. ఆమె పతి భక్తికీ, హితవచనలకీ సంతోషించాడు.

"దేవీ... నా మీద ప్రేమతో, స్నేహంతో హిత వాక్యాలను చెప్పావు. ఎవ్వరూ పీడితులు ఉండకూడదనే క్షత్రియులు ధనస్సు పట్టుకుంటారని నువ్వే చెప్పావు. ఎప్పుడూ తపస్సులతోనూ, ధ్యానాలతోనూ, యాగాలతోనూ సంచరించే ఈ సాధుజనం ఆ రాక్షసులకు ఎంత భయపడిపోతున్నారో నీవూ గమనించావు. వారు ఫలాది, కందమూల ప్రియులు... సాధులు... అట్టి వారి మీద పడి వారిని హింసించి... వారినే తినెయ్యడం ప్రారంభించారు రాక్షసులు.

"సాధుపుంగవ, మునీశ్వర భక్షణ చేస్తుంటే వారు తల్లడిల్లి నా వద్దకు వచ్చి మొరపెట్టుకున్నారు. సీతా అపచారం చేశాను. వారి దగ్గరికి నేనే వెళ్ళి వారి యోగక్షేమాలు చూడవలసిన వాడిని, అది చెయ్యకుండా నా వద్దకు





వచ్చేలా చేశాను. అందుకే నన్ను ఏం చెయ్యమంటారో శెలవివ్వండి, అని వారిని అడిగాను. అంటూ చేతులు జోడించాను."

దానికి మునులంతా... "రాక్షసులు కామరూపులై విహరిస్తూ యాతనలకు గురిచేస్తున్నారు. హోమాలు చెయ్యనియ్యటంలేదు. మా క్రతువులను చెడగొడుతున్నారు. మా తపోబలంతో వారిని శపించగలం. కానీ ఎంతో నిష్ఠతో ధర్మ, దైవ బలంతో సాధించుకున్నది అట్టి నీచులకై వాడకూడదని సంశయిస్తున్నాము. భూమికి రాజైన నీవే మాకు రక్ష... దిక్కు... శ్రీరామా. నువ్వూ, నీ తమ్ముడూ రాక్షస సంహారం చేయండి. ఇది మా అందరి వేడుకోలు..." అని చెప్పారు.

"సీతా... జనకరాజ పుత్రీ... జానకీదేవీ... మహర్షుల వ్యధలు నీవూ విన్నావు కదా! అప్పుడే మాట ఇచ్చాను. ప్రతిజ్ఞ చేశాను. నా సత్యవ్రతము గుర్చి తెలుసు... ఈ ప్రపంచమున అన్నింటికన్న అదియే నాకు ముఖ్యం. ఆడిన మాట తప్పను. అందరినీ కాపాడుతానని చెప్పాను.

"ఓ మైథిలీ... సత్యమే ప్రాణం నాకు. దాని తర్వాతే నువ్వూ... తమ్ముడూ, రాజ్యమూ, మిగతా అంతా...

"మునీశ్వరులు అడిగేంత వరకూ చెయ్యలేకపోయినందుకు నేను వ్యధ చెందుతున్నాను. ఏది ఏమైనా హితులైన వారికే హితము చెబుతారు. నీ హిత వచనాలకు సంతోషం... నా సహధర్మచారిణివి నీవు... నేను ఏ ధర్మాన్ని ఆచరిస్తే అదే నీకు ధర్మం..." చెప్పాడు అనునయంగా జనకరాజపుత్రి మైథిలీతో-

## సరోవర సందర్శనం

శ్రీరాముడు ముందు నడుస్తున్నాడు. ఆ వెనుక సీతా... ఆమె వెనుక లక్ష్మణుడు విల్లూ, అంబులూ పట్టుకొని నడుస్తున్నాడు. ముగ్గురి వెనుకగా మునిపుంగవులు నడుస్తున్నారు. అనేక పర్వతాల గుండా, నదుల గుండా, వనాల గుండా, ఇసుక దిబ్బల గుండా... వృక్షరాజముల క్రింద... ప్రయాణించారు.

రకరకాల పక్షులూ, తామర కొలనులూ, అనేక అడవి జంతువులూ, చెట్లను పెకిలిస్తున్న ఏనుగులూ... చూసుకుంటూ, దాటుకుంటూ నడిచారు. సూర్యాస్తమయం అయింది.

అల్లంత దూరాన నాలుగు యోజనాల సరస్సును చూశారు. ఎంతో రమ్యంగా ఎర్ర, తెల్ల తామరలతో నిండి ఉంది.

రాజహంసలూ, కలహంసలూ గానం చేస్తున్నాయి. జంత్ర వాద్యాలూ వినిపించాయి.

శ్రీరాముడుకి అక్కడెవ్వరూ కానరాలేదు. సీతా లక్ష్మణులలోనూ కుతుహలం. శ్రీరాముడు ముని పుంగవుడైన ధర్మభృత్తుని అడిగాడు.

"మహామునీ... అక్కడెవరూ కాన రావటం లేదు. సరస్సు నుంచి రమ్యమైన సొగసైన జంత్రగానం వినవస్తోంది. నేను తెలుసుకోవచ్చునను కుంటే... రహస్యం ఏమీ గాకుంటే మాకు చెప్పవలెను" అడిగాడు శ్రీరాముడు.

"శ్రీరామా! ఈ సరస్సు పేరు పంచాప్సరం. మాండకర్ణి మహర్షి తన తపోబలంతో నిర్మించాడు. ఎప్పుడూ జంత్ర గానాలూ, గీతా వాద్య ధ్వనులూ వినిపిస్తూ ఉంటాయి.

"ఆ మహర్షి పదివేల సంవత్సరాలు వాయు భక్షణ చేసి నీటిలో తపస్సు చేశాడు. ఆ తపస్సుకు అగ్నిహోత్రుడితో సహా దేవతలంతా భయకంపితు లయ్యారు.

"తమ పదవులని హరించటానికే ఆ తపస్సు అని అంతా ఆలోచించి అద్భుత అందగత్తెలైన అప్సరసలను ఐదుగురిని మాండకర్ణినుడి వద్దకు పంపారు. తపస్సు పాడు చెయ్యమని శాసించారు.

"ఆ అప్సరసలు అనేక రకాలుగా మాండకర్ణి మహర్షిని కదిలించి మెప్పించారు. భార్యలయ్యారు. సర్వ సుఖాలకి సిద్ధమయ్యారు.

"మాండకర్ణి మహర్షి తన తపోబలంతో యువకుడయ్యాడు. సరస్సులో అద్భుత భవనాన్ని నిర్మించాడు. అందులో ఆ ఐదుగురు అప్సరసలతో సర్వ సుఖాలను అనుభవిస్తున్నాడు. ఆడుతున్నాడు. పాడుతున్నాడు. వారితో క్రీడిస్తున్నాడు. అదిగో ఆ అప్సరసల నగల చప్పుళ్ళే ఈ ధ్వనులు" చెప్పాడు ధర్మభృత్తు.

అది విన్న సీతారామలక్ష్మణులు నివ్వెరపోయారు. దాన్ని దాటి ముందుకు వెళ్ళారు. కొంత దూరం వెళ్ళగా దర్భలతోనూ, వల్కలాలతోనూ ఉన్న ఆశ్రమం కనిపించింది. ఆ ఆశ్రమంలోకి వెళ్ళాడు శ్రీరాముడు.

అక్కడ ఎన్నో మాసాలున్నాడు. అక్కడ్నించి మరో ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ కొంత కాలం ఉన్నాడు. ఓ చోట పదమూడు మాసాలూ, మరో చోట సంవత్సరమూ, ఇంకొక చోట నాలుగు మాసాలూ, మరోచోట మూడు మాసాలూ అలా ఋషుల ఆశ్రమంలో పదేళ్ళు సుఖంగా గడిపాడు.





తమ్ముడుతోనూ, భార్యతోనూ ప్రతీ ఆశ్రమాన్నీ ఒకటి కంటే ఎక్కువ సార్లు సందర్శించాడు. రాక్షస బాధ పోగొట్టడానికి మునీశ్వరుల ఆశ్రమాల్లో ఎక్కువ కాలం గడిపాడు.

ఆ తర్వాత మళ్ళీ సుతీక్ష్ణుడి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ కొంత కాలం ఉన్నాడు.

ఒకనాడు శ్రీరాముడు సుతీక్ష్ణుడితో... "మహర్షీ...ఈ వనంలో అగస్త్య మహర్షి ఉన్నాడని మునులంతా అనుకొంటుంటే విన్నాను. వారిని దర్శించాలని, సేవించాలని ఉంది. వారి ఆశ్రమానికి త్రోవతెలీయదు. తమరు సెలవిస్తే భార్య, సోదర సమేతంగా వారిని దర్శించి, సేవించి ఆశీర్వాదం పొందుతాను."

"శ్రీరామా! నేనే నీకు ఆ విషయం చెబుదామనుకుంటున్నాను. దైవవశాత్తు నీవే అడిగావు. అగస్త్యుడి ఆశ్రమం ఇక్కడికి దక్షిణ దిక్కుగా నాలుగు యోజనాల దూరంలో ఉంది. దూరం నుంచే నీకు పిప్పలి వనం కానవస్తుంది. దాని దగ్గరలోనే ఉంది ఆశ్రమం.

"ఆ ఆశ్రమం అగస్త్యభ్రాత ఆశ్రమం. ఆ రాత్రి అక్కడే ఉండండి. ఆ ఆశ్రమం పరిసరాల్లో పక్షులు మధురంగా కూస్తూ వుంటాయి. పళ్ళ చెట్లూ, పూల చెట్లూ మీ కనులకు మనోహర అందాలను పంచుతాయి. స్వచ్ఛమైన నీటిలో అనేక రకాల తామరలూ, చక్రవాకాలూ, హంసలూ గలగలమని నీటిలో పోటీపడుతూ జారుతుంటాయి.

"అక్కడ్నించి దక్షిణ దిక్కుగా పెద్ద చెట్టును దాటుతూ పోతుంటే ఓ యోజన దూరంలో అగస్త్యాశ్రమం కానవస్తుంది. మహారమణీయమైన ఆ ఆశ్రమంలో అగస్త్యుడని సేవించవచ్చును. అక్కడ కొంత కాలం గడపవచ్చు. కాన ప్రయాణానికి సిద్ధంకమ్ము. ఆలస్యం కాకుండా బయలుదేరు" చెప్పాడు సుతీక్ష్ణుడు.

సీతారామలక్ష్మణులు మహర్షికి వందనము చేసి శెలవు తీసుకొని ప్రయాణించారు. మహర్షి చెప్పిన విధంగా వనాలూ, పర్వతాలూ, జలాశయాలూ దాటుకుంటూ అగస్త్యభ్రాత ఆశ్రమానికి చేరుకున్నారు.

"లక్ష్మణా! మహర్షి చెప్పిన ఆనవాలు ప్రకారం ఇది పుణ్యకర్ముడు అగస్త్య మహర్షి సోదరుడి ఆశ్రమం. అదిగో చూడు పండ్ల బరువుకు వంగిన చెట్లు... పూవులతో నిండి మోయలేక వంగిపోయిన లతలు... పిప్పలి చెట్ల అరమగ్గిన పిప్పలి పళ్ళ వగరు వాసన ఇచ్చటకు వస్తోంది.

"అటుచూడు... మునులు తెచ్చుకున్న కట్టెల మోపులు... అదుగో మునులు... పుణ్య తీర్థాలలో స్నానం చేసి స్వయంగా కోసి తెచ్చుకున్న పుష్పములతో పుష్పబలి ఇస్తున్నారు.

"లక్ష్మణా! సుతీక్ష్ణముని చెప్పిన ఆశ్రమం ఇదే. సందేహం వలదు. ఇతని అన్న అగస్త్యముని మహాతపఃశ్శాలి. ఆ మహాత్ముడిని దర్శించటానికి ముందు ఇక్కడ విడిది చేద్దాం. అగస్త్యముని లోకమేలుకై మృత్యువుని నిగ్రహించుకున్నాడు. ఈ దక్షిణ దేశాన్ని ఋషులకు నివాస యోగ్యం చేశాడు."

## వాతాపీ

"పూర్వం ఇక్కడ ఇల్వలుడూ, వాతాపీ అనే ఘోర రాక్షస అన్నదమ్ములు నివశించేవారు. వారు బహుక్రూరులు. ఇల్వలుడూ సద్ బ్రాహ్మణ వేషధారిగా మారి, సద్ బ్రాహ్మణ భాష మాట్లాడుతూ శ్రాద్ధకర్మలకని బ్రాహ్మణులను తీసుకు వచ్చేవాడు.

"తమ్ముడు వాతాపీ మేక రూపంలో ఉండేవాడు. దయదాక్షిణ్యంలేని వారి దగ్గరికి భోక్తలు అమాయకంగా వచ్చేవారు. ఇల్వలుడు శ్రాద్ధకర్మలు చేస్తూ, మేక రూపంలో ఉన్న తమ్ముడిని చంపి చక్కగా రుచికరంగా వండి వడ్డించేవాడు.

"బ్రాహ్మణులు భోజనం చేశాక, ఇల్వలుడు తమ్ముడని "వాతాపీ" బయటకు రా అని పిలిచేవాడు.

"మేకలా అరుస్తూ బ్రాహ్మణుల పొట్ట చీల్చుకొని వచ్చేవాడు. ఆపై వారు భోక్తలను తృప్తిగా ఆరగించేవారు. ఎంతో మంది బ్రాహ్మణులను వారు తమ పొట్టన పెట్టుకున్నారు.

"వారి చేష్టలు భరించలేక దేవతలు అగస్త్యుణ్ణి ప్రార్థించారు. అగస్త్యుడు ఇల్వలుడి వద్దకు భోక్తగా వెళ్ళాడు.

"ఎప్పటిలా ఇల్వలుడు మేక రూపంలో ఉన్న తమ్ముడిని చంపి వండి పెట్టాడు అగస్త్యునకు.

"ఉత్తరాపోశనం ఇచ్చి ఇల్వలుడు.... వాతాపీ... ఇక వచ్చేయి అన్నాడు. అగస్త్యుడు నవ్వి... ఇంకెక్కడి వాతాపీ... జీర్ణం... జీర్ణం... వాతాపీ జీర్ణం. ఎప్పుడో యముని దగ్గరికి వెళ్ళాడు. ఇక మిగిలింది నీవే అన్నాడు.

"ఇల్వలుడు ఉగ్రుడయ్యాడు. విచక్షణా రహితమైన ఆవేశంతో అగస్త్యుడి మీదకు వెళ్ళాడు. అగస్త్యుడు కళ్ళెర్రచేశాడు. నిప్పులు కురిశాయి. అందులో





పడి మాడి మసి అయిపోయాడు. తాపసులకు వారిద్దరి రాక్షసుల పీడ విరగడయ్యింది.

"లక్ష్మణా... కనిపిస్తున్న ఆశ్రమమే ఆ మహాముని అగస్త్యుడి తమ్ముని ఆశ్రమ సదనం. వెళ్ళి ఆయన ఆశీర్వాదం తీసుకుందాం" చెప్పాడు శ్రీరాముడు.

అగస్త్యుడి సోదరుడు వద్దకు వెళ్ళి నమస్కరించాడు శ్రీరాముడు. అగస్త్యుడి తమ్ముడు వారి రాకతో పరమానందభరితుడయ్యాడు.

తటాకాలతో, ఫల వృక్షాలతో శోభిస్తున్న ఆశ్రమ పరిసరాల్లోని ఫలాలనూ, కందమూలాలనూ తెప్పించాడు. సమర్పించాడు. వాటిని ఆనందంగా స్వీకరించి ఆ రాత్రి అక్కడే గడిపారు. తెలతెల్లవారుతూనే లేచారు. ఉదయపు కార్యాలన్నీ అయ్యాక అగస్త్యుడి తమ్ముడి వద్ద శెలవు తీసుకున్నారు.

"అగస్త్యభ్రాతకు ప్రణామాలు. మీ ఆతిథ్యానికి ధన్యవాదములు. శెలవైన తమ అన్నగారు అగస్త్యుడి దర్శనార్థమై సాగిపోతాం. సెలవియ్యగలరు"

సీతారామలక్ష్మణుల ద్వయానికి తన ఆశీస్సులను అందించాడు.

అడవిలోని అందాలనూ, పక్షుల రాగయుక్త కూతలనూ వింటూ ప్రయాణం సాగించారు. ప్రయాణ మార్గంలో పొగడ చెట్లూ, పనస చెట్లూ, మారేడు చెట్లూ, ఇప్పలూ, తుమ్మికలూ ఇలా ఎన్నో రకాల జాతి చెట్లూ కనిపించాయి. అవి అన్నీ పూతకు వచ్చి పుష్టిగా ఉన్నాయి. కనులకు ఆనందాన్ని కలగ చేస్తున్నాయి.

"లక్ష్మణా! గమనించావా! పూల పిందెలు తిని పక్షులు ఎంత హాయిగా ఉన్నాయో చూడు. జాతి వైరం మరిచిన జంతువుల స్నేహ భాందవ్యాన్ని చూడు... లక్ష్మణా చూడబోతే వింధ్య పర్వతాన్ని లొంగ తీసిన ఆ ముని పుంగవుని ఆశ్రమం దరిదాపుల్లోకి మనం వచ్చినట్లుంది కదూ"

లక్ష్మణుడు శ్రీరాముడి మాటలకు తలవూపాడు.

"లక్ష్మణా! మహాముని పుంగవుడు అగస్త్యుడి వల్లనే దక్షిణ దిక్కులో రాక్షసుల బాధ వదిలింది. అగస్త్యుడి భయంతోనే రాక్షసులు అనేక మంది ఋషులతో వైరం లేకుండా ఉంటున్నారు. ఆ పరమ పూజ్యుడైన మహర్షి ఇచ్చట నివశించుట వల్లే ఈ దిక్కుకు అగస్త్యదిక్కు అని వచ్చింది.

"అదిగో తమ్ముడా! ఆశ్రమం నుంచి వస్తున్న పొగ. అల్లదిగో ఆరబెట్టిన నార బట్టలు. శ్రీమంతమైన మహానుభావుడైన అగస్త్యుడి ఆశ్రమం. ఆ ఆశ్రమ వనం చూసినంతనే ప్రయాణ బడలిక పోయింది.

“ పర్వతాలలో శ్రేష్ఠమైన వింధ్య పర్వతం సూర్యుడి మార్గాన్ని అడ్డగిస్తూ పెరిగిపోతుండటంతో ఈ మునీశ్వరుడే ఒక్క మాటతో వింధ్యపర్వతాన్ని పెరగకుండా చేశాడు.

“లక్ష్మణా... అన్ని లోకాలు అగస్త్యుడను పూజిస్తాయి. ఆయన చెంత ఉంటే అంతా మేలు జరుగుతుంది. అబద్ధాలు ఆడేవారూ, క్రూరులూ, ఘాతకులూ, వంచకులవంటి వారు ఆ మహానుభావుని వద్ద ఉండలేరు. చూడలేరు. ఉండరు. మన మిగతా వనవాస కాలమంతా ఇక్కడే గడుపుదాం.

“ఇక్కడ యక్షులూ, గంధర్వులూ, నాగులూ లాంటి వారేకాదు పక్షులు కూడా ధర్మాన్ని పాటిస్తూ మిత ఆహారంతో నివసిస్తుంటాయి. ఎంతో మంది ఋషులు తమ దేహాలని వదలి సూర్యకాంతి తేజోవిరాజినులై స్వర్గలోకానికి వెళ్ళారు.

“లక్ష్మణా! నీవు ముందుగా లోనికెళ్ళి సీతా సమేతుడనై నేను వచ్చానని అగస్త్య మహర్షికి తెలియచేయవలెను.”

☆☆☆ ☆☆☆ ☆☆☆

అన్న రామన్న ఆజ్ఞప్రకారం లక్ష్మణుడు ఆశ్రమంలోనికి వెళ్ళాడు. అగస్త్యుడి శిష్యుడని గాంచి... “దశరథ మహారాజు జ్యేష్ఠ పుత్రుడు శ్రీరామచంద్రుడు ఆయన సహధర్మచారిణి సీతాదేవితో వచ్చి ఉన్నాడు, అగస్త్య మహర్షి దర్శనార్థం.

“నేను ఆయన తమ్ముడను, లక్ష్మణుడను. తండ్రి ఆజ్ఞతో మేం ఇలా అరణ్యాలకి వచ్చాం. మా గూర్చి మీరు వినే ఉంటారు. కాన ఈ సంగతి మహర్షికి విన్నవించమని మా మనవి” చెప్పాడు.

శిష్యుడు అగ్నిహోత్ర గృహమునకు వెళ్ళి శ్రీరామ ఆగమనాన్ని గూర్చి చెప్పాడు. అది విన్న అగస్త్యుడు మహదానందభరితుడయ్యాడు.

“మహాభాగ వైదేహీ మంగళరూపిణీ, సీతాదేవితో శ్రీరాముడు వచ్చినాడా! అతని తమ్ముడు లక్ష్మణుడుతో సహా... ఎందుకు వెనువెంటనే తీసుకొని రాలేదు. ఆహా ఎంత భాగ్యం... శ్రీరాముడు నా వద్దకు వచ్చినాడా! అతని రాకకై వారి దర్శనం కోసమే ఎదురుచూస్తున్నాను. నీవు వెంటనే సాదరంగా వారిని ఆశ్రమంలోకి తీసుకురావలెను” చెప్పాడు.

అగస్త్యుడి మనో వేగం వలె శిష్యుడు శ్రీరాముని వద్దకు వెళ్ళాడు. వినయంతో, విధేయతతో, గౌరవంతో ఆశ్రమంలోకి తీసుకువెళ్ళాడు.





శిష్యుని వెంట అంతా నడిచారు. ఆశ్రమ ద్వారం సమీపించారు. ఆశ్రమ ఆవరణలో లేళ్ళు యథేచ్ఛగా తిరుగుచున్నాయి.

బ్రహ్మస్థానాన్నీ, అగ్నిస్థానాన్నీ, విష్ణుస్థానాన్నీ, దేవేంద్రస్థానాన్నీ, సూర్యస్థానాన్నీ, చంద్రస్థానాన్నీ, భగస్థానాన్నీ, కుబేరస్థానాన్నీ, ధ్యాతస్థానాన్నీ, విధాతస్థానాన్నీ, వాయుస్థానాన్నీ, శేషస్థానాన్నీ, అనంతునిస్థానాన్నీ, గాయత్రీ స్థానాన్నీ, వసుస్థానాన్నీ, వరుణస్థానాన్నీ, కార్తికేయుడి స్థానాన్నీ చూస్తూ లోపలికి వెళ్ళారు.

శ్రీరాముడిని చూస్తూనే అగస్త్యుడు ఎదురొచ్చాడు. మహాతేజోవంతమైన అతని ముఖవర్చస్సు సీతారామలక్ష్మణులను చూడగానే మరింత వెలిగిపోయింది. మునులందరినీ వెంట పెట్టుకొని వస్తున్న శ్రీరాముడను తనివి తీరా కనులార్పకుండా చూశాడు అగస్త్యుడు.

కొండంత తృప్తికి లోనయ్యాడు అగస్త్యుడు.

“లక్ష్మణా! అదిగో ఆ తేజోరూపం... అతనే అగస్త్యుడు” చెప్పాడు శ్రీరాముడు.

సీతారాములు అగస్త్యునకు నమస్కరించారు. లక్ష్మణుడు కూడా నమస్కరించాడు అగస్త్యునకు. అగస్త్యుడు శ్రీరాముడిని కుశల ప్రశ్నలు వేశాడు. పాద్యమూ, అర్ఘ్యమూ ఇచ్చాడు. అతిథులను పూజించి ఫలాలనూ, వన్యద్రవ్యాలనూ, పూలనూ ఇచ్చాడు.

“శ్రీరామా అతిథికి అర్ఘ్యమిచ్చి పూజింపవలెను. ఋషధర్మ ప్రకారం అట్లు చేయనిచో తప్పుడు సాక్ష్యమిచ్చిన వాడివలె ఆ లోకాన తన మాంసాన్ని తానే తినాలి...

“ఓ శ్రీరామా! నీవు మహారథుడవు, సమస్త లోకాలకీ నాయకుడవు... పూజనీయుడవు... సత్యవాదివి... మాన్యుడవు... నా అతిథి సత్కారాలకు ఆనందపడినావా? ధన్యుడనయితినా నేను...

“శ్రీరామా! పురుషోత్తమా! ఇదిగో దివ్యధనుస్సు. రత్న కాంచనాలతో ఉన్న ధనుస్సు... సాక్షాత్తు శ్రీమహావిష్ణువిది. విశ్వకర్మ చేసిన ధనుస్సు ఇది. బ్రహ్మదేవుడు నాకు ఇచ్చాడు. అగ్నిహోత్రంలా మండుతున్న బాణాలతో నిండిన అక్షయ తూణీరాలను దేవేంద్రుడు నాకు ఇచ్చాడు. దానితోపాటే బంగారు పిడితోనూ, ఒరతోనూ ఉన్న ఖడ్గాన్ని కూడా దేవేంద్రుడే ఇచ్చాడు.

"శ్రీరామా! ఈ ధనుస్సుతోనే పూర్వం మహావిష్ణువు రాక్షస సంహారం చేశాడు. దేవతలకి రాజ్యలక్ష్మిని తెచ్చాడు. ఇవి స్వీకరించు. వీటిని సంధించ అర్హత పృథ్విపై నీ ఒక్కడికే ఉంది. శత్రువులని జయించు. లోక కళ్యాణం చెయ్యి శ్రీరామా!" అంటూ శ్రీరామునికి సమర్పించాడు.

## పంచవటి

"శ్రీరామా! సీతాదేవితో, లక్ష్మణుడితో కలిసి నా ఆశ్రమానికి వచ్చావు. నాకు బహు ఆనందంగా ఉంది. ఎంతో దూరం నుంచి అరణ్యాలూ, పర్వతాలూ, వనాల గుండా రావటం వల్ల ఎంతో అలిసిపోయారు.

"మహాసాధ్వి సీతాదేవి మరీ శ్రమకు లోనైనది. సుకుమారి. భర్త మీద ప్రేమతో, దుఃఖమంటే, కష్టమంటే ఏమిటో తెలియని జనకరాజపుత్రి, కళ్యాణీ, సీతాదేవి నీ వెంట అడవులకి వచ్చింది. ఆమె లోకపావని, లోకైక నారీ శిరోమణి.

"భర్త బావుంటే, అన్ని సుఖాలు ఇస్తేనే అంటిపెట్టుకొని ఉంటారు. అనురాగము చూపిస్తారు. సంతోషాన్ని కలిగిస్తారు. విషమ స్థితి వస్తే విడిచిపెడతారు. స్త్రీల చిత్తమే అంత... ఎంతటి స్నేహబంధాన్నైనా ఇట్లే వదులుకోగలరు. కత్తి కంటే పదునుతో వ్యవహరిస్తారు. లక్ష్మిలేని భర్తను చులకన చేస్తారు. అవమానాలకీ, అవహేళనకీ గురి చేసి దూరమవుతారు. సుందర, ఐశ్వర్య మార్గాన్ని ఎంచుకుంటారు, ఎక్కువ శాతం మంది మహిళలు.

"నీ సతిలో మాత్రం అట్టి దోషాలేమిలేవు. అరుంధతి వంటి మహాపతివ్రత... పతివ్రతలలో అగ్రగణ్యురాలు. భూమిపై భార్య ఎలా నడుచుకోవాలో తెలియ చెప్పే సాధ్వీమణీ...

"పతివ్రతా శిరోమణి అయిన నీ భార్యతోనూ, లక్ష్మణుడితోనూ నీవు ఏ ప్రదేశంలో ఉన్నా, ఏ ప్రాంతంలో ఉన్నా అంతా సస్యశ్యామలమవుతుంది. కాన నా ఆశ్రమంలో ఉండి మమ్ము తరింప చేయ ప్రార్థన" చెప్పాడు అగస్త్యుడు.

శ్రీరాముడు అగస్త్యునకు వినయంగా నమస్కరించాడు.

"ధన్యుడని మునిపుంగవా! వరదులైన తాము నన్నూ నా భార్య సీతనూ, తమ్ముడు లక్ష్మణుడునూ, మా ముగ్గురి గుణాలను మెచ్చుకున్నారు. మమ్ము అనుగ్రహించారు అంతేచాలు. నేను మరెక్కడైనా ఆశ్రమం నిర్మించుకొని ఏకాగ్ర చిత్తంలో గడుపవలెనని భావిస్తున్నాను. తమరు ఏదైనా ప్రదేశం చూపవలెనని కోరుతున్నాను" చెప్పాడు శ్రీరాముడు.





శ్రీరాముని కోరికతో అగస్త్యుడు ధ్యానించాడు. ముహూర్తకాలంలోనే ఆయనకు ఓ ప్రదేశం స్మరణకు వచ్చింది. ప్రసన్నంగా కనులు తెరిచాడు.

"శ్రీరామా! ఇక్కడికి రెండు యోజనాల దూరంలో పంచవటి అను చక్కటి ప్రదేశం ఉన్నది. జల, ఫల, పుష్పాది వృక్షాలతో, జలపాతాలతో కడు రమ్యమైన ప్రాంతం.

"సీతతోనూ, లక్ష్మణుడితోనూ హాయిగా అచ్చట నివసించుము. నీ వనవాస కాలం చాలా వరకూ అయిపోయింది. మిగతా వనవాస దీక్ష పూర్తి చేసి అయోధ్య చేరి జనరంజకమైన రామరాజ్యాన్ని ప్రజలకు అందివ్వు...

"శ్రీరామా! ఆ ప్రాంతం పవిత్రమైనది. పంచవటి సమీపముననే గోదావరి ఉన్నది. అచ్చట ఉంటూనే మునులను రక్షించు. నీ తండ్రి దశరథ మహారాజుకూ నాకూ మధ్య మంచి స్నేహమున్నది. అందువల్లే మిమ్ము ఇక్కడే ఉండమన్నాను. నా తపో బలంతో నీ అభిప్రాయం తెలిసినది. కాన పంచవటినే మీకు సరియైన నివాస ప్రదేశం.

"శ్రీరామా! కనపడుతున్న ఇప్ప చెట్లను చూడు. అడవికి ఉత్తర దిక్కున మర్రిచెట్టు కాన వచ్చేంత వరకూ ప్రయాణించండి. అక్కడనే మీకు ఓ మిట్ట కానవస్తుంది. ఆ మిట్టను ఎక్కి దిగితే మీకు పంచవటి కానవస్తుంది. మానవ సంచారముండదు. పక్షులు మృదుమధుర గానాలు చేస్తుంటాయి. ఎటు చూసినా పూల చెట్లే... ఎప్పుడూ పూత పట్టి ఉండే వృక్షజాతులతో ఆ ప్రాంతం సుందర పంచవటి అయినది."

సీతారామలక్ష్మణులు మహర్షికి నమస్కరించారు. అగస్త్యుడు చెప్పిన ప్రకారం ముగ్గురూ ప్రయాణించారు.

## జటాయువు

సోదరుడు లక్ష్మణుడితో, భార్య సీతాదేవితో నడుస్తున్న శ్రీరామ చంద్రునకు పెద్ద మర్రిచెట్టు కనిపించింది. ఆ మర్రిచెట్టుపై మహాకాయంతో భయంకరంగా ఓ ఆకారం ఉంది. రాక్షసుడేమోనని అనుకున్నారు రామలక్ష్మణులు.

"ఎవరు నువ్వు?" గద్దించి అడిగారు.

"శ్రీరామచంద్రా! నేను నీ తండ్రి దశరథ మహారాజు స్నేహితుడని, గద్దను" అని పలికింది.

తండ్రి స్నేహితుడనగానే ఆ గద్దపై పూజ్య భావం కలిగింది. కుశల ప్రశ్నలడిగాడు.

“శ్రీరామా! నా పుట్టుపూర్వోత్తరాల కంటే ముందు ప్రజాపతులెవరో చెబుతాను. ప్రజాపతులలో మొదటివాడు కర్దముడు. అతని తర్వాత విక్రీతుడు, శేషుడూ, సంశయుడు, స్థాణుడూ, మరీచీ, అత్రీ, క్రతువూ, పులస్త్యుడూ, అంగీరసుడూ, ప్రచేతసుడూ, పులహుడూ, దక్షుడూ, వివస్వంతుడు. వీరు వరుస ప్రజాపతులు.

“ఆ తర్వాత ప్రజాపతి కాశ్యపుడు. ఇతనినే అరిష్టనేమి అంటారు. అతను మహా బలవంతుడు, తేజశ్శాలి.

“శ్రీరామా! ఇలా వుండగా దక్షప్రజాపతికి అరవై మంది కూతుళ్ళు కలిగారు. వారిలో అదితి, దితి, దనువు, కాళిక, తామ్ర, క్రోధవశ, మనువు, అనల అనే ఎనిమిది మంది కన్యలను కాశ్యపుడు వివాహం చేసుకున్నాడు.

“శ్రీరామా! కాశ్యపుడు వారితో సంతోషంగా గడిపి, తనతో సమానమైన వారిని కనమని భార్యలకి చెప్పాడు.

“భర్త చెప్పినట్టుగా అదితి, దితి, దనువు, కాళికా మనస్సులో సంకల్పించుకున్నారు. భర్త మాట వేద వాక్కులా పాటించారు. కానీ మిగతా వారు పాటించలేదు.

‘దశరథ పుత్రా అయోధ్యా రామా! శ్రీరామా! అదితికి పన్నెండుమంది ఆదిత్యులూ, ఎనిమిదిమంది వసువులూ, పదకొండుమంది రుద్రులూ, ఇద్దరు అశ్వినీ దేవతలు వారితో పాటు ముప్పైమూడు మంది దేవతలూ జన్మించారు.

“దితి యశోవంతులైన దైత్యులని కన్నది. ఈ సమస్త భూమండలమూ, సముద్రమూ, అడవులూ, యావత్తు దైత్యులదే మొదట.

“శ్రీరామా! దనువు హయగ్రీవుణ్ణి కన్నది. కాళికాకి నరకుడూ, కాలకుడూ జన్మించారు.

“శ్రీరామా! తామ్ర కూడా క్రౌంచీ, భాసి, శ్యేనీ, ధృతరాష్ట్రి, శుకీ అని అయిదుగురు కూతుళ్ళని కన్నది. అందు క్రౌంచీకి పులుగు పిట్టలు పుట్టాయి. భాసినికి భాసపక్షులు జన్మించాయి.

“శ్యేనీకి డేగలూ, గద్దలూ జన్మించాయి. ధృతరాష్ట్రికి కలహంసలూ, హంసలూ, చక్రవాక పక్షులూ పుట్టాయి. శుకీనికి నత పుట్టింది. నతకి వినత పుట్టింది.





“శ్రీరామా! క్రోధవశకి మృగీ, మృగమందా, హరి, భద్రమదా, మాతంగీ, శార్దూలీ, శ్వేతా, సురభీ, సురసా, కద్రువా అనే కూతుళ్ళు పుట్టారు. సురసా, కద్రువా సమస్త లక్షణములైన పుత్రికలు.

“వారిలోని మృగికి జింకలు పుట్టాయి. మృగమందకి ఎలుగు బంట్లూ, సృమర మృగాలూ, చమరీ మృగాలూ పుట్టాయి. హరికి సింహాలూ, వానరలూ, భద్రమదకు మాత్రం ఇరావతి అనే కూతురు పుట్టింది.

“ఆ ఇరావతికి ఐరావతమైన మహా ఏనుగు జన్మించింది. ఆ ఐరావతమే దేవేంద్రుడి వాహనం.

“మాతంగికి ఏనుగులు, శార్దూలీకి పులులూ, కొండముచ్చులూ జన్మించాయి. శ్వేతకు దిగ్గజాలు, సురభి మాత్రం రోహిణి, గంధర్వి అనే చక్కటి కూతుళ్ళను కన్నది.

ఆ రోహిణికి ఆవులు పుట్టినవి.

“శ్రీరామా! గంధర్వికి గుర్రాలు పుట్టాయి. సురస దివ్యసర్పాలను కన్నది. కద్రువ సాధారణ సర్పాలను కన్నది.

“మనువు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రలను మగవారిని కన్నది. అనల ఫలవృక్షాలని కన్నది.

“శ్రీరామా... శుకి మనమరాలు వినత వంశాన్ని, సురస చెల్లెలు కద్రువ వంశాన్ని చెబుతాను విను. కద్రువ వెయ్యి తలల ఆదిశేషుడని కన్నది. భూమిని మోస్తున్నాడతను.

“వినత అరుణుడు, గరుత్మంతుడు అనే ఇద్దరు పుత్రులని కన్నది. ఆ అరుణుడే నా తండ్రి, నా తల్లి శ్యేని. వాళ్ళిద్దరికీ ఇద్దరు సంతానం. నేనూ, సంపాతి... నా నామధేయం జటాయువు... నేనూ, సంపాతి ఒకానొక సమయాన వేసుకున్న పందెం కారణంగా భంగపడి విడిపోయాము. సంపాతి జాడ తెలియక దుఃఖిస్తున్నాను.

“కాన శ్రీరామా! ఇది నా వంశ చరిత్ర... తమకి ఇష్టమైన ఈ వనవాస కాలంలో మీకు సహాయంగా ఉంటాను.

“ఈ అడవి భయంకరమైనది. అడవి మృగాలూ, రాక్షసులూ కోకొల్లలు. శ్రీరామా నీవూ, నీ తమ్ముడైన లక్ష్మణుడూ కలిసి ఎక్కడికైనా వెళ్ళినప్పుడు మహాతల్లి సీతాదేవికి రక్షణగా ఉంటాను. కనిపెట్టుకుని వుంటాను. దయతో ఒప్పుకొనమని ప్రార్థన.”

శ్రీరాముడు సంతోషంగా జటాయువుని కౌగిలించుకున్నాడు. తండ్రి దశరథ మహారాజు గూర్చి జటాయువు చెబుతూంటే ఆనందంగా విన్నాడు. భార్యతోనూ, తమ్ముడితోనూ శ్రీరాముడు పంచవటి వైపు నడిచాడు.

## పంచవటి ఆశ్రమం

సీతారామలక్ష్మణులు అనేక సాధు, విష జంతువులు తిరిగే పంచవటికి చేరారు. ఆ ప్రాంతమంతా అగస్త్యముని చెప్పినట్టు, ఫల, వృక్షాలతో విరగకాసి ఉన్నాయి. ఎన్నో పుష్పజాతులు కనువిందు చేస్తున్నాయి. చక్కని జలపాతాలతోనూ, సరస్సులతోనూ, ప్రక్కగా గోదావరితోనూ కడు రమ్యంగా ఉంది.

"లక్ష్మణా! ఏ ప్రాంతంలో ఎక్కడ మనకు నివాసయోగ్యంగా ఉంటుందో నిర్ణయించు. ఏ ప్రదేశమైతే నీకూ... సీతాదేవికి ఆమోదయోగ్యంగా ఉంటుందో ఆలోచించు... నీటి సదుపాయం, ఫల, పుష్పాలు అందుబాటులో ఉండేలా చూడు..."

లక్ష్మణుడు సీతారాములకు నమస్కరించి...

"రామా! నీతో నేను వందేళ్ళు అడవిలో ఉన్నా నీవు చెప్పిన పని చెయ్యటమే నా ధర్మం. నేను స్వతంత్రుడనికాను, పరతంత్రుడను. నీవే స్థలం నిర్ణయించి ఆశ్రమం నిర్మించమని చెబితే నేను నిర్మిస్తాను" చెప్పాడు లక్ష్మణుడు.

శ్రీరాముడు తమ్ముడి పలుకులకి సంతసించి ఓ ప్రదేశాన్ని నిర్ధారించాడు.

"లక్ష్మణా! ఈ ప్రదేశం చూడు దగ్గరిలో నీరు పుష్కలంగా ఉంది. గోదావరీ నదీ ప్రాంతం. రెండు వైపులా చెట్లు ఉన్నాయి. హంసలూ, నీటి కోళ్ళూ, చక్రవాకాలు కిలకిలమంటున్నాయి.

"దూరంగా కనిపించే కొండలు... అదిగో చూడు జింకలు... ఆ పర్వత ప్రాంతంలో మద్దిచెట్లూ, తాటి చెట్లూ, ఖర్జూరపు చెట్లతోపాటు పనసా, మామిడీ, నేమీ, పున్నాగా, మోదుగా... ఆహా ఎంత రమణీయంగా ఉందీ ప్రాంతం." చెప్పాడు శ్రీరాముడు.

శ్రీరాముని ఆజ్ఞతో లక్ష్మణుడు ఆశ్రమ నిర్మాణం ప్రారంభించాడు. మట్టి త్రవ్వాడు, కలిపాడు. పొడవాటి గట్టి వెదురు కర్రలు పాతాడు. జమ్మి వాసాలు వేసి తాళ్ళతో కట్టి బిగించాడు.





వాసాల మీద ఆకులూ, రెల్లూ కప్పాడు. చక్కగా గోడలను అలికాడు. సీతాదేవి వాటిపై చక్కటి ముగ్గులు వేసింది.

ఆశ్రమం చుట్టూ నేలని చదను చేశాడు. రకరకాల పూల మొక్కలని నాటాడు. ఆశ్రమం చుట్టూ దడి కట్టాడు.

బహు సుందర పర్ణశాలను నిర్మించాడు. అంత లక్ష్మణుడు గోదావరిలో స్నానమాచరించి పండ్లూ, పూలూ, ఇత్యాది వస్తువులతో వాస్తు పూజ చేశాడు.

శ్రీరాముడు ఆనంద పరవశంతో తమ్ముడని కౌగిలించుకున్నాడు.

"నా ఆనందం చెప్పనలివికానిది.. నా పరిపూర్ణ హృదయమునకు నీవు ప్రతిరూపం. తండ్రి దశరథ మహారాజు మరణించినట్టులేదు. నిన్ను చూస్తుంటే తండ్రినే చూస్తున్నట్టు ఉంది" చెప్పాడు శ్రీరాముడు.

బహు చక్కగా నిర్మించిన ఆ పర్ణశాలలో ఆశ్రమ వాసం ఆరంభించారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

సీతాదేవీ... లక్ష్మణుని సేవలతో శ్రీరాముడు దేవలోకంలో దేవేంద్రుడి వలె సుఖంగా ఉన్నాడు. శరత్కాలం గడిచింది. నవ దంపతులకు ప్రీతి అయిన హేమంత ఋతువు వచ్చింది.

సీతారాములు గోదావరిలో స్నానం చేయటానికి నిత్యం వలె బైలుదేరారు. వారిని అనుసరిస్తున్నాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా! ఇష్టమైన హేమంతం వచ్చింది. సంవత్సరానికంతటికీ రాణి హేమంత ఋతువు. భూదేవి పంటచేలతో పచ్చగా కలకలలాడిపోతూ ఉంటుంది. నీళ్ళు ముట్టుకుంటే కరిచేలా ఉంటాయి. పితృదేవతలను పూజించే సమయం. అన్ని నిత్య అవసర వస్తువులు వివాహం కాని స్త్రీలా సమృద్ధిగా దొరుకుతాయి. మహారాజ్యాలు నిర్మించాలనుకున్న రాజులు చతురంగ బలాలతో దండ యాత్రలు చేసే సమయం.

"ప్రచండ సూర్యభగవానుడు దక్షణ దిక్కుకి వొరుగుతాడు. బొట్టులేని స్త్రీలా ఉంటుంది దక్షిణ దిక్కు. మంచు దట్టమవుతోంది. పుష్యమాసం వచ్చేసింది. చలితోపాటు రాత్రి సమయమూ పెరగబోతోంది."

లక్ష్మణుడికి అయోధ్య తలంపుకి వచ్చింది.

"అన్నా! శ్రీరామా... మన భరతుడు నీ కోసం వ్యథ చెందుతూ నీపై భక్తితో తపస్సు చేసుకుంటూ ఉంటాడిప్పుడు. రాజ్యమూ, భోగ భాగ్యాలూ

అన్నీ వదిలేశాడు. ఈ హేమంతాన్ని అనుభవించకుండా మనం వచ్చే రోజు కోసం చూస్తుంటాడు.

"ఈసరికి సరయూనదీ తీరానికి మన వలె స్నాన జలతర్పణాలకై వెళుతుంటాడు. భరతడు చక్కటి అందగాడు. పెద్ద పెద్ద కళ్ళు అతనివి. సన్నటి నడుం గల మహావీరుడు. ధర్మం తెలిసిన సత్యవాది. ఇంద్రియాలను జయించిన వాడు.

"అంతటివాడు అడవిలో ముని వేషధారియై తండ్రి మాటకై వనవాసం వచ్చినందుకు తానూ అలానే మారి సర్వం త్యజించాడు. నీ రాకకై ఎదురు చూస్తున్నాడు.

"అన్నా శ్రీరామా! మగ పిల్లలకి తల్లి గుణం అబ్బుతుందంటారు. భరతునకు దశరథుని మహోన్నతమైన వ్యక్తిత్వమే వచ్చింది. మగబిడ్డకు తల్లి గుణం వస్తుందనే లోకోక్తిని భరతుడు తారుమారు చేశాడు. కైకాదేవీ క్రూర..." పూర్తిగా చెప్పకుండానే అడ్డుకున్నాడు శ్రీరాముడు.

"లక్ష్మణా! తల్లి కైక గూర్చి నిందించవద్దు. ఆమె మనకి తల్లి. పూజ్యురాలు. ఆమె మాట అటుంచు భరతుడి గూర్చి చెప్పు. అవి ప్రియాలు, మధుర వాక్యాలు... శత్రువు గూర్చి అయినా మంచిగా మాట్లాడుకుంటే మనసు హాయిగా ఉంటుంది.

"వనవాసానికీ, మునివాసానికీ కారణం కైకమ్మకాదు. విధి... దాన్ని ఎవ్వరూ తప్పించలేరు. ధర్మసత్య గుణాలతోనే దాన్ని ఎదుర్కోవాలి. లక్ష్మణా! భరతుడిని ఎప్పుడు చూస్తానా అని మనసు తపించిపోతోంది.

"శుభలక్షణుడవైన నీతోనూ, భరతుడితోనూ, శత్రుఘ్నుడితోనూ, తల్లులతోనూ... మీ అందరితో కలిసి ఎప్పుడు నేనూ, సీతా అయోధ్యలో ఉంటామో... ఎప్పుడు అయినవారితో కూడి సుఖంగా ఉంటామో..." అన్నాడు.

అలా మాట్లాడుకుంటూ గోదావరి నది వద్దకు చేరారు. దేవతలకీ, పితృదేవతలకీ జల తర్పణాలు కావించారు. స్నానాదులు ముగించారు.

## శూర్పణఖ

గోదావరి నదీ ప్రాంతం నుంచి రాగానే ఉదయం చెయ్యాల్సిన కర్మలు పూర్తి చేసుకొని పర్ణశాలలోకి వెళ్ళారు. తాపసులు వచ్చి పూజించి స్తుతించి వెళ్ళారు.





శ్రీరాముడు భార్యతోనూ, తమ్ముడితోనూ మాట్లాడుతూ ఉన్నాడు. ఆ సమయంలో వచ్చింది దశగ్రీవుడి చెల్లెలు వికారి, మదమెక్కిన ఏనుగు, కామరూపిణి, చుప్పనాతి శూర్పణఖ.

చిత్రనక్షత్రంలో చంద్రుని వలె తేజోవంతంగా ఉన్న శ్రీరాముడను చూసింది. కనులు రెపరెపలాడించింది. ఆ సుందర రూపం చూసి నాలుక తడి చేసుకుంది. కామంతో కళ్ళు ఎరుపెక్కాయి.

పద్మ పత్రాయతాక్షుణ్ణి, ఆ సుకుమారుడను, జటామండలధారుణ్ణీ, రాకుమారుడి వలే, దేవేంద్రుడు వలే మెరిసిపోతున్న శ్రీరాముడని చూస్తూనే ఉంది.

విశాల వక్షస్థలముతో, తామరరేకుల్లాంటి కనులతో, దివ్యతేజస్సుతో సుకుమార శరీరంతో, బలిష్టమైన శరీర సౌష్టవమును చూసి తట్టుకోలేక పోయింది. రాక్షస ప్రవృత్తితో వెనువెంటనే కామ చర్యలకి సిద్ధపడింది.

సుందరమైన నగువెూము శ్రీరామునిది. దుష్టమాలిన ముఖం శూర్పణఖది. సన్న నడుం శ్రీరామునిది. తుంబలాంటి నడుం శూర్పణఖది. తుమ్మెదలాంటి జుత్తు శ్రీరామునిది, రాగి జుత్తు శూర్పణఖది. సదాచార సంపన్నుడు శ్రీరాముడు. దురాచారమే వృత్తి, ప్రవత్తి శూర్పణఖది.

అట్టి వికారపుది శూర్పణఖ... చెట్టు చాటు నుంచి కామరూప విద్యతో సుందర వయ్యారాల స్త్రీగా మారి దగ్గరికొచ్చింది.

"ఓయీ... చూస్తుంటే తాపసివలే కనిపిస్తున్నావు. భార్యని దగ్గరుంచుకొని సుఖంగా గడుపుతున్నావు. ధనస్సూ, బాణాలూ పెట్టుకొని వున్నావు. ఎవరు నువ్వు... రాక్షసులు తిరిగే ప్రదేశమిది.. వాస్తవం చెప్పు..."

శ్రీరాముడు తాపస ధర్మం అనుసరించి ఉన్న సంగతి విదిత పరిచాడు.

"అతను నా తమ్ముడు లక్ష్మణుడు. నన్ను శ్రీరాముడంటారు. దశరథ మహారాజు మా తండ్రి.

"ఈమె నా భార్య సీత... తండ్రి ఆజ్ఞతో వనవాసానికి వచ్చాం. ఇక నీ సంగతి చెప్పు... ఎవరు నువ్వు?" అడిగాడు శ్రీరాముడు.

"శ్రీరామా! నీ పలుకులు నాలో మరులు పుట్టిస్తున్నాయి. నా పేరు శూర్పణఖ. కామరూపిణిని.. రాక్షస స్త్రీని... నా పేరు వింటేనే దండకారణ్యంలో ప్రాణికోటి భయాందోళనలకు గురి అవుతుంది.

"విశ్రవసుడి కుమారుడు మహాబలవంతుడైన రావణుడు నా అన్న. ఆ దశగ్రీవుడైన రాక్షస వీరుడు పేరు వినే ఉంటావు. సంవత్సరంలో సగభాగం నిద్రించి ఒక్కరోజు మేలుకొని యోజనాల కొద్దీ మాంసాన్ని తిని మళ్ళీ నిదురించే పరాక్రమవంతుడు కుంభకర్ణుడూ, మా జాతి రాక్షస చేష్టలులేని విభీషణుడూ నా తోబుట్టువులు.

"ఈ అడవంతా నాది... నా అన్న రావణుడు నాకిచ్చి ఏలుకొమ్మని చెప్పాడు. ఈ దండకారణ్యమంతా యథేచ్ఛగా విహరిస్తుంటాను.

"ఓ అందగాడా! శ్రీరామా! నీ దర్శనం అయినది. ఎంత బలం కావాలంటే అంత బలం తెచ్చుకోగల శక్తి గలదానిని. నన్ను కట్టుకో ఆకట్టుకో... సీత ఎందుకు... నిన్ను నేను మొగుడిగా చేసుకుంటాను. ప్రియా! సీత వికృతంగా ఉంది. ఆమె నీకు తగినదికాదు. తినేస్తాను... సీతనూ, లక్ష్మణుడనూ...

"పురుషోత్తమా మనం కొండల్లోనూ, తోపుల్లోనూ, జలపాతాల్లోనూ, సరస్సుల్లోనూ, నదుల్లోనూ విహరిద్దాము. ఈ దండకారణ్యమంతా తిరుగుదాం" చెప్పింది.

శ్రీరాముడు సన్నగా నవ్వాడు. సీత భయంగా రాముని ప్రక్క చేరింది.

☆☆☆ ☆☆☆ ☆☆☆

కామపాశిత అయిన శూర్పణఖతో శ్రీరాముడు మృదుమధురంగా "అమ్మా నాకు వివాహం అయినది. ఇదిగో నా భార్య సీతాదేవి. నన్ను సంతోషపెడుతూ ఉన్నది. నీవు మంచి పిల్లవి. సవతి పోరుపడలేవు. అదిగో లక్ష్మణుడు, నా తమ్ముడు. సదాచార సంపన్నుడు సూర్యకాంతితో పోటీపడే నా తమ్ముడు నీకు తగినవాడు" చెప్పాడు.

శ్రీరాముడు అలా అనగానే శూర్పణఖ లక్ష్మణుడని చేరింది. "భలే... భలే... నేనే నీకు తగిన పెళ్ళాన్ని, చలికాలంలో వెచ్చగా, ఎండకాలంలో చల్లగా నీకు సుఖాలిస్తాను. రా పెళ్ళాడు వెనువెంటనే కలిసి తిరుగుదాం..." అడిగింది.

"ఆఁ... ఆఁ... కమలాల రంగు చిన్నదానా శ్రీరాముడి దాసుడని, నన్ను వివాహం చేసుకుంటే నీవూ దాసివి కావలెను... నేను పరాధీనుణ్ణి, నీవు సర్వసమర్థమైన అన్నగారికడకే వెళ్ళు."

లక్ష్మణుడు వేళాకోళంగా అన్న మాటలని శూర్పణఖ తెలుసుకోకుండా శ్రీరాముని చెంతకు వెడలి-





సీతాదేవితో ఉన్న శ్రీరామునితో... "ఈమె ఉందని నన్ను నిరాకరిస్తున్నావు... ఇప్పుడే నీ సీతను నమిలి మింగేస్తాను. నాకు సవతి పీడ విరగడవుతుంది" అని అరుస్తూ సీతాదేవి మీదకి పోయింది. వైదేహి భయంగా శ్రీరాముడిని పట్టుకుంది. లక్ష్మణుడు అప్రమత్తుడయ్యాడు.

భయంకర ఆకారంతో గుహలాంటి నోరుతో మీదకు వస్తున్న శూర్పణఖను వైదేహి వరకు రాకుండానే ఆపాడు శ్రీరాముడు.

"లక్ష్మణా! చెడుప్రవర్తన గల వారితోనూ, క్రూరులతోనూ పరిహాసం ఆడరాదు. అట్లే శాంతీ పనికిరాదు. ఈ దుష్టురాలికి మదం ఎక్కింది. దీన్ని విరూపను చేయ్..."

రామాజ్ఞ అవ్వడం ఆలస్యం లక్ష్మణుడు సత్వరున కత్తి తీశాడు. సింహం లంఘించినట్టు శూర్పణఖ మీదకు వెళ్ళి ముక్కు, చెవులు కోశాడు.

దండకారణ్యం అదిరిపడేలా అరిచింది శూర్పణఖ. వర్షిస్తున్న మేఘంలా రక్తం కారింది. కారుతున్న రక్తాన్ని దోసిళ్ళలో పట్టుకుంటూ పరుగు లంకించింది. జనస్థానమునకి పోయింది.

అక్కడ ఖరుడు తన రాక్షస వీరులతో మందీ, మార్బలంతో సభ తీరి ఉన్నాడు.

పిడుగు వలె వచ్చి పడింది శూర్పణఖ. రక్తంతో... భయంతో... పడి ఉన్న సోదరిని చూశాడు ఖరుడు. అంతే ఆ ఖరుడు ఉగ్రుడైపోయాడు. నిప్పులు కక్కాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

క్రోధంతో మహోజ్వల అగ్నిలా ఊగిపోయాడు ఖరుడు.

"సోదరీ శూర్పణఖ... ఏమిటిది? ఎలా జరిగింది. నిన్నిలా చేసిన వాడెవడు? మృత్యుపాశంతో ఆడుకున్న వాడెవ్వడు... అన్ని మంత్ర శాస్త్రాలూ తెలుసున్నదానివి. కామ గుణం కలదానివి... నీ ఈ దురవస్థకి కారణం ఎవరు? గంధర్వులా... యక్షులా... దేవతలా... చెప్పు ఎవ్వరైననూ సరే వారి ప్రాణములు పోయినట్టే."

శూర్పణఖ కన్నీరు మున్నీరుగా విలపిస్తూ... "పంచవటీ ప్రాంతంలో నివసిస్తున్నారు. ఎవరో దశరథమహారాజు పుత్రులట... శ్రీరాముడూ, లక్ష్మణుడూ వారి నామధేయములు. అందగాళ్ళు... సుకుమారులు... నారబట్టలు

కట్టుకున్నారు. విల్లంబులు ధరించారు. దుంపలూ, కాయలూ, పండ్లూ తింటూ గడుపుతున్నారు. గంధర్వుల వలే ఉన్నారు. దేవతల తేజస్సు వారిలో ఉంది.

"వారితో ఓ అందమైన పడుచు పిల్ల ఉంది. ఆమె అందానికి పధ్నాలుగు భువనభండాల్లో స్త్రీ లెవరూ సరిరారు. యవ్వనంతో ఉన్నది. కందిరీగలాంటి నడుంతో ఉన్న పిల్లది. ఆ ఆడుదాని కోసమే నన్ను ఇలా పరాభవం చేశారు. వారి ముగ్గురి వెచ్చటి రక్తం త్రాగాలి అన్నా... నా కోర్కె తీర్చు. నట్టింటిలో సోదరిని ఏడుస్తూ... అర్థిస్తున్నాను" చెప్పింది శూర్పణఖ.

సోదరి మాటలు పూర్తి కాకుండానే ఖరుడు మహాబల పుష్టికల పధ్నాలుగు రాక్షస వీరులకి ఆజ్ఞాపించాడు.

"మానవులట... నార బట్టలు ధరించి విల్లంబులు చేతబూనినవారట. పంచవటిలో ఓ స్త్రీతో దండకారణ్యంలో ఉన్నారు. వార్ని చంపెయ్యండి. వాళ్ళ నెత్తురు సోదరి శూర్పణఖకు అందించండి. మీ పరాక్రమంతో వేగిరంగా నెరవేర్చండి. చిత్రవధ చేసి మరీ చంపండి."

ఖరుడి ఆజ్ఞతో గాలితో పోటీపడి ప్రయాణించారు. శూర్పణఖతో పంచవటి ముందున్నారు. శ్రీరాముడని చూడగానే... కార్చిచ్చు చూసి ఏనుగులు భయపడ్డట్టు భయకంపితులయ్యారు.

శూర్పణఖ రాక్షసులతో "రండి..." అని వారిని పర్ణశాలలోకి తీసుకెళ్ళింది. వారి ముగ్గురిని చూపించింది.

శ్రీరాముడు వారి రాకను గాంచాడు. రాక్షసులు ఆ తేజోరూపం చూసి సంకోచిస్తున్నారు. ఎందులకో వారికి ఏదో తెలియని భయం ఆవహించింది. శూర్పణఖ ఆజ్ఞాపించింది.

"లక్ష్మణా! రాక్షస సంహారం తప్పదు... కోరి మృత్యువుని వెతుక్కుంటూ వచ్చిన వారి కోరికను నెరవేరుస్తాను" చెప్పాడు శ్రీరాముడు.

ధనస్సు పైకెత్తి "రాక్షసులారా! నేను దశరథరాజు పుత్రుడను శ్రీరాముడను. తమ్ముడితోనూ, భార్యతోనూ దండకారణ్యానికి తండ్రి మాటతో వచ్చినవాడను. పండ్లూ, ఫలాలనూ స్వీకరిస్తూ గడుపుతున్నాం. మునులనూ, సాధువులనూ హింసించేవారిని సంహరిస్తామని ప్రతిన బూనిన వారం... ముహూర్తకాలంలో మిమ్మల్ని హతమారుస్తాను. ప్రాణాల మీద తీపి ఉంటే పారిపోండి" శ్రీరాముడు గంభీరమైన వాక్కులతో చెప్పాడు.





అంత ఆ రాక్షసులకి కోపం వచ్చింది. వికటాట్టహాసాలు చేశారు.

"మా రాజు ఖరుడు. అతడికి కోపం వచ్చింది. క్రుద్ధుడయ్యాడు. మమ్మల్ని పంపాడు.

"శూలాలతో... ఇనుపగుదియలతో చిత్తు చేస్తాం. మేం పధ్నాలుగు మందిమి. నీవు ఒక్కడివి" అంటూ ఒకేసారి శ్రీరాముడి మీద శూలాలను విసిరారు.

శ్రీరాముడు బంగారు తొడిమలు గల పధ్నాలుగు బాణాలను వదిలాడు. రాక్షసులు వదిలిన శూలాలను గాలిలోనే తుక్కుగా చేశాయి. ఆ వెనువెంటనే శ్రీరాముడు పధ్నాలుగు బాణాలు సంధించాడు. వదిలాడు. సూర్య సమాన తేజంతో ఆ బాణాలు గాలిని చీల్చుకుంటూ వెళ్ళి ఆ రాక్షసుల వక్ష స్థలాలను చేధించాయి.

భయంకర కేకలతో అడవి దద్దరిల్లింది. రక్తం ధారలు వారి శరీరాల్లోంచి చిమ్మింది. మొదలు నరికిన చెట్లవలే చివరి అరుపు అరిచి వాలిపోయారు.

అది చూసి శూర్పణఖ భయంకరంగా కేకలు వేసింది. దుఃఖంతో బాధతో, వ్యధతో... పెడబొబ్బలు పెడుతూ... దెయ్యం పట్టినట్టు... వెనుక మహా మృత్యువు తరుముతున్నట్టు... ఎగ ఊపిరి పీలుస్తూ ఖరుడి వద్దకు బైలుదేరింది.

☆☆☆ ☆☆☆ ☆☆☆

పెడబొబ్బలు పెడుతూ... గావుకేకలు వేస్తూ... దీనాతి దీనంగా నేల మీద ఉన్న శూర్పణఖను చూశాడు ఖరుడు. "సోదరీ... మళ్ళీ ఏమైంది. ఇంతకు ముందే కదా! రాక్షస వీరులను పంపినాను. అరివీర పరాక్రమవంతులు. నా ఆజ్ఞను తూ.చ. తప్పక పాటించేవారు.

"ఎంతటి కార్యాన్నైయినా చేయగల సమర్థులు. ఇంకా దిగులెందుకు భీతెందుకు... లే" సముదాయించాడు ఖరుడు.

"రామలక్ష్మణులను సంహరించటానికి మహా వీరులని పంపావు. వారంతా క్షణకాలంలో శ్రీరాముడి బాణాలకు శివసాన్నిధ్యం పొందారు. వెళ్ళినంత సేపు కూడా నిలువలేకపోయారు. శ్రీరాముడు మహాతేజోవంతుడు. ధనుర్ధరుడు.

"మహాబలవంతులైన మన రాక్షసులను క్షణకాలంలో సంహరించటం నాకు మరింత భయం గొల్పింది. అతన్ని నువ్వూ... నీ పరివారమూ... ఏమీ చేయలేరు. రాక్షస కంటకుడు రాముడని సంహరించు మహాశక్తి నీకు లేదని

నా మనసు చెబుతోంది. ముక్కూ, చెవులూ పోయి సిగ్గుమాలిన జీవితం గడపవల్సిందేనా?"

ఖరుడు శూర్పణఖ మాటలతో భవంతి గోడలు పగిలేలా అరిచాడు.

"దేవతలందరితోనూ ఒంటరిగా పోరాడిన వాడ్ని. నీ సోదరుడను... ఖరుడను"

"ఓ ఖరుడా! నీవు పరాక్రమవంతుడవే అయితే... రాముడని వెనువెంటనే సంహరించేవాడివి. బలం లేనివారు అల్పులు. అట్టి వారు రాజులు కారాదు. ఉండరాదు. బంధుగణంతో పలాయనం చిత్తగించు... శ్రీరాముడి ప్రతాపం మధ్యాహ్న సూర్యుడి వంటిది. ఆ వేడికి నీవు తాళలేవు. దశరథ పుత్రుడు శ్రీరాముడనూ, అతని సోదరుడు నా ముక్కూ, చెవులూ కోసిన లక్ష్మణుడనూ నీవు ఏమీ చేయలేవు" అంటూ శూర్పణఖ పరిపరి విధాలుగా ఖరుడను రెచ్చగొట్టింది.

★★★ ★★★ ★★★

పెద్దపొట్టతో వికార రూపంతో శూర్పణఖ చెబుతున్న కఠోర మాటలతో ఖరుడు రుద్రుడయ్యాడు. పళ్ళు పటపటా కొరికాడు.

"లే శూర్పణఖ... ఏడ్వకు... ప్రళయకాల ఉప్పెన వలే ఆకలిగొన్న అగ్ని వలే శ్రీరాముడిపై విరుచుకుపడతాను. వాడినీ, వాడి తమ్ముడనీ ఈ నల్ల గొడ్డలితో నరుకుతాను. ఆ వేడి రక్తం నీవు ఆనందంగా జుర్రుకుందువుగానీ... యమసదనానికి వారెళ్ళటానికి ఎంతో సమయంలేదు. నేను యుద్ధరంగానికి బైలుదేరుతున్నానంటే ఆ యముడే స్వయంగా వస్తాడు. వారి ముగ్గురి ప్రాణాలను తన పాశంతో లాక్కొనిపోతాడు."

ఖరుడి నోటి నుంచి విన్న ఆ పలుకులు శూర్పణఖకు సంతోషాన్నిచ్చాయి. అంత వరకూ తన పదజాలంతో తక్కువ చేసిన ఖరుడ్ని అనేక విధాలుగా పొగిడింది. దానితో ఖరుడు తన సేనానికి ఆజ్ఞాపించాడు.

"దూషణుడా! పధ్నాలుగు వేల మంది రాక్షసులను సిద్ధంచేయి. వారందరూ ఎంతటి క్రూరానికైనా వెనుదీయని వారై ఉండాలి. నల్లటి మేఘాలవలె పరమ భయంకరంగా ఉండాలి. నా రథం సిద్ధం చేయి. ఆ శ్రీరాముడను నేనే స్వయంగా సంహరిస్తాను. పులస్త్యవంశంలో రణకోవిదుణ్ణి నేను. నేనే ముందుగా వెళతాను."





ఖరుడి కోసం ధగధగలాడే పంచవన్నెల గుర్రాలు పూన్చిన రథం వచ్చింది. బంగారు చక్రాలతో ఉంది ఆ రథం... బంగారంతో చేసిన పక్షులూ, చేపలూ, పూలచెట్లూ, సూర్య, చంద్ర, నక్షత్రాలు లాంటి బొమ్మలతో రథం అంతా తాపడం చేసి ఉంది.

మేరు శిఖర పర్వతంలా ఉన్న ఆ రథాన్ని ఎక్కాడు ఖరుడు. చిరు గంటలు మ్రోగాయి.

చిత్ర విచిత్ర ధ్వనులతో రాక్షసులు అరిచారు. మహాయోధులంతా కవచాలు ధరించి ఉన్నారు.

ఖరుడి ఆజ్ఞతో రథం కదిలింది.

ఆ వెనుకే బ్రహ్మాండమైన రాక్షస సేన కదిలింది. ముద్గరాలూ, శూలాలూ, గదలూ, పొడవాటి కత్తులూ, అడ్డకత్తులూ, ఎనిమిది అంచుల ఆయుధాలతో కోలాహల ధ్వనులతో కదులుతున్నారు.

ఖరుడు రథంపై యముడిలా ఊగిపోతున్నాడు. రాళ్ళవాన కురుస్తున్నట్టు ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు. పై నుంచి చూస్తే మహా సముద్రం కదులుతున్నట్టుగా కానవస్తోంది.

## ఖరుని యుద్ధం

ఆ భయంకర రాక్షస సేన దిక్కులు పిక్కటిల్లేలా అరుస్తూ కదులుతోంది. ఖరుడు రాజ్యపొలిమేర కూడా దాటలేదు. ఆకాశంలో మేఘాలు గాడిద రంగు ధరించాయి. నెత్తుటి వాన పడింది.

చక్కటి పువ్వులు పరిచిన రాజమార్గంలో ప్రయాణిస్తున్న ఖరుడి రథ గుర్రాలు కూలబడ్డాయి.

మహావేగంతో ఓ గద్ద వచ్చి ఖరుడి రథంపైనున్న బంగార ధ్వజంపై వాలింది. రణ చీకటి అవరించింది. పిడుగులూ, ఉరుములూ వినిపించాయి.

జంతువులు భయంకరంగా అరిచాయి. మిణుగురుపురుగుల్లా పగటి పూటే నక్షత్రాలు వెలిసాయి. చెరువుల్లో పద్మాలు వాడిపోయాయి. ఉల్కలు జారాయి పిడుగులు అల్లంత దూరంలో కూడా పడ్డాయి.

భూమి కంపించింది. అశుభ సూచనలతో ఖరుడి ఎడమ భుజం అదిరింది. ఖరుడి మాట తడబడింది.

గొంతు ఎండిపోయి మాట్లాడినట్టు పలికాడు.

"భీతిచెందవద్దు... ప్రకృతి సహజములు... బల పరాక్రమవంతులు ఈ ఉత్పాతాలను లెక్కచెయ్యరు. నక్షత్రాలను కూడా నా తీక్షణ చూపులతో పడగొట్టగలను. నేను యుద్ధంలో అపజయం లేనివాడిని. దేవేంద్రుడు సైతం వజ్రాయుధంతో శరణు వేడుకొనగల మహావీరుడను. ఆ రామలక్ష్మణులను చంపకుండా వెనుతిరగను. శూర్పణఖ వారి నెత్తుటిని త్రాగవలెను. మాంసాన్ని ఆరగించవలెను. మానవులు అర్భకులు. క్షణంలో వారిని పరిసమాప్తి చేద్దాం." అంటూ అరిచాడు.

ఆ యుద్ధాన్ని చూడటానికి ఆకాశంలో దేవతలు ఒక్కటిగా చేరారు. పులస్త్యవంశ రాక్షసుల సంహారాన్ని వీక్షించటానికి అంతా ఉత్సాహపడుతున్నారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

సమరోత్సాహంతో మహాసముద్రంలా కదిలి వస్తున్న సేనను శ్రీరాముడు చూశాడు. అంతకు ముందే దుశ్శకునాలు చూసి... లక్ష్మణుడితో చెప్పాడు.

"లక్ష్మణా! చూశావా ఆకాశంలో మేఘాలు గాడిద రంగు పులుము కున్నాయి. మేఘాలు అరుస్తున్నాయి. దూరంగా రక్తంవాన పడిన వాసన. అడవి జంతువుల ఆక్రందనలు... ఏదో ఉపద్రవం జరగబోతున్నట్టుగా ఉంది. వనదేవతలు కూడా అంతర్ధానమయ్యారు. యుద్ధం జరగటం తథ్యం. నా కుడి భుజం మాటి మాటికీ అదురుతోంది. జయానికి సూచనగా..."

"అదిగో రాక్షసుల పెడబొబ్బలు. మరి కొద్ది సేపటికి అవి ఆక్రందనలుగా మారుతాయి. లక్ష్మణా సీతాదేవితో నీవు ఆ కొండగుహ వద్దకు వెళ్ళు. రాక్షస సంహారం శూరుడవైన నీవు చేయగలవు. నీవు ఒక్కడివే ఒట్టి చేత్తో సంహరించగలవాడవు. అయిననూ నేనే సంహరించవలెనని అనుకుంటున్నాను" చెప్పాడు శ్రీరాముడు.

అన్నగారి ఆజ్ఞతో లక్ష్మణుడు వదిన సీతాదేవితో శ్రీరాముడు చెప్పిన కొండ గుహ వద్దకు వెళ్ళాడు.

శ్రీరాముడు ధనుష్టంకారం చేశాడు. దశ దిశలు మారుమ్రోగాయి. పధ్నాలుగు వేలమంది రాక్షసులతో శ్రీరాముడి యుద్ధం చూడటానికి గంధర్వులూ, సిద్ధులూ, చారణులూ.. సమావేశమయ్యారు. గోబ్రాహ్మణ, తాపస, ముని హితం కోరే శ్రీరాముడికి శుభమూ, జయమూ కలుగుతుందని విశ్వసించారు.





ధర్మాత్ముడు శ్రీరాముడు మీదకు గావుకేకలతో, భేరీధ్వనులతో అనేక రకాల ఆయుధాలతో రాకాసి రాక్షస దండు వచ్చింది. రాక్షస సేన అంతటినీ కలియచూశాడు శ్రీరాముడు. అమ్ములపొది నుంచి బాణాలు తీశాడు. ధనుస్సు వంచాడు.

అగ్నిహోత్రుడిలా వెలిగిపోతూ, ప్రశాంత చిత్తంతో ఉన్నాడు శ్రీరాముడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

మహోగ్రమైన తేజస్సుతో... చేత చాపం ధరించిన శ్రీరాముడను చూశాడు ఖరుడు. శ్రీరాముని ఎదురుగా పోనియ్యమని సారధికి ఆజ్ఞాపించాడు. ఖరుడు ఆజ్ఞతో సారధి రథాన్ని పోనిచ్చాడు. శ్యేనగామితో పాటు అమాత్యులు హాహాకారాలు చేస్తూ ఖరుడి రథాన్ని అనుసరించారు. ఖరుడు సింహనాదం చేశాడు. శ్రీరాముడిపై వెయ్యి బాణాలు వదిలాడు.

అదే సమయంలో రాక్షసులందరూ ఉగ్రమైన ఆయుధాలు వదిలారు. ముద్గరాలూ, శూలాలూ, ప్రాసాలూ, కత్తులూ, గండ్రగొడ్డళ్ళు... వరుసపెట్టి కురిపించారు.

పెద్ద పెద్ద గొంతుకలతో అరిచారు. రథాల మీదా, గుర్రాల మీదా, ఏనుగలు మీదా చుట్టు ముట్టారు.

నదులపై సముద్రుడు విరుచుకుపడ్డట్టు శ్రీరాముడు విరుచుకుపడ్డాడు. శ్రీరాముడి వింటి నుంచి బాణాలు వచ్చాయి. అవి వందలయ్యాయి. వందలు వేలయ్యాయి. సమస్త రాక్షస ఆయుధాలు శ్రీరాముడి బాణాలకు వీగిపోయాయి. రాక్షసులు ఆయుధాలను ప్రయోగిస్తూనే ఉన్నారు. పిడుగులకు కొండ అదరనట్టు శ్రీరాముడు శరాలను వదులుతూనే ఉన్నాడు.

అన్ని వేల రాక్షసుల మధ్య శ్రీరాముడిని చూసి గంధర్వులూ, సిద్ధులూ, ఋషులూ అంతా కలత పడ్డారు.

శ్రీరాముడు నిప్పులు కక్కే అగ్నిపర్వతమయ్యాడు. భయంకర శర వర్షం కురిపించాడు. లెక్కలేనన్ని రాక్షసుల ధనుస్సులనూ, శూలాలనూ, అనేక ఆయుధాలనూ శ్రీరాముడి శరాలు ముక్కలు చేశాయి.

అగ్నిలో పడ్డ మిడతల్లా రాక్షసులు మరణిస్తున్నారు.

శ్రీరాముడి శరపరంపరలో రాక్షస వీరుల కవచాలు చీలిపోయాయి. ఏనుగులు మావటి వాళ్ళతో కలిసి కూలిపోతున్నాయి. శ్రీరాముడు వేసిన

వంకర బాణాలు, ఇనుప బాణాలు రాక్షసుల తొడలను చీల్చుకుంటూ వెళ్తున్నాయి.

రాక్షసులంతా ఖరుడి రథం దగ్గరికి పరుగుతీశారు.

"రాజా రక్ష.... శ్రీరాముడి బాణాలతో మృత్యువుని ప్రత్యక్షంగా చూపిస్తున్నాడు" అంటూ అర్థించారు.

బలాఢ్యులని రాముడి మీదకి పంపాడు ఖరుడు. శ్రీరాముడి తన వైపుకు వచ్చిన ఆ రాక్షసులను తన బాణాలతో కంఠాలను తెగేలా చేశాడు.

దానితో ఖరుడు శ్రీరామునికి నలువైపులా సైన్యాన్ని కమ్మించాడు. బాణవర్షాన్ని కురిపించాడు. శ్రీరాముడు సింహనాదం చేశాడు. గంధర్వాస్త్రాన్ని వదిలాడు. ఆ అస్త్రం నుంచి వేలాది బాణాలు ఉద్భవించి దశ దిశల నుంచి వస్తున్న రాక్షసుల బాణాలను తుక్కుగా చేశాయి.

శ్రీరాముడి అస్త్రం నుంచి వచ్చిన బాణాలు తగిలి రాక్షసులు హాహాకారలు చేశారు. ఆ బాణాలు ఎట్లా వచ్చి తమకి తగులుతున్నాయో అర్థంకాక ప్రాణ భయంతో తగిలీ తగలక ముందే గుండెలవిసి చస్తున్నారు.

శ్రీరాముడి బాణ పరంపరకు ఆ ప్రాంతమంతా రాక్షస మృతదేహాలతో నిండిపోయి ఉంది. చేతులు తెగిన వారూ... కాళ్ళు తెగిన వారూ... కొన ఊపిరితో ఉన్నవారు... వేలాది మంది విగత జీవులు... కనుచూపుమేరంతా రాక్షస వీరుల విగత శరీరాలే...

వేలాది గుర్రాలూ, ఏనుగులూ.... వారి మీదున్న వారంతా ఉన్నట్టే వాలిపోయి ఉన్నారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

తనసైన్య దుస్థితికి దూషణుడు ఖిన్నుడయ్యాడు. ఐదువేల మహాయోధులని శ్రీరాముడి మీదకు పంపాడు. వారు భీమవేగులు. వారంతా శ్రీరాముడి చుట్టూ చేరారు.

శూలాలూ, పట్టిసాలూ, ఖడ్గాలూ శ్రీరాముడిపై కురిపించారు. శ్రీరాముడు కోపావిష్టుడయ్యాడు. ఆయుధ కుంభవృష్టిని కురిపించాడు. దూషణుడు ప్రతిగా మహోత్తర ఆయుధాలను సంధించాడు.

శ్రీరాముడు అగ్నిహోత్రుడివలె నిప్పులు కక్కాడు. పిడుగుల్లాండి దూషణుడి బాణాలకి సమాధానంగా శ్రీరాముడు ఓ శరంతో దూషణుడి





బాణాలనూ, విల్లునూ విరిచాడు. నాలుగు బాణాలు వేసి దూషణుడి రథాశ్వాలను పూడ్చేశాడు. అర్థచంద్ర బాణంతో సారథి తలని నేల రాల్చాడు. శ్రీరామచంద్రుని ధనస్సు నుంచి మరో మూడు అర్థచంద్రాకార బాణాలు గాలిని చీల్చుకుంటూ వచ్చి దూషణుడి రొమ్ముని తాకాయి.

దూషణుడి విల్లు విరిగింది. సారథి చనిపోయాడు. దూషణుడు పెట్రేగిపోయాడు. అభేద్యమైన పరిఘుని అందుకున్నాడు. కొండ శిఖరం వంటి ఆ పరిఘుకు బంగారు కట్లు ఉన్నాయి. పరిఘుకు ఉన్న ఇనుప మేకులు వాడిగా సూదిగా పటిష్టంగా ఉన్నాయి. దేవతలనూ, సాధువులనూ ఎంతోమందిని చితక బాదిన ఆ పరిఘును తీసుకొని రథం మీద నుంచి దూకాడు.

శ్రీరాముడి వైపు పరిగెత్తాడు. అంత శ్రీరాముడు రెండు బాణాలను ప్రయోగించాడు. అవి రెండూ దూషణుడి రెండు బాహువులను తెగకొట్టాయి. వికృతంగా అరిచాడు దూషణుడు. దంతాలు ఊడబికిన మదపుటేనుగు వలే విరుచుకు పడిపోయాడు.

దూషణుడు నిహతుడవటంతో మహాకపాలుడూ, స్థూలాక్షుడూ, ప్రమాథీ ముగ్గురు మూకుమ్మడిగా కదిలారు. శూలంతోనూ, పట్టసాలతోనూ, గండ్రగొడ్డలితోనూ వస్తున్న ముగ్గురి మీద బాణ ప్రయోగం చేశాడు శ్రీరాముడు.

మహాకపాలుడి కపాలం పగిలిపోయింది. స్థూలాక్షుడి కళ్ళల్లోకి దూసుకుపోయాయి బాణాలు... కత్తిలాంటి బాణాలు ప్రమాథీని పలకరించాయి. అదే సమయాన శ్రీరాముడు తన ధనస్సు నుంచి ఐదువేల బాణాలను విరజిమ్మాడు. ఐదువేల మంది రాక్షసులను హతమార్చాడు.

శ్రీరాముడి ధనుస్సు నుంచి వచ్చిన బాణాలకి తనసేన అంతా సర్వనాశనం అవటం గాంచాడు ఖరుడు.

"రాక్షస వీరులారా! దూషణుడనూ, మన వీరులనూ యుద్ధమున శ్రీరాముడు వధించినాడు. ఇక ఎంత మాత్రం ఆలస్యం చేయరాదు. మీ మీ ఆయుధాలతో మీ సైన్యంతో వెళ్ళండి..."

ఖరుడి ఆజ్ఞతో శ్యేనగామి, పృథుగ్రీవుడు, యజ్ఞశత్రువు, విహంగముడు, దుర్జయుడు, కరవీరాక్షుడు, పరుషుడు, కాలకర్ముడు, మేఘమాలి, మహామాలి, సర్పాస్యుడు, రుధిరాశనుడు అనబడే పన్నెండు మంది సైన్యాధ్యక్షులూ శ్రీరాముని పై యుద్ధానికి సంసిద్ధులయ్యారు.

కాలసర్పాలతో సరిసమానమైన బాణాలను శ్రీరాముడి మీదకి సంధించారు. దానికి ప్రతిగా శ్రీరాముడు బంగారం మీద వజ్రాలు తాపడం చేసిన అగ్నిహోత్రం వంటి బాణాలను వదిలాడు. పెద్ద మంటలనూ, నిప్పు కణికలనూ వెదజల్లుతూ ఆ బాణాలు రాక్షస సేనపై పడ్డాయి. పెడబొబ్బలు పెడుతూ రాక్షసులు నేలకొరిగారు.

కవచాలు పగిలిపోయాయి. కరిగిపోయాయి. నెత్తుటి వరద వచ్చినట్లుంది అక్కడ ప్రాంతం... రథాలు పగిలిపోయి, రక్త మాంసాలతో కకావికలంగా ఉంది.

శ్రీరాముడు ఖరుడి వైపు చూశాడు. ఇక మిగిలింది ఖరుడూ, అతని సైన్యాధ్యక్షుడైన త్రిశిరుడూ.

☆☆☆ ☆☆☆ ☆☆☆

ఖరుడు మహా ఆవేశంతో ఊగిపోయాడు. అంత జరిగినా వెనుకడుగు వేయలేదు. వజ్రాయుధం ధరించిన ఇంద్రుడివలే శ్రీరాముని మీదకి రొమ్ము విరుచుకొని వెళ్ళబోయాడు.

అంత త్రిశిరుడు ఖరుడను ఆపాడు.

"వీరాధివీరా.... ఆగు. ఆ శ్రీరాముడనకు నేనే మృత్యువును. నీవు ఆజ్ఞాపించు. నేను కార్యం పూర్తి చేసుకు వస్తాను. ఆయుధాల మీద ఆన... ఈనాడు మృత్యువు నాకో... ఆ రామునికో తేల్చుకు వస్తాను. ఓ ముహూర్తకాలం వేచి చూడు. శ్రీరాముడను వధిస్తాను. అప్పుడే మనం జనస్థానానికి వెళదాం. నన్ను శ్రీరాముడు వధిస్తే... శ్రీరాముడితో పోరాడండి."

ఖరుడు త్రిశిరుడుని ఆజ్ఞాపించాడు. ముందుకెళ్ళమన్నాడు.

ధగధగ మెరుస్తున్న రథంపై నున్న త్రిశిరుడు శ్రీరాముడిపై బాణ వర్షం కురిపించాడు. శత్రువు ఒక బాణం వేస్తే ఒక బాణంతోనూ వంద బాణాలు వేస్తే వంద బాణాలతోనూ లక్ష బాణాలు వేస్తే లక్ష బాణాలతో సమాధానం చెబుతూ శ్రీరాముడు శత్రువుల బాణాలనూ, ఆయుధాలనూ మధ్యలోనే త్రుంచేశాడు. త్రిశిరుడు ఉగ్రుడై రాముడిపై మూడు బాణాలు ప్రయోగించాడు. అవి శ్రీరాముడి నుదట ప్రక్కగా స్పృశిస్తూ వెళ్ళాయి.

"ఆహా, రాక్షసవీరుడా! పరాక్రమవంతుడవు" అంటూ మహాసర్పంలాంటి నాలుగు బాణాలను త్రిశిరుడి వక్షస్థలంపై ప్రయోగించాడు. మరి నాలుగు





బాణాలు త్రిశిరుడి రథ గుర్రాలకి తగిలాయి. మరో ఎనిమిది బాణాలు సారథిని చుట్టు ముట్టాయి. ఇంకొక బాణం రథధ్వజాన్ని విరగకొట్టింది.

శ్రీరాముడు మళ్ళీ బాణాలని వేశాడు.

రథం దిగబోతున్న త్రిశిరుడని మూడు బాణాలు చుట్టు ముట్టి శిరస్సుని తాకాయి. అంతే త్రిశిరుడు నేలకొరిగాడు. ఖరుడి వైపు చూసి క్షమించమని కనులతోనే వేడుకొని కనులు మూశాడు. అడవి రాజు సింహాన్ని చూసి బెదిరిన పిల్ల జంతువులవలె సైన్యం భయంతో పరుగులు తీసింది.

ఖరుడు అడ్డుపడి... ధైర్యవచనాలు చెప్పి శ్రీరాముడిపైకి ఉసిగొల్పాడు.

శ్రీరాముని అరివీర పరాక్రమం ఖరుడిలో ఆలోచన రేకెత్తించింది. సమస్త సైన్యాన్నీ... సైన్యాధ్యక్షులనూ శ్రీరాముడు ఒంటి చేత్తో సంహరించాడు. విమనస్కుడయ్యాడు ఖరుడు. మరుక్షణం కోపంతో బుసలు కొట్టాడు.

ఇంద్రుని మీదకు వెళ్ళిన నముచిలా ఖరుడు శ్రీరాముని మీదకు వెళ్ళాడు. నల్లత్రాచుపాముల్లాంటి బాణాలను వదిలాడు. ఆ వెనువెంటనే మరికొన్ని బాణాలను వదిలాడు. ఎత్తిన విల్లు దించకుండా బాణ ప్రయోగం చేస్తూనే ఉన్నాడు ఖరుడు.

శ్రీరాముడు అంతకు మించిన బాణాలతో... సమాధానమిస్తున్నాడు. మహారథుల్లో మహారథుడైన శ్రీరాముడి బాణప్రయోగాలకి ఆకాశం అగ్నిలా ఉంది. నలుదిక్కులు ఎర్రగా నిప్పులు గుట్టలు గుట్టలుగా పడి ఉన్నట్టుగా ఉన్నాయి.

ఖరుడు, శ్రీరాముడి బాణాలతో ఆకాశం పొగతోనూ, వెలుగుతోనూ ఎర్రగానూ అయిపోయింది. సూర్యుడు వెతికి చూసినా కనపడటంలేదు.

మృత్యుపాశాలు పట్టుకున్న యముడిలా ఉన్నాడు ఖరుడు. తెగించి ఉన్నాడు. శ్రీరాముడు ఎంతో సేపు నుంచి యుద్ధం చేస్తున్నాడు. అలసిపోయి ఉంటాడు. తనిప్పుడే మరింత తీవ్రంగా యుద్ధం చేయాలి. విజయం సాధించాలి అనుకున్నాడు ఖరుడు.

అగ్నిహోత్రం మీదకి వెళ్ళే మిడతలా శ్రీరాముని మీదకు దూకాడు. బాణాన్ని ప్రయోగించాడు. అది పోయి శ్రీరాముని వింటి పిడికిటిలో తగిలింది. వింటిని విరగొట్టింది. ఖరుడు ఆ వెనువెంటనే వజ్రాయుధం వంటి బాణాల్ని వదిలాడు. శ్రీరాముడి కవచం నేల రాలింది. ఖరుడు ఆనందంగా రంకెలు వేస్తూ వేయి బాణాలు వదిలాడు.

శ్రీరాముడు అగస్త్యుడిచ్చిన వైష్ణవ ధనస్సును తీసుకున్నాడు. భగభగ మండుతున్న అగ్నివలే మారాడు. బంగారు ములుకుల బాణాలను వదిలాడు.

ఖరుడి రథధ్వజం విరిగిపడింది. శ్రీరాముడు మృత్యుదండ లాంటి బాణాలను వదిలాడు. సూర్యుడిలా మండుతూ వెళ్ళిన ఆ బాణాలు ఒకటి శిరస్సుకూ, రెండు బాణాలు రెండు చేతులకూ, గుండెల మీద అర్థచంద్ర బాణాలు మూడూ, మొత్తం ఆరు బాణాలు ఖరుడికి తగిలాయి.

శ్రీరాముడు మరి పదమూడు బాణాలు వదిలాడు. రథం కాడినీ, రథాశ్వాలనూ, సారథి శిరస్సునూ, రథం ఇరుసునూ, చివరి రెండు బాణాలు ఖరుడి ధనస్సుని, గుండెలను తాకాయి.

సర్వం పోయి నిస్తేజంగా నుల్చుండిపోయాడు ఖరుడు. శ్రీరాముడు చిద్విలాసంగా నవ్వాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"ఖరా! సర్వసైన్యం అంతరించింది. లోక కంటకుడైనవాడూ, అధర్మపరుడూ విజయం సాధించలేడు. నీలాంటి పాపకర్ముడను విష సర్పాన్ని చంపినట్టు నలిపి చంపాలి.

"దండకారణ్యంలో ముక్కు మూసుకొని తపస్సు చేసుకునే మునులని ఎంతో మందిని హింసించావు. విషాహారం తింటే వెనువెంటనే మరణం సంభవిస్తుంది. పాపకర్మలు చేసేవాడికి మాత్రం పాపం పండాలి. నీ పాపం పండింది. లోకానికి నీ భారం ఇక ఉండదు. నీవు హింసించినవారు పై నుంచి అంతా చూస్తున్నారు. ఆనంద పడుతున్నారు. నేటితో నీవు సరి."

శ్రీరాముడి పలుకులకి ఖరుడు వికటాట్టహాసం చేశాడు.

"ఓ దశరథ తనయా శ్రీరామా! సైన్యాన్నీ, సైన్యాధ్యక్షులనీ చంపినంత మాత్రన నీవు వీరుడవ్వవు... మహా శూరుడిలా తెగ ఆనందపడుతున్నావు. ఇదిగో మహోత్తరమైన గద. దానితో మూడు లోకాలనూ జయించగలను. నువ్వెంత.... అదిగో సూర్యుడు అస్తమించువేళవుతున్నది. సూర్యస్తమయం తర్వాత యుద్ధం యుద్ధనీతి కాదు. నా పరాక్రమానికి విఘాతం కలగరాదు" అంటూ గదను శ్రీరాముడిపై ప్రయోగించాడు.

వేలకొద్ది పిడుగులు పడుతున్నట్టు శబ్దాలు చేస్తూ శ్రీరాముడి వైపుకి వస్తోంది ఆ గద. అడ్డువచ్చిన వాటినీ దూరంగా ఉన్న అనేక వృక్షాలనూ





భస్మం చేస్తూ వస్తున్న గదను శ్రీరాముడు తన బాణంతో వక్కలు చేశాడు. ముక్కలై కుప్పకూలిపోయిందా గద.

అప్పుడు శ్రీరాముడు ఖరుడితో చెప్పాడు.

"ఓ నిరాయుధా ఖరా.... రాక్షసాధమా! అంతా అయిపోయింది. ప్రగల్భాలన్నీ పటాపంచలయ్యాయి. నీవు శక్తి హీనుడవు. నా బాణాలు ఇప్పుడే నీ కంఠంను తెగకోస్తాయి.

"దండకారణ్యంలో మునులందరూ ప్రశాంత చిత్తులవుతారు. పరమ ధార్మికులనూ, ఋషులనూ వేపుకు తింటున్న రాక్షస పడతులు ఈ యుద్ధమున తమ భర్తలు పోయి వగచి వగచి ఏడుస్తారు. మీలాంటి భర్తలను కట్టుకున్నందుకు వారి కదే శిక్ష... నీ కుల స్త్రీల దుఃఖానికి అంతూ పొంతూ లేనంతగా రాక్షస వధ జరిగింది. ఇక మునులు నిశ్చింతంగా హోమాలు చేసుకుంటారు."

"ఆపు శ్రీరామా! చావు నెత్తి మీద ఉంటే ఇంద్రియాలు పనిచేయక ఇష్టం వచ్చిన రీతిలో మాట్లాడతారు నీవూ అంతే" అని ఖరుడు ఓ పెద్ద వృక్షాన్ని పెకిలించి శ్రీరాముని మీద వేశాడు.

శ్రీరాముడు మధ్యలోనే దాన్ని ముక్కలు చేశాడు. ఇక శ్రీరాముడు ఉపేక్షించదలచుకోలేదు. ధనస్సుని ఎక్కుపెట్టాడు. వేయి బాణాలు వదిలాడు.

అవి పర్వతం మీద నుంచి జలపాతం సెలయేరులో దూకినట్టు దూకుడుగా వెళ్ళి ఖరుడిని తాకాయి.

రక్తం ఎగచిమ్మింది. ఖరుడి రక్తం నుంచి మదం వాసన వచ్చింది. ఒంటి నిండా రక్తమే. నురుగులు కక్కుతున్నాడు. అయినా కోపంతో శ్రీరాముడి వైపుకి వెళ్ళాడు.

శ్రీరాముడు అగస్త్యుడిచ్చిన బాణం తీశాడు. అగస్త్యుడికి దేవేంద్రుడిచ్చాడు. దాన్ని ప్రయోగించాడు. ఖరుడి గుండెలను తాకింది. వజ్రాయుధం దెబ్బతిన్న వృత్రాసురుడివలే ఖరుడు నేలకొరిగాడు.

దేవతలు ఆనందంతో కేరింతలు కొట్టారు. ఋషులు, ధర్మ పరాయణులు శ్రీరాముడని స్తుతించారు. చారణులు విజయ దుందుభులు మ్రోగించారు. దేవతలు శ్రీరామునిపై పూల వర్షం కురిపించారు.

లక్ష్మణుడూ, సీతా గుహ నుంచి శ్రీరాముడి వద్దకు వచ్చారు. ముహూర్తన్నర కాలంలో అశేష రాక్షస సేనను హతమార్చి ఋషీ లోకానికి

మేలు చేసిన శ్రీరాముడిని చూసి సీతాదేవి మురిసిపోయింది. వెన్నెల వెలుగు వంటి శ్రీరాముని అక్కున చేరింది.

## రావణుడు

రావణాసురుడి మేనమామ సుమాలి కొడుకు అయిన అకంపనుడు శ్రీరాముడి యుద్ధమంతా యుద్ధ రంగానికి దూరంగా ఉండి చూస్తున్నాడు. శ్రీరాముడు రాక్షస సంహారం పూర్తి చేయగానే అకంపనుడు అగమేఘాల మీద రావణుడను చేరాడు.

"మహాప్రభో... అంతా సర్వనాశనమయ్యింది. రాక్షస వీరులతో పాటు ఖరుడు హతమయినాడు. ఈ వర్తమానం మీకు ఇచ్చుటకే ఏదోలా వచ్చి మిమ్మల్ని చేరాను."

దశకంఠుడు రావణుడు అగ్ని మీద గుగ్గిలం వేసినట్టు మండిపడ్డాడు. కళ్ళు నెత్తుటి ముద్దలయ్యాయి.

"ఎవరు? ఎవరు నా జనస్థానమున రాక్షస వీరులను హతమార్చినది. రావణుడికి ఇష్టంలేనిది చేస్తే దేవేంద్రుడూ, మహావిష్ణువూ, కుబేరుడూ సుఖశాంత చిత్తములతో ఉండలేరే! అగ్నిహోత్రుడ్ని దహించి వేసే శక్తి కలవాడిని.... తేజస్సులో సూర్యుడను.... వాయువును స్థంబింపచేయు శక్తి గలవాడను... సూర్యచంద్రాదులను మాటతో ఆజ్ఞాపించగలవాడను... అట్టి నా వారిని ఎవరు సంహరించారు? అంతటి ఘాతకానికి పూనుకున్నది ఎవరు?" దశగ్రీవుడు రావణుడు క్రుద్ధుడయ్యాడు.

అకంపనుడు వణికిపోయాడు. రావణుడి రౌద్రం చూసి బెదరి ధైర్యం కూడదెచ్చుకొని చెప్పాడు.

"శ్రీరాముడు. అయోధ్యా రాజు దశరథ మహారాజు పుత్రుడు. భార్యతోనూ, తమ్ముడితోనూ వనవాసానికి వచ్చాడు. శ్రీరాముడు చక్కటి భుజస్కంధాలతో, తేజస్సుతో ఉన్నాడు. అతని ధనస్సు నుంచి వచ్చిన బాణాలకి దూషణుడూ, ఖరుడూ వారితో పాటు పధ్నాలుగు వేల రాక్షస సేన అంతరించింది."

నాగేంద్రుడివలె బుసలు కొట్టాడు రావణుడు.

"ఆ రాముడు..... దేవసేనలను వెంట తెచ్చుకున్నాడా? యక్షులూ, గంధర్వులూ సహాయపడినారా?"





"లేదు ప్రభూ... రాముడు తేజోవంతుడు. అమిత బల సంపన్నుడు. దేవేంద్రుడిలా యుద్ధం చేశాడు. ఈ సృష్టిలోని ధనుర్ధారులలో మేటి. అతని తమ్ముడు లక్ష్మణుడు ముఖం చంద్రబింబాన్ని పోలి ఉంటుంది. శ్రీరాముడు ఒక్కడే మన వీరులను హతమార్చాడు."

"ఆహా అంతటి వీరుడా! నే ఇప్పుడే శ్రీరాముడి జనస్థానానికి వెళ్ళి అందర్నీ హతమారుస్తాను" రావణుడు లేచాడు.

అకంపనుడు కంగారుగా వారించాడు.

"ప్రభూ! నా పలుకులు రెండు వినవలెను. శ్రీరాముడు బహు బలవంతుడు. మన రాక్షస వీరులు ఏ ఆయుధాలతో యుద్ధం చేస్తుంటే రాముడూ అవే ఆయుధాలు వాడాడు. శ్రీరాముడి శర పరంపర కనులారా చూశాను. శ్రీరాముడు తన పరాక్రమంతో మహోన్నతమైన ప్రవాహాన్ని సైతం ఆపగలడు. సముద్రాన్నీ ప్రక్కకి మరల్చగలడు. హరిహరాదులు వచ్చినా ఏమి చెయ్యలేని వీరత్వం శ్రీరాముడి స్వంతం."

"లంకేశా! రావణ ప్రభూ... దయతో వినుము. శ్రీరాముడు తన పరాక్రమంతో లోకాలన్నింటినీ నాశనం చేయగలడు. బలపౌరుషాలతో నక్షత్రమండలాన్ని కూడా లేకుండా చేయగలడు. తిరిగి తన శక్తితో సృష్టించగలడు.

"ప్రభూ...రాక్షసలందరూ ఏకమైనా రాముడ్ని నిరోధించటం సాధ్యం కాదనిపిస్తోంది. పాపం చేసినవారు స్వర్గాన్ని ఎలా చేరలేరో... యుద్ధంలో రాముడిని జయించలేరని అనుకుంటున్నాను.

"ప్రభూ నా వద్ద ఓ చక్కటి ఉపాయం ఉంది. శ్రీరాముని భార్య సీతాదేవి. చక్కటి అందగత్తె. శ్రీరామునకు బహిప్రాణం. ఆమె ఉత్తమ ఇల్లాలని విన్నాను. సీత స్త్రీ రత్నం. సర్వలోకాలలోనూ అందంలో ఆమెకి సాటిరాగల స్త్రీ లేదు.

"దశగ్రీవా! ఏదో ఒక తంత్రం చేసి సీతాదేవిని లంకకు తీసుకు రావలెయను. దండకారణ్యం వెళ్ళి భువనైక సుందరి యౌవన మధ్యస్థ సీతను రాముడు లేని సమయమున తస్కరించి తీసుకురా. భార్యంటే అమిత ప్రేమ గల శ్రీరాముడు నిలువెల్లా కుమిలిపోతాడు. శక్తి హీనుడవుతాడు. ఆ సమయంలో శ్రీరాముడ్ని తేలికగా జయించవచ్చు" చెప్పాడు.

"ఆహా అకంపనా... బహు చక్కటి ఆలోచన చెప్పినావు" అభినందించాడు రావణుడు.

సూర్యకాంతితో తేజరిల్లే రథంపై బైలుదేరాడు రావణుడు. కంచర గాడిదల ఆ బంగారు రథం ఆకాశ మార్గాన ప్రయాణించి మారీచుని ఆశ్రమం వద్దకు వెళ్ళింది. తాటకి కొడుకు మారీచుడు రావణబ్రహ్మను చూస్తూనే స్వాగతించాడు. పాద్యమూ, అర్ఘ్యమూ ఇచ్చాడు. భక్ష్యభోజ్యాదులతో సత్కరించాడు.

"రాక్షసరాజా... మన వీరులంతా కుశలమే గదా! నాతో ఏదో కార్యం ఉండి వచ్చినట్లున్నావు. ఎంతో గొప్ప మహోన్నత మహానుభావుడవు. కార్యార్థివై బైలుదేరినట్టున్నావు. నేను చెయ్యగల కార్యమైతే శెలవివ్వు...." అడిగాడు మారీచుడు.

"మారీచా... ఏం చెప్పను. నాకు అన్ని విధాల చేదోడు వాదోడుగా ఉంటు నా వాక్కు వేదవాక్కులా భావించే ఖరుడనీ, దూషణుడనీ శ్రీరాముడు చంపివేసినాడు. అమిత బలసంపన్నులైన మన వీరులను కడతేర్చాడు. అంతకు అంత చేయవలెను. శ్రీరాముడి భార్యను దొంగలించుకు పోవుటకే లంకను వీడి వచ్చాను. దానికి నీ సాయం కావలెను" చెబుతున్నాడు రావణుడు.

మధ్యలోనే అందుకున్నాడు మారీచుడు.

"రాక్షస రాజా... ఏమిటి మీరంటున్నది. శ్రీరాముడా! ఆ శ్రీరాముని భార్య సీతాదేవిని అపహరించుటయా?

"మీకీ సలహా ఇచ్చిన మిత్రద్రోహి ఎవరు? అట్టు చెప్పిన వాడు ఎవరైనా నీకు శత్రువే... రాక్షస నాశనం కొరకే...

"మహా సర్పం విషపు కోరలు నీచే పీకిస్తున్నది ఎవరు? సింహం గుహలోకి నీ కళ్ళకు గంతలు కట్టుకొని పొమ్మని చెప్పినది ఎవరు? రాక్షస లోకానికి మణిమకుటం నీవు. ఎంతో అనర్థం సృష్టించాలనే ఈ పన్నాగం పన్ని మీకు బోధించి ఉంటాడు.

"రాక్షస శార్దూలమా! శ్రీరాముడు సింహం. ఎన్ని జంతువులొచ్చినా ఏమీ చేయలేవు. అతని చేత ఉన్న ధనస్సు మొసలి వంటిది. శ్రీరాముడి చేతి స్పర్శతో అది నీటిలో మొసలివలె క్షణక్షణానికి శక్తి పెంచుకుంటుంది.

"లంకాధిపతి రావణా....వద్దు... శాంతించు. మారీచుడు నీ శ్రేయోభిలాషి. నా మాట విను. రాక్షసేంద్రా! శ్రీరాముడు కోపంతో ఉన్న సింహము లాంటి వాడు. తన బాణాలను గోళ్ళగానూ, ఖడ్గాలను కోరలవలె ప్రయోగించ శక్తి





కలవాడు. ఆ రాముడు ప్రస్తుతం నిద్రపోతున్న సింహం. జరిగినదేదో జరిగింది. వదిలేయ్. లంకచేరు. నీ అనేక ఇష్ట భార్యలతో క్రీడించు" చెప్పాడు.

మారీచుడి హితం విని రావణుడు తిరిగి లంక చేరాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

వేలాది మంది రాక్షస వీరులనూ, ఖరుడనూ, దూషణుడనూ సంహరించటం శూర్పణఖ స్వయంగా చూసింది. మేఘం ఉరిమినట్టు శోకాలు పెట్టింది. పుంజాలు తెంచుకొని పారిపోయిన మృగంలా పరుగుతీసింది. లంకకి చేరింది. పౌలస్త్య వంశ నందనుడు రావణుడు సభ తీరి ఉన్నాడు. దేవతలతో కూడిన దేవేంద్రుడిలా ఉన్నాడు రావణుడు. సింహాసనంపై మహాతేజస్సుతో సూర్యుడిలా వెలిగిపోతున్నాడు.

మహావీరుడు.... యక్ష, గంధర్వ, కింపురుషాది దేవతలతో సహా ఎవరితోనైనా యుద్ధరంగమున క్షణ వ్యవధిలోనే విజయాన్ని సాధించగల మహా పరాక్రమవంతుడు. దివ్యమైన ఆభరణాలతో ఉన్న రావణాసురుడి శరీరంపై దేవాసుర యుద్ధములో తగిలిన వజ్రాయుధపు గుర్తులున్నాయి. ఐరావతం అడ్డగించి నందు వల్ల వక్షస్థలం గాట్లు పడి ఉంది.

పది తలలూ, ఇరవై చేతులూ, విశాల వక్షస్థలమూ, వజ్రవైఢూర్యాల తోనూ, పుటం పెట్టిన బంగారం కుండలాలతో ఉన్నాడు రావణుడు.

తెల్లటి పలువరుసతో ఛత్రచామరాలతో కొండలా ఉన్నాడు రావణాసురుడు.

నిత్య యజ్ఞుడు. పర్వతాలను పిండి చెయ్యగల శక్తివంతుడు. దేవతలని మర్దించినవాడు. అధర్మాన్ని నిత్యం చేసేవాడు. సర్పరాజుని జయించినవాడు. తక్షకుడి భార్యను తీసుకొచ్చినవాడు. కుబేరుడి పుష్పక విమానాన్ని పట్టుకొచ్చినవాడు. అంతటితో ఆగక కుబేరుడి ఇష్ట ఉద్యానవనాన్నీ ధ్వంసం చేసినవాడు.

అట్టి రావణుడు సూర్య చంద్రులకు తన చేతులను అడ్డం పెట్టగల ధీమంతుడు. పదివేల సంవత్సరాలు తపస్సు చేసి బ్రహ్మదేవుడని మెప్పించినవాడు.

దేవ దానవ పిశాచ పత గోరగులు ఎవ్వరునూ తనని జయించకుండా వరం సంపాదించినవాడు.

మహాగర్విష్టి. ఆ మద గర్వంతోనే బ్రహ్మదేవుడని అడిగిన వరంలో మానవుని మినహాయించేశాడు.

తన తలలనే బ్రహ్మకి కానుకగా ఇచ్చి పొందిన వర గర్వంతో విర్రవీగుతూ ఉన్నాడు.

అట్టి మహావీరుడైన రావణాసురుడితో శూర్పణఖ అంది.

"అన్నా నీకిది తగునా? నీ సోదరికింత పరాభవం చేస్తే ఊరుకుంటున్నావా? నా ముక్కూ, చెవులూ కోసి నన్ను విరూపను చేసిన ఆ తుచ్ఛ మానవాదములను ఉరికే వదిలిపెడతావా?" ఏడుస్తూ రేగిన జుట్టును సవరించుకుంటూ అడిగింది.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"అన్నా రావణా! నీవు సుఖాలను మరిగినావు. ఇన్ని ఘాతుకాలు జరుగుతున్నా పట్టించుకోవటం లేదు.

"భోగాలతో స్త్రీల సాంగత్యంతో మునిగి తేలుతుంటే ప్రజలు అట్టివార్ని గౌరవించరు. వల్లకాటిలో నిప్పువలే చూస్తారు. బురద అంటిన ఏనుగును తప్పించుకు తిరిగినట్టు తిరుగుతారు.

"అన్నా రావణా! నీవు వివేకహీనుడవు... బుద్ధిహీనుడవు... వేగులవాండ్ల వల్ల జనస్థానం నాశనమైయిందని తెలియలేదా! ఖరుడనూ, దూషణుడనూ, పధ్నాలుగు వేల మంది రాక్షస వీరులనూ హతమార్చిన శ్రీరాముడు విజయ గర్వంతో ఉన్నాడు.

"నీ రాజ్యంలో ఇంత వినాశనం జరిగినా నీకు తెలియలేదా! నీ వేగులువాండ్లకు లోభంతో ధనం ఇచ్చి ఉండవు. లంకాధిపతి రావణా... క్రూరుడూ, గర్వి, ప్రమత్తుడూ, అల్పుడూ అయిన రాజును ఆపదలపాలు అయినప్పుడు అందరూ వదిలేస్తారు.

"విషయసుఖాలలో పడి నీవు నీ రాజ్య దేశ కాల పరిస్థితులు తెలుసు కోలేదు. రాజుగా నీవు అర్హుడవు కావు. నీవు త్వరలోనే భ్రష్టుడవవుతావు. నాశనం అవుతావు..." శూర్పణఖ కడుపు మంట తీర్చుకొంది.

రావణుడు తన దోషాలను గూర్చి ఆలోచించాడు. క్రోధ పరవశ అయిన శూర్పణఖని అడిగాడు.

"ఆ రాముడికి అంతటి పరాక్రమం ఎలా వచ్చింది. పధ్నాలుగు వేల మంది రాక్షసులను ఎలా సంహరించాడు. ఏ ఆయుధంతో..."





"దశరథ పుత్రుడు శ్రీరాముడు. ఇంద్రధనస్సు వంటి ధనస్సుతో, నార బట్టలు కట్టుకొని ఉన్నాడు. యుద్ధరంగంలో అతడు బాణాలు తియ్యటం వెయ్యటం ఒక్కసారి కూడా కనిపించలేదు. జడివాన కురిసినట్టు బాణాలు వదిలాడు. రాక్షసుడనే వాడినెవ్వరిని మిగల నియ్యలేదు. ధర్మపరుడు శ్రీరాముడు ఆడదాన్ని అని నన్ను వదిలేశాడు.

"రాముడి తమ్ముడు లక్ష్మణుడు మహా గుణవంతుడు. అందగాడు. రాముడి కుడి భుజం.

"శ్రీరాముడి భార్య పేరు సీత. చంద్రుని నగుమోముతో, పొడవాటి జుత్తుతో... మలిచినట్టుండే ముక్కుతో, ముగ్ధమనోహర రూపంతో ఉంటుంది. శ్రీరాముడంటే ప్రాణం... దండకారణ్య వనదేవతలా... రెండో లక్ష్మీదేవిలా ఉంటుంది.

"పచ్చి బంగారపు రంగు... సన్నని నడుం... విశాలకటి ప్రదేశం. కొండల వంటి స్థనాలు. ఎన్నో లోకాలు తిరిగాను. ఎక్కడా అంత అందగత్తెను చూడలేదు. సర్వశుభలక్షణాల గల స్త్రీని మొదటి సారి రాముడి ప్రక్కన చూశాను. విదేహరాజు జనకుడి కూతురు. మంచి యవ్వనంతో ఉంది.

"అన్నా! నిజం చెబుతున్నాను. రూపంలో సాటి మేటి గల ఆ చిన్నదాన్ని... ఆ సుశీలను... నీ కోసమే తేవాలనుకున్నాను. ఆమె ఎవర్ని కౌగిలించు కుంటుందో.... ఆ పురుషుడు దేవేంద్రుడికంటే ఎక్కువ ఆనందపడతాడు.

"నీ కోసమే పెద్ద పెద్ద స్తనాలు గల సీతను తేవాలనుకున్నాను. దానికి ఆ రాముడి తమ్ముడు నన్ను విరూపను చేశాడు.

"రాక్షసరాజా! ఆ సీతను చూసినంతనే మన్మథుడి బాణాలకు లొంగిపోతావు. కుడికాలు ముందు పెట్టు. మన రాక్షస వీరులను చంపిన రాముడు సీత సిగలో పువ్వులు పెడుతున్నాడు. అతడిని చంపి రాక్షసులను ఆనందింపచేయి.

"లక్ష్మణుడిని నీ కరకు బాణాలకు బలిచేయి. నీ బలం ఎవరుకుంది. ఎవరు నిన్ను ఆపగలిగింది. ఆ వయ్యారి సీతను లంకకు తీసుకురా... ఆలోచించు... ఆలోచించి నిర్ణయం తీసుకో" చెప్పింది శూర్పణఖ.

రావణుడు శూర్పణఖ చెప్పిందంతా విన్నాడు. ఆలోచించాడు. సీతను తీసుకురావటానికే నిర్ణయించుకున్నాడు.

ఒక్కడే రత్నాల రథంపై బైలుదేరాడు. పది తలలతో, ఇరవై చేతులతో పర్వతమంత ఆకారంతో బైలుదేరాడు. దేవ శత్రువు దశగ్రీవుడు ఎక్కిన రథం మేఘనాదముతో సముద్ర తీరానికి వెళ్ళింది. ఆ సముద్ర తీరంలో అనేక వృక్షాలకి ఫలాలూ, పుష్పాలూ కనిపించాయి. ఆ ప్రక్కగా పర్వతాలు... ఆ మధ్యలో ఆశ్రమపదాలు... అరటి చెట్లూ, కొబ్బరి చెట్లూ, మద్ది చెట్లూ, తాటి చెట్లూ శోభయమానంగా కనువిందు చేస్తున్నాయి.

రావణుడు అన్నీ చూస్తూ ప్రయాణిస్తున్నాడు. అనేక ఉద్యాన వనాలు, వాటి నుంచి వస్తున్న సుగంధాన్ని ఆస్వాదిస్తూ జలపాతాలూ, ప్రవాహాలూ మీదుగా చక్కటి స్త్రీలూ, ఏనుగులూ, గుర్రాలూ, పెద్ద పెద్ద మిద్దెలున్న నగరాలనూ దాటి స్వర్గంవలే ఉన్న ఓ ప్రదేశానికి చేరాడు. అక్కడో మర్రిచెట్టు ఉంది.

ఆ మర్రిచెట్టు కొమ్మలు నూరు యోజానాల వరకూ ప్రాకి ఉన్నాయి. ఆ చెట్టు చుట్టూ ఋషులున్నారు. ఒకనొక సమయాన విష్ణువాహనుడు గరుత్మంతుడు ఓ ఏనుగునూ, ఓ తాబేలునూ ఆహారానికి తెచ్చుకొని ఆ మర్రిచెట్టు మీద కూర్చున్నాడు.

ఆ మహాబలవంతుడి బలానికి ఆ మర్రిచెట్టు కొమ్మ ఆగలేక విరిగిపడింది.

వైఖానసులూ, వాలఖిల్యులూ, మరీచిపులూ కొమ్మ క్రింద తపము చేసుకుంటున్నారు. విరిగిన కొమ్మ వారి మీద పడుతుందేమోనని నూరు యోజానాల కొమ్మ క్రింద పడకుండా పట్టుకున్నాడు. మర్రికొమ్మనూ, ఏనుగునూ, తాబేలునూ పట్టుకొని దూరంగా ఎగిరిపోయాడు. ఆపై గరుత్మంతుడు ఒంటి పాదంతో నల్చుని గజకచ్ఛపాలను ఆరగించి ఆ కొమ్మతో నిషాదులను సంహరించి మహర్షుల వ్యథలనూ, బాధలనూ తప్పించాడు.

ఆ సంతోషములో రెట్టించిన ఉత్సాహంతో అమృతం కోసం వెళ్ళాడు. దేవేంద్రుడి రత్నాల భవనం పగలకొట్టాడు. అమృత భాండాన్ని ఎత్తుకొని పోయాడు.

ఆ మర్రిచెట్టు పై గరుత్మంతుడి వల్ల విరిగిన కొమ్మ గుర్తులున్నాయి. దాని క్రింద తపసులు తపస్సు చేసుకుంటున్నారు.

రావణుడు ఆ చెట్టు దగ్గర్నించి బైలుదేరాడు. మనోహరమైన ప్రదేశాన్ని చేరాడు. జటావల్కల ధారియైన మారీచుడ్ని చూశాడు.





మారీచుడు యధాప్రకారం అతిథి మర్యాదలతో దశగ్రీవుడు రావణుడను సంతృప్తిపరిచాడు.

"దశకంతా రావణా!... లంకలో అంతా క్షేమమే కదా! నాతో మరేదన్నా కార్యం పడినదా?" అడిగాడు మారీచుడు.

"మారీచా! నేను చెప్పునది ఆసాంతం వినుము. నా సోదరుడు ఖరుడూ, దూషణుడూ, పధ్నాలుగు వేలమంది వీరాధివీరులు నా జనస్థానమున నా వాక్కు వేదవాక్కుగా పాటించే నా అనుంగులందరునూ శ్రీరాముని బాణ పరంపరకు శివ సాన్నిథ్యం పొందారు. శూర్పణఖను విరూపను చేశారు. మరణించిన వారంతా మునుల యజ్ఞయాగాదులను ధ్వంసం చేసి నాకు ఆహ్లాదం కలిగించేవారు.

"నా ఆజ్ఞ తూ.చ. తప్పక పాటించేవారు. ఒక మానవుడు అదీ ఒంటరిగా అంతమందిని వధించటం నేను భరించలేకున్నాను. దండకారణ్యం ఇప్పుడు నిర్భయము అయినది తపసులకు.

"శ్రీరాముడు తన ధనుర్విద్యా పాండిత్యము చూపినాడు. మనం మన శక్తి యుక్తులను చూపవలెను. ఉగ్రతేజులైన రాక్షస వీరులను సంహరించినందులకు మనం ప్రతీకారం చేయవలెను. లేనిచో సర్వలోకాల్లోనూ, మనకు ఎదురుదాడి తప్పదు. దేవతలు దీన్ని అవకాశంగా తీసుకొని మన ఆధిపత్యాన్నే వ్యతిరేకిస్తారు.

"అందులకు ఒక్కటే ఉపాయము. శ్రీరాముని భార్య సీతాదేవిని... ఆ దేవకన్యను... ఆ అపురూప సౌందర్యవతిని భర్తలేని సమయమును తీసుకురావటమే.

"అందులకు సమర్థడవు నీవే.... మహాబలుడవు నీవు. దేవేంద్రుడూ, దేవతలూ కలిసి వచ్చినా యుద్ధరంగమున నీకు అపజయము లేదు. అన్ని మాయల్లోనూ నీకు నీవే సాటి....

"వెండి మచ్చలతో, బంగారు రంగుతో జింక రూపం ధరించి పంచవటీ ప్రాంతంలో సీత కంట పడేలా తిరగవలెను. సీత ఖచ్చితంగా మచ్చికకై ఆరాటపడుతుంది. నిన్ను తీసుకురావలెనని శ్రీరాముడిని కోరుతుంది.

"రామలక్ష్మణులు నీ వెంట పడతారు. అప్పుడు ఆ మానవ సౌందర్యరాశి సీతను నేను మాయోపాయం చేత తస్కరిస్తాను. లంకకు తెస్తాను. అప్పుడు

శ్రీరాముడు భార్యా వియోగంతో అలమటిస్తాడు. శత్రువుని అప్పుడు తేలికగా సంహరించగలం. చంద్రుడిని రాహువు పట్టుకున్నట్టు సీతను నేను ఎత్తుకొస్తాను. వెనువెంటనే సిద్ధం కమ్ము..." చెప్పాడు రావణుడు.

రాక్షస ప్రభువు చెప్పినది విన్న మారీచునకు గొంతులో తడారిపోయింది. భయంతో శరీరం వణికింది. ఎండి పోయిన పెదాలను నాలుకతో తడి చేసుకున్నాడు. శరీరంలో ప్రాణం లేనట్టు కళ్ళప్పగించి చూస్తుండిపోయాడు.

శ్రీరాముడులోని మహా పరాక్రమం మారీచుడు ఎరగనది కాదు. అతి బలవంతంగా శరీరాన్ని అదుపులోకి తెచ్చుకున్నాడు. దశగ్రీవుడితో చెప్పాడు.

"ప్రభూ... తాము రాజులు. మేం బంట్రోతులం. మీరు చెప్పినది మారు మాట్లాడకుండా చేయవలెను. అయిననూ ప్రభువు క్షేమం ఆశించి చెబుతున్న నా మాటలు వినవలెను. హితవచనాలు విని సమ్మతమైన నిర్ణయాన్ని తీసుకొనవలెను.

"ఓ రావణ ప్రభూ! శ్రీరాముడు మహావీరుడు. గుణవంతుడు. ఇంద్రుడితోనూ, వరణుడితోనూ సమస్త దేవతలతోనూ... ఏకకాలంలో యుద్ధం చేయగల సమర్థుడు. అప్రియమైన వాక్యములైనా తప్పక వినుము. ప్రీతి అయ్యే వినాశకరమైన మాటలు చేప్పేవారు నీకు కోకొల్లలు. శ్రీరాముడితో వైరం వల్ల రాక్షస జాతి లేకుండా పోతుంది. చూడపోతే నీ మరణం కోసం సీత పుట్టినట్లుంది.

"శ్రీ రాముడు తండ్రి తరిమేస్తే రాలేదు. దశరథుడి మాట కోసం వచ్చాడు. పితృ వాక్య పరిపాలకుడు శ్రీరాముడు. ధర్మం తప్పనివాడు. సృష్టిలోని ధర్మాలన్నీ తెలిసినవాడు. అట్టి గుణవంతుడి, వీర్యవంతుడి తమ్ముడు లక్ష్మణుడు.

"సుడిగాలినీ, అగ్నికీలకాలనీ ఎలా పిడికిలిలో బంధించలేమో, అట్లే శ్రీరాముడనూ జయించలేం.

"సత్యపాశాల్లో చిక్కిన శ్రీరాముడు అన్నీ భోగాలు వదిలాడు. దండ కారణ్యాం వచ్చాడు.

"కాన రావణా! నా పలుకులు విశ్వసించు. శ్రీరాముడు నీలా కామవృతుడు కాడు. దుశ్శీలుడు కాదు. అట్టి దోషాలున్న వారు తాము మాత్రమే కాక తన వాళ్ళనందరినీ మృత్యుదేవతకు ఆహారంగా వేస్తారు.





"రావణా! సూర్యకాంతిని ఎత్తుకు రాగలమా? అగ్నిహోత్రం శ్రీరాముడు. అతని శరాలే మంటలు. ధనుస్సే యముడి మంటలు కక్కేనోరు... చాపపాతమే కాలపాశం.... అందులో కోరి దూకకు. సింహం లాంటి రొమ్ము అతనిది. సీతను ప్రాణం కంటే అధికంగా చూసుకుంటున్నాడు. అగ్నిహోత్రాన్ని తాకటం ఎలా సాధ్యం కాదో, సీతను కూడా అట్లే సమీపించలేం.

"రాక్షసరాజా! వ్యర్థమైన ప్రయత్నం. శ్రీరాముడు నిన్ను చూస్తే నిలువునా నీ ప్రాణాలు హరించి వేస్తాడు.

"ధర్మపరులైన విభీషణుడు మొదలైన మంత్రులందరితో ఆలోచించు. నీ బలమూ, శ్రీ రాముడి బలమూ తెలుసుకో, ఏది కీడో, ఏది మేలో నిర్ధారణ చేసుకో.

"ఓ రావణా నేను ఎన్నిసార్లు చెప్పిననూ ఒక్కటే. శ్రీరామునితో వైరం మంచిది కాదు."

## మారీచుడు రావణ హితం కోరి మందలించుట

"రావణా! నా గూర్చి నీకు తెలియనది కాదు. వెయ్యి ఏనుగుల బలంతో పెద్ద ఇనుప గుదియ ధరించి, శిరస్సున కిరీటంతో తప్తకాంచన కుండాలలు ధరించి దండకారణ్యమంతా సంచరిస్తూ అందరినీ భయభ్రాంతులను చేసేవాడిని.

"సిద్ధుల, ఋషుల మాంసాన్ని కడుపారా ఆరగిస్తూ ఉండేవాడినని నీకు తెలుసు. అటువంటి సమయంలో బ్రహ్మర్షి విశ్వామిత్రుడు యజ్ఞసంరక్షణకై దశరథ మహారాజు వద్దకు వెళ్ళి శ్రీరాముడను పంపమని అడిగాడు.

"అందుకు దశరథ మహారాజు విశ్వామిత్ర మహర్షితో శ్రీరాముడు బాలుడు. పసివాడు. అస్త్ర విద్య పూర్తి చేయలేదు. నా చతురంగ బలాలూ, నేనూ మీతో వస్తాను. రాక్షస సంహారం చేద్దామని చెప్పాడు.

"ఓ దశరథ మహారాజా... లోకంలోని సైన్యమంతా ఒక ఎత్తు. శ్రీరాముడు ఒక ఎత్తు. దేవసేన నడిపిన వీరుడవు. నీ సైన్యం చాలా గొప్పది. ఆ సైన్యం ఇక్కడనే ఉంచు. నాతో శ్రీరాముడిని పంపు. నీకు శుభమవుతుందని" చెప్పి శ్రీరాముడను తన వెంట తీసుకు వెళ్ళాడు.

"విశ్వామిత్రుడితో వచ్చిన శ్రీరాముడు ధనుస్సు ఎక్కుపెట్టి అల్లెతాడు మోగించాడు. దండకారణ్యం మారు మ్రోగిపోయింది. ఒకే వస్త్రం ధరించి,

మెడలో బంగార హారం... కిరీటం ధరించిన శ్రీరాముడు బాల చంద్రుడిలా ఉన్నాడు.

"విశ్వామిత్ర యజ్ఞ దీక్షకు భంగం కలిగించాలని బంగారు కుండలాలు ధరించి బలగర్వంతోనూ, విజయగర్వంతోనూ వురికాను.

"నన్ను చూసి శ్రీరాముడు రవ్వంత కూడా చలించలేదు. యజ్ఞ వాటికను ధ్వంసం చేద్దామని ప్రయత్నించాను. శ్రీరాముడు ఒకే ఒక్క బాణం వేశాడు. ఆ నిశితాస్త్రం నన్ను నూరు యోజనాల దూరంలో ఉన్న సముద్రంలో పడవేసింది.

"ఆ బాణ శక్తితో సముద్రంలో పడ్డ నేను ఎంతో లోతుకెళ్ళాను. చివరకు నీ రాజ్యం లంకాపట్టణం చేరాను. శ్రీరాముడు నన్ను చంపివేయాలని అనుకోలేదు. అందువల్లే బ్రతికిపోయాను.

"రావణా! అప్పుడు శ్రీరాముడు బాలుడు. పిల్లవాడు. కాన రావణా నా మాట విను.

"శ్రీరాముడితో వైరమనగా వెనువెంటనే కష్టాల్లో పడటమే. రాక్షసలందరికీ మహా అనర్థమే.

"సకల ఐశ్వర్యాలతో తులతూగే లంకాపట్టణం సీత వల్ల స్మశానం అవుతుంది.

"రావణా! పరస్త్రీని ఆశించటం కంటే నీచ పాపం సృష్టిలో లేదు. అంతకు మించి వినాశనం లేదు. నీకు వెయ్యి మంది భార్యలున్నారు. వారంతా ఎంతో అందమైన వాళ్ళు... వారితో సుఖంగా జీవించు. బహుకాలం నీ ఇష్టమొచ్చినంత కాలం రమించు.

"నీ గౌరవన్నీ, నీ వంశాన్నీ, నీ మిత్రులనూ, లంకా పట్టణాన్నీ, నీ సంపదనూ... కాపాడుకో... శ్రీరాముడితో వైరం వల్ల అన్నీ పోతాయి. వచ్చేది ఒక్క మృత్యువే.

"లంకా నగరం అగ్నిపాలు కావటం సహించలేను. నేను ఎంతగానో వద్దు అని చెబుతున్నాను. కాదు, అంటే సీతను ఎత్తుకుపోతానూ అంటే నేను చెయ్యగలిగింది లేదు. రామబాణంతో యమపురికి పోవుటకు సిద్ధమైతే సిద్ధమవ్వు..."

☆☆☆ ☆☆☆ ☆☆☆





"రావణా! ఇంకా విను, విశ్వామిత్ర మహర్షి ఆశ్రమంలో శ్రీరాముడి బాణ ధాటికి నేను నిర్వీర్యుణ్ణి అయిపోలేదు.

"అన్ని యోజనల దూరం పడ్డా... నేను భయపడలేదు. సమయం కోసం కాచుకున్నాను. ఇద్దరు రాక్షసులతో కలిసి మృగాలుగా మారి దండకారణ్యం ప్రవేశించాను.

"క్రూరంగా, ధర్మదూషకుడిగా మారాను. ఋషులను చావబాదాను. మునులను భయభ్రాంతులను చేశాను. జింక రూపం ధరించి ఇష్టమొచ్చినట్టు తిరుగుతూ... సాధు పుంగవుల నెత్తురునూ, మాంసాన్నీ ఆరగిస్తుండేవాడని.

"ఓ నాడు సీతారామలక్ష్మణుల వద్దకు వెళ్ళాను. తాపస రూపంలో ఉన్న శ్రీరాముడు నన్ను గుర్తుపట్టలేదు. నాకు మాత్రం శ్రీరాముడి బాణ దెబ్బ గుర్తుంది.

"పాత వైరం గుర్తుకు వచ్చింది. శ్రీరాముడు తపసి, నన్ను ఏం చేస్తాడులే అనుకున్నాను.

"నా వాడి కొమ్ములతో పొడవాలనుకున్నాను. బుద్ధి తక్కువగా ప్రయత్నించాను.

"అప్పుడు శ్రీరాముడు మూడు బాణాలు వేశాడు. ఆ బాణాలు గరుత్మంతుడి రెక్కల్లా భయంకరంగా ధ్వని చేస్తూ... గాలితో పోటి పడుతూ నా వైపుకు వస్తున్నాయి.

"గతంలో శ్రీరాముడి బాణం దెబ్బ నాకు ఇంకా గుర్తుండటంతో... శ్రీరాముడి పరాక్రమం నాకు మరపులో ఉన్నందువల్లే భయంకరంగా పరుగుతీశాను.

"ఆ బాణాలకి నా వెంట ఉన్న ఇద్దరు రాక్షసులు మరణించారు. శ్రీరాముడి బాణాన్ని పరిగెత్తి తప్పించుకొని బ్రతికి బయట పడ్డాను.

"అంతే ఆ రోజు నుండి ఋషుల జోలికి పోవటంలేదు. సాధుపుంగవులను గౌరవిస్తున్నాను. నరమాంసం కూడా మానివేసినాను. ముక్కు మూసుకు తపస్సు చేసుకుంటున్నాను.

"రావణా! శ్రీరాముడు నార బట్టలు ధరించాడని తక్కువగా అంచనా వెయ్యద్దు. లేడి తోలు ధరించిన యముడు. తలుచుకుంటేనే ఎటు చూసినా శ్రీరాముడు ఒక్కడు కాదు, వేలు వేలుగా అగుపిస్తున్నాడు.

"ఈ అడవంతా శ్రీరామ మాయలా తోస్తోంది. 'ర' శబ్దంతో ఏది పలికినా హడలిపోతున్నాను. శ్రీరాముడు బలినయినా, నముచినయినా ముహూర్తకాలంలో సంహరిస్తాడు.

"రాక్షస రాజా! నేను బ్రతికి ఉండుట ఇష్టమైతే శ్రీరాముడి గూర్చి మాట్లాడకు. ఖరుడ్నీ, జనస్థాన రాక్షసులను సంహరించటంలోనూ, శూర్పణఖకు ముక్కూ, చెవులూ కోయటంలోనూ శ్రీరాముని తప్పేముంది. ధర్మం తెలిసిన నీవు ధర్మంగా చెప్పు....." అడిగాడు మారీచుడు.

★★★ ★★★ ★★★

యమసదనానికి పోవువాడు ఔషధం పుచ్చుకొననట్టుగా రావణాసురుడు మారీచుడి హిత వాక్యాలు వినలేదు. రోగికి పథ్యం చేసే మేలులా మారీచుడు ఎన్ని విధాలుగా చెప్పినా వినలేదు. పైగా కఠినంగా...

"మారీచా! నీ అనుచిత ప్రసంగమంతా నేను ఓపికగా వింటిని. చవిటి నేలలో విత్తనాలు చల్లుతున్నావు. శ్రీరాముడు పాపాత్ముడు. నీ తల్లిని చంపినాడు. శూర్పణఖను పరాభవించినాడు.

"నా సోదరులు ఖర, దూషణులను సంహరించాడు. వేలాది రాక్షస వీరులను తుది ముట్టించాడు. బుద్ధిలేని ఓ ఆడదాని మాటతో అడవికి వచ్చిన మహామూర్ఖుడు. ఒక మానవుడా! నన్ను యుద్ధంలో జయించునది... అది అశక్యం.

"మారీచా! నాకింత నష్టం కలిగించిన శ్రీరాముడను దేవతలందరూ వచ్చి చెప్పినా విడవను. వెనుకకు తగ్గను. ఉపాయ, అపాయల గూర్చి నేను నిన్ను అడగలేదు. అడిగితే చెప్పినా అర్థం ఉంది.

"అడగనిదే ఏదీ చెప్పకూడదు. అది కూడా అప్రియంగా ఉండకూడదు. మంచీ చెడ్డా అడిగానా? యోగక్షేమాలు చెప్పమన్నానా? రాజుని అన్ని సమయాల్లోనూ పూజించాలి. మన్నించాలి. రాజధర్మం తెలియని మూఢుడవు నీవు.

"రాజు ఎప్పుడూ ఉన్నత గౌరవనీయుడు. మంచి వాక్యమైనా నిర్లక్ష్యంగా, గౌరవ హీనంతో చెబితే రాజు క్షమించడు.

"ఓ మారీచా! నేను చెప్పినట్టు నీవు వినవలిసినదే, చేయవలిసినదే. మారు మాట్లాడకు.





"వెండి చుక్కల బంగారు లేడిగా మారు... రాముడి ఆశ్రమానికి వెళ్ళు. సీత నిన్ను చూసి ఆశ్చర్యపోతుంది. ఆ లేడి కావాలి అని అడుగుతుంది. మైథిలీ మాటను త్రోసి పుచ్చని శ్రీరాముడే నీ వెంట పడతాడు.

"చాలా దూరం నీవు పరిగెత్తి "అయ్యో సీతా! అయ్యో లక్ష్మణా!" అని అరువు... ఆ కేకలకి సీత కలవర పడుతుంది. లక్ష్మణుడని పొమ్మని తొందర పెడుతుంది. లక్ష్మణుడు ఆశ్రమం దాటగానే శచీదేవిని ఎత్తుకు పోయిన దేవేంద్రునివలె సీతను నేను ఎత్తుకు వస్తాను.

"మారీచా! ఆపై నీవు నీ ఇష్టం వచ్చిన చోట ఉండవచ్చును. సువ్రతుడవు... ఈ కార్యం నీవు చేస్తే రాజ్యంలో సగభాగం ఇస్తాను. నిన్ను కూడా నాతో లంకానగరానికి తీసుకుపోతాను.

"కాదనకు మారీచా! అవశ్యముగా చేయవలెను. నేను రాజును. రాజాజ్ఞ పాటించనివాడు బ్రతకడు. సుఖపడడు. ఈ కార్యం వల్ల శ్రీరాముడి వల్ల నీవు మరణించకపోవచ్చు. కాదంటే మాత్రం నీవు బ్రతికి ఉండటం కల్ల. ఆ పై నీ ఇష్టం" చెప్పాడు కరకుగా రావణుడు.

★★★ ★★★ ★★★

"రావణా! ఎంత చెప్పిననూ నా మాటలను నీవు విశ్వసించుట లేదు. నీ సర్వం నాశనమగు ఈ కార్యం నీకు చెప్పిన ఆ పాపకర్ముడు ఎవరు? వీర్యహీనులైన రాక్షసులే నీ అసలు సిసలు శత్రువులు. రాముడి చేత రాక్షస జాతి అంతం కావాలని అనుకొని నీకు నూరిపోసిన ఆ నీచుడు ఎవరు? నీ మంత్రులూ, నీ అనుంగులూ ఎవరూ కాదని చెప్పలేదా! అయితే వారు కూడా మరణింప దగ్గవారే....

"ఓ రావణా! రాజులో దోషాలుంటే మంత్రీ, సామంతులకే కాదు ప్రజలకీ కష్టాలు తప్పవు. రాజు బుద్ధిలేనివాడూ, మంత్రులు అసమర్థులైతే బుద్ధి తక్కువవాడు రథం నడిపినట్లే ఉంటుంది.

"రాజా! రాజు క్రూరుడై, ప్రజలకు ప్రతికూలుడైతే ప్రజలు నక్కలు కాపాడే మేకలవలే క్షీణించిపోతారు. కఠినాత్ముడవు, దుర్బుద్ధివి. నీవు రాక్షసులకు రాజువి. అది అందరి దురదృష్టం. రాక్షసులంతా సర్వనాశనం కాక తప్పదు.

"ఈ భయంకర ఘోర తప్పిదం నాతో ప్రారంభమవుట నా దురదృష్టం. శ్రీరాముడు తప్పక నన్ను చంపుతాడు. బ్రతికి ఉన్నా, ఆ తర్వాత నిన్నూ,

నన్నూ చంపుతాడు... మంచి మాటలను గతాయుష్కూలూ, మృతప్రాయులూ వినరు..." చెప్పాడు మారీచుడు.

## బంగారు జింక

మారీచుడు సరేననటంతో రావణాసురుడు సంతసించాడు.

"మారీచా! నీవు నాతో పాటు ఈ పిశాచ ముఖాల కంచర గాడిదలు కట్టిన రత్నా భూషిత రథమెక్కు. సీతను ప్రలోభపెట్టు... ఆపై యథేచ్ఛగా నీ ఇష్టం వచ్చిన చోటకు పొమ్ము."

ఆ తర్వాత ఇద్దరూ రథంపై ప్రయాణించారు. పట్టణాలనూ, అడవులనూ, కొండలనూ, పర్వతాలనూ, జలపాతాలనూ, నదులనూ దాటారు.

మారీచ రావణులు శ్రీరామాశ్రమాన్ని సమీపించారు. అరటి చెట్ల నడుమున ఉన్న రాముని ఆశ్రమాన్ని మారీచుడికి చూపించాడు. రావణుడు చెప్పినట్టుగా మారీచుడు బంగారు లేడిగా మారాడు. శ్రీరాముడూ, సీతా, లక్ష్మణుడూ ఉన్న దగ్గరిలో తచ్చాడాడు, మాయ లేడి రూపంలో ఉన్న మారీచుడు.

బంగారు లేడిగా మారిన మారీచుడు మహదాశ్చర్యం కలిగించే రూపంతో ఉన్నాడు. కొమ్ములు ఇంద్ర నీలమణులు. ముఖం తెలుపు, నలుపులతో... నోరు ఎర్ర కలువవలే...

చెవులు నల్ల కలువ వలే, కంఠం ఎత్తుగానూ, పెదవి ఇంద్రనీలము పలుకువలె... పొట్ట తెల్ల మల్లెపూవువలె, చంద్ర బింబంవలె, వజ్రమువలె, దాని పక్కలు ఇప్ప పూలవలే, దాని గిట్టలు వైఢూర్యమణులవలే ధగ ధగలాడుతూ తళతళలాడుతూ మనోహరంగా ఉంది.

ఆ లేడి శ్రీరాముడి ఆశ్రమ పరిసరాలనూ, చుట్టూ అడవిని మురిపిస్తూ సీతను ఆకర్షించటం కోసం నానాపాట్లు పడుతోంది.

వెండి మచ్చల బంగారు లేడి చెట్ల చివుళ్ళు కొరుకుతూ మెల్లమెల్లగా నడిచింది.

అరటి బోదెలూ, కర్ణికార వృక్షములూ, కొండ వాగు లాంటి ప్రదేశాల్లో సీత తనని చూసేలా దృష్టి పడేలా మెసిలింది.

అడవి జంతువులు ఆ మాయలేడిని చూసి దగ్గరికి వచ్చాయి. వస్తూనే తమని చంపుకు తినే రాక్షసుడని తెలిసి దూరంగా పోయాయి.





ఆ సమయంలో పువ్వుల కోసం వచ్చింది సీత కొండ వాగు దగ్గరికి. అక్కడ నుంచి అరటి బోదెల వద్దకూ, అశోక వృక్షం వద్దకూ పువ్వులు కోసుకుంటూ వస్తోంది.

అక్కడే తిరిగింది పద్మమువలే ఉన్న బంగారు మాయలేడి. మంగళ కరమైన నేత్రముల గల సీత కంట పడింది. ముత్యాలూ, వజ్రాలూ తాపడం చేసినట్టు ఉన్న ఆ జింకను చూడగానే ఆకర్షితురాలైంది సీత.

సీతని చూసి మరింత చిత్రంగా తిరిగింది. సీతాదేవి ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. తెల్లటి పలువరుస గల సీత, ఎర్రటి పెదవుల గల సీత నోరు తెరచి ఉత్ఫుల్ల నయనాలతో చూసింది.

ఆ జనకాత్మజ, ఆ శుభలోచన... ఎన్నడూ చూడని ఆ బంగారు లేడిని విస్మయంగా చూస్తుండిపోయింది.

★★★ ★★★ ★★★

బంగారు బొమ్మ సీతాదేవి ఆ బంగారు లేడిని చూస్తూ శ్రీరాముడిని పిలిచింది. మహావీరుడు శ్రీరాముడూ, లక్ష్మణడూ వెనువెంటనే ఆమె వద్దకు వచ్చారు.

చిత్ర విచిత్రంగా సంచరించే బంగారు జింకను చూశారు. జింక రెండు ప్రక్కల బంగారు రంగుతోనూ, వెండి రంగుతోనూ ఉంది. లక్ష్మణుడు శంకించాడు.

"శ్రీరామా! చూడపోతే ఈ జింక మారీచుడి వలె అనిపిస్తోంది. కామరూపివాడు. ఆ దుష్టుడే మాయా రూపంతో వేటకు వచ్చిన ఎందరో రాజులను చంపివేసినాడు.

"వజ్రం మచ్చలతో గల బంగారు లేడిని లోకంలో ఎక్కడా చూడలేదు. వినలేదు. ఇది ఖచ్చితంగా రాక్షస మాయే. సందేహం లేదు... ఓ రామా! జగతీనాథుడవు... నీకు తెలియనిది కాదు" చెప్పాడు లక్ష్మణుడు.

జనక నందిని అందమైన చిరునవ్వుల గలది అయిన సీతాదేవి శ్రీరాముని వంక చూసింది.

"ఆర్యపుత్రా! మనోహరంగా ఉంది జింక. చూడముచ్చటగా ఉంది. దానిని మీరు తెచ్చి పెట్టమని నా అభ్యర్థన... కోరిక. మన ఆశ్రమంలో సృమరాలూ, చమరాలూ, చక్కటి జింకలూ, కిన్నెర మృగాలూ ఎన్నో ఉన్నాయి.

"స్వామీ! ఎన్ని సాధుజంతువులున్నా ఈ బంగారు జింకకు సాటిరావు. తళతళలాడుతూ శోభాయమానంగా శోభిస్తోంది. నాకు పదేపదే ఆ మహావిచిత్రమైన జింకను మచ్చిక చేయాలని ఉంది. వనవాసమనంతరం మన అయోధ్య అంతఃపురానికి వన్నె కాగలదు.

"ప్రాణనాథా! ఇటువంటి దేహకాంతితో మెరిసిపోయే జింకను చూసి భరత శత్రుఘ్నులూ, అత్తగార్లూ తప్పక ఆనందిస్తారు. ఎంతో చక్కని రూపమూ, ఆ సౌందర్యమూ, నా మనస్సును హరించినది. ప్రాణంతో దొరకనప్పుడు దాని చర్మమైనా చాలును. బంగారంలా మెరుస్తున్న ఆ చర్మం దర్భాసనముగా పరిచి మిమ్మల్ని సేవిస్తాను.

"స్వామీ భర్తను భార్య కోరాలి గాని, ఆజ్ఞతో, వినమ్రతతో అడుగరాదు. నాది తప్పిదమే. అయిననూ భార్య తన ఇష్టాల్నీ, కోరికల్నీ భర్తతో మాత్రమే చెప్పి తీర్చుకుంటుంది. ఆ ధర్మం ప్రకారమే కోరుతున్నాను" చెప్పింది సీత.

శ్రీరాముడు శాంత వదనంతో చూసి లక్ష్మణుడితో చెప్పాడు.

"లక్ష్మణా! అద్భుతమైన ఆ జింకను సీత కోరింది. దాని అద్భుత లావణ్యం చూస్తుంటే ఇట్టి మృగం నందనోద్యానవనంలో కూడా ఉండదనిపిస్తోంది. చైత్రరథవనములో కూడా కానరాదు. అదిగో చూడు అది ఆవలిస్తోంది. అలా చేసినప్పుడు నాలుక మేఘాలలో మెరుపువలె మెరుస్తోంది.

"దాని పొట్ట శంఖమువలె, బాల సూర్యుని వంటి రంగుతో ఇంద్రనీలమణి గిన్నెలా ఉంది నోరు. బంగారం మీద అద్భుత రత్నాలు అద్దినట్టు ఉన్న ఆ దివ్యరూపం చూసి ఎవరికి మాత్రం మనసురాదు. మనసుపడరు.

"మనం క్షత్రియులం. మాంసం కోసం, సరదా కోసం అడవికి వస్తాం. క్రూర మృగాలను చంపుతాం... ఆ ప్రయత్నంలో రత్నాలు, మాణిక్యాలు, బంగారం లాంటి వివిధ ధాతువులు ఎన్నో అడవిలో నిక్షిప్తమైనవి దొరుకుతాయి.

"లక్ష్మణా! సంకల్పం వల్ల శుక్రుడికి సమస్త సంపదలు వచ్చినట్టు, రాజులకు ఈ అరణ్యాల వల్లే సమస్త ధనం సమకూరుతుంది. నీతి శాస్త్రజ్ఞులూ, అర్థ శాస్త్రజ్ఞులూ చెప్పిన ప్రకారం తనకి కావలసిన దాని కోసం ఏ ఆలోచన లేకుండా ఆ పనినే చేసి సంపాదించుకుంటాడు సమర్థుడు. నేను ఖచ్చితంగా ఆ బంగారు జింకను వదలను. శ్రీమంతమైన లేడి.. ఆకాశం మీద మృగ శీర్ష, ఈ భూమి మీద ఈ బంగారు జింక...





"కాదు నీ వన్నదే అయితే, రాక్షస మాయ అయితే చేధిస్తాను. లేదా సాధిస్తాను. వదిన కోరిక తీరుస్తాను. మారీచుడే ఈ జింక అయితే వాడికి ఈ రోజుతో రోజులు సరి. ఎంతో మంది ఋషులను హింసపెట్టాడు. వేటకు వచ్చిన చాలా మంది రాజులను వంచనతో చంపి తిన్నాడు. రెండు సార్లు జాలితో వదిలేసాను. అయితే ఈ సారి తప్పదు.

"లక్ష్మణా! మారీచుడు వాతాపీలాంటివాడు. ఎంతో మంది ముని పుంగవులను ఆరగించినవాడు. అగస్త్య మహర్షి కడుపులో వాతాపీ జీర్ణమైనట్టు... ఈ మారీచుడు కూడా మరణిస్తాడు. సీతను కనిపెట్టుకుని ఉండు. వైదేహికి రక్షణగా ఆశ్రమంలోనే ఉండు. నేను త్వరితంగా వస్తాను... సీతను కంటికి రెప్పలా కాపాడు.

"మహాసమర్థుడైన జటాయువును సాయంగా ఉంచుకో... అప్రమత్తుడిగా ఉండు" చెప్పాడు లక్ష్మణుడితో శ్రీరాముడు.

## మారీచుని వధ

లక్ష్మణుడికి సీత గూర్చి జాగ్రత్తలు చెప్పి అమ్ముల పొదినీ, వింటినీ తీసుకున్నాడు. దాన్ని గమనించిన మారీచుడు ఒక్క గెంతు గెంతాడు. శ్రీరాముడు వర్ణింప శక్యంగాని సౌందర్యము గల ఆ లేడి కోసం చూశాడు. కనిపించలేదు. ప్రక్కకి చూశాడు కనిపించింది.

మారీచుడు శ్రీరాముడు దగ్గరికి వస్తున్నప్పుడు మాయమై, దూరమైనప్పుడు కనిపిస్తూ ముందుకు తీసుకు వెళ్తున్నాడు.

ఒక క్షణం ఆదమరిచి ఉన్నట్టు చెట్ల చిగుళ్ళు కొరుకుతూ కనిపించేది. మరుక్షణం చప్పున తుప్పల మాటుకి తప్పుకునేది. మబ్బుల్లో చందమామలా అవుపడీ అవుపడనట్టు అయిపోయేది.

దొరికీ దొరకనట్టుగా చేస్తూ శ్రీరాముడని ఎంతో దూరం తీసుకు పోయింది. ఆ బంగారు జింక అలా మురిపిస్తున్నందుకు శ్రీరాముడు క్రుద్ధుడయ్యాడు. సౌందర్యానికి పరవశుడై చంపబుద్ధికాక చెట్టు నీడన నిల్చున్నాడు.

అప్పుడు కనిపించింది దగ్గరిగా, వన్య మృగాలతో కలిసి... పట్టుకోవటానికి వేగంగా పరిగెత్తాడు. అందినట్టే అంది జారిపోయింది. శ్రీరాముడు తప్పని సరై బాణం గురి పెట్టాడు. సూర్యుడిలా వెలిగిపోతుందా బాణం. సంధించి

వదిలాడు. బ్రహ్మ నిర్మించిన ఆ బాణం, ఆ మహాస్త్రము గాలిని చీల్చుకెళ్ళింది. మంటలు చిమ్ముతూ పిడుగులా వెళ్ళి జింక రూపంలో ఉన్న మారీచుడికి తగిలింది.

ఆ బాణ ధాటికి తాటి చెట్టంత ఎగిరి క్రింద పడింది. మరుక్షణంలోనే మాయా రూపం మాయమైంది. మారీచుడు నిజరూపం బైటపడింది.

రావణుడు చెప్పిన ప్రకారం అరిచాడు.

"అయ్యో సీతా! అయ్యో లక్ష్మణా!" దుష్టబుద్ధీ, క్రూరుడూ అలా రాముడి కంఠంతో అరిచి కనులు మూశాడు. సర్వాభరణాలతో, బంగారు కంఠమాలతో, పెద్ద పెద్ద కోరలతో శరీరమంతా రక్తంతో చనిపోయిన మహాకాయుడు మారీచుడిని చూశాడు శ్రీరాముడు.

లక్ష్మణుడు చెబుతూనే ఉన్నాడు. రాక్షస మాయని, మారీచుడని. పరలోకానికి పోతూ "అయ్యో సీతా! అయ్యో లక్ష్మణా!" అని అరిచాడు.

అది విన్న వైదేహి ప్రస్తుతం ఏ స్థితిలో ఉందో... లక్ష్మణుడు ఎంత వేదనకు గురి అవుతున్నాడో... అంతటి పరాక్రమవంతుడు శ్రీరాముడు మారీచుడు అరుపు గుర్చి చాలా  సేపు మథనపడ్డాడు.

వాడి అరుపు ఏ అనర్థానికి దారి తీస్తుందోనని కలవరపడ్డాడు. జనస్థానాభిముఖుడయ్యాడు. దారిలో మరో మృగాన్ని గాంచి, దాన్ని చంపి మాంసము తీసుకొని బైలుదేరాడు.

## సీత ఆవేదన

మాయా మారీచుని ఆర్తనాథం సీత విన్నది. అది శ్రీరాముడి గొంతు. ఆదుర్దాగా, ఆందోళనగా అంది.

"లక్ష్మణా! విన్నవా? అది మీ అన్నగారి గొంతు. ఎంతటి ఆపదలో ఉన్నారో... నా మనస్సు ఏదో కీడు శంకిస్తోంది. నా ప్రాణం నిలిచేలా లేదు. రాక్షసులుకి చిక్కి ఆపన్నుడు అయి ఉంటారు. సింహానికి దొరికిన ఆంబోతువలె అరిచారు. వెంటనే వెళ్ళు. రామునికేమైనదో తెలుసుకో. అన్నగారిని రక్షించు" చెప్పింది సీత.

లక్ష్మణుడు సీత ఎంత తొందర పెట్టినా కదలలేదు.

"లక్ష్మణా! మీ అన్నగారి ఆర్తనాదం నిన్ను కదిలించలేదా! అయినా నిమ్మకు నీరెత్తకుండా ఉన్నావంటే మిత్ర రూపంలో ఉన్న శత్రువులా





అగుపిస్తున్నావు. మీ అన్నగారికి కష్టం వస్తే నీకు సంతోషంలా ఉంది. నా మీద ఆసక్తి పెట్టుకున్నావు... అందుకే ఆపదలో ఉన్న అన్న దగ్గరికి వెళ్ళకుండా ఉన్నావు" సీత కోపంతో ఆవేశంతో వణికిపోతూ అంది.

లక్ష్మణుడు ఖిన్నుడయ్యాడు.

"ఓ మైథిలీ... విదేహ రాజపుత్రీ... నీ భర్తను అసురులుగానీ, దేవతలుగానీ, యక్ష, గంధర్వులు గానీ జయించటం సాధ్యంకాదు. ఆ గొంతు అన్నగారిది కాదు. రాక్షస మాయ. శ్రీరాముడు వెళుతూ మీ సంరక్షణ బాధ్యత అప్పగించి వెళ్ళారు. ఆ ధర్మం ప్రకారమే కదలటంలేదు.

"తల్లీ సీతాదేవీ... నీవు మంగళస్వరూపిణివి. నీ భర్త దేవతల రాజు దేవేంద్రుడి కన్నా వీరుడు. నా మాటలు సంశయించవద్దు. మేఘాలలో కనిపించిందే గంధర్వ నగరమని భ్రమసినట్టు ఆ కంఠం శ్రీరాముడిదిగా భావించవద్దు.

"శ్రీరాముడు లేకుండా నిన్ను ఒంటరిగా విడువుట నా కిష్టంకాదు. వైదేహీ.... జనస్థానములోని ఎందరో రాక్షసులను శ్రీరాముడు సంహరించాడు. ఆ పగతో రాక్షసులు ఏదో మాయ చేస్తున్నారు."

సౌమిత్రి మాటలతో మరింత మండిపడింది సీత.

"లక్ష్మణా! దురుద్దేశంతోనే వంచన మాటలు చెబుతున్నావు. నీవు కులపాంసనుడవు. నా స్వామి కష్టంలో ఉంటే సమయాన్ని వృథా చేస్తూ సంతోషపడుతున్నావు... లేనిపోనివి ఊహించి చెబుతున్నావు.

"లక్ష్మణా! నీలాంటి వారికి పాపబుద్ధులు పుట్టుటలో ఆశ్చర్యంలేదు. దుష్ట ఆలోచనతోనే మాతో అడవికి వచ్చావు. భరతుడైనా కపటంగా పంపి ఉండవచ్చు.

"సౌమిత్రీ! విను. నువ్వు కానీ, భరతుడు కానీ నన్ను పొందలేరు. మీ కపట కోర్కె సిద్ధించదు. మహావీరుడు, ధర్మాత్ముడు నల్లకలువులలాంటి శరీరం, పద్మపత్రాల్లాంటి నేత్రాలు కలిగిన శ్రీరాముడని భర్తగా పొందిన నేను పర పురుషుల్ని కామిస్తానని ఆశపడకు. ప్రాణం వదిలేస్తాను. శ్రీరాముడను వదిలి క్షణమైనా ఈ భూతలంపై బ్రతుకజాలను" నిష్ఠూరాలతో లక్ష్మణుడి ఊపిరి ఆడనియ్యలేదు సీత.

లక్ష్మణుడికి ఒళ్ళు గగురు పొడిచింది. రెండు చేతులతో నమస్కరించాడు.

"ఓ మైథిలీ... వైదేహీ... మీరన్న మాటలకు బదులు చెప్పుట కూడా నాకు ఇష్టంలేదు. కాల్చిన నారాచ బాణములవలే మీ వాక్యాములు నా చెవులని బద్ధలు చేయుచున్నవి. తల్లీ నాకు నీవు దేవతవి. నీ మాటకు ఎదురు చెప్పను. అన్నగారి ఆజ్ఞను మీరలేదు. అదే నా తప్పిదమైనట్టు నిందిస్తున్నావు. వనదేవతలంతా మీ పలుకులు విన్నారు.

*ఉత్తరం నోత్సహే వక్తుం దైవతం భవతీ మమ,*
*వాక్యమప్రతిరూపం తు న చిత్రం స్త్రీ షు మైథిలి*
*స్వబావస్త్వేష నారీణామేవం లోకేషు దృశ్యతే.*

"తల్లీ... స్త్రీ బుద్ధే దుష్టమైంది. ఆడవారి స్వభావమే అంత. లోకంలోని ఆడవాళ్ళు అంతా ఇంతే. వారి బుద్ధి చంచలమైనది. వాళ్ళ హృదయం క్రూరమైంది.

"ఓ విశాలక్షీ! నేను శ్రీరాముని వద్దకు వెళుతున్నాను. ఈ వనదేవతలే నిన్ను కాపాడవలెను. మరల వచ్చి నిన్ను చూడగలనో, లేదో, నాకు తెలియదు... తల్లీ... ఈ అశుభ శకునాలని చూస్తుంటే శ్రీరామునితో కలిసి, ఈ పర్ణశాలకి వచ్చిన పిదప నిన్ను చూడగలనా అని సందేహం కలుగుతోంది."

లక్ష్మణుడితో సీత కన్నీరు కారుస్తూ అంది.

"శ్రీరాముడు రాకపోయినట్లయితే నేను నదిలో దూకుతాను. లేదా ఎత్తైన ప్రదేశం నుంచి క్రిందపడి మరణిస్తాను. లేదా కాలకూట విషాన్ని తీసుకుంటాను. లేదా అగ్ని హోత్రంలో పడి ప్రాణత్యాగం చేసుకుంటాను.

"శ్రీరాముడిని తప్ప కాలితోనైనా పర పురుషుడను తాకను"

దుఃఖంతో సీత విశాల నేత్రాల నుంచి కన్నీరు ధారాపాతంగా ప్రవహిస్తోంది.

*తతస్తు సీతామభివాద్య లక్ష్మణః*
*కృతాఞ్జలిః కించిదభిప్రణమ్య చ*
*అన్వీక్షమాణో బహుశశ్చ మైథిలీమ్*
*జగామ రామస్య సమీప మాన్మవాన్*

దుఃఖాక్రాంతురాలైన సీతను లక్ష్మణుడు ఎన్నో రకాలుగా ఓదార్చి, వైదేహికి అభివాదమూ, అంజలీ ఘటించి వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ శ్రీరాముడు వెళ్ళిన దారిలో వెళ్ళాడు.





## రావణుడు

విశాలనేత్ర సీత అట్లు మాట్లాడినందుకు ఇష్టం లేకపోయినా శ్రీరాముడి వద్దకు బైలుదేరాడు లక్ష్మణుడు. ఆ అవకాశం కోసమే చూస్తున్నాడు దశగ్రీవుడు.

కాషాయవస్త్రం ధరించాడు. జుట్టు తాపసులవలే జటలుగా ఉంది. దండానికి కమండలం తగిలించాడు. పాదాలకు పావుకోళ్ళున్నాయి. సన్యాసి రూపంలో సూర్య, చంద్రులు లేని సందు చూసుకొని, సంధ్యని ఆవరించిన చీకటి వలే రామలక్ష్మణులు లేని సమయం చూసుకొని సీత వద్దకు నడిచాడు.

రావణుడని చూసి పంచవటీ ప్రాంత వృక్షాలన్నీ కదలక మెదలక ఉండిపోయాయి. గాలి ఆగిపోయింది. ఉరుకుల పరుగులతో పరిగెత్తే గోదావరి భయంతో మెల్లమెల్లగా ప్రవహించింది.

చిత్ర నక్షత్రం వద్దకు శని వచ్చినట్టు, శ్రీరాముడి కోసం దిగులుపడుతున్న సీత వద్దకు గడ్డి కప్పిన నుయ్యిలా సన్యాసిగా వచ్చి నిలబడ్డాడు.

మంగళకరమైన సీతను చూశాడు. పున్నమి చంద్రుని వంటి నగుమోము. తామరల వంటి కన్నులు, మల్లె మొగ్గల వంటి పలువరుస, దొండపండులాంటి పెదాలు. పసుపు చీరతో ఉన్న సౌభాగ్యవతిని చూసి రావణుడు మన్మథ పరవశుడయ్యాడు. తన రూపానికి అనుగుణంగా వేదం చదువుతూ వినయం నటిస్తూ ముందుకెళ్ళాడు. సీతాదేవిని నఖశిఖ పర్యంతమూ చూస్తూ అడిగాడు.

"నీవు ఎవరు? బంగారు దేహచ్ఛాయతో, పచ్చని వస్త్రముతో పద్మలతలా ఉన్న నీవెవరు? పద్మాలహారం వేసుకున్న పద్మినిలా ఉన్నావు. భూదేవతవా? కాంతి దేవతవా? విశాలమైన కన్నులు నీవి... నిర్మలంగా ఉన్నాయి. కనుపాపలు నల్లగా ఉన్నాయి.

"తెల్లని దంతములు సమముగా, కొనలు తేరి నున్నగా ఉన్నాయి. విశాలంగా ఉంది నీ జఘనం. ఏనుగు తొండాల్లా ఉన్నాయి నీ తోడలు. నీ స్తనాలు బలిసి ఎత్తుగానూ, చక్కటి గుండ్రంగానూ ఉన్నాయి. కదులుతుంటే తాటి పండ్లవలె ఉన్నాయి. అందమైన చిరునవ్వు, పలువరుస... చక్కటి నేత్రాలు.

"వయ్యారీ... విలాసవతీ, ఓ కాన్తా, నీ కేశపాశములు చక్కగా ఉన్నాయి. నీ సన్నటి నడుము పిడికిటితో కొలవలేనట్టుగా ఉన్నది. స్తనములు దగ్గరిగా ఉన్నవి. నది ఒడ్డును లాగుకున్నట్టు నా మనస్సు లాగుకున్నావు. నీ అంత సుందర రూపం ఈ మహీమండలంలోనే చూడలేదు.

"యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుషులలో గాంచలేదు. లోకమంతటికీ శ్రేష్ఠమైన అపురూప లావణ్యంతో ఉన్న నీలాంటి ఆడదాన్ని నే ఇంతవరకూ చూడలేదు.

"ఇంతటి అద్భుత సౌకుమార్య సౌందర్యంతో ఈ అడవిలో ఉండుట తగదు. దానికి తోడు రాక్షసులకు పట్టు ఉన్న అరణ్యం. కామరూపులైన రాక్షసులు నివశించు ప్రాంతం. నీవు ఇక్కడుండ తగిన దానివి కాదు.

"ఉద్యానవనాల్లోనూ, సుగంధ పరిమళాలు గుభాళిస్తున్న భవనాల్లోనూ ఉండవలసిన దానవు.

"కళ్యాణీ! ఎవరు నీవు... నీవు పెట్టుకున్నందువల్లే ఆ పూల దండలు అంత అద్భుతంగా కానవస్తున్నాయి. నీవు కట్టుకున్నందు వల్లే ఆ చీరకు అంత సింగారమొచ్చింది...

"ఓ చిన్నదానా! నీవు నా కన్నులకు దేవ కన్యలా అగుపిస్తున్నవు... సప్త మహర్షులకు సంబంధించిన దానివా? అష్ట వసువులకు సంబంధించిన దానివా? ఎవరు నీవు మేలుజాతి చామంతీ చెప్పు.

"ఈ అడవిలోని క్రూర జంతువులను చూసి ఎలా భయపడుటలేదు. ఒంటరిగా ఎలా ఉన్నావు" దురాత్ముడైన రావణుడు ఇట్లు పరిపరి విధాలుగా పొగుడుతూ అడిగాడు.

పరమసాధ్వి సీత రావణుడని చూసింది. సన్యాసి వేషంలో ఉన్న రావణుడు పలుకుతున్న సౌమ్య పదజాలంలో అతని అంతర్గత ఉద్దేశ్యాన్ని శ్రీరామ, లక్ష్మణుల గూర్చి ఉన్న ఆలోచనలతో సీత పసిగట్టలేకపోయింది.

అన్యమనస్కంగా కాషాయాంభరదారి చెప్పింది విన్నది. అతిథి మర్యాద ప్రకారం ఆదరించింది. పాద్య జలమిచ్చింది. పీట వేసింది.

చక్కటి పదార్థాలతో భోజనం సిద్ధం చేసింది. అడవిలో దొరికే ఉత్తమ ఫలాలతో ఆతిథ్యం స్వీకరించమని చెప్పింది.

రావణుడు సీతనే చూస్తున్నాడు. గుటకలు మింగుతున్నాడు. తన చావును తెచ్చుకోవటానికి వేగిర పడుతున్నాడు.

సీత మాటి మాటికీ అడవిలోకి చూస్తోంది. ఎక్కడా రామలక్ష్మణుల జాడలేదు.

☆☆☆ ☆☆☆ ☆☆☆





శ్రీరాముడి గూర్చి మధన పడుతూనే సన్యాసి వేషంలో ఉన్న రావణుడి ప్రశ్నలకు సమాధానం చెప్పింది. అతిథికి కోపం వస్తే శాపగ్రస్తురాలవ్వాలని, సీత దొంగ సన్యాసి కోరిక మీద బదులిచ్చింది.

"బ్రాహ్మణోత్తమా! మిథిలా రాజు జనక మహారాజు పుత్రికను. సీత నా నామధేయము. దశరథ మహారాజు పుత్రుడు శ్రీరాముడు నా భర్త. ఇక్ష్వాకుల కోడలిగా పన్నెండు సంవత్సరాలు అయోధ్యలో శ్రీరాముడితో మనుష్యులు ఎన్ని భోగములు అనుభవించగలరో అన్నీ సమస్త దివ్య భోగాలూ అనుభవించాను.

"పదమూడొవ సంవత్సరంలో నా భర్త రాజ్యాభిషేక సమయంలో మా అత్తగారు కైక అడిగిన వరం, భరతుడికి పట్టం కట్టాలనీ, నాభర్త వనవాసం చెయ్యాలనీ కోరింది. సత్యసంధుడు దశరథ మహారాజు మాట మన్నించి దేవతల వయస్సంత గల నా నాథుడు, ఇరవై ఐదు సంవత్సరాల నా భర్త శ్రీరాముడూ, నేనూ, పధ్నాలుగు సంవత్సరాలు అరణ్యావాసం చేయుటకు ఈ దండకారణ్యం వచ్చాం.

"నా భర్త శ్రీరాముడు లోకానికంతటికీ మేలు చేసే వీరుడు. సత్య వంతుడు. గుణవంతుడు మనోవాక్కాయములందు పరిశుద్ధమైనవాడు. గొప్ప బాహువులు కలవాడు. నిజం తప్ప మాట్లాడడు. ఆయనకు ఎల్లప్పుడూ తోడుగా ఉండే లక్ష్మణుడు ఆయన తమ్ముడు. మహా పరాక్రమవంతుడు. అన్న శ్రీరాముడిని అనుసరించి మాతో వనవాసానికి వచ్చాడు."

రావణుడు కన్నార్పకుండా సీతనే చూస్తున్నాడు.

"స్వామీ... నేను చెబుతుంటే మీరు అన్యమనస్కంగా ఉన్నారు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నారు. నా భర్త వచ్చే వేళయ్యింది. వచ్చేటప్పుడు అనేక మధుర ఫలాలనూ, జింకలనూ, ఉడుములనూ కొట్టి తెస్తాడు. మంచి మృగాల మాంసం పట్టుకు వస్తాడు. ఈ లోగా ఆయాసం తీర్చుకోండి.

"స్వామీ! బ్రాహ్మణోత్తమా! మీరెవరు? ఈ అరణ్యంలో తిరుగుతున్న మీ కుల గోత్రము లేమిటి?" అడిగింది సీత.

వైదేహి అలా అడుగగానే మహాబలశాలి, రాక్షస ప్రభువు రావణుడు వికటంగా నవ్వాడు.

"సీతా! దేవతలూ, రాక్షసులూ, నాగులూ, నేనంటే గజ గజ వణికిపోతారు. రాక్షసరాజును. దశగ్రీవుడను. సర్వసుందర రూపం నీది. దోషములు లేనిదానవు. పసుపు బట్ట కట్టుకున్న నిన్ను చూసిన వెంటనే మోహించాను.

"నాకు వెయ్యి మంది భార్యలు. నిన్ను చూశాకే వారంతా నచ్చకుండా పోయారు. నారీమణులకి రాణివి నీవు. లంకా నగరం నీదే... చుట్టూ సముద్రమున్న మహా పట్టణం. అపురూప ఉద్యానవనాలలో విహరించు. కాదంటే ఎత్తుకొని పోవుటకు నేను సిద్ధమే.

"ఓ సీతా! నన్ను కనికరించు. ఐదువేల మంది దాసీజనంతో సుఖంగా లంకలో నాతో ఉండు. నీకు సర్వమంగళమగు గాక" చెప్పాడు.

రావణాసురుడి మాటలతో సీత కోపించింది. నిందించింది. తోక తొక్కిన త్రాచులా మండిపడింది సీత.

"రాక్షస రాజా! తప్పు. సూర్యకిరణాలను తాకవలెననుకుంటున్నావు. నా భర్త శ్రీరాముడు మహావీరుడు. ఆకలిగొన్న సింహం నోటిలో ఉన్నావు... మహాసర్పం కోరలను పెకిలింప తలచావు. ఉత్తమోత్తమ పర్వతమైన మంథరగిరిని ఎత్తుకుపోవాలని భావిస్తున్నావు.

"ఓయీ రాక్షసుడా! శ్రీరాముడి ప్రియమైన భార్యను ఎత్తుకు పోవాలని భావిస్తే సూదులతో కన్నులు తుడుచుకున్నటే. రాముని ప్రియ భార్యని కోరి, మరణమాసన్నమైన వారికి మల్లే బంగారు వృక్షములు చూసి ఉండి ఉంటావు.

"ఓయీ మాయావీ! అడవిలో గుంట నక్కకూ, నీకునూ అట్టే తేడా లేదు. శ్రీరాముడు సహస్రాక్షుడితో సమానం. అతనితో విరోధం అంటే మరణించటమే.

"అగ్నిని మూట గట్టుకు పోవుటకు ప్రయత్నించునది మూఢుడు మాత్రమే లేదా నీ వంటి అల్పఆయుర్దాయమున్నవాడు మాత్రమే అట్టి సాహసానికి పూనుకుంటాడు" సీత ధైర్యంగా చెబుతుందే గాని గాలికి వణికే అరటి చెట్టులా వణుకుతూనే ఉంది.

★★★ ★★★ ★★★

లంకేశ్వరుడు రావణాసురుడికి కోపం వచ్చింది. కనుబొమలు పెద్దవయ్యాయి.

"మైథిలీ... నేను రావణుడను. కుబేరుడి సవతి తల్లి బిడ్డను. దశగ్రీవుడను. మృత్యువుని చూసి ఎలా పరుగు తీస్తారో లోకమంతా నా పేరు వింటేనే హడలిపోయి, పరుగులు పెడతారు. కుబేరుడని ముహూర్తకాలంలో జయించాను.





"సర్వైశ్వర్యాలతో ఉన్న లంకను వదిలి పెట్టి పారిపోయాడు. పిరికి కుబేరుడు పర్వత శ్రేష్ఠమైన కైలాస పర్వతానికి పారిపోయాడు. కుబేరుడు నుంచి సాధించిన పుష్పక విమానం మీద గగనతలంపై నేను విహరిస్తుంటే గాలి భయపడుతుంది. దేవతలూ, దేవేంద్రుడూ నా పేరు చెబుతూనే వినయులై పోతారు.

"సీతా నువ్వు రాచబిడ్డవి. భోగాలు గూర్చి నీకు చెప్పక్కర్లేదు. మానవ భోగాలే అనుభవించావు. నాతో ఉండు. దేవతలు అనుభవించే భోగాలు అనుభవించు. రాజ్య భ్రష్టుడూ, నార బట్టలు ధరించినవాడూ, శోచనీయుడూ, శ్రీరాముడు నిన్ను ఏం సుఖపెడతాడు.

"నాతో ఉండు! రాక్షస రాజును. కాదనకు... మనసు పడి బ్రతిమి లాడుతున్నాను. కాళ్ళ మీద పడ్డ పురూరవుణ్ణి కాలితో తన్నేసి ఆపై పరితాపం చెందిన ఊర్వశిలా నువ్వే బాధపడతావు" ప్రాధేయపడ్డాడు రావణుడు.

సీత కళ్ళలో నిప్పులు కురిశాయి. కన్నులు ఎర్రబడ్డాయి. ఒంటరిగా ఉన్నా పౌరుషంగానే మాట్లాడింది.

"రాక్షసుడా! దేవేంద్రుడి భార్య శచీదేవిని అవమానించినా బ్రతికితే బ్రతికి ఉంటావేమో.

"శ్రీరాముడు భార్యనీ, జనకమహారాజు పుత్రికనీ, నన్ను అవమానించినా, అపహరించినా నీవు బ్రతికుండుట కల్ల. అమృతం సేవించిననూ నీకు మరణం తథ్యం. బంగారానికీ, సీసానికీ ఎంత తేడానో, సుగంధ గంధానికీ, బురదకీ ఎంత తేడానో, ఏనుగుకీ పిల్లికీ ఎంత భేదమో నీకూ, రామునకూ అంత భేదముంది" సీతాదేవి కర్కశంగా చెప్పింది.

## సీతాపహరణం

"సీతా! నీవు చెప్పినది వింటుంటే నీవు అమాయకురాలి వలే తోస్తున్నావు. ఈ భూమిని నేను ఒంటి చేత్తో ఎత్తగలను. సముద్రంలోని నీటిని త్రాగివేయగలను.

"కామరూపుడను. పది కంఠములు కలవాడను. కోరిన కోరికలిచ్చే రాజును" అంటూ నిజరూపం ధరించాడు. మరుక్షణమే మహాకాయుడయ్యాడు.

పరమ పూజ్యంగానూ, పూజనీయమైన సాధు రూపం పోయింది. మండే నిప్పుల్లా కనులు, నీల మేఘదేహచ్ఛాయతో తప్తకాంచన కుండలాలతో,

రక్తాంబరములతో, ధనుర్బాణాలతో ప్రత్యక్షమైన కాలాంతకుడు రావణుడని చూసి సీత భయకంపితురాలైంది.

దుష్టుడైన రావణుడు కామోద్రేకముతో రోహిణిని బుధుడివలె సీతను పట్టుకోవటానికి చేయి చాపాడు.

పద్మపత్రాయతాక్షి వణికిపోయింది. పెద్ద పెద్ద కోరలతో, అంతకు మించిన చేతులతో కొండంత రావణుడిని చూసి సీత భీతిల్లిపోయింది.

వనదేవతలు భయార్తులై పరుగులు తీశారు. పిశాచ ముఖాల కంచర గాడిదలతో, బంగారు చక్రాలతో మహాధ్వనులు చేస్తూ రావణుడి రథం ప్రత్యక్షమైంది.

యశస్వి సీతను కేశపాశాన్ని పట్టుకొనబోయాడు రావణుడు. భయంకరమైన అగ్ని బ్రహ్మాండమైన తేజస్సుతో వెలిగింది. మీద కొచ్చింది.

రావణుడి కళ్ళు మసక పడ్డాయి. మహా ఇల్లాలు సీతను పట్టుకొని తీసుకెళ్ళే ప్రయత్నం మాని... సీతాదేవి నుంచున్న ప్రదేశంలో మట్టి పెళ్ళను పెకిలించి సీతను రథం మీదకు చేర్చాడు.

"శ్రీరామా! శ్రీరామా!" ఆర్తిగా అరిచింది సీత. శాయశక్తులా ప్రయత్నించింది రావణుడి బారి నుంచి తప్పుకొనుటకు. మతి తప్పినట్టు, పిచ్చెక్కినట్టు వెర్రికేకలు పెట్టింది.

రావణాసురుడు వికటాట్టహాసం చేశాడు. దిక్కులు దద్దరిల్లాయి.

"రామా! ధర్మం కోసం అన్నీ వదిలేసిన ధర్మ ప్రభువువి నీవు. అట్టి నీ ధర్మపత్నిని అధర్మంగా ఎత్తుకెళుతున్నాడు.

"కొండగోగుల్లారా! బ్రతిమి లాడుతున్నాను. రావణుడు దుష్ట తంత్రంతో నన్ను ఎత్తుకు పోతున్నాడు. శ్రీరాముడితో చెప్పండి.

"ప్రస్రవణ గిరీ! నీకు పదేపదే మొక్కుతున్నాను. శ్రీరాముడితో విన్నవించు ఈ దారుణాన్ని... హంసలతోనూ, నీటి కొంగలతో ఉన్న గోదావరీ నీకు నమస్కారం. లోకైక వీరుడైన శ్రీరాముడునకు వెనువెంటనే చెప్పు, నన్ను రక్షించమని.

"వనదేవతలారా! అడవి జంతువులారా! పక్షులారా! శ్రీరాముడితో చెప్పండి. రావణుడు నన్ను ఎత్తుకు పోతున్నాడు. రక్షించమని చెప్పండి. మహారాళ్ళు సైతం కరిగేలా ఏడుస్తుంది సీత. చెట్టుకీ, పుట్టకీ, పక్షులకూ సైతం మొరపెట్టుకుంది.





"రావణుడేకాదు, యముడూ, దేవేంద్రుడూ నన్ను బంధించినా, నా భర్త తన పరాక్రమంతో నన్ను తెచ్చుకుంటాడు. దశరథ మహారాజు కోడలిని, జనక మహారాజు కూతురను. శ్రీరాముడి ప్రియ భార్యను, మైథిలీని, సీతను. రక్షించమని నా రామునికి చెప్పండి..." దుఃఖంతో బాధపడుతూ, ఏడుస్తూ అరుస్తోంది సీత.

ఓ చెట్టు మీద జటాయువును చూసిన వైదేహి...

"పూజ్యుడా! ఓ జటాయువా! పాపాత్ముడు, దుష్టుడు... నా భర్త లేని సమయాన పిరికివాడుగా ప్రవేశించి నన్ను దొంగిలించుకుపోతున్నాడు. వీడు మహా బలవంతుడు. ఆయుధాలతో సిద్ధంగా ఉన్నవాడు. క్రూరాతి క్రూరుడు. సాయుధుడు. వీడ్ని ఎదురించ నీకు సాధ్యంకాదు. ఈ రాక్షసుడు ఎత్తుకొని పోతున్నాడని నా భర్త శ్రీరాముడునకూ, లక్ష్మణునకూ చెప్పు..." సీత జటాయువుతో కేకలు పెడుతూ చెప్పింది.

## జటాయువు హితం

చెట్టుపై విశ్రాంతి తీసుకుంటున్న జటాయువు సీత అరుపులూ, ఆర్తనాదాలూ విని తుళ్ళిపడి లేచాడు. రావణుడని చూశాడు. సీత ఏడ్పులు విన్నాడు. ఆ పర్వత శిఖరుడైన జటాయువు దిగ్భ్రాంతి చెందాడు.

తన తీక్షణమైన ముక్కుని కదిలించాడు.

"ఓ దశగ్రీవుడా! నేను జటాయువును. ధర్మం తప్పని వాడను. గెద్దల రాజుని. మహాబలవంతుడను. నిజం పలుకువాడిని...

"రావణా! నీవు చేస్తున్నది ముమ్మాటికీ ఘోరం, నీచం. శ్రీరాముడు దశరథ రాజు పుత్రుడు. పరాక్రమంలో ఇంద్రుడూ, వరుణుడూ కూడా సాటిరారు. సత్యం, ధర్మం అతని వ్రతాలు.

"అట్టి శ్రీరాముడి ధర్మపత్నిని భర్త లేని సమయాన ఆ నితంబినీ సీతాదేవిని తీసుకుపోవటం రాజధర్మం కాదు. మహావీరులూ, మహానుభావులూ, బలవంతులూ ఇతరులు నిందించే కార్యక్రమాలని చేయరు. పరస్త్రీని చెరపట్టడం నీచమని నీకు తెలియదా! రాజు లెవరూ శాస్త్రవిరుద్ధమైన ధర్మమూ, అర్థమూ, కామమూ కోరరు. ఈ మూడింటికీ రాజే ఆధారం.

"పౌలస్త్య నందనా! దేవ లోక నివాసానికి పాపకర్ముడెట్లు అనర్హుడవు తాడో అట్టే రాజ్యమేలుటకు నీవు పనికి రాకుండా పోతావు. నా హిత బోధ

విను. దుష్టులకు హిత బోధ ఎక్కదు. ఎక్కినను కొద్దిసేపే. కాన నా మాట విను. సీతను జనస్థానమున వదులు...

"రాక్షస రాజా రావణా! ఖర, దూషణులను సంహరించినందుకు ప్రతీకార మందువో అదియును నీ పొరపాటే. శూర్పణఖ అనుచితంగా ప్రవర్తించినది. దాన్ని ఖరుడు వెనకేసుకు వచ్చాడు.

"అతని అతిప్రవర్తనే అతను చనిపోయేలా చేసింది. రావణా సత్యం గ్రహించుము. అందు శ్రీరాముడి తప్పేముంది?

"రాక్షసుడా! సీతను వెంటనే వదిలిపెట్టు. ఈ సీతమ్మ అగ్నిగా మారి నీ వంశాన్ని కాల్చివేయగలదు. మహేంద్రుడి వజ్రాయుధానికి వృత్రాసురుడిలా శ్రీరాముడి కోపాగ్నికి భస్మం అవుతావు. కోరలతో నిండి ఉన్న సర్పాన్ని ఎవ్వరైనా తీసుకెళతరా? నీ కంఠానికి యమపాశమే సీత... వలదు. విను.

"ఓ బలవంతుడా! నేను జన్మించి అరవై వేల సంవత్సరాలైంది. వృద్ధుడను. నిరాయుధుడను. నీవు సర్వాయుధాలతో సిద్ధంగా ఉన్నావు. అయినను పోనివ్వను. నా బొందిలో ప్రాణం ఉన్నంత వరకూ ఈ అకార్యాన్ని చేయనీయను.

"కమలపత్రాక్షి, మంగళ రూపిణి సీతమ్మకు రక్షణగా ఈ జటాయువు ఉన్నాడు. తొడిమ నుంచి పండు రాలినట్టు నిన్ను నేల పాలు చేస్తాను. కూలగొడతాను. యుద్ధ రూపంలో నా ఆతిథ్యమును స్వీకరించు" చెప్పాడు జటాయువు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

లంకేశ్వరుడు రావణుడు తన ఇరవై కళ్ళ నుంచి నిప్పులు కక్కాడు. క్రుద్ధుడయ్యాడు. జటాయువు గాలిని చీల్చుకుంటూ వచ్చి రావణుడి మీద పడ్డాడు. రావణుడు విదిలించుకున్నాడు. మళ్ళీ మీద పడి రక్కాడు.

లంకాధిపతి సహించలేకపోయాడు. భయంకరమైన నాళాకారపు ఇనుప బాణాలను వదిలాడు. వాటిని లెక్క చెయ్యకుండా తన కరకు గోళ్ళతో రావణుడి మీద పడి ఒళ్ళాంతా రక్కేశాడు.

రావణుడు మృత్యు దండలాంటి పది బాణాలు వదిలాడు. ఆ బాణాలు నాశిక బాణములు, వికర్ణి బాణములు. అన్నీ జతాయువుపై ప్రయోగించాడు. మహా తీక్షణమైనవి. గురి తప్పనివి.





జటాయువు వాయువేగంతో ప్రయాణించి వాటి నుంచి తప్పించుకొన్నాడు. అంతకు మించిన వేగంతో తిరిగి రావణుడి వద్దకు వచ్చి అతని వింటిపై వాలి చటుక్కున విరగొట్టాడు.

వీరాధి వీరుడు రావణుడి కవచాన్ని రెక్కలతో ఎగర కొట్టాడు. పిశాచ ముఖాల కంచర గాడిదలను కొరికి చంపాడు.

వనదేవతలు జటాయువు పోరాటాన్ని చూసి సంబరపడ్డారు.

"రావణా! ఇకనైనా బుద్ధి మార్చుకో... దాహం అయినవాడు విషము త్రాగుతున్నట్టుగా ఉంది నీ చర్య. రాక్షసులందరి సమూల నాశనం కొరకే ఈ ప్రయత్నం చేయుచున్నావు" చెప్పాడు జటాయువు.

రావణాసురుడునకు పట్టశక్యంగాని కోపం వచ్చింది. ముసలివాడనీ, పక్షి అనీ, సందేహిస్తే తన మీదే ప్రతాపం చూపుతాడా? హుంకరించాడు.

"రావణా! నీవు పిరికి వాడివి. ఎవరూ లేకుండా చూసి సీతను తస్కరిస్తున్నావు.

వీరులెవ్వరూ నిందించే పనులు చేయరు. ఇట్టి పాపకర్మమునకు మరణమే శిక్ష. త్రిమూర్తులు సహితం రక్షించలేరు" జటాయువు హితబోధకి సమాధానంగా తన ఖడ్గంతో జటాయువు రెండు రెక్కలూ, కాళ్ళూ నరికేశాడు.

కొనఊపిరితో నేల కూలాడు జటాయువు. నెత్తురిలో పొర్లాడాడు. ఆపదపాలైన జటాయువుని చూసి సీత కన్నీరు మున్నీరుగా విలపించింది.

☆☆☆ ☆☆☆ ☆☆☆

మృగాలూ, పక్షులూ కకావికలంగా పరుగులు తీశాయి. నేల కూలిన జటాయువుని చూసి వికటాట్టహాసం చేశాడు రావణుడు. దండకారణ్య మహర్షులు సీతాదేవి అవస్థ చూసి దుఃఖించారు.

"రామా! లక్ష్మణా!" సీత ఎలుగెత్తి పిలుస్తోంది.

జనకరాజ పుత్రి... బంగారు ఛ్ఛాయగలది... మంగళకరమైనది.... పసుపు చీర ధరించిన సీతను ఆకాశ మార్గాన తీసుకెళ్తున్నాడు రావణుడు.

సమస్త దేవగణాలు వైదేహి అవస్థకు వేదన పడ్డాయి.

'రామా! లక్ష్మణా!' అంటూ ఆ మహాసాధ్వి భూమి వంక చూస్తూ అరుస్తోంది. సీత కట్టుకున్న పసుపు చీర గాలి గమనానికి ఎగురుతోంది. దూరం నుంచి అగ్నిలో రావణుడు మండుతున్నట్టు కనిపిస్తోంది.

చక్కటి నుదురూ, నల్లటి ముంగురులూ, తెల్లటి పలు వరుస, చక్కటి పెదాలూ గల చందమామలాంటి సీత ముఖం వాడిపోయి ఉంది.

క్రింద అరణ్య జంతువులన్నీ ఆకాశ మార్గాన ప్రయణిస్తున్న నీడ ఆధారంగా కసితో ఏదో ఒకటి చెయ్యాలని పరుగెడుతున్నాయి.

సీత నెత్తి కెళ్ళిపోవటం చూసి సూర్యుడు దిగులు పడి దీనుడైపోయాడు. కళాకాంతీ తగ్గిపోయింది. సమస్త భూతములు విచారించాయి. లేడి పిల్లలు కన్నీళ్ళు కారుస్తూ పైకి చూశాయి. ప్రకృతి మొత్తం కదిలిపోయింది. వాయువు అసహనంగా తల విదిలించాడు. గాలి ఝుం,ఝుం అంటూ వచ్చింది.

సీత ఎడమ కాలి రత్నాల అందె వూడి పోయి క్రిందకు జారింది. చంద్రహారం తెగిపోయింది. ఆకాశం నుంచి భుమికి వచ్చిన గంగలా క్రిందికి జారిపోయింది.

ఆ మహాసాధ్వి ముంగురులు చెదిరిపోయాయి. బొట్టు స్వేదంతో నానుతోంది. జనకరాజ పుత్రి... శ్రీరాముడి భార్య... దశరథ మహారాజు కోడలు.. వైదేహిని రావణుడు భయంకర వికటాట్టహాసం చేస్తూ ఆనందంగా, సంతోషంగా తన మరణం కోసం తీసుకు వెళుతున్నాడు.

## అరణ్యరోదన

“ఓయీ రావణా! నీచుడా! నా భర్త లేని సమయాన తీసుకుపోతున్నావు. ఇట్టి పిరికి పాడుపని చేయుటకు సిగ్గు లేదూ. ఖచ్చితంగా ఆ మాయలేడి నీ కుతంత్రమే.

“పాపం మామగారి మిత్రుడూ, ముసలివాడూ ఆ జటాయువును నేల కూల్చినావు. నీ పరాక్రమం ఇదేనా! దీని గుర్చేనా లోకులు నీ గూర్చి మాట్టాడుకుంటున్నది.

“రెండు ఘడియలు నిలు. రామలక్ష్మణుల ఎదుట నిలు. ముహూర్త కాలం కూడా జీవించి ఉండలేవు. వినాశకాలే విపరీత బుద్ధి. మరణించే వాడికి బ్రతుకు రుచింపదు. వైతరణీనదినీ, కత్తుల చెట్ల గల అడవినీ చూస్తావు. ఇనుప ముండ్లతో ఉండే బూరుగు చెట్లు చూస్తావు.

“రావణా! నా భర్త సర్వాస్త్ర విశారదుడు. తన తీక్షణమైన బాణాలతో నిన్ను వధిస్తాడు” సీతాదేవి కఠినంగా పలికింది. ఆమె ఆవేదన అరణ్యరోదనయ్యింది. రావణుడు లెక్కచెయ్యలేదు.





సీతాదేవి వేదననూ, హిత వాక్యాలనూ పట్టించుకోకుండా సాగుతున్నాడు రావణుడు. తనని రక్షించే నాథుడి కోసం భూమి పైకి చూస్తున్న సీతకు ఓ పర్వత శిఖరంపై ఐదుగురు వానరులు కానవచ్చారు.

తన దుస్థితి వారైనా శ్రీరాముడితో చెబుతారనుకొని, ఆ విశాలక్షి తన బంగారు రంగు ఉత్తరీయంలో తన నగలు మూట కట్టింది. సరిగా వారి ముందు పడేలా వేసింది. రావణాసురుడు త్వరగా లంక చేరే తొందరలో ఉన్నాడు. సీత చర్యని గమనించలేదు.

క్రిందున్న వానరులు పైకి చూశారు.

తేనె కన్నులతో రెప్పలార్పకుండా చూశారు వానరులు.

పంపా సరస్సు దాటి లంకా పట్టణాన్ని సమీపించాడు రావణుడు. తను ఎత్తుకొస్తున్నది భయంకర విషం కక్కే మహాకాల సర్పమని తెలియని రావణుడు మధంతో మాటి మాటికీ సీతను చూస్తున్నాడు.

నూరు యోజనాల మహాసముద్రాన్ని దాటాడు. సముద్రం అల్లాడి పోయింది. కెరటాలు ఆగిపోయాయి. సముద్ర జంతువులన్నీ నీటి అడుక్కి వెళ్ళాయి.

లంక చేరాడు. రాజ ప్రాసాదాలను దాటి తన అంతఃపురం చేరాడు. పరమ భయానక రూపంలో ఉన్న పిశాచ అంతఃపుర రాక్షస స్త్రీలను పిలిచాడు.

“ఆజ్ఞ... ఈ సీతాదేవికి కాపలా మీరంతా. నా అనుజ్ఞలేనిదే స్త్రీ అయినా, పురుషుడైనా ఈమెను చూడరాదు. ఈ సౌందర్యరాశికి నొప్పి కలిగించిన వారికి మరణ దండనే శిక్ష...” చెప్పి రాక్షస రాజు అంతః పురం నుంచి వచ్చేశాడు.

మహావీరులూ, పచ్చి మాంసము పీక్కుతినే ఎనిమిది మంది రాక్షసులను పిలిచాడు.

“రాక్షస వీరులారా! సర్వ ఆయుధాలతో జనస్థానం వెళ్ళండి. ఖరుడుండే జనస్థానం హతస్థానమై ఉంది. రాక్షసులందరూ మరణించడంతో పాడుపడి పోయింది.

“మీరు జనస్థానము చేరి రాముడు ఎప్పుడు, ఏ నిమిషాన ఏం చేస్తున్నది నాకు సమాచారం ఇవ్వవలెను. దానితోపాటు అవకాశాన్ని బట్టి రాముడిని చంపటానికి ప్రయత్నాలు చేస్తుండండి.

“మీ మహా పరాక్రమం నాకు తెలియనిదికాదు. అందులకే మిమ్ము ఈ పనికి ఆజ్ఞాపిస్తున్నాను” చెప్పాడు రావణుడు.

లంకేశ్వరుడు చెప్పిన ప్రియ వాక్యాలకు సంబరపడ్డారు రాక్షసులు. ఏలికకు వంగి వంగి నమస్కరించి వెడలి పోయారు. సీతను తెచ్చినందుకు విజయ గర్వంతో ఉప్పొంగిపోయాడు రావణుడు. అజ్ఞానంతో శ్రీరాముడితో వైరం పెట్టుకున్నానని గ్రహించలేకపోయాడు.

ఎనిమిది మంది రాక్షసులను పంపాక తిరిగి సీత నుంచిన అంతః పురంకి వెళ్ళాడు. రాక్షసాంగనల మధ్య దీనంగా ఉంది సీత. మహాసముద్రంలో మునిగి పోతున్న నౌక వలె అల్లల్లాడుతోంది.

గద్దించి రాక్షస స్త్రీల సాయంతో సీతను తనతో తీసుకెళ్ళాడు రావణుడు. తన హర్మ్యాలనూ, ప్రాసాదాలనూ, వివిధ పక్షులనూ, రత్నాలూ, స్ఫటికాలూ వజ్రవైఢూర్యాలను పొదిగిన భవనాలనూ, అద్భుత రాజ భవన మందిరాలనూ చూపించాడు.

కాలుపడగానే దుంధిబి చప్పుళ్ళు చేసే మెట్లపై నడిపించాడు. వివిధ ఫల వృక్షాలున్న కోనేరులనూ చూపించాడు.

"సీతా! చూడు నా వైభోగం... పది కోట్ల మంది రాక్షసవీరులున్నారు. నా భార్యవైతే ఈ అనంత వైభోగం నీది. నా రాజ దండం నీ చేత ఉంచుతాను. ఈ లంకా పట్టణం వైశాల్యం నూరు యోజనాలు. మహాసముద్రం చుట్టూ ఉంది. దేవతలు మొత్తం మూకుమ్మడిగా కలిసి వచ్చినా, నన్ను దరిచేరలేరు. శ్రీరాముడి గూర్చి ఆలోచన మాను. తాపసుడు శ్రీరాముడు. నన్నేమీ చేయలేడు. వాడి తేజము అల్పము.

"అఖండ తేజస్సుతో వెలిగిపోతున్న ఈ రాక్షస వీరుడని వరించు. నా రాణులందరికీ రాణిని చేస్తాను. సుందర వదనా! నా మాట మన్నించు. లంకకి నిన్ను పట్టం కడతాను. సుఖపడు. ఆనందించు. యవ్వనాన్ని వృధా చేయకు.

"దివ్యమైన వాసన పువ్వుల దండలు వేసుకో. అద్భుతమైన నగలు పెట్టుకో. పుష్పక విమానం మీద విహరిద్దాం. యవ్వనం పడే జలపాతం లాంటిది. వెనక్కి రాదు. ఇక్కడ నాతో సుఖంగా రమింపుము.

"అందమైన పద్మం లాంటి ముఖం గల ఓ సీతా విచారంతో నీ ముఖం వికసించుటలేదు. కన్నీరు మాను."

రావణుడి మాటలకు సీత మరింత విలపిస్తూ చీర కొంగుతో ముఖం కప్పుకుంది. వల వలా ఏడ్చింది.





"ఓ వైదేహీ! నీవు చేయునది ధర్మ లోపము కాదు. చేతకాని భర్తని వదలి మరియొక సమర్థుడని భర్తగా స్వీకరించటము ఆర్ష సమ్మతము. నీ దాసుడను అడుగుతున్నాను. వేడుకుంటున్నాను. కరుణించు. నే ఇంత వరకూ ఏ స్త్రీకీ తలవంచలేదు. ప్రార్థించి అడగలేదు. నీ వశుడైన దాసుడను. నీ పాదములకు నమస్కరించి అడుగుతున్నాను. కామపీడుతుడనై అడుగు తున్నాను" చెప్పాడు రావణుడు.

## జగతికే నాథుడు నా నాథుడు శ్రీరాముడు

దుఃఖంతో క్రుంగిపోతూ, ఓ గడ్డి పరకను తనకీ, రావణుడీ మధ్య పెట్టి చెప్పింది.

"ఓ రాక్షసా! దశరథ మహారాజు ధర్మానికి సేతువు. స్థిర చిత్తుడు. సత్యసంధుడైన సుప్రసిద్ధుడు. అతని పుత్రుడు శ్రీరాముడు.

"నా రాముడు ధర్మాత్ముడు. ముల్లోకాలలోనూ కీర్తింప తగినవాడు. విశాలాక్షుడు. ఆజానుబాహుడు. మహాతేజశ్శాలి. సింహం లాంటి భుజాలు కలవాడు. ఇక్ష్వాకు వంశంలో జన్మించిన ఆ రాముడు శ్రీరాముడు నా రాముడు నాకు భర్త, దైవం.

"అట్టి శ్రీరాముడి తమ్ముడు లక్ష్మణుడు. తమ్ముడితో శ్రీరాముడు వస్తాడు. అతని బంగారు ములుకుల బాణాలతో నీ కంఠాలను కూలుస్తాడు. నీ ప్రాణాలు తీస్తాడు.

"రాక్షస రాజా! శ్రీరాముడి సమక్షంలో నీవీపని చేసినట్లయితే ఖరుడి వలే శాశ్వత నిద్ర పోయేవాడివి.

"రావణా! దేవతలూ, యక్షులూ, కిన్నెరలూ నీకు భయపడితే భయపడవచ్చు.

"నీ ప్రతాపం రాముడి ముందు దేనికీ పనికి రాదు. భయంకర రూపులైన రాక్షసులూ, మహా బలవంతులని విర్రవీగే నీ వీరులనూ, గరుత్మంతుని ముందు సర్పములు ఎట్లో నా రాముని ముందు అట్లే. శ్రీరాముడు చంద్రునిని నేలపై పడగొట్టగలడు. నీ బలమూ, నీ మదమూ, వీర్యమూ నీ ఒంటి నుంచి తోడేస్తాడు.

"దైవబలం శ్రీరాముడిది. మిగిలిన నీ ఆయుర్దాయాన్ని శ్రీరాముడు హరించి వేస్తాడు. యూప స్తంభానికి కట్టిన పశువు జీవించటం దుర్లభం. నీవూ అంతే. శ్రీరాముడు తీక్షణంగా చూస్తే భస్మం అయిపోతావు.

"రావణా! ఈ దేహం కట్టె వంటిది. బంధించాలనుకుంటే బంధించు. భక్షింపదలిస్తే భక్షించు. ఈ దేహంపై, ప్రాణంపై ఎట్టి మమకారం లేదు. నేను ధర్మపత్నిని, నన్ను వశపరుచుకోవలెనని అనుకుంటున్నది జరగదు. అది అశక్యం."

వైదేహి మాటలతో రావణుడి ఒళ్ళు జలదరించింది. క్రుద్ధుడయ్యాడు. మండిపడ్డాడు.

"ఓ సీతా! ఎంతటి సహనం వహించిననూ, వేడుకొన్ననూ, నీవు మారుటలేదు.

"ఆలకించు. సరిగ్గా పన్నెండు మాసాలు. అదే నీకు గడువు. ఈలోగా మనసు మార్చుకొని నను చేరావో సమస్త భోగాలూ అనుభవిస్తావు. లేదా పన్నెండు మాసాలు పూర్తి అయ్యాయా!

"నా వంట వాళ్ళు ఉదయం భోజనం కోసం నిన్ను ముక్కలు ముక్కలుగా నరుకుతారు" భూమిని తంతూ గర్జనతో కూడిన మాటలన్నాడు రావణాసురుడు.

రాక్షసాంగనల వైపు తిరిగాడు. కఠినంగా చెప్పాడు.

"ఈ మైథిలిని అశోకవనం చేర్చండి. ఏమరుపాటు లేకుండా కావలి కాయండి. పోతుటీగ కూడా అశోకవనంలోకి రాకూడదు.

"ఈ ఆడ ఏనుగును మచ్చిక చేయండి. అదిలిస్తూ, బెదిరిస్తూ మంచి మాటలతో వశపరుచుకోండి."

రాక్షస రాజు ఆజ్ఞతో సీతాదేవిని అశోకవనానికి తీసుకెళ్ళారు. సుందరమైన అశోకవనంలో కాల బేధం లేకుండా సకల పుష్పాలూ, ఫలాలూ కాస్తాయి. అద్భుత పక్షులు కూస్తూ పాటలు పాడుతుంటాయి.

అట్టి అశోకవనమున జనకరాజ పుత్రి వైదేహి... మైథిలీ దీనంగా భారంగా ఆ రాక్షస స్త్రీల మధ్య, పెద్ద క్రూర జంతువుల మధ్య లేడిలా ఉంది.

రాక్షస స్త్రీలు వికార చేష్టలతో బెదిరిస్తుంటే మహాసాధ్వి సీత శ్రీరాముడను తలుచుకుంటూ, స్మరిస్తూ ఉంది.

## రామ లక్ష్మణులు

మృగరూపంలోని మారీచుణ్ణి చంపివేసి శ్రీరాముడు ఆత్రుతతో ఆశ్రమం వైపు అడుగులు వేస్తున్నాడు. దగ్గరిలోని నక్క ఒకటి శ్రీరాముడి వెనుకగా వచ్చి వికారంగా అరిచింది.





మారీచుడు రాక్షస మాయతో అరిచిన అరుపు గూర్చి ఆలోచిస్తున్న శ్రీరాముడి అంతరంగం నక్క అశుభ సూచిక అరుపుతో మరింత ఆదుర్దా పడింది. ఏ అమంగళానికి సూచికో అని మరింత వడివడిగా అడుగులు వేశాడు.

జనస్థానం వచ్చేస్తున్న రాముడికి పక్షులూ, జంతువులూ అప్రదక్షిణంగా వచ్చాయి. ఈ దుశ్శకునాలు గమనిస్తూ సీతను గూర్చీ, లక్ష్మణుడను గూర్చీ తలుచుకుంటూ పరుగులాంటి నడకతో ఆశ్రమం వైపు వస్తున్నాడు.

మారీచుడి అరుపు లక్ష్మణుడికీ, సీతకీ కూడా వినిపించి ఉంటుంది. సీత లక్ష్మణుడను తొందర చేసి పంపి ఉంటుంది. రఘుకుల తిలకుడు శ్రీరాముడి ప్రశ్నలకి జవాబుగా దూరంగా లక్ష్మణుడు కళావిహీనంగా కనిపించాడు.

మహా రాక్షసులకు ఉనికి పట్టు అయిన ఈ అరణ్యంలో సీతను ఒంటరిగా వీడి రావటం అకార్యంగా తోచింది రాముడికి. లక్ష్మణుడు దగ్గరికి రాగానే ఎడమ చెయ్యి పట్టుకొని "లక్ష్మణా! ఎంత పని చేశావు. చూశావా ఈ దుశ్శకునాలు... ఇవన్నీ చూస్తుంటే సీతను రాక్షసులు భక్షించేందుకే ఇలా చేశారనిపిస్తోంది. లేదా ఎత్తుకుని పోయి ఉంటారు. నీవన్నదే నిజమైనది. అది మాయా జింక. మారీచుడు.... చాలా దూరం తీసుకు వచ్చాడు. రాక్షసుల పథకం కూడా అదే అయి ఉంటుంది. సీతకు అపకారం చేసేందుకే ఈ మాయా జింకను సృష్టించి ప్రక్కదారి పట్టించారు."

లక్ష్మణుడు తలవంచుకొని వ్యధ చెందాడు.

"సౌమిత్రీ! సకల రాజభోగాలు వదలి జనకరాజపుత్రి సీత నాతో అడవులకి వచ్చింది. భూలోక ఆధిపత్యం కన్నా, ఇంద్రలోక ఆధిపత్యం కన్నా ఆ వైదేహినే నాకు ఎక్కువ. సీత లేకుండా నేను బ్రతకలేను లక్ష్మణా!

"ఖరుడని, అతని మూకను చంపివేయటంతో రాక్షసులు క్రోధంతో ఈ ఘోరానికి పూనుకొని ఉంటారు. వారంతా మాంసాహారులూ, కపటోపాయులూ, వారితో సువృత్త ఎన్ని కష్టాలు పడుతున్నదో..." శ్రీరాముడు పరిపరి విధాలుగా వేదన చెందుతూ నడుస్తున్నాడు.

లక్ష్మణుడు అన్న మాట కాదని వచ్చినందుకు దుఃఖపడుతున్నాడు. "లక్ష్మణా! నీవు కనపడగానే దూరాన నిన్ను చూడగానే నా ఎడమ కన్ను, ఎడమ భుజం అదిరినాయి."

"రామా! నా అంతట నేను స్వయం నిర్ణయం తీసుకోలేదు. 'అయ్యోసీతా! అయ్యో లక్ష్మణా!' అన్న కేకలతో వదినమ్మ... సీతమ్మ... నన్ను తక్షణం పొమ్మని కోరింది.

"శ్రీరాముడను ఎదిరించటం ముల్లోకాలలోనూ ఎవరికీ సాధ్యంకాదని చెప్పినా వినలేదు" గద్గద స్వరంతో చెప్పాడు.

"లక్ష్మణా! సీత క్రుద్ధరాలై, ఆవేశంతోనూ, అసహనంతోనూ అన్నా నీవు రాకుండా ఉండవలిసింది. కనీసం మరుగున ఉండి కనిపెట్టుకుని ఉండాల్సింది. స్త్రీ కోపంలో నిష్ఠూరంగా అనేకం అంటుంది. అవన్నీ సత్యాలు కావని తెలుసు. లక్ష్మణా ఏది ఏమైనా ఏదో అనర్థం జరిగిందని అనిపిస్తోంది" చెప్పాడు శ్రీరాముడు.

శ్రీరాముడూ, లక్ష్మణుడూ అమితవేగంతో ఆశ్రమం వైపు పరుగు తీశారు.

గొంతు తడి ఆరిపోయి మాట రాకపోయినా మార్గ మధ్యంలో మంచి నీరు కూడా తీసుకోకుండా వచ్చారు.

శ్రీరాముడు వివర్ణమైన ముఖంతో ఆశ్రమంలో చూశాడు. నవ్వుతూ ఎదురొచ్చే దేవకన్య సీత కనపడలేదు.

చుట్టూ విహార ప్రదేశాలను చూశాడు శ్రీరాముడు. వైదేహి కానరాలేదు. లక్ష్మణుడు ఆ ప్రక్క, ఈ ప్రక్క చూశాడు. జాడలేదు. ఆశ్రమం ముందు పెద్ద గొయ్యి. శ్రీరాముడి ముఖం కాంతి హీనమైంది. ధనుర్బాణాలు కూడా మోయలేనంత నీరసం ఆవహించింది. 'సీతా!' ఎలుగెత్తి పిలిచాడు.

ఆశ్రమము పాడుపడినట్టుగా ఉంది. కళాకాంతులు లేవు. హేమంత కాలంలో కమలాలు లేని కాసారంలా ఉంది ఆశ్రమం. వన దేవతలు కానరావటం లేదు.

లేళ్ళూ, జింకలూ, పక్షులూ... ఏవీ లేవు. శూన్యంగా ఉంది పర్ణశాల.

సీత ఏది?... నది వద్ద వెతికాడు. చెరువు వద్ద చూశాడు. అక్కడ, ఇక్కడ అని కాకుండా అడవంతా గాలించాడు. "సీతా" దుఃఖ సముద్రంలో మునిగిపోయాడు.

"ఓ కదంబ వృక్షమా! నీ పూలంటే సీతకు ఎంతో ఇష్టం. నువ్వైనా చెప్పు నా సీత ఏది? ఓ బిల్వ వృక్షమా.. చిగురులాంటి అందమైన నా సీత ఏది?

"అర్జున వృక్షమా! బిడియస్థురాలు నా సీత... ఆమె ఏమైందో నీవైనా చెప్పు?





"ఏరు మద్ది చెట్టా! చిగుళ్ళతోనూ, పువ్వులతోనూ నీలా కళకళలాడే నా సీత ఏది?

"ఓ తాళ వృక్షమా! నీకు పండే పళ్ళలాంటివి నా సీత స్తనాలు. నీవూ నా సీతను ఎరుగుదువు, నీవైనా చెప్పు ఏది నా సీత?

"జంబూ వృక్షమా నా వైదేహి దేహం నీ పళ్ళంత నునుపుగా ఉంటుంది. నిస్సంకోచంగా చెప్పు ఏది నా సీత?

"వృక్షములలో శ్రేష్ఠమైన తిలక వృక్షమా. తిలకంపై నా సీతకు ఎక్కువ మక్కువ. నీకు నా సీత గూర్చి తప్పక తెలుసును నీవైనా చెప్పుము."

శోకతప్తుడైన శ్రీరాముడు మామిడి చెట్లనూ, మద్ది చెట్లనూ, పనస, గోరంట, చంద్ర, దాడిమ, మల్లె, గురివింద, మొగలి పొదల చెట్లనూ పేరు పేరునా పిలిచి అడిగాడు. పిచ్చి పట్టినట్టు పలకరిస్తున్నాడు.

లక్ష్మణుడు రాముడని చూసి 'అయ్యో....! నా అన్నని బాధపెట్టనిది, భయపెట్టనిది ముల్లోకలలోనూ లేదనుకున్నానే... అట్టి వ్యధలు నేను చూడవలసి వచ్చినదికదాని' శోకించాడు.

"ఓ లేడీ నీ కళ్ళులాంటివి నా సీత కళ్ళు... నీలా బెదురుగా చూస్తూ ఉంటుంది. నా మైథిలీ నీకు తెలుసు. మీ జింక మందలో ఉందేమో చెప్పు...?

"ఓ గజరాజా నీ తొండము వంటివి నా భార్య తొడలు. ఎక్కడుందో తెలిసే ఉంటుంది. ఏది నా సీత...?

"ఓ పులీ! చంద్రబింబం లాంటి నగుమోము. భయపడకుండా చెప్పు నా సీత ఏది...?

"ఓ సూర్యుడా! భువిపై ఏమి జరిగినా నీకు తెలియకుండా ఉండదు. సత్య అసత్యాలకి నీవే సాక్షివి. నా సీత ఏది? ఓ వాయుదేవా! అన్ని లోకములలో నిండి ఉన్నవాడివి. నీవైనా నా సీత ఎక్కడున్నదో చెప్పు?

శ్రీరాముడు పరిపరి విధాలుగా చెట్టునీ, పుట్టనీ బ్రతిమిలాడుతున్నాడు. దూరంగా మసకగా... మసకగా సీత...

"సీతా... ఆగు పరుగెత్తకు నీ పసుపు చీర నాకు కానవచ్చింది. ఆగు సీతా ఆగు. నా మీద జాలి లేదా, పరిహాసమా... శ్రీరాముడు చేతులు చాపి అన్నాడు. సీత లేదు.. తన భ్రాంతి... వర్ణనాతీతం శ్రీరాముని వ్యధ... నిట్టుర్చాడు రాముడు. మహారణ్యం జల్లెడ పట్టాడు.

  

"లక్ష్మణా! నా సీత కానరావటం లేదు. ఎవ్వరు లేనిచో ముహూర్తకాలం కూడా జీవించలేనో... ఆ సీత నా సీత ఏది? రాక్షసులు ఈ పాటికి తినేసి ఉంటారంటావా?

"నా సీత లేకుండా నేను జీవించలేను... బంగారు రంగు గల సీత లేకుండా నాకీ దేవతాధిపత్యమూ, భూలోక రాజ్యమూ వద్దు. సీతనే తలుచుకుంటూ తండ్రిగారు దశరథమహారాజు చెంత చేరుతాను" శ్రీరాముడు గాలిలోకి చూస్తూ చెప్పాడు. మహాబురదలో కూరుకుపోయిన ఏనుగులా విలవిలలాడాడు.

"అన్నా! రామా! వ్యధ చెందకు.... మహాశూరుడివి... విచారించకు. ఈ మహారణ్యంలో ఎన్నో లతా గృహాలున్నాయి. వెదుకుదాం" చెప్పాడు లక్ష్మణుడు.

రామలక్ష్మణులు అడవులూ, కొండలూ, నదులూ, చెరువులూ, ప్రసవణ పర్వతాలూ, గుహలూ వెదికారు.

సీత జాడ కానరాలేదు.

"రామన్నా! విచారాన్ని దూరంగా ఉంచు. బలిని బంధించి భూమిని వశం చేసుకున్న మహావిష్ణువులా సీతను తీసుకుపోయిన వాడిని ఖండించి ఆమెను తీసుకువస్తావు" ధర్మజ్ఞుడు లక్ష్మణుడు చేతులు జోడించి చెప్పాడు శ్రీరాముడునకు.

"ఓ రామా! మహామహులు జన్మించిన వంశంలో జన్మించాము. దుఃఖాన్ని నీవే సహించలేకపోతే ఎలా! సముద్రాలన్నీ మదిద్దాము. భూమినీ, లోకాలనీ జల్లెడ చేసి గాలిద్దాం.

"ఓ కోసలేంద్రా! రామా! దుఃఖంతో తపించవలదు. విలపించవలదు. ఊరడిల్లుము. సీత జాడ తెలియనినాడు నీ బంగారు ములుకుల బాణాలతో ఈ జగత్తునే నాశనం చేద్దువుగాని...

"పురుషోత్తమా! మహావీరులూ, జ్ఞానులూ స్వబుద్ధితో నడుచుకుంటారు. సాక్షాత్తు బృహస్పతి కూడా నీకు చెప్ప అర్హుడు కాదు. నీవు మహాప్రాజ్ఞుడవు. దేవతలకు సహితం లేని మహాబుద్ధి నీకు మాత్రమే ఉంది.

"ఇక్ష్వాకు వంశంలో పుట్టిన మహావీరుడవు. ఉత్తముడవు. ఉత్తమ శీలమూ, సుందరమైన సౌశీల్యం గల సీతను ఎత్తుకుపోయిన పాపత్ముడను తెలుసుకుందాము."





# జటాయువు

లక్ష్మణుడి స్వాంతన పలుకులను శ్రీరాముడు ఆలకించి, అంగీకరించాడు. "రామా! ఈ దండకారణ్యం ఎంతో మంది రాక్షసులకు జనస్థానం. సీతను ముందుగా ఈ జనస్థాన పర్వతాల్లో, గుహల్లో, కిన్నెర గుహల్లో అన్నీ గాలిద్దాము. తుఫానులొచ్చినా సడలని కొండలవలె నీలాంటి వారు ఎన్ని ఆపదలొచ్చినా చలించరు" చెప్పాడు లక్ష్మణుడు.

రామ లక్ష్మణులు సీతకై బయలుదేరారు. కొంత దూరం ప్రయాణించాక పెద్ద కొండలాంటి శరీరం కనపడింది. మూలుగుతోంది. శరీరమంతా రక్తం. ఆ శరీరం జటాయువుది. రామలక్ష్మణులు జాటాయువును సమీపించారు. దీనమైన స్వరంతో "రామా" అన్నాడు.

శ్రీరాముడికి దుఃఖం వచ్చింది. తన తండ్రి దశరథ మహారాజు మిత్రుడు జటాయువుకి ఏం కష్టం వచ్చింది. అయ్యో నా కన్నీ కష్టాలే... భార్యా వియోగం, తన తండ్రి సన్నిహిత మిత్రుడి అవస్థ... శ్రీరాముడు వేదనాభరితుడైయ్యాడు.

"శ్రీరామా! మహావనంలో ఔషధిని వెదుకుతున్నట్టు వెదకుతున్నావో అట్టి సీతనూ, నా ప్రాణములనూ రావణుడు హరించినాడు. నీవులేని సమయం చూసి దశకంఠుడు రావణుడు మహాసాధ్వి విశాలక్షిని... నీ సీతను ఎత్తుకొని పోయాడు. అడ్డగించిన నాకు ఈ గతి పట్టించాడు" చెప్పాడు జటాయువు.

సీతను రావణుడు ఎత్తుకెళ్ళాడు. శ్రీరాముడు జతాయువు చెప్పింది విన్నాడు.

దుఃఖ పరవశుడయ్యాడు శ్రీరాముడు. నేలపై చతికిల పడ్డాడు. జటాయువును ప్రేమతో నిమిరాడు.

జటాయువు పోయేప్రాణంతో ఉన్నాడు. రామలక్ష్మణుల సంతాపము రెండింతలైంది. ఆ భయంకర అరణ్యంలో ఇరుకు దారిలో ఒంటరిగా పోరాడి నేలకొరిగిన జటాయువును చూసి తమ తండ్రే ఆ స్థితిలో ఉన్నట్టు చలించి పోయారు.

"జటాయువా! పలుకు శక్తి ఉంటే చెప్పు. ఆ రాక్షసుడు నిన్నెలా నేల కూల్చిందీ, సీత జాడ తెలుపు. నా మైథిలీ ఏమైంది. చంద్రబింబం వంటి ఆమె నగుమోములో ఏ భావాలు పలికినవి. ఆ రాక్షసుడి నివాసస్థానం, వాడి శక్తీ చెప్పు."

శ్రీరాముడి ప్రశ్నలకు జటాయువు లేని శక్తి తెచ్చుకొన్నాడు. “శ్రీరామా! నీ కోసం నా ప్రాణాలు నిలుపుకున్నాను. ఆ రాక్షసుడు ఆకాశ మార్గన దక్షిణ దిక్కుగా పోయాడు.

“విందు ముహూర్తంలో రావణుడు సీతను తీసుకెళ్ళాడు. అంతటి రాక్షస వీరునకు ఆ ముహూర్తం గూర్చి ఎరుగనట్టుంది. ఆ ముహూర్త బలం ప్రకారం ఆ సమయంలో పోయిన ధనం, లక్ష్మీ మళ్ళీ యజమానికి పూర్తి భద్రంగా చేరుతుంది.

“జానకిని తీసుకెళ్ళిన రావణుడు గాలము మ్రింగిన చేపవలే మరణిస్తాడు. అది తథ్యం.

“రావణుడు విశ్రవసుడి పుత్రుడు. కుబేరునకి తమ్ముడు. రాఘువా! శ్రీరామా! వట్టి వేళ్ళవంటి బంగారు వృక్షములు కానవస్తున్నాయి. నాకు మరణం తప్పదు” జటాయువు అంత వరకే పలికాడు. ముఖం నుండి మాంసముతో కూడిన రక్తం వచ్చింది. ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి.

“మహారాక్షసులున్న ఈ అరణ్యంలో సాధు జీవి జటాయువు వేల సంవత్సరాలు జీవించాడు. నాకు ఉపకారం చెయ్యబోయి మరణించాడు.

“లక్ష్మణా! మన తండ్రి దశరథ మహారాజు ఎంతో ఈ జటాయువు అంతే. ఈ గెద్దల రాజుకి అంతిమ సంస్కారం చేద్దాము. మాన్యుడు, పూజనీయుడు అయిన జటాయువుకి కర్రలు పేర్చు, అగ్గి పుట్టించు...

“లక్ష్మణా! ఈ పక్షి రాజు, యజ్ఞవంతులు ఏ లోకానికి పోతారో, భూదాతలు ఏ లోకానికి పోతారో... అట్టి ఉత్తమోత్తమ లోకాలకి చేరవలెను. నేనే దహన సంస్కారము చేస్తాను.”

లక్ష్మణుడు పేర్చిన చితిపై నున్న మహాకళేబరాన్ని చూసి దుఃఖితుడయ్యాడు. వేదనాభరిత హృదయంతో చితికి నిప్పు పెట్టాడు. మహావీరుడైన శ్రీరాముడు మహారణ్యంలోకి పోయి రోహి మృగాలను చంపి తీసుకువచ్చాడు.

నేల మీద దర్భలు పరిచాడు. మృగ మాంసాన్ని ముద్దలుగా చేసి పిండ ప్రదానం చేశాడు. స్వర్గానికి పోయే మంత్రాలను శ్రీరాముడు జపించాడు.

గోదావరి నది కెళ్ళి రామలక్ష్మణులు జల తర్పణములను విడిచారు. ఆ పై రామలక్ష్మణులు స్థిమిత పడి మహారణ్యంలో సీతకై పశ్చిమ దిక్కుగా ముందుకు కదిలారు.





# కబంధుడు

జటాయువుకు అంతిమ సంస్కారములయ్యాక, ముందుకు నడిచారు. ఆ దారిన ఎవరూ నడిచిన జాడలు కనిపించలేదు. దక్షణ దిక్కు మరలారు.

పొదలూ, చెట్లూ, మహాక్రూర మృగాలనూ దాటుకుంటూ నడిచారు. అలా మూడు క్రోసులు ముందుకు సాగి క్రౌంచారణ్యం చేరారు. రంగు రంగుల మబ్బుల వలె రకరకాల వృక్షాలు కళకళలాడుతూ కనిపించాయి. వివిధ సర్పాలు యథేచ్ఛగా విహరిస్తున్నాయి. అలాంటి క్రౌంచారణ్యము దాటి మతంగాశ్రమము వైపు పయనించారు.

ఆశ్రమం వైపు పోతున్న రామలక్ష్మణులకు ఓ పెద్ద గుహ కానవచ్చింది. భయంకరమైన మృగాలకీ, సర్పాలకీ, భీకర పక్షులకూ ఆటపట్టైన ఆ అరణ్యమున ఓ చీకటి గుహను చూసి ఆగారు.

పాతాళంలా ఉంది. అంధకారబంధురంగా ఉంది. రామలక్ష్మణులు మరింత లోతుగా చూశారు.

వికృతవదనము, భయంకర ఆకారంతో ఓ రాక్షస స్త్రీ కానవచ్చింది. బ్రహ్మాండమైన నోరుతో ఆవలిస్తోంది. పెద్ద పెద్ద గుడ్లతో మింగేసేలా చూస్తోంది.

దాని తుంబ కడుపు తొడలదాకా వేలాడుతోంది. రామలక్ష్మణులను చూసింది. మృగాల మాంసం తినటం ఆపింది. ఒంటి కంటితో నిప్పులు కురిపిస్తూ ముందుకు అడుగులు వేసింది.

మహా అందగాళ్ళైన రామలక్ష్మణుల వద్దకు వెళ్ళింది. దాని కళ్ళు మెరిశాయి. లక్ష్మణుడిని చూస్తూనే మోహించింది.

“ఓ అందగాడా! నా పేరు అయోముఖి. నా అందం నీ స్వంతం. దక్కించుకో. రమ్ము. ఇద్దరమూ రమిద్దాము” అంటూ లక్ష్మణుడిని ఆశగా చూసింది.

లక్ష్మణుడు కోపంతో కత్తిని దీశాడు. అయోముఖి వికటంగా నవ్వింది.

“ఇంతకీ మీరు ఎవరు? పెద్ద పెద్ద ధనస్సులతో, ఖడ్గాలతో ఈ భయంకర అరణ్యానికి ఎందుకు వచ్చారు.

“మీ ఆయుధాలూ, భుజబలమూ మిమ్ము నా నుంచి కాపాడలేవు. నాకు ఆకలిగా ఉంది. మీరు బ్రతుకుట కల్ల...” కామ ఆశ వదలి, కడుపు ఆకలి కోసం తల ముందుకు వచ్చింది.

పెద్ద పులిలా లక్ష్మణుడు కదిలాడు. చేతనున్న కత్తితో ముక్కు, చెవులూ కోసేశాడు. లబోదిబోమని అరిచింది. పిచ్చెక్కినట్టు గెంతులు వేసింది. ఇక అక్కడుంటే ప్రాణాలు దక్కవని పరుగు తీసింది.

రామలక్ష్మణులు ముందుకు కదిలారు.

మహాబలవంతుడు, తేజోసంపన్నుడైన లక్ష్మణుడు శ్రీరాముడితో చెప్పాడు. "అన్నా! నా ఎడమ భుజం అదురుతోంది. ఏదో ఉపద్రవం ముంచుకు వచ్చేలా శకునాలు కానవస్తున్నాయి. భయంకరావస్థ రాబోతున్నది, అయిననూ మనకు జయమే... అదిగో వంచులక పక్షి పెద్దగా అరుస్తోంది."

అదే సమయంలో మహావృక్షాలు మూకుమ్మడిగా విరిగి పడినట్టు భయంకరమైన శబ్దాలు.

దానితోపాటు విపరీతవేగంతో గాలి. రామలక్ష్మణులు ఆ ధ్వని వచ్చిన వైపు తీక్షణంగా చూస్తున్నారు.

ఓ పొద వద్ద మహాకాయుడు. వాడిది విశాలమైన వక్షస్థలం. పెద్ద కొండంత ఉన్నాడు. దేహమంతా నల్లటి వెంట్రుకలు సూదుల్లా ఉన్నాయి. వాడి రూపానికి తగ్గట్టు ఒకటే కన్ను.

సింహాలనూ, మృగాలనూ, ఏనుగులనూ భక్షిస్తున్నాడు. భయంకరమైన నోరు తెరిచి నాలుక అడించి, తన విశాల బాహువులను కదిలించాడు. భీకరంగా నవ్వాడు.

"నా బాహువులను చూడండి. నేను చాపితే యోజనం దూరం సాగుతాయి. అలా సాగిన బాహువులకి జంతువులూ, పక్షులూ, ఏనుగులూ, ఎన్నో అందుతాయి. నచ్చిన వాటిని తినేస్తాను. నచ్చని వాటిని విసిరేస్తాను..." అంటూ ఆ రాక్షసుడు తన రెండు బాహువులను చాపి రామలక్ష్మణులను పట్టుకున్నాడు. మేఘంలా గర్జించాడు. శ్రీరాముడు తీక్షణంగా చూశాడు.

"ఎవరు మీరు కత్తులూ, ధనస్సులూ ధరించారు. ఈ అడవిలో మీకేంటి పని... మావు వంటి భుజములతో ఉన్నారు. తీక్షణమైన కొమ్ములు గల వృషభముల వలే ఉన్నారు. నాకు ఆకలిగా ఉంది. నరమాంసం భలే రుచి. తినేస్తాను" నాలుక తడుపుకుంటూ చెప్పాడు.

ప్రతాపవంతుడూ, దృఢవిక్రముడూ, సత్య పరాక్రమ వంతుడైన శ్రీరాముడితో లక్ష్మణుడు చెప్పాడు.





"అన్నా! శ్రీరామా! వీడు బాహువులను చూసుకొనే మిడిసిపడుతున్నాడు. వాటితోనే లోకంలోని జీవులను చంపుకుతింటున్నాడు. పైగా తన బాహువులతోనే మనల్ని పట్టుకొని విర్రవీగుతున్నాడు. వాడి బాహువులని నరికి వేస్తాను."

లక్ష్మణుడి మాటలు ఆ రాక్షసుడు విన్నాడు. క్రుద్ధుడయ్యాడు. క్షణమాలస్యం చెయ్యకుండా గుహలాంటి నోరు తెరిచాడు. రామలక్ష్మణులు ఏకకాలంలో కత్తులు తీశారు.

ఆ ఖడ్గాల మెరుపుకి కళ్ళు దిమ్మెక్కిపోయాయి. చేతులు వణికాయి. పట్టు వదిలేశాడు.

శ్రీరాముడు తన ఖడ్గంతో వాడి కుడి భుజాన్ని నరికేశాడు. అదే సమయాన లక్ష్మణుడు ఎడమ భుజం తెగనరికాడు. ఏం జరిగిందో, ఎప్పుడు జరిగిందో కూడా ఆ రాక్షసుడికి తెలియలేదు. తెలిసిన మరుక్షణం భూమి, ఆకాశాలు దద్దరిల్లిపోయేలా అరిచాడు.

వాడి భయంకరమైన అరుపులకి అడవి మారుమ్రోగింది. భూమిలో జల పడినట్టు, వాడి బాహువుల నుంచి రక్తం పొంగు కొచ్చింది.

క్రిందపడ్డ రాక్షసుడి శరీరం వాడి రక్తంతోనే తడిచిపోయింది. వాడి అహం, దర్పము అణగారిపోయింది.

"ఓ మహా వీరులారా! నా ఈ కబంధుడి అహం అణిచారు. ఎవరు మీరు?" దీనంగా అడిగాడు.

శుభలక్ష్మణుడు శ్రీరాముని వంక చూసి చెప్పాడు.

"ఇక్ష్వాకు వంశ రాజు దశరథమహారాజు పుత్రుడు శ్రీరాముడు. దేవేంద్రుడిని మించిన వీరుడు మా అన్న శ్రీరాముడు. నేను అతని తమ్ముడు లక్ష్మణుడను.

"తండ్రిమాటపై వనవాసానికి వచ్చాం. దండకారణ్యంలో నివసిస్తున్నాం. కపటంతో మా వదిన సీతమ్మ తల్లిని ఎవడో రాక్షసుడు రావణుడు, విశ్రవసుడి పుత్రుడు తస్కరించాడు. ఆమె జాడకై అన్వేషిస్తున్నాం."

"నీవు ఎవరవు? చిత్రంగా ఉన్నావు. నోరుంది. కాని అది రొమ్ముల మీదుంది. తల లేదు కాళ్ళులేవు. ఈ విచిత్ర రూపేంటి? నీవు ఎవడవు...?"

లక్ష్మణుడి ప్రశ్నలకి కబంధుడికి లోగడ దేవేంద్రుడు చెప్పిన పలుకులు జ్ఞప్తికి వచ్చాయి. తనకి శాప విమోచన కాలం దగ్గర పడిందని సంతసించాడు.

"పురుషోత్తములారా! నా భాగ్యం పండింది. అపురూపమైన మీ దర్శనం లభించింది.

"ఓ నరశార్దూలములారా! స్వాగతం. నా బాహువులు తెగవేసి నాకు మహోత్తరమైన ఉపకారం చేశారు.

"ఓ వీర పుత్రులారా! నా బుద్ధి వల్ల, నా దౌష్ట్యము వల్లనే నాకు ఈ వికార రూపు వచ్చింది. ఓ శ్రీరామా... దయతో నీవు వినవలెను..." వేడుకున్నాడు.

## కబంధుడి గాథ

"ఓ రామా! ఇప్పుడు నా వికార రూపుతో ఎంత కళావిహీనంగా ఉన్నానో, అందుకు విరుద్ధంగా మహా అందంగా ఉండేవాడిని. సూర్యునిలా వెలిగిపోతూ.. చంద్రునిలా కళాకళలాడుతూ... దేవేంద్రుడిలా వైభవంగా ఉండేవాడిని. ముల్లోకాలలోనూ నేను ప్రసిద్ధుడను. అట్టి నేను, నా బుద్ధి మాంద్యము వల్ల భయంకర వికృతరూపం ధరించి అరణ్యాలలో జపం చేసుకొనే మునీశ్వరులను భయపెడుతూ ఆనందించేవాడిని.

"ఓ నాడు యథా ప్రకారం ఋషులను వేపుకు తినటానికి వికృతరూపం ధరించి, పళ్ళూ, పువ్వులూ కోసుకుంటున్న స్థూలశిరస్కుడనే మహర్షిని భయభ్రాంతుడను చేశాను. అందులకు ఆ మహాతపస్వి మండిపడ్డాడు. సత్యం గ్రహించి తన తపఃశక్తితో శపించాడు.

"ఓరీ దుర్మార్గుడా! అంతా ఏవగించుకునే ఈ రూపమే నీకు శాశ్వతమగుగాక..."

"మునీశ్వరుడి పాదాల మీద పడి వేడుకున్నాను. ఘోర రూప శాపం గూర్చి మదన పడ్డాను. అంత ఆ మహాత్ముడు స్థిమిత పడి... వ్యథ చెందకు. ఇక్ష్వాకు వంశ తిలకుడు శ్రీరామచంద్రుడు జనశూన్యమైన వనానికి వస్తాడు. నీ బాహువులని ఖండిస్తాడు. అప్పుడే నీకు శాప విమోచనం కలిగి నీ సుందర దివ్యమైన రూపం వస్తుంది అని శెలవిచ్చాడు....

"ఓ లక్ష్మణా! శ్రీరాముడు ఇక్ష్వాకు వంశస్థుడని చెప్పావు. నేను శ్రీ పుత్రుడను. దనువును.

"అష్ట భోగాలూ, ఐశ్వర్యాలూ ఉన్నాయి. ఈ ఘోర రూపం ముని ఇచ్చినా, ఈ కబంధు రూపం మాత్రం దేవేంద్రుడిచ్చాడు.





"మహర్షి శాపం పెట్టిన తర్వాత బ్రహ్మదేవుని గూర్చి మహాఘోర తపము చేశాను. నా తపస్సు మెచ్చిన బ్రహ్మ దీర్ఘాయుర్దాయము అనుగ్రహించాడు. దానితో నాకు కన్నూ మిన్నూ కానరాక మిడిసిపడి దేవతల రాజు దేవేంద్రుడితో కయ్యానికి వెళ్ళాను.

"దేవతల రాజు దేవేంద్రుడు తన నూరు అంచుల వజ్రాయుధాన్ని నా మీద ప్రయోగించాడు. ఆ మహా ఆయుధం నా తలనీ, తొడలనీ చీల్చివేసింది.

"జరిగిన నష్టానికి వ్యథ చెంది దేవేంద్రుడని వేడుకున్నాను. నన్ను కడతేర్చమని... దానికి దేవేంద్రుడు బ్రహ్మ వర ప్రభావం వల్ల ఆ పని చేయలేనన్నాడు.

"తలా మొలా లేకుండా ఎలా బ్రతకాలన్నాను. అంత దేవేంద్రుడు యోజన దూరం సాగే బాహువులను, కడుపులో నోరు, గుండెల మీద కన్ను కల్పించాడు. అప్పటి నుంచి చేతులు చాపి అందినవి చంపి తింటున్నాను. రామలక్ష్మణులు వచ్చి నీ బాహువులను ఖండిస్తారు. అప్పుడే నీకు శాప విమోచనం. తిరిగి స్వర్గానికి చేరుతావు అని చెప్పాడు దేవేంద్రుడు.

"ఓ లక్ష్మణా! ఆ ఆశతోనే కనిపించిందల్లా పట్టుకుంటున్నాను. తినేస్తున్నాను. రాముడు తప్పక వస్తాడు. నా చేతికి చిక్కుతాడు. నా రూపం వదిలిస్తాడు. అని ఎదురు చూస్తున్నాను. నా ఆశ నేటికి ఫలించింది.

"ఓ శ్రీరామా! నీకు శుభం కలగాలి. శ్రీరామా! నన్ను దహనం చేయి. నా నిజరూపం నాకు రప్పించు. అప్పుడు మాత్రమే నాకు దివ్యజ్ఞానం కలుగుతుంది. నీకు తప్పక ఉపకార విషయాన్ని చెప్పగలను..."

"ఎవడో రావణుడట. రాక్షసాధముడు నేనూ, నా తమ్ముడూ లేని సమయాన సీతను తీసుకుపోయాడు. వాడెక్కడ ఉంటాడు. వాడి జనస్థానం గానీ, నివాస స్థానం గానీ తెలియచేయి...ఏనుగులు విరిచిన చెట్లు ఎన్నో ఉన్నాయి. వాటితో నీ దహన సంస్కారము చేయిస్తాను"

"శ్రీరామా! సూర్యుని గుర్రాలు ఇప్పటికే చాలా దూరం ప్రయాణించాయి. సూర్యుడు అస్తాద్రికి చేరే లోపే దహనసంస్కారాలు పూర్తి చేయాలి. ఆ తర్వాత నా దివ్య రూపంతో, జ్ఞానంతో చెబుతాను. ప్రస్తుతం నాకు అంత సామర్థ్యము లేదు..."

☆☆☆ ☆☆☆ ☆☆☆

కబంధుడి కోర్కె ప్రకారం... కొండ ప్రక్క కళేబరం ఉంచి దానికి నిప్పు పెట్టారు. చితికి అన్ని వైపులా లక్ష్మణుడు కొరవులు తగిలించాడు.

భగభగమని మండిపోయింది కబంధుని కళేబరం. కబంధుని కళేబరం క్రొవ్వు వల్ల కాలటానికి చాలాసేపు పట్టింది. మహా బలవంతుడి కాయం పూర్తిగా దహనమవ్వగానే మహా వెలుగు. ఆ వెలుగులోంచి దివ్యమైన సమస్తాభరణాలు ధరించిన దివ్య విగ్రహం వచ్చింది.

ఆయన కోసం ఆ ప్రక్కనే దివ్య విమానం...

"ఓ శ్రీరామా! సీతాదేవి దొరికే ఉపాయం చెబుతాను. ఈ లోకమున ఆరు ఉపాయలున్నాయి. వాటితోనే భూమి పుత్రులంతా తమ కార్యాలన్నీ సఫలం చేసుకుంటున్నారు.

"సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైదీభావ, సమాశ్రమాలు."

"ఓ శ్రీరామా! భార్యా వియోగంతో వేదన చెందుతున్నావు. కార్యసిద్ధి కోసం మైత్రికి మహాశ్రేష్టుడు అయిన సుగ్రీవునితో స్నేహం చెయ్యి...

"ఆ వానర పుత్రుడైన సుగ్రీవుడి అన్న వాలి. దేవేంద్రుని పుత్రుడు. మహాబలవంతుడు. ఆ బలమదంతోనే తమ్ముడు సుగ్రీవుడను దేశం నుంచి తరిమేశాడు.

"సుగ్రీవుడు తన ఆంతరంగిక అనుచరులైన నలుగురు వానర వీరులతో కలిసి పంపా సరస్సు ఒడ్డున ఋష్యమూక పర్వతం మీద ఉంటున్నాడు.

"శ్రీరామచంద్రా! వానర వీరుడు సుగ్రీవుడు మహావీరుడు, శూరుడు, తేజశ్శాలి. రాజ్యం కోసం అన్న వాలి సుగ్రీవుడని వెళ్ళగొట్టాడు.

"శ్రీరామా! అతడూ కష్టంలో ఉన్నాడు. అగ్నిహోత్రం సాక్షిగా నేస్తం కట్టు. వానరుడని తక్కువగా చూడకు. పార్వతీ శాపమున్న సరస్సులో దిగి ఋక్షరజుడు ఒక్కరోజు స్త్రీగా మారిపోతాడు. అప్పుడు సూర్యుడూ, ఇంద్రుడూ మోహించుట వల్ల వాలి, సుగ్రీవులు జన్మించారు. మరుసటి రోజు పురుషుడిగా మారి, బ్రహ్మమాట మీద ఇద్దరు పుత్రులను తీసుకొని కిష్కంధ చేరాడు ఋక్షరజుడు.

"శ్రీరామా! ఆలస్యం చేయకుండా జతకట్టు... వానరుల్లో ఉత్తముడైన సుగ్రీవునకూ రాక్షస ప్రదేశాలన్నీ తెలుసు. సమర్థుడు, ప్రగల్భుడు. కాంతి మంతుడు. అపార వానర సేనను కలిగిన వాడు. నీకు హితము చేయువాడు.





స్వేచ్ఛానుసార రూపం ధరించగలవాడు. సూర్యుని కిరణాలు వ్యాపించిన మేరా సుగ్రీవునికి తెలుసు. వానర వీరులతో సమస్తం గాలిస్తాడు.

"నరమాంస భక్షకులైన సమస్త రాక్షస స్థానములు సుగ్రీవునకు తెలుసు. సీతాదేవి ఎచ్చట ఉన్నదో పర్వత దుర్గములూ, గుహలనూ వెదకి నీ భార్య జాడ నీకు తెలియచేస్తాడు.

"శ్రీరామా! వెనువెంటనే సుగ్రీవుడని కలువు. ఆ మహాసాధ్వి, మహా పతివ్రత, మైథిలీ మీ ఎడబాటుకు ఎంత తపించిపోతుందో... శ్రీరామా! సీతాదేవి మేరు పర్వతాగ్రంపై నున్నా, పాతాళ లోకంలో ఉన్నా, వానరుడైన సుగ్రీవుడు జాడ తెలుసుకొనగలడు.

★★★ ★★★ ★★★

ఇక్ష్వాకు వంశ శ్రేష్ఠ శ్రీరామా.... ఇచ్చట నుంచి పశ్చిమ దిక్కుకు వెళ్ళు. నేరేడు చెట్లూ, పనస చెట్లూ, జువ్వి చెట్లూ, మర్రిచెట్లూ, రావి చెట్లూ, కొండ గోగు చెట్లూ, మామిడి చెట్లూ, వెదరు పొదలూ, నాగవృక్షాలూ, బొద్దుగు చెట్లూ, కానుగు చెట్లూ, అశోకాలూ, రక్త చందనం చెట్లూ, పారిజాతం చెట్లూ, దేవదారు వృక్షాలూ పూలతోనూ, పళ్ళతోనూ నిండి ఉంటాయి. మంగళకరమైన మార్గము.

వాటి మధుర ఫలాల కోసం వృక్షాలనూ ఎక్కి లేదా బలం చేత దులిపి వాటిని ఆరగిస్తూ అడవి దాటితే మరో అడవి తగులుతుంది. నందన వనంలా ఉంటుంది. కుబేరుడి ఉద్యానవనంలా ఋతువులతో సంబంధం లేకుండా పూలూ, కాయలూ కాస్తుంటాయి. పెద్ద పెద్ద కొమ్మలతో చెట్లు పళ్ళతో వొంగిపోయి ఉంటాయి.

"శ్రీరామా! ఆ కొండ, ఈ కొండా, అడవినీ చూసుకుంటూ వెళితే పంపా సరస్సు వస్తుంది. సరస్సు ఎంతో సుందరంగా ఉంటుంది. కాళ్ళకు రాళ్ళు గుచ్చుకోవు.

"సన్నటి ఇసుక తీరంలో ఆహ్లాదంగా ఉంటుంది వాతావరణం. ఆ పంపా సరస్సులో సుందరమైన కమలాలు, నీలోత్పలాలు ఎల్లవేళల విరగకాసి ఉంటాయి. నీరుకోళ్ళూ, క్రౌంచ పిట్టలూ, కురచ పిట్టలూ, హంసలూ, వీనుల విందుగా రమ్యంగా పాటలు పాడతాయి.

"శ్రీరామా! తామరాకు దొప్పల్లో పంపాసరస్సు నీరు అమృతంగా ఉంటుంది. శ్రీరామా! అక్కడి హంసలూ, నీటి కోళ్ళూ, క్రౌంచపక్షులూ వేటగాళ్ళ

రాని ప్రదేశం. కాన చంపుట తెలియకపోవుటతో మనుష్యులను చూసి బెదరవు. ఎంతో రుచికరంగా నేతి ముద్దల్లా ఉంటాయి.

"ఇంకా దివ్యమైన పువ్వులతో బొద్దుగు చెట్లూ, కానుగు చెట్లూ, కలువలూ, పద్మాలూ ఎన్నో పూలు ఉంటాయి. శ్రీరామా! అక్కడ ఆ పూవులను అనుభవించే వారులేరు. అవి వాడిపోవు రాలిపోవు...

"శ్రీరామా! ఆ ప్రాంతమున ఒకప్పుడు మతంగముని శిష్యులు ఉండేవారు. గురుసేవ కోసం అనేక పళ్ళూ, పువ్వులూ తెస్తుండేవారు. అలా తెచ్చేటప్పుడు వారి శరీరము నుంచి పడ్డ స్వేద బిందువులు ఆ చెట్లపై పడ్డాయి. పువ్వులయ్యాయి.

"శ్రీరామా! అక్కడే శబరి ఉండేది. మునులందరికీ ఉపచారములు చేసిన పండుముసలి శబరి. తపస్సు చేస్తూ పంపాతీరాన ఇప్పటికీ ఉంది. పంపానది పడమటికి వెళితే ఆమె ఆశ్రమం వస్తుంది. మీ వంటి దేవతుల్యులకి మాత్రమే కానవస్తుంది. శ్రీరామా! ఆమె ఆశ్రమాన్ని దర్శించు... నీ కోసమే ఆ పండు ముసలి ఎదురు చూస్తోంది.

"దాశరథీ! కాకుత్థ్సవంశమున జన్మించిన రామా! పంపా సరస్సు ఎదురుగానే విరగ పూసిన చెట్లతో ఋష్యమూకం ఉంది. చాలా కష్టంతో కూడినది ఆ పర్వత అధిరోహణం. ఏనుగులూ, విషసర్పాలూ అనేకం... లోగడ బ్రహ్మ నిర్మించిన పర్వతం. మహా మాహితాన్వితమైనది.

"ఓ ప్రభూ! శ్రీరామా! ఆ ఋష్యమూక పర్వతంపై నిద్రిస్తున్న వారికి ధనం దొరికినట్టు కలవస్తే, అది వెనువెంటనే వాస్తవ రూపం ధరిస్తుంది. దుర్మార్గులూ, పాపాలు చేసేవారూ ఆ కొండ మీదకు వెళ్ళలేరు. ఒకవేళ వెళ్ళినా రాక్షసులు అతన్ని తిరిగి వెనక్కి పంపరు.

"శ్రీరామా! మతంగారణ్యంలోని ఏనుగులు పంపా సరస్సులో జలక్రీడలాడుతూ చేసే ఘీంకారాలు ఋష్యమూక పర్వతం పైకి వినపడు తుంటాయి. పెద్ద పులులూ, ఎలుగుబంట్లూ, నల్ల చారల దుప్పులూ స్వేచ్ఛగా తిరుగుతుంటాయి.

"శ్రీరామా! ఆ పర్వతములో పెద్దరాయి పెట్టిన గుహ ఒకటి ఉంటుంది. ఆ గుహలోకి పోవుట అతి కష్టం. దాని ఎదురుగుండా సరస్సు ఉంది. అందులోని నీరు ఎంతో నిర్మలంగా ఉంటాయి. సరస్సు చుట్టూ అనేక ఫల వృక్షాలుంటాయి. అనేక రకాల క్రూర మృగాలుంటాయక్కడ...





"శ్రీరామా! అక్కడే సుగ్రీవుడు నలుగురు వానర వీరులతో ఉంటున్నాడు. శ్రీరామా! మీ కార్యం సిద్ధిస్తుంది. అంతా శుభమే జరుగుతుంది" చెప్పి సూర్యుడిలా వెలిగిపోతున్న విమానంలో కదలి వెళ్ళిపోయాడు కబంధుడు.

## శబరి

కబంధుడు ఆకాశ మార్గాన వెళ్ళిపోయాక పశ్చిమ దిశగా పంపా సరస్సుకి బైలుదేరారు. కబంధుడు చెప్పినట్టు మధుర ఫల వృక్షాలనూ, పూల చెట్లనూ చూసుకుంటూ నడిచారు.

"తేనెలూరించే మధుర పళ్ళని తీసుకొని దారిలో ఓ కొండ మీద ఆ రాత్రి శయనించారు. ఉదయాన్నే బయలు దేరి పంపా సరోవరం పశ్చిమ తీరం చేరారు. శబరి ఆశ్రమం కనిపించింది. ఎంతో రమ్యంగా ఉంది. మహోన్నతమైన వృక్షాలతో పండ్ల చెట్లతో, పూలచెట్లతో ఎంతో రమణీయంగా ఉంది.

శ్రీరాముడు పరిసరాల రమ్యతను చూస్తూ ఆశ్రమం వైపు నడుస్తున్నాడు. లక్ష్మణుడు అనుసరిస్తున్నాడు. దూరంనుంచే శబరి శ్రీరాముడిని చూసింది.

శ్రీరాముడని తెలియగానే పులకించిపోయింది సిద్ధురాలైన శబరి. ధీమంతులైన రామలక్ష్మణులను చూసి రెండు చేతులను జోడించి ఆ మహోన్నత మూర్తికి నమస్కరించింది.

నా రాముడు శ్రీరాముడు వస్తున్నాడు. నా పురుషోత్తముడు శ్రీరాముడు నా కోసం వస్తున్నాడు.

సిద్ధురాలు శబరి రామలక్ష్మణులను ఆహ్వానించింది. పరమానందంతో పాద్యము, అర్ఘ్యము, ఇచ్చింది. శ్రీరాముడిని భక్తిగా చూస్తుండిపోయింది. శ్రీరాముడన్నాడు...

"శబరీ! ఓ చారు భాషిణీ... తపస్సే నీ ధనం. నీ తపస్సు సిద్ధించిందా!"

"రామా! నీ దర్శనమైంది. ఇప్పుడు నా తపస్సు సిద్ధించింది. దేవ దేవుడవినీవు.

"ఈ వేళ నా జన్మ ధన్యమైంది. పవిత్రురాలనయ్యాను. నీ దర్శనంతోనే పుణ్యలోకాలు సాధించాను.

"శ్రీరామా! చిత్రకూటంలో ఉన్నప్పుడు నా గురువులు దివ్యరథాలపై స్వర్గానికి పోతూ నీ గూర్చి చెప్పిన నాటి నుంచి నీ కోసం ఎదురుచూస్తున్నాను.

"రఘునందనా! నీ కోసం అనేక ఫలాలను సంపాదించి పెట్టాను" అంటూ అందించింది. శ్రీరామలక్ష్మణులు మధుర ఫలాలను ఆరగిస్తుంటే తృప్తిగా చూసింది.

శ్రీరాముడికి ఆశ్రమ విశేషాలను చూపించింది. మహావనము విశేషాన్ని చెప్పింది.

"ఓ రామా! మహావృక్షాలూ, అనేక మృగ పక్షులూ, పూలూ, కాయల చెట్లూ ఉన్న ఈ ప్రాంతం మతంగవనముగా ప్రసిద్ధి పొందింది. రామా! ఇదిగో ఇక్కడే మా గురుదేవులు ఋత్విజులతో యజ్ఞాలు చేశారు.

"ఇదే శ్రీరామా యజ్ఞవాటిక. ఉపవాస శ్రమచేత, ముసలితనం చేత స్వయంగా వెళ్ళలేక సప్త సాగరాలను తెప్పించారు. అదిగో శ్రీరామా సప్త సాగర సరస్సు. అందులోనే స్నానం చేసేవారు.

"అదిగో మా గురువర్యులు ఆరవేసుకున్న వల్కలాలు. ఇంకా తడిగానే కనిపిస్తున్నాయి. దైవ పూజ కోసం వారు కట్టిన పూదండలు. చూడు రామా! ఇంకా వాడిపోలేదు" శబరి ఆనందంగా చెబుతున్న విషయాలను శ్రీరాముడు చిరునవ్వుతో శ్రద్ధగా విన్నాడు.

"రామా! మబ్బుగుట్టల్లా ఉన్న మతంగ వనమంతా చూపినాను. నీ అనుమతితో ఈ శిథిల దేహాన్ని త్యజిస్తాను. పరమాత్మ వద్దకు వెడతాను. దివ్యలోకాలకి వెడిలిపోతాను శ్రీరామా!"

శ్రీరాముడు చిరునవ్వుతో తలవూపాడు.

జడలు కట్టుకొని పోయి, వల్కలాలు ధరించిన శబరి శ్రీరామునకు నమస్కరించి అగ్ని ప్రవేశం చేసింది.

దివ్యాభరణాలతో, బ్రహ్మాండమైన తేజస్సుతో, దివ్యములైన వస్త్రములు ధరించి మెరుస్తున్న మెరుపువలే శబరి వెలిగిపోతూ మహర్షులు నివశించే దివ్యలోకాల దిశగా వెళ్ళిపోయింది.

☆☆☆ ☆☆☆ ☆☆☆

శబరి ఆకాశమార్గాన దివ్యకాంతులతో విరాజిల్లుతూ వెళ్ళిపోయాక సప్తసాగర తీర్థములో స్నానం చేసి పితృతర్పణాలు వదిలిపెట్టారు.

రామలక్ష్మణులకు మనసు తేలిక పడింది. ఋష్యమూక పర్వతంపై నివశిస్తున్న సుగ్రీవుడిని కలవటానికి రామలక్ష్మణులు బైలుదేరారు.





రమణీయమైనదీ, చల్లని నీటితో నిండినదీ, మంగళప్రదమూ, తిలక, అశోక, పున్నాగ, వకుళ, ఉద్దాల వృక్షములతో విలసిల్లే పంపా సరస్సు చేరారు.

ఎర్రతామర పూలతో, తెల్లకలువ పూలతో పంపా సరస్సు చిత్రకంబళము వలె కానవచ్చింది. సరస్సులోని నీరు చూస్తూనే త్రాగాలనిపించేలా ఉన్నాయి. పుప్పొడి వాసన కమ్మగా తగులుతోంది.

మతంగసరస్సులో రామలక్ష్మణులు స్నానం చేశారు. అనేక ఫలవృక్షాలతో, మామిడి తోపులతో, పద్మాలూ, నల్ల కలువలతో, సౌగంధికాలతో, అనేక పక్షుల కేకలతో సమస్త సింగారాలు చేసుకున్న కన్నె పిల్లలా ఉందా ప్రాంతం.

బొద్దుగు చెట్లూ, దానిమ్మ చెట్లూ, ఏరుమద్ది చెట్లూ, పొన చెట్లూ, గన్నేరు చెట్లూ, మర్రి చెట్లూ, మాలతీ లతలూ, అశోకాలూ, సంపంగి చెట్లూ కళకళలాడుతూ కనిపించాయి.

స్ఫటికంలా స్వచ్ఛమైన పంపానీటిని చూస్తూ నెమళ్లూ, కొక్కెరలూ, చిలకల కూతలూ, బెగ్గురు పక్షుల కూతలూ వింటూ శ్రీరాముడు మైమరిచిపోయాడు. ప్రియనేస్తం... సతి... సీత మీదకు మనసు పోయింది శ్రీరామునకు. ఎంతో వేదనకు గురి అయ్యాడు.

"లక్ష్మణా! ఈ సరోవర తీరాన్నే ధాతువులతో ధగధగలాడుతూ, అనేక ఫలపుష్ప వృక్షాలతో కళకళలాడే ఋష్యమూక పర్వతం కనిపిస్తుందని, దాని మీద సుగ్రీవుడు ఉన్నాడని కబంధుడు చెప్పాడు" చెప్పి పంపా సరస్సు వద్దకు నడిచాడు.

"లక్ష్మణా! సుగ్రీవుడి దగ్గరికి వెళ్ళు. సీత లేకుండా బ్రతికే బ్రతుకు భారంగా దీనంగా ఉంది. ఋక్షరజుడి పుత్రుడు సుగ్రీవుడు ఋష్యమూక పర్వతంపైనున్నాడు. నీవే సుగ్రీవుడి దగ్గరికి వెళ్ళిరా!" అంటూ శ్రీరాముడు లక్ష్మణుడితో దుఃఖముతో చెప్పాడు.

*శ్రీమద్రామాయణములోని అరణ్యకాండము సమాప్తము*

# కిష్కింధాకాండము





## వసంత ఋతువు

పంపా సరస్సులోని కమలాలనూ, నల్లకలువులనూ, చిట్టి చిట్టి చేపలనూ శ్రీరాముడు చూశాడు. ఆ సుందర పువ్వులలో సీత కానవచ్చింది. శ్రీరాముడు వేదనకు గురయ్యాడు. మౌనంగా విలపించాడు.

"లక్ష్మణా! పంపాతీరం నిర్మలంగా ఉంది. రకరకాల పూలతో, వృక్షాలతో, శిఖరాల కొండలతో శోభాయమానంగా ఉంది. అయోధ్య వెలుపల వ్రత నిష్ఠలతో ఉన్న భరతుడనీ, సీతనూ తలుచుకున్న కొద్దీ దుఃఖముతో తపించిపోతున్నాను. వివిధ వృక్షజాతులూ, మృగాలూ ఇక్కడ హాయిగా ఉన్నాయి. పచ్చిక బయళ్ళు రంగురంగుల పూలతో సింగారించుకున్నట్టుగా ఉన్నాయి. జలము వైదూర్యమణి వలే ఎంతో నిర్మలంగా శోభిస్తోంది. ఆహా ఎంత రమణీయంగా ఉందీ ప్రాంతం. ఇట్టి ప్రాంతము చూసిన సీత ఎంత సంతోషపడేదో కదా!

"లక్ష్మణా! పూల చెట్లు చూడు. పుష్టిగా పూలు పూసిన లతలు మహా వృక్షాలను ఎలా పెనవేసుకుపోయినవో... ఎడబాటు భరించి ఒక్కటైన భార్యాభర్తల్లా ఉన్నాయి కదూ!

"లక్ష్మణా! ఇది వసంతకాలం... వృక్షాల కదలికలు చూడు నాట్యం చేస్తున్నట్టు ఉన్నాయి. కొండ గోగు చెట్టు చూడు సకలాభరణాలు ధరించిన యుద్ధ వీరుడిలా ఉంది.

"ఆహా! ఎంత రమ్యం... సీత ఉంటే... అదిగో ఆ పక్షుల కిలకిలా రావాలకి ఎంత ఉప్పొంగిపోయేదో.... ఆ కుందేలు పిల్లలు చూడు ఎలా గెంతు తున్నాయో... సీత ఉంటే వాటి వెనుక పరిగెత్తి పట్టుకొని అల్లరి చేసేది....

"లక్ష్మణా! అడవంతా తేనె వాసన వస్తోంది. లేళ్ళతోనూ, పక్షులతోనూ నిండి ఉంది. రాలిపోతున్న పువ్వులూ, రాలబోతున్న పువ్వులూ, రాలిపోయిన పువ్వులూ.... రకరకాల రంగులతో ఉన్న పూలపై తుమ్మెదలు పోటీపడి పూలతో ద్వంద్వయుద్ధం చేస్తున్నట్టుగా ఉంది. ఆ లతాపూల చెట్లు చూడు బంగారు నగలు పెట్టుకొని పసుపు పట్టు చీర ధరించిన ముత్తైదువుల్లా ఉన్నాయి.

"లక్ష్మణా! మదించిన కోకిల ధ్వనులతో కలిసిన గాలి... హాయిగానూ ఇంత చల్లని ప్రదేశంలో కూడా సీతాదేవి గుర్తొచ్చి వెచ్చగా తగులుతోంది.

"ఆహా! మృధుబాషిణి, సుకేశి సీత... వైదేహి నా ప్రక్కన లేదు. నా దుఃఖం పొంగిపొర్లుతూ ఉంది. నా అవస్థ చూసి కోకిలలూ, పూల చెట్లూ నవ్వుతున్నట్టు ఉంది. అదిగో సెలయేటిలో ఆడే నీటికోడి కూడా నా వంక జాలిగా చూస్తోంది.

"లక్ష్మణా! అనేకరకాలైన పిట్టలు జంటలు జంటలుగా ఉన్నాయి. ఒకటితో ఒకటి ఊసులాడుకుంటున్నాయి. పొదల్లోనూ, లతల మీద ఆటాడు కుంటున్నాయి.

"అందమైన అడవంటే సీతకెంతో ఇష్టం. వసంతం అగ్నిహోత్రంలా నన్ను దహించివేస్తోంది. సన్నని కనురెప్పలు, అందమైన జుత్తు, మృదు మధురమైన పలుకుల సీత... ఆమె లేకుండా ఈ ప్రాణం దేనికి?

"ఆ నెమలి చూడు ఎంత ఆనందంగా నాట్యం చేస్తోందో... ఆడుతున్న ఆడనెమలిని చూసి, మగ నెమలి తనూ జతకడుతోంది. సీత నా ప్రక్క నుండుంటే ఈ వసంతంలో విరగపూసిన పూలతో అలంకరించుకునేది.

"ఆ అశోకం చూడు నాలాంటి వాడ్ని బాధ పెట్టడమే దాని ఉద్దేశ్యమయినట్టు పూలతో ఉన్న చెట్ల మీదకు వంగి, మళ్ళీ యథాస్థానంలోకి పోతోంది.

"ఆ మామిడి చెట్లు చూడు విలాసంగా వసంతాన్ని చూసి విర్రవీగి పోతున్నాయి. కారండవ పక్షి నీటిలో మునుగుతూ తన ప్రియురాలితో ఎలా క్రీడిస్తున్నదో.....





"పంపానది ఒడ్డంతా జాజులూ, మల్లెలూ, గన్నేరులూ, అడవి మొల్లలూ, కానుగులూ, ఇప్పలూ, పొగడలూ, సంపెంగలూ, పారిజాతాలూ, ఎర్ర కాంచన చెట్లూ, గేదంగులూ, గోరింటలూ, చందన చెట్లూ, అన్నీ పూత పట్టి సింగారించుకున్నట్టు ఉన్నాయి.

"అందమైన లతలు అంతకు మించి అందమైన పూలని పూసి, అంతకంటే బలమైన అందమైన వృక్షాలను ఎలా పెనవేసుకు పోయాయో.... గాలి కదలికలకు చెట్లు ఊగుతుంటే పరమసాధ్వీమణులు, మహా పతివ్రతలు భర్తనే అనుసరించినట్టు ఆ లతలు కూడా అనుగుణంగా కదులుతున్నాయి. అదుగో కిన్నెరలు సుందర వనపంక్తులలో ప్రియురాళ్ళతో ఎలా సంచరిస్తున్నారో.....

"చెట్టు చెట్టుకీ, లత లతకీ పోటీ అన్నట్లు పూలూ, కాయలూ ఒకదాని కొకటి పోటీ పడి కాసినట్టు ఆకుల కంటే కాయలూ, పూలే ఎక్కువగా కనిపిస్తున్నాయి. వాయుదేవుడు అన్ని వైపులా రాలుతున్న పువ్వులతోనూ, చెట్లుకి భారంగా విరగ పూసిన పూలతోనూ ఆడుకున్నట్టు అగుపిస్తోంది కదూ!

"ఆ నీటి కోడి చూడు భార్యతో కలిసి జలక్రీడలాడుతోంది. లక్ష్మణా! సృష్టిలో స్త్రీ వెంటే మగవాడు పడతాడు. ఈ వసంత ఋతువు ప్రభావం చూడు సృష్టి ఆనవాయితిని తప్పించి ఆ ఆడ నెమలి మగ నెమలి వెంట ఎలా పడుతోందో. ఆనందముతో కూయు కోకిల నన్ను పిలుచుచున్నట్టు ఉంది.

"లక్ష్మణా! ఆ కాకిని చూడు సీతతో నేను ఆనందంగా ఉన్నప్పుడు అతిశయంగా కూసిన కాకి ఇప్పుడు ఆనందంగా "కా కా" అని అరుస్తోంది. సీతా వియోగాన్ని చెబుతున్నట్టుగా ఉంది. ఇప్పుడు కాకే నన్ను వైదేహి వద్దకు తీసుకువెళుతుందేమో...

"లక్ష్మణా! చల్లని నీళ్ళతో, పద్మాలతో, చక్రవాకాలతో, నీటి కోళ్ళతో, క్రౌంచ పక్షులతో పంపా తీరమెంత సుందరంగా ఉందో... మంచి యవ్వనంలో ఉన్న సీత పదే పదే గుర్తుకు వస్తోంది.

"పద్మముల వంటి ఆమె కనులు, చందమామ లాంటి నగుమోము గల సీత ఆ రాక్షసుల మధ్య ఎలా వేగుతున్నదో కదా! నా ఎడబాటు భరించలేక ఆమె ఆత్మత్యాగం చేసుకోలేదు కదా!

"లక్ష్మణా! అయోధ్య చేరిన నన్ను నా కోడలేది అంటే నా తల్లికేం సమాధానం చెప్పగలను. సీత తన అనురాగమంతా నా మీదే ఉంచింది. నా

అనురాగాన్ని ఆమె మీద ఉంచాను. అందువల్ల ఆమె నన్ను విడిచి ఉండలేదు. ఈ వసంతము నన్ను అగ్నిలా కాలుస్తోంది."

శ్రీమంతుడైన శ్రీరాముడు విలపిస్తుండటంతో యుక్తము, దోష రహితమైన పలుకులతో చెప్పాడు లక్ష్మణుడు.

"అన్నా! శ్రీరామా! స్వాంతన చెందు. నీవు పురుషోత్తముడవు. ధైర్యం తెచ్చుకో అంతా శుభమే అవుతుంది. కష్టాల్లో బుద్ధి మాంద్యము ఎట్టి వారికైనా తప్పదు. అతి ప్రేమే అనాలోచనలను చేయిస్తోంది. వియోగంలో విచారం సహజం.

"అన్నా! ఆ రావణుడు పాతాళంలో దాక్కున్నా వాడి మరణం తప్పదు. మా వదిన సీతమ్మ నీ కోసమే ఎదురు చూస్తుంటుంది. తన చెర విడిపిచ్చే నాథుడివైన నిన్నే తలచుకుంటూ ఉండి ఉంటుంది. ఇది వసంత మంత సత్యమని నా మనసు చెబుతోంది. ఆ రాక్షసుడి ఉనికి తెలిసిన మరుక్షణం లక్షలాది బాణాలు అతడినీ, అతని పరివారాన్నీ చుట్టుముడతాయి.

"రామన్నా! నీకు తెలియనది కాదు. ధైర్యముంటేనే అన్నీ కార్యాలు సత్ఫలితాలిస్తాయి. ప్రయత్నిస్తే భువిలో కానిదేముంది. ధైర్యమే బలం... ఉత్సాహం...

"మహాశక్తి గల శ్రీరామా! ఉత్సాహాన్ని ఆశ్రయించు. నీ బాధ నేను పరిపూర్ణంగా అర్థం చేసుకోగలుగుతున్నాను. అతి త్వరలోనే సీతను చూస్తావు. మళ్ళీ అయోధ్య వెళతాం. ఇది సత్యం" సోదర ధర్మంతో రాజనీతి చెపుతూ అప్రమత్తుడిగా శ్రీరాముడిని ఓదార్చాడు లక్ష్మణుడు.

లక్ష్మణుడి మాటలతో శ్రీరాముడు కుదుట పడ్డాడు. గాలికి ఊగుతున్న చెట్లప్రక్కన పంపాతీరంలో లక్ష్మణుడితో నడుస్తున్నాడు శ్రీరాముడు. మహావృక్షాలకు పెనవేసుకుపోయిన లతలు తాము పెనవేసుకుపోయిన మహావృక్షం క్రిందకు రామలక్ష్మణులు రాగానే పూలన్నీ జారవిడుస్తున్నాయి.

రామలక్ష్మణులు సెలయేళ్ళు, కొండ గుహలు దాటారు. ఆ ఇద్దరినీ ఋష్యమూక పర్వతంపై నుంచి చూసిన సుగ్రీవుడు భయపడ్డాడు. ధనుస్సు ధరించి ఠీవిగా నడుస్తున్న సింహాలని గుర్తుకు తెస్తున్నారు రామలక్ష్మణులు.

సుగ్రీవుడి నలుగురు మంత్రులు చూసి వారిని వాలి పంపిన శత్రువులుగా తలచారు. బలశాలియైన సుగ్రీవుడు భ్రాంతితో నిశ్చేష్టుడయ్యాడు. భయ భారము చేత కృంగిపోయాడు.





# సుగ్రీవుని భయం

మహాశ్రేష్ఠమైన ఆయుధాలు ధరించిన రామలక్ష్మణులను తన నలుగురు మంత్రులకీ చూపించాడు సుగ్రీవుడు.

రాజ్యాన్ని అపహరించి పర్వత పాలు చేసినా వాలి రక్తదాహం తీర లేదన్నమాట. అన్ని దిక్కులూ చూశాడు సుగ్రీవుడు. ఎటు పోవాలో అర్థం కాలేదు.

"వారిని ఖచ్చితంగా వాలే పంపి ఉంటాడు. నార బట్టలు ధరించారు. కపటి వేషధారులై ధనస్సులు ధరించి వస్తున్నారు. మనం జాగురూకతతో ఉండుట అవశ్యం" చెప్పాడు సుగ్రీవుడు.

ఆ వానరులంతా బైలుదేరి పర్వత శిఖరం మీదకు పోయారు. ఆ శిఖరం మీద నుంచి ప్రక్క కొండ మీదకు ఆ కొండ మీద నుంచి ప్రక్క శిఖరం మీదకు దూకుతూ వెళ్ళారు. వారి వేగానికి దూకుడికి అనేక చెట్లు విరిగిపోయాయి.

వారిని చూసి అనేక మృగాలు భయంతో పరుగులు తీశాయి. వానర వీరులు నలుగురూ సుగ్రీవుడి వద్దకు వచ్చారు. వారితో చెప్పాడు సుగ్రీవుడు.

"వానర వీరులారా! భయం వద్దు. ఈ ఋష్యమూక పర్వతంపైకి వాలి రాలేడు. ఆ పాపి, ఆ క్రూరుడు వాలి ఇక్కడకు రాలేడు. వాలి వల్లే మనం ఇలా పరిగెత్తవలసి వచ్చింది".

"అవును సుగ్రీవా... మన కోతి బుద్ధితో చపల చిత్తులమయ్యాం. బుద్ధి బలం మరిచాం."

సుగ్రీవుడు హనుమంతునితో చెప్పాడు.

"హనుమా! ఆజానుబాహులైన ఆ వీరులని చూడు. ధనుర్ధారులైన వారిని చూస్తే ఎవరికి మాత్రం భీతి కలగదు. ఆ పురుషోత్తములని వాలే పంపాడని నా సందేహం. లేదంటే ఈ సానువుల్లో ఋషి బట్టలు ధరించి ఆయుధాలతో ఎందుకు తిరుగుతారు.

"హనుమా! రాజుకు ఎంతో మంది మిత్రులూ, అనుచరులూ ఉంటారు. రాజనీతితో, రాజ్యకాంక్షతో రాజు అనేవాడు అన్ని వైపుల నుంచి పగవాళ్ళని ఉసికొల్పుతాడు. హనుమా! అనేక మార్గాల ద్వారా శత్రుశేషం లేకుండా చేసుకుంటాడు రాజు. అందులోని భాగంగానే ఈ మహానుభావులని వినియోగించి ఉన్నాడేమో వాలి...

"కాన హనుమా ప్రాకృత వేషం ధరించు. అన్యోన్య సంభాషణలను బట్టి వారెవరో, ఏ కార్యార్థమై వచ్చారో తెలుసుకో. వారిని స్తుతించు. వానర శ్రేష్ఠ హనుమా..... వాయుపుత్రా తక్షణమే నీవు తెలుసుకొనవలెయును" చెప్పాడు సుగ్రీవుడు.

## రామలక్ష్మణులను హనుమ కలియుట

సుగ్రీవుని అనుమతితో మహాబలవంతుడు హనుమ వానర రూపాన్ని వదలి భిక్షు రూపం ధరించాడు. రామలక్ష్మణులు వస్తున్న దిశగా వెళ్ళాడు. ఎంతో వినయముతో, విధేయతతో, తియ్యని పలుకులతో పలకరించి నమస్కరించాడు.

"మహానుభావుల్లారా! చూస్తుంటే రాజ ఋషుల్లా ఉన్నారు. వ్రత దీక్షా పరులైన తాపసుల్లా ఉన్నారు. ఈ పంపా తీర ప్రాంతంలో దేని కోసమో వెతుకుతున్నట్టుగా ఉంది.

"నార బట్టలు ధరించారు. ఎంతో దూరం నుంచి ప్రయాణిస్తున్నట్టు మీ బడలిక వల్ల అవగతమౌతోంది. మిమ్ము చూసి మృగాలూ, పక్షులూ కకావికలమవుతున్నాయి.

"శ్రేష్ఠమైన భుజాలతో సింహాల్లా ఉన్నారు. దేవేంద్రుడి ధనుస్సుల్లా ఉన్నాయి మీ ధనుస్సులు. మీ శరీరకాంతితో ఋష్యమూక పర్వతం మరింత వెలిగిపోతోంది.

"ధనుర్ధారులైన మీరు మీ బాహువులకి ఎట్టి ఆభరణాలు పెట్టుకోలేదు. మీ అంబుల పొదిలో బాణాలు మహాసర్పాల వలె అగుపిస్తున్నాయి. కుబుసం విడిచిన పాముల వలే బుసలు కొడుతున్నట్టున్నాయి.

"వృషభము వంటి పరాక్రమవంతులుగా అగుపిస్తున్నారు. మీ బాహువులు ఏనుగు తొండముల వలే ఉన్నాయి. కాంతివంతమైన మానవ శ్రేష్ఠులు మీరు.

"సముద్రంతోనూ, పర్వతాలతోనూ, వింధ్య, మేరు ప్వతాలతోనూ నిండిన ఈ భూమినంతా పాలించుటకు మీరు తగిన వారులా ఉన్నారు. మహావీరుల్లా ఉన్నారు.

"మీ తేజస్సు, మీ రూపము చూస్తుంటే శత్రుసంహారం చెయ్యటానికి భూమి మీదకు వచ్చిన దేవతల్లా ఉన్నారు. ధనుస్సులు ఇంద్ర బంగారముతో అలంకరించిన వజ్రాయుధాల వలే ఉన్నాయి.





"ఓ వీరులారా! నేనే మాట్లాడుతున్నాను. అయిననూ పర్వాలేదు. ముందు నా గూర్చి చెప్పుకుంటాను. సుగ్రీవుడనే వానరుడున్నాడు. అతను సమస్త ధర్మాలు తెలిసినవాడు. ఈ భూమండలాన్ని చుట్టి చూసి వచ్చినవాడు. సుగ్రీవుడు వానరులకు రాజు. నా పేరు హనుమంతుడు. వాయుపుత్రుడని. వానరుడను.

"ఋష్యమూకం నుంచి సుగ్రీవుని అభిప్రాయము ప్రకారం మీ వద్దకు వచ్చాను. ఏ రూపాన్నైనా ధరించి ఎక్కడికైనా వెళ్ళగలను. స్నేహధర్మంతో మీతో స్నేహం చెయ్యాలనుకుంటున్నాడు సుగ్రీవుడు."

హనుమంతుని మాటలను రామలక్ష్మణులు విన్నారు. సంతసించారు.

"లక్ష్మణా! సుగ్రీవుడు పంపగా ఈ కపీంద్రుడు వచ్చాడు. మాటలని బట్టి మహా పండితుడిలా ఉన్నాడు. ఆపి ఆపి మాట్లాడలేదు. ఉచ్ఛారణలో తొందరలేదు. బిగ్గరగా, మందముగా లేకుండా మధ్యమ స్వరములో ఉంది.

"వ్యాకరణాన్నీ, వేదాలనూ చదివి ఉన్నవాడు అగుటచేనేమో, నోటి వెంట అప శబ్దము రాలేదు. మాట్లాడుతున్నప్పుడు ముఖములో కానీ, లలాటములో కానీ, కనుబొమ్మలలో కానీ, ఏ వికారమూ కలగలేదు. మనోహరమైన మాటలను వాక్యాలుగా నిర్మించి మాట్లాడాడు. తల ఆడించకుండా చేతులు వెనక్కీ, ముందుకీ ఆడించకుండా పలికాడు. ఇట్టి సద్గుణాలు ఉన్న దూతను పొందిన సుగ్రీవునకు ఏ కార్యమైనా ఇట్టే నెరవేరిపోతుంది."

అన్నగారి మాటలను లక్ష్మణుడు ఆలకించాడు. సుగ్రీవ సచివుడైన హనుమతో చెప్పాడు.

"పండితుడా! మహాత్ముడైన సుగ్రీవుని గూర్చి మేం విని ఉన్నాము. ఆ మహావీరుడైన వానరరాజు కొరకై ఈ ఋష్యమూక పర్వతం వద్దకు వచ్చాం. సుగ్రీవుడితో చెలిమి కోసమే మేము ఇంత దూరం వచ్చినది."

☆☆☆ ☆☆☆ ☆☆☆

లక్ష్మణుడు అలా చెప్పగానే హనుమంతుడు ఆనందపడ్డాడు. వాలిని జయిస్తాడు సుగ్రీవుడు. శ్రీరామ సుగ్రీవుల స్నేహం జగతికే కళ్యాణంగా తలంచాడు.

"శ్రీరామా! మహామృగాలూ, సర్పాలూ యథేచ్ఛగా సంచరించే మహాఘోరారణ్యానికి ఎందుకు రావల్సి వచ్చింది" అడిగాడు హనుమ.

శ్రీరామ ఆదేశం ప్రకారం లక్ష్మణుడు చెప్పాడు.

"అయోధ్యరాజు దశరథమహారాజు మా తండ్రిగారు. కోసల దేశ రాజు, ద్యుతిమంతుడు, మా తండ్రిగారైన దశరథమహారాజు ధర్మవత్సలుడు. యజ్ఞాలు చేసి దేవతలను మెప్పించాడు. ధర్మము తప్పకుండా నాలుగు వర్ణాలకు సమ రక్షణ ఇస్తూ పాలించాడు. ఈ భూమండలానికి బ్రహ్మలా కీర్తించబడ్డాడు.

"అతని జ్యేష్ఠ పుత్రుడు శ్రీరాముడు ఇతను. ఇతని తమ్ముడను లక్ష్మణుడను నేను. తండ్రి మాటతో వనవాసానికి వచ్చాడు పితృాజ్ఞాపాలకుడైన శ్రీరాముడు. అన్నను అనుసరించాను నేను.

"సూర్యుడిని అంటి పెట్టుకున్న కాంతిలా మా వదినమ్మ సీతమ్మ వైదేహి భర్త శ్రీరాముడని అనుసరించింది. సమస్త ప్రాణికోటికి మేలు చేసే పూజ్య నీయుడు శ్రీరాముడు.

"అట్టి శ్రీరాముని భార్యని కామరూపుడైన రావణుడు కుటిల పన్నాగముతో మేం ఇద్దరం పంచవటిలో లేనప్పుడు అపహరించాడు. వాణ్ణి వెదుకుతూ వస్తుండగా శ్రీ పుత్రుడు దనువుకి మా వల్ల శాప విమోచనమై సుగ్రీవుని గూర్చి చెప్పి, సీత జాడ తెలుస్తుందని చెప్పి తన నిజస్థానానికి వెళ్ళాడు.

"హనుమా! శ్రీరాముడు భార్యా వియోగ దుఃఖములో దుఃఖ పరవశుడై ఉన్నాడు. ధర్మ వత్సలుడూ, సర్వలోకాల్లోనూ ధర్మాత్ముడిగా పేరొందిన శ్రీరాముడు శరణాగతుడు అవుతున్నాడు."

"లక్ష్మణా! మీరు మహాత్ములు, సర్వగుణోపేతులు, క్రోధాన్నీ ఇంద్రి యాలనీ జయించిన వారు మీరు. అట్టి లోకనాధుడిని సుగ్రీవుడే వెదుకుకుంటూ రావలిసి ఉంది. అతని మహాభాగ్యము, పూర్వ జన్మ సుకృతం వల్ల ఇట్లా జరిగింది.

"శ్రీరామా! సుగ్రీవుడు రాజ్య భ్రష్టుడై ఉన్నాడు. అతని అన్న వాలి. తమ్ముడైన సుగ్రీవుని భార్యని చెర పట్టి ధర్మ విరుద్ధానికి పాల్పడ్డాడు. రాజ్యం నుంచి సుగ్రీవుడిని వెళ్ళగొట్టాడు.

"ప్రభూ! శ్రీరామా! నీవు మూడులోకాల్లోనే కాదు పధ్నాలుగు భువన భాండాల్లోనూ ఉత్తముడవి. సీత జాడకై అహర్నిశలు శోదిద్దాం. ముందుగా సుగ్రీవుని వద్దకు వెళ్ళదాం" చెప్పి హనుమ తన యధారూపం వానర రూపాన్ని ధరించాడు.





సకల గుణముల గల రామలక్ష్మణులను తన విశాలమైన వీపుపై ఎక్కించుకొని ఋష్యమూక శిఖరంపైకి తీసుకువెళ్ళాడు మంగళప్రదమైన బుద్ధీ, కీర్తి పరుడూ అయిన హనుమంతుడు.

## శ్రీరామ సుగ్రీవుల స్నేహం

ఋష్యమూక పర్వతంపై రామలక్ష్మణులను దింపి... "శ్రీరామా! సుగ్రీవుడు మిమ్ము చూసి వాలి మనుష్యులుగా భావించి, భయపడి ఈ ఋష్యమూక పర్వతాల్లోని మలయ పర్వతానికి వెళ్ళాడు. నేను వేగిరంగా సుగ్రీవుని తీసుకువస్తానని" చెప్పి వెళ్ళాడు హనుమంతుడు.

మలయ పర్వతంపై నున్న సుగ్రీవుడిని చేరిన హనుమంతడు "సుగ్రీవ మహారాజా! మీకు జయం. నీవు చూసిన వారిలో పెద్దవాడు శ్రీరాముడు. చిన్నవాడు లక్ష్మణుడు. వారు దశరథమహారాజు పుత్రులు. ధర్మాత్ములు. లక్షలకొలది గోవులనూ, భూములనూ దానమిచ్చిన రాచ బిడ్డలు వారు.

"సత్యవ్రతుడైన శ్రీరాముడు తండ్రి మాట కోసం అడవులకి వచ్చాడు. మహా పతివ్రత సాధ్వి అయిన మిథిలా దేశపు రాకుమారి సీతాదేవి భర్తని అనుసరించి వనవాసానికి వచ్చింది. తమ్ముడు లక్ష్మణుడు అన్న వెంట తానూ అడవులకి వచ్చాడు.

"అట్టి ధర్మపరుడు, సత్యవ్రతుడు, పితృాజ్ఞాపాలకుడైన రఘునందుని సతి సీతను రామలక్ష్మణులు ఆశ్రమంలో లేనప్పుడు రావణుడు అపహరించుకు పోయాడు. సీత జాడకై నీ సహాయార్థం వెదుకుతూ వచ్చారు. ఆ ఉభయులూ ఇక్ష్వాకు వంశాంకులైన శ్రీరామలక్ష్మణులు. నీ స్నేహం కోసం ఎదురు చూస్తున్నారు."

హనుమ మాటలతో సుగ్రీవుడు తేలికపడ్డాడు. ఆందోళనా, భయమూ తొలిగిపోయాయి.

హనుమంతుడితో కలిసి శ్రీరామలక్ష్మణుల వద్దకు వెళ్ళాడు. రామలక్ష్మణు లను కనులారా వీక్షించాడు. అపూర్వమైన శ్రీరాముని తేజస్సుని చూసి సుగ్రీవుడు తెలియకనే నమస్కరించాడు.

"సమస్త ధర్మములూ తెలిసివారనీ, పరమ వీరులనీ హనుమ చెప్పి ఉన్నాడు. శ్రీరామా! మహాప్రాజ్ఞులు మీరు. కనుకనే వానరుడైన నన్ను వెదుకుతూ వచ్చారు.

"శ్రీరామా! ఇదిగో నా చెయ్యి చాచినాను. నీ చెయ్యి నా చేతిలో వేయి. స్నేహధర్మాన్నీ, మర్యాదనీ ఎప్పటికీ కాపాడుదాం" చెప్పాడు సుగ్రీవుడు. శ్రీరాముడు సుగ్రీవుని చేతిలో చెయ్యి వేశాడు. ఆనందంగా సుగ్రీవుని కౌగిలించుకున్నాడు.

హనుమంతుడు అరణి కట్టెలతో అగ్నిహోత్రం వెలిగించాడు. పూలు చల్లాడు. అలంకరించాడు. మైత్రీ ధర్మమంత్రాలని పఠించాడు.

మండుతున్న అగ్నిహోత్రానికి శ్రీరాముడూ, సుగ్రీవుడూ ప్రదక్షిణం చేశారు. అగ్నిసాక్షిగా స్నేహితులైయ్యారు.

"శ్రీరామా! మనమిప్పుడు స్నేహితులం. ఇక నీ సంతోషమే నా సంతోషం. నా దుఃఖమే నీ దుఃఖం. నీ నా భేదాలు లేవు" చెప్పి సుగ్రీవుడు ఆకులతోనూ, పూలతోనూ ఉన్న మద్ది కొమ్మలిరిచి క్రింద పరిచాడు. శ్రీరాముడూ, సుగ్రీవుడూ దాని మీద కూర్చొన్నారు. హనుమంతుడు బాగా పూసిన చందన కొమ్మలిరిచి లక్ష్మణుడి కోసం వేశాడు.

"శ్రీరామా! నా అన్న వాలి. మోసంతోనూ, ఆ ధర్మంతోనూ నా భార్యని లాక్కున్నాడు. రాజ్యం నుంచి వెళ్ళగొట్టాడు. ప్రాణ భయంతో ఈ ఋష్యమూక పర్వతంపై గడుపుతున్నాను. నీ అభయంతో నా వేదనా, దిగులూ పోగొట్టు."

తేజశాలి, ధర్మములు తెలిసినవాడు శ్రీరాముడు చిరునవ్వు నవ్వాడు.

"సుగ్రీవా! మైత్రికి ఉపకారమే ఫలం. నీ భార్యని అపహరించిన వాలికి భూమిపై జీవించే హక్కులేదు. నా నిశితాస్త్రాలతో గ్రద్దెల రెక్కలు కట్టిన బాణాలతో అతన్ని సంహరిస్తాను.

"అనేక కణుపులతో, సూర్య చంద్రుల్లా తేజరిల్లే నా బాణం వాలిని తాకగలదు. అనేక కణుపులతో వాడియైన, వంకరలేని కణుపులు గల నా బాణం అతనిలో దిగిననాడు వాలి నేల కూలటం నీవు చూస్తావు" చెప్పాడు శ్రీరాముడు.

సుగ్రీవుడు శ్రీరామ హితమైన మాటలకు పరమానంద భరితుడయ్యాడు.

"మిత్రమా! నరులలో శ్రేష్ఠమైన వీరుడా! శ్రీరామా! నేను ధన్యుడనైతిని. నీవు సమస్త నరులకీ ప్రభువువి. నీ మైత్రి వల్ల, నీ పరాక్రమం వల్ల పోయిన రాజ్యమూ, నా భార్యనూ తిరిగి పొందగలను. అది సత్యం" పలికాడు సుగ్రీవుడు.

శ్రీరామ సుగ్రీవుల మైత్రి అగ్నిసాక్షిగా పూర్తి అవ్వగానే లంకా పట్టణంలో అశోకవనంలో శ్రీరామునికై వేచి చూస్తున్న సీత ఎడమ కన్ను అదిరింది.





సీతతో పాటు అగ్నికణముల వంటి కనుల కలిగిన రావణాసురుడి ఎడమ కన్ను, బంగారం వంటి పచ్చగా ఉన్న వాలి కన్ను ఏకకాలంలో అదిరాయి.

## వైదేహి నగలు

"శ్రీరామచంద్రా! ఈ హనుమ మంత్రులందరిలోనూ ఉత్తముడు. ఈ మహారణ్యానికి మీరు వచ్చిన పరిస్థితులన్నీ నాకు వివరించాడు. మీరు ఆశ్రమ పదంలో లేనప్పుడు జనక రాజకుమారి సీతమ్మను రావణుడు అపహరించినట్టు మంత్రి శ్రేష్ఠుడు హనుమ చెప్పాడు. అటకాయించిన జటాయువును సంహరించాడు ఆ దుష్టుడు.

"శ్రీరామా! దుఃఖించకు. త్వరలోనే సీత నీకు చేరువవుతుంది. మధుకైటభులు వేదాలని ఎత్తుకెళ్ళి పాతాళంలో దాచి పెడితే, వైకుంఠవాసుడు శ్రీమహావిష్ణువు మత్స్యావతారంలో వెళ్ళి తీసుకువచ్చినట్టు, భూమి, ఆకాశం, పాతాళంలో ఎక్కడున్నా సీతాదేవి జాడ తెలుసుకుంటాను. నీకు సమర్పిస్తాను. శ్రీరామా ఇది సత్యం...

"శ్రీరామా! రాక్షసులూ, దేవేంద్రుడూ కలిసినా, సీతను ఏమీ చెయ్యలేరు. ఆమె చెంత కెళ్ళామనుకున్నవారు విషాహారం తిన్నవారి వలే నేలరాలిపోతారు. మట్టిలో శాశ్వతంగా ఇంకిపోతారు.

"శ్రీరామా! జ్ఞప్తికి వచ్చినది. సందేహం లేదు. ఆమె మైథిలీనే. ఆ రాక్షసుడు రావణుడు ఎత్తుకెళ్తున్నప్పుడు ఆ తల్లి సీతమ్మ 'ఓ రామా! లక్ష్మణా!' అంటూ రోదిస్తోంది. నేను విన్నాను. చూశాను. ఆ సమయమున నలుగురు వానరులతో ఉన్నాను.

"మమ్మ్మ చూసి తన ఉత్తరీయంలో సొమ్ములు అన్నీ మూట కట్టి పడవేసినది. శ్రీరామా ఆ ఆభరణాలని అన్నింటినీ జాగ్రత్త చేశాం. ఇప్పుడే వాటిని తీసుకువస్తాను. నీవు గుర్తు పట్టగలవు" చెప్పాడు సుగ్రీవుడు.

శ్రీరాముడు ఆదుర్దాపడ్డాడు. లక్ష్మణుడు వేగిరంగా నగలు తీసుకు రమ్మన్నాడు. సుగ్రీవుడు చీకటి గుహలోకి వెళ్ళాడు. ఆ సుందర ఆభరణాలని తెచ్చాడు.

శ్రీరాముడు ఆ ఆభరణాలనీ, ఉత్తరీయాన్నీ చూశాడు. మంచు కమ్ము కున్న చంద్రుడయ్యాడు. కళ్ళలో నీళ్ళు సుడులు తిరిగాయి. నిలవలేక పోయాడు. కూర్చుండి పోయాడు.

"లక్ష్మణా! చూడు! నా సీత..... సీత ఆభరణాలు, ఆ ఉత్తరీయం చూడు మెత్తటి పచ్చిక బయలు మీద పడవేసి ఉంటుంది. అందువల్ల చెక్కు చెదరని ఆభరణాలని చూడు" శ్రీరాముడు వ్యథ భరితంగా చెప్పాడు.

"అన్నా శ్రీరామా! ఆమె బాహుపురులు గాని, కుండలాలు గాని ఎట్లున్నవో నేను ఎన్నడూ చూడలేదు. కానీ ఆ అందెలు... మా వదినమ్మవే. నిత్యమూ పాదాభివందనం చేస్తున్నప్పుడు అగుపించే నూపురాలను నేను ఖచ్చితంగా ఎరుగుదును."

"సుగ్రీవా! చెప్పు నా ప్రాణాన్ని, ఆ రాక్షసుడు ఎటు తీసుకువెళ్ళాడు. వాడు వాడి మృత్యు ద్వారాన్ని తెరిచాడు. సమస్త రాక్షసులనూ నా బాణాలకి ఆహుతి చేస్తాను. ఆ రాక్షసాధముడు ఎచ్చట నివశిస్తున్నాడో చెప్పు యమసదనానికి తక్షణమే పంపుతాను."

☆☆☆ ☆☆☆ ☆☆☆

"శత్రుసంహారకుడవైన శ్రీరామా! దిగులు చెందకు. వాడ్ని నేను ఎరగను. వాడి నివాస స్థలం, గుణగణాలు ఏమీ తెలియవు. దుష్కులుణ్ణి గూర్చి నాకు ఏమీ తెలియక పోయినా, ఇక ముందు తెలుసుకుంటాను. సత్యప్రతిజ్ఞ చేస్తున్నాను.

"సీతాదేవిని నీకు సమర్పించే ప్రయత్నం చేస్తాను. సమస్త పరివారంతో రావణ సంహారం చేయుట తథ్యం. మహాశక్తివంత శ్రీరామా! నీవు ధైర్యవంతుడవు. కన్నీళ్ళు కార్చవద్దు. ధైర్యంతో నిగ్రహంగా ఉండు. మహాను భావులు, మహామహితాత్ములైన ధర్మపరుల కంటనీరు భూమిపై పడరాదు. కష్టాల్లోనూ, దుఃఖాల్లోనూ బుద్ధిమంతుడు ధైర్యాన్ని వీడడు. నీళ్ళలో ప్రయాణించే పడవలో దుఃఖ, భయ అను నీరు ప్రవేశించితే పడవ మునిగిపోతుంది.

"శ్రీరామా! స్వాంతన చెందు. దుఃఖము వల్ల భూమిపై ఏదీ సాధించలేము. స్నేహబంధంతో చెపుతున్నాను. నీవు ధృతిమంతుడవి. సర్వం తెలిసినవాడవు.

"శ్రీరామా! దుఃఖంతో ఉన్న వారికి ప్రాణ సంశయము కూడా ఒక్కొక్కసారి ఏర్పడుతుంది" చెప్పాడు సుగ్రీవుడు.

శ్రీరాముడు కనులు అద్దుకున్నాడు. సుగ్రీవుడని కౌగిలించుకున్నాడు.





"సుగ్రీవా! హితం కోరే స్నేహితుడు ఎట్లా మాట్లాడవలెనో, అట్లే మాట్లాడావు. నీలాంటి ఆత్మబంధువు కష్టకాలంలో దొరుకుట దుర్లభం. ఆ దుర్మార్గుడూ, మోసకారీ, క్రూరుడైన రావణాసురుడు ఎచ్చట ఉన్నదీ, సీతను ఎక్కడ ఉంచినదీ తెలుసుకొనవలెను. వెదికే ప్రయత్నం చేయవలెను.

"సుగ్రీవా! అడిన మాట తప్పటం ఇక్ష్వాకుల వంశంలోనే లేదు. భార్యని వీడిన దుఃఖం ఏమిటో నాకు తెలుసు. అట్టి అకార్యం చేసిన వాలిని ముందు సంహరిస్తాను" చెప్పాడు శ్రీరాముడు. సుగ్రీవుడు సంతుష్టుడు అయ్యాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

తేజశాలియైన సుగ్రీవుడు మంగళకరమైన నేత్రములు తుడుచుకొని శ్రీరామునితో చెప్పాడు.

"శ్రీరామచంద్రా! సకల సద్గుణ సంపన్నుడవు. నాకు ఎట్టి సంశయమూ లేదు. నీ స్నేహ సాన్నిహిత్యముతో దేవలోకాన్ని కూడా పొందగలను. అగ్నిసాక్షిగా మిత్రుడవైయ్యావు. వానర రాజ్యము నాది నాకు దక్కుతుంది.

"రఘువీరా! వాలి నా భార్యనీ, రాజ్యాన్నీ అధర్మంగా వశపరుచుకున్నాడు. ప్రాణ భయంతో ఈ ఋష్యమూక పర్వతంపై తలదాచుకున్నాను. ఓ రామా! సమస్త లోకాల భయాలు పోగొట్టే ధీమంతుడవు నీవు. నీవే నన్ను అనుగ్రహించి రక్షించవలెను."

"దేవేంద్రుని మించినవాడు, తేజోవంతుడు, ధర్మజ్ఞుడూ అయిన శ్రీరాముడు సుగ్రీవుని మాటలు విన్నాడు.

"సుగ్రీవా! ఉపకారం స్నేహితుడి ప్రథమ లక్షణం. అపకారం శత్రులక్షణం. నీ భార్యని అపహరించిన వాలిని ఇప్పుడే చంపుతాను.

"బంగారు ములుకులు గల వజ్రాయుధంలాంటి నా బాణంతో వాలి రొమ్ము చీలుస్తాను. సుగ్రీవా నా బాణానికి కణుపులు ఉన్నాయి. తీక్షణమైన ఆ మొనలు ప్రాణాలు తీసే సర్పకోరలు. వాలి మహాపర్వతం వలే నేలకొరుగుతాడు."

సుగ్రీవుడు అంజలి ఘటించాడు శ్రీరామునకు. కన్నీళ్ళు తుడుచుకొని చెప్పాడు.

"వాలి చేసిన నీచకార్యాలు అన్నీ ఇన్నీ కావు. నన్నూ, నా మిత్రులనూ పరుష వాక్యాలతో అవమానించాడు. నా అనుకున్న నా వారినందరినీ

కారాగారంలో పెట్టాడు. నా ప్రాణ సమానమైన భార్యని చెరపట్టాడు. చివరకు తమ్ముడని కూడా చూడకుండా నన్ను చంపెయ్యాలని చూశాడు.

"హనుమ లాంటి అనునయుల సహకారంతో నేను ఇంకా బ్రతికి ఉన్నాను. వీరంతా నేనంటే ప్రాణం పెడుతున్నారు. అనుక్షణం నన్ను కంటికి రెప్పలా కాపాడుతున్నారు. ఒక్క క్షణం కూడా వదలి పెట్టడం లేదు. నా అన్న వాలి మహా పరాక్రమవంతుడు. నేను బ్రతికి ఉండాలంటే వాడు చావాలి. నా జ్యేష్ఠభ్రాత మరణంతోనే నా శోకము నన్ను వీడిపోతుంది."

"వానర ముఖ్యా, సుగ్రీవా! చింతించవలదు. అధర్మం జయించుట తాత్కాలికమే. ధర్మమే చివరకు నిలుస్తుంది. ఇది సత్యం. వైర కారణం చెప్పు సుగ్రీవా! బలాబలాలు వివరిస్తాను. వానాకాలం వరదలా నాకు కోపం వస్తోంది. విల్లు ఎక్కుపెట్టేలోపే వివరించు. బాణం వదిలిన తర్వాత పగవాడు పాపలోకాలకి వెళ్ళవలిసిందే."

సుగ్రీవుడు సంతోషంగా తనకూ, వాలికీ వచ్చిన వైర కారణం చెప్పటం ప్రారంభించాడు.

## వాలి, సుగ్రీవుల వైరం

"శ్రీరామా! మా అన్న వాలి అడ్డు వచ్చిన వారినెవరినీ వదలి పెట్టేవాడు కాదు. మా తండ్రి గారికి వాలి అంటే ఎంతో ప్రేమ. ఎప్పుడూ మెచ్చుకుంటుండే వాడు. నేను సహితం అన్నగారిని గౌరవిస్తూ, సేవిస్తూ ఉండేవాడిని.

"మా తండ్రిగారు స్వర్గస్థులయ్యాక ఆనవాయితీ ప్రకారం జ్యేష్ఠుడు వాలికి వానర రాజ్యాన్ని పట్టం కట్టారు. సర్వకాలసర్వావస్థలలో వాలిని కనిపెట్టుకుండేవాడిని.

"మాయావి అనే రాక్షసుడు ఉండేవాడు. దుందుభి జ్యేష్ఠపుత్రుడు. వాడికీ, మా అన్న వాలికీ ఓ స్త్రీ కారణంగా విరోధం వచ్చింది. ఆ కోపతాపాల కారణంగా మాయావి ఓ అర్ధరాత్రి కిష్కింధానగర ద్వారం వద్దకు వచ్చి భీకర సవాలు చేశాడు. వికటాట్టహాస ధ్వనులతో నగరాన్ని భయానికి గురి చేశాడు.

"వాలి కోపంతో, ఆవేశంతో ఆయుధాన్ని తీసుకొనిపోతుంటే, కుల స్త్రీలంతా వద్దని చెప్పారు. అయినా వాలి వినలేదు. నేను భ్రాతృప్రేమతో వెంబడించాను. వాలిని చూసిన ఆ అసురుడు పరుగు లంకించుకున్నాడు. వాడ్ని వేగంగా వెంబడించాడు. అన్నని నేను అనుసరించాను.





"ఇంతలో చంద్రోదయం అయింది. వెన్నెల వెలుగులో దారి చక్కగా కనపడింది. మేం చూస్తుండగానే ఓ చీకటి బిలంలోకి దూరి వెళ్ళిపోయాడు. గడ్డీ, గాదాతో అడుగు పెట్ట సాధ్యం కాని దానిలా ఉంది. రోషంతో వాలి బిలం లోపలికి వెళ్ళబోతే ఆపేను. వద్దని బ్రతిమిలాడాను.

"సుగ్రీవా! అన్న గారి ఆజ్ఞ! బిలంలోకి పోయి శత్రువుని తుది ముట్టిస్తాను. అంతవరకూ ద్వారం వద్దే వేచి ఉండు."

"శ్రీరామా! అలా నన్ను రానీయలేదు. నేను ద్వారం వద్దే వేచి ఉన్నాను. రోజులూ, నెలలూ దాటి సంవత్సరము అయింది. అంత వరకూ ఆ బిలం వద్దే కనిపెట్టుకున్నాను. బిలంలో భయంకర సింహనాదాలు వినిపించాయి. మా అన్న వాలి భయంకర బాధాకరమైన అరుపులు విన్నాను. బిలం లోంచి ఎర్రటి చిక్కటి రక్తం వచ్చింది. నేను దుఃఖితుడనైయ్యాను. అసురుల అరుపులు కోలాహలంగా వినిపించాయి. మా అన్న వాలి విజయ సింహనాదం వినిపించలేదు.

"శ్రీరామా! ఆ చిహ్నాల ఆధారంగా మా అన్న వాలి యుద్ధంలో మరణించాడని భావించాను. శోకంతో జల తర్పణం వదిలాను. ఆ బిలద్వారాన్ని మహాపర్వతమంతటి రాయితో మూసివేశాను. కిష్కింధ వచ్చాను.

"శ్రీరామా! ఆ తర్వాత కొంతమంది మంత్రులకి మాత్రం జరిగింది చెప్పాను. అంతా యోచించి తప్పదని రాజ్యాభిషేకం నాకు చేశారు. అన్నగారి రాజ్యం ఆయన చూపిన మార్గంలోనే పరిపాలించాను.

"కొంత కాలానికి మహావీరుడైన వాలి మాయావి రాక్షసుడని చంపి కిష్కింధ వచ్చాడు. వానర రాజైన నన్ను చూసి మండిపడ్డాడు. కళ్ళతో నిప్పులు కురిపించాడు. బిలద్వారాన్ని మూసి కావాలనే తనని మట్టు పెట్టేందుకే అడ్డుపెట్టానని నిందవేశాడు.

"మంత్రులందరినీ కారాగారంలో వేశాడు. ఎన్ని మాటలంటున్నా నేను పూజించాను. వినయంగా, విధేయతతో జరిగింది చెప్పాను. నా కిరీటం తీసి అన్న పాదాల వద్ద ఉంచాను. అయినా వాలి నన్ను అనుగ్రహించలేదు.

"అన్నా! నేను ఒక సంవత్సరం పాటు పర్వత బిలం గుమ్మం వద్దే వేచి ఉన్నాను. బిలం లోంచి నెత్తురు ప్రవాహంలా వచ్చింది. నా దేహం కంపించింది. చిహ్నాలన్నీ నాకు వ్యతిరేకంగా వినవచ్చాయి.

"దానితో నేను కిష్కింధ వచ్చాను. నన్ను నమ్ము. విశ్వసించు. చిన్ననాటి నుంచీ నేను నీ సేవకుడను. నా గూర్చి నీకు తెలీదా? ఈ వానర రాజ్యం నీది. నీవు పూజనీయుడవు. నన్ను క్షమించవలెను.

"అన్నా... రాజు లేని రాజ్యము భర్త లేని స్త్రీ లాంటిది. ప్రతివారూ ఓ రాయి వేద్దామనుకుంటారు. అట్టి దుస్థితి కిష్కింధకు రాకుండా మంత్రులూ, సేనా నాయకులూ, బలవంతపెట్టగా రాజుగా ఒప్పుకున్నాను.

"రాజ్యాన్నీ, ధనాన్నీ పట్టణాలనీ, చెక్కుచెదరనీయలేదు. ఇదిగో మళ్ళీ నీది నీకే జాగ్రత్త చేసి సమర్పిస్తున్నాను. నీ రాజ్యాన్ని రక్షించేవాడిగానే ఉన్నాను. హక్కుదారుడిగా పరిపాలించలేదు."

వాలి నా మాటలను విశ్వసించలేదు. ఛీ కొట్టాడు. ఛీత్కరించాడు. మహామంత్రులను పిలిపించాడు.

"కిష్కింధ హితులారా! ఆ రాత్రి మాయావి వెనుక నేను పడ్డప్పుడు, సుగ్రీవుడు నన్ను వెంబడించాడు. ఆ క్రూర రాక్షసుడు ఓ బిలంలోకి దూరి వెళ్ళాడు. సుగ్రీవుడని బిల ద్వారం వద్ద ఉంచి లోపలికెళ్ళాను.

"లోపలికెళ్ళిన నాకు మాయావి కానరాలేదు. వాడ్ని వెదికి పట్టుకునే సరికి ఓ సంవత్సరం గడిచింది. వాడ్నీ వాడి బంధువులనూ చితక బాదాను. తలలు విరిచేశాను. వారి రక్తంతో బిలం నిండిపోయింది. శత్రువులని చంపి బిలం వద్దకు వస్తే మూసి ఉంది.

'సుగ్రీవా! సుగ్రీవా!' అని ఎన్నోసార్లు పిలిచాను. ఊహు జవాబు రాలేదు. రాజ్యకాంక్షతోనే బిలద్వారాన్ని మూసివేశాడు. దాన్ని పగల కొట్టి కిష్కింధ రాగానే నా అనుమానమే నిజమై రాజ్యాభిషేకం చేసుకొని కులుకుతున్నాడు.

"శ్రీరామా! ఆ తర్వాత లెక్కకి మించిన దెబ్బలు కొట్టి కిష్కింధ నుంచి వెళ్ళగొట్టాడు. అట్లా వెళ్ళ గొట్టినా నేను ఏ దూరప్రాంతాలకో నా భార్యతో వెళ్ళిపోయేవాడిని. కాని నా ప్రాణమైన భార్యను అపహరించాడు. నన్ను వెళ్ళగొట్టాడు.

"నా రక్షణకు భూమంతా తిరిగి, ఈ ఋష్యమూక పర్వతాన్ని ఎన్ను కున్నాను. వాడు ఇక్కడికి రాలేడు. చెప్పు రఘురామా! ఇందు నా అపరాధం ఏమున్నది. పంచభూతాల సాక్షిగా, అగ్నిసాక్షిగా నేను అంతా సత్యమునే చెప్పాను."

శ్రీరాముడూ, లక్ష్మణుడూ సుగ్రీవుడు చెప్పినది ఆసాంతమూ విన్నారు.





"సుగ్రీవా! సూర్యసమాన బాణాలు నావి. అమితవేగంతో ఆ వాలిని తాకటానికి ఉవ్విళ్ళూరుతున్నాయి. నీ భార్యని అపహరించిన ఆ దుష్టుడు నాకు కనపడేంత వరకే బ్రతికి ఉంటాడు" చెప్పాడు తేజస్వి, ధర్మజ్ఞుడైన శ్రీరాముడు.

సుగ్రీవుడు పరమానందం చెందాడు. హనుమ భక్తిగా నమస్కరించాడు.

## వాలి బలము

"శ్రీరామా! ప్రళయకాల మార్తాండుడిలా నీ తీక్షణ బాణాలతో లోకాలన్నీ మసి చెయ్యగల వీరుడవు. అందు ఎట్టి సందేహము లేదు. అయిననూ వాలి బల పరాక్రమము గూర్చి తప్పక తెలుసుకోవలెయును.

"మహాబలశాలి, ధైర్యవంతుడు వాలి. సూర్యోదయము అయ్యేలోపు పడమటి సముద్రం నుంచి తూర్పు సముద్రానికీ, దక్షిణ సముద్రం నుంచి ఉత్తర సముద్రానికీ ఇలా నాలుగు సముద్రాలనీ చుట్టేస్తాడు అవలీలగా... ఆపై సంధ్యోపాసన చేస్తాడు.

"మహాపర్వతాల మీద శిఖరాలను పెకిలించి బంతుల్లా ఎగరేసి పట్టుకుంటాడు. మహా వృక్షాలను బాహుబలంతో విరిచేస్తాడు.

"శ్రీరామా! దుందుభి అనే భీకర రాక్షసుడుండేవాడు. వాడిది వెయ్యి ఏనుగుల బలం. పర్వతాల రాజు మహాపర్వతంలా ఉంటాడు. బ్రహ్మ వరప్రసాది. ఆ గర్వంతో సముద్రుడితో సవాలు చేశాడు.

"రత్నరాసులతో ఉప్పొంగిపోయే సముద్రుడు అతని సవాలును సున్నితంగా తిరస్కరించాడు.

"ఓ దుందుభీ! నీ వీరత్వము నా మీద కాదు. నీ సరిసాటి అయిన వాడి పేరు చెబుతాను. అతనితో యుద్ధం చేయి. సరిసమానుడితోనే కయ్యమైనా, వియ్యమైనా...

"ఓ దుందుభీ! యుద్ధ విశారదుడా! హిమవంతుడు పర్వతాలరాజు. సాక్షాత్తు పరమ శివునకు మామగారు. అనేక గుహలతో, పాషాణ రంధ్రాలతో, మహారణ్యాలతో వెలిగిపోతున్నాడు. అట్టి వాడితో యుద్ధం చేయి. నీ కాంక్ష తీరుతుంది."

సముద్రుడిని వదలి దుందుభి వింటి నుంచి వెలువడ్డ బాణంలా హిమవంతుని వద్దకు వెళ్ళాడు.

ఆ పర్వతం మీద ఏనుగంతటి రాళ్ళను కుమ్ముతూ సింహనాదం చేశాడు. పర్వతరాజు హిమవంతుడు బదులిచ్చాడు.

"ఓ దుందుభీ! నీ కోర్కె నేను తీర్చలేను. నన్ను బాధించవద్దు. తాపసులనేకులకు ఈ పర్వత ప్రాంతమున ఆశ్రయం ఇచ్చాను. యుద్ధం చేయుట నాకు తెలీదు. కాన నన్ను వదిలేయ్" చెప్పాడు గిరిరాజు.

"అందరూ భయపడితే నేను ఎవరితో యుద్ధం చేయాలి. నీకు యుద్ధం చేయుట రాదా? కనీసం నాతో పోరాడే వీరుడి పేరైనా చెప్పు."

తెల్లని మేఘంలా చల్లని రూపం గల ధర్మాత్ముడు శైలరాజు హిమవంతుడుకి కోపం వచ్చింది.

"కిష్కింధరాజు వానర వీరుడు వాలి. యుద్ధమంటే కాదనని శూరుడు. కాంతిమంతుడు. దేవేంద్రుడితో సరిసమానమైనవాడు. సమస్త యుద్ధ విద్యలూ తెలసినవాడు. ద్వంద్వ యుద్ధంలో అతనికి అతనే సాటి.

"దుందుభీ! నముచితో దేవరాజు దేవేంద్రుడిలా వాలితో యుద్ధంచేయి. ఈ క్షణమే కిష్కింధ వెళ్ళు. ఏ సమయాన పిలిచినా వాలి కాదనడు. యుద్ధమంటే వివాహ భోజనంగా తలుస్తాడు."

దుందుభి వింటినుంచి వెలువడ్డ బాణంలా కిష్కింధ నగరానికి హుటాహుటిన వెళ్ళాడు. కిష్కింధ చేరి దుందుభులు మ్రోగించినట్టు శబ్దాలు చేస్తూ, చెట్టూ చేమలనూ ధ్వంసం చేశాడు. కోట వాకిలిని కుమ్మికుమ్మి పెట్టాడు.

మహావీరుడు వాలి దుందుభి సింహనాదం విన్నాడు. స్త్రీల మధ్య ఉన్నాడు. హాయిగా సుఖిస్తున్నాడు. సహించలేకపోయాడు.

"ఓయీ వీరుడా! చూడబోతే బలవంతుడివిగా ఉన్నావు. నీకూ, నాకూ ఎట్టి వైరమూ లేదు. చేసిన కోతి పనులు చాలు. వెళ్ళి ప్రాణాలు దక్కించుకో" తీక్షణంగా చెప్పాడు వాలి. దుందుభి కోపితుడయ్యాడు. కనులు ఎఱ్రగా చేశాడు. అగ్ని కురిపించాడు.

"వాలీ... ఆడాళ్ళ ముందు మాటలు కాదు. దుందుభితో యుద్ధం చేయి ... వానరుడా ఇది రాత్రి సమయం. కామభోగాలు సమృద్ధిగా అనుభవించు. రేపు తెల్లవారు జాము వరకు నీకు గడువు. ఈలోగా నీ కోర్కెలన్నీ తీర్చుకో బంధువులనీ, హితులనీ కౌగిలించుకో...





"కిష్కింధ అంతా చివరిసారి చూసుకో ధనాగారం నుంచి మిక్కిలి ధనాన్ని నీ సన్నిహితులకు తరలించు. స్త్రీలతో రమించు. తెల్లవారితే నీ మదము అణిచివేస్తాను.

"ఓ వాలీ... సిద్ధంగా లేనివాడినీ, మత్తులో ఉన్నవాడినీ, నిరాయుధుడనీ, నిద్రపోతున్నవాడినీ, స్త్రీ భోగం కోసం మదుపానము చేస్తున్నవాడినీ చంపను. తద్వారా భ్రూణహత్యా దోషము పట్టుకుంటుంది. అందువల్ల వాలీ నీకు తెల్లవారే వరకే గడువు."

ఆ మాటలు విని వాలి చిందులు త్రొక్కాడు. తారనీ మిగతా స్త్రీలనూ పంపించి వేశాడు. పరమ క్రుద్ధుడై పలికాడు.

"ఓ దుందుభీ! నీకు కాలం మూడింది. అంతిమ క్షణాలు దగ్గరికి వచ్చే నన్ను చూశావు. నీకు యుద్ధమంటే భయం లేకపోతే నాతో యుద్ధానికి రా." చెప్పి దేవేంద్రుడిచ్చిన కాంచనమాలను ధరించాడు.

"ఒక్క ఉదుటున దుందుభి ముందుకు వెళ్ళాడు. వెళ్ళీ వెళ్ళటంతోనే వాడి రెండు కొమ్ములు పట్టుకొని పైకెత్తి గిరగిరా తిప్పి విసిరేశాడు. సింహంలా అరిచాడు వాలి.

"దుందుభి చెవుల్లోంచి రక్తం కారింది. నెమ్మదిగా లేచాడు దుందుభి భీకరంగా అరుస్తూ వాలి మీద పడ్డాడు. పెద్ద బండరాయిని తీసుకొని దుందుభి మీదకి విసిరాడు. దుందుభీని తాకి పొడిపొడి అయింది.

"వాలి చెట్ల కొమ్మలతో చితక బాదుతున్నాడు. దుందుభి పిడికిళ్ళతో ముష్టిఘాతాలతో వాలిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాడు.

"సమయం గడుస్తున్న కొద్దీ... వాలికి బలం పెరగటం మొదలైంది. దుందుభి శక్తి క్షీణిస్తోంది. దుందుభి ఎంత ఆలోచించినా తన బలమెందుకు తగ్గుతుందో అర్థంకాలేదు.

"వాలి వాడ్ని అమాంతమూ లేవనెత్తి నేలకేసి కొట్టాడు. దుందుభి నుగ్గు నుగ్గు అయ్యాడు. శరీరం పగిలిపోయింది. వాలి వాడి కళేబరాన్ని లేవనెత్తి గిరగిరా తిప్పి ఓ యోజనము దూరంలో పడేటట్టు విసిరేశాడు. అలా విసిరేసిన దుందుభీ మృత కళేబరం మతంగ మహాముని ఆశ్రమంలో పడింది.ముని ఆశ్రమం ఋష్యమూక పర్వతంపై ఉన్నది. కొన్ని రక్తపు చుక్కలు మతంగుని మీద పడ్డాయి. దానికి ఆ మహాముని క్రుద్ధుడయ్యాడు. జరిగింది దివ్యదృష్టితో తెలుసుకున్నాడు. ఆ మహాకళేబరాన్ని చూశాడు.

"మతంగముని వాలిని తలచి మండిపడ్డాడు. తపోవనాల వృక్షాలూ, పూల చెట్లూ చిందర వందరగా విరిగిపోయి ఉన్నాయి.

"ఓరీ దురాత్ముడా, మూర్ఖుడా, మూఢుడా, నా తపోవనాన్ని కకావికాలం చేసిన వాలీ... ఇకపై ఈ ఆశ్రమ పదానికి యోజన దూరంలోనే ఉండాలి. కాదని వస్తే మరణం తథ్యం" అని మంత్రజలంతో శపించాడు.

మతంగముని ఆశ్రమంలోని వాలి హితులు భయకంపితులయ్యారు. "ఇందు వాలి మిత్రులున్నా వెనువెంటనే పోవలెను. వారికి ఇదే నా శాపం. ఈ ఆశ్రమ పరిసరాలని నా బిడ్డగా సాకుతున్నాను. ఈ తపోవనములోని ఫల, పుష్పాదులను సహితం వాలి అనుచరులు ముట్టరాదు. నా యీ శాపానికి గడువు ఒక్కరోజే ... వెళ్ళిపోండి. యోజనం దాటి వెళ్ళిపోండి. అట్లా కాక దిక్కరించిన వారు శిలలై పోతారు."

మతంగుని శాప వాక్కులు విని వాలి మిత్రులు అంతా పరుగు తీశారు. వాలిని చేరారు. ఘోరమైన శాపం గూర్చి చెప్పారు.

వాలి వినయంగా మతంగుడని దర్శించి వివరించాడు. అయినా మతంగుడు వినలేదు. మన్నించ లేదు. చేయునదిలేక వాలి కిష్కంధ వెళ్ళిపోయాడు.

"రామా! రాజ్యం నుంచి వెళ్ళగొట్టిన తర్వాత నా ప్రాణరక్షణకై ఈ ఋష్యమూక పర్వతం ఎంచుకున్నాను. అందువల్ల నిశ్చింతగా నా నలుగురు మంత్రులతో ఏ దిగులూ, విచారమూ లేకుండా మహా పర్వతం మీద నివసిస్తున్నాను.

"శ్రీరామా! అదిగో అటు చూడు. పెద్ద కొండలా అగుపిస్తూ ఉండే అదే దుందుభి అస్థి సమూహము. అదిగో ఈ ప్రక్కచూడు ఏడు పెద్ద మద్ది చెట్లు అగుపిస్తున్నాయా! వాటికి ఆకులు లేవు కేవలం కొమ్మలే...

"శ్రీరామా! వాలి ఆ ఏడు మద్ది చెట్లను ఒక్కసారి పట్టుకొని ఊపాడు. దానితో ఆ చెట్ల ఆకులన్నీ రాలిపొయ్యాయి. వాలి ఎట్టి ఆయుధం లేకుండా బాహుబలంతో ఆ పని చేశాడు.

"ఇక్ష్వాకు తిలకా శ్రీరామా! ఈ రెండు విషయాల వల్ల వాలి బలాబలాలను సమీక్షించు. వాలితో ఎట్టి యుద్ధం చెయ్యాలనుకుంటున్నావో తెలవివ్వు."

సుగ్రీవుల ప్రశ్నలకి లక్ష్మణుడు నవ్వాడు.





"వానరవీరా! శ్రీరాముడు ఎట్లు చేయవలెనో, ఏమి చేయుట ద్వారా వాలిని చంపగలడో చెప్పు... నీ సంశయాన్ని శ్రీరాముడు తక్షణమే తీర్చి వేయగలడు."

"సంతోషం లక్ష్మణా! అదిగో ఆ మద్ది చెట్లు. ఆ ఏడింటిని వాలి ఒక్కొక్క దానిని పట్టుకొని ఊపి పెకిలించేవాడు. శ్రీరాముడు ఒక బాణంతో ఏడు చెట్లలో ఒక సాల వృక్షాన్ని చీల్చినా చాలును. చీల్చి, ఆ దుందుభి ఎముకల గూడును ఒక కాలితో ఎత్తి తన్ని రెండు వందల ధనుస్సుల దూరం పోయి పడేలా చేయటం ద్వారా నేను వాలిని చంపగల పరాక్రమవంతుడిగా విశ్వసిస్తాను."

"శ్రీరామా! అన్యధా భావించవద్దు. వాలి వానరుడు. అయిననూ మహావీరుడు. వరప్రసాది. యుద్ధంలో అపరాజితుడు. దేవతలకి సాధ్యం కాని పనులెన్నో చేశాడు. పరమకోపి. అజేయుడు. ఎంతో మంది శూరుల్ని చంపేశాడు.

"రామా! మిత్రవత్సలా! హిమవత్పర్వతము వంటి నిన్ను ఆశ్రయించాను. వాలి బల పరాక్రమాలన్నీ ఎరుగుదును. నీ వీరత్వం నాకు తెలియదు. అయిననూ నీ భీకరరూపమూ, నీ మహాతేజస్సూ, నీ యుద్ధ బుద్ధీ, ధైర్యమూ, అన్నీ నివురు కప్పిన నిప్పు వలే ఉన్నాయని నీ మందహాసం సూచిస్తోంది."

శ్రీరాముడు చిరునవ్వు నవ్వాడు.

"సుగ్రీవా! నా పరాక్రమాన్ని గూర్చి నమ్మకం కలిగిస్తాను. గట్టి నమ్మకంతో నాతో ఉండేలా చేస్తాను" అని దుందుభి అస్థి సమూహాన్ని కాలితో లేవనెత్తి అటూ, ఇటూ తిప్పి నాలుగు వందల గజాల దూరానికి విసిరాడు. దుందుభి అస్థిపంజరము పది యోజనాల దూరం వెళ్ళి పడింది.

సుగ్రీవుడు పరమానందభరితుడయ్యాడు.

"ఓ మహాతేజా.... పర్వతాలలో శ్రేష్ఠమైన హిమపర్వత మెట్టిదో... సమస్త జంతుజాలములో సింహం ఎట్టిదో.... తేజోవంతులలో సూర్యుడు ఎట్టివాడో... నరులలో శ్రేష్ఠుడవి.... శ్రీరామా! బాణం సంధించు. ఒక్కవేటతో మద్దిచెట్టు చీలిపోతుంది.

"నేను విల్లు నుంచి బాణం వదలక ముందే విశ్వసిస్తున్నాను" చెప్పాడు సుగ్రీవుడు.

సఖుడు చెప్పిన మాటలకు శ్రీరాముడు చిరునవ్వుతో ధనుస్సుకి బాణాన్ని సంధించాడు. అల్లెత్రాటిని మ్రోగించాడు. నలు దిక్కులు దద్దరిల్లాయి. మద్ది చెట్లకి గురిపెట్టి బాణాన్ని వదిలాడు.

గాలిని చీల్చుకుంటూ బంగారు ములుకుల బాణం ఆ ఏడు మద్ది చెట్లనూ చీల్చివేసింది. ఆ బాణ వేగం అంతటితో తృప్తి పడక కొండని చీల్చి, తిరిగి అంబుల పొదిలోకి వచ్చింది.

## వాలి సుగ్రీవులు

ఆ బాణ ధాటికి విరిగి పడిపోయిన సాలవృక్షాలను చూసి సుగ్రీవుడు హర్షం వ్యక్తం చేశాడు.

"శ్రీరామా! ప్రభూ... పురుషోత్తమా... సర్వాస్త్రాలూ తెలిసిన నీతో దేవేంద్రుడు కూడా నిలవలేడు. అట్టి నీ ముందు వాలి ఎంత? ఒకే ఒక్కబాణంతో ఏడు వృక్షాలనూ నేలకూల్చావు. నాకు పరమానందంగా ఉంది.

"రఘువీరా! శత్రురూపంలో ఉన్న నా సోదరుడు వాలిని ఇక ఉపేక్షించ వద్దు. అంజలి ఘటిస్తున్నాను. వెంటనే బైలుదేరు" చెప్పాడు సుగ్రీవుడు.

"వానర రాజా! సుగ్రీవా! నీవు ముందు నడువు. మీ వెంట మేమంతా కిష్కంధ వస్తాము. రణ కేక పెట్టు. నిన్ను అవమానించి, వెళ్ళగొట్టిన అన్న వాలిని పొలికేకలు పెట్టి యుద్ధానికి రమ్మను" చెప్పాడు శ్రీరాముడు.

శ్రీరాముడూ, లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, మంత్రులూ అందరూ ఋష్యమూక పర్వతం దిగారు. కిష్కంధ నగర పరిసర ప్రాంతాన ఓ మహావృక్షం చాటున ఉన్నారు.

సుగ్రీవుడు గదను భుజాన వేసుకొని, వస్త్రమును గట్టిగా బిగించి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ గగనతలం పగిలి పోయేలా భీకర గర్జనలు చేశాడు. యుద్ధానికి రమ్మని సుగ్రీవుడు చేస్తున్న సింహనాదాలను వాలి విన్నాడు. మండిపడ్డాడు. మహాబలుడు వాలి తన అంతఃపురం నుంచి కొండల మాటు నుంచి వచ్చిన సూర్యుడిలా వచ్చాడు.

సుగ్రీవుడిని చూస్తునే తొడ చరిచి గదను కలిపాడు వాలి. రెండు కొండలు 'ఢీ' కొన్నట్టు భయంకరమైన శబ్దం. యోజన దూరం వరకూ భూప్రాణులన్నీ ప్రాణభయంతో పరుగులు తీశాయి. పిడుగుల వంటి అరచేతులతో చరచుకున్నారు. గగన తలంపై బుధుడూ, అంగారకుడూ పోరాడినట్టు అన్నదమ్ములు భీకర యుద్ధం చేస్తున్నారు. ఒకరిపై ఒకరు పిడి గుద్దులు కురిపించుకున్నారు. అరచేతులతో చరచుకున్నారు. వజ్రాయుధం తగిలినట్టు ఇద్దరి ఒళ్ళు చీలిపోయింది.





యుద్ధం జరిగే కొద్దీ సుగ్రీవుడి శక్తి సన్నగిల్లింది. వరప్రభావం వల్ల వాలి బలం పర్వత శిఖరంలా పెరిగింది.

శ్రీరాముడు ఇరువురినీ చూస్తున్నాడు. అశ్వినీ దేవతల్లా ఉన్నారు. అందు వాలి ఎవరు? సుగ్రీవుడెవరు? శ్రీరామ చంద్రుడు పోల్చుకోలేకపోయాడు. ప్రాణాంతకమైన బాణం సంధించలేకపోయాడు.

సమయం గడిచే కొద్ది సుగ్రీవుడికి నవనాడుల్లో భయం ఏర్పడింది. శ్రీరాముడెక్కడ. వీరాధివీరుడు నా స్నేహితుడెక్కడ. ప్రాణభయం ఆవహించింది.

"ఋష్యమూక పర్వతం స్మరణకి వచ్చింది. నాధుడైన శ్రీరాముడు కానరాక అనాధగా పలాయనం చేశాడు. మతంగ ఆశ్రమం వరకూ వచ్చి ఊపిరి పీల్చుకున్నాడు. వాలి అంత వరకూ తరిమి ముందుకు వెళ్ళే వీలులేక వెనక్కి మరిలాడు.

సుగ్రీవుడు రొప్పుతున్నాడు. ప్రాణ భయంతో ఎగశ్వాస పీలుస్తున్నాడు. ఒళ్ళంతా గాయాలు... రక్తం...

శ్రీరామ ద్వయం సుగ్రీవుడిని సమీపించారు.

"శ్రీరామా! అగ్ని సాక్షిగా ప్రమాణం చేసి స్నేహితులయ్యాం. దానికి ఇదా ఫలం" అడిగాడు.

"సుగ్రీవా! రూపంలోనూ, ఆకారంలోనూ మీ ఇరువురూ ఒక్కరిగానే కానవచ్చారు. బాణాన్ని ప్రయోగించలేదు. అలంకారాలూ, వేషాలూ, ఒడ్డూ, పొడుగూ, దేహకాంతీ, గర్జనలూ ఎందులోనూ తేడా కానరాలేదు. బేధం కనిపించలేదు.

"కాన సుగ్రీవా! వాలిని మళ్ళీ యుద్ధానికి పిలువు. సందేహించవద్దు. ఈ సారి వాలి సాల వృక్షాలవలె నేల కూలక తప్పదు. ద్వంద్వయుద్ధం చేసేటప్పుడు పోల్చుకోవటానికి ఏదైనా గుర్తు ధరించు...

"అదిగో లక్ష్మణా గజ పుష్పలత చక్కగా వికసించింది. సుగ్రీవుడి మెడలో వేయి. ఇప్పుడే సుగ్రీవుడిని కిష్కంధ రాజుని చేద్దాం."

లక్ష్మణుడు పర్వతముల మీద చరియల మీద బాగా వికసించిన గజపుష్పలతలను తెంపి దండగా చేసి సుగ్రీవుడి మెడలో వేశాడు. హనుమ జయ జయధ్వనులు చేశాడు. సుగ్రీవుడు సంధ్యాకాలమందు ఎర్రగా ఉన్న మేఘం కొండ వెలిగిపోయేట్టు వెలిగిపోయాడు.

## సుగ్రీవుని యుద్ధ సింహనాదం

శ్రీరాముడి అభయంతో సుగ్రీవుడు మళ్ళీ వాలితో యుద్ధానికి సిద్ధమయ్యాడు. ముందు సుగ్రీవుడూ, ఆ తర్వాత శ్రీరాముడూ, లక్ష్మణుడూ, నళుడూ, నీళుడూ, వానరసేనాధిపతి తారుడూ నడుస్తున్నారు.

మార్గములో పూల బరువుతో వొంగిపోతున్న చెట్లూ, కొండలను కోసుకుంటూ ప్రవహిస్తున్న నదులూ, మహా గుహలూ, మహాబిలాలూ చూస్తూ నడుస్తున్నారు.

వైఢూర్య మణుల్లా నిర్మలంగా తామరాకులతో వికసిస్తూ మొగ్గలు విడిన తామర పూవులనూ, లేడి పిల్లలనూ, హంసలనూ, వంజుల పక్షులనూ, నీటి కోళ్ళనూ, చక్రవాకాలు నిండిన సరస్సులనూ, వన్య మృగాలనూ, క్రూరమృగాలనూ, పక్షులనూ చూశారు.

ఓ దట్టమైన వనం కానవచ్చింది. జట్టు జట్టుగా ఆడ పిల్లలు ఆటలాడుకుంటున్నట్టు చెట్ల గుంపుల వనాన్ని చూసి బంగారం చేత అలంకరించిన ధనస్సునూ సూర్యునితో వెలిగిపోయే బాణాలను ధరించిన శ్రీరాముడు అడిగాడు.

"సుగ్రీవా! ఆకాశంలో మేఘాల్లా చెట్లతో నిండి ఉన్న ఈ మహా వనమెవరిదో తెలుసుకోగోరుతున్నాను. చుట్టూ అరటి చెట్లతో చూచుటకు ఆహ్లాదంగా ఉన్నదీ వనం."

"ప్రభూ! ఇది సప్త జనాశ్రమం... ఈ ఆశ్రమంలో అద్భుతమైన శక్తి ఉంది. శ్రమ ఉండదు. ఎన్నో ఉద్యానవనాలున్నాయి. రుచికరమైన పండ్లూ, పూలూ, కాయలూ ఎన్నో లభిస్తాయి.

"మహావ్రత నిష్టలు సప్తజనులు అనే ఏడుగురు మహర్షులు ఈ ప్రాంతాన అకుంఠిత దీక్షతో తపస్సు చేశారు. తలక్రిందులుగానూ, నీటిలోనూ ఆహారానికి బదులు ఏడు రాత్రుళ్ళులలో ఒక రాత్రి పూట మాత్రం వాయుభక్షణ చేస్తూ ఏడు వందల సంవత్సరాలు తపస్సు చేశారు.





"స శరీరముతో స్వర్గానికి చేరారు. మహావృక్షాలతో నిండిన ఈ ఆశ్రమం వారిదే. ఈ ఆశ్రమంలోకి దేవతలరాజు దేవేంద్రుడు కూడా అడుగుపెట్టలేడు. కాదని ఎవరు అతిక్రమించినా, యమపురికే పయనం. మానవులేకాదు, పశువులూ, పక్షులూ, వన్య క్రూర మృగాలూ ఆశ్రమములోకి వెళ్ళవు. తెలిసి చేసినా, తెలియక చేసినా తప్పు తప్పులా... లోనికివెళ్ళినా తిరిగిరారు.

"రామా! ఆశ్రమంలో నాట్యం చప్పుళ్ళు.... ఆ నాట్యకదలికల వల్ల కలిగే ఆభరణాల శబ్దాలు వినవస్తాయి. ఆశ్రమమంతా మంచి సుగంధం గుభాళిస్తుంది. శ్రీరామచంద్రా! సోదరునితో కూడి మహర్షులనుద్దేశించి నమస్కరింపవలెయును" చెప్పాడు సుగ్రీవుడు.

శ్రీరామలక్ష్మణులు ఆత్మవేత్తలైన మహర్షులకు అంజలి ఘటించారు. మునులకు నమస్కరించుటచే రామక్ష్మణులలో ఉగ్రమైన తేజస్సు ఆవిర్భవించింది.

ఆ సప్త జనాశ్రమము నుంచి అంతా కిష్కంధ చేరారు. క్రితంవలె శ్రీరాముడు చెట్టు చాటున ఉన్నాడు. శ్రీరాముని వెనుక లక్ష్మణుడూ, హనుమా, మిగతా మంత్రులూ ఉన్నారు.

"సుగ్రీవా! సింహనాదం చేయి. గజ పుష్పలత మెడలో ఉన్న నీవు నక్షత్రాల మధ్య సూర్యుడిలా వెలిగిపోతున్నావు. గర్జించు. యుద్ధప్రియుడు వాలిని యుద్ధానికి ఆహ్వానించు. క్షేత్రంలో పండిన పైరును వానలతో సఫలం చేస్తాడు దేవేంద్రుడు. అట్టి అగ్నిసాక్షిగా చేసిన ప్రతినను నేనూ సఫలం చేస్తాను. తడబడకు... హుంకరించు" చెప్పాడు శ్రీరాముడు.

బంగారు పింగళి వర్ణదేహం గల సుగ్రీవుడు శ్రీరాముని ధైర్యవచనాలతో రొమ్ము విరుచుకున్నాడు. వానరులు కాపలా కాస్తున్న పరిశుద్ధమైన బంగారంతో చేసిన ముఖద్వారాన్ని సమీపించాడు.

మహాక్రూర మృగాలు దడుసుకొని పది యోజనాలు పరుగుతీసేలా భీకర సింహనాదం చేశాడు. సర్పాలు పుట్టల్లోకి పరుగుతీశాయి. వందలాది మేఘాలు ఏకకాలంలో ఉరిమినట్టు, మహా పెను తుఫానుకు సముద్రం భీకర హోరుతో పైకి లేచినట్టు బంగారు వంటి పచ్చని ఛ్ఛాయ గల సుగ్రీవుడి అరుపు వాలికి వినవచ్చింది.

★★★ ★★★ ★★★

వాలి పరమ కోపోద్రిక్తుడయ్యాడు. చేతనున్న మధుపాత్రని విసిరికొట్టాడు. మత్తు స్థానంలో క్రోధం అలుముకుంది. రోషంతో రోహిణీకార్తె ఎండలా అయ్యాడు.

క్రోధంతో పగిలే అగ్ని పర్వతంలా మారి గదను అందుకున్నాడు. భూమిని పగల కొడుతున్నట్టు కాలితో నేలను తన్నాడు. మదపుటేనుగు ఘీంకరించినట్టు ఎలుగెత్తి అరిచాడు. వాలి వీరావేశం చూసి తార భయపడింది. ప్రేమగా దగ్గరికెళ్ళింది. హిత, ఫలమునిచ్చే వాక్యములు చెప్పింది.

"స్వామీ ఏటి వరదలా వచ్చిన కోపాన్ని విడనాడు. రాత్రి ధరించిన పూల దండలను ఉదయం లేవగానే విసిరేసినట్టు కోపాన్ని అవతల పారేయి. రేపు ఉదయాన్నే యుద్ధం చేయండి. నా మాట మన్నించండి.

"ఇంతకు ముందే నీచే చావు దెబ్బలు తిని వెంటనే మళ్ళీ వచ్చాడంటే ఏదో మర్మం ఉంది. అదిగో సుగ్రీవుడు అరుపుల్లో ఆ దర్పము విను. ఉత్సాహాన్ని గమనించు.

"స్వామీ! దానికి కారణం ఉంది. అంగదునకు చారుల చెప్పిన సంగతి... ఇక్ష్వాకు వంశరాజు దశరథుని కుమారులు శ్రీరామలక్ష్మణులు వనానికి వచ్చారట. మీ తమ్ముడు సుగ్రీవుడు వారితో చెలిమి కట్టాడట. రామలక్ష్మణులు శూరులు. యుద్ధంలో ఎవ్వరూ వారు ముందు నిలువలేరట.

"శ్రీరాముడు శౌర్యం మరీనట... యుద్ధంలో ఎవ్వరూ జయించలేని మహావీరుడట... నా పలుకులు విశ్వసించండి. శ్రీరాముడు ప్రళయాగ్ని లాంటివాడు. సాధుజనానికీ, ఎండనబడ్డ వాళ్ళకీ నీడ నిచ్చే మహావృక్షం. తండ్రి మాట కోసం మహారణ్యాలను పట్టి వచ్చినవాడు.

"నాథా... భార్య ఎప్పుడూ భర్త శ్రేయెస్సు కొరకే చెబుతుంది. నా సంతోషం కోసమైనా యుద్ధానికి వెళ్ళకండి. కోసలరాజు పుత్రుడు శ్రీరాముడితో వైరం మనకి అంత క్షేమం కాదు.

"స్వామీ! కాలం ముంచుకొచ్చిన వారికి హితములు రుచించనట్టుగా మీరు చేయవలదు. నా మాటలు రుచింపకపోయిననూ తెల్లవారే వరకూ ఆగండి."

వాలి చంద్రునితో సమానమైన ముఖము గల తార మాటలు వినలేదు. భయ స్వభావము గల తారని తప్పుకోమన్నాడు. ఇతర స్త్రీలతో కలిసి వెళ్ళిపొమ్మని కసురుకున్నాడు.





"తారా! విశాలకంఠము గల సుగ్రీవుడు బద్ధశత్రువై సింహనాదం చేస్తున్నాడు. యుద్ధానికి ఆహ్వానిస్తుంటే శూరుడైన నన్ను వెనక్కి తిరగమంటావా? వీరలోకం నన్ను చూసి ఎగతాళి చేస్తుంది.

"శ్రీరాముడు శక్తి గూర్చి నీవు దిగులు చెందకు. శ్రీరాముడు ధర్మపరుడని నీవే చెప్పావు. అతనికీ, నాకూ ఎట్టి శత్రుత్వం లేదు. నన్ను చంపి ఆ ధర్మపరుడెందుకు పాపం కట్టుకుంటాడు. సుఖంగా అంతఃపురంలో ఉండు. నీ పతిభక్తితో హితం చెప్పావు. నీ ధర్మం నీవు చేశావు.

"రాజుగా నా ధర్మం నేను చెయ్యాలి. పగవాడు కిష్కింధకు వచ్చి భీకరాలు పలుకుతుంటే అంతఃపురంలో స్త్రీ మధుపాన కౌగిలిలో ఉంటే నేను బ్రతికుండీ మరణించినట్టే.

"సుగ్రీవుడిని వదలి పెట్టను. పిడి గుద్దులతో అవయవాలన్నీ ఛిద్రం చేస్తాను. వాడి ప్రాణం తియ్యకుండా పొగరు అణిచి వేస్తాను" చెప్పాడు వాలి.

తార భర్తకు జయం కలగాలని స్వస్త్యయనాది మంత్రములు చదివింది. విజయ మంత్రాలను పఠించింది. దగ్గరుండి సాగనంపింది.

## వాలి వధ

వాలి కొండ గుహ చెలియ నుంచి బైటపడ్డ మహా సర్పంలా బుసలు కొట్టాడు. సుగ్రీవుడి కోసం వెతికాడు. అరుపులు వినవచ్చిన దిశగా వెళ్ళాడు.

వాలిని చూస్తూనే సుగ్రీవుడు వస్త్రం బిగించి తొడచరిచాడు. విరుచుకు పడ్డాడు. వాలి పిడికిలి బిగించి సుగ్రీవుడి ముఖం మీద ముష్టిఘాతాన్నిచ్చాడు. ప్రతిగా సుగ్రీవుడు వేళ్ళు ముడిచి పిడికిలితో వాలి రొమ్ము మీద గుద్దాడు.

సుగ్రీవుడు పెద్ద వృక్షాన్ని పెకిలించి దానితో వాలిని బాదసాగాడు. అధికమైన పుస్తువులతో ప్రయాణిస్తున్న ఓడలా కదిలాడు వాలి.

వాలి చేతులనే వజ్రాయుధంలా చేసి మహావృక్షాన్ని అడ్డుకొని విరిచేశాడు. వాలి వ్రేళ్ళు బిగించి పిడికిలితో గట్టిగా కొట్టాడు. ఇద్దరూ యుద్ధ విద్యలో ఆరితేరిన వారు.

సూర్య చంద్రుల్లాంటి వారి యుద్ధం జరిగే కొద్దీ వాలి బలం పెరగసాగింది. సుగ్రీవుడు ఒళ్ళంతా వాలి గోళ్ళతో చీరుకు పోయింది. ఇద్దరికీ ఒళ్ళంతా గీరుకుపోయింది. రక్తంతో తడిసిపోయారు. ఉరుములు గల మేఘాలు కొట్టుకున్నట్టు కొట్టుకున్నారు.

సుగ్రీవుడు శక్తి సన్నగిల్లింది. శ్రీరాముని కోసం చూశాడు. సర్పమువంటి బాణాన్ని శ్రీరాముడు సంధించాడు. యముడు కాలచక్రాయుధాన్ని లాగినట్టు పూర్తిగా లాగాడు. మహా ప్రచండ వేగంతో... గాలిని చీల్చుకుంటూ... అత్యంత వెలుగుని ప్రసరిస్తూ శ్రీరామ వింటి నుంచి వస్తున్న బాణాన్ని వాలి కనురెప్ప కాలంలో చూశాడు.

పిడుగూ, పిడుగూ రాసుకున్నట్టు ధ్వని... మంటలు మండుతూ వాలి వక్షస్థలాన్ని చేధించింది. మహాగర్వంతో విర్రవీగిన వాలి విచేతనుడయ్యాడు. వక్షస్థలానికి గుచ్చుకున్న బాణాన్ని పట్టుకొని నుల్చున్నపళంగా వాలిపోయాడు. నేలకూలిన అశోక వృక్షమయ్యాడు. సమస్త అవయవాలు నేలని తాకాయి.

మహాశివుడి లలాటము నుంచి వెలువడ్డ అగ్నిహోత్రములాంటి బాణాన్ని ప్రయోగించాడు శ్రీరాముడు.

ఆశ్వయుజ మాసం పున్నమినాడు పడతోసిన దేవేంద్రుడి ధ్వజములా కూలిపోయాడు వాలి. కంఠం కన్నీటి చేత అడ్డుకొనుట వల్ల దీనమైన శబ్దము చేస్తున్నాడు వాలి. బంగారం చేత వెండి చేత అలంకరించబడిన బాణం వాలి వక్షస్థలములో గుచ్చుకొని ఉంది.

## శ్రీరామా నీకిది తగునా!

వానరరాజు వాలి కూలి పోగానే కిష్కింధ చంద్రుడు లేని రాత్రిలా అయింది. వాలిలో తేజస్సూ, పరాక్రమమూ చెదరలేదు. దేవేంద్రుడిచ్చిన బంగారు హారం ప్రభావంతో...

అగస్త్యుడిచ్చిన దివ్యబాణం తగిలి వాలి యుగాంతంలో నేలరాలిన సూర్యుడిలా ఉన్నాడు.

"శ్రీరామా! కోదండ రామా! ఎక్కడున్నావయ్యా..." పిలిచాడు వాలి. శ్రీరామలక్ష్మణులు చెట్టు చాటునుంచి బైటికి వచ్చారు. మహాబాహుడు ప్రకాశవంతమైన తేజస్సు గల వాలిని సమీపించారు.

శ్రీరాముడిని చూశాడు వాలి.

"కోదండ రామా! అన్ని శాస్త్రాలూ చదివిన వాడివని చెప్పారు. ధర్మాన్ని ఎరిగినవాడవని, ధర్మాన్ని మాత్రమే ఆచరించేవాడివని చెప్పారు. వీరుడవట... శూరుడవట.... ముల్లోకాలూ ఎదురొచ్చినా ఆపగల ధీరుడవట... కరుణామూర్తుడవని విన్నాను.





"రాజుకి ఉండాల్సిన సమస్త గుణాలతో ధర్మకవచాన్ని ధరించావన్నారు. ఇదేనా రామా నీ ధర్మం. అపకారము చేసిన వారిని దండించుట రాజు ధర్మం. నేనేమి అపచారం చేసితిని. ఒకరితో యుద్ధం చేస్తుంటే, చెట్టు మాటున దాగి బాణాన్ని ప్రయోగించావు. సజ్జన వేషధారివైన దుర్జనుడవు...

"శ్రీరామా! నేను నిన్ను గాని, మరెవ్వరినిగాని, నా రాజ్యప్రజలని కానీ అకారణంగా శిక్షించలేదు. ధర్మం వీడలేదు. శ్రీరామా! రఘు వంశంలో జన్మించావు. లోకమంతా కీర్తించేవాడివి. నామీదెందుకయ్యా ఈ అకారణ ద్వేషం...

"శ్రీరామా! రాజును సంహరించినవాడూ, సద్బ్రహ్మణుడిని చంపిన వాడూ, గోవును చంపినవాడూ, భగవత్ అపచారకుడూ, అన్న కన్నా ముందు పెళ్ళి చేసుకున్నవాడూ, అకారణంగా ప్రాణహింస చేసినవాడూ రౌరవాది నరకానికి పోతారు.

"రామా.... చెప్పు వాటిల్లో ఏ కోవకు చెందుతావు.... రామా! మేం వానరులం... హింస చెయ్యం.... పళ్ళూ, ఫలాలే మా ఆహారం. నరులవలే జంతువుల్ని చంపి తినం. అట్టి ఈ వానరుడిని దొంగతనంగా చెట్టు చాటునుంచి చంపవల్సిన అగత్యం ఏం ఏర్పడిందయ్యా. తప్పత్రాగి స్పృహలో లేని వాడ్ని పాము కరిచినట్టు, నీ బాణంతో నన్ను కరిచావు.

"శ్రీరామచంద్రా! మహా పతివ్రత... సీతమ్మ జాడకై నన్ను అడిగినా, నాతో స్నేహ హస్తాన్ని చాచినా, నుల్చున్నపళాన ఆ తల్లిని తీసుకొచ్చి నీ ముందు పెట్టే వాడిని కదా...

"సుగ్రీవుడూ, నువ్వు కలిసింది అందులకే గదా! సీత నెత్తికెళ్ళిన రావణుడిని మించిన వీరుడను నేను. పధ్నాలుగు భువనభాండాల్లో సీతాదేవిని ఎక్కడ దాచినా, అపురూపంగా ఆ తల్లిని నీకు సమర్పించేవాడిని. సుగ్రీవుడు నాతో, నేను సుగ్రీవుడితో యుద్ధం చెయ్యడం ధర్మం. వానర రాజ్యానికి వారసులుగా మా యుద్ధం లోకధర్మం....

"నీకేమి సంబంధం రామా... రాజు అనువాడు ప్రక్క రాజ్యాల ఆంతరంగిక విషయాల్లో తలదూర్చుట వివేకమా! రాజధర్మమా... పుట్టినవాడు మరణించక తప్పదు. చావంటే భయంలేదు. బ్రతుకంటే తీపిలేదు. క్షత్రియ వంశంలో జన్మించావు. శస్త్రాభ్యాసము చేశావు. ఇట్టి క్రూరమైన పని చేయుట తగునా?" అడిగాడు వాలి.

# శ్రీరాముని ఉపదేశము

"వానర వీరా! వాలీ...ఇక్ష్వాకు వంశం మాది. అంటే ఈ భూమంతా మాది. ఈ భూమిపై ఉండే వానరులే కాదు, పశు, పక్షు, మృగాలని సహితం దండించే అధికారం నాకుంది.

"ప్రస్తుత రాజు భరతుడు. ధర్మపాలకుడు. సత్యసంధుడు. నీతిజ్ఞుడు. ధర్మహాని చేసిన వారిని శిక్షిస్తూ రాజ్యపాలన చేస్తున్న భరతుడు నా తమ్ముడు.

"నీవు ధర్మ విరుద్ధంగా ప్రవర్తించావు. సోదరుడి భార్యని నిర్బందించావు. రాజధర్మం వీడి మీ ఇద్దరికీ ఉమ్మడి భార్యగా ఇచ్చిన తారతో ఒక్కడివే గడిపావు. నీవు ఒక్కడివే అనుభవించావు.

"జరిగిందేదో తెలుసుకోకుండా... నిందలు మోపి రాజ్యభ్రష్టుడిని చేశావు. తమ్ముడి భార్యతో భోగించావు. మహాత్ముడైన సుగ్రీవుడు భార్య రుమ నీకు కోడలు వంటిది. కామంతో ధర్మం తప్పి తమ్ముడి భార్యతో వ్యభిచరించావు. కూతురూ, చెల్లెలూ, తమ్ముడి భార్యనీ ముగ్గురిలో ఎవ్వరితోనైనా సంగమించినవాడు భూమి మీద ఉండుటకు అనర్హుడు.

"వాలీ! భరతుడు రాజై ఉన్నాడు. ధర్మమార్గం ప్రకారం నిన్ను క్షమించకూడదు. అందుకే శిక్షించాను. భార్య కోసమూ, రాజ్యము కోసమూ ఏర్పడిన స్నేహం కాదు నాదీ, సుగ్రీవునిది.

"ధర్మ రక్షణ కోసం... ధర్మం పాటించేవాడు ధర్మజ్ఞుడు అయిన స్నేహితుడినే ఎన్నుకుంటాడు. అధర్మపరుడైన నీవంటి వారి సహాయం తీసుకొని వైదేహిని ఎలా కనిపెడతానని అనుకున్నావు... అట్లు చేసినచో ధర్మానికి అర్థమే మారిపోతుంది...

"ఇక చెట్టు చాటు నుంచి కొట్టినాను అన్నావు! ఇంట్లో చేరిన కాల సర్పాన్ని ఎవరూ ఎదురుగా వెళ్ళి కొట్టారు. నీతో యుద్ధం చేయు వారి శక్తిని గ్రహించే వరమున్నది నీకు. నేను రాజును. క్రూర మృగాలనీ, కాల సర్పాలనీ చాటునుంచే వేటాడతాను.

"నీవు ఎన్ని విధాలుగా చూసినా అపరాధివి. రుచి మరిగిన పులివి... నీవు బ్రతికుండ అనర్హుడవు. దుష్టజంతువ్వి... అట్టి నిన్ను ఉపాయంతోనే సంహరించవలెను. నీవు వానరుడవు కావు. అధర్మ భక్ష జంతువువి...

"వాలీ... పాపం చేసిన వాడిని దండించకుండా వదిలిపెడితే ఆ పాపం వదిలిన వాడికి చుట్టుకుంటుంది. నీ వలె పూర్వం శ్రమణకుడు అని





ఒకడున్నాడు. మహాపాపి. మా పూర్వుడు మాంధాత చక్రవర్తి అతనికి మహా ఘోరమైన శిక్షను విధించాడు.

"వానర రాజా... రాజుకి తెలియకుండా తప్పించుకొని ఎన్ని రోజులైనా పాపకర్మలు చేయవచ్చును. ఆ పై రాజుకి దొరికి లేదా తెలిసిననాడు అతనికి శిక్ష తప్పదు.

"పాపాలు చేసినవాడికి రాజు శిక్ష విధించినట్లైతే అతని పాపాలు పోవటంతో పాటు రాజు కూడా పుణ్యలోకాలకి వెళతాడు. వాలీ.. దేవతలే మనుష్యరూపంలో పుట్టి రాజై ధర్మాన్ని కాపాడతారు. అట్టి రాజే అధర్మం చేస్తే రాక్షసుడవుతాడు. శిక్షింప దగ్గవాడు అవుతాడు" చెప్పాడు శ్రీరాముడు.

వాలి దుఃఖపడ్డాడు. శ్రీరాముడిని ఆర్తిగా చూశాడు.

"రామా! శ్రీరామా! సమస్త ధర్మాలు తెలిసిన పండితుడవు. నా అజ్ఞానము వల్ల అప్రియాలు ఎన్నో చేశాను. వరబలంతో విర్రవీగాను. నా అపరాధాలకీ, దోషాలకీ సరియైన శిక్షయే....

"శ్రీరామచంద్రా! ధర్మాన్ని అతిక్రమించాను. నేను శిక్షార్హుడనే. కానీ నా కొడుకు అంగదుడు. పిల్లవాడు. గుణవంతుడు. అతి గారబంగా పెంచాను. నా ముద్దుల తనయుడు. వర్షంలేక ఎండిపోయిన చెరువులా ఎండిపోతాడేమో నీవే రక్షించవలెను. తార కన్న బిడ్డ. మహావీరుడూ, బలవంతుడూ అయిననూ తండ్రిలేని చిన్నవాడు.

"శ్రీరామా! నాది ఒక్కటే వేడుకోలు. సుగ్రీవుడనూ, అంగదుడనీ ఒక్కటిగా చూడు. సుమిత్రకు ఎంతో ఆనందాన్నిచ్చినవాడూ, శత్రుసంహారకుడూ అయిన లక్ష్మణుడని ఎంతప్రేమగా అక్కున చేర్చుకుంటున్నావో నా అంగదుడిని అట్లే చూసుకో...

"తార అపరాధం ఏమియునులేదు. బలవంతుడూ, భర్త ఒక్కరే అయినప్పుడు ఏ భార్య అయినా అట్లే చేస్తుంది. సుగ్రీవుడు తారను చిన్నతనంగా చూడకుండా చూడు స్వామీ.

"నేను పోతున్నానని బాధలేదు. సంతోషంగా ఉంది. శ్రీరామ బాణానికి హతమగుట కన్నా భువిలో పుణ్యలోకప్రాప్తి ఏమున్నది" చెప్పాడు వాలి.

సుగ్రీవుడు రోదించాడు. వాలిని పట్టుకున్నాడు.

"అన్నా వాలీ... అంగదుడని నా కన్న కొడుకులా చూసుకుంటాను. కిష్కింధకు యువరాజును చేస్తాను."

మహావీరుడైన వాలి శ్రీరాముడికి చెప్పాడు.

"మహాపూజ్య శ్రీరామచంద్రా! దేవేంద్రుడి కంటే ఉన్నతుడవు. ధర్మాపథానువర్తివి. పురుషోత్తముడవు, సర్వజ్ఞుడవు, రణశూరుడవు, నా అపరాధాలు క్షమించు...." చెప్పాడు వాలి... సుగ్రీవుడు కన్నీరు కార్చాడు.

★★★ ★★★ ★★★

వానరశార్దూలమూ, మహావీరుడూ, కిష్కింధరాజు అయిన వాలి శ్రీరాముని బాణానికి కూలి పోయాడని, తారకి తెలిసింది. అప్రియాన్ని విని తట్టుకోలేకపోయింది. పుత్రుడు అంగదుడ్ని వెంట బెట్టుకొని నాథుడ్ని చూడటానికి బైలుదేరింది.

గుహలాంటి కిష్కింధలోంచి బైటికి రావటంతో వానర వీరులు భయకంపితులై చెల్లాచెదురవుతున్నారు. మహావీరులైన వానరులు యుద్ధంలో ముందు నడిచేవారు. అట్టి వీరులు రామబాణాలు తమకు తాకుతాయేమోమని కంపితులవుతున్నారు. తారకెదురెళ్ళి చెప్పారు వానరులు.

"మహారాణీ! నీవూ, అంగదుడూ రక్షణ ప్రదేశంలోకి వెళ్ళండి. శ్రీరాముడి బాణం కాలపాశమే. మహాకాంతిమంతుడూ, అవిక్రమ పరాక్రమవంతుడూ వాలి క్షణాలలో నేలకూలాడు. కాంతి విహీనం అయ్యాడు. నగర ద్వారాలు మూసివేసి కిష్కింధని కాపాడుకుందాం.

"ఓ రాణీ! సుగ్రీవాదులు ఇప్పటికే అనేక దుర్గములు ఆక్రమించుకొని ఉంటారు. యముడి రూపంలో శ్రీరాముడున్నాడు. ఎదుటకు వెళ్ళిన శత్రువుకి ప్రాణాలు మిగలవు. కొండలనూ, గుట్టలనూ, శిఖరాలనూ పిండి కొట్టిన వాలి... వజ్రాయుధ శరీరం కల వాలినే ఒకే ఒక్కబాణంతో నేలకూల్చాడు."

"ఓ వానర వీరులారా! నా భర్త వాలి సింహంలాంటివాడు. అతనే లేనినాడు ఈ ప్రాణాలెందుకు. నా నాథుడు పాదాల వద్ద నుంచే నేనూ అతని మార్గాన ప్రయాణిస్తాను. చేరుకుంటాను. వెళతాను" చెప్పింది.

ఆగమేఘాల మీద రామలక్ష్మణ, సుగ్రీవులు ఉన్న ప్రాంతానికి చేరింది. మాంసం కోసం సింహం వేటాడినట్టు పడి ఉన్నాడు వాలి. కనులు మూసి తెరుస్తున్నాడు.

వాలి మెడలో ఉన్న కాంచన మాల ప్రభావంతో ప్రాణాలు త్వరగా పోవుట లేదు. భర్త పాదాల వద్దకు పరుగున వెళ్ళి పట్టుకుంది. వంజుల పక్షిలా





రోదించింది తార... అంగదుడు తండ్రిని చూసి దుఃఖించాడు. వాలికి కళ్ళల్లోకి ప్రాణం వచ్చింది. తారను చూశాడు. ఏదో చెప్పాలనుకున్నాడు.

"వీరోత్తమా! వానరరాజా... మహాశూరుడా! పలుకు... నీ భార్యని, తారని... ఇదిగో బిడ్డ అంగదుడు... అయ్యో... పట్టు పరుపుల మీద శయనించే నీవు ఈ రాళ్ళూ, రప్పల మధ్యన పడుకున్నావా!"

"అతని భార్యని లాక్కున్నందుకు శిక్ష అనుభవిస్తావు. వద్దు అని చెప్పాను. ఈ ఒక్కరాత్రి ఆగమన్నాను. అయినా వినలేదు. భార్య మాటలెప్పుడూ భర్తకి మంచే చేస్తాయి. అయినా మీ మగవారు వినరు. కోరి కష్టాలు తెచ్చుకుంటారు. ఇక నాకూ, నా బిడ్డ అంగదునకూ దిక్కెవరు.

"సుగ్రీవా! నీవు శాంతించినావా! నీ అన్నలేడు. ఈ కిష్కింధ నీదే. పట్టం కట్టుకో... నీ రుమాదేవి ఇక నీ స్వంతం" తార ఏడుస్తోంది. మొత్తుకుంటోంది. అంగదుణ్ణి పట్టుకొని గోరువంక పిట్టవలె ఎలుగెత్తి అరుస్తోంది. ప్రాయోపవేశమే నాకు దిక్కు అని నిర్ణయించుకుంది.

## వానర వీరుడు వాలి హిత బోధ

మహా ఆకాశం నుంచి రాలిపోయిన నక్షత్రంలా ఉన్న తారని సమీపించాడు హనుమంతుడు.

"రాణీ! దుఃఖించవలదు. పాపకర్మలు తెలిసో తెలియక చేస్తుంటారు. పాప ఫలం ఎవ్వరైనా అనుభవించవలసిందే. ఊరడిల్లు... నీకు కుమారుడున్నాడు. వాడ్ని చూసుకొని కుదుటపడు. సంతాప పడవలదు. వాలి సమస్త శాస్త్రాలూ చదివినవాడు, క్షమాపరుడు... అందరూ వెళ్ళే ఉత్తమ లోకాలకే వెళుతున్నాడు. అనుచితమైన దుఃఖాన్ని వదులు."

"హనుమా! భార్యకి నూరుగురు కొడుకుల కన్నా భర్తే ముఖ్యం. ఎక్కువ. నాకు భర్తే దైవం. ఈ లోకాన గానీ, పరలోకాన గానీ వాలిని ఆశ్రయించటమే నా ధర్మం, శ్రేయము. అంతకు మించిన ఉత్తమగతి నాకు లేదు. ఆయన పడుకున్న ప్రక్కనే నేనూ పడుకుంటాను. ఈ శరీరం నుంచి ప్రాణాలు వదిలేస్తాను" చెప్పింది తార. ఆరిపోయే దీపం వంటి వాలి మిగిలిన శక్తిని తెచ్చుకున్నాడు.

కదిలాడు. చేయి ఎత్తాడు. పోయేప్రాణం కొట్టు మిట్టాడుతోంది. లేని ఓపికను కూడ గట్టుకున్నాడు. సుగ్రీవుడు వాలి దగ్గరకి వచ్చాడు.

"సుగ్రీవా! నీకు చాలా ద్రోహం చేశాను. రాజ్యం నుంచి దూరం చేశాను. నీ భార్యని లాక్కొన్నాను. నా బుద్ధి వక్రమార్గం పట్టింది. సుఖాలని తమ్ముడైన నీకు పంచకుండా ఒక్కడినే అనుభవించాను. దాని ఫలమే ఇది. ఇద్దరం కలిసి రాజ్యాన్ని పాలించే అదృష్టం లేదు.

"సుగ్రీవా! వానర రాజ్యం ఇక నీదే. నా దోషాలనూ, బుద్ధివ్యామోహాలనీ మన్నించు... సుగ్రీవా! అన్నగా అడుగుతున్నాను. అంగదుడు పసివాడు. నీ ఔరస కుమారుడిగా చూసుకో. సుఖము తప్ప దుఃఖము తెలియనివాడు. నా మీద ద్వేషంతో వాడ్ని దూరంగా ఉంచవద్దు.

"తమ్ముడా! అంగదుడు మహావీరుడు. నీతో సమానమైన శూరుడు. శత్రువులెవరైనా కిష్కింధ మీదకు వస్తే తొలుత అంగదుడే పోరాడుతాడు. వేగవంతుడు. బలవంతుడు. పిల్లవాడు. శ్రీమంతుడు అంగదుడు.

"సుగ్రీవా! తార సుషేణుడి పుత్రిక. ధర్మసూక్ష్మములతోపాటు, అతి సూక్ష్మములను కూడా ముందే గ్రహించి హెచ్చరించగలదు. ఆపదలనూ, ఉత్పాతాలనూ గ్రహించి చెప్పగల ప్రాజ్ఞురాలు. ఆమె మాటని పరగణలోకి తీసుకో. కిష్కింధని ధర్మబద్ధంగా పాలించు...

"సుగ్రీవా! శ్రీరామ చంద్రుడు ఇక్ష్వాకు వంశతిలకుడు. శ్రీరామ కార్యానికి ముందుగా శ్రీకారం చుట్టు. ఇదిగో దేవేంద్రుడిచ్చిన కాంచన మాల. విగత శరీరంపై ఉంటే కాంతి విహీనమై శక్తి కోల్పోతుంది. నా బొందిలో ప్రాణముండగానే తీసి ఇస్తున్నాను. ఈ హేమ మాలను గ్రహించు..." అంటూ వాలి తన మెడలోని కాంచనమాల తీసి సుగ్రీవునికిచ్చాడు.

"నాయనా అంగదా! ఇక సుగ్రీవుడే అన్నీ నీకు. ఆయన మాట మీరకు. శ్రీరామ మాటను ఆజ్ఞగా స్వీకరించు. ప్రియమూ, అప్రియమూ తెలుసుకో... నడుచుకో...

"సుఖ పడాల్సిన సమయంలో సుఖపడు. దుఃఖించవలసినప్పుడు దుఃఖించు... కష్టపడేటప్పుడు కష్టపడు. మనం ధర్మబద్ధంగా ఉన్నప్పుడు ఉత్పాతాలు వచ్చినా ఎంత ఎత్తు మీదున్నా నీళ్ళలా క్రిందికి జారిపోతాయి."

వాలి మాట్లాడలేకపోతున్నాడు. అంగదుడ్నీ, సుగ్రీవుడినీ, రామలక్ష్మణు లనూ చూశాడు. అలా చూస్తుండిపోయాడు. సుగ్రీవుడు ఘొల్లుమన్నాడు. వానరవీరులూ, వాలి భార్యలూ శోకాలు పెట్టారు.





కిష్కింధ రాజు వానరవీరుడు వాలి పరలోకానికి వెళ్ళిపోయాడు. కిష్కింధ ఇక పాడుబడినట్టే. పూలూ, కాయలూ, తీగలతో నిండి ఉండే ఉద్యానవనాలని ఇక ఎవరు శాసిస్తారు.

గోలభుడు అనే గంధర్వ వీరునితో పదిహేను సంవత్సరాలు భీకర యుద్ధం చేశాడు. మహావీరుడు వాలి పదహారో సంవత్సరం గోలభుడ్ని చంపేశాడు. అంతటి వీరుడు. సంవత్సరాలు, సంవత్సారాలు రాత్రీ పగలూ తేడా లేకుండా పోరాడే ఆ యోధుడిని చంపిన వారి శక్తీ, యుక్తు లేపాటివో కదా! వానరులందరిలోనూ అదే శేషప్రశ్న.

సింహం ఆంబోతుని చంపిస్తే ఆవులు చెల్లా చెదురైనట్టు అయ్యారు వానరులు. నేల కూలిన మహా వృక్షంలాంటి వాలిని పూల తీగలా పెనవేసుకొని వాలిపోయింది తార.

## సుగ్రీవుడి దుఃఖము

తార, అంగద, వానరవీరుల శోకాన్ని చూసి చలించిపోయాడు సుగ్రీవుడు. శ్రీరాముని వద్దకు వచ్చాడు.

"రామా! అగ్నిసాక్షిగా చేసిన ప్రతిజ్ఞను నిలబెట్టుకున్నావు. కానీ వాలి రక్తంతో తడిచిన ఈ నేల నా కొద్దు. రాజ్యకాంక్ష లేదు. జీవితము మీద ఇష్టం లేదు. తారాదేవి రోదన భరించ లేకుండా ఉన్నాను. అగందుడి ఆవేదన చూడలేకున్నాను.

"కారణం లేకుండా వెళ్ళగొట్టాడు. ప్రాణభయం పెట్టాడు. అనేక అవస్థలు పెట్టాడు. అందుకే అన్న మరణం కోరుకున్నారు. తీరా అది అయ్యాక నా గుండె వక్కలైపోతోంది.

"రామా! వాలి నన్ను చంపే అవకాశం ఉన్నప్పుడు కూడా నన్ను చంపలేదు. వెళ్ళు నీ ఇష్టం వచ్చిన చోటికి పో అన్నాడు. మళ్ళీ మనసు మార్చుకొని ఏ క్షణంలోనైనా చంపుతాడేమోనని భయపడ్డాను. పారిపోయాను.

"వాలి ధర్మపరుడు. నన్ను చంపుటకు ప్రయత్నం చెయ్యలేదు. సోదర ప్రేమ లేకుండా నేనే దుష్కార్యం చేశాను. క్రోధమే చేశాను. కుల నాశనం చేశాను.

"కోరరాని కోరిక కోరి పాపం చేశాను. మహాపాపాన్ని నింపుకున్నాను. అన్న వాలిది గొప్ప స్వభావం. కాని నేను భార్య కోసం, రాజ్యం కోసం అన్నని

బలి తీసుకున్నాను. వాలితో పోరాడుతున్నప్పుడు, మహా వృక్షాలను పెకిలించి నన్ను బాదుతుంటే నొప్పి భరించలేక అరుస్తుంటే ఎప్పుడూ యుద్ధానికి రాకు అని పంపేసేవాడు. తరిమేసేవాడు.

"శ్రీరామా! విశ్వరూపుణ్ణి చంపిన దేవేంద్రుడివలె నాకు మహాపాపం అంటింది. దేవేంద్రుడు కాన వరాల ద్వారా పాపాన్నీ, భూమి చవుడు రూపానా, నీరు నురుగు రూపానా, చెట్లు జిగురు రూపానా, స్త్రీలు ఋతువు రూపానా పంచుకున్నారు. ఈ మహాపాపి పాపాన్ని ఎవరు పంచుకుంటారు. నన్ను ఎవరు క్షమిస్తారు.

"శ్రీరామా! అన్నను చంపించుటకన్నా నీచమేమున్నది. వర్షపు నీరు పల్లానికి చేరినట్టు ఎక్కడెక్కడి పాపాలూ నన్ను చేరినాయి. కొలిమిలో బంగారం వేస్తే అగ్నివేడికి మకిలం దూరమవుతుంది.

"నేను ఏ అగ్నిలో పడినా, నా పాపం వీడిపోదేమో... నా మూలంగా అంగదునకూ, తారకూ శోకతాపం. దుఃఖంతో దేహం వణికిపోతోంది.

"శ్రీరామా! నాకు ఆజ్ఞ ఇవ్వు. చితి పేర్చుకొని ఈ శరీరాన్ని అగ్నికి ఆహుతి చేసుకుంటాను. అంగదుడు వానర రాజ్యానికి రాజై నీ ఆదేశంతో సీతమ్మ జాడ తెలుసుకుంటాడు. నీ కార్యం నెరవేరుస్తారు వానర వీరులు."

సుగ్రీవుడని శ్రీరాముడు ఓదార్చాడు. వాలి విగత శరీరాన్ని చూస్తున్న తార వద్దకు నడిచాడు. లోకరక్షకుడు, భూదేవితో సమానమైన సహనం కల శ్రీరాముడుని చూసింది తార. ధనుస్సూ, బాణాలతో తేజోవంతంగా ఉన్న శ్రీరాముడని తన అందమైన కనులతో చూసింది.

"దివ్యమైన లక్షణాలతో, ఇంతకు ముందెన్నడూ చూడని దివ్యరూపం. పురుషోత్తముడైన శ్రీరాముడంటే నీవేనా... మనుష్య శరీరం ధరించిన దివ్య పురుషుడివి నీవేనా... ఇక్ష్వాకు వంశ కోదండ రాముడవు నీవే కదా!

"శ్రీరామా! వాలిని చంపిన బాణంతోనే నన్ను చంపు... నేను లేకపోతే వాలి, వాలి లేకపోతే నేనూ ఉండలేం... ఎంత మంది అప్సరసలున్నా, నేను లేకపోతే దిగులు పెట్టుకుంటాడు.

"విదేహ కన్య వియోగంతో దుఃఖపడుతున్న నీకు నేను చెప్పనవసరం లేదు. అట్టి బాధే నేనూ పడుతున్నాను. నా భర్త వాలి నాదిలి ఉండలేను. నీలా వియోగంతో చిక్కిపోతాను. అట్టే నన్ను విడిచి వాలీ స్వర్గంలో దుఃఖితుడై ఉంటాడు కృశించి పోతుంటాడు.





"శ్రీరామా! మహాత్ముడవు నీవు. జితేంద్రియుడవు. కీర్తిమంతుడవు. సర్వాంగ సుందరుడవు. దివ్యమంగళ రూపుడవు. ధార్మికుడవు. రామా! నా నాథుడి బాణంతోనే నన్ను కడతేర్చు. భార్యా భర్తలను కలిపిన పుణ్యాన్ని సంపాదించుకో...

"శ్రీరామా! ఆలోచించకు. సందేహించవలదు. స్త్రీ హత్యాదోషం ఎట్టి దశలోనూ నీకు అంటదు. భార్య భర్తలో సగం. అట్టి తార వాలి ఆత్మ స్వరూపము. వేదాలను చదువుకున్న వాడివి నీకు తెలియనిది కాదు. భార్య పురుషుడి ఆత్మే కాని అన్యము కాదు. కావున నన్ను సంహరించినా స్త్రీ హత్యా దోషం క్రింద రాదు. భర్తకు భార్యను దానమిచ్చిన ఫలం వస్తుంది."

తార మాటలకు శ్రీరాముడు దయాహృదయ చూపులతోనూ, మాటలతోనూ చెప్పాడు.

"వీరపత్నీ... విచారించవలదు. సమస్త లోకాన్ని సృష్టించింది బ్రహ్మ దేవుడు. అతడే విధిని నియమించాడు. విధి బలీయమైనది. ఈ సమస్త చరాచర లోకాలన్నీ విధికే కట్టుబడి ఉన్నాయి. ఆ విధిని తప్పించుట సృష్టించిన వారికే సాధ్యం కాదు.

"వాలి మరణించాలి. అది విధి... కాన విచారం వదలి పెట్టు. స్మశాన వైరాగ్యం ఎంతటి వారికైనా తప్పదు. సుగ్రీవుడు నీ కొడుకు అంగదుడిని యువరాజు చేస్తాడు. సుఖించు. సంతోషపడు. మహావీరుల పత్నులు పిరికి వారివలె పరలోకానికి వెళాతానని అనరు. నీ వీరుడు నిన్ను క్షమించడు.

"పుత్ర ధర్మాన్ని నిర్వర్తించకుండా అకార్యం చేసుకుంటే అక్కడ ఆ లోకాన నీ భర్త నిరాదరణకు గురి అవుతావు. భర్త అయినా, భార్య అయినా రాజైనా, సేవకుడైనా ఎవరైనా సరే వారి వారి ధర్మాలను ఆచరించవలసిందే..." చెప్పాడు శ్రీరాముడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"మీరీ విధంగా శోకిస్తే మరణించిన వాలి ఆత్మకి శ్రేయస్సు లభించదు. విచారాన్ని వదలండి. జరగవలిసింది చూడండి. వాలికి ఔర్ధ్వదైహిక క్రియలు జరిపించండి.

"కిష్కింధ రాజు ఆచరించిన కర్మలను బట్టి ధర్మార్థకామాలను అనుభవించటానికి పుణ్య లోకాలకి తరలి వెళ్ళాడు. ఉత్తమ గతి చేరాడు.

"సుగ్రీవా! అంగదుడిచే పూలదండలూ, వస్త్రాలూ, నూనె, నెయ్యి, సుగంధాలూ తెప్పించు. చిత్తముతో ధైర్యము చెదిరిన అంగదుడిని ఓదార్చు... నీ దౌర్బల్యమును విడనాడు.

"తారుడా! మంచి గంధపు చెక్కలూ, కర్రలూ సిద్ధంచేయి. మోయటానికి నలుగురు వానరులను సిద్ధంచేయి" చెప్పాడు శ్రీరాముడు.

దివ్యమైన రథంలాంటి పల్లకీని సిద్ధం చేశారు. ఎర్రటి గంధం పూశారు. ఎర్ర తామర పువ్వుల దండలూ, రకరకాల పూలనూ అలంకరించారు పల్లకీకి. సుగ్రీవుడూ, అంగదుడూ వాలి శరీరాన్ని పల్లకిలోకి చేర్చారు. నవరత్నాలు చల్లుతూ నడిచారు వానరులు.

తారుడూ, సుగ్రీవుడూ, వానర వీరులూ పల్లకీ వెంట నడుస్తున్నారు. వానర స్త్రీల అరుపులూ, ఏడుపులతో కిష్కింధ మారుమ్రోగింది.

ఓ సెలయేరు వద్ద మంచి గంధపు చెక్కలతో చితి పేర్చారు. పల్లకీ చితి వద్దకు వచ్చింది. తార దిక్కులు పగిలేలా రోదిస్తోంది.

"ఓ నాథా... మహాబాహూ... మమ్ముచూడు. నీ స్త్రీ జనాన్ని చూడు. అదిగో ఆ రాముడే యముడి రూపంలో వచ్చి మమ్ము అందరిని విధవలగా చేశాడు. నిన్ను మాకు దూరం చేశాడు. చందమామ లాంటి మోహాలు కల వానర స్త్రీలూ, నేనూ నీ దగ్గరే ఉన్నాం. అందర్నీ పంపేయ్. మా అందరితో మన్మథ క్రీడలు జరుపు..."

వానర స్త్రీల రోదన ధ్వనులతో వనములూ, పర్వతములూ కూడా శోకించినట్టు మౌనం వహించాయి.

"అయ్యో... వానరుడా! వాత్సల్యవంతుడా, మహాభోగములు అనుభవించిన వాడా... నన్ను చూడు. చంద్రునితో సమానమైన ముఖములు గల నీ భార్యలందరినీ చూడు. నీ స్త్రీ వ్యామోహమూ, ధన వ్యామోహమే కదా మాకూ, నీకూ ఈ దుస్థితి తెచ్చింది" రోదిస్తూ తల పట్టుకుంటూ అరుస్తున్న తారను వానర స్త్రీలు ఓదార్చారు.

అంగదుడు సుగ్రీవుని సాయంతో పల్లకీ మీద ఉన్న వాలి శరీరాన్ని పర్వతము నుంచి ప్రవహించే నదీ తీరాన నలువైపుల జలమున్న నిర్జనమైన ఇసుక తిన్నె పై నున్న చితి పైకి చేర్చాడు. అంగదుడి చేతిలో మండుతున్న దివిటీ.





"తండ్రీ! కానరాని లోకాలకు వెళ్ళిపోయావు. ఇక నీ రూపం కూడా కానరాదు" అని కడసారి చూసి చితికి నిప్పు పెట్టాడు. అగ్నిదేవుడు మధ్యాహ్న ఆకలిలా ఆక్రమించుకున్నాడు.

శాస్త్ర ప్రకారంగా శీతల జలాలు ప్రవహిస్తున్న సెలయేరు వద్దకు వెళ్ళి జల తర్పణాలు చేశారు.

## వానర వీరుడు సుగ్రీవుని పట్టాభిషేకం

తడిబట్టలతోనే సుగ్రీవుడూ, వానర ప్రముఖులూ శ్రీరాముని వద్దకు వచ్చారు. సృష్టికర్త బ్రహ్మ వద్ద నుంచున్న మహా ఋషుల్లా, విధేయంగా చేతులు కట్టుకున్నారు. హనుమ విన్నవించాడు.

"రామా! వానర రాజ్యం సుగ్రీవుడ్ని వరించింది. హితులందరినీ వెంటబెట్టుకొని కిష్కింధలో ప్రవేశించి, మహారాజ్యమైన వానర రాజ్యానికి పట్టాభిషేకుడవుతాడు సుగ్రీవుడు. మహా కోరలు కలిగిన బుద్ధిశాలి. అధిక బలశాలి. సుగంధ ద్రవ్యములతోనూ, ఔషధులతోనూ రాజ్యాభిషిక్తుడై అన్ని కార్యములు చక్కపరుస్తాడు.

"ప్రభూ! లక్ష్మణుడితో కలిసి వానరరాజు సుగ్రీవుని పట్టం జరిపించవలెను. కాన తమరు దయ చేయవలసినదిగా కోరుటమైనది" చెప్పాడు హనుమంతుడు.

"హనుమా! సౌమ్యుడా! నా తండ్రి ఆజ్ఞను పాటిస్తున్నాను. నేను వనవాస దీక్షలో ఉన్నాను. పట్టణాలలోకిగానీ, గ్రామాల్లోకి గానీ వెళ్ళరాదు. నియమ బద్ధుడునై ఉన్నాను.

"మంచి గుహలతోనూ, ఉద్యానవనాలతోనూ, పూలూ, చెట్లతో ఉన్న కిష్కింధకి వెడలి సుగంధద్రవ్యాలతోనూ, ధన కనక వాహన వస్తువులతోనూ సుగ్రీవుని పట్టాభిషేకం జరిపించండి" చెప్పాడు శ్రీరాముడు.

హనుమంతునికి చెప్పి సుగ్రీవునితో అన్నాడు.

"వానరరాజా! పట్టాభిషేకుడివి కమ్ము. రాజ్యాన్ని ధర్మబద్ధంగా పాలించు. వీరుడైన అంగదుడను యువరాజుగా ప్రకటించు. మీ వంశానికి జ్యేష్ఠుడు. పరాక్రమంలో నీతో సరిసాటి అయిన అంగదునకు యువరాజు పట్టాభిషేకం వైభవోపేతంగా జరిపించు.

"ఓ సుగ్రీవా! వర్షఋతువుకి శ్రావణము తొలి మాసం. సీత జాడకై బైలుదేరు సమయం కాదు. వర్షాకాలములో ఎక్కువ వర్షములు కురియు

మాసం శ్రావణమాసము. ఈ నాలుగు మాసాలూ కిష్కింధ రాజుగా సమస్త సుఖాలు అనుభవించు. అదిగో ఆ పర్వత గుహలో నేనూ, నా తమ్ముడూ నివశిస్తాము. ఆపై సీతాన్వేషణ ప్రయత్నం చేద్దాం.

"ఆ పర్వత గుహ ఎంతో రమ్యంగానూ, మనోహరంగానూ ఉంది. చక్కటి గాలీ, వెలుతురూ వస్తోంది. దగ్గరిలో కందమూల ఫలాలు సమృద్ధిగా లభిస్తున్నాయి. వానాకాలం అవ్వగానే కార్తీక మాసం వస్తుంది. సీత జాడకూ, రావణ వధకూ శ్రీకారం చుడదాం" చెప్పాడు శ్రీరాముడు.

సుగ్రీవుడు శెలవు తీసుకొని కిష్కింధ చేరాడు. వానర వీరులందరూ సుగ్రీవుడ్ని ఆహ్వానించారు. సుగ్రీవుడు అందరినీ ఆదరించి నేలపై పడి నమస్కరించిన వారిని లేవదీసి వారితో చక్కగా మాట్లాడి అన్నగారి సుందర భవనమైన అంతఃపురానికెళ్ళాడు. తారను వశం చేసుకున్నాడు.

వానర వీరులు భయంకర పరాక్రమం గల సుగ్రీవుడికి పట్టాభిషేకం ఏర్పాట్లు చేశారు. బంగారు కర్రతో చేసిన తెల్ల గొడుగు పట్టారు. కనక పిడులతో చేసిన వింజామరలతో విసిరారు. నవరత్నాలూ, నవధాన్యాలూ, రత్నాలూ, వనమూలికలూ, చక్కటి పూలూ, పట్టు వస్త్రాలూ, అత్తర్లూ, చందనాలూ, కమలాలూ, బంగారు అక్షితలూ, కుంకుమ పువ్వులూ, తేనె, నెయ్యీ, పెరుగూ, పులితోలూ, అడవి పందితో చేసిన చెప్పులూ, తెల్లని వింజామరులూ, తెల్లని మై పూతను సిద్ధం చేశారు.

సుగ్రీవునకు గోరోచనమూ, తిలకమూ, నలుగూ పెట్టడానికి పదహారు కన్నెపడుచులు వచ్చారు. సద్ బ్రాహ్మణులను పూజించి, కానుకలిచ్చారు. అగ్నిహోత్రం వెలిగించారు. మంత్రవేత్తలు దర్భలు పరిచి హవిస్సు హోమం చేశారు.

కనకపు కోళ్ళుగల సింహాసనం సిద్ధంచేశారు. ఆ సింహాసనంపై తూర్పు ముఖంగా సుగ్రీవుడని కూర్చోబెట్టారు. పుణ్యతీర్థాల నుంచీ, సముద్రాల నుంచీ తెచ్చిన పవిత్ర జలాలను బంగారు కుండల్లో పోశారు. ఎద్దు కొమ్ములతో చేసిన పాత్రలతోనూ, బంగారు కలశాలతోనూ సుగ్రీవుడిని అభిషేకించారు.

వసువులు దేవేంద్రుడికి అభిషేకం చేసినట్టు శ్రేష్ఠమైన ఆసనంపై చక్కటి రాగయుక్త మంత్రోచ్చారణం చేస్తూ తూర్పు వైపుగా ముఖాన్నుంచి కూర్చోబెట్టారు. సుగ్రీవునకు వానర వీరులు అంతా అభిషేకించారు.





గజుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ, నలుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ సుగ్రీవుడిని అభిషేకించి జయజయ ధ్వనులు చేశారు.

సుగ్రీవుని పట్టాభిషేకమవ్వగానే అంగదుడిని సుగ్రీవుడు కౌగిలించుకొని కిష్కింధకు యువరాజుగా ప్రకటించాడు. రామలక్ష్మణులను సభాముఖంగా స్తుతించాడు. పతాకాలతోనూ, ధ్వజాలతోనూ కిష్కింధ మెరిసిపోయింది.

భార్య రుమనూ, వానర వీరులనూ వెంటబెట్టుకొని శ్రీరామ దర్శనము చేసుకొని రాజ్యాభిషేక విషయాలన్నీ విన్నవించి శ్రీరామ ఆశీర్వాదంతో తిరిగి కిష్కింధ వచ్చి భార్యతోనూ, హితులతోనూ, సన్నిహితులతోనూ రాజ్యాన్ని పరిపాలించసాగాడు.

## ప్రస్రవణగిరి

శ్రీరాముడు లక్ష్మణుడితో కలిసి ఋష్యమూకం వచ్చాడు. సింహాలూ, పులులూ, భయంకరంగా గర్జిస్తున్నాయి.

జింకలూ, లేళ్ళూ, కోతులూ, కొండముచ్చులూ పిల్లలవలే కేరింతలు కొడుతున్నాయి. లతలతోనూ, వృక్షాలతోనూ, జలాశయాలతోనూ ఉన్న ఋష్యమూక పర్వతాల్లోని ప్రస్రవణగిరి చేరారు.

రామ లక్ష్మణులు ఆ పర్వతంలో చక్కటి గుహని చూశారు. దోషమన్నది లేనివాడూ, రఘువంశ ఆనందానికి కారకుడూ అయిన శ్రీరాముడు చెప్పాడు.

"లక్ష్మణా! ఈ గుహ అనేక ధాతువులతో చక్కగా ఉన్నది. ఈ మూడు మాసాములు మన బస ఇచ్చటనే. ఈ ప్రక్కన సెలయేళ్ళు, చక్కటి ఫల వృక్షాలూ ఉన్నాయి.

"నెమళ్ళూ, కోయిలల కూతలూ వినసొంపుగా వినవస్తున్నాయి. జాజులూ, మల్లెలూ, విరగపూసి ఉన్నాయి. మాలతీ లతల పొదలూ, మల్లెతీగల పొదలూ, సింధువారములూ, శిరీష, కదంబ, అర్జున, సర్జ వృక్షములు ఈ ప్రస్రవణగిరి పర్వతానికి మరింత శోభని సమకూరుస్తున్నాయి.

"అందమైన తామర కొలను. సుందరమైన దృశ్యాలతో బహురమ్యంగా ఉన్నది. మన నివాస గుహ వాకిలి నైరుతి దిశను ఉన్నది. ఈశాన్యంగా వచ్చే వర్షపు జల్లుపడదు. పడమర మెరకగా ఉంది. తూర్పు చలిగాలి లోపలకి రాదు. కాన వాస్తు రీత్యా నివాస ప్రదేశం.

"లక్ష్మణా! తెల్లటి శిఖరం చూడు. ధాతువులతో కైలాస శిఖరంలా ఉంది. తూర్పుగా పారుతున్న నది నీటిని చూడు. ఎంత నిర్మలంగా ఉన్నాయో జలాలు.

"నది కిరువైపులా సంపెంగ చెట్లూ, బొట్టుగూ, సరళ వృక్షాలూ, అశోక వృక్షాలూ, పొగడ చెట్లూ, తినాసపు చెట్లూ ముచ్చటగా అగుపిస్తున్నాయి.

"ఆ నది చూడు త్రికూట పర్వతం దిగుతున్న గంగానదిని గుర్తుకు తెస్తోంది. ఆ ఇసుక తిన్నెలలో చక్రవాక పక్షులూ, హంసలూ, సారస పక్షులూ జతగాళ్ళతో కలిసి ఎలా ఆడుతున్నాయో... ఈ నది చక్కగా ప్రియుడి కోసం అలంకరించుకొని నవ్వుతున్న స్త్రీలా ఉంది.

"నల్లకలువలతో, ఎర్రకలువలతో పేరంటానికి వెళుతున్న ముత్తైదువులా ఉంది కదూ... అదిగో వినపడుతున్నాయా దగ్గరిలోని కిష్కింధలో వానర వీరులు చేస్తున్న డప్పుల చప్పుళ్ళు...

"సుగ్రీవుడు భార్యతోనూ, సకల సంపదలతోనూ సంతోషంగా జీవిస్తున్నాడు" చెప్పాడు శ్రీరాముడు.

రాత్రి అయింది. ఉదయ పర్వతంపై చంద్రుడు కానవచ్చాడు. ఆకాశాన చంద్రుడు నెమ్మదిగా కొత్త పెళ్ళికూతురిలా నడుస్తున్నాడు. శ్రీరాముడు సీత గూర్చి దిగులు పడ్డాడు.

"రామా! దుఃఖించకు. ఇంకెంత వర్షాకాలం మూడు నెలలు దాటగానే కార్యాన్ని పూర్తి చేస్తారు వానరవీరులు. ఇక్ష్వాకు వంశ బాణ రుచి రావణునకు చూపించి, సీతమ్మని విడిపిద్దాం. శత్రువుని చంపే శక్తి దుఃఖం వల్ల సన్నగిల్లుతుంది. దుఃఖించుట వల్ల పనులు చెడిపోగలవు. నీ శక్తితో అనతి కాలంలోనే సపరివారంగా రావణుడు చస్తాడు.

"రామా! సముద్రాలూ, అడవులూ, భూమినీ ఏదైనాసరే నీవు తలక్రిందులుగా చెయ్యగలవు. శరత్కాలం దాకా నిరీక్షించుదాము. రావణుడెంత?" శ్రీరామునకు చెప్పాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా! హితమైన, పరాక్రమమైన పలుకులు పలికావు. నదులు పొంగేదాకా, శరత్కాలం వచ్చేదాకా ఓపిక పడతాను. ఉపకారికి ప్రత్యుపకారం చేసే సుగ్రీవుడూ, మనమూ వానాకాలం వరకూ వేచి ఉందాము" చెప్పాడు శ్రీరాముడు. రామలక్ష్మణులు పర్వతాల్లో తిరిగే సింహాల్లా ఆ పర్వతం మీద ఉండసాగారు.





## వానాకాలం వచ్చింది

"లక్ష్మణా! వానాకాలం ప్రారంభమైంది. మహా కొండలాంటి మేఘాలు చూడు కార్తీక మాసం నుంచి ఆషాఢ మాసం వరకూ నవమాసాలు మోసి రసాయాన్ని ప్రసవిస్తున్నట్టుగా కానవస్తోంది. ఆ మేఘాల వరుస చూడు. ఆ శిఖరం మీద నుంచి మేఘాల మెట్ల మీదగా వెళ్ళి సూర్యునికి దండలూ, పూలూ, ఫలాలూ అర్పించ వచ్చుననిపించుట లేదూ...

"ఆకాశం సంధ్యారాగంతో చందనము పూసుకొని తొలిరాత్రి పెళ్ళి కొడుకులా కానవస్తోంది. విరగ పూసిన మద్ది చెట్లతో, మొగలి పువ్వుల సువాసనలతో ఈ మాల్యవంత పర్వతం సుగ్రీవునిలా, మహారాజులా ఉంది కదూ... మేఘ మధ్యముల నుంచి బైలుదేరి కర్పూరదళమువలె మొగలి పూల సువాసనలతో వీచే గాలులను దోసిళ్ళతో త్రాగాలనిపిస్తోంది.

"లక్ష్మణా! నల్లటి మేఘం మధ్య మెరుస్తున్న మెరుపు చూడు. రావణుడి చెర నుంచి తప్పించుకోవటానికి పెనుగులాడుతున్న సీతలా అగుపిస్తున్నది.

"గాలి దుమారము లేదు. చల్లటి గాలి వీస్తోంది. మేఘాలు కమ్ముకొని చీకట్లు ఆవరించాయి. సూర్యుడూ, చంద్రుడూ వారి వారి ఇండ్లకు భార్యలతో ఊసులాడుకుంటానికి వెళ్ళినట్లున్నారు.

"అదిగో కొండనెత్తాలతో విరగ పూసిన కొండమల్లెలు ఎలా ఊగుతున్నాయో, ప్రియుని సుమాగమునానికి ఆహ్వానించే ప్రియురాళ్ళవలే ఉన్నాయి. హసిత వదనాల్లా ఉన్నాయి.

"హంసలు మానస సరస్సుకి తరలిపోయాయి. చక్రవాక పక్షులు పెనిమిటి పిట్టలను వదలక తిరుగుతున్నాయి.

"కొండవాగులు, పర్వతాల నుంచి వచ్చిన ఎర్రనీటితో, కొత్తనీళ్ళతో కొత్త చీర కట్టుకున్న పడుచు పిల్లలా ఎలా ఓయ్యారాలు పోతున్నవో... వర్షానికి మామిడి పండ్లు రంగూ, రుచీ, వాసనా చెడి నేలరాలుతున్నాయి. నదులన్నీ సముద్రుడిని చేరటానికి ఎంత తొందర పడుతున్నాయో చూడు.

"వర్షానికి ఏనుగులు మొగలి పువ్వుల వాసన పీల్చి ఆనందంగా ఘీంకరిస్తున్నాయి. కొండ సెలయేళ్ళు నెమళ్ళతోనూ, కోకిలలతోనూ పోటీ పడి అరుస్తున్నాయి. ఓ దగ్గర తుమ్మెదలు పాటలు పాడుతున్నాయి. మరో దగ్గర నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి. మరోప్రక్క కోకిలలూ, ఇతర పక్షులూ

కబుర్లు చెప్పుకుంటున్నాయి. ఇంకో ప్రక్క తుమ్మెదలు వీణలు మీటుతున్నట్టు ధ్వనులు సృష్టిస్తున్నాయి.

"ఏనుగులు మదించి తిరుగుతున్నాయి. ఆంబోతులు అరుస్తుంటే సింహాలు గుహల్లో వెచ్చగా పడుకొని ఉన్నాయి. దేవతలందరూ పెద్దపని పెట్టుకున్నట్టు పోటీపడుతూ బంగారు కడవలతో నీరుని భూమి మీదకు పోస్తున్నట్టు ఆ వర్షపు వేగం చూడు...

"చిగురుటాకుల మీద, పెద్ద పెద్ద ఆకుల మీద పడ్డ నీటి శబ్దం, ఆకూ, నీరూ కలిసి చేస్తున్న సవ్వడికి గుండె ఝల్లుమంటోంది.

"వానాకాలం రాజులు దండయాత్రలు చేయరు. దూరతీరాలకి వర్తకం నిమిత్తం వెళ్ళిన పురుషులు తిరిగొచ్చే కాలం.

"ఆకలీ, కామమూ వృద్ధి అయ్యే కాలం. హంసలు మానస సరస్సు చేరుటకై బైలుదేరుతున్నవి. చక్రవాక పక్షులు ప్రియురాళ్ళతో కలిసి ఉన్నాయి. నిద్రమెల్లగా శ్రీమహావిష్ణువుని చేరుతున్నది. ఆడ కొంగ మేఘం వైపు ఎగురుతోంది. నెమళ్ళు నాట్యం చేస్తున్నాయి.

"గూళ్ళలో పిట్టలు దూరితే, తామరులు పడుచు పిల్లలా ముడుచుకుపోతే, మాలతీపూలు వికసిస్తే గాని పొద్దుగూకిందని తెలీదు.

"లక్ష్మణా భాద్రపదం వచ్చేసింది. భరతుడు చాతుర్మాస్య వ్రతం ఆరంభించివుంటాడు. అయోధ్యలో పౌరులు ఆ వర్షానికి ఇంట్లోని ఉండి రుచికరమైన పదార్థాలూ, ఫలహారాలూ తింటూ ఆనందంగా భార్యపిల్లలతో ఉండి ఉంటారు.

"సుగ్రీవుడు ఈ వర్షంలో భార్యతో సుఖాలు అనుభవిస్తుంటాడు. సీత జాడకై వెనువెంటనే బైలుదేరుదామన్నా వద్దన్నాను. వానాకాలం అయ్యేదాకా ఆగమని ఒప్పించాను.

"ఎన్నో కష్టాల తర్వాత భార్యని కలిశాడు. అందుకే తొందర పడవద్దన్నాను. వానాకాలం అయ్యేదాకా తనవి తీరా సుఖాలని పొందమన్నాను. గడువు తీరగానే సుగ్రీవుడు ప్రత్యుపకారం చేస్తాడు" చెప్పాడు మానవనాథుడు మహావీరుడు శ్రీరాముడు.

"శరత్కాలం దగ్గరిలోనే ఉంది. అట్లే శత్రువు సంహారం కూడా" చెప్పాడు లక్ష్మణుడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆





ఆకాశము తేట పడింది. సారసపక్షులు చక్కగా కూస్తున్నాయి. మేఘాలూ, మెరుపులూ కానరావటంలేదు. రాత్రి వెన్నెల పచ్చపువ్వులా కాస్తోంది. కిష్కింధలో సుగ్రీవుడు మధు, సరసాల్లో తేలియాడుతున్నాడు. స్త్రీలతో రహస్య ప్రదేశాలల్లో గడుపుతున్నాడు.

సకల మనోరథములను, భార్య రుమతోనూ, ప్రియమైన తారతోనూ తీర్చుకుంటున్నాడు. శ్రీరామ మాట తలచక భోగలాలసుడై నిత్యమూ పరిజనంతో పొంగిపోతున్నాడు.

దేవతలరాజు దేవేంద్రుడిలా నిత్యం అందగత్తెల నాట్యమూ, మదువూ, మనోహరమైన హిత మాటలూ అవే నిత్య సుగ్రీవుని దినచర్య.

రాజ్యపాలన మంత్రులకు వదిలేశాడు. హనుమంతుడు పరిస్థితి గమనించాడు. కర్తవ్య ధర్మంతో సుగ్రీవుని చెంత చేరాడు.

"రాజా! వానరవీరా! రాజ్యం వచ్చింది. భార్య చెంతనే ఉంది. వర్షాకాలమంతా దేవేంద్రుడిలా సుఖాలు అనుభవించావు. ధనాగారాన్నీ, సైన్యాన్నీ పెంచవలిసిన అవసరం ఏర్పడింది. శ్రీరామ కార్యానికి సంసిద్ధుడవై కదలాలి. సదాచారసంపన్నుడవు. పుణ్యామార్గం తెలిసిన వాడవు. కోశాగారమూ, సైన్యమూ, మిత్రులూ, పరిపాలనా శక్తీ నాలుగూ సమంగా సమర్థవంతంగా చూసుకున్నవాడే గొప్పరాజు అవుతాడు.

"మిత్రుని కార్యాన్ని అలక్షణం చేసిన వాడికి మహా కష్టాలు ఎదురువుతాయి. కాలం దాటిన తర్వాత ఏం చేసినా నిష్ప్రయోజనమే, వ్యర్థమే.

"శ్రీరామచంద్రుడు సర్వమూ తెలిసిన కాలవిదుడు. అందులకే వర్షాకాలం సుఖంగా ఉండమన్నాడు. కార్తీక మాసంలో సీత జాడకై బైలుదేరాలని చెప్పాడు. నీవు ఆజ్ఞాపించితే పాతాళములో గానీ, భూమి పై గానీ, జలములో గానీ, ఆకాశమునందు గానీ ఎందూ అడ్డే లేదు. శ్రీరాముడి కార్యం దైవ కార్యంతో సరిసమానం.

"అది విస్మరిస్తే వానర రాజ్యమూ, నీవూ, నేనూ, అంతా దుఃఖించ వలసి ఉంటుంది. అంతటి అనర్థానికి కారణం కాకుండా మేల్కొనవలెను. సీతమ్మ జాడకై ఆజ్ఞలు జారీ చేయవలెను. జాగు చేయుట తగదు. భూమీ, ఆకాశమూ, పాతళమూ వీటి యందు ఎక్కడున్నా సీతమ్మ జాడ తెలుసుకొనవల్సిన సమయము ఆసన్నమైనది" సరళంగా, వినయంగా, స్నేహం అర్థస్వభావాన్ని ఎరిగిన హనుమంతుడు సుగ్రీవుడికి చెప్పాడు.

సుగ్రీవుడు హనుమ పలుకులతో బాధ్యతెరిగి చెప్పాడు.

"హనుమా! రామకార్యాన్ని చక్కబెడతాను. వానర వీరులందరిని పిలిపించు. జ్ఞానులనూ, జ్ఞానవృద్ధులనూ సమావేశపరుచు. అంగదునికి చెప్పు. పదిహేను రాత్రుళ్ళలో వానర వీరులెక్కడ ఉన్నా హాజరు కావలెను. లేనిచో మరణమే శిక్ష" అని ఆజ్ఞాపించి, తన అంతఃపురానికి వెళ్ళాడు వానర శ్రేష్ఠుడూ, వీర్యవంతుడూ అయిన సుగ్రీవుడు.

## శరత్కాలము

శ్రీరాముడు వర్షాకాలమంతా సీతాదేవి తలపులతో గడిపాడు. వైదేహి గూర్చి మథనపడ్డాడు. సుగ్రీవునికి పెట్టిన గడువు దాటింది. ఆకాశం స్వచ్ఛంగా ఉంది. ప్రియుడి స్పర్శ తగిలి ప్రియరాలు పులకించినట్టు, చంద్రుడి కిరణాలకి చుక్కలు వెలిగిపోయాయి.

ప్రేమతో ప్రియుడి కోసం కట్టుచీర విప్పినట్టు సంధ్యారాగం ఆకాశం నుంచి వదలి పోయింది. చంద్రుడు వెండివెన్నెల కురిపిస్తున్నాడు. పక్షులు కిలకిల ధ్వనులు చేస్తూ ఆకాశ మార్గాన విహరిస్తున్నాయి. వానకోసం ఎదురు చూసే చాతక పక్షిలా సీత కోసం శ్రీరాముడు విలపించాడు. పండ్లు కోసం పర్వతాల్లో తిరిగి వచ్చాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా! మధుర మాటలు మాట్లాడునది, అందమైన సకలావయవాలు కల వైదేహి బంగారు పూలు పూసిన వేగిస చెట్లను చూసి ఎంత ముచ్చటపడు తుండేదో. ఆ పూలకి మంచి కాలమిది. ఆ పూలని చూసి నా కోసం మరింత దుఃఖిస్తుంది. సీత కలహంసల రెక్కల చప్పుడికి నిద్రలేసేది. చక్రవాక పక్షుల ధ్వనులను వింటూ మైమరచి పోయేది.

"అందమైన సరస్సులూ, నదులూ, జలాశయాలూ, చక్కటి పూలూ మధుర ఫలాలూ, ఎన్ని ఉన్నా ప్రయోజనమేమిటి. చెట్టు చూసినా, పుట్ట చూసినా, అందమైన పక్షిని చూసినా, పుట్ట తేనెని చూసినా సీతే కానవస్తోంది" శ్రీరాముడు సీతకై వర్షము కోసం తపించే చాతక పక్షిలా విలపించాడు. జనశూన్య ప్రదేశంలో కూర్చొని వ్యధతో ఉన్న శ్రీరామునితో చెప్పాడు లక్ష్మణుడు.

"అన్నా! రామా! మహేంద్రుడు భూమికి కావలిసినంత వానని కురిపించాడు. మేఘాలూ, ఉరుములూ ఇష్టారాజ్యంగా వర్షించాయి. వాయు దేవుడు కొండమల్లె వాసనలతో, ఏరు మద్ది పువ్వుల పరిమళంతో సంతృప్తు





డయ్యాడు. జలపాతాలూ, నదులూ, తటాకాలూ దూకుడు తగ్గించాయి. చక్రవాకాలూ, హంసలూ వైరం మరచి కలిసిమెలసి ఉంటున్నాయి.

"రాజులు పాత పగలతో యుద్ధానికి సిద్ధం అవుతున్న కాలం. సుగ్రీవుడు రాడేమి. ప్రయత్నము ఏదీ చేస్తున్నట్టుగా సూచనలు కానరావుటలేదు.

"అన్నా! శ్రీరామా! శరత్కాలం వచ్చింది. మాట ప్రకారం సుగ్రీవుడే రాలేదు. సుఖాల్లో మైమరచి ఉన్నాడా? సంభోగ సుఖాల్లో తేలియాడుతున్నాడా? ఉపకారం చేసిన వాడ్ని మరిచిన కృతఘ్నుల మాంసాన్ని నక్కలూ, కుక్కలూ కూడ ముట్టవు.

"అన్నా! శ్రీరామా! అల్లెత్రాడు ఎక్కుపెట్టిన నీ ధనుస్సుని చూడాలని ముచ్చట పడుతున్నాడనుకుంటున్నాను. చుట్టాలూ, స్నేహితులతో మధుపానం చేసి చేసి గడువు మరిచాడా! కాలాతీతమైనా కర్తవ్యం గుర్తుకు రానంత మధం ఆవహించినదా" లక్ష్మణుడు ఆవేశపడ్డాడు.

"లక్ష్మణా! కిష్కింధ వెళ్ళు. వానర రాజుకి ధర్మం చెప్పు. వర్షం కురిసిన నాలుగు మాసాలు నూరు సంవత్సరాలుగా గడిపాను. ప్రతిజ్ఞ నెరవేర్చమను. శాశ్వతమైన ధర్మంలా సత్యానికి నిలబడమను" శ్రీరాముడు తమ్ముడు లక్ష్మణుడితో చెప్పాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

లక్ష్మణుడు కిష్కింధ బైలుదేరాడు. ధూమముతో కూడిన అగ్నిలా ఉన్నాడు. కోపంతో ఊగిపోతున్నాడు. అడ్డం వచ్చిన చెట్లను చేతులతో విరగొట్టాడు. కోపం వచ్చిన ఏనుగు వలె పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ కిష్కింధ సమీపించాడు. కావలి కాస్తున్న వానర వీరులు లక్ష్మణుడిని చూశారు. వస్తున్న వాలకం వల్ల శత్రువు అనుకున్నారు.

పర్వతాల గుట్టల్లోని పెద్ద పెద్ద రాళ్ళనూ, మహావృక్షాలనూ లక్ష్మణుడి మీదకి విసిరారు. దానితో లక్ష్మణుడు మహోగ్ర రూపం ధరించాడు. ప్రళయకాల రుద్రుడయ్యాడు. బాణాలతో అగ్ని కురిపించాడు.

చెల్లా చెదురుగా పరుగు తీశారు. సుగ్రీవుని భవనం వద్దకు వెళ్ళి లక్ష్మణుడు క్రుద్ధుడై ఉన్నాడని చెప్పారు. మంత్రులు చూసి రావలిసినదని వానర వీరులను పంపారు. ఏనుగులతో సమానమైన బలం కలవారూ, మేఘసమానులూ, భయంకర రూపు కలవారు, అందరూ మహా వృక్షాలను పెకిలించి చేతబట్టారు.

లక్ష్మణుడి రెండు కళ్ళు నిప్పు కణికలయ్యాయి. మహాసర్పంలా మారాడు. బాణాలు మెరుస్తున్న మృత్యు నాలికల్లా ఉన్నాయి. ధనుస్సు పడగలా ఉంది. తేజస్సు విషంలా ఉంది.

వానర వీరులు భయంతో చేష్టలుడిగిపోయారు. అంగదుడు పరుగు పరుగున వచ్చాడు. లక్ష్మణుడ్ని చూశాడు. తప్పు జరిగిందని తెలుసుకున్నాడు. ప్రజ్వలించుచున్న ప్రళయ కాలాగ్ని వలే, కోపం వచ్చిన మహామదపుటేనుగు వలే ఉన్న లక్ష్మణుడిని చూసి నమస్కరించాడు.

"సుగ్రీవుడెక్కడ? అన్నగారి మాట మరిచిన వాడేడి. సుగ్రీవుడికి వెళ్ళి చెప్పు. లక్ష్మణుడు వచ్చాడని " చెప్పాడు.

అంగదుడు వడివడిగా సుగ్రీవుని వద్దకు వచ్చాడు. తల్లి తారకీ, పినతల్లి రుమకీ నమస్కరించి సుగ్రీవునికి చెప్పాడు. మత్తులో మునిగిన వానికి ఏం తెలుస్తుంది. మళ్ళీ మళ్ళీ చెప్పాడు.

వానర వీరులు సింహనాదాలు చేశారు. సుగ్రీవుని మత్తు వదిలింది. చెదిరిన వస్త్రాలనూ, నగలనూ సరి చేసుకున్నాడు.

అంగదుడు మంత్రులను రమ్మని చెప్పాడు. ప్రభావుడూ, ప్లక్షుడూ క్షణాల్లో వచ్చారు. హనుమంతుడికి సుగ్రీవుడు చెప్పాడు.

"రామలక్ష్మణులు సత్యసంధులు. రాజ్యాన్నీ, సంపదనూ, సిరినీ, సుఖాలనీ ఇచ్చారు. ధనుస్సు పట్టుకుని కిష్కింధ వరకూ తెచ్చాం లక్ష్మణుడను. కాన మనమంతా కలిసి వెళ్ళి లక్ష్మణుడి కోపాన్ని పోగొడదాం. మర్యాద కాపాడుకుందాం" చెప్పాడు సుగ్రీవుడు.

"వానర రాజా! స్థిమితపడు. దేవేంద్రుడి అంతటి వీరుడు వాలిని సంహరించి రాజ్యాన్ని అప్పగించాడు. ఎంతటి వీరుడో అంతటి ప్రేమ స్వభావుడు. లక్ష్మణుడు వచ్చేవరకూ తెచ్చుకోకూడదు. అయినా అయింది ఏదో అయింది. అప్రమత్తుడివైయ్యావు.

"ఆకాశం నిర్మలంగా ఉంది. మేఘాలూ, గ్రహాలూ, నక్షత్రాలూ, దిక్కులూ, నదులూ, సరస్సులూ నిర్మలంగా ఉన్నాయి. సీతాకార్యం కోసం శ్రీరాముడి చెంతకెళదాం.

"ఆధీనంలో ఉండే భార్యలా శ్రీరాముడి ఆజ్ఞని పాటిద్దాం. శ్రీరామునకు కోపం వస్తే, అతను ధనుస్సు పట్టుకుంటే సర్వలోకాలూ కలిసి వచ్చినా తల వాల్చవలిసిందే...





"సుగ్రీవా! హితులతోనూ, సన్నిహితులతోనూ, సేనా నాయకులతోనూ వెళ్ళి శ్రీరాముడిని దర్శించి మన్నించమని వేడుకో"

సుగ్రీవుడూ, మంత్రులూ, అంగదుడూ హనుమంతుడు చెప్పినట్టుగా బైలుదేరారు. సుగ్రీవుడు లక్ష్మణుడి చెంతకేగి... స్నేహ ధర్మాన్ని నిర్లక్ష్యం చేసినందుకు మన్నించమన్నాడు.

## తార విన్నవింపు

కిష్కింధలోకి తీసుకొచ్చాడు. కోపంతో ఉన్న లక్ష్మణుడని శాంతపరిచాడు సుగ్రీవుడు. బంగారు వాకిలితో ఉన్న మందిరంలోకి శ్రీమంతుడైన లక్ష్మణుడు ప్రవేశించాడు.

వీణాతంత్రుల నాదములూ, తాళములూ, పదములూ గల ధ్వనులు వినిపించాయి. సౌందర్య యవ్వనంతో గర్వంగా ఉన్న స్త్రీలను చూశాడు. వెండి బంగారు శయ్యలున్నాయి. చిత్రాలతో రమ్యంగా ఉంది.

చక్కని అందగత్తెలు అటూ, ఇటూ తిరుగుతున్నారు. పురుషోత్తముడు లక్ష్మణుడు వద్దకు వచ్చింది తార. స్త్రీ కావటంతో, స్నేహితుని భార్య కావటంతో తలవంచుకున్నాడు.

"రాకుమరా! సుగ్రీవుని చర్యకి చింతిస్తున్నాను. మీ ఆజ్ఞ మీరలేదు. అన్యధా భావించవలదు."

"భర్త మేలు కోరుట నా ధర్మము. సుగ్రీవుడు కామంతో ధర్మమూ, అర్థమూ వదిలేశాడు. మద మత్తులో, కామం మత్తులో ఉండిపోయాడు. ధర్మార్థములు సిద్ధి కోరువాడు చేయదగ్గ పనికాదు. పానము వల్ల ధర్మ-అర్థ-కామములు మూడూ చెడిపోతాయి."

"లక్ష్మణా! సుగ్రీవునకు సుస్థిరమైన వానర రాజ్యాన్ని కట్టబెట్టాడు. నన్నూ, రుమనూ సాధించాడు. ఎంతో దుఃఖం అనుభవించాడు. అష్టకష్టాలూ పడ్డాడు. కాలం గడిచిపోవటం గుర్తించలేనంత సుఖాలకి బానిసయ్యాడు.

"విశ్వామిత్రుడు ఘృతాచి వలపులో పదేళ్ళు గడిపాడు. ఒక్కరోజే అనుకున్నాడు. అంతటి రాజర్షి ప్రియురాలి కౌగిలిలో కాలాన్ని మరిచాడు. సుగ్రీవుడెంత. సత్యగుణ సంపన్నుడవు. సుగ్రీవుడని మీ అన్నదమ్ములు క్షమించవలెను. చంద్రుడితో రోహిణీదేవి ఉన్నట్టు సీత శ్రీరాముడని చేరుతుంది.

"లక్ష్మణా! ఇంతకాలం ఏకాకిగా విలపించాడు సుగ్రీవుడు. ఇప్పుడు అందుబాటులో ఉన్నవన్నింటితోనూ తనవి తీరా దేహ సుఖాన్ని అనుభవిస్తున్నాడు. కామంతో చేసిన ఆలస్యాన్ని మన్నించవలెను.

"లక్ష్మణా! నా భర్త వాలి చెప్పగా విన్నాను. రావణుని సైన్యం లక్షకోట్ల మూడు లక్షల అరవైవేల మంది. వారే కాక అనేక లక్షల మంది రాక్షసులు ఉన్నారట. వారంతా కామరూపులు.

"అంతటి సైన్యాన్నీ ఎదుర్కొనటానికి ఎక్కడెక్కడ వానరులనూ ఓ చోట చేర్చే పనిని సుగ్రీవుడు ఇంతకు ముందే చేసి ఉన్నాడు. అందువల్లే సుగ్రీవుడు ఆ విరామాన్ని కూడా సుఖాలకి వినియోగిస్తున్నాడు" చెప్పింది తార.

## వానర వీరులు

లక్ష్మణుడు కోపాన్ని మానాడు. సుగ్రీవుడు సుగంధాలను వెదజల్లే మాలలను మెడలోంచి తెంచి వేశాడు. కామాన్ని వదిలేసినట్టు దూరంగా పడవేశాడు. సిగ్గుగా తలొంచుకొని చెప్పాడు.

"లక్ష్మణా! నన్ను వదిలిన సమస్త రాజ్యలక్ష్మలనూ తిరిగి నాకు ఇచ్చినవాడు శ్రీరాముడు. మహావీరుడు. యుద్ధమున ప్రజ్వరిల్లుతున్న అగ్ని లాంటివాడు. శ్రీరామచంద్రునికి ప్రత్యుపకారం చేసే శక్తి ఈ పృథ్విలో ఎవరకీ లేదు. అతని బాట నడువుట. అతని ప్రక్కనుండుటనే ఎవ్వరైనా చెయ్యగలిగేది.

"నేను నిమిత్తమాత్రుడను. రావణ సంహారం చేసేది శ్రీరాముడే. ఏడు మహావృక్షాలనూ, పర్వతాన్నీ, భూమినీ ఒక్క బాణముతో చేధించిన వీరునకు ఎవ్వరూ సహాయం చెయ్యనవసరంలేదు.

"రావణ సంహారానికి శ్రీరాముడు ముందు నడుస్తుంటే, ఆ మహాత్ముడి వెంట మేమంతా నడుస్తాం. ఎక్కడెక్కడి వానర వీరులకూ కబురు పంపుతాను. శ్రీరాముని దయ సంపూర్ణంగా ఉందని భావించి, నిర్లక్ష్యంగా కాలాతిక్రమణము చేసినందుకు మన్నించమని వేడుకుంటున్నాను. తప్పు చెయ్యనివాడు ఈ భూమిలో శ్రీరాముడొక్కడే. నేను రామప్రభువు భృత్యుణ్ణి" చెప్పాడు సుగ్రీవుడు.

"సుగ్రీవా! వినయవంతుడవు. సదాచారడవు. ఉత్తమోత్తమమైన వానర రాజ్యలక్ష్మికి తగినవాడవు. నీ సహాయముతో శ్రీరాముడు యుద్ధం చేస్తాడు. శత్రుసంహారం చేస్తాడు.





"వానర రాజా! తన తప్పు తెలుసుకొని తాము చేసింది తప్పే అని చెప్పే వాళ్ళు మహానుభావులు. ధర్మస్వరూపులు. వివేకవంతులు. సుగ్రీవా శ్రీరాముని వద్దకు మనం వెళ్ళవలెను.

"ఆ మహానుభావుడు వియోగ దుఃఖంతో మునిగి ఉన్నాడు. ఆయనను స్వాంతన పరచవలెను. ఊరడించవలెను. దుఃఖిస్తున్న శ్రీరాముడ్ని చూసి తట్టుకోలేకపోయాను. పౌరుష పదజాల ప్రవర్తనకు ఏమియును అనుకోవలదు" చెప్పాడు లక్ష్మణుడు.

సుగ్రీవుడు సచివుడైన హనుమంతుడి వైపు తిరిగాడు. కంచు మ్రోగించినట్టు మరల దూతలను పంపమని చెప్పాడు.

"హనుమా! మహేంద్ర పర్వతము మీదా, హిమవత్పర్వతము మీదా, వింధ్య పర్వతము మీదా, కైలాస పర్వతము మీదా, మందర పర్వతము మీదా నివశిస్తున్న వానర వీరులనూ, పడమరవైపున సముద్ర తీరాన ఉన్న వానర వీరులనూ, ఉదయ పర్వతము మీదా, పద్మతాళ వనములో ఉంటున్న వారినీ, నల్లటి ఏనుగులంత బలమైన అంజన పర్వతము మీద వానరులనూ, మహాశైల గుహల్లో ఉన్న వానరులనూ, అట్లే మేరు పర్వతము, ధూమ్రగిరి, అస్త్రాద్రిలలో ఉంటున్న వానరులందరినీ పిలిపించు.

"వాయుసుతా! మైరేయ మద్యము త్రాగే భీమవేగులైన వానరులతో పాటు ఈ భూమిపై నివశించే ప్రతి వానరుడనూ పిలిపించు. వారందరికీ కబురు తెలియుటకై వేగవంతమైన వానరులను పంపు. వెళ్ళిన వానరులు వారితో కలిసి వెనువెంటనే వచ్చేయవలెను. ఆకాశాన్ని కప్పివేసేంతటి వానరులందరూ రావలెను."

సుగ్రీవుని ఆజ్ఞతో వాయుపుత్రుడు హనుమ పక్షిమార్గమందు, నక్షత్ర మార్గమందు సంచరించే దూతలను పంపాడు. వారు అమిత వేగంతో వెళ్ళి విషయాన్ని తెలియచేశారు. ప్రళయకాల మృత్యువు వంటి సుగ్రీవుని ఆజ్ఞ, శ్రీరామకార్యం గూర్చి చెప్పారు.

వానరులు బైలు దేరారు. అంజన పర్వతం మీద వానరులు మూడు కోట్లు, అస్తగిరి మీద వానరులు పదికోట్లు, కైలాస శిఖరంపై ఉన్న వానరులు వెయ్యి కోట్లు, హిమలయాల నుంచి వెయ్యికోట్లు, క్షీరసాగరం తమాల వనం నుంచి లెక్కపెట్టలేనంత మంది వానరులు కిష్కింధకు బైలు దేరారు.

వేగవంతులు, కాటుక కొండల్లాంటివారు, బంగారు కాంతి గలవారు, ఎన్నో యోజనాలు ఆకాశ మార్గాన వెళ్ళగలిగే వారు, బలవంతులు అట్టి వానర వీరులు ఆకాశ మార్గాన ప్రయాణించి వస్తుంటే సూర్యుడు కానరాలేదు. మధ్యాహ్నం ఎండ భూమిని తాకలేదు.

వానర వీరులకు సుగ్రీవుని ఆజ్ఞని తెలియ చెయ్యటానికి వెళ్ళిన వానరులకు హిమాలయ శ్రేణుల్లో యజ్ఞవాటిక కానవచ్చింది. మహేశ్వర యజ్ఞవాటిక అది.

మహావృక్షం క్రిందున్న ఆ యజ్ఞవాటిక ద్వారానే దేవతల కోసం మహాశివుడు యజ్ఞం చేశాడు. యజ్ఞ సమయంలో హవిస్సు క్రిందపడింది. ఆ ప్రాంతం పవిత్రమైనది. కందమూల ఫలాలు పుట్టాయి. అవి తిన్నవారికి మాసము వరకూ ఆకలి దప్పికలు ఉండవు.

వానరదూతలు అక్కడి పళ్ళూ, ఫలాలూ, పుష్పాలూ తమ రాజు సుగ్రీవుని కోసం తీసుకువెళ్ళారు.

రాచకార్యం పూర్తి చేసి సుగ్రీవుడను చేరారు. విషయం వివరించి తాము తెచ్చిన ఫలాలనూ, పుష్పాలనూ, కాయలనూ రాజుకి సమర్పించారు.

"వానరరాజా! తమ ఆదేశం ప్రకారం భూమండలంలోని వానర వీరులందరికీ తెలియచేశాము."

సుగ్రీవుడు సంతోషంగా కానుకలను స్వీకరించాడు.

## శ్రీరామా!

"వానరవీరా! మనం శ్రీరాముని వద్దకు వెళదాం. విషయాన్ని వివరించుదాం" చెప్పాడు శుభ లక్షణములు గల లక్ష్మణుడు.

సూర్యసమాన కాంతిపరుడు సుగ్రీవుడు క్షణాలలో దేదీప్యమైన పల్లకిని సిద్ధం చేయించాడు. లక్ష్మణ, సుగ్రీవులు కూర్చున్నారు. మహాబలవంతులైన వానర వీరులు పల్లకీని మోస్తూ ప్రస్రవణగిరి చేర్చారు.

పల్లకీకి ముందూ వెనుకా లెక్కలేనంత మంది వానరులు ఆయుధాలతో నడిచారు.

అఖండ వైభవంతో కదిలిన సుగ్రీవుడు ప్రస్రవణగిరి పర్వత ప్రారంభం లోనే పల్లకి ఆపించి దిగాడు. శ్రీరాముడుంటున్న మాల్యవంతం చేరారు సుగ్రీవుడూ, లక్ష్మణుడూ.





మిత్రుడ్ని చూసి ఆహ్వానించాడు శ్రీరాముడు. సుగ్రీవుడు వస్తూనే రాముడి పాదాల మీద పడ్డాడు. శ్రీరాముడు ప్రేమాతిశయంతో లేపి అక్కున చేర్చుకున్నాడు.

"మిత్రమా! ధర్మ, అర్థ, కామాలను విభజించి, వాటి స్వరూపాన్ని బట్టి సమయాన్ని బట్టి ఏది అనుభవించాలో తెలుసుకొని అనుభవించినవాడు రాజు అవుతాడు. ధర్మమూ, అర్థమూ వదిలేసి నడిచిన రాజు చిటారుకొమ్మన నిద్రించిన వాడితో సమానం" అన్నాడు శ్రీరాముడు.

"ప్రభూ! మన్నించాలి. సుఖలోలుడనయ్యాను. లక్ష్మణుడి రాకతో మత్తు వదిలించుకున్నాను. మహోపకారానికి ప్రత్యుపకారం చెయ్యనివాడు ఈ లోకంలోనే ఉండుటకు అనర్హుడు.

"శ్రీరామా! వానరులు దండ్లు, దండ్లుగా వస్తున్నారు. నదుల ప్రక్క, చెట్ల ప్రక్క, పర్వతాల్లో, గుహల్లో, అడవుల్లో, కీకారణ్యాల్లో ఉన్న వానరులతో పాటు ఎలుగుబంట్లూ, కొండముచ్చులూ కిష్కింధకు చేరుతున్నారు.

"దశరథ పుత్రా శ్రీరామా! వానర వీరులంతా ఘోర రూపులు. దేవతలకీ, గంధర్వులకీ పుట్టినవాళ్ళు. దేవేంద్రుని పరాక్రమంతో సరైన వారూ ఉన్నారు. కామరూపులూ ఉన్నారు. వానరుల్లో ఒక్కొక్కరు లక్షమందితోనూ, పదివేలమందితోనూ, వెయ్యిమందితోనూ పోరాడే వీరులున్నారు. మేరు మంథర పర్వతాల వంటివారు. సీతజాడ తెలిసిన ఒక్కసారిగా మీదపడి రావణుడ్ని బంధుమిత్ర పరివారంగా హతమార్చి సీతాదేవిని సమర్పించగల ధీరులు.

"ప్రభూ శ్రీరామా! 'శ్రీరామబంట్లు' వానరులు లెక్కకు మించి వస్తున్నారు. ఒక ప్రాంతం నుంచి శంకువు (లక్షకోట్లు), మరొక దిక్కు నుంచి అర్బుదం (పదికోట్లు), పర్వతప్రాంతాల నుంచి కొందరు ఖర్వం (వెయ్యి కోట్లు), అరణ్యాల నుంచి కొందరు వానరులు మధ్యమ (పదివేల లక్షల కోట్లు), గుహల్లో నివశించే వానరుల వీరాధి వీరులు అంత్యమ (వెయ్య లక్షల కోట్లు), కీకారణ్యం నుంచి వచ్చిన వానర సేనాలు సముద్రం (వందలక్షల కోట్లు), వింధ్య, మేరు పర్వతాల నుంచి వానరు వీరులు కొందరు పరార్థం (లక్ష లక్షల కోట్లు) వస్తున్నారు. మహా పర్వతాలను పెకిలించగలవాళ్ళు, దేవేంద్రుడితో యుద్ధమన్నా సిద్ధమనే శూరులు వారంతా.... బంధుమిత్రపరివారంతో శ్రీ రామ కార్యం కొరకు ఉరకలు వేస్తూ వస్తున్నారు. ఋషికేశ్ వద్ద భూమిని తాకి వేగంగా ప్రవహించే గంగానదిలా సాగి వస్తున్నారు.

పరాక్రమవంతుడైన శ్రీరాముడు సుగ్రీవుడిని ఆదరంగా చూశాడు. సుగ్రీవుడి సీతాన్వేషణ ప్రయత్నాన్ని విని సంతోషించాడు. అప్పుడు శ్రీరాముడి నల్ల కలువుల వంటి కనులు కలకలలాడాయి.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"సకల చరాచర సృష్టికి వెలుగుని ప్రసాదిస్తాడు సూర్యుడు. అందరికీ వెన్నెల పంచుతాడు చంద్రుడు. అట్లే స్నేహితునికి ప్రత్యుపకారం చేస్తాడు నీ వంటివాడు.

"సుగ్రీవా! శచీదేవిని అనుహ్లాదుడు పులోముని సహాయంతో అపహరించినట్టు రావణుడు మారీచుడి సహాయంతో వైదేహిని తీసుకెళ్ళాడు. మృత్యువుని వెంటబెట్టుకు వెళ్ళాడు.

"శచీదేవి తండ్రి పులోముణ్ణీ, అనుహ్లాదుడినీ దేవతల రాజు దేవేంద్రుడు తన వజ్రాయుధంతో సంహరించినట్టు నా బంగారు ములుకుల బాణాలతో రావణుడిని హతమారుస్తాను" శ్రీరాముడు చెప్పాడు.

చూస్తుండగానే వానరులు వచ్చేశారు. పొద్దుగూకే కాంతితో, ఉదయిస్తున్న చంద్రకాంతితో మధ్యాహ్న సూర్యకాంతితో రకరకాలుగా వెలిగిపోతున్నారు. దుమ్మూ, ధూళీ చెలరేగి ఆకాశమే మసకబారిపోయింది.

సముద్ర ద్వీపాల నుంచీ, మహారణ్యాల నుంచీ, గుహ, పర్వత, నదీ పరివాహ ప్రాంతాల నుంచీ వచ్చిన వానర వీరులను శ్రీరాముడు చూశాడు.

ఒక్కొక్క యూథపతి నూరు కోట్ల వానర సైన్యంతో కనిపించాడు.

వానరసేనా నాయకుడు మేరుపర్వతము మీద నివశించే వెయ్యికోట్ల వానరులతో వచ్చాడు. వానరులు సూర్యతేజస్సుతోనూ, పద్మకింజల్క వర్ణముతోనూ మెరిసి పోతున్నారు.

కాంచన పర్వతము వంటి వీరుడూ, శూరాధిశూరుడూ తార తండ్రి అయిన సుషేణుడు వేల కోట్ల వానరులతో కనిపించాడు.

రుమ తండ్రి తారుడు వెయ్యి కోట్ల మంది వానరులతో ఉన్నాడు.

వానర వీరులలో శ్రేష్ఠుడూ, కాంతిమంతుడూ అయిన హనుమంతుడి తండ్రి కేసరి అను వానరుడు ఇరవై ఒక్క వేల కోట్లకి పైగా వానరులతో వచ్చాడు.

గోలాంగూల రాజు గవాక్షుడు వెయ్యి కోట్ల మంది వానరులతో వచ్చాడు.





ధూమ్రుడు రెండు వేల కోట్లతో, పనసుడు మూడు కోట్ల మంది వానరులతో, గవయుడూ, నీలుడూ, పది కోట్ల మందితో, దధిముఖుడు వెయ్యి కోట్ల మంది వానరులతో తరలి వచ్చారు.

మైంద ద్వివిదులూ, గజుడూ, భల్లూకరాజు జాంబవంతుడూ, రుమణ్వంతుడూ లక్షలు కోట్ల వానర వీరులతో సిద్ధంగా ఉన్నారు.

తన తండ్రి వాలితో సమాన పరాక్రమం గల అంగదుడు వెయ్యి పద్మాల బలముతో, నూరు శంకువుల వానరుల బలముతో వచ్చాడు.

తారుడు అయిదు కోట్ల మందితో కాన వచ్చాడు. పదికోట్లతో వచ్చాడు ఇంద్రజానుడు. కైలాస శిఖరము వంటి ఆకారాలు గల వెయ్యి కోట్ల వానరులతో వచ్చాడు హనుమ.

రెండుకోట్ల దండుతో వచ్చాడు దుర్ముఖుడు. సుగ్రీవునికి ఇష్టమైన దధిముఖుడు పదికోట్ల మందితో వచ్చాడు. నలుడు నూరు కోట్ల మంది వానరులను తెచ్చాడు.

శంఖుడూ, వహ్నీ, రంహుడూ, కోట్లకొలదీ వానరులతో వచ్చారు. దేవతలకు జన్మించిన వానరులూ, వానరులకు జన్మించిన వానరులూ, అంతా అందరూ వచ్చారు.

అంతా కేకలు పెట్టారు. సుగ్రీవునకు జయం... శ్రీరామునకు జయం... అరిచారు. వానర సేనా నాయకులు శ్రీరామ, సుగ్రీవుల వద్దకు వచ్చి నమస్కరించారు. ఆజ్ఞాపించాల్సిందిగా వేడుకున్నారు.

"సేనా నాయకుతారా! మీమీ సేనలతో కొండవాగుల వద్ద, నదీ జలాల ప్రక్కన విశ్రమించండి. సందర్భమూ, సమయమూ కోసం వేచి చూడండి. ఋష్యమూక పర్వత పరిసరాల్లోని మధుర ఫలాలనూ, కాయలనూ సంతృప్తిగా ఆరగించండి" చెప్పాడు సుగ్రీవుడు.

## సీతాన్వేషణ ప్రారంభము

సుగ్రీవుడు దశరథాత్మజుడు శ్రీరాముడితో చెప్పాడు.

"శత్రుసంహారకా! శ్రీరామా! వానర వీరులంతా వచ్చారు. మహేంద్రుని వంటి కాంతి గలవారు. బలవంతులు. స్వేచ్ఛగా విహరించువారు. దైత్యులతోనూ, దానవులతోనూ సమమైనవారు. ఆకాశ మార్గాన ఎంత దూరమైనా వెళ్ళగల బలశాలులు. నీటి మీద, భూమి మీద, కొండల మీద సంచరించ గల యోధులు.

ఎన్నో కార్యాలు సమర్థవంతంగా చేసిన చరిత్రగల వాళ్ళు. ఈ భూమి మీద వానర వీరులంతా నీ ముందు నీ ఆజ్ఞ కోసం ఉన్నారు. నీ వశము చేసిన నా సైన్యాన్ని ఆజ్ఞాపించుము."

"వానరరాజా! సమస్తం తెలిసినవాడవు. మునుముందుగా జనకరాజ పుత్రి జాడ తెలుసుకొనవలెను. రావణాసురుడి నగర జాడ తెలుసుకొనవలెను. వైదేహి విషయం, రావణుడి అనుపానులు తెలిసిన తర్వాతే ఏమి చేయ నిర్ణయము తీసుకోవలెనన్నా. కాన సీతాదేవి జాడ తక్షణ కర్తవ్యము..

"సుగ్రీవా! ఈ వానర సైన్యము నీది... నీవు రాజువి.. ఆజ్ఞాపించ వలిసినది నీవే..." చెప్పాడు దశరథ కుమారుడు శ్రీరాముడు.

## తూర్పున జల్లెడ పట్టండి

వానరరాజు సుగ్రీవుడు శ్రీరామ ఆదేశంతో పర్వతమువంటివాడు, మేఘంవంటి ధ్వనికలవాడు అయిన వానర సేనాని వినతుడకి చెప్పాడు.

"వానర యూథపతి లక్షమంది వానర వీరులతో తూర్పు దిక్కుగా తూర్పు వైపుకు పోవలెను. కొండలూ, కోనలూ, గుహలూ, పర్వతాలూ ఏవి వదలొద్దు. అణువణువు గాలించవలెను. విదేహ రాజపుత్రి సీతాదేవినీ, రావణుడి ఉనికినీ తెలుసుకోవలెను.

"భగీరథీ నదీ ప్రాంతం, సరయూనదీ తీరాలూ, కౌశికీ నదీ ప్రాంతమూ, కళింద పర్వతమూ, కాళిందీ, యమునా నదీ ప్రాంతాలూ, సరస్వతీ, సింధూ నదీ ప్రవాహప్రాంతల్లోనూ, మణుల వంటి జలాలతో ప్రవహించే శోణనదమూ...

"బ్రహ్మమాల, విదేహ, మళవా, కాశీ, కోసల దేశాలూ, మహా గ్రామాలున్న మగధ దేశమూ, పుండ్రదేశమూ, అంగదేశమూ, వంగ దేశమూ, కోశకార రాజుల పట్టణాల్లోనూ, వెండి, బంగారు గనులున్న భూముల్లోనూ శ్రీరామ చంద్రుడి ఇల్లాలిని వెదకండి.

"తూర్పున ఉన్న విశాలమైన మందర పర్వతాలు మీదా, సముద్రాలలో ఉన్న పర్వతాల మీదా వెతకండి. మందర పర్వతాగ్రభాగమున చెవులున్నచోట మూతులున్న వార్నీ, పెదవులే చెవులుగా ఉన్న వార్నీ, ఒక పాదమున్న వారినీ, పొడవు తలలున్న వారినీ, పిచ్చి చేపలను తినే వారినీ, నీటి మధ్య ఉండే వారినీ, ఎవ్వరినీ, ఏ ప్రదేశాన్నీ వదలక చూడవలెను. నరమాంస భక్షకులూ,





కిరాతకులూ, సముద్ర ద్వీపాలలో పచ్చిమాంసం తినే వార్నీ వారంతా నివశించే ప్రాంతాలనీ దశరథుని కోడలు సీతకై గాలించండి.

"అట్టి ద్వీపాలకి ఎవరికి చిత్తమెుచ్చిన రీతిలో వారు వెళ్ళండి. ఎగురుటయో తెప్పల మీద వెళ్ళుటో మీ ఇష్టం. యవద్వీపానికి పొండి. అక్కడ రత్నాల గనులున్నాయి. బంగారు గనుల సువర్ణ రూప్యకము అను ద్వీపము ఉంది.

"వానర సేనాధిపతులారా! ఆ రెండు ద్వీపాలలో వెతకించండి. సీతాదేవి జాడ తెలియచ్చు. ఆ ప్రాంతం దాటితే శిశిర పర్వతం వస్తుంది. ఆకాశాన్ని అంటే పర్వతమది. దేవతలూ, దానవులూ ఉండే ప్రాంతమంతా వెతకాలి. ఏదో ఒక దారి దొరక్కపోదు.

"ఉప్పు సముద్రం అవతల ప్లక్ష ద్వీపంలో శోణనదం ఉంది. రక్తం పారే నది. ఎంతో లోతైనది. సుందరమైన అడవులూ, ఉద్యానవనాలున్నాయి. సీతాదేవి, రావణుడి జాడ తెలుస్తుందేమో శోధించండి.

"వానరా యోధుడా! ఆ తర్వాత ఇక్షు సముద్రం. మహాగాలికి అలలు భయంకర శబ్దంతో లేస్తుంటాయి. మహా భారీకాయములతో అసురులు ఉంటారు. నీడను మింగినా, జీవులను మింగినా ఒక్కటే వారికి. బ్రహ్మవరమది.

"ఎంతో కాలం నుంచి ఆకలితో ఉండి ఉంటారు. మీ నీడ దొరికినా మీరు వారికి ఆహారం అయినట్టే. అట్టి ప్రమాదాల్ని ఏమరుపాటుతో తప్పించుకోవలెను. ఆ తర్వాత లోహితమనే రక్త జలాలతో ఉన్న సముద్రము వస్తుంది. ఆ సముద్ర ద్వీపాల్లో శాల్మలీ అనే ప్రదేశంలో కొండ బూరుగు చెట్టు ఉంటుంది. ఆ ప్రదేశమే గరుత్మంతుడి నివాసము. విశ్వకర్మ రత్నాలూ, మణులతోనూ నిర్మించిన గరుత్మంతుడి గృహము అద్భుతంగా ఉంటుంది.

"ఆ ద్వీపంలో మందేహులు అనే రాక్షసులున్నారు. శిఖరాల మీద వ్రేలాడే భయంకర కురులు. అనేక రూపాలు ధరించే శక్తి గలవారు. బ్రాహ్మణులు జపించే గాయత్రీ మంత్రం వల్ల ప్రతిరోజూ సూర్యోదయ కాలానికి లోహిత సముద్రంలో పడతారు. మళ్ళీ సూర్యకిరణాల తాపానికి పర్వతాల మీదకు చేరుతారు.

"వీరానాయకుడా! సర్పనది సముద్రం దాటితే తెల్లని మేఘం వంటి కాంతి గలది, తరంగములతో ముత్యాలహారము వంటి క్షీర సముద్రం

కానవస్తుంది. అక్కడ ఋషభము అను పర్వతముంది. రజత పుష్పాలతో దివ్యసుగంధ పరిమళాలను వెదజల్లుతూ ఉంటుంది. అక్కడ ఉన్న సుదర్శన మను సరస్సులో కనక కింజల్కాలతో వెండి కమలాలూ, హంసలూ ఉంటాయి.

"దేవతలు, చరణులు, యక్షులు, కిన్నెరలు విహరించే, క్రీడించే ప్రదేశమది.

"క్షీర సముద్రం దాటిన తర్వాత శుద్ధజల మహాసముద్రం వస్తుంది. మంచి నీళ్ళ సముద్రం జలోద మంటారు.

"మహాముని ఔర్వుడి కోపంతో పుట్టిన తేజస్సు బడబాగ్ని ఉంటుంది. అశ్వముహంతో ఉండే ఆ బడబాగ్ని ప్రళయకాలమప్పుడు నీళ్ళని దహించి వేస్తుంది. ఆ బడబాగ్నిని సముద్రప్రాణులు చూసి భయంతో అరిచే అరుపులు విన వస్తాయి.

"ఆ సముద్రానికి పదమూడు యోజనాల దూరంలో మధుర ఉదకము గల జాతరూప శిల అనే మహాపర్వతము ఉంది. అక్కడే వెయ్యి తలల ఆదిశేషుడు ఉన్నాడు. భూమి భారం మోస్తున్న ఆదిశేషుడు నల్లని బట్టలు కట్టుకొని ఉంటాడు. సుందర నేత్రాలతో, చంద్రుని వంటి కాంతితో ఉన్న ఆ దివ్యమూర్తికి దేవతలందరూ నమస్కరిస్తారు.

"పర్వత శిఖరము మీద ఆదిశేషుడికి మూడు తలల బంగారు ధ్వజము ఉంది. చక్కటి అరుగు కూడా ఉంది. ఆ తాళధ్వజమును దేవతలు తూర్పు దిక్కున చేసి ఉన్నారు.

"అది దాటిన తర్వాత కాంచనమయము అయిన ఉదయ పర్వత ముంది. నూరు యోజనాల పొడవుతో గగనాన్ని తాకేలా ఉంటుంది. బంగారు మద్ది చెట్లూ, తాటి చెట్లూ, కొండ గోగు చెట్లూ పూలతోనూ, కాయలతోనూ కానవస్తాయి. ఆహ్లాదంగా ఉంటాయి.

"కొండ శిఖరం మీద సౌమనసమని ఓ బంగారు శిఖరముంది. శ్రీ మహావిష్ణువు త్రివిక్రమావతార మెత్తినప్పుడు పది యోజనాల ఎత్తు, యోజనము విస్తీర్ణము గల ఆ సౌమనస శిఖరం మీద ఒక పాదమూ, మేరువు సావర్ణిక శిఖరము మీద ఒక పాదమూ నిలిపాడు. సూర్య భగవనుడు జంబూ ద్వీప ఉత్తర భాగం సంచరించి, సౌమనస శిఖరాన్ని చేరతాడు. అప్పుడే మేరువుకీ దక్షిణ భాగంలో ఉన్న వారికీ అగుపిస్తాడు.





"ఆ పర్వతము మీద ఎంతో మంది తాపసులున్నారు. ఆ ఉదయ పర్వతం ప్రక్కనే మహా తేజస్సుతో ప్రకాశిస్తూ ప్రాణాలకే నేత్ర తేజస్సు ఇచ్చే సుదర్శన ద్వీపం ఉంది.

"ఆ పర్వతాలన్నీ గాలించి శోధించండి. ఆదిలో భూమికీ లోకానికీ ఉదయ పర్వతమే తొలి ద్వారము. సూర్యుని ఉదయ స్థానం. దాని వల్లే దీనిని పూర్వదిక్ అని అంటారు.

"ఆ పర్వతము ఆవలి ప్రక్క దేవతలుంటారు. సూర్య చంద్రులు లేని ప్రదేశం. కటిక చీకటి. వానరులారా... అంతవరకే నాకు తెలుసు. మీరునూ అంతవరకే వెళ్ళగలరు.

"మీరు నేను చెప్పినవి, చెప్పనవి ఆ దిక్కులో దేన్నీ వదలకుండా గాలించండి. ఉదయ పర్వతం దాకా వెళ్ళి ఓ మాసంలోగా తిరిగి రావాలి. గడువు దాటి రాని వారి తలలు తీయబడతాయి.

"వానర యోధులారా మీరు సేనా నాయకునితో కదలండి. మీరు వెళ్ళే దిక్కు వృక్షముల సముదాయములతో అందంగా ఉండే సుందర దిక్కు. దేవేంద్రునకు ప్రియమైనది. అడవులూ, ఉద్యానవనాలూ, నదులూ ఉంటాయి. శ్రీరామచంద్రుడి ఇల్లాలు సీతాదేవి జాడ తెలుసుకొని రండి" చెప్పాడు సుగ్రీవుడు.

## దక్షిణాన సాగిపొండి

వినతునకూ, వానరులకూ తూర్పు వైపు వెళ్ళమని చెప్పి దక్షిణం వైపు అగ్ని పుత్రుడు నీలుడనూ, వాయు పుత్రుడు హనుమనూ, బ్రహ్మపుత్రుడు జాంబవంతుడనూ, సుహోత్రుడూ, శరారీ, శరగుల్ముడూ, గజుణ్ణీ, గవాక్షుణ్ణీ, గవయుణ్ణీ, సుషేణుడినీ, ఋషభుడూ, మైందుడునూ, ద్వివిచుడునూ, విజయుడునూ, గంధమాదనుడునూ, అగ్నికొడుకులు ఉల్కాముఖుడునూ, అసంగుడునూ, కిష్కింధ యువరాజు అంగదుడనీ తరలి వెళ్ళాలని ఆజ్ఞాపించాడు సుగ్రీవుడు. ఆ దక్షిణ దిక్కుకు అంగదుడ్ని నాయకుడ్ని చేశాడు. దక్షిణ దిక్కు విషయాలని వారికి వివరించాడు.

"వీరాధివీరులైన వానరులారా! దక్షిణ దిక్కుగా వెళితే వెయ్యి పర్వత శిఖరాలు గల మహా పర్వతరాజం వింధ్యపర్వతము వస్తుంది. లతలతోనూ, చెట్లుతోనూ నిండి ఉంటుంది.

"మహాకాల సర్పాలూ, క్రూర జంతువులూ, నదులూ, తటాకాలూ, గోదావరీ, వరదా, మేఖలా, ఉత్కలా నదులు వస్తాయి. మార్గమధ్యంలో అశ్వవంతీ, అవంతీ, విదర్భా, ఋషికా, మహిషికా, వంగా, కళింగా, కౌశిక రాజ్యాల పట్టణాలూ, పల్లెలూ తగులుతాయి.

"దండకారణ్యంలోని కొండలూ, గుహలూ, సర్వం శోధించండి. దుర్గమ ప్రదేశాలూ, ఆంధ్ర, పుండ్ర, చోళ, కేరళ, పాండ్య దేశాలు యవత్తూ గాలించండి.

"అట్లా వెతుకుతూ వైదేహీ జాడకై ధాతువులచే అలంకరించబడిన అందమైన సహ్యపర్వతానికి పోండి. ఆ పర్వత ప్రాంతం కడురమ్యం. మీరెప్పుడూ చూడని పూలు చూడొచ్చు. విచిత్ర శిఖరములను చూడొచ్చు. చందన వృక్షాలతో చూడ చక్కగా కానవచ్చే గైరికాది ధాతువులతో కాంచనంలా ధగధగలాడే ఆ పర్వత ప్రాంతాలన్నీ వెదకండి.

" ఆ పర్వతం దాటిన తర్వాత శుభప్రదమైన నిర్మల జలముతో నిండిన కావేరీ నది వస్తుంది. ఆ నదీ తీరాన అప్సరసలు కానవస్తారు. మంగళకరమైనది కావేరి. ఆ నదీ నీరు స్ఫటికంలా ఉంటాయి. ఆ చెంతనే ఉన్నది మలయ పర్వతము. అక్కడే సూర్యుడి తేజస్సుతో వెలిగిపోతుంటాడు అగస్త్యుడు. వారికి నమస్కరించండి. దీవించమని కోరండి.

"ఆ పై భయంకర మొసళ్ళతో నిండిన తామ్రపర్ణీ నది వస్తుంది. ప్రియుడి దగ్గరికి వెళ్ళే ప్రియురాలిలా సముద్రంలో కలుస్తుందక్కడ. ఆ పై పాండ్యనగరం, బంగారం, రత్నాలతో చేసిన ఆ నగర ద్వారం నుంచి దక్షిణ దిశగా వెళ్ళండి.

"మహేంద్ర పర్వతం వస్తుంది. సముద్రంలో అగస్త్యుడు ఉంచిన పర్వతమదే. ఆ పర్వతము సముద్రంలోకి చొచ్చుకొని ఉంటుంది. అప్సరసలూ, గంధర్వులూ, సిద్ధులూ నివశిస్తుంటారు. దేవేంద్రుడు ప్రతి పర్వమూ సముద్ర స్నానానికి వచ్చే ప్రాంతమది.

"మీరెక్కడా చూడని పళ్ళూ, ఫలాలూ, పూలూ, కాయలూ, అనేక సుందర ఉద్యానవనాలుంటాయి. చరియలు, వృక్షములు నానావర్ణములతో ఉంటాయి.

"ఆ ప్రాంతంలోనే అవతలి ఒడ్డున అద్భుతమైన లంకా ద్వీపము ఉంది. అది ఎంతో వైశాల్యము కలది. నూరు యోజనాలు. ఇంద్రుడితో సమానమైన శక్తి కలవాడూ, దుర్మార్గుడూ, దూర్తుడూ అయిన రావణాసురుడు ఉండేది అక్కడే. అచ్చట జనకరాజ పుత్రిని వెదకండి. రవ్వంత ప్రదేశాన్ని కూడా





వదలరాదు. ఆ ద్వీపానికి ఉత్తరంగా పోతే అంగారక అనే మహా రాక్షసి ఉంటుంది. ఆకాశ మార్గాన వెళుతున్న మీ నీడను చూసి మిమ్ము దాని నోటిలోకి లాగేసుకో గల దిట్ట. ఏమరుపాటుగా ఉండవలెను.

"వీరులారా! ఆ లంకా ద్వీపం నుంచి నూరు యోజనాల దూరంలో పుష్పితకమమనే పర్వతము వస్తుంది. ఆ పర్వతము జలాల మధ్య ఉంటుంది. శిఖరాలు ఎంతో ఎత్తుగా ఆకాశాన్ని చుంబిస్తున్నట్టుగా ఉంటాయి. పుష్పిత పర్వతానికి బంగారు శిఖరం ఉంది. సూర్యుడు నిత్యం దానికి నమస్కరించి దక్షిణ దిశగా పోతాడు.

"వానరులారా! మహాత్ములకూ, ధర్మపరులకూ, సత్యవాక్కు గలవారికీ మాత్రమే కానవస్తుంది. కాన దానికి నమస్కరించి, వెదకి ముందుకు పోవలెను.

"పుష్పితక పర్వతానికి పధ్నాలుగు యోజనాల దూరంలో సూర్యవంత పర్వతముంది. బహు కష్టమైననూ మీరు పోయి వెదకవలెను. అక్కడ నుంచి వెళితే వైద్యుతము అనే పర్వతము ఫల వృక్షాలతో కానవస్తుంది. సర్వకామములను ఫలింప చేయు పర్వతమది.

"అక్కడ మధుర ఫలాలనూ, తేనెనూ ఆస్వాదించి, నేత్రపర్వమూ మనస్సు రంజింప చేయగల కుంజర పర్వతాన్ని చేరండి. ఆ ప్రదేశంలోనే విశ్వకర్మ అగస్త్యుడి కోసం బంగారమూ, రత్నాలూ, మణులతో చక్కటి భవనాన్ని నిర్మించాడు. ఆ భవనం దాటిన తర్వాత భోగవతీ పట్టణం వస్తుంది.

"వాసుకీ సామ్రాజ్యమది. భయంకర సర్పాలూ, నాగులూ సంచరించే ప్రదేశం. అంతటా కావలి కాస్తూ ఉంటాయి. ఆ పట్టణంలోనూ, పరిసరప్రాంతాల్లో రహస్య ప్రదేశాల్లో క్షుణ్ణంగా వెదకండి. సీతమ్మ జాడకై గాలించండి....

"భోగవతిని దాటితే సకల రత్నాలతో నిండిన ఋషభ పర్వతం వస్తుంది. పేరుకు తగ్గట్టుగా ఉంటుంది. రత్నాలూ, మణులూ రాసులుగా ఉంటాయి. ఎన్నో గంధపు చెట్లు ఉంటాయి. గోరోచనపు వన్నెతోనూ, శ్యామవర్ణముతోనూ ఉంటాయి. ఆ గంధపు వృక్షాలు తాకకండి. మహాశక్తి వంతమైన రోహితులు అనే వారు తమ ప్రాణంగా చూసుకుంటారు.

"శైలూషుడూ, గ్రామణీ, శిక్షుడూ, శుకుడూ, బభ్రువూ, అనే గంధర్వ రాజులున్నారు. ఆ ఋషభ పర్వతంపై అగ్ని తేజస్సుతోనూ, సూర్య చంద్ర తేజస్సుతోనూ వెలిగిపోతుంటారు. ఆ స్వర్గవాసులే అక్కడ నివశిస్తున్నారు.

"ఆ పై పితృలోకం వస్తుంది. దాని వైపు వెళ్ళరాదు. యముడి రాజధాని. గాఢాంధకారంతో ఉంటుంది. ప్రాణులెవ్వరూ వెళ్ళలేని యముడి రాజధాని. అక్కడ్నించి ఇక ముందుకు వెళ్ళలేరు. కాన వానరులారా... సీతమ్మ జాడ తెలుసుకోండి...

"సీతమ్మతల్లిని కనుగొనిన వారు తరతరాలుగా సుఖంగా బ్రతకవచ్చు. అట్టివాడు నాకు ప్రాణసమానమవుతాడు. నాతో సమానంగా సుఖాలు అనుభవిస్తాడు. అనేక తప్పులు చేసిన వాడూ నాకు ఆత్మబంధువవుతాడు. కాన పురుష ప్రయత్నము చేయుము" చెప్పాడు సుగ్రీవుడు.

## పడమర వైపుకి

దక్షిణం వైపు వెళ్ళాల్సిన వారికి అన్నీ చెప్పి మేఘ సమానుడు సుషేణుడైన తన మామకి నమస్కరించాడు. సుషేణుడితో మరీచిముని పుత్రుడు మరీచుణ్ణి, అతని సోదరుడు అర్చిష్మంతుడను పడమర దిక్కుగా వెళ్ళమని సూచించాడు.

వేగంలోనూ, పరాక్రమంలోనూ గరుత్మంతుడితో సమానమైన వారికి చెప్పాడు సుగ్రీవుడు.

"సుషేణుడితో రెండు లక్షల వానరవీరులు పడమరవైపు వెళ్ళండి. సౌరాష్ట్ర, బాహ్లిక, చంద్ర, చిత్ర, శూర, భీమరాజ్యాలు ఆ దిశగా వస్తాయి. విశాలమైన గ్రామములూ, పున్నాగములూ, వకుళ వృక్షములూ, ఉద్దాలక వృక్షమలూ ఎన్నో వింతలు గల మధ్యదేశమూ, కేతన వనమూ వెదకండి. ఓ మహా ఎడారి కూడా వస్తుంది. అలా పెద్ద పెద్ద శిఖరాలు ఉన్న కొండలు దాటితే పడమటి సముద్రానికి చేరుకుంటారు. ఆ సముద్రం తిమింగలాలకీ, మొసళ్ళకీ పుట్టినిల్లు లాంటిది.

"అక్కడ మొగలి పొదలూ, తమాల వనములూ, కొబ్బరి తోటలూ ఎక్కువ. అక్కడి కొండలూ, కోనలూ, అడవి అంతా మహాసాధ్వి సీతకై వెదకండి. రావణుడి జాడేమన్నా తెలుస్తుందేమో శోధించండి. ఆ దిశగా ఉన్న మరచీ పట్టణాన్నీ, జటీపురమునూ, అవంతీ పట్టణాన్నీ, అంగలోపానగరాన్నీ వెదకండి.

"ఆ ప్రాంతపు అరణ్యాలనూ, పట్టణ ప్రాంతాలనీ గాలించండి. ఆ పై హేమగిరి వైపు వెళ్ళండి. సింధునది సంగమించే చోటు నూరు శిఖరాలతో మహోన్నతమైన వృక్షాలతో ఉంటుంది.





"వానరులారా! ఆ పర్వత నెత్తాలని కామరూపులై వెదకండి. మధమెక్కిన ఏనుగులూ, సింహాలూ, అనేక పక్షులూ, మేఘాలూ గర్జించినట్టు ఘీ పెడుతుంటాయి. నలువైపులా నీటితో ఉన్న విశాల ప్రాంతాన్ని శోధించండి. హేమగిరి బంగార శిఖరాన్ని అణువణువు గాలించండి. సముద్రంలో ఉన్న పారియాత్ర పర్వతం యొక్క నూరు యోజనముల బంగారు అగ్రభాగమును చూడగలరు.

"ఆ తర్వాత ఇరవై కోట్ల మంది ఉండే గంధర్వ పర్వతం వస్తుంది. తేజస్సుతో వెలిగిపోతుంటారు. యుద్ధంలో అసహాయ శూరులు. మీరంతా సరిసమాన శక్తి కలవారైనా వారి జోలికి పోవద్దు. పారియాత్రము అనే బంగారుమయమైన ఆ పర్వతాన పండూ, ఫలమూ దేన్నీ ముట్టవద్దు.

"ఆ గంధర్వులు ఫలమూలలను రక్షిస్తుంటారు. వాటిని తుంచుట, ముట్టుట చేయకుంటే గంధర్వులు మీ జోలికిరారు. మన జాతి లక్షణాన్ని అణుచుకొని సంచరించండి.

"ఆ పారియాత్రమునకు అవతల వజ్రము అనే వైఢూర్యకాంతులతో తేజరిల్లే పర్వతముంటుంది. అక్కడ గుహల్లో వెతకండి.

"ఆ పై లవణ సముద్రము నాలుగో భాగంలో చక్రవంతము అను పర్వతముంటుంది. ఈ పర్వతం మీదనే శ్రీమహావిష్ణువు పంచజనుణ్ణి సంహరించే శంఖమూ, హయగ్రీవుణ్ణి చంపే చక్రమూ సంపాదించాడు. ఆ పర్వతంలో ఎన్నో గుహలున్నాయి. విశ్వకర్మ సహస్రార చక్రం తయారు చేసిన చక్రవంతము అను పర్వత పరిసరాల్లోనూ వెదకండి.

"అక్కడ్నించి అరవై యోజనాల దూరంలో బంగారు శిఖరము గల వరాహ పర్వతం వస్తుంది. నరకుడు అనే రాక్షసుడి స్థావరమది. బంగారు శిఖరాలతో మెరిసిపోతుంటుంది. ఆ వరాహగిరిలోనూ, అక్కడ గుహల్లోనూ వెదకండి.

"వరాహ పర్వతం మీద నరకుడు అనే మహా దుష్టుడు అయిన దానవుడు ఉంటాడు. ప్రాగ్జ్యోతిష పురం దాటిన తర్వాత ఆ పై వెళితే అరవై వేల బంగారు కొండల మధ్య సావర్ణ మనుపర్వతం వస్తుంది. ఆపై మేఘవంత పర్వతం వస్తుంది. అనేక సేలయేళ్ళు ప్రవహిస్తుంటాయి. నీటి గలగలలతో పాటు మదించిన ఏనుగుల ఘీంకారలూ, అడవి పందుల మూలుగులూ, సింహాల గర్జనలూ వినవస్తాయి.

"గుహల్లో ప్రతిధ్వనించుట విని మళ్ళీ అరుస్తుంటాయి. దేవతల రాజు దేవేంద్రునికి ఈ మేఘవంత పర్వతం మీదే దేవతలు పట్టం కట్టారు.

"మేఘ పర్వతము దాటితే అరవై వేల బంగారు పర్వతాలకి వెళ్ళండి. బాగా పుష్పించిన బంగారు వృక్షాలుంటాయి అక్కడ. సూర్యభగవానుడుని సంధ్య సమయాన దేవతలు పూజిస్తారు. ఈ పర్వత ప్రాంతం మేరువు నుంచి అర ముహూర్తకాలంలో పదివేల యోజనాలు దాటి అస్తగిరి చేరుతాడు సూర్యుడు. ఈ శిఖరంపై ఓ దివ్యమైన భవనం ఉంది. వరుణ భవనం. విశ్వకర్మ సమస్త సుందర ప్రకృతితో సృష్టించాడు. పూల చెట్లూ, పక్షులూ, సాధు జంతువులూ ఎటు చూసినా కానవస్తాయి.

"సావర్ణిమేరు పర్వతానికీ, అస్తగిరికీ మధ్య చిత్ర వర్ణము అయిన వేదిక ఉంది. దానిపై పది తలల బంగారు తాటి చెట్టు కానవస్తుంది. అక్కడే మహాతపస్సంపన్నుడు, ధర్మము తెలిసినవాడు మేరుసావర్ణి ముని నివశిస్తుంటాడు. ఆయనకి వినయంగా నమస్కరించవలెను.

"అక్కడ సరస్సులనూ, నదీ ప్రాంతాలనూ వెదకండి.

"వానరులారా! ఆ పై సూర్యుడు కనిపించడు. కటిక చీకటి అవతల ఏముందో ఎవరికీ తెలీదు. ఈ దిశగా వెళ్ళి ఒక్క నెలలో తిరిగిరావాలి.

"వీరాధివీరులారా! సుషేణుడు నాకు మామగారు. ఆయన వెంట పోవలెను. ఆయన ఆజ్ఞలతో సాగవలెను. శ్రీరామునకు ప్రత్యుపకారం చేసి కృతార్థులము అవుదాము. సీతాదేవి జాడకై కార్యసిద్ధితో ముందుకు కదలండి." చెప్పాడు సుగ్రీవుడు.

వానర వీరులు జయజయ ధ్వనులు చేసుకుంటూ పడమటి దిక్కుగా వెళ్ళారు.

## ఉత్తరము

మహాబాహువు, మహాబలశాలి సుషేణుడికి పడమర దిక్కు అప్పచెప్పి సుగ్రీవుడు శతబలుడు వద్దకు వచ్చాడు.

"వానరశ్రేష్ఠుడైన శతబలీ హిమవత్పర్వతము శిరోభూషణమైన ఉత్తరం వైపు నీతో సరిసమానమైన లక్ష మంది వానరవీరులతో వెళ్ళాలి. శ్రీరాముడు, పురుషోత్తముడు. అట్టి వానికి ప్రత్యుపకారం చెయ్యగలిగితే మన వానర వీరులందరి జన్మ చరితార్థమైనట్టే. జన్మ సాఫల్యము అవుతుంది.





"తనకి ఉపకారము చెయ్యనివారికైనా కార్యము కోరి వచ్చినప్పుడు అతని కార్యము సఫలం చెయ్యవలెను. జన్మ సఫలం అగును. ముందే వారి నుంచి ఉపకారం పొంది ఉంటే ఉపకారము చేసిన వారి కార్యము గూర్చి చెప్పవలెనా? శ్రీరాముడు నరులలో శ్రేష్ఠుడు. శత్రుపురములు జయించువాడు. నాకు స్నేహితుడు. వన దుర్గములలోనూ, నదులలోనూ, పర్వత మధ్యములందు సీతాదేవికై అన్వేషించండి.

"ఉత్తరం వైపునున్న అడవులూ, కోనలూ, పర్వతాలూ, పట్టణాలూ గుహలూ, ఉద్యానవనాలూ సర్వం వెదకాలి. మ్లేచ్ఛదేశమూ, శూరసేన దేశమూ, భరత దేశమూ, ప్రస్థల దేశమూ, కురుదేశమూ, మద్ర దేశమూ, కాంభోజ దేశమూ, శక దేశమూ, యవన దేశమూ, అరట్టక దేశమూ, బాహ్లిక, ఋషిక, పౌరవ, టంకణ, చీన, పరమచీన దేశములలో యావత్తు సీతమ్మ కొరకై రావణుడికై శోధించండి.

"ఆ యా దేశాల్లో నగరాలనీ, ఉద్యాన వనాలనీ, గుహలనీ, పర్వతాలనీ ఏదీ వదలొద్దు. ఆ దేశాల నుంచి సోమాశ్రమం చేరండి. దేవతలతోనూ, గంధర్వులతోనూ ఉండే కాల పర్వతం ఉంటుంది. బంగారపు పర్వతమది. వాటి గుహల్లో దూరి వెదకండి.

"కాల పర్వతము నుంచి మహాభాగ సీత జాడకై సుదర్శన పర్వతం వెళ్ళండి. దాన్ని దాటితే దేవసఖ పర్వతం వస్తుంది. చక్కటి పక్షులూ, గుహలూ, చెట్లూ ఉంటాయి. అంతా గాలించండి.

"ఆ ప్రాంతం దాటితే నూరు యోజనాలు వెళ్ళాలి. ఈ మధ్య అంతా ఎడారిలా శూన్యమే. చెట్లూ చేమా కూడా కానరాదు. దాన్ని దాటితే తెల్లని కైలాస పర్వతం వస్తుంది. దాన్ని చూస్తూనే మీరు ఆనంద పడతారు. రమ్యమైన కుబేరుడి భవనం ఉంటుంది. తెల్లగా, ఎత్తుగా బంగారముచే నిర్మించినది. అక్కడే ధనరాజు విశ్రవసుని పుత్రుడు కుబేరుడు ఉంటాడు.

"ప్రక్కనే తామరలతో పూసిన సరస్సు ఉంటుంది. అందులో నీటి కోళ్ళూ, హంసలూ తామర పువ్వులతో ఆడుకుంటూ కనువిందు చేస్తాయి.

"యక్షుల రాజు కుబేరుడి కైలాస పర్వతం ప్రక్కనే అనేక పర్వత గుహలున్నాయి. అవన్నీ వెదకండి. ఆపై క్రౌంచ పర్వతాన్ని చేరండి. ఆ పర్వతంలో ఒక అసాధ్యమైన మహా బిలం ఉంది. అందులోకి జాగ్రత్తగా

వెళ్ళండి. అందు మహాత్ములూ, దేవరూపులైన మహాఋషులూ ఉంటారు. ఆ క్రౌంచ పర్వతమూ దాని గుహలూ శిఖరాలూ వెదకండి. ఇక్కడే మానసమను కోరికలు తీర్చే పర్వతముంది. దీనిపై వృక్షములూ, పక్షులూ ఉండవు. దేవతలూ, రాక్షసులూ అక్కడకి వెళ్ళలేరు.

"దేవదానవులెవ్వరూ పోలేని మానస పర్వతమంతా వెదకి క్రౌంచ పర్వతానికి అవతల మైనాకము అను పర్వతాన్ని చేరండి. అక్కడ మయుడు స్వయంగా నిర్మించుకున్న భవనముంటుంది. ఆ పర్వతంపై గుర్రాల ముఖాలతో కిన్నెరలు కానవస్తారు.

"వారి నివాసాల్లోనూ, గుహల్లోనూ, భవన సముదాయాల్లోనూ వెదకండి. అక్కడ్నించి వెడితే సిద్ధాశ్రమము వస్తుంది. వైఖానసులూ, వాలఖిల్యులూ ఉంటారక్కడ. నమస్కరించి మీరాక కారణం చెప్పండి. వారికి అవగతమైతే చెబుతారు.

"సిద్ధాశ్రమ పరిసరాల్లో వైఖానసము అనే సరస్సు ఉంది. అందు బంగారు వన్నె కమలాలు కనిపిస్తాయి. అట్లే చక్కటి హంసలూ కనువిందు చేస్తాయి. సార్వభౌమము అనే ఏనుగు తన పెంటి ఏనుగుతో కలిసి విహరిస్తూ కనిపిస్తుంది. ఆ గజము కుబేరుడి వాహనము.

"ఆ వైఖానస సరస్సు అవతల సూర్యచంద్రులు సంచరించరు. చీకటి. మేఘ, నక్షత్రాలు ఉండవు. దేవతలతో సమానమైనవారు స్వయంప్రభల్లా వెలిగిపోతుంటారు.

"అక్కడ్నించి వెళితే శైలోద నది వస్తుంది. ఆ నది కిరువైపులా కీచకం అనే పొదలుంటాయి. ఈ ఒడ్డు వెదుళ్ళు ఆ ఒడ్డు వెదుళ్ళకీ, ఆ ఒడ్డు వెదుళ్ళు ఈ ఒడ్డు వెదుళ్ళకీ పెనవేసుకొనిపోయి శైలోద నది అటు ఇటూ తిరుగుటకు సిద్ధుల కోసం వెదుళ్ళన్నీ వంతెన దారి చేశాయా అన్నట్టుగా ఉంటుంది.

"అదే పుణ్యవంతుల ఉత్తర కురుదేశము. అక్కడ అనేక వేల నదులు ప్రవహిస్తుంటాయి. అక్కడ వృక్షాలు అన్ని కాలాలలోనూ పూలూ, పండ్లూ కాస్తాయి.

"అక్కడి గాలి సుగంధాలు కలిపినట్టు సువాసనతో ఉంటుంది. అక్కడి పర్వతాలూ, తిన్నెలూ, చిత్రమైన కాంతులతోనూ, బంగారుమయమైన అగ్ని తేజస్సుతోనూ ఉంటాయి.





"మృదు మధుర ఫలాలే కాదు. దివ్యములైన గంధర్వ అప్సరసలనూ, ఇంకా కోరినవన్నీ ఇచ్చే వృక్షాలూ ఉన్నాయి. కొన్ని ఆయుధాలు ఇస్తాయి. మరికొన్ని అనేక ఆకారములు కల్గిన వస్త్రములని అందిస్తాయి.

"మరికొన్ని మణులూ, వజ్రాలూ, ఆభరణాలూ, మరి కొన్ని వృక్షాలు సుందర సుకుమార కాంతులనూ ఇస్తాయి.

"ఇంకొన్ని చక్కని మత్తు గల పానములూ, అనేక భక్ష్యాలనూ, రూప యవ్వనంతో నిండిన సద్గుణ స్త్రీలనీ ఇస్తాయి. ఆ సుందర ప్రదేశాన గంధర్వులూ, కిన్నెరలూ, యక్షులూ తమ ప్రియురాండ్లతో యథేచ్ఛగా విహరిస్తుంటారు.

"వారి వినోదక్రియలకూ, సంగీత ధ్వనులకూ, గీతా వాద్య ధ్వనులకూ భంగం కలిగించ రాదు. అక్కడెవ్వరూ ఒంటరిగా కనిపించరు. సంతోష సౌభాగ్యానికి నిర్వచనం ఆ ప్రాంతమున వారిని చూస్తే తెలుస్తుంది.

"అక్కడ్నించి ఉత్తారన సోమగిరి పర్వతము ఉంది. బ్రహ్మ, విష్ణు, స్వర్గలోకాల్లో నివశించే దేవతలకి మాత్రమే గోచరిస్తుంది. ఆ ప్రాంతన సూర్యుడు సంచరించడు. అయిననూ ఆ సోమగిరి వెలుగే చాలు.

"ఆ పవిత్ర క్షేత్రమైన సోమగిరి పైనే ప్రపంచ స్వరూపుడు, శివుడూ బ్రహ్మదేవుడూ, బ్రహర్షులూ నివశిస్తున్నారు. ఆ సోమగిరికి దేవతలే వెళ్ళలేరు. మీరు దానిని చూచి వెనుకకు మరలండి.

"ఇక అక్కడ్నించి మీరు ముందుకు పోలేరు. ఉత్తర కురుదేశము వరకే... ఆ పై వెళ్ళినవారు ఎవరూలేరు. ఆపై ఏముందో నాకు గానీ, మహామహులైన మహాత్ములకి గానీ తెలియదు.

"వానరులారా! నేను చెప్పిన అన్ని ప్రదేశాలనూ, చెప్పని ప్రదేశాలనూ వెదకండి. అగ్నీ, గాలితో సమానమైన వారు మీరు. మీకు సాధ్యం కానిది లేదు. సీత జాడ తెలుసుకొని వస్తే శ్రీరాముడు సంతోషిస్తాడు. శ్రీరాముడు సంతోషిస్తే సమస్త భుమండలమూ సంతోషించినట్లే" చెప్పాడు సుగ్రీవుడు.

## శ్రీరాముడు హనుమంతునకు అంగుళీయకం ఇచ్చుట

నలుదిక్కులకి వెళ్ళే వానర వీరులకు సూచనలిచ్చిన సుగ్రీవుడు హనుమంతుని వైపు తిరిగాడు.

"వాయుపుత్రా హనుమా! భూమి మీదా, ఆకాశమునా, అంతరిక్ష ములో కానీ, మహాత్ములూ, సిద్ధులూ సంచరించే ప్రాంతంలో కానీ, దేవతలూ, గంధర్వులూ సంచరించే ప్రదేశాలలో కానీ, నీటిలోనూ, గంధర్వ, నాగ లోకాలలోకానీ, పర్వత లోయల్లోనూ, గుహల్లోనూ ఎందులోనైనా కానీ, ఎందైనా కానీ నీవు యాథేచ్ఛగా సంచరించగలవాడవు. మహాకపివి నీవు. వానరులందరి లోనూ శక్తిమంతుడవు. నీ శక్తి నీకు తెలీదు.

"ఏ కార్యాన్నైనా సాధించగల ధీరోదత్తుడవు. వేగానికీ, గమనానికీ, లాఘవానికీ సాటిలేనివాడివి.

"పవనసుతా! దేహ, బుద్ధి, పరాక్రమముతో నీవు ఈ కార్యము సాధించవలెను. కార్యసాధకుడవి కావలెను. పండితుడవు, నీతిమంతుడవు. కార్యభారాన్ని వహించి విదేహ పుత్రి జాడ తెలుసుకొని రావలెయును. ఏ కలుగులో రావణుడు ఉన్నాడో త్రొవ్వి అయినా తెలుసుకొనవలెను" చెప్పాడు సుగ్రీవుడు.

శ్రీరాముడు హనుమంతుడిని దగ్గరికి పిలిచాడు.

"వానరోత్తమా! నీవు శక్తిమంతుడవు. జనకరాజసుతను కనిపెట్టగలవు. సుగ్రీవుని విశ్వాసమూ, నా విశ్వాసమూ వమ్ముకాదు. ఇదిగో నా అంగుళీయకము. వైదేహికి ఈ ఆనవాలు చూపించు. ఈ ఉంగరాన్ని చూస్తే నిన్ను సంశయించదు" అని పరంతపుడూ, సంతుష్టుడూ అయిన హనుమకి మహాతేజోవంతుడు శ్రీరాముడు తన వేలికున్న ఉంగరాన్ని తీసి ఇచ్చాడు.

హనుమంతుడు భక్తిగా అందుకున్నాడు. శిరముపై పెట్టుకున్నాడు. సన్నద్ధుడై శ్రీరామచంద్రుని ఆశీర్వాదం కొరకు పాదాలకు నమస్కరించాడు. తన వానర సేనతో ఆకాశమార్గాన వెళ్ళాడు హనుమ. నక్షత్రాల మధ్య చంద్రుడిలా వెళ్తున్నాడు హనుమ.

సుగ్రీవుడు మిగతా వారినీ సాగనంపాడు. అన్ని దిక్కులకీ వానరులు వెళ్ళారు. నలుదిక్కులకి వెళ్తున్న వానర వీరులతో ఆకాశం మధ్యలో మాత్రమే ఖాళీ ఉంది. వెలుగు లేని సూర్యుడిలా అగుపించింది ఆ ఖాళీ.

సుగ్రీవుని ఆజ్ఞ ప్రకారం శతబలుడు హిమవత్పర్వతము వైపున్న ఉత్తరం వైపుకూ, వినతుడు తూర్పు దిక్కుకూ, హనుమంతుడు, తారుడూ, అంగదుడూ అగస్త్యుడున్న దక్షిణ దిక్కుకూ, సుషేణుడు వరుణుడు పరిపాలించే పడమర





దిక్కుకూ సాగిపోయారు. సుగ్రీవుని మహా ఆజ్ఞతో భూమిపై నుంచి పైకి లేచిన మహా మిడతల దండులా ఒకేసారి లేచి ప్రయాణమయ్యారు.

ఆ మాసమంతా శ్రీరామలక్ష్మణులు మాల్యవంత పర్వతం మీదే ఉన్నారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

రావణుడు కాన వస్తే చెట్టు పండులా తల కోస్తాను అని ఒకరు, సీతాదేవి పాతాళంలో ఉన్నా తీసుకువస్తాను అని మరొకరు, ఇంకొకరు సముద్రాలనూ చీలుస్తాను, చెట్లనూ నరుకుతాను, పర్వతాలనూ పగలకొడతాను. సీతమ్మ జాడను తెలుసుకుంటాను.

రావణుడ్ని ఒక్కగుద్దుతో గుండెలు పగల కొడతాను. ఇట్లు అనేక విధాలుగా వానరవీరులు వీర ప్రతిజ్ఞలు చేసి వెళ్ళగానే... స్వామి కార్యం సాగుతున్నందుకు సుగ్రీవుడు శ్రీరామునకు నమస్కరించాడు.

"కిష్కింధ రాజా... నీవు వానరవీరులను పంపుతూ నలు దిక్కుల గూర్చి ఎంతో విపులంగా వివరంగా చెప్పినావు. అంతటి మహోన్నతమైన విషయాలు నీకెలా తెలుసు. సమస్త భూమండాలన్నీ అరచేతిలో చూసినట్టు చెప్పావు" అడిగాడు శ్రీరాముడు.

సుగ్రీవుడు సవినయముగా వంగి విపులంగా చెప్పాడు.

"శ్రీరామచంద్రా! నా గతమంతా మీకు తెలుసు. వాలి నుంచి ప్రాణరక్షణకై నేనూ నా మంత్రులతో పారిపోతూ ఆయా నగరాలూ, సముద్రాలూ, పర్వతాలూ, గుహలూ చూశాను.

"వాలి నన్ను తరుముకు వస్తుండటంతో, కొరివి చక్రం గిర్రున గుండ్రంగా తిరిగినట్టు తిరిగాను. తూర్పు వైపుకి వెళ్ళాను. పర్వతాలూ, రమణీయ ప్రదేశాలూ, సిద్ధులనూ చూశాను. అట్లే నేను ఉదయ పర్వతం వరకూ వెళ్ళాను. అప్పుడే పాలసముద్రాన్నీ, అందాల భామలనూ చూశాను.

"వాలి నన్ను విడవక అక్కడికీ వచ్చాడు. భయంతో వింధ్యపర్వతానికి వచ్చాను. అక్కడికీ నన్ను వదలక వచ్చాడు. నేను దక్షిణం వైపున్న చందన వనంలోకి వెళ్ళాను.

"అట్లా నేను ఆ దిక్కుగా ద్వీపాలూ, నదులూ, సముద్రాలూ, రకరకాల పూలచెట్లూ, కాయల చెట్లూ చూసుకుంటూ దక్షిణ దిశలోని పితృలోకం వరకూ వెళ్ళాను. నా అన్న వాలి అక్కడా నన్ను ప్రశాంతంగా ఉండనీయలేదు.

"దానితో పడమర దిక్కుగా వెళ్ళాను. ఆ దిశలో నేను అస్తగిరి చేరాను. వాలి నన్ను వదలక పోవటంతో ఉత్తర దిక్కునున్న హిమవత్పర్వతం మీదుగా మేరు పర్వతాన్ని చేరి ఉత్తర మహాసముద్రాన్ని చేరాను.

"అట్లు నన్ను వాలి భూమండలమంతా తిప్పాడు. శ్రీరామా! ఇక తిరిగే శక్తిలేక ప్రాణాలు ఉగ్గబెట్టుకున్నాం. అప్పుడు వాయుపుత్రుడు హనుమ, మతంగముని శాపం గుర్తు చేశాడు. వాలి అందు అడుగుపెడితే శిరస్సు వక్కలవుతుంది అని చెప్పటంతో ఋష్యమూక పర్వతాన్ని ఆశ్రయించాము.

"వాలి మతంగ మహర్షి భయంతో ఏనాడూ రాలేదు ఆ ప్రాంతానికి. భూమి అంతా చుట్టి వచ్చి ఈ గుహల్లో తలదాచుకున్నాం. ఆ తర్వాత మీ దర్శనమైనది" చెప్పాడు సుగ్రీవుడు.

## సీతకై అన్వేషణ

రోజులు గడుస్తున్నాయి. శ్రీరాముడు వానరుల కోసం ఎదురు చూస్తున్నాడు. వానరులు పగలు అంతా విడిపోయి అన్నీ ప్రదేశాలూ, గుహలూ, నదీప్రాంతాలూ, పర్వతాలూ, భవనాలూ, డొంకలూ, దుర్గమ ప్రదేశాలూ అన్నీ వెతికి రాత్రికి ఓ చోటకు చేరుకుంటున్నారు. వేకువనే మళ్ళీ ప్రయాణమై సాగిపోతున్నారు.

సీతమ్మ జాడ తెలియ రాలేదు. రాత్రిళ్ళు పండ్ల చెట్ల మీద కొద్దిసేపు నిదురిస్తూ సుగ్రీవుని సూచనలతో పాటు, ఆ ప్రాంతాల్లోని చెప్పని ప్రదేశాల్లో కూడా వెతికారు.

మహా బలశాలి వినతుడు తూర్పు దిక్కు అంతా వెతికాడు. ఏ జాడాలేదు. ప్రస్రవణ పర్వతానికి మరలాడు. శతబలుడు ఉత్తర దిక్కు అంతా చూశాడు. ప్రయోజనం లేకపోవటంతో గడువు లోపలే చేరాలని వెనక్కి మరిలాడు. సుషేణుడు పడమర దిక్కు వెదికి సీతమ్మ జాడగానీ, రావణుడి జాడగానీ తెలియక పోవటంతో సుగ్రీవుని దర్శనానికి వెనక్కి తిరిగాడు.

వారు ముగ్గురూ శ్రీరామ సుగ్రీవులను చేరారు.

"మహాప్రభూ! తమరు చెప్పిన ప్రదేశాలూ, చెప్పని ప్రదేశాలూ, లతలు దట్టముగా అల్లుకున్న ప్రదేశాలూ పొదలనూ అన్నీ వెదికాము. చెట్లూ, పుట్టా, గట్లూ అని తేడా లేకుండా జల్లెడ వేశాము. జనవాసాలూ, లతావాసాలూ అన్నీ వెతికాము. ఏ జాడా దొరకలేదు.





"వానర రాజా... మహాకపి... వాయుపుత్రుడు హనుమ సీతను తీసుకెళ్ళిన దక్షిణ దిక్కుగా వెళ్ళాడు. ఇంకనూ రాలేదు. వీరుడూ, శక్తివంతుడూ అయిన హనుమ తప్పకుండా మైథిలీని చూసి వస్తాడు" చెప్పారు వానర వీరులు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

దక్షిణ దిక్కుగా తారునితో, అంగదునితో తన సేనా నాయకులతోనూ, సేనలతోనూ వెళ్ళిన హనుమంతుడు ఆయా ప్రదేశాలను వెదుకుతూ సాగిపోతున్నాడు. ముందుకు కదులుతున్నాడు.

మహాభీకర అరణ్యాలనూ, నదీ ప్రాంతాలనూ, సరోవరాలనూ, పూల వనాలనూ, కాయల తోటలనూ, వింధ్య పర్వత గుహల్లోనూ వెతికారు. దొరికిన కాయనూ, పండునూ తింటూ గాలించారు.

దక్షిణ దిక్కుగా ఉన్న నిర్జలమైన శూన్యమైన ప్రాంతాన్ని దాటారు. కాయలూ, పూలూ లేని చెట్ల వనాన్ని చేరారు. అక్కడ వెతికారు. ఎండిపోయిన సరోవరాలూ, మంచి వాసనలు గల పూల తోటలనూ చూశారు.

కండుమహర్షి ఆది వరకు అక్కడ ఉన్నాడు. ఆ మునీశ్వరుడి పుత్రుడుకి పదహారేళ్ళు. అకాల మరణం పాలయ్యాడు. ఆ ప్రాంతంలోని జలముకానీ, ఔషధులు కానీ ఏవీ అతని పుత్రుడిని బ్రతికించలేదు.

దానితో ఆయన తనకి ఉపయోగపడని జలాలూ, ఔషధులూ, పూలూ, పండ్లూ ఏవీ ఎవ్వరికీ ఉపయోగపడవని శాపం ఇచ్చాడు.

ఆ శాపఫలంగానే పువ్వులపై తుమ్మెదలు వాలవు. చెట్లకూ పూలుండవు. పూలుంటే ఆకులుండవు. ఔషధ చెట్టున్నట్టు వాసన ద్వార తెలుస్తుంది. చెట్లు కానరావు. జలపాతాలు జారి పడుతుంటాయి. క్రింద తటాకాల్లో నీళ్ళుండవు.

వానరులు ఆ అద్భుతాన్ని చూసుకుంటూ సావదాన చిత్తముతో వెదుకుతూ ముందుకు కదిలారు. మహా వృక్షాలతో నిండిన వనాన్ని చేరారు. అక్కడ భయంకరమైన అరుపు వినవచ్చింది. వానరులందరూ ఆశ్చర్యంగా చూశారు.

మహాభీకర రాక్షసుడు. పర్వతమంత ఉన్నాడు. వానరులను చూడగానే పెడబొబ్బలు పెట్టాడు. వానరుల మీదకు వచ్చాడు. దేవతలనూ భయపెట్టే అసురుడు. ఆహా నేటితో మీరంతా నా చేతిలో చస్తారు. పొలి కేకలు పెట్టాడు. వాలి పుత్రుడు అంగదుడు ఆ రాక్షసుడిని లాగిపెట్టి ఒక్క చరుపు చరిచాడు.

అంతటి రాక్షసుడూ ఆ దెబ్బకు వనాల్లోని వృక్షాలు విరిగిపోయేలా అరుస్తూ రక్తం కక్కుకొని ప్రాణాలు వదిలాడు. వానరులంతా ఆ గుహ సముదాయాల్లో వెతికారు. అంతా అలసిపోయారు. గడువుకాలం దగ్గర పడుతోంది.

వైదేహి జాడ తెలియరావుట లేదు. దీనమైన మనస్సులతో చెట్ల మధ్యలో కూర్చున్నారు. అంగదుడు సేనలకి చెప్పాడు.

"వానర వీరులారా! నిరుత్సాహ పడవద్దు. ఉత్సాహంతో దిగులూ, నిద్రా వదలి ముందుకు సాగి వెతుకుదాము.

"సుగ్రీవుడు ఎంత సాధుజీవో... అంతటి కోపిష్టివాడు. చండశాసనుడు. కాన దిగులు వద్దు. మనస్సు ఉత్సాహంతో ఉంచండి. నేర్పుతో కార్యాన్ని సాదిద్దాము. గడువులో అంతా వెతకి ఆయన్ని చేరవలెను" చెప్పాడు మహా బుద్ధిమంతుడైన అంగదుడు.

గంధమాదనుడు అంగదుడు హితమూ, అనుకూలమూ అయిన వాక్యములతో చెప్పినది సబబుగానే ఉన్నదన్నాడు. ఆలశ్యము పనికిరాదని చెప్పాడు.

వానరులంతా ముందుకు కదిలారు. గుహలనూ, రజత పర్వతాలనీ, ఏడే ఏడు ఆకుల గల అరటి తోటలనూ, వింధ్య పర్వత ప్రాంతాలన్నీ వెతికారు. రజిత పర్వతాన శోభాయుక్తమైన శిఖరాలనీ ఎక్కి, రమ్యమైన రోధ్ర వృక్షములనీ ఎక్కి చూశారు. ఊహు అచ్చుటా సీతా దర్శనము కానరాలేదు.

## హనుమంతుడూ, అంగదుడూ, తారుడూ బిలములోకి ప్రవేశించుట

హనుమంతుడూ, అంగదుడూ, తారుడూ వనాలనీ, సెలయేళ్ళు పారే పర్వత అంచు గుహలనూ వెతికారు. వింధ్య పర్వత నైఋతి దిశగా వెళ్ళారు. అప్పటికే సుగ్రీవుడిచ్చిన గడువు పూర్తి అయింది. అయినా శోధించారు. సీత జాడ కానరాలేదు.

ఆకలీ, దప్పికలయ్యాయి. వాటి కోసం అక్కడ అలా తిరుగుతూ గజుడూ, గవాక్షుడూ, శరభుడూ, గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ, సుషేణుడూ, జాంబవంతుడూ, నలుడూ, హనుమా, అంగదుడూ ఒక బిలాన్ని చూశారు.





లోపల ఏదన్నా సరోవరము ఉండవచ్చని లోనికెళ్ళారు. మయుడు నివశించిన బిలమది. ఋక్షబిలమను నామం కలది. వానర వీరులు అనేక మృగాలనూ, చెట్లనూ, లతలనూ చూస్తూ బిలములోకి చాలా దూరం వెళ్ళారు. వెళ్ళే కొద్దీ వెలుగు తగ్గిపోతోంది. ఎంతో దూరం పోయినా నీటి జాడ కానరాలేదు. చంద్రసూర్యులు కానరాకుండా రోమాంచనమును కలిగిస్తోంది.

దాహంతో నాలుకలు పిడచకట్టుకుపోయాయి. దూరంగా వెలుగు కనిపించింది. అటుకేసి వెళ్ళారు. ధగధగమనే మంట వెలుగుతో పోటిపడుతూ అనేక చెట్లను చూశారు. అనేక పూల చెట్ల పూలు బంగారు రంగుతో ఉన్నాయి. ప్రక్కనే కొలను ఉంది. తామర పువ్వులతో నిండిన నీరుని చూడగానే ప్రాణం లేచి వచ్చింది.

బంగారు చేపలూ, తాబేళ్ళూ తిరుగుతున్నాయి. బంగారంతోనూ, వెండితోనూ చేసిన గృహాలు కానవచ్చాయి.

చెట్లకు పూలూ, పండ్లూ విరగకాసి ఉన్నాయి. పూల మీద బంగారు రంగు గల తుమ్మెదలు తిరుగుతున్నాయి. వానరులు బంగారు గృహంలోకి వెళ్ళారు. రత్నాలూ, మణులూ పొదిగిన శయ్యలూ, బంగారు, వెండి, కంచులతో చేసిన పాత్రలు.

వాటిలో మధుర రసాలు... ఫలాలు... పానీయాలూ... రుచికరమైన తేనెలు, చిత్రాసనాలూ, ఎన్నో, అన్నీ ఉన్నాయి. వానరులకి నోరువూరింది.

అక్కడే ఓ వృద్ధ స్త్రీని చూశారు. కృష్ణా జినము ధరించి ఉంది. తేజస్సుతో ఉన్న శరీరం కృశించి పోయి ఉంది. వానరులంతా ఆమెని చూసి ఆగారు. హనుమంతుడు కదలి ఆ స్త్రీకి నమస్కరించాడు.

"ఎవరమ్మా నీవు! ఈ బిలంలో ఉన్న కారణమేమిటి? మేం దాహంతోనూ ఆకలితోనూ ఈ బిలంలోకి ప్రవేశించాము. ఎన్నో ఉత్తమ పదార్థాలతోనూ బంగారు, వెండి, రత్నాల రాసులతోనూ అద్భుతమైన వనాలతోనూ ఉంది."

నారచీరనూ, కృష్ణా జినమునూ ధరించిన పూజ్యురాలైన తాపసి చెప్పింది.

"పర్వతాకారా... ఈ బంగారు చెట్లూ, రమ్యమైన భవనాలూ, సరస్సుల లోని కనక కమలాలూ... అన్నీ మయుడు అనే రాక్షుడవి. తన అపూర్వశక్తితో వీటిని నిర్మించుకున్నాడు.

"దానవుల విశ్వకర్మ అయిన మయుడు వేలాది సంవత్సరాలు బ్రహ్మకై తపస్సు చేసి మెప్పించాడు. శిల్పాశాస్త్రమునూ, శుక్రాచార్యుని ధనాన్నీ పొందాడు.

బ్రహ్మ వరాలతో అపూర్వమైన ఈ బంగారు నగరాన్ని నిర్మించుకున్నాడు. హేమ అనే అప్సరసతో ఈ నగరంలో సుఖాలు అనుభవించాడు. దేవేంద్రుడు పగతో వజ్రాయుధంతో మయుడుని సంహరించాడు. ఆ దానవుడి కామభోగాలకీ, విలాసాలకీ నిర్మించుకున్న నగరమిది.

"ఆ పై ఈ నగరం హేమ స్వంతమైంది. ఆ హేమ ప్రియ చెలికత్తెను నేను. హేమ మంచి నాట్యగత్తె. ఆమె ఈ కాంచన నగరాన్ని కాపాడమని, నన్ను కావలిగా ఉంచి వెళ్ళింది. నేను మేరుసావర్ణి కూతురిని. నా పేరు స్వయంప్రభ. మీ గూర్చి నేను తెలుసు కొనగోరుతున్నాను. మీరంతా ఎవరు? ఎందుకోసం ఈ బిలంలోకి ప్రవేశించారు. అందుకు ముందుగా మీరు ఫలాహారాదులూ, పానాలూ తీసుకోండి" చెప్పింది తాపసి. వానరులంతా ఆకలీ, దప్పికలనూ సంతృప్తిగా తీర్చుకున్నారు.

"ఓ తాపసీ! మా క్షుద్బాధ తీర్చినందుకు ధన్యవాదములు. మేం వానరులం. మా రాజు వాలి తమ్ముడు సుగ్రీవుడు. దశరథమహారాజు పుత్రుడు అయోధ్యా రాముడు తండ్రి మాటకై అడవులకి వచ్చాడు. లోకైక వీరుడైన శ్రీరాముడిని ధర్మపత్ని సీతాదేవీ, ఆయన తమ్ముడు లక్ష్మణుడూ అనుసరించారు.

"వనవాసకాలంలో మాయోపాయంతో దానవుల రాజు రావణుడు కపటంతో శ్రీరామలక్ష్మణులు లేని సమయంలో సీతాదేవిని అపహరించాడు.

"విదేహరాజ పుత్రి సీతాదేవి జాడకై వెతుకుతున్న శ్రీరామునకూ, సుగ్రీవునకూ మైత్రి కుదిరింది. అధర్మంతో తనకీ గతి పట్టించిన వాలి గూర్చి సుగ్రీవుడు చెప్పాడు.

"మిత్ర ధర్మంతోనూ, స్నేహధర్మంతోనూ మహావీరుడైన వాలిని ఒక్క బాణంతో నేల కూల్చి సుగ్రీవునికి కిష్కింధ పట్టం కట్టాడు. వాలి పుత్రుడైన ఈ అంగదుడని యువరాజుగా చేశాడు సుగ్రీవుడు. ఉపకారానికి ప్రత్యుపకారంగా సుగ్రీవుని ఆజ్ఞతో సీతమ్మ జాడకై వెదుకుతున్నాము. అందులో భాగంగానే మీ బిలంలోకి చొరబడ్డాము.

"ఓ తాపసీ! అదీ మా వైనం. ఆకలీ, దప్పికలతో ఉన్న మాకు తనివి తీరా ఆకలీ, దప్పికలను తీర్చావు. మేం చెయ్యగలిగిన సాయం ఉంటే చెప్పిన చెయ్యగలము"





"నాయనలారా! బిలంలోకి వచ్చిన మీరు నా అతిథులు. కాన నా ధర్మం నేను చేశాను. ధర్మ దీక్షతో ఉన్న నాకు ఏమీయు అవసరంలేదు."

"ధర్మచారిణీ! మా అందరికీ మార్గం చూపవలెను. సుగ్రీవుడు విధించిన గడువు పూర్తి అయినది. అయిననూ మాకు వైదేహి జాడ తెలియలేదు. రాజాజ్ఞ మీరినా సరే సీతమ్మ జాడతోనే కిష్కింధ చేరుతాం. దానికి ముందు ఈ బిలం నుంచి మేం బైటికి వెళ్ళుటకు దారి శెలవివ్వగలవు" అడిగాడు.

"వానరులారా! ఈ బిలము నుంచి బైటికి వెళ్ళుట అసాధ్యం. ఎవ్వరైనా లోపలికి రాగలరేమో గానీ బైటపడలేరు. నేను నా తపఃశక్తితో మిమ్ము బైటికి తీసుకెళ్తాను. మీరంతా కనులు మూసుకోండి. కనులు తెరిచి ఉంచిన వారు బైటపడలేరు" చెప్పింది స్వయంప్రభ.

వానరులు చప్పున కళ్ళు ముసుకున్నారు. లిప్తపాటు కాలంలో స్వయంప్రభ వానరులను బైటికి చేర్చింది.

"వానరులారా! మీరిప్పుడు వింధ్య పర్వతం వద్ద ఉన్నారు. కన్నులు తెరవండి. దక్షిణ భాగమైన ప్రస్రవణ పర్వతము. అదిగో మహోదధి సముద్రం ముందుకు సాగండి" చెప్పి తన బిలంలోకి వెళ్ళిపోయింది స్వయంప్రభ.

వానరులంతా మహోదధి సముద్రాన్ని చూశారు. అలలతో భయంకరంగా ఉంది. వందల సింహాలు గర్జిస్తున్న సముద్ర ఘోష. అంతకు మించిన ఘోష వానరులూ పడ్డారు.

సుగ్రీవుడిచ్చిన గడువు పూర్తి అయింది. కార్యం సఫలం కాలేదు. దిగులూ, విచారంతో కూర్చున్నారు.

వసంతం వచ్చింది. పూలతో చెట్లు కిక్కిరిసి ఉన్నాయి. పిందెలు కట్టి ఉన్నాయి. కిష్కింధ యువరాజు మహాప్రాజ్ఞుడు అంగదుడు చెప్పాడు.

"వీరులారా! సుగ్రీవాజ్ఞ ప్రకారం ఇంతదూరం వచ్చాము. ఆయన ఆజ్ఞ ప్రకారం ఆశ్వయుజ మాసం లోపు కిష్కింధ చేరాలి. ఆ గడువు తీరిపోయింది. మనమిప్పుడు వెనక్కి వెళ్ళినా తేనె కళ్ళ సుగ్రీవుడి చేతిలో దండన ఖాయం. తప్పదు. దాని కన్నా మనం ఇక్కడనే అంతా ప్రాయోపవేశం చేద్దాం.

"భార్యలనీ, పిల్లలనీ మన ధనాన్నీ, ప్రియరాండ్లనూ అన్నీ వదలేసి ఇక్కడనే స్వర్గవాసులం అవుదాము. శ్రీరామ ఆజ్ఞతో సుగ్రీవుడు నన్ను యువరాజుని చేశాడు. ఆ రామకార్యం నేను నెరవేర్చలేకపోయినందుకు పవిత్రమైన ఈ సముద్రతీరమే మన ప్రాయోపవేశానికి అనువైన స్థలం."

"నిజమే యువరాజా! అపరాధం చేసిన వారు, రాజు ముందుకు వెళితే ఏం అవుతుందో అదే మనకు జరుగుతుంది. సీతాదేవి జాడ తెలిస్తే వేరు. అలా కాక కిష్కింధకు వెళ్ళుట, యమసదనానికి పోవుట రెండూ ఒక్కటే..."

తారుడు కలగచేసుకొని అంగదుడితో చెప్పాడు.

"యువరాజా! నా దొక మనవి. సర్వ సుఖాలు గల ఆ బిల భవనంలో నివసిద్దాం. అక్కడకి సుగ్రీవుడూ, శ్రీరాముడూ, లక్ష్మణుడూ రాలేరు. ఫలాలు తింటూ, భవనాల్లో విశ్రాంతి తీసుకుంటూ గడుపుదాం. ఆత్మహత్య మహాపాతకమని సర్వశాస్త్రాలూ తెలిసిన నీకు నేను చెప్పకూడదు. పానీయాలూ, జలాలూ, వృక్షాలూ, పండ్లూ, పూలూ అన్నీ ఉన్నాయి. కాన ఆలోచించండి."

అంగదుని ప్రతిపాదనా, తారుని సలహా హనుమంతుడు పూర్తిగా విన్నాడు.

"అంగదా! నీవు బుద్ధిలో బృహస్పతివి. వీరత్వంలో వాలివి. గ్రహణమూ, ధారణమూ, స్మరణమూ ప్రతిపాదనమూ, ఊహా, అపోహ, అర్థవిజ్ఞానమూ, తత్వజ్ఞానమూ అను అష్టాంగ బుద్ధి కలవాడవు. అట్లే బాహుబలమూ, మనోబలమూ, ఉపాయబలమూ, బంధుబలమూ అను నాలుగు బలాలున్నాయి. శుక్లపక్షం చంద్రుడివలె నిత్యం వృద్ధి పొందుతున్నావు.

"వాటితోపాటు దేశకాలాలు తెలియుటమూ, చిత్త స్థైర్యమూ, దుఃఖాన్ని దిగమ్రింగుటమూ, నిత్యం కొత్త విషయాలని తెలుసుకోవటమూ, శక్తి కలిగి ఉండటమూ, బలం కలిగి ఉండటమూ, ఆలోచనలను క్రియా రూపం దాల్చే వరకూ దాచి ఉంచటమూ, ఐకమత్యముతో ఉండటమూ, శౌర్యంతో సాధించే తత్వమూ, బలబలాలను ఎరిగి ప్రవర్తించటమూ, తలవంచిన శత్రువును కూడ ఆదరించటమూ, కోపాన్నీ, చాపల్యాన్నీ ఆపుకోవటం అను పధ్నాలుగు గుణాలు కలవాడవు. కాన అంగదా నా మాట విను. ఆలోచించు. పిరికివారివలె మరణించటమూ, బిలములో ఉండుటమూ రెండూ తప్పిదాలే.

"సుగ్రీవుడ్ని వదిలి నేను కానీ, జాంబవంతుడు కానీ, నీలుడూ, సుహోత్రుడూ కానీ ఎంత మాత్రం ఆ బిలంలో భార్యబిడ్డలని వదిలేసి ఉండరు. కాన కిష్కింధ వెళదాం... ఆ పై సుగ్రీవుని ఇష్టం. భార్యా మనస్కుడైన శ్రీరామ ప్రభువు దయ....

"ఇక నీ ఒక్కడివే ఉండినా, అరివీర శూరుడైన లక్ష్మణుడి బాణధాటికి బిలంలోని సమస్తమూ అగ్నికి ఆహుతి కాక తప్పదు. లక్ష్మణుడి వద్ద వజ్రా





యుధముతోనూ, పిడుగులతోనూ సమానమైనవి, పర్వతములను కూడా నుగ్గు నుగ్గు చేయగల బాణములున్నాయి. ఇప్పుడు రాజాజ్ఞను మాత్రం అతిక్రమించిన వారము. అలా చేస్తే రాజద్రోహం చేసినవారము అవుతాము. శ్రీరాముని దృష్టిలో గడ్డిపోచగా మిగిలిపోతాం...

"అంగదా! సుగ్రీవుడు దృఢవ్రతుడు. నీ తల్లి తార సంతోషాన్ని మాత్రమే కాంక్షించేవాడు. ధార్మికుడు. సుగ్రీవునికి నీవే బిడ్డవు. ఆయనకు పిల్లలు లేరు. కాన యువరాజువే కాదు కిష్కింధకి కాబోయే రాజు కూడా భవిష్యత్తులో నీవే" చెప్పాడు హనుమంతుడు.

## అంగదుని నిర్ణయము

"హనుమా! నీవు చతురోపాయాలతో చెప్పిన వన్నీ నాకు అవగతమైనవి. మీ అందరకూ నీవు చెప్పినది సబబే. నాకు మాత్రం కాదు. నా తండ్రి వాలి తమ్ముడు సుగ్రీవుడను నేను నమ్మజాలను. ఈ నెపం మీద నన్ను మందలించి వదిలినా.... కిష్కింధలో నాకు విలువ ఉండదు.

"మహోపకారం చేసి కిష్కింధను కట్టబెట్టిన శ్రీరాముని కార్యాన్నే నిర్లక్ష్యం చేసిన సుగ్రీవుడు ఈ తప్పును కాస్తాడంటావా! క్షమించి మన్నించి వదులు తాడంటావా! శూరుడూ, క్రూరుడూ, ఘాతకుడూ అయిన సుగ్రీవుడు నన్ను రహస్యంగానైనా దండిస్తాడు.

"ఉమ్మడి భార్యగా దేవతలు నా తల్లిని వాలికీ, సుగ్రీవునికీ ఇచ్చినా నా తండ్రి వాలి శౌర్యంతో ఒక్కడే స్వంతం చేసుకున్నాడు. ఆపై నా తండ్రి మరణం తర్వాత సుగ్రీవుడు అతి నీచంగా పొందుట ఎట్లు సమ్మతం. అట్టి వాడ్ని నేను ఎలా నమ్మగలను.

"శ్రీరామలక్ష్మణులకు నా మొహం ఎలా చూపేది. వారికి నా నమస్కారాలు చెప్పండి. నా తల్లి తారకు అంతిమ నమస్కారము తెలియచేయండి. పిన తల్లి రుమాదేవిని కుశలము అడిగానని చెప్పండి" అని చెపుతూ దుఃఖిస్తూ నేల మీద దర్భలు పరిచి పడుకున్నాడు.

వానరులంతా గగ్గోలు పెట్టారు. పెద్ద పెట్టున ఏడుపు లంకించుకున్నారు.

"అంగదా! వానర రాజా... నువ్వే మా రాజువి. నీ మార్గమే మా మార్గం. మేమునూ కిష్కింధ పోజాలము" అంటూ వారూ సముద్రంలో స్నానం చేసి ఉత్తర తీర మందు దర్భలు దక్షిణాగ్రముగా పరచి ఆచమనం చేసి తూర్పు

దిక్కువైపు అభిముఖులై కూర్చున్నారు. శ్రీరాముని గూర్చి, లక్ష్మణుని గూర్చి చెప్పుకుంటూ గోలగోలగా ఏడుస్తున్నారు.

## సంపాతి

వారి ఏడుపులూ, పెడబొబ్బలూ ఆ గుహల్లోనే ఉంటున్న గెద్దల రాజు, బల పౌరుషములు గలవాడు అయిన సంపాతి చెవున పడ్డాయి. సంపాతి జటాయువు జ్యేష్ఠభ్రాత. వృద్ధుడు. నెమ్మదిగా బైటికొచ్చాడు. దర్భలు పరుచుకొని ప్రాయోపవేశం చేసుకుంటున్నారు వానరులు. వారిని చూడగానే సంపాతికి నోట్లో నీళ్ళు వూరాయి.

"ఆహా వానరులారా! నా పంట పండింది. ఆకలి గొన్న వాడికి మధుర భక్ష్యాలు లభించినట్టు మీరు లభించారు. రోజుకొక్కడిని తినేస్తాను. నే చేసుకున్న పుణ్యఫలం ఈ విధంగా పరిగణించింది. నే చేసుకున్న పుణ్యం ఇదిగో మీ రూపంగా నా చేతికి, నోటికి వచ్చి దక్కబోతోంది" అని సంబరంతో చెప్పాడు సంపాతి.

అంగదుడు హనుమంతుడితో చెప్పాడు.

"చూశావా హనుమా! మన పని మరింత తేలికయ్యింది. యముడే పక్షి రూపాన వచ్చాడు. ఆ రాక్షస పక్షికి ఆహారంగా అయ్యి అంతిమ క్షణాన ఓ మంచి పని అయినా చేద్దాము. శ్రీరాముని కార్యం చేయని మనం మృత్యువు చెంతకే వెళ్ళుట సముచితం. సుగ్రీవాజ్ఞ ప్రకారం మాసం గడువు తీరింది.

"ఈ వానరులంతా ప్రభు భక్తులు. అందరికీ ఒకేసారి కష్టం వచ్చింది. సీతాదేవి కోసం ఆనాడు జటాయువు తన ప్రాణాన్నే పణంగా పెట్టాడు. మళ్ళీ అదే విధంగా వైదేహి కోసం వానరులైన మనం ఈ పక్షికి ఆహారంగా మారబోతున్నాము.

"సర్వలోకాల్నీ సంతోష పెట్టగల రాముడి కోసం ఆ జటాయువులా మనం ప్రాణాన్ని తృణప్రాయంగా అర్పిద్దాం. అడవులూ, కొండలూ, కోనలూ వెతికాము. సీతమ్మ జాడ తెలియలేదు. మరణించటానికి సిద్ధమైనప్పుడు ఎలా అయితేనేం... రా పక్షిరాజా... ఆహారంగా స్వీకరించు" చెప్పాడు అంగదుడు.

సంపాతి అంగదుడి మాటలు విన్నాడు.

"ఓయీ వానరుడా! ఏం మాట్లాడుతున్నావు. జటాయువు మరణించాడా! అమంగళం. నాకు కోపం తెప్పించకు. మహావీరుడూ, శక్తివంతుడైన జటాయువు





మరణించాడా! అబద్ధం. జరిగిందేమిటో చెప్పండి. సూర్య కిరణాల వల్ల నా రెక్కలు పోయాయి. ఈ గిరి దుర్గము నుంచి క్రిందకి దింపండి.

"నేనే రావలన్న ఎంతో సమయం పడుతుంది. జనస్థానమునున్న నా ప్రియతమ్ముడు జటాయువుకు ఏం జరిగినది. ఆలస్యంగాకుండా చెప్పవలెను" అడిగాడు సంపాతి హీన, దిగులు స్వరంతో...

వానరులంతా సంపాతి మాటలు విన్నారు.

"ఓ పక్షిరాజమా! కపటమాటలతో మమ్ము మాయ చేయవలదు. మేం మరణించుటకు సిద్ధంగా ఉన్నాము. కాన మమ్ము నీవు నిరభ్యంతరంగా భక్షించవచ్చు" చెప్పాడు అంగదుడు.

"వానరులారా! నన్ను నమ్మండి. ఈ కొండ కొప్పు నుంచి క్రిందకి దించండి. నా తమ్ముడు జటాయువు.... అది సత్యం. పక్షిరాజు మీద ఆన."

వానరులు సంపాతిని క్రిందకు దింపారు. అప్పుడు చెప్పాడు అంగదుడు.

"ఇక్ష్వాకు వంశరాజు దశరథుడు. అతనికి ముగ్గురు ప్రియ భార్యలు కౌసల్యా, సుమిత్రా, కైకేయీలూ. కౌసల్యా పుత్రుడు శ్రీరాముడు తండ్రి మాటతో భార్యతోనూ, తమ్ముడితోనూ అడవులకి వచ్చాడు.

"వనవాసకాలంలో అధర్మంతో రాక్షసుడు రావణుడు సీతను చెరపట్టాడు. ఆ సమయాన జనస్థానమున జటాయువు రావణుడ్ని అడ్డగించి అతని చేతిలో చచ్చిపోయాడు.

"ఆ పై సుగ్రీవునితో స్నేహం చేశాడు శ్రీరాముడు. తన అన్న వాలి దుర్మార్గం చెప్పాడు సుగ్రీవుడు. వాలిని చంపి సుగ్రీవుడికీ, వాలి పుత్రుడు అంగదునికీ పట్టం కట్టాడు శ్రీరాముడు.

"ఆ స్నేహ ధర్మంతోనూ, ఉపకార ఫలం పొందిన ధర్మంతోనూ సుగ్రీవుని ఆజ్ఞ మీద సీతాదేవిని వెతుకుటకు బైలుదేరాము. రాజు ఆజ్ఞ ప్రకారం గడువు దాటిపోయింది. వెనక్కి ఉత్త చేతులతో వెళ్ళలేక ప్రాయోపవేశానికే మొగ్గు చూపాము" చెప్పాడు అంగదుడు.

## శుభవార్త

వానరులు చెప్పినదంతా సావధానంగా విన్నాడు సంపాతి. "మీరు చెపుతుంటే నా రక్తం సలసలా కాగిపోతుంది. నా తమ్ముడిని చంపిన రావణుడిపై పై పగ తీర్చుకొను శక్తి నాకు లేదు. వృద్ధుడనయ్యాను.

"వృత్రాసురుడి వధ జరుగుతున్నప్పుడు నేనూ, జటాయువు పందెం పెట్టుకొని సూర్యుని వైపు పయనించాము. కిరణముల పంక్తులతో ప్రజ్వలించుతున్న సూర్యునికి దగ్గరిగా పోవటంతో అంత వేడి భరించలేక ఆగిపోయాడు. నడినెత్తి కొచ్చేసరికి సూర్యుని కిరణాలు మరింత వేడెక్కాయి.

"తమ్ముడి బాధ చూడలేక నా రెక్కలతో జటాయువును కమ్మేశాను. ఆ మహోగ్రమైన వేడి కిరణాలకి నా రెక్కలు కాలిపోయాయి. అక్కడ్నించి ఈ వింధ్య పర్వత ప్రాంతంలో పడిపోయాను. అంతే ఆపై నాకు నా తమ్ముడు జటాయువు జాడ తెలియలేదు" చెప్పాడు సంపాతి.

అంగదుడికి ఆనందం వేసింది. దిగులూ, భయాన్నీ వదిలాడు.

"దాహం వేస్తున్నవాడికి, సరస్సులా అగుపించినట్టు నీవు మాకు అగుపిస్తున్నావు. రావణుడి జాడగానీ, సీతమ్మ వైనం కానీ నీకు తెలుస్తే చెప్పు... ఆ రాక్షసుడి వివరాలు చెప్పు" అడిగాడు అంగదుడు.

"వానరులారా! నాకు రెక్కలు లేవు. బలమూ, శక్తీ లేవు. లేదంటే నేనూ రామకార్యంలో పాలు పంచుకునేవాడిని. నాకు అతల, కుతల, రసాతల లోకాలన్నీ తెలుసు. త్రివిక్రముడైన శ్రీమహావిష్ణువు అడుగు పెట్టిన ఊర్ధ్వలోకాలూ తెలుసు.

"దేవాసుర యుద్ధమూ, అమృతము కోసము దేవతలూ, రాక్షసులూ చేసిన అమృత మథనమూ తెలుసు. దుష్టుడూ, కాముకుడూ అయిన రావణుడు ఓ స్త్రీని ఎత్తుకుపోవటం చూశాను.

"ఆ స్త్రీ అపురూప సౌందర్యవతి. రూప సంపన్నురాలు సమస్త అలంకారములు చేసుకొని ఉన్నది. జట్టు వీడిపోయి ఉంది. నగలతో ఉంది. ఆ నగలని ఒక్కొక్కటీ తీస్తూ పారవేస్తూ ఉంది.

"రామా! లక్ష్మణా! అంటోంది గట్టిగట్టిగా... మహా మెరుపు తీగలా ఉన్న ఆమె రోదిస్తోంది.

"వానరులారా! ఆ రావణాసురుడు విశ్రవసుడి కొడుకు. కుబేరుడి తమ్ముడు. వాడి జనస్థానము లంకా నగరము. ఆ నగరం ఇక్కడికి నూరు యోజనాల దూరంలో ఉంది.

"విశ్వకర్మ సముద్ర మధ్యమున చేసిన నగరం. బంగారమూ, రత్నాలూ, మణులూ, వజ్రాలతో నిర్మించిన నగరము. అద్భుతవనాలతో, ఉద్యాన వనాలతో దేవేంద్రుడి అమరావతిని మించిన వైభవం గల నగరమది.





"జనకరాజు సుతను చూడవలెనన్నా, ఆమె స్థితి తెలియవలెనన్నా మీరు అచ్చటకి పోవలెను. మీరు అచ్చటకి వెళ్ళటానికి ఆకాశమార్గమే దారి. ఆ ఆకాశ మార్గంలోనూ ఏడు దారులున్నాయి.

"నేలకి కొద్ది ఎత్తులో పిచ్చుకలు ఎగురుతుంటాయి. కాకులు రెండవ ఎత్తులోనూ, క్రౌంచ పిట్టలూ, లకుముకి పిట్టలూ మూడొవ ఎత్తుదారిలోనూ, డేగలూ లాంటివి నాలుగొవ ఎత్తు వీధిలోనూ, ఐదో ఎత్తు వీధుల్లో గద్దజాతి పక్షులూ ఎగురుతుంటాయి. ఆరవ ఎత్తు వీధుల్లో హంసలు తిరుగుతుంటాయి. అన్నింటిలో ఎత్తు ఏడో మార్గం. ఆ మార్గాన, ఆ దారిన ఏవీ ఎదురురావు. అడ్డు ఉండవు. బలమూ, పరాక్రమమూ శక్తితోనూ లంక చేరవచ్చు.

"వీరులారా! నాది అరుణుడి వంశము. నేత్రపాటవము ఉన్నది. నేను కదలకనే చెప్పగలను.

"గరుత్మంతునకు ఎట్టి దివ్యమైన నేత్రమున్నదో, బలమున్నదో నాకునూ అట్లే ఉన్నది. నూరు యోజనాల దూరంలో ఏం ఉన్నా నేను చెప్పగలను. సీతాదేవి లంకలో ఉన్నది.

"రావణుడు తీసుకెళ్ళినది సీతను కాదు. సాక్షాత్తు మృత్యుదేవతను. ఆ విషయం అతనికి తెలిసే సరికే అంతా అయిపోతుంది. సర్వం నాశనం అయిపోతుంది. వెళ్ళండి. లంకవెళ్ళి వైదేహిని చూసి వచ్చి శ్రీరాముడికి విన్నవించండి. ఆపై రామబాణమే మాట్లాడుతుంది. రాక్షసుల నాశనం ప్రారంభమవుతుంది.

"మిత్రులారా! దయతో మీరు నన్ను సముద్రం వద్దకు తీసుకువెళ్ళండి. స్వర్గస్థుడైన ఉత్తమ బుద్ధి గల నా తమ్ముడు జటాయువుకి జల తర్పణములు చేయవలెను" చెప్పాడు సంపాతి.

వానరులు సంపాతిని సముద్రం వద్దకు తీసుకెళ్ళారు. తమ్ముడు జటాయువుకు దుఃఖంతో, ప్రేమతో జల తర్పణములు వదిలాడు సంపాతి. ఆ తర్వాత సంపాతిని యథాస్థానంలోకి చేర్చారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

వానరులంతా సంపాతి చుట్టూ చేరారు. జాంబవంతుడు అడిగాడు.

"పక్షిరాజమా! సీతాదేవిని ఎత్తుకొని పోయిన రావణుడి గూర్చి నీకు ఇంకేమి తెలియును. నీతోపాటు మరెవరైనా గాంచినారా.... శ్రీరామలక్ష్మణుల

పరాక్రమాన్ని మరిచి సీతను అపహరించిన ఆ దుష్టుడు గూర్చి తెలిసిన నీవే మాకు దిక్కు. దయతో చెప్పుము.”

“వానరులారా! గంధర్వులకు కామం ఎక్కువ. పాములకు కోపము ఎక్కువ. మృగాలకు భయం ఎక్కువ. మా పక్షిజాతులకు ఆకలి ఎక్కువ. ఆకాశ మార్గం నుంచి ఈ వింధ్య పర్వతం వద్ద పడినప్పట్నించి నా పుత్రుడు సుపార్శ్వుడే నాకు ఆహారాన్ని అందిస్తున్నాడు.

“ఓ రోజు సుపార్శ్వుడు ఆహారం తేలేదు. వట్టి చేతులతో వచ్చాడు. కారణమేమిటని కోపం తెచ్చుకున్నాను. ఆకలితో అరిచాను.”

అందులకు నా పుత్రుడు....

“నాయనా! నీకూ నాకునూ ఆహారం కోసం మహేంద్ర పర్వత ద్వారము వద్దకు పోయినాను. అక్కడ ఒక నీచుడు కాటుకరాశివలే ఉన్నవాడు సూర్యోదయ సమాన కాంతి గల స్త్రీని తీసుకు వెళుతున్నాడు. ఆ తల్లి రామా... రామా అంటోంది. ఆహారం కోసం ఉన్న నన్ను చూసి అడ్డు తొలగమని హుంకరించాడు.

“నా చిన్న రెక్కలతో వాడితో పోరాడలేను కనుక నేను ప్రక్కకి వచ్చాను. వాడ్నే చూస్తుండిపోయాను. మహా తేజస్సుతో ఉన్నాడు.

“ఆ తర్వాత ఆకాశ మార్గాన ప్రయాణించే సిద్ధులూ, చారణులూ వాడే రావణుడనే రాక్షసుడని చెప్పారు. ఇదంతా జరుగుట వల్ల ఆహారాన్ని తేలేకపోయాను” అని చెప్పాడు.

అటుల నాకు తెలుసును. వానరులారా! రావణుడు సమర్థుడు. మీరు అంతకు మించిన సమర్థులు. లంకకు వెళ్ళండి.

సీతమ్మ జాడను శ్రీరాముడునకు చేరవేయండి. బుద్ధిమంతులు కార్య నిర్వహణలో ఆలస్యం చెయ్యరు....

“ఇన్నాళ్ళకు నా శ్రమ ఫలించింది. శ్రీరామ కార్యాన్ని పూర్తి చేశాను... శ్రీరాముని బాణాలు ముల్లోకాలనూ రక్షించగలవు. భక్షించనూ గలవు. శ్రీరాముడి పని పూర్తి చేశాను. విషయం అంతా మీకూ తెలియచేశాను” చెప్పాడు సంపాతి.

“శ్రీరామ కార్యమా! నీ పని పూర్తి అయినదా! అర్థం కావటం లేదు” అడిగాడు హనుమంతుడు.





# సంపాతి గాథ

సంపాతి తను చుట్టూ ఉన్న అంగద, జాంబవంత, హనుమంతాది, వానరులకి చెప్పాడు.

“వానరులారా! ఈ రోజు కోసమే నూరు సంవత్సరాల నుంచి ఎదురు చూస్తున్నాను. నా తమ్ముడు జటాయువును కాపాడే ప్రయత్నంలో నా రెక్కలు తెగి ఇక్కడ పడ్డాను. ఆరు రోజులు తెలివి లేకుండా పడి ఉన్నాను. ఆ తర్వాత నెమ్మదిగా కదిలాను. అన్ని దిక్కులూ చూశాను.

“కొండలూ, నదులూ, సముద్రాలూ, గుహలతో నిండి ఉన్న ఈ ప్రాంతం వింధ్యపర్వత ప్రాంతమని దక్షిణ సముద్రమని తెలిసింది.

“ఈ పవిత్ర వింధ్య పర్వత ప్రాంతంలోనే, దేవతలు సహితం వచ్చి పూజించే ఉగ్రమైన తపస్సు చేసే నిశాకరుని పుణ్యమైన ఆశ్రమం ఉంది. జటాయువూ, నేనూ కలిసి ఇంతకు ముందు దర్శించాము.

“ఆయన ఆశ్రమం పెద్ద పర్వతం మీదుంది. ఎన్నో వ్యయప్రయాసల కోర్చి పర్వతం ఎక్కి ఆయన్ని వేడుకున్నాను. నిశాకరుని ఆశ్రమంలో పూలు పూయని చెట్లూ, కాయలు కాయని చెట్లూ మచ్చుకైనా కానరావు.

“ఆ తాపసి స్నానాదులన్నీ పూర్తి చేసుకొని, తేజోవంతంగా దర్శనమిచ్చాడు. మహారాజులూ, చక్రవర్తులూ, వెంట మంత్రులూ సామంతులూ విధేయతలతో ఉన్నట్టు, క్రూర, సాధు అను తేడా లేకుండా ఆయన చుట్టూ ఎలుగుబంట్లూ, సృమరములూ, పెద్ద పులులూ, సింహములూ, సర్పాదులు లాంటివి బ్రహ్మదేవుడను ప్రాణులు అనుసరించినట్టు ఆయన చుట్టూ జంతువులు ఉంటాయి. నన్ను చూసి జాలి పడ్డాడు. మొదట నేనెవరో గుర్తుపట్టలేదు. నీ పేరు సంపాతి కదూ, నీ సోదరుడి పేరు జటాయువు కదూ... చాలా రోజుల క్రితం మీ ఇద్దరూ నన్ను దర్శించారు.

“నీ రెక్కలు కాలిపోయ్యాయే, ఈకలన్నీ ఊడిపోయి ఉన్నాయి. ఏమైనది? గెద్దల రాజులు మీరు. మీకు అడ్డేమున్నది. ఇట్లు ఈ స్థితికి వచ్చిన కారణమేమిటి?” అని అడిగాడు ఋషీశ్వరుడు.

దానికి నేను జరిగింది జరిగినట్టు చెప్పాను.

“గెద్దల రాజా సంపాతీ... సూర్యుడ్ని అనుసరించటమూ, వెంబడించటమూ తగదు. అందులకే దేహము వ్రణమయినది.”

"స్వామీ! బాధతో ఉన్నాను. ప్రశ్నకు సమాధానం కూడా చెప్పలేని నీరసంతో ఉన్నాను. నన్ను దయ చూడవలెను. జటాయువూ, నేనూ పోటీ పడ్డాము.

"సూర్యుడు అస్తగిరి వెళ్ళేలోపు ఆయన్ని చేరే ధీరుడెవ్వడని గర్వంతో పందెము కట్టుకున్నాము.

"కైలాస శిఖరం నుంచి ఎగిరాము. మహావేగంతో పోయాము. మహా పర్వతాలు పెద్ద పెద్ద ఏనుగులవలె, ఆంబోతులవలె కనిపించాయి. ఈ దండకారణ్యమంతా పచ్చటి పచ్చిక బయలుగా పై నుంచి కానవచ్చింది. పర్వతములతో కూడిన భూమి రాళ్ళు కప్పినట్టు కనిపించింది. భూమి మీద నదులన్నీ నేలపై దారములు పరిచినట్టుగా అగుపించాయి.

"అలా వెళుతూనే ఉన్నాము. శరీరంలో శక్తి సన్న గిల్లుతుంది. కళ్ళు మసక బాకాయి. సూర్యభగవానుడి వేడి తట్టుకోలేకపోయాము. అప్పటికే జటాయువు నేలరాలుతున్నాడు. విలవిలలాడుతున్నాడు.

"సూర్యుడు కనిపించాడు. భూమి కంటే పెద్దగా అగుపించాడు. నేను ఆలోచించకుండా జటాయువుకి ఏమీ కాకుండా నా రెక్కలు అడ్డు పెట్టాను. అప్పుడు నా రెక్కలు కాలిపోయాయి. జటాయువు జనస్థానంలో పడిపోయి ఉండవచ్చు...

"నేను వింధ్య పర్వతంపై పడ్డాను. ఆరు రోజుల తర్వాత తెలివి తెచ్చుకొని, పరిసరాలు గమనించి మీ వద్దకు వచ్చాను."

## నిశాకర మహర్షి బోధ

అంటూ పలికి దుఃఖించాను. పూజ్యుడైన ముని ఇలా చెప్పాడు.

"సంపాతీ! దిగులు చెందకు. నీకు మంచి రోజులు వస్తాయి. ఇక్ష్వాకు వంశస్థుడైన దశరథమహారాజు పుత్రుడు శ్రీరాముడు, అతని తమ్ముడు లక్ష్మణుడితో సత్యవాక్య పరాక్రమముతో దండకారణ్యం వస్తాడు.

"దేవ, దానవులెవ్వరూ జయించలేని లంకాధిపతి రావణుడు మాయోపాయం చేత శ్రీరాముడి ధర్మపత్నిని అపహరిస్తాడు. సర్వసుఖాలకి ప్రలోభపెడతాడు సీతను రావణుడు. మహాభాగ్యవంతురాలు, కీర్తిమంతురాలు సీతాదేవి భక్ష్య, భోజ్య, ధన, కామాలని తృణప్రాయంగా నిరాకరించి శ్రీరాముని కోసమే తపిస్తుంటుంది.





"మహాపతివ్రత సీత శ్రీరాముని ధ్యానంలో మునిగిపోతుంది. అన్న పానాలు కూడా ముట్టదు. అది తెలిసి దేవతల రాజు దేవేంద్రుడు దివ్యాన్న మును పంపుతాడు.

"దేవేంద్రుడు పంపినది అని తెలుసుకున్న సీత తొలి ముద్దను శ్రీరాముడికీ, లక్ష్మణుడికీ అర్పిస్తుంది.

"మైథిలీని వెతుకుతూ వానరులొస్తారు. సీతాదేవి వృత్తాంతము కాల గమనాన నీకు తెలుస్తుంది. ఆ సంగతి వానరులకి చెప్పాలి. అప్పుడు నీకు మళ్ళీ రెక్కలొస్తాయి. రాజ్యం పోగొట్టుకున్న శ్రీరాముడు మళ్ళీ వైభవోపేతంగా పట్టాభిషక్తుడైనట్టు... నీకు రెక్కలు వస్తాయి. యవ్వనంతో మిడిసిపడతావు.

"కాన సంపాతి నీవు దిగులు చెందవద్దు. ఎక్కడికీ పోవలదు. దేవతలూ, ఋషులూ, సిద్ధుల వలే నీవు శ్రీరామ కార్యము కొరకై ఎదురు చూడవలెను. వంద సంవత్సరాలు వింధ్యపర్వతం పైన గడపవలెను.

"నాయనా సంపాతీ! నాకు రామలక్ష్మణులను చూడవలెనన్న కోర్కె ఉంది. అంతవరకూ బ్రతుకుట నాకు ఇష్టం లేదు. ఈ శరీరాన్ని వదలి పెట్టవలెనని అనుకుంటున్నాను" అని చెప్పి ఆ మహర్షి తన దేహాన్ని వదలి దివ్యకాంతులతో ఆకాశ మార్గాన పుణ్యలోకాల దిశగా వెళ్ళాడు.

## సంపాతి సంతోషం

అలా నేను మునీశ్వరునికి నమస్కరించి అనుజ్ఞ పొంది పర్వత గుహ నుంచి మెల్లగా ప్రాకుతూ వింధ్య పర్వతం చేరి జీవిస్తున్నాను.

సంపాతి అలా చెబుతుండగానే భూమిని చీల్చుకొని జల ధారవచ్చినట్టు ఎర్రని ఈకలతో రెక్కలొచ్చాయి. సంపాతి ఆనందానికి అవధులు లేవు. కొత్తగా వచ్చిన రెక్కలను టపాటపా కొట్టాడు. అమృతం త్రాగినట్టు గెంతాడు. శిఖరాల మీదకు రివ్వున వెళ్ళాడు. ఆ కొండ మీద నుంచి ఈ కొండ మీదకు ఎగిరాడు.

వానరులతో సంతోషంగా చెప్పాడు.

"నిశాకర మహాఋషి మాట ప్రభావంతో మళ్ళీ పూర్వపు శక్తితో గెద్దల రాజునయ్యాను. నేను యవ్వనదశలో ఎట్టి వేగమూ, పరాక్రమములతో ఉన్నానో ఇప్పుడూ అట్లే ఉన్నాను. శ్రీరామునకూ, లక్ష్మణుడనకూ, సీతమ్మ తల్లికీ నా వందనములు.

"వెళ్ళండి నా రెక్కలు రావటము ఎంత సత్యమో సీత మీకు కనిపించుట అంత సత్యం" చెప్పాడు సంపాతి.

వానరులకి నూతనోత్సాహం వచ్చింది. శ్రీరాముని తల్చుకొని అభిజిన్ముహూర్తము దాకా వేచి ఉండి దక్షిణ దిశగా వెళ్ళారు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

మహాసముద్రం కెరటాలతో ఒడ్డున ఉన్న మహాబండరాళ్ళని పెటేలున కొడుతోంది. అనంతమైన సాగరాన్నీ దాని వైశాల్యమునూ చూసి వానరులు గెంతులు వేశారు.

ఆ మహాసముద్రాన్ని దాటి ఎవరు వెళతారు. మహాసముద్రంలో ఓ చోట ప్రశాంతత. మరోచోట కల్లోలం. మహా పర్వతాలనే కబళించే జలచరాలు, భయంకర రాక్షసులు... నూరు యోజనాల దూరం. ఎంతో దూరం. సముద్ర ఘోషతో సమానంగా వ్యథ చెందారు వానరులు.

అంగదుడు భయపీడితులైన వానరులను ఓదార్చాడు.

"నిరాశ పడవద్దు. ఏదైనా చెయ్యాలనుకుంటే చెయ్యగలలేమని నిరాశ పడితే చేసే శక్తి ఉండి కూడా ఏమి చెయ్యలేం" చెప్పాడు అంగదుడు.

దేవేంద్రుడి చుట్టూ దేవతలు మూగినట్టు అంగదుడి చుట్టూ మూగారు. చర్చించుకున్నారు. తర్జన భర్జనలు చేశారు. ఆ రాత్రి గడిచింది. తెల్లారింది. అంగదుడు అడిగాడు.

"వానరులారా! కనిపిస్తున్న సముద్రాన్ని దాటి సీత జాడ ఎవరు తెలుసుకుంటారు. వీరులారా మీరంతా శక్తి వంతులు. సుగ్రీవుని మాటను ఎవరు నెరవేరుస్తారు.

"వంద యోజనాల దూరం. సీతమ్మ జాడ తెలుసుకొని వెళితే సుగ్రీవుడు మన తప్పు కాస్తాడు. శ్రీరాముడు రక్షిస్తాడు. మనం భార్యలనూ, ఆస్తులనూ తిరిగి అనుభవించవచ్చు" అంగదుని మాటలకు ఎవరూ ముందుకు రాలేదు. అంతా బిక్కమొహం వేసి ఒకరినొకరు చూసుకున్నారు.

అంగదుని మాటలతో వానరులు నిశ్చలమైనట్టు చాలా సేపు పలకలేదు.

"వానరులారా! పలకండి. మీ శక్తి భేరీజు వేసుకోండి. మీరంతా శ్రేష్ఠులు. దృఢపరాక్రమము కలవారు. ఎవరు ముందుకు వస్తారో రండి" చెప్పాడు శ్రీమంతుడైన అంగదుడు.





"కిష్కింధ యువరాజా నేను పది యోజనాలు దాటగలను" చెప్పాడు గజుడూ. గవాక్షుడు ఇరవై యోజనాలన్నాడు. ముప్పై అని గవయుడూ, గంధమాదనుడు నలభై యోజనాలన్నాడు. శరభుడూ యాభై యోజనాలన్నాడు. మైందుడు అరవై అన్నాడు.

ఎవరూ వంద అనలేదు. అంగదుడు అందరినీ ఆశతో చూశాడు. ద్వివిదుడు డెబ్బై యోజనాలూ, సుషేణుడు ఎనభై యోజనాలు అన్నాడు. "వంద యోజనాలు వెళ్ళి తిరిగి రాగల ధీరుడెవ్వడు. జగదేక వీరుడెవ్వడు" అడిగాడు అంగదుడు. ఎవ్వరూ ముందుకు రాలేదు.

"అయితే నేనే వెళ్ళి వస్తాను. అంత వరకూ ఈ సముద్రం వద్దే వేచి ఉండండి."

జాంబవంతుడు ముందుకు వచ్చాడు.

"అంగదా! నేను ఓపిక చేసుకొని తొంభై యోజనాలు వెళ్ళగలను. కానీ ఈ వయస్సులో తిరిగి రాలేను. అంగదా! అన్ని యోజనాలు వెళ్ళగలిగేది నీవు మాత్రమే. నీ అపూర్వ ఆకాశ గమన శక్తి నాకు తెలుసు. వెయ్యి యోజనాలైనా అవలీలగా వెళ్ళగలవు.

"కానీ రాజు చెప్పి చేయించుకోవాలి. మా అందరికీ స్వామివి. ఈ వానరవీరులలో ఎవరినైనా నీవు వెళ్ళమని ఆజ్ఞాపించవచ్చు.

"రాజంటే భార్యతో సమానం. భార్యని మనం రక్షించుకుంటున్నట్టే రాజుని సదా రక్షించుకోవాలి. ఈ మహా రామ కార్యానికీ, సుగ్రీవుని ప్రతిజ్ఞకూ నీవు వృక్షము వేరు లాంటివాడివి. కాన నీవు ముందుకు కదలరాదు" చెప్పాడు జాంబవంతుడు.

"మరి నేనూ వెళ్ళక మీరు వెళ్ళక ఎలా? నేను కూడా వెళ్ళగలుగుతానన్న నమ్మకం లేదు. తప్పక ఏది అయితే అదయిందని వెళ్ళటమే. ఎవరో ఒకరు వెళ్ళి సీతమ్మ జాడ తెలుసుకోకపోతే సుగ్రీవుని చేతిలో అందరికీ మరణం తప్పదు. గడువు దాటినా రానందుకు, చేతకానందుకు మనమే మళ్ళీ ప్రాయోపవేశానికి సిద్ధపడాలి" చెప్పాడు అంగదుడు.

"యువరాజా! ఈ మహోత్తర కార్యాన్ని సాధించుకు రాగల వీరుడు మనలోనే ఉన్నాడు. ఆయన శక్తి ఆయనకు తెలీదు. లక్ష యోజనాలైనా సునాయాసంగా వెళ్ళి రాగల వీరుడు. సమర్థుడు. బలానికీ, పరాక్రమానికీ

మేరు పర్వతమంతటివాడు. హనుమంతుడు. వాయుపుత్రుడు" చెప్పాడు జాంబవంతుడు.

వానరులంతా హనుమ కోసం చూశారు. పెద్ద బండరాయి మీద కూర్చొని సముద్రాన్నే చూస్తున్నాడు వాయుపుత్రుడు.

## మహాబలా... మహావీరా... హనుమా

లక్షలాది వానరులు దిగులు చెంది దీనంగా మారటంతో జాంబవంతుడూ, అంగదుడూ, వానరవీరులూ హనుమ చుట్టూ చేరారు.

"వాయుపుత్రా! సర్వశాస్త్ర కోవిదుడవు. సమస్త శాస్త్రములు తెలిసిన వాడవు. వానరవీరులలో మేటి కిష్కింధరాజు సుగ్రీవునికి సమానమైన శక్తి కలవాడవు.

"గరుత్మంతుడి శక్తితో సమానుడవు. హనుమా... వాయుపుత్రా... బుద్ధిబలంతోనూ, మహావేగంతోనూ, గరుత్మంతుడి రెక్కల బలంతో ఉన్న నీకు ఎదురులేదు. ఏకాంత ప్రదేశంలో మౌనంగా ఉండి మాట్లాడకపోతే ఎలా?

"కశ్యప్రజాపతికీ, వినతకూ జన్మించిన గరుత్మంతుడు పక్షులన్నింటిలో ఎలా శ్రేష్ఠుడో, నీవు వానరులలో ఉత్తమోత్తమ శ్రేష్ఠుడవు.

"హనుమా! ఉత్తమోత్తమురాలూ, మహా అందగత్తె అయిన పుంజికస్థల శాపముతో కుంజరుడు అనే వానరునకు పుత్రికగా జన్మించింది నీ తల్లి అంజనాదేవి. అప్సర స్త్రీలలో ఉత్తమురాలు. మహావీరుడు కేసరునకు పత్ని అయింది. వానర స్త్రీ అయిననూ మహా సౌందర్యవంతురాలు. కామరూపిణి. కోరిన రూపాన్ని ధరించేది.

"ఓ రోజు నీ తల్లి అంజనాదేవి మానవ రూపం ధరించింది. సర్వాభరణాలూ, పుష్పమాలలూ ధరించి పర్వతం మీద విహరిస్తోంది.

"విశాల నేత్రములతో పచ్చని ఎర్రని అంచుల గల వస్త్రములతో ఉన్న అపురూప సౌందర్యాన్ని వాయుదేవుడు చూశాడు. తన శక్తితో బాగా వీచాడు. అంజనాదేవి పచ్చని ఎర్రని పట్టుచీర తొలగింది.

"సన్నని నడుము. సకల సుందర అవయవాలతో ఉన్న అంజనను చూడగానే వరుణదేవుడిలో మన్మథుడు ప్రవేశించాడు. గుండ్రంగా బలిసి దగ్గరగా ఉన్న స్తనములను కాంక్షగా చూశాడు. మోహితుడయ్యాడు. పొడవైన భుజములతో కౌగిలించుకున్నాడు. తన్మయుడయ్యాడు. సంతృప్తిపడ్డాడు."





"ఏక పతివ్రతములోనున్న నన్ను పాడుచేయ తలపెట్టినవాడు ఎవడు?" అరిచింది.

అంజన కోపాల పలుకులకి వాయుదేవుడు చెప్పాడు.

"అందమైన శ్రోణులు గల అంజనా... సుశ్రోణీ... నీవు నాకు నచ్చావు. మోహించాను. అందులకే అక్కున చేర్చుకున్నాను. మనస్సుతో అనుభవించితిని. నీకు ఎట్టి వ్రతభంగము అవదు. నీకు మహా పరాక్రమవంతుడూ, వీరుడైన పుత్రుడూ జన్మిస్తాడు. వేగంలోనూ, శక్తిలోనూ నాతో సమానమైన వాడు.

"ఓ మహాబాహూ హనుమా! ఆపై ఓ గుహలో నిన్ను కనెను. నీవు చిన్న వాడవు. ఓ రోజు సూర్యుడు ఉదయించుట చూశావు. అదేదో మధుర ఫలమని తలచావు. మూడు వందల యోజనాల దూరం వెళ్ళావు. సూర్యతేజస్సునూ, వేడినీ లెక్కచెయ్యక దూసుకెళ్ళావు.

"అది దేవేంద్రుడు చూశాడు. కోపంతో వజ్రాయుధాన్ని నీపై ప్రయోగించాడు. ఆ మహా ఆయుధం దెబ్బకు నీవు ఓ పర్వత శిఖరంపై పడిపోయవు. నీ చెక్కిలి విరిగింది. అందుకే నీవు హనుమ నామధేయుడవయ్యావు.

"దేవేంద్రుడు వజ్రాయుధం విసురుట నీ తండ్రి వాయుదేవుడు చూశాడు. పరమ కోపంతో ఊగిపోయాడు. ముల్లోకాలకీ జీవనాథుడైన తన పుత్రుడినే దేవేంద్రుడు శిక్షిస్తాడా అని ఊగిపోయాడు.

"తన ధర్మాన్ని నిలిపివేశాడు. అంతే లోకం స్తంభించి పోయింది. సింహం నుంచి తప్పించుకుపోతూ ఎగిరిన జింక అలానే ఉండిపోయింది.

"నేలరాలుతున్న పువ్వులు మధ్యలోనే స్తంభించి పోయాయి. చెట్లు ఊగటం ఆపేశాయి. లోకాల్లోని జీవులంతా గాలిలేక బ్రతికున్న కట్టెలయ్యారు. దేవతలంతా బ్రహ్మదేవుడని శరణు వేడారు. ఆయన దివ్యదృష్టితో గమనించి దేవేంద్రుడని పంపాడు. దేవేంద్రుడు వాయుదేవుడిని ప్రసన్నం చేసుకున్నాడు.

"బ్రహ్మదేవుడు నీకు అపూర్వమైన వరాన్ని ప్రసాదించాడు. ఏ ఆయుధంతోనూ నీకు చావులేదు. ఇంద్రుడి వజ్రాయుధానికే నీవు చెక్కుచెదరక పోవటం చూసి, ఇష్ట మరణాన్ని కూడా ప్రసాదించాడు దేవేంద్రుడు.

"కావున హనుమా! నీ శక్తి అపారం. వాయువుకి ఔరస పుత్రుడవు. రామ కార్యం నీవు మాత్రమే చెయ్యగల సమర్థుడవు. కాకున్న రామున్న అంగుళీయకం నీ కెందుకిస్తాడు. అది ఒక్కటి చాలు.

"హనుమా! శ్రీమహావిష్ణువు త్రివిక్రమావతారం ఎత్తినప్పుడు ఆయన చుట్టూ భక్తిగా ఇరవై మార్లు ప్రదక్షిణం చేశాను. అమృతం కోసం దేవతలు పాల సముద్రాన్ని చిలికినప్పుడు భూమిపై నున్న ఔషధులన్నీ తెచ్చి పాల సముద్రంలో వేశాను.

"కానీ ఇప్పుడు అంతశక్తిలేదు. నా కన్నా వెయ్యింతల శక్తి కలవాడవు. లే హనుమా! రాఘవుని చిత్తం నెరవేర్చే బంటువు నీవే. శ్రీరామ బంటుగా శ్రీరాముని హృదయంలో ఉన్నది నీవే. విజృంభించు. నీ పరాక్రమాన్ని చూపు. నీ గమన వేగానికి మించిన గమనవేగం ఈ సృష్టిలోనే లేదు. మహావేగంతో వెళ్ళిరా..." చెప్పాడు జాంబవంతుడు.

ప్రసిద్ధమైన వేగము గల హనుమంతుడు లేచాడు. గదను పైకెత్తాడు. తన ఖాయాన్ని భయంకరంగా పెంచాడు. వానర వీరులంతా హనుమకి జయజయ ధ్వనులు చేశారు. హనుమ మహాకాయుడయ్యాడు. శ్రీరాముడని తలుచుకున్నాడు. శరీరం పులకరించింది. వానరులు గదలను పైకెత్తి వాయుపుత్రుడికి స్తోత్రం చేశారు. మరింత మహాబలుడయ్యాడు.

పర్వత గుహలోంచి జూలు విదుల్చుకొని వచ్చిన కొదమ సింహంలా సముద్రం వైపు చూశాడు. వాయుపుత్రుడు హనుమ ఆవులించినప్పుడు అతని నగుమోము ఎర్రగా, కాలిన పెనమువలే, ధూమములేని అగ్ని వలే వెలిగిపోయింది.

"వానరులారా! ఆకాశాన్ని అంటుకొనిపోయి ఉన్న మేరు పర్వతాన్ని వెయ్యిసార్లు తిరిగి రాగలను. నా బాహుబలంతో సముద్ర జలాన్ని భూమి మీదకు మళ్ళించగలను. నా అమిత వేగానికి సముద్రంలోని జలచరాలన్నీ ఆకాశంలో కానవస్తాయి. దాన్ని ఆహారంగా చేసుకునేందుకు వచ్చిన గరుత్మంతుడి చుట్టూ కూడా వెయ్యిసార్లు తిరగగలను.

"సూర్యభగవానుడు ఉదయ పర్వతము మీద నుంచి అస్తగిరి చేరేలోపు అంత కన్నా ముందే వెళ్ళి ఆ గిరి మీద ఉండగలను. అక్కడ్నించి మళ్ళీ మధ్యాహ్న భానుడికి ఎదురు పడి భూమి మీదకు వచ్చి మళ్ళీ సూర్యుడికి ఎదురుగా పోగలను.

"వానరులారా! సముద్రాన్ని అల్లకల్లోలం చేయగలను. భూమిని నా బాహువులతో రెండుగా విడగొట్టగలను. నేను సీత జాడకై సముద్రంపై





ఎగురుతుంటే నన్ను అనుసరించగల శక్తి నా తండ్రి వాయుదేవునకూ, గరుత్మంతునకు మాత్రమే ఉంది" చెప్పాడు హనుమంతుడు.

"హనుమా! మా ప్రాణాలన్నీ నీ మీదే పెట్టుకున్నాము. సీత జాడతో వేగిరంగా తిరిగిరా" చెప్పాడు జాంబవంతుడు.

"జాంబవంతా! నేను లంఘించే వేగధాటి భూమి తట్టుకోలేదు. మహేంద్ర పర్వతము మీదకు వెళతాను. అక్కడ్నించి లంఘిస్తాను" అని చెప్పి ఒక్క ఉదుటున లంఘించాడు. మహేంద్ర పర్వతాన్ని చేరాడు.

పర్వత శ్రేష్ఠమైన మహేంద్ర పర్వతం సుందర వృక్షాలతో, పూలూ, కాయలు చెట్లతో రమ్యమైనది గట్టి అయినది. పూల తీగలతోనూ సుందర సెలయేళ్ళతోనూ ఉన్న ఆ మహాపర్వతంపై హనుమంతుడు మహేంద్రుడి వలె ఉన్నాడు. హనుమ లంఘునకు పర్వత శిఖరాలు కుప్పకూలాయి. పర్వతం చెదరి జలము బైటికొచ్చింది. జింకలూ, పులులూ, అడవి జంతువులూ అరుస్తూ పరిగెత్తాయి. ఆ సుందర పర్వతంపై నివశిస్తున్న గంధర్వులూ, నాగులూ, వింధ్యాధరలూ తన ప్రియురాళ్ళతో పరిగెత్తారు.

పర్వత రాళ్ళు కదలటంతో మహాసర్పాలు బైటికొచ్చి బుసలు కొడుతున్నాయి.

వేగము కలవాడూ, కార్యం పైనే సర్వచిత్తాలనూ నిలిపినవాడూ, మహా వీరుడూ అయిన హనుమంతుడు మహాసంకల్పంతో వేగగమనంతో లంక వెళ్ళడానికి ఉద్యుక్తుడయ్యాడు.

*శ్రీమద్రామాయణములోని కిష్కింధాకాండము సమాప్తము*

# సుందరకాండము





## లంకకు ప్రయాణము

జాంబవంతాదులు ఉత్సాహాన్నీ, ప్రోత్సాహాన్నీ ఇస్తున్నారు. వానరులంతా జయ జయ ధ్వనులు చేస్తున్నారు.

శోభాయమానమైన మహేంద్ర పర్వతంపై నున్నాడు హనుమ. నీలముగానూ, తెలుపూ, నలుపులతోనూ, కామరూపులైన యక్షులతోనూ, కిన్నెరలతోనూ గంధర్వులతోనూ, మదపుటేనుగులతోనూ మహేంద్ర పర్వతం నిండి ఉంది.

మహాబలవంతుడూ, ధైర్యవంతుడూ అయిన హనుమ మహా వృక్షాలను విరిచేశాడు. బైలుదైర సంసిద్ధుడై మెడా, శిరస్సూ వంచాడు.

బ్రహ్మాండమైన మదపుటేనుగులా ఉన్నాడు. సూర్యునకూ, దేవేంద్రునకూ, వాయుదేవునకూ, పంచభూతాలకూ నమస్కరించాడు.

మహావేగవంతుడూ, సాక్షాత్తు గరుత్మంతుడివంటివాడూ అయిన హనుమ దక్షిణ దిక్కుకేసి చూశాడు. సముద్రమూ, ఆకాశమూ ఎక్కడో కలుసుకున్నట్టు అగుపిస్తోంది. అంతా నీళ్ళ మయం. కొలుచుటకు సాధ్యం కానిది.

తన దేహాన్ని నొక్కిపెట్టాడు. దానికి మహేంద్ర పర్వతము క్షణ కాలం వణికింది. దానితో పూల చెట్లుకున్న పూలన్నీ రాలి పూల కొండలా మారింది. తూర్పు వైపుకి తిరిగాడు. తన తండ్రి వాయుదేవునకు నమస్కరించి కాళ్ళను

మహేంద్ర పర్వతానికి తన్ని పెట్టి లేచాడు. దట్టముగా పెరిగిన వెంట్రుకల గల తోకను విదిలించాడు. శ్రీరాముడని తలచుకున్నాడు. రామబాణమే అయ్యాడు.

ఆ ఊపుకీ, ఆ ఎగిరిన వేగానికీ కాలి క్రిందున్న పర్వతము మట్టి ముంతవలె చిదిమి పోయింది. చలిజ్వరము వచ్చినట్టు పర్వతమంతా వణికింది. మంచులో పడ్డ జీవిలా గజగజలాడింది.

మహేంద్ర పర్వతము మీద పూలు చెట్లు ఆ కదలికకు ఆకులు రాల్చాయి. కాయలు గుత్తులు గుత్తులుగా క్రింద పడ్డాయి. జంతు జాలమంతా మహాప్రళయం వచ్చినట్టు భీకరంగా అరిచాయి.

దేవలోక పురుషులు, స్త్రీలు ఎవరికి వారు ఉన్న పళాన పరుగులు తీశారు. హనుమ గమనవేగానికి మహావృక్షాలూ, జంతుజాలం పైకి లేచి మళ్ళీ పర్వతం మీద పడ్డాయి.

ఆకాశ మార్గాన హనుమ ఎగురుతున్నాడు. అప్పటి వరకూ ప్రశాంతంగా ఉన్న సముద్రం ఆ పెను వేగానికి అల్లకల్లోలమైంది. పెద్ద పెద్ద కొండలు సముద్రంలో పడ్డట్టు ఊహించనంత ఎత్తులో నీరు ఎగసింది. సముద్ర జల చరాలు ఆ నీటితో పైకెగిరి, బ్రతుకు జీవుడా అనుకుంటూ మళ్ళీ నీళ్ళలో పడుతున్నాయి.

మెరుపు తీగ వలే దూసుకుకెళుతున్నాడు. ఆ మహాకాయం ఆకాశాన ఎగురుతుంటే సముద్రంపై నీడ పడి మహానౌక ముందుకు సాగుతున్నట్టు కానవస్తోంది.

అపూర్వమైన రామకార్యార్థమై వెళుతున్న హనుమకు దేవతలూ, గంధర్వులూ పూల వాన కురిపించారు. తాపసులు దీవించారు. కపి శార్దూలమును చూసి సముద్రంలోని సర్పాలన్నీ గరుత్మంతుడిగా భావించి భీతిల్లి పోయాయి.

ఆ సముద్రాన్ని త్రాగేస్తున్నట్టూ, ఆకాశాన్ని మింగేసేటట్టూ వెళ్తున్నాడు హనుమ. మహోద్రకాయంతో వెళుతున్న హనుమ రెండు కనులను చూస్తే సూర్య, చంద్రుల్లా అగుపించాయి. నిటారుగా లేచిన తోక మహా ఇంద్రధ్వజంలా కానవస్తోంది.

హనుమ గమనవేగానికి అతని చేతుల మధ్య నుంచి, తొడల మధ్య నుంచి వెళుతున్న గాలి మేఘంలా ఉరిమినంత ధ్వని చేస్తోంది.





ఉత్తరం నుంచి మహావేగంతో దక్షిణానికి వెళుతున్న తోకచుక్కలా అగుపిస్తున్నాడు శ్రీరామబంటు హనుమ. హనుమ నీడ ముప్పై యోజనాల పొడవు, పది యోజనాల వెడల్పుగా సముద్రం మీద పడింది.

## మైనాకం

శ్రీరామ కార్యంకోసం వెళుతున్న హనుమని చూశాడు సముద్రుడు. ఇక్ష్వాకువంశ హితంకై తనూ ఏదో ఒకటి చెయ్యాలనుకున్నాడు. వాయుపుత్రుడు ఎంతో దూరం నుంచి ఏకధాటిన ప్రయాణిస్తున్నాడు. అతని శరీరం నుంచి జారుతున్న స్వేద బిందువులు చిన్న చిన్న పర్వతల్లా వచ్చి సముద్రంలో పడుతున్నాయి.

కొద్దిసేపు సేద కూడా తీర్చుకోకుండా హనుమ మరింత వేగంగా విజృంభిస్తున్నాడు.

ఇక్ష్వాకు వంశానికి చెందిన సగర చక్రవర్తి వల్ల వృద్ధి పొందిన సముద్రుడు తన మధ్య ప్రదేశమునందు బంగారంతో నిండిన మైనాక పర్వతమునకు చెప్పాడు.

"మైనాకా! ఇక్ష్వాకు వంశానికీ, నాకూ అవినాభావ సంబంధము ఉంది. ఆ వంశస్థుడైన సగర చక్రవర్తి నన్ను ఎంతో ఎదిగేలా చేశాడు. అట్టి వంశస్థుడైన శ్రీరాముని కార్యార్థమై హనుమ వెళుతున్నాడు. అతనికి ఆతిథ్యమివ్వవలెను. విశ్రాంతి ఇవ్వవలెను.

"కాన మైనాక పర్వతమా, పాతాళంలోని రాక్షసులు భూమి మీదకు రాకుండా దేవేంద్రుడు నిన్ను మూతలా ఉంచాడు. పాతాళంలోని రాక్షసులు ఎన్నిసార్లు ప్రయత్నించినా నీవు అణగదొక్కుతూనే ఉన్నావు. నీవు పైకి క్రిందకు జారగలవు. ఎటు కావాలంటే అటు జరగగలవు.

"గరుత్మంతుడు అంతటివాడు. పూజ్యుడు. బ్రహ్మ, దేవేంద్రుని వరాలు పొందినవాడు చిరంజీవి హనుమంతుడు. ఇక్ష్వాకు వంశీకులు నాకు పూజ్యులు. కాన ఉదకము నుండి రావలెను.

"లే! పైకి లే... హనుమకి విశ్రాంతి నివ్వు. యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుషులు సేవించే నీ బంగారు శిఖరాలతో పైకి లే" చెప్పాడు సముద్రుడు.

సమస్త కిరణాలతో ఒళ్ళు విరుచుకొని ఉదయించిన సుర్యుడిలా సముద్ర గర్భాన్ని ఛేదించుకొని మైనాక పర్వతం తన అఖండ శిఖరాలతో పైకి లేచింది.

సముద్రంలో పెద్ద రంధ్రం పడ్డట్టుగా ఉంది ఆకాశం నుంచి చూస్తే. మహావృక్షాలతోనూ, బంగారు శిఖరాలతోనూ కైలాస పర్వతమే వచ్చిందా అన్నట్టు బైటికొచ్చింది. ఒకేసారి వందలాది సూర్యులు ఉదయించినట్టు పరిసరాలు వెలిగిపోయాయి.

మహాపర్వతం సముద్రాన్ని చీల్చుకొని రావటం చూశాడు హనుమ. అది తనకి అడ్డుగా కూడా ఉండటంతో బాహువులతో తోశాడు.

మైనాక పర్వతం స్థానభ్రంశమయ్యింది. మైనాకుడు ప్రత్యక్షమైయ్యాడు.

"హనుమా! వాయుపుత్రా! నూరు యోజనాల నుంచి వస్తున్నావు. నా ఆతిథ్యాన్ని స్వీకరించు. కొంత విశ్రాంతి తీసుకో. సముద్రుని కోర్కె మన్నించు. ఇక్ష్వాకువంశ సగర చక్రవర్తి నుంచి ఉపకారం పొందాడు సముద్రుడు. దానికి ప్రత్యుపకారాన్ని కొంచమైనా తీర్చుకోవటానికి సముద్రుడు నన్ను ఆజ్ఞాపించాడు. అలుపు తీర్చుకో...

"వానరోత్తమా... నీ తండ్రి వాయుపుత్రునకు నేను ఎంతో ఋణపడి ఉన్నాను. ఎంతో సహాయం చేశాడు నీ తండ్రి. పూర్వం కృతయుగంలో ప్రతి పర్వతానికీ, కొండలకీ రెక్కలుండేవి. ఇష్టమొచ్చిన చోటుకి వెళ్ళేవి. అలా ఆకాశ మార్గంలో వెళుతుంటే మునులూ, తాపసులూ భయపడ్డారు. దేవేంద్రునికి చెప్పారు.

"ఇంద్రుడు తన వజ్రాయుధంతో లోకంలోని కొండలవీ, పర్వతాలవీ రెక్కలు విరగొట్టాడు. నా మీదకూ దేవేంద్రుడు వచ్చాడు. అప్పుడు నీ తండ్రి వాయుదేవుడు నన్ను తృటిలో తీసుకొచ్చి ఈ సముద్రంలో పడవేశాడు. రక్షించాడు. నిన్ను పూజించినా, ఆతిథ్యమిచ్చినా వాయుదేవునకు ఇచ్చినట్టే.

"ఓ ధర్మజ్ఞుడా! హనుమా! నీ తండ్రి వాయుదేవుడి వల్ల నా బంగారు రెక్కలు ఇంద్రుడి వజ్రాయుధానికి చిక్కలేదు. నన్నూ, సముద్రుడనూ ఆనందింపచేయి. ఇదిగో మధురమూ, మంచి రుచీ, వాసనా కలిగిన కందమూల ఫలాలు, విశ్రమించు... సేదతీరుము" అడిగాడు మైనాకుడు.

హనుమంతుడు గమన వేగం తగ్గించకుండానే చెప్పాడు.

"రామ కార్యమే నాకు రక్ష. శ్రీరామ వేదాక్షరాలే నాకు ఎనలేని శక్తినీ, విశ్రాంతినీ ఇస్తాయి. మైనాకా.... నీ ఆతిథ్య పురస్కారానికి ధన్యవాదములు. సూర్యుడు తన మజిలీని చేరబోతున్నాడు. నేను అగరాదు" అని హనుమ మైనాకుణ్ణి తాకినాడు.





మైనాకుడు కపివీరునకు నమస్కరించాడు. అంత హనుమ వాయు మార్గంలో ముహూర్తకాలంలో మైనాకుణ్ణి దాటిపోయాడు.

సముద్రంలో అంత ఎత్తునకు వచ్చిన మైనాక పర్వతంతో ఇంద్రుడు చెప్పాడు.

"పర్వతోత్తమా! శ్రీరాముని కార్యంకై వెళుతున్న హనుమంతునికి ఆతిథ్యమిచ్చుటకై బైటికొచ్చిన నీవు ప్రశంసనీయుడవు. నిన్ను నేను ఏమీ చెయ్యను. అభయం ఇస్తున్నాను. నిశ్చింతగా ఉండు."

మైనాకుణ్ణి దేవేంద్రుడితోపాటు, గంధర్వులూ, యక్షులూ, నాగులూ, ప్రశంసించారు. మైనాకుడు ఆనందంగా ఆ సముద్రంలో నిలిచిపోయాడు.

## సురస

దేవతలూ, సిద్ధులూ, సప్త మహర్షులూ హనుమని ప్రశంసిస్తూనే సర్పాల తల్లి సురసని పిలిచారు.

"సురసా! మహాకాయుడు హనుమ ఆకాశ మార్గన మనోవేగంతో వెళుతున్నాడు.

"నీవు రాక్షసివిగా మారి, గుహలాంటి నోరుతో ఎదురు నిలువు. హనుమ శక్తీ, యుక్తీ తెలియాలి. పచ్చని కళ్ళతో, ఆకాశమంత నోటితో ముహూర్తకాలం విఘ్నం చేయుము" చెప్పి పంపారు.

సురస వికారానికే వికారంగా తయారయ్యింది. ఘోర రాక్షసులే హడలిపోయే రూపం ఎత్తింది. హనుమకు ఎదురు నిలిచింది.

"వానరుడా! నీవు నా ఆహారం. దేవతలు నిర్ణయించారు. కాన రా. నా నోటిలోకి రా. అప్పడంలా చప్పరిస్తాను" చెప్పింది.

హనుమ నమస్కరించాడు.

"మన్నించాలి. అడ్డు తొలగాలి. శ్రీరామకార్యమై వెళుతున్నాను. ఇదంతా రాముని రాజ్యం. అందులోని భాగమే నువ్వు.

"కాన శ్రీరామ కార్యానికి అడ్డురాక, అడ్డు తొలగు. సీతమ్మ జాడ తెలుసుకొని రామయ్యకి చేరవేసి నీ వద్దకు వస్తాను" చెప్పాడు హనుమ.

"హనుమా! నా నోటి ఎదురకు వచ్చినవాడ్ని, నేను తినకుండా ఇంత వరకూ ఉండలేదు. బ్రహ్మవరం ఉంది. నా నోటిలో పడి ఆహారము అవ్వవలి సిందే" అరిచింది రాళ్ళు దొర్లినట్టు... చెప్పింది నాగసుత సురస.

"బ్రహ్మ మాటకు తిరుగులేదు. నన్ను మింగగలిగినంత నోరు తెరువు" అని ఇరవై యోజనాలు పెరిగాడు హనుమ. సురస ఇరవై యోజనాల అంత నోరు పెంచింది. హనుమ ముప్పై యోజనాలు పెరిగాడు. సురస ముప్పై యోజనాలు నోరును పెంచింది. హనుమ నలభై యోజనాలు పెరిగాడు. సురస మళ్ళీ తన నోరును నలభై యోజనాలు పెంచింది. అలా హనుమ వందయోజనాల వరకూ పెంచాడు. సురసా పెంచింది.

భయంకర నరకలోక ద్వారంలా ఉంది దాని నోరు. హనుమ చప్పున వేలడంత అయిపోయి. సురస నోటిలోకి వెళ్ళి చప్పున రాహు ముఖం నుండి చంద్రుడు వచ్చినట్టు బైటికొచ్చాడు.

"సురసా! బ్రహ్మవరం సార్థకమైంది. నీ నోట్లో పడ్డాను" చెప్పాడు హనుమ.

సురస తన రూపం ధరించింది. హనుమకి దక్షప్రజాపతి కూతురు నమస్కరించింది.

"వాయుపుత్రా! హనుమా! నీ కార్యం సఫలం అవుతుంది. లోకైక వీరుడైన శ్రీరాముని చెంతకు సీతాసాధ్వి చేరుతుంది. శుభం అవుగాక" దీవించింది సురస.

హనుమంతుడు గరుత్మంతుడిలా ఎగిరిపోతున్నాడు. రెక్కల పర్వతంలా సాగిపోతున్నాడు.

దేవ గాయకులు తంబుర, నారదులు సంచరించే మార్గము. మహాయజ్ఞాలూ, హోమాలూ చేసి స్వర్గానికి చేరిన పుణ్యపురుషులు నడిచే గగన మార్గము.

యక్షులూ, గంధర్వులూ, కుజుడూ, సూర్యచంద్రులూ, కిన్నెరులూ, దేవేంద్రుడి ఐరావతమూ తిరిగే ఆ గగన మార్గంలో హనుమ మహాపక్షిరాజువలే సాగిపోతున్నాడు.

## సింహిక

ఎంత పెద్ద పర్వతాన్నైనా నీడని బట్టి తనలోకి లాక్కొనే శక్తి గల సింహికకు ఎన్నో రోజుల నుంచి ఆకలిగా ఉంది. నకనకలాడిపోతోంది. గగన మార్గాన పోతున్న హనుమ నీడ కనిపించింది. సంబరపడింది. నీడ ఆధారంతో లాగసాగింది.





మహావేగంతో వెళుతున్న హనుమ ఒక్కసారిగా అదిరాడు. వేగం తగ్గుతోంది. వెనక్కి లాగుతున్నారెవరో... సింహిక మరింత హనుమను లాక్కోవటం ప్రారంభించింది. చాలా కాలం తర్వాత మంచి భోజనము దొరికి నందుకు ఉత్సాహపడుతోంది.

హనుమ అటూ, ఇటూ పరికించాడు. సముద్రం మధ్యలో మహా పర్వతంలా ఉంది.

మహా సముద్రంలో ఎదురు గాలికి ఓడ వేగం తగ్గినట్టు, తన గమన వేగం ఎలా తగ్గిందో వాయుపుత్రునికి అవగతమైంది. తన నీడ వైపు నోరు పెట్టి చూస్తోంది. కిష్కింధ రాజు సుగ్రీవుడు చెప్పిన వికృత రూపమైన 'ఛాయాగ్రహి' అదేనని ఊహించాడు.

సింహికని నిర్ధారించుకొని, వర్షించే మేఘంలా మహోన్నతంగా తన కాయాన్ని పెంచాడు. వికటంగా నవ్వుతూ సింహిక కూడా నోరు పెద్దది చేసింది. మహావీరుడు పిసరంత అయిపోయి సింహిక నోట్లో దూరాడు.

వజ్రదేహ సమానుడైన హనుమ రాహువు నోట్లోకి వెళ్ళిన చంద్రుడివలె తనవాడి అయిన గోళ్ళతో సింహిక గుండెలని చిదిమి చీల్చుకొని బైటికొచ్చాడు.

సముద్రం పగిలేలా అరిచింది. మహావృక్షం వంటి తన జుట్టుతో బాధగా నీటి మీద కొట్టింది. వెనక్కి వాలిపోయింది. సింహిక రక్తంతో సముద్రం ఎర్రగా అయింది.

గగన మార్గాన ఉన్న సిద్ధులూ, చారణులూ, సర్వభూతాలూ హర్షధ్వానాలు చేశారు.

"హనుమా! మహాశ్రేష్ఠుడా! రాక్షసిని చంపి మహాపీడ వదిలించావు. నీ వంటి వాని కార్యం ఎప్పుడూ మంగళకరమే అవుతుంది" దీవించారు.

హనుమ వారి ఆశీర్వాదాలను అందుకొని ముందుకు సాగాడు. వాయుపుత్రుడు హనుమ దాదాపుగా అవతలి ఒడ్డు సమీపించాడు. అన్ని మూలలూ పరికించాడు. మహావృక్షపంక్తిని చూశాడు.

లంక గట్టు కానవచ్చింది. దిగకుండానే మలయ పర్వత వనాలన్నీ చూశాడు. త్రివిక్రమావతారం వదలి వామనుడైన శ్రీమహావిష్ణువులా మామూలు రూపం ధరించాడు. లంకనూ, పరిసరాలనూ చూస్తూ లంబ పర్వతం మీద దూకాడు.

మొగలి పొదలతోనూ, కొబ్బరిచెట్లతోనూ, అనేక శిఖరాలూ, మహావృక్షాలూ ఉన్న లంబ పర్వతం మీద నుంచి త్రికూట పర్వతం మీద మహావైభవోపేతంగా కానవచ్చే లంకా పట్టణాన్ని చూశాడు.

## లంకా పట్టణము

వాయు పుత్రుడు వాలిన కొండ మీద అనేక పూల వృక్షాలు ఉన్నాయి. అవన్నీ హనుమ అలికిడికి రాలాయి. వాయుపుత్రుని మీద పూలవాన కురిపించాయి.

అన్ని యోజనాలు దాటి వచ్చినా హనుమలో కించిత్తు అలసటలేదు. ఉదయాన్నే నిద్రలేచి స్నానం చేసి వచ్చినట్టు ఉన్నాడు.

ఆ పర్వతం మీద నుంచే లంకా పట్టణాన్ని చూశాడు. బంగారంతో చేసిన నగరం.

కుబేరుడి పట్టణమూ, అమరావతీ నగరమూ రెండూ లంక ముందు దిగదుడుపే...

పట్టణం చుట్టూ ఉన్న అగడ్త పై ప్రాకారం కనక కాంతులను వెదజల్లుతోంది.

మహా గగనమండలంలో నక్షత్రాలవలె గృహాలు ఒకదాని కొకటి మించి మెరిసిపోతున్నాయి.

ప్రాకారానికి అండగా ఉన్న ఇసుక తిన్నెలు జఘనాల వలే ఉన్నాయి. అగడ్తలో ఉన్న పూల చెట్లు కట్టుకున్న చీరవలె, కోటబురుజులు, కర్ణాభరణముల వలే ఉన్నాయి. మొత్తం కలిపి చూస్తే సుందరాంగివలె ఉన్నది లంక.

సరళ వృక్షములూ, కొండగోగు చెట్లూ, బాగా పూసిన ఖర్జూర వృక్షములూ, కొండమల్లె, సువాసన గల పిప్పిలి చెట్లూ, పుష్పములతో, మొగ్గలతో బరువుగా నిండిన చెట్లూ, హంసలూ, జలపక్షులూ, పొరులు విహరించు ప్రదేశాలూ, రమ్యమైన ఉద్యానవనాలూ చూశాడు.

పూర్వం కుబేరునది ఆ నగరం. అన్న అని కూడా చూడకుండా రావణాసురుడు అన్నని కొట్టి లాక్కున్నాడు. అట్టి వజ్ర, వైఢూర్య, మణులతో నిండి ఉన్న లంకా పట్టణ ద్వారాన్ని రాక్షసులు శూలాలతోనూ, బరిశెలతోనూ శతఘ్నులతోనూ కావలి కాస్తున్నారు. ఆవులించినప్పుడు వారి కోరలు మహా సర్పాల విషకోరలను గుర్తుకు తెస్తున్నాయి.





వానర సైన్యమంతా ఇచ్చటకు ఎటుల రావలెయును. లంకానగరం ఐశ్వర్యవంతమైనది. ధన ఆశతో రాక్షసులెవ్వరినీ లోబరుచుకోలేము. మిత్రబేధం చెయ్యటానికి వీరంతా రాక్షసజాతి. యుద్ధమే ఇక దారి.

హనుమంతుడు పరిపరివిధాలుగా ఆలోచన చేస్తూ చీకటి పడేంత వరకూ ఆగాడు. రామ మహత్కార్యము పూర్తి చేయుటకు రాత్రి సమయమే సరైనది అనుకున్నాడు.

తను రాక్షసుల కన్ను గప్పి ఎలా వెళ్ళవలెను. తన తండ్రి వాయుదేవుడు సహితము రావణుని ఆదేశం మేర వీస్తున్నాడు. రాక్షసులకు ఏ చిన్న సవ్వడి చేసినా తెలియక మానదు.

హనుమంతుడు గగన మార్గాన్ని చూశాడు. సూర్య భగవానుడు అస్తమిస్తున్నాడు.

కపి వీరుడు తన దేహాన్ని మరింతగా కురచ చేశాడు. చిన్నపిల్లాడంత అయ్యాడు. నేరుగా లంకాద్వారం వద్దకు నడిచాడు. పిల్ల కోతిలా గెంతుతూ కిచకిచ మంటూ వెళ్ళాడు. ద్వారం నుంచి లోపలికి చూశాడు.

మహోన్నతుడూ, మనోహరుడూ, వీరుడూ, వాయుపుత్రుడూ అయిన హనుమ లోనికి చూసి ఖిన్నుడయ్యాడు. కైలాసశిఖరంలా ఆకాశానికి అంటుకునేలా ఉన్న లంకానగరం బంగారు నగరంలా తళతళలాడిపోతోంది. భవనాలు అత్యున్నతంగా ఉన్నాయి.

గృహ స్తంభాల మీద చక్కటి పూలూ, కాయల వృక్షాలూ, సెలయేళ్ళూ, జలపాతాల బొమ్మలూ చెక్కి ఉన్నాయి. బహు అంతస్తుల ప్రాసాదాలు. అనేక విమాన గృహాలు... అద్భుతమైన సౌందర్యంతో కానవచ్చాయి.

ఆ సమయాన ఆకాశాన చంద్రుడు ఉదయించాడు. తామర కొలనులో తెల్ల తామర వికసించినట్టు, చంద్రుడు తన సమస్త కిరణాలతో పున్నమి వెన్నెలని సాగనంపాడు. శంఖంలా, రాజహంసలా, పాలలా వెలిగిపోయాయి పరిసరాలు.

## లంకిణి

లంకావాసుల కలకల ధ్వనులు వినవస్తున్నాయి. రాక్షసులు మత్తులో అరుస్తున్న కేకలూ, కావలి వాళ్ళ అడుగుల చప్పుళ్ళూ, యోధులైన సైనికుల సింహానాదాలూ విన్నాడు వాయుపుత్రుడు.

మదపుటేనుగుల ఫీంకారాలూ, అశ్వాల సకిళింపులూ విన్నాడు కపికుంజరుడు. ఆకాశాన్ని తాకుతూ ఉన్న భవనాలపై జెండాలు రెపరెపలాడుతున్నాయి. భవనాలు మెరుపులోని మెరుపులా మెరిసి పోతున్నాయి. భవనాల మీద నెమళ్ళు కానవస్తున్నాయి. క్రౌంచ పిట్టలు కిచకిచ మంటున్నాయి.

సింగారించుకున్న యవ్వన వతిలా కానవస్తున్న ఆ పట్టణాన్ని చూసి పరవశించాడు హనుమ. ద్వారం దగ్గరి కొచ్చాడు. మరింత స్పష్టంగా కానవస్తోంది లంకా నగరం.

రత్నకాంతులు వస్త్రములుగానూ, గోశాలలు కర్ణభూషణములుగానూ, స్తనములు యంత్రములుగానూ ప్రకాశించే సర్వసుందరి అయిన స్త్రీలా కాన వచ్చింది. పూబంతి లాంటి ఆ సుందర లంకా నగరం మహోన్నత వెలుగుతో మెరిసిపోతోంది.

అప్పుడినిపించింది భయంకరమైన పలుకు. ఉరుమూ, మెరుపూ కల బోసినట్లుంది. భయంకరమైన ముఖముతో, నేత్రములతో ఉరిమి చూస్తోంది.

"ఎవడవురా నీవు! ఈ లంకిణినే ఏమార్చి లంకలో అడుగు పెట్టబోతున్నావు. లంకాధిపతి రావణుడి నగరంలోకి అడుగు పెట్టు సాహసము చేసిన కోతీ ఎవరు నీవు?"

హనుమ లంకిణి వైపు చూశాడు. మహాపర్వతం వలే ఉంది. రెండు కోరలతో గుహవంటి నోరుతో, బాన పొట్టతో, క్రొవ్వు పెరిగిన తొడలతో జారిన స్తనాలతో ఉంది.

"మహా వికృతంగానూ, భయం గానూ కనిపించే నీవు ఎవరవు... ఈ లంకా పట్టణ ద్వారం వద్ద నీకేం పని" అడిగాడు హనుమ.

"ఓయీ పిల్ల కోతి. నా పేరు లంకిణి. మహాప్రభువు, సమస్త లోకాలనీ తన శౌర్యంతో పారద్రోలగలిగే వీరుడు రావణుడి లంకా నగరాన్ని కాపు కాసే లంకిణిని..... లంకాధి దేవతను. అనుమతి లేకుండా నగరంలో ప్రవేశించే నీ వంటి వారికి శాశ్వత నిద్రనిచ్చే మృత్యువుని" చెప్పింది.

"ఓ లంకిణీ! లంకానగరం బహు సుందరంగా నున్నది. అంతయూ చూసి మరల తిరిగి వెడలిపోతాను. కాన నన్ను వదులు."

ఆకాశం అదిరేలా అరిచింది. లంకిణికి కోపం ముంచుకు వచ్చింది. కామరూపిణి లంకిణి చెప్పింది.





"వానరా! నీ పలుకులు నేను విశ్వసించుటలేదు. ఏదో రాక్షస కీడుకై నీవు లోనికి వెళుతున్నావు. అందులకు ఇదే శిక్ష" అని చేయి చాచి కొట్టింది. హనుమంతుడు ఆ దెబ్బ కాచుకున్నాడు. పిడికిలి బిగించి లంకిణి మీద విసురుగా విసిరాడు.

హనుమంతుని దెబ్బకు లంకిణి అవయవాలన్నీ అదిరిపోయాయి. గుడ్లు తేలేసింది. వికారమైన నోట్లోంచి నురుగు వచ్చింది. దబ్బున నేల మీద పడింది. లంకిణి చేతులెత్తి నమస్కరించింది.

"వానరా! నీకు జయం. మహాబాహుడివి. ధర్మాత్ముడవి. అందుకే స్త్రీనైన నన్ను చంపక వదిలేశావు. బ్రహ్మవరం నేటికి ఫలించింది.

"ఏనాడైతే ఓ వానరుడు నన్ను జయించి లోనికి వెళతాడో అప్పుడే సంపూర్ణ రాక్షస నాశనం. ఉపద్రవం. ఆదిలో బ్రహ్మ ఇచ్చిన వరం నేటికి వాస్తవ రూపం దాల్చింది.

"మహావీరా! నందికేశ్వరాదులు లంక తగలబడుతుందని శాపం ఇచ్చారు. దానితో నేను భయంతో ఆదిలో బ్రహ్మ దగ్గరికి వెళ్ళి వేడుకున్నాను" అందులకు ఆయన "భయపడవలదు. ఇప్పుడు కాదు, ఓ వానరుడు నిన్ను జయించినప్పుడు" అని చెప్పాడు.

"ఓ వీరుడా! లంకలోకి యథేచ్ఛగా పో.. నీ కార్యం చక్కబెట్టుకో... రాక్షసులందరికీ మృత్యువుని తెచ్చి పెట్టాడు రావణుడు. ఆయన స్త్రీ కాంక్ష, కామమూ సమస్త రాక్షస జాతినే తుడిచి పెట్టెయ్యబోతోంది. నిన్ను ఎవ్వరూ జయించలేరు. నీకు అంతా శుభమవుతుంది. పతివ్రతయైన సీతాదేవిని వెదుకు" చెప్పింది లంకిణి.

## లంకలో అన్వేషణ

లంకిణిని జయించిన వాయుపుత్రుడూ, ధర్మశాస్త్రకోవిదుడూ హనుమ ధర్మశాస్త్రాల్లోని విధంగా శత్రువు నివాసద్వారం నుంచి వెళ్ళకుండా ప్రహరీ ఎక్కి లంకానగరంలో ముందుగా ఎడమకాలు పెట్టాడు.

దర్జాగా మహావీధిలోంచి నడిచాడు. విశాల భవనాల ముందు ముత్యాలూ, పువ్వులూ చల్లి ముగ్గు పెట్టారు. తూర్పు ద్వారాలలోని రెండు వైపులా వరండా భవనాలూ, గుడి ఆకారంలో కట్టిన భవనాలూ ఉన్నాయి. చక్కటి సువాసనలిచ్చే భవన అందాలను శ్రీరామ కార్యంకై చూశాడు.

అందమైన నవ్వుల ధ్వనులు లంకాపురంలోని గృహముల్లోంచి వినవస్తున్నాయి.

భవనాల్లోని రాక్షస స్త్రీలు మద్యము సేవిస్తున్నారు. బంగారు, వెండి పాత్రల్లోని మాంసాలను పీక్కు తింటున్నారు.

రాక్షసస్త్రీలు గెంతేటప్పుడూ, నడిచేటప్పుడూ వినవచ్చే అందెల శబ్దాలూ, తాగి, తాగి అరిచే మదకేకలూ, రోషంతోనూ, వీరంతోనూ తొడలూ, జబ్బలూ చరుచుకునే రాక్షసులూ, అన్నీ, అందరినీ చూస్తూ హనుమ ఆ భవనం మీద నుంచి ఈ భవనం మీదకు గెంతుతూ వెళుతున్నాడు.

కొన్ని రాక్షస గృహాలు పద్మాకారముతోనూ, కొన్ని స్వస్తికాకారముతోనూ ఆశ్చర్యకరమైన, మంగళకరమైన విశాల భవంతులెన్నో కానవచ్చాయి. స్వర్గలోకమున ఉండే అప్సరస స్త్రీల్లా పాడే గానాలనీ, మదముతో నిండిన ఆడవాళ్ళనీ చూశాడు.

మహాబలవంతులైన రాక్షస వీరులనూ, మహాయుధాలైన పట్టిసాలూ, అశనులూ, క్షిపణులూ, పాశములూ, శూలములూ, వజ్రాయుధాల్లా మెరిసే అనేక ఆయుధాలనూ చూశాడు.

లంకానగర భవన సముదాయల్లో త్రాగేవాళ్ళనీ, తినేవాళ్ళనీ, సంగీత వాయిద్యాలతో మైమరిచిపోయే వారినీ, ఒక్క చెవి ఉన్నవారినీ, ఒకే కన్ను ఉన్న వారినీ, పొట్టివార్నీ, లావు వార్నీ, వికారులనూ, మహా వికారులనూ అలా ఎందరినో చూశాడు.

అలా చూసుకుంటూ రావణుడి భవనం వద్దకు వెళ్ళాడు. పెద్ద వృక్ష శిఖరం మీద కూర్చొని చూశాడు. ఆ రావణుని మహా భవనము ఓ పర్వత శిఖరం మీద ఉన్నది. భవన సముదాయము చుట్టూ పెద్ద అగడ్తలున్నాయి. అందు తెల్లనీ, ఎర్రనీ, పచ్చనీ తామరలున్నాయి.

ముందు భాగంలో కత్తులూ, పట్టిసాలూ, క్షిపణులూ, కవచాలూ, శూలాలూ ధరించిన లక్షలాది రాక్షసులు కావలి కాస్తున్నారు. ఆ రాక్షసుల మధ్యలో గుర్రం మీద తిరిగే వాళ్ళూ, రథాల మీద వెళ్ళే వాళ్ళూ, ఏనుగుల మీద వెళ్తున్నవారు కానవచ్చారు.

హనుమ పర్వతం దిగి రావణుడి భవనంలోకి ప్రవేశించాడు. దివ్యమైన గానం వినవస్తోంది. మంచి గంధమూ, చందనమూ కలిసిన గాలి వాసన.





అంతఃపుర దిశగా వెళ్ళాడు. స్త్రీల ఆభరణాల ధ్వనులూ, కిలకిలలు వచ్చే వైపు గెంతుతూ పోయాడు.

## పున్నమి రాత్రి

గగన తలంలో పున్నమి చంద్రుడు వెండి పంజరంలో తెల్ల రాజహంసలా ఉన్నాడు. దట్టమైన వెన్నెలని కుండలతో పోస్తున్నట్టు పోస్తున్నాడు. మహేంద్ర పర్వతపు గుహలో సింహంలా, దండకారణ్యంలో ఏనుగుల రాజులా ఉన్నాడు. సముద్రాన్ని తన వెన్నెలతో ఆటలాడిస్తున్నాడు. కవ్విస్తున్నాడు.

సింహము గుహ నుంచి వచ్చినట్టు, చక్రవర్తి మహాసభలో ఆశీనుడైనట్టూ, మదపుటేనుగు అరణ్యానికి వచ్చినట్టూ శశాంకుడు తన వెన్నెల వెలుగులతో లోకాలన్నింటికీ వెన్నెల వెలుగును విరజిమ్ముతున్నాడు. హనుమ భవనాల ప్రధాన ద్వారాల నుంచి చూసుకుంటూ అంతఃపురాన్ని చేరుతున్నాడు. రాక్షసులు తాగినంత మద్యము తాగి, తిన్నంత మాంసము తిని ప్రియురాళ్ళను కరుచుకొని నిద్రిస్తున్నారు.

మరో భవనంలో మత్తు కైపుగా మారిన రాక్షసులు అరుస్తున్నారు. వలువలు తనవీ, ప్రియరాళ్ళవీ తొలగించి ఎగురుతున్నారు. ఇద్దరేసి ముగ్గరేసి ఆడవాళ్ళని కౌగిలించుకుంటున్నారు.

రథాలూ, అశ్వాలూ, గజశాలలూ చూశాడు వాయుపుత్రుడు. రాక్షస స్త్రీలు భర్తల కోసం కొన్ని భవనాల్లో ఎదురుచూస్తున్నారు. అపరాత్రి అయినా శ్రీవారి కోసం గంధమూ, చందనమూ రాసుకుంటూ మాటి మాటికీ తమ ప్రతిబింబాన్ని చూసుకుంటున్నారు. వయ్యారాలపై వస్త్రాన్ని సరిచేసు కుంటున్నారు.

మరికొన్ని భవనాల్లో దైవభక్తి గల వారినీ, ఆచార సంప్రదాయాలతో ఉండే వారినీ చూశాడు.

మరికొన్ని భవనాలపై భాగంలో మన్మథ పరవశంతో భర్తకు చేరువవు తున్నారు.

తెల్లని వెన్నెలలో తెల్లని శయ్యపై చంద్రుడ్ని సాక్షిగా చేసుకొని సుఖిస్తున్నారు.

మరి కొందరి స్త్రీల శరీరాల మీద ఏ అచ్ఛాదనా లేదు. అలసిసొలిసి అదమరిచి నిద్రిస్తున్నారు.

ప్రియులని చేరే పడతులనూ, భర్తలతో సుఖిస్తున్న సుందర భామలనూ, వికృతరూపంలో ఉన్న స్త్రీలు మరింత వికృత రూపం గల పురుషులతో మద్యం సేవిస్తూ సరసాలాడుకుంటున్నవారినీ, సుందర నేత్రాలూ, అవయవ సౌష్టంగల పురుషులనూ చూశాడు.

హనుమంతునికి ఎక్కడా సీత జాడ అగుపించలేదు.

దుమ్ముపట్టిన బంగారు తీగా, లోకంలోని స్త్రీలందరికీ తలమానికమైన విదేహ రాజ్యలక్ష్మి, వైదేహీ... భర్త వియోగంతో ఏకధాటిగా విలపించే జనకరాజపుత్రి సీతాదేవి కానరాలేదు.

## రావణుడి అంతఃపురము

వాయుపుత్రుడు హనుమంతుడు అంతటా చూసుకుంటూ రావణుడి భవనంలోనికి ప్రవేశించాడు. మహా మహా దిగ్గజాలూ, వీరులూ, ఏనుబోతుల్లాంటి రాక్షసులూ ఆయుధాలతో పహారా కాస్తున్నా హనుమ కామరూపుడై వెళ్ళాడు.

ద్వారాలన్నీ బంగారముతోనూ, వజ్రాలతోనూ, వెండితోనూ చేసి ఉన్నాయి.

ద్వారాల మీద లతలూ, సెలయేళ్ళూ, పర్వతాలూ, అందమైన పడుచుల బొమ్మలూ చెక్కి ఉన్నాయి. అర్థరథులనూ, మహారథులనూ, వారెక్కి తిరిగే వాహనాలనూ చూశాడు.

రావణుడి భవన ప్రాంగణాన ఏనుగులూ, గుర్రాలూ, రథాలతో పాటు పెంపుడు జంతువులైన పశువులూ, ఆవులనూ చూశాడు. రకరకాల రంగు పక్షులనూ, పిట్టలనూ చూశాడు.

అందమైన పడుచులు యవ్వన మదంతో ఠీవిగా రొమ్ములు ముందుకు పెట్టి నడుస్తున్నారు.

వారు ధరించిన ఆభరణాల ధ్వని మన్మథ తాపాన్ని మరింత రేపేలా ఉంది. చందనమూ, అగరూ వాసన మత్తెక్కిస్తోంది. రాత్రిని రాగ రంజితము చేస్తోంది.

మహారథులు నివశించే భవన ప్రాంగణానికి వెళ్ళాడు. ఆకాశాన్ని అంటేలా ఉన్నాయి. ప్రతి భవనం ముందు పూల చెట్లూ, నీటి యంత్రాలున్నాయి.

స్త్రీ పురుష రాక్షసులు బల్లెలూ, గదలూ పట్టుకొని కావలి కాస్తున్నారు. మరికొంత మంది పొదల్లోనూ, చాటున శృంగారం చేసుకుంటున్నారు.





మరికొంత మంది రాక్షసులు మూకుమ్మడిగా మాంసాన్ని పీక్కు తింటూ, మద్యము త్రాగుతూ తమ విద్యుత్తు ధర్మం చేస్తున్నారు.

హనుమంతుడు సింహాలవనం లాంటి రావణుడి సేనాధిపతులూ, మంత్రులూ ఉండే భవన సముదాయాల వద్దకు వెళ్ళి మొదటిగా పరాక్రమంలో సాటి అయిన లంకాధిపతి రావణుడి మంత్రి ప్రహస్తుడి భవనంలోకి వెళ్ళాడు. ఆ భవనాన్ని వెతికి మహాపార్శ్వుడు ఇంటికి వెళ్ళి మేఘమంతటి ఆ ఇంటిని వెతికాడు. అక్కడా హనుమకి వైదేహి జాడ తెలియరాలేదు.

విభీషణ, మహోదర, విద్యుజ్జిహ్వల, గృహాలతో పాటు వజ్రదంష్ట్రుడూ, శకుడూ, సారణుడూ, ఇంద్రజిత్తు, జంబుమాలీ, సుమాలీ, రశ్మికేతువూ, సూర్యకేతువూ, ధూమ్రాక్షుడూ, సంపాతీ, విద్యుద్రూపుడూ, కరాళుడూ, పిశాచుడూ, శోణితాక్షుడూ, ఇంద్ర జిహ్వుడు వంటి వారి అన్ని భవనాల్లోనూ మైథిలీకై వెతికాడు.

ఎంత వెదికినా సీతమ్మ ఉన్నట్టు జాడ తెలియలేదు. వారి వైభవాలనూ, సుఖాలనూ, సంపదనూ, వారి రాక్షస ప్రవృత్తులనూ, బలాలనూ, బలగాలనూ చూస్తూ రావణుడి అంతఃపురం చేరుకున్నాడు.

లెక్కకు మించిన సైనికులు మహా ఆయుధాలతో పహారా కాస్తున్నారు. బంగారు లంకా పట్టణంలో రావణుడి గృహం వజ్రకాంతులతో విరాజిల్లుతుంది.

ఉత్తమజాతి తెల్ల గుర్రాలనూ, మదపుటేనుగులనూ, లతాగృహాలనూ, సంభోగ గృహాలనూ, రాసులుగా ఉన్న రత్నాలనూ, బంగారు శయ్యలనూ మధుర వాసనతో ఉన్న మద్యమునూ, మాంసాన్నీ చూశాడు. రావణుడి వైభవము ముందు ఇంద్రుడి వైభవం దిగదుడుపే అనుకున్నాడు.

అందమైన పడతులు సౌందర్యంకానవచ్చే దుస్తులూ, నగలూ ధరించి తిరుగుతున్నారు. కొందరు బంగారు శయ్యల మీద పవళించి ఉన్నారు. మరి కొందరు బంగారు పాత్రలలోని పదార్థాలను తింటున్నారు. రత్నాలమయమైన పాన పాత్రలలో మద్యాన్ని సేవిస్తున్నారు.

మరికొంత మంది ఇంతులు తమ పొడవాటి జుట్టుకు ధూపమూ, అగరు చెలికత్తెల సాయంతో వేసుకుంటున్నారు. హనుమ వస్త్ర విహీనులైన పడతులనూ, బంగారు తీగల వంటి సుందర సుందరాంగులనూ, బహు సంభోగానందము నివ్వగలిగే బంగారు పుటము పెట్టిన రంగులో ఉన్న

పడతులనీ, చంద్రుని మచ్చ రంగులో ఉన్న ప్రియ వియోగముతో వ్యధ చెందుతున్న స్త్రీలనీ చూశాడు.

స్త్రీల అందెల చప్పుళ్ళు, నగల చప్పుళ్ళు, వీణావాద్యాల్లో కలిసిపోయి సరికొత్త రాగాలు వినిపిస్తున్నాయి.

హనుమంతుడు సీతకై చూసుకుంటూ కదులుతున్నాడు. ఎందరో స్త్రీలు కానవచ్చారు.

కానీ ఉత్తమ సౌందర్యవతి, మహారాజ వంశము నందు జన్మించినదీ, సుకుమారవతీ, ఆడ నెమలీ అయిన సీతాదేవి కానరాలేదు.

ఓ చోట మహాదివ్యసౌధం కానవచ్చింది. వాస్తుదోషం లేకుండా ఉంది. మయుడు నిర్మించినట్టు ఉంది.

బంగారు రంగుతో మెరిసిపోతోంది. ఎన్నో జన్మల పుణ్యఫలంగా సాధించినట్టు అద్భుతంగా ఉంది.

## సుందర రాక్షస స్త్రీలు

పువ్వుల రాజు భవనంలా ఉంది. మెరుపుల రాజుదిలా ఉంది. వెన్నెల రాజు శశాంకుడిదిలా ఉంది.

విశ్వకర్మ తన కోసం నిర్మించుకున్నట్టు ఉంది. కావాలనుకుంటే పైకి లెగుస్తుంది. ఎక్కడికి కావాలంటే అక్కడికి వెళుతుంది. భూలోకానికి జారిన స్వర్గంలా ఉంది. హంసలు మోస్తున్నట్టు తేలి ఉంది.

రత్నాలూ, వజ్రాలూ, బంగారమూ తప్ప మరే లోహమూ వాడనది. శరత్కాల చంద్ర మండలంలా ఉంది. వసంతకాల పూల అందాన్ని మించి ఉంది. బాల సూర్యుని వర్ణముతో గజపాలకుల రక్షణ కవచాలతో మహావీరులతో మహారథులతో నిండి ఉంది.

రావణుడు నివశించే గృహమిదే. భూమి మీదున్న స్వర్గధామమది. ఆకారమందు అద్భుతమూ, గజాశ్వరథములతో కిక్కిరిసి ఉన్న రావణుడి గృహంలోకి అడుగు పెట్టాడు.

హనుమ చిన్న రూపంతో ప్రవేశించాడు. అంతా శోధించాడు. నాలుగేసి దంతాల ఏనుగులూ, మూడేసి దంతాల ఏనుగులూ కానవచ్చాయి. రావణుడు తీసుకొచ్చిన స్త్రీలెంతో మంది ఉన్నారు. ఇంకా సమయం లేక రావణుడు ముట్టని కన్యలూ ఉన్నారు.





దేవేంద్రుడి దగ్గరా, కుబేరుడి దగ్గరా, యముడి దగ్గరా లేని సంపద రావణుడి స్వంతం.

పానీయాలూ, భక్ష్యాన్నాల వాసన గుప్పుమని కొట్టింది. మేడ గదులన్నీ ఎంతో శోభగా ఉన్నాయి. వజ్రం వంటి మేడ గదిలోకి వెళ్ళాడు.

ధూపవాసనలతో రత్నకంబళ్ళతో మందిరము ఉంది. అక్కడ్నించి ప్రక్కకొచ్చాడు. మరో మేడ గదిలో చీరలూ, నగలూ, ముస్తాబు చేసుకొని తృప్తి తీరనట్టు నిద్రలో కూడా దొర్లుతున్నారు. మొహాలు పద్మాల్లా ఉన్నాయి.

గుండ్రని మొహంతో పోటి పడుతూ వారి స్తనాలూ ఉన్నాయి. గాలికి వస్త్రం చెదిరినప్పుడు వాటిని చూస్తుంటే వెండి ఇసుక తిన్నెలను గుర్తుకుతెస్తున్నాయి. కొందరి నుదుటన బొట్టు చెరిగిపోయి ఉంది. చెక్కిళ్ళు మీద పళ్ళ గుర్తులున్నాయి.

ఆ అనుభవం మళ్ళీ గుర్తుకొచ్చినట్టు 'చిన్నగా' మూలుగుతున్నారు. కలవరిస్తున్నారు. ముని పంట పెదవిని నొక్కి పెడుతున్నారు.

మదపుటేనుగు తొక్కేసిన తర్వాత లతల్లా ఉన్నారు. వస్త్రాలు స్థానభ్రంశమై మెడలో ముత్యాల హారాలు స్తనాల మధ్య నుంచి జారి, మహా పర్వతాల మధ్య ప్రవహిస్తున్న నదీ పాయలా ఉన్నది. హారం మీద ముత్యాల మధ్య మెరుస్తున్న మణులు నదిలోని చక్రవాకాలూ, హంసల్లా తోస్తున్నాయి.

ఆ కాంతల వేడి నిట్టూర్పులకు చెవులకున్న వజ్రాల పోగులు లయ బద్ధంగా కదులుతున్నాయి.

చక్కెర రుచి గల మత్తు మద్యాన్ని సేవించిన పడతులు తమ ప్రక్కనున్నది రావణుడే అనుకొని మీద కెక్కుతున్నారు. ఒకటి ప్రక్కదాని రొమ్ములే దిండుగా చేసుకొని నిదురిస్తోంది.

అంతమంది అలా విచ్చల విడిగా, పగలు పిసరంత కూడా ఒళ్ళు కానరాకుండా జాగ్రత్తపడే ఆ స్త్రీలు వంటిమీద గుడ్డలు లేకుండా, ఎవరి మీద ఎవరు పడుకున్నదీ, ఏ నగ ఎవళ్ళదో తెలీకుండా ఒకరి వీపులు మరొకరు రాసుకుంటూ నిదురిస్తున్నారు.

అద్భుత సమయమనుకొని బంగారు దీపాలతో వెలుగుతున్న దీపాలు వారినందరినీ రెప్పవాల్చకుండా చూస్తున్నట్టు నిశ్చలంగా ఉన్నాయి. ఉత్త మాంగనలు వారంతా. రావణుడి వీరత్వాన్ని మోహించి వచ్చిన వాళ్ళు.

ఐశ్వర్యాన్నీ, ఆనందాన్నీ, రావణుడి సౌందర్యానీ కామించి, మోహించి వచ్చిన స్త్రీలు.

రావణుడు తప్ప మరే మగవాడు తాకిన వారు కారు. జాణలు, నెరజాణలు, గంధర్వ సుందరీ మణులూ, కొంతమంది ఇష్టంతో వచ్చారు. మరికొందరిని రావణుడు తీసుకొచ్చాడు. ఎత్తుకొచ్చాడు.

వారంతా రూపంలో అద్భుత సౌందర్యవంతులు. కులగుణాలతో ఉన్న రూప సంపన్నులు వారు. ఇసుక తిన్నెలవంటి విశాలమైన జఘనప్రదేశం గల స్త్రీలనూ, వసంతము నందు వికసించే పుష్పాలని మరిపించే మగువలనూ చూశాడు.

మదన మోహితులైన, సౌందర్యాది గుణాలతో ఉన్న ఆ స్త్రీలను హనుమ చూశాడు.

మహా పతివ్రత్యాది సుగుణాల సీతాదేవి అత్యుత్తమురాలు జానకీ దేవి జాడ మాత్రం తెలియలేదు.

ఇంతటి స్త్రీలోలుడు రావణుడు సీతమ్మను ఎక్కడ ఉంచాడో కదా! అనుకున్నాడు వాయుపుత్రుడు.

## మహాబాహువు రాక్షసరాజు మందిరము

హనుమంతుడు సీత జాడకై శోధిస్తూ ఓ సువిశాల మందిరంలోకి వచ్చాడు.

గాలి కూడా ఎక్కువ తక్కువలు లేకుండా వీస్తోంది. రత్నాల శయ్య కానవచ్చింది. తల వైపు ముత్యాలతో చేసిన తెల్లగొడుగు ఉంది. అశోక పూలతో పూల దండలు వేలాడి దీసి ఉన్నాయి.

మహాసుందరమైన అతివల శిల్పాల చేతుల్లో నెమలితో చేసిన చామరలు లయబద్ధంగా కదులుతున్నాయి. అనేక సుగంధాలూ, ధూపాలూ తమ సువాసనలను వెదజల్లుతున్నాయి.

దేవేంద్రుని శయనాగారమువలే ఉన్న ఆ అద్భుత శయ్యపై మహాబాహువు, రాక్షసరాజు, లంకాధిపతి రావణుడు నిర్భయంగా నిదురిస్తున్నాడు. చెవులకి ఉన్న రత్నాల కుండలాలు గాలికి చిగురుటాకుల్లా కదులుతున్నాయి.

బంగారపు దుస్తులతో, ఎర్ర గంధం రాసుకొని, శ్రేష్ఠమైన ఆభరణాలు ధరించి ఉన్నాడు లంకేశ్వరుడు, పరాక్రమశాలి రావణుడు.





అతను ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తున్నాడు. మదపుటేనుగు సర్వ క్రీడలతోనూ, సర్వ సుఖాలతోనూ అలసి సొలసి నిద్రిస్తున్నట్టుగా నిద్ర పోతున్నాడు రావణుడు.

హనుమంతుడు దగ్గరికెళ్ళి చూశాడు. మహా తేజస్సుతో కానవచ్చాడు. మందర పర్వతంపై నిద్రిస్తున్న మహాసర్పమువలే ఉన్నాడు. పర్వతసమానుడిగా ఉన్నాడు. విశాల గంగాజలము మధ్య నిద్రిస్తున్న గజమువలే ఉన్నాడు. సకల శాస్త్ర కోవిదుడు. ఆగర్భశ్రీమంతుడు. మహా బలవంతుడు. బ్రహ్మ, మహాశివుడుల వరాలున్నవాడు. ఇంతటి జ్ఞాని ఇంత దుష్కార్యము ఎలా చేశాడు.

హనుమంతుడు దూరంగా వచ్చి రావణుడ్ని చూస్తుండిపోయాడు. అచ్ఛాదన తొలిగిన అతని వక్షస్థలంపై ఇంద్రుడితో పోరాడిన వజ్రాయుధపు గుర్తులూ, మహా విష్ణువు చక్రాయుధంతో చేసిన గాట్లూ, ఐరావతపు దంతాల గాయాలూ కానవచ్చాయి. పాన్పుకు ఇరువైపులా బంగారు దీపాలు. వాటిల్లో వజ్రాలు మెరుస్తున్నాయి.

రావణుడి నోటి నుండి మద్యమూ, మాంసముల వాసనలు వస్తున్నాయి. మహాసర్పం నిదురిస్తున్నట్టు అతను శ్వాస వదిలినప్పుడూ, పీల్చినప్పుడూ కాలసర్ప బుసలు గుర్తుకు తెస్తున్నాయి.

ఆ ప్రక్కన సుందరాంగినులు. అద మరచి నిద్రిస్తున్నారు. ఉత్తమమైన తమ అందాలకు ఉత్తమోత్తమమైన ఆభరణాలు ధరించారు. నాట్యంలో ఎంతో నేర్పు ఉన్నట్టు వారి నడుములూ, కాళ్ళూ చెబుతున్నాయి.

సన్నని నడుముల గల రావణాసురుడి భార్యలు మదము చేత రతికేళుల చేత అలసి సొలసి నిదురిస్తున్నారు.

సృష్టిలోని స్త్రీ అందాలకే ప్రతీకగా ఉన్న ఓ స్త్రీ బంగారు వీణను కౌగిలించుకొని, ఓ కాలు దాని మీద వేసి పడుకొని ఉంది. ఎన్నో రోజుల విరహ తాపము తర్వాత వచ్చిన ప్రియుడ్ని కౌగిలించుకున్నట్టు తలగడను గుండెలకి హత్తుకొని పడుకుంది ఇంకొకతి.

మదము నిండిన నేత్రములతో, రంగుతో, మృదువుతో, బలిసిన అవయవములతో ఉన్న మరొక స్త్రీ మృదంగమును కౌగిలించుకొని పడుకొని ఉంది.

నల్లతామరల కనుల గల సుందరి, సర్వాంగసుందరి చక్కటి బలమైన తన స్తనాలకి తనివి తీరనట్టు తప్పెటతో ఒత్తుకుంటోంది. మరో ముదిత రహస్యంగా ప్రియుణ్ణి కౌగిలించుకున్నట్టు పిల్లంగ్రోవిని తన అందాల చాటున పెట్టుకొని నిద్రిస్తోంది.

కలశము మీద నీళ్ళలా పడుచు వయ్యారాలతో, తడిపిన పూవులా ఉన్న మరో ఇంతి తన ఇసుక తిన్నె వంటి స్తనాలను తనే అదుముకుంటోంది. మరో చంద్రవదన మత్తులో, ఊహల్లో రావణుడ్ని తలుచుకొని గమ్మత్తుగా గాలి కూడా వేడెక్కేలా మూలుగుతోంది.

అందరిలోకెల్లా అద్భుతమైన సౌందర్యంతో... ఆణిముత్యాలూ, మణులూ ధరించి ఏకాంతంగా ప్రశాంతంగా, మంగళకర సుందర శయ్యపై అతి సుందరంగా సంసార స్త్రీలా ఒంటి మీద బట్ట తొలగకుండా నిద్రిస్తోంది.

ఆమె రావణుడి భార్య. ఆ అంతఃపురానికి రాణి, లంకా నగరానికి పట్టమహిషి మండోదరి. ఆ నిండుదనం ఆ ప్రశాంతత... హనుమంతుడు తొలిగా సీతే అనుకున్నాడు. ఆనందంగా తోకను కదిపాడు. గెంతులు వేశాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

ఆ వెనువెంటనే తప్పుని తెలుసుకున్నాడు. తన తొందరపాటు ఆలోచనకు నిందించుకున్నాడు. తేరుకున్నాడు.

సీతాదేవి శ్రీరాముడు లేకున్న నిద్రించదు. పానసేవనము కూడా చేయదు. అలంకారాలు చేసుకోదు. కాన ఆమె సీతకాదు.

మళ్ళీ వెతుకులాట ప్రారంభించాడు. శృంగారంలో అలసిన స్త్రీలనూ, మద్యము ఎక్కువై ఒంటి మీద పోసుకున్న స్త్రీలనూ, మాంసాలు కండలు తిని పారేసిన బొమికలనూ, బొమికలను నమిలినమిలి విసిరేసిన నజ్జులనూ చూశాడు.

మురజములపై, మద్దెళ్ళపై, పీఠములపై ఆనుకొని కొందరు... మరికొందరు తివాచీలపై, శయ్యలపై నిదురిస్తున్నారు. గోవుల మధ్య నిదురిస్తున్న వృషభంవలే ఉన్నాడు రావణుడు.

అందమైన సుందర శృంగార పురుషుడు రావణుడు. ఆడ ఏనుగుల మధ్య మదపుటేనుగులా కనిపించాడు. సృష్టిలోని సమస్త అందాలనూ అనుభవించే ఇతను గత జన్మలో ఏ పుణ్యం చేసి ఉంటాడోననిపించింది.





చేసిన మహా పుణ్యం తరిగి, మిగిలిన పాపానికి శిక్షగా సీతాదేవిని తీసుకువచ్చి ఉంటాడు. హనుమంతుడు ముందుకు కదిలాడు. పానశాలకి వెళ్ళాడు.

అక్కడ మహామహా బలవంతులు మాత్రమే ఎత్తగలిగే పాత్రలున్నాయి. వాటిల్లో నెమలి మాంసమూ, కోడి మాంసమూ, ఇప్ప మాంసమూ, దుప్పి మాంసమూ, జింకల మాంసమూ, కొక్కిరాల మాంసమూ, చకోర పక్షుల మాంసమూ పక్వము చేసి ఉన్నాయి. ఇంగువ, మిరియాలు, దినుసుల వాసనతో ఘాటెక్కి పోతున్నాయి. సగం తినగా మిగిలిన పదార్థాలను చూసుకుంటూ కదిలాడు.

తేనెతో చేసిన లేహ్యాలూ, ఇప్పపూలుతో చేసిన మద్యాలూ, ద్రాక్షపండ్లతోనూ, సుగంధ ద్రవ్యాలతోనూ చేసిన మద్యాలూ ఉన్నాయి. కొన్ని సగమే ఉన్నాయి. మరి కొన్ని నిండుకున్నాయి.

మణులూ, రత్నాలూ పొదిగిన పాన పాత్రలు చిందర వందరగా పడి ఉన్నాయి.

మరోచోట మధుర ఫలాలు కానవచ్చాయి. తనింత వరకూ చూడని ఆ ఫలాలను హనుమ చూశాడు.

ఆ ప్రక్కనే మద్యము సేవిస్తూ, మాంసాన్ని ఆరగిస్తూ ఆనంద డోలికల్లో మునిగిన స్త్రీలు అడ్డం వచ్చి తీసిన చెంప స్వరాలూ, అందెలూ అనేక కంఠాభరణాలు కానవచ్చాయి.

మహాబలవంతుడు, వాయుపుత్రుడు హనుమంతుడు పర పురుషుడు అడుగుపెట్టని రావణుడి అంతఃపురంలో ఎట్టి చాపల్యము లేకుండా తిరిగాడు.

పురుషుడు ప్రవేశించవీలుకాని ఆ అంతఃపురంలో స్త్రీలు స్వేచ్ఛగా ఉన్నారు.

వస్త్రాలు తీసేసిన వారు, ఆభరణాలు తీసేసినవారు, మత్తులో ఎదుట స్త్రీ వలువలను లాగేసి వాటిని తలగడగా చేసుకొని నిద్రిస్తున్నవారు, గంధర్వ స్త్రీలు, యక్ష స్త్రీలు అందరినీ చూశాడు.

చల్లని చందనము, మద్యము, తేనె, రసము, పుష్పమాలలు... ధూపములు వీటన్నింటితో కలిసినట్టు నలు మూలల నుంచి చల్లటి గాలి వీస్తోంది.

హనుమ ఇంద్రియాలను అదుపులో ఉంచుకున్నవాడు. మనో వికారము లేకుండా, దేహేంద్రియాలన్నీ సీతాదేవి జాడకై మాత్రమే వినియోగించి వెదికాడు.

పురుషులెవ్వరూ రారు అనుకొని తగు ఇష్టరీతిగా నిద్రిస్తున్న రావణుడి స్త్రీలను హనుమ చూసినా, స్థిర మనస్సుతో, ఉత్తమ ఆలోచనలతో, కార్యం కోసమే సీతాదేవి జాడ కోసమే చూశాడు.

హనుమ అలా తనకి తాను సమాధానపరుచుకున్నాడు. ఆడ లేడి కోసం ఆడ లేళ్ళ మధ్యకే వెళ్ళి చూడవలెను. స్త్రీని వెదక వలిసి వచ్చినప్పుడు, స్త్రీల మధ్యకే వెళ్ళి వెదకాలి. నిశ్చలమైన మనస్సుతోనే రావణాంతఃపురాన్ని వెదికాను అనుకున్నాడు హనుమ. సీత ఇక్కడుండదు. వైదేహిని ఇక్కడ వెదుకుట అనవసరం.

తులసీవనంలో మత్తు మందు మొక్క ఉంటుందేమో గానీ, మత్తు మందు మొక్కల మధ్య తులసి ఉండదు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

వాయుపుత్రుడు దగ్గరలోని ఆకాశ విమాన గృహాలన్నీ చూశాడు. విదేహ పుత్రి కానరాలేదు. జనకాత్మజ, సీతాదేవి జాడ తెలియక వెళితే సుగ్రీవునికి ఏం సమాధానం చెప్పాలి. స్వశీలసంరక్షణామణి మైథిలీ ఎక్కడుందంటే తానేం చెప్పగలడు.

దుర్మార్గుడు, వ్యసనపరుడు, స్త్రీలోలుడి వికృత చేష్టలకు భయపడి ఆత్మత్యాగం చేసుకొనలేదు కదా! ఆ సాధ్వీమణిని కనుగొనకుండా వెళితే అంగదుడూ, జాంబవంతుడూ అడిగే ప్రశ్నలకు తానేమి సమాధానం చెప్పాలి. హనుమంతుడు స్థిర చిత్తముతో మళ్ళీ మళ్ళీ వెదికిన గృహాలూ, భవనాలూ, పానశాలలూ, క్రీడా శాలలూ, మంత్రి, సైన్య భవనాలు వెతికాడు.

ఉహూ...మహాసౌందర్యవంతులైన విద్యాధర మగువులూ కనిపించారు. పెద్ద పెద్ద స్తనాలతోనూ, పిరుదులతోనూ, నడుం మాత్రం సన్నగా ఉండే నాగ కన్యలూ అగుపించారు. తేజస్సుతో వెలిగే దేవకన్యలూ కనిపించారు. సీతాదేవి మాత్రం కనిపించలేదు. రావణుడి భవనంలో నాలుగు అంగుళాలు కూడా వదలకుండా వెదికాడు.

ఉత్సాహం తెచ్చుకున్నాడు. ఉత్సాహమే కార్యానికి శక్తి.... అదే సర్వశుభాలకీ సంపదలకీ మూలం.





# హనుమంతుడి వ్యధ

సీతాసాధ్వి కానరాదే. సంపాతి లంకలో ఉందని చెప్పాడు. భవనాలూ మందిరాలూ, వంటశాలలూ, పానశాలలూ, వీధులూ, సెలయేళ్ళూ, సరస్సులూ, జలపాతాలూ, దుర్గాలూ, కొండలూ వెతికాడు.

మిథిలా నగర రాకుమార్తె మైథిలీ రావణుడు లంకకి తెస్తుంటే మహా సముద్రంలో దూకి ఆత్మత్యాగం చేసుకుందా!

లేక ఈ మహా క్రూరుడు సీత, అంగీకరించలేదని చంపేశాడా. ఆహారంగా స్వీకరించాడా? లేక నరమాంసానికి అలవాటు పడ్డ రావణుడి భార్యలు మూకుమ్మడిగా పడి తినేశారా!

సీత గూర్చి రాముడికేం చెప్పను. సుగ్రీవుని గడువు దాటింది. ఉత్తచేతులతో కిష్కింధ వెళ్ళి రామలక్ష్మణులకూ, సుగ్రీవునకూ ఎలా మొఖం చూపించాలి.

నూరు యోజనాల సముద్రయానమూ, లంకిణి సంహారమూ వృధాయేనా!

సీత లేదని తెలిస్తే శ్రీరాముడు ప్రాణాలతో నిలిచేనా! అది చూసి లక్ష్మణుడు వుంటాడా! మైత్రిబంధంతో చేసిన బాస నిలుపుకోలేక సుగ్రీవుడు మాత్రం ఎందుకు జీవిస్తాడు.

ఇన్ని విషయాలు విని భరతుడు గుండెలు పగిలి అన్నదమ్ములను చేరకుండా ఎందుకుంటాడు. శత్రుఘ్నుడు కూడా లక్ష్మణుడిలా భరతుని మార్గాన్నే అనుసరిస్తాడు.

పుత్రులు దూరమయ్యి తల్లులు కౌసల్యాదేవి, సుమిత్రాదేవి, కైకయీ దేవీల ప్రాణాలు మాత్రం ఎందుకుంటాయి.

ఇంత జరిగితే అంగదుడూ, జాంబవంతుడూ, వానరవీరులు మాత్రం జీవించి ఉండగలరా! మహాశిఖరాల మీద నుంచి విషపు పండ్లనూ, కాయలనూ కొరుకుతూ లోయల్లోకి దూకుతారు.

అలా కాకూడదు. ఓ పంచ భూతములారా! దిక్పాలకులకి రాజైన ఇంద్రుడా, సర్వ భుతాల్లారా! శ్రీరామ కార్యం కోసం సాయం చెయ్యండి. ఆ మహా ఇల్లాలిని తపస్విని కానవచ్చేలా మార్గం చూపండి... వేడుకున్నాడు హనుమ. అప్పుడు కాన వచ్చింది అశోకవనం.

నీచుడూ, క్రూరమైన పనులు చేసేవాడూ, భయరూపుడు రావణుడు అపహరించిన ఆ తల్లి, దీనురాలు అయిన సీతాదేవి ఎప్పుడు నా కనులకు కానవచ్చునో... అనుకుంటూ అశోక వనాన్ని పరీక్షగా చూశాడు.

## వాయుపుత్రుడు అశోకవన ప్రవేశము

అశోకవన ప్రాకారము చూస్తూనే హనుమంతుడికి ఆ వనాన్ని వెదకలేదనిపించింది. లంకేశ్వరుడి భవన ప్రాకారము ఎక్కి అశోక వన ప్రాకారాన్ని చేరాడు.

ప్రాకారము వద్దకు వెళ్ళగానే హనుమంతుడిని అనేక పూల వృక్షాల సువాసనలు చుట్టు ముట్టాయి. వసంతకాలంలా పూల చెట్లు అన్నీ విరగపూసి ఉన్నాయి.

విరిగి చెట్లూ, సంపెగ చెట్లూ, మామిడి చెట్లూ, వెలగ చెట్లూ, అశోక వృక్షాలూ, మద్ది చెట్లూ, తీగ కానుగ చెట్లూ, మామిడి చెట్లూ ఎన్నో ఉన్నాయి.

అందమైన మగవాడ్ని హత్తుకు పోయేలా అల్లుకునే ప్రియరాళ్ళలా లతలు వృక్షాలని చుట్టి ఉన్నాయి. గాఢ పరిష్వంగమే కాక చుంబనతో చుంబించినట్టు, లతల తీగలకు ఉన్న పూలు చెట్టుని ముద్దాడుతున్నాయి.

రంగురంగుల పిట్టలు కిచకిచమంటున్నాయి. నెమళ్ళు పురివిప్పి నాట్యం చేస్తున్నాయి. గండు కోయిలలూ, తుమ్మెదలూ, తేనెలను ఆస్వాదించి, ఇక వద్దనుకొని విశ్రాంతి తీసుకుంటున్నాయి.

హనుమంతుడు ఎగిరి ఓ వృక్షం మీదకి వెళ్ళాడు. ఆ అలికిడికి పిట్టలన్నీ కదిలాయి. ఆ తాకిడికి లతలూ, పూల చెట్లూ, పూలని రాల్చాయి. మహాపూల వర్షం కురిసినట్టు అశోక వన నేలపై పూవుల కంబళి పరిచినట్లుంది.

ఆ చెట్ల మీద నుంచి ఈ చెట్ల మీదకు గెంతుతూ చూస్తున్నాడు. నీటి యంత్రాల నుంచి సుందర స్త్రీ ఆకారాలతో ఏర్పడే ఆకృతులూ, ఆ జలాల మీద తేలియాడుతున్న హంసలూ, వాటి వేగానికి సరదాలకి అడ్డు వస్తున్న వికసించిన తామరలూ... హనుమంతుడు ఆశ్చర్యంగా చూస్తుండిపోయాడు.

తామర పువ్వులూ, కలువపూలూ గల కొలనుపై సారస పక్షులూ, చక్రవాకాలూ జలకాలాడుతున్నాయి.

హనుమంతుడు మహావృక్షానికి తోకను చుట్టి అదిలించాడు. దానితో పిట్టలు ఎగిరిపోయాయి. ఆలింగనముతో చెదిరిన ఆభరణాలతోనూ, కౌగిలింత





వల్ల రాలిన చందనమువలె దంతక్షతాలూ, నఖక్షతాలూ చేసి నలిపేసిన పడుచువలె, ఆ వృక్షము ఆకులు రాల్చి, కొమ్మలు ఊపింది.

అశోక వనంలో అక్కడక్కడా మణి సోపానాలలో నడబావులున్నాయి. బంగారు మండిగలున్నాయి. వాటిలో నీరు స్వచ్ఛంగా, కొబ్బరి నీరులా ఉంది. ఆ బావుల చుట్టూ పొదలున్నాయి. వాటికి చక్కటి రంగు రంగుల పూల లతలు చుట్టుకుని ఉన్నాయి.

ఇంకొద్ది దూరం వెళ్ళాడు. పచ్చటి పట్టుచీరపై ఎర్రటి కమలాలు అద్దినట్టు, కనిపించే దూరమంతా పచ్చటి పూలవనమే. ఇష్టమైన పురుషుడికి చూపులతోనూ, చేష్టలతోనూ చెప్పే స్త్రీలా మకరందాన్ని నింపుకున్న పూలు తన సుంగధ పరిమళాలతో తేనె సువాసనను చేర్చి పంపుతున్నాయి. తుమ్మెదలకి ఆహ్వానం అందచేస్తున్నాయి.

హనుమ ఆ చెట్టు మీద నుంచి ఈ చెట్టు మీదకు దుముకుతున్నాడు. అలా దుముకినప్పుడు, ఆ చెట్ల ఆకులూ, కొమ్మలూ రాలి, విరిగి, ప్రియుని గాఢ చుంబనకు గురి అయి నఖక్షత దంతక్షతములతో చెదిరిన జుట్టుతో నలిగిన యువతివలే అవుతోంది. ఓ దగ్గర పర్వతముంది. దాని మీద నుంచి సుందర జలపాతం పడుతోంది. ప్రియుడి తొడ మీద నుంచి లేపిన తన తొడలా ఉంది. ఆ జలపాతం ప్రక్కగా బాగా పూసిన పండ్లూ, కాయల చెట్లూ ఉన్నాయి. వంగి ఉన్నాయి.

ఓపిక లేదంటున్న మగువును బ్రతిమాలి ఒప్పిస్తున్నట్టు... జలపాతపు ధార వాటి మీదగా వస్తూ గాలికి కదులుతున్న పూలను ముద్దాడుతూ నేలను తాకుతోంది.

వానరవీరుడూ, వాయుపుత్రుడూ అయిన హనుమంతుడు ఆ అశోక వనంలో పెద్ద భవనాలనూ, సెలయేళ్ళనూ, చక్కటి పూల చెట్లనూ, తామర కొలనులనూ, బంగారపు రంగు చెట్లకు సిరిసిరిమువ్వలంత పిందెలు గల పిందెలనూ, వాటి సవ్వడులనూ ఎన్నో చూశాడు, విన్నాడు.

ఎగురుతున్న పక్షుల రెక్కలు తగలి అనేక వర్ణములు గల పుష్పములు నేలరాలుతున్నాయి. అశోక వనంలో తిరుగుతున్న హనుమపై పడుతున్నాయి. పుష్పకొండలా ఉన్నాడు. వసంతుడే అశోక వనంలో విహరిస్తున్నాడా అన్నట్టు కానవస్తున్నాడు వాయుపుత్రుడు హనుమంతుడు.

వైదేహి మాత్రం కానరాలేదు. అప్పుడే అక్కడ కపివీరునకు ఇరుగుడు చెట్టు చిగుళ్ళతోనూ, ఆకులతోనూ కానవచ్చింది. ఆ చెట్టు మీద నుంచి చూస్తే సీతాదేవి ఈ మహావనమున ఉంటే కానవస్తుంది అనుకొని ఎగిరాడు.

రావణుడి అశోకవనము శోభాయమానంగా ఉంది. సుందర గానం చేసే పక్షులు. చూస్తునే ఆకలి తీర్చే మధుర ఫలాలు. రకరకాల పూల చెట్లు, ప్రక్కనే నదీ తీరాలు... వృక్షాలూ, ఉద్యానవనాలూ... ఇరుగుడు చెట్లూ... పొగడ చెట్లూ... చందనపు చెట్లూ... అన్నీ ఇరుగుడి చెట్టు పై నుంచి కానవచ్చాయి.

పూజ్యురాలు... జనక రాజసుత... మైథిలీ... వైదేహి... విదేహ రాకుమారి, వరవర్ణిని, శుభాంగి, వనచారిణి, శ్రీరాముడి పట్ట మహిషి, లేడికళ్ళ అందగత్తె... విచక్షణ... శ్రీరామచంద్రుని ఇల్లాలు సీతాదేవి తప్పక ఈ వనంలోకి వస్తుంది.

ఏడ్చి ఏడ్చి... శ్రీరామ వియోగ దుఃఖంతో సగమైన సీతాదేవి సంధ్యావందనానికై ఈ నదీ తీరానికి ఖచ్చితంగా రావచ్చును అనుకొని కొమ్మల మాటున రాక్షసులకు కానరాకుండా కూర్చున్నాడు హనుమంతుడు.

## మహాసాధ్వి సీతాదేవిని చూచుట

దివ్య గంధము వాసనలతో, నానావిధ పక్షి కూతలతో, కలవ పూల కదలికలతోనూ నిండి ఉన్న సుందర అశోక వనంలో ఋతువులతో పని లేకుండా నిత్యం వసంత ఋతువులానే కాయలు కాస్తాయి, పూలూ పూస్తాయి.

నందనోద్యానవనాన్నీ, కుబేరుడి చైత్ర వనాన్నీ తల తన్నే ఆ అశోక వనం సుగంధ ఔషధాలతో నిండిన గంధమాదన పర్వతాన్ని గుర్తుకు తెస్తోంది.

హనుమంతుడు కూర్చున్న శింశుపా వృక్షానికి దగ్గరలో ఉన్న చైత్రప్రాసార గృహాన్ని చూశాడు. వెయ్యి స్తంభాలున్నాయి. బంగారు రంగుతోనూ, మణులతోనూ మెరిసిపోతోంది.

బాగా ఎత్తులో ఉంది. కైలాస పర్వతంలా తెల్లగా ఉంది.

హనుమంతునకు అక్కడ ఓ స్త్రీ కనిపించింది. చీర బాగా మాసి పోయి ఉంది. ఆభరణాలు లేవు. ఆ స్త్రీ చుట్టూ అనేక మంది రాక్షస స్త్రీలున్నారు. ఆ స్త్రీ దీనంగా ఉంది. తలవంచుకొని కూర్చుని ఉంది. తామరలులేని కోనేరులా ఉంది. పూవులు కోసేసిన చెట్టులా ఉంది. అంగారకుడు వేధించిన రోహిణివలే ఉంది. క్రూర జంతువుల మధ్య లేడిలా బిత్తర చూపులు చూస్తోంది. మాట మాటకి ఏదో ఉచ్చరిస్తోంది.





హనుమంతుడు కనులు చిట్లించి అదిరే గుండెలను అదిమిపెట్టి చూశాడు. పసుపుపచ్చ రంగు చీరలో, శుక్లపక్ష పాడ్యమినాటి చంద్రరేఖవలే, బురదలోని తామరవలె ఉన్న విశాలాక్షిని చూశాడు.

'ఆమెయే సాధు స్వభావము గల సీతాదేవి' అని అనుకున్నాడు. సుందర నగుమోము.. చీకటిని పారద్రోలే రంగు... ఆ తేజస్సు... నల్లని పెద్ద జడ... సర్వావయవసుందరిని, విశాల కనులుగల ఆ పద్మ పత్రాక్షిని... హనుమంతుడు చూసి పరికించి సందేహం లేదు రఘురాముని భార్య సీతాదేవి ఈమెయే అనుకున్నాడు.

అయినా మరింతగా శ్రీరాముడు చెప్పిన ఆనవాలు ప్రకారం ఆభరణాలనూ, చీరనూ పరికించాడు.

శ్రీరాముడు చెప్పిన అనవాళ్ళు గల ఆభరణాలు చెట్టుకు వేలాడు తున్నాయి. సాధ్వీమతల్లి సీత భర్త దూరంగా ఉన్నందున ఆభరణాలు ధరించలేదు.

ఋష్యమూక పర్వతంపై పడవేసిన ఆభరణాలకీ, వాటికీ పోలిక సరి చూసుకున్నాడు.

ఆమే... శ్రీరాముడి ప్రియ పట్ట మహిషి... పతివ్రత... పద్మపత్ర నేత్రము కల సీతాదేవిని చూశాను... ఆహా శ్రీరామా... నాదియే అదృష్టం... శ్రీరామా! ఇక నీకు శుభం... కిష్కింధ రాజు గడువు తీరిననూ కార్యము పూర్తి చేశాను. అంగదా, జాంబవంతా ఇక మనం ప్రాయోపవేశం చేసి రామలక్ష్మణులకూ, సుగ్రీవునకూ, కిష్కింధకు దూరంగా ఉండవల్సిన పని లేదు.

మహాసుందరి సీతాదేవి, అసితేక్షణ, అపూర్వ శ్రీరాముడి అంగ ప్రత్యంగ సౌష్ఠవానికి సరిపోయే అంగప్రత్యంగ సౌష్ఠధారి మైథిలీని చూశాను. వనమధ్యమున సింహము చేత బంధించిన ఆడ ఏనుగులా విలపిస్తున్న సీతాదేవిని, భర్తను మాత్రమే పూజిస్తూ ఓర్పుతో నేల మీద శయనించుతూ, ధర్మపాతివ్రత్యముతో ఉన్న సీతాదేవిని చూశాను. ధర్మాత్ముడు, సకల ప్రాణకోటికి రక్షకుడు అయిన శ్రీరాముని ధర్మపత్నిని లంకలో అశోకవనంలో శ్రీరాముని గుర్చే ఆలోచిస్తూ చిక్కిశల్యమైన ఆ మహాతల్లిని సీతాదేవిని, శ్రీరాముని భార్యని చూశాను. హనుమంతుడు ఆనందంతో తబ్బిఉబ్బిబ్బై పోయాడు.

ముహూర్త కాలం కన్నీళ్ళు పెట్టుకున్నాడు. వర్షాకాలంలో గంగానదిలా నిండుగా ఉంది మహావీరుడైన శ్రీరాముడి భార్య. దశరథమహారాజు కోడలకి ఎంతటి కష్టం వచ్చిందో కదా!

బంగారుచ్ఛాయతో శ్రీమహా విష్ణువు భార్య లక్ష్మీదేవిలా ఉన్న సీతాదేవిని చూస్తూ హనుమ అనుకున్నాడు.

వాలీ, కబంధుడూ, విరాధుడూ, ఖరుడూ, దూషణుడూ, పధ్నాలుగు వేల మంది రాక్షసులు అంతా ఈమె కోసమే మరణించారు. ఈ తల్లి కోసమే నూరు యోజనాలు సముద్రాన్ని తాను దాటి వచ్చింది. నాకిదే చాలు. సర్వభోగాలూ, చలువరాతి అంతఃపురాలు వదిలేసి భర్తతో అయోనిజ అడవులకి వచ్చింది. అట్టి ఈ సుగుణాల రాశికా ఈ కష్టం.

శ్రీరాముడికి సేవలు చేస్తూ వయసుడిగినవారు తిన్నట్టు పళ్ళూ, దుంపలతో సరిపెట్టుకుంది.

అమ్మా సీతమ్మ తల్లీ... నీవు పడ్డ కష్టాలు పృథ్విలోనూ, మరే లోకంలోనూ ఎవ్వరూ పడలేదమ్మా.

చుట్టూ చెట్ల మీద, లతాంగనల మీద చూపు లేదు. కన్నీటితో చారికలు కట్టి ఉంది నగుమోము. అయినా తేజస్సు చెక్కు చెదరలేదు. ధూళి కప్పినా వజ్రం వెలుగెక్కడికి పోతుంది.

భూదేవిని మరిపించింది. ఆ తల్లి బిడ్డే కదా! 'అమ్మా' సీతమ్మా... ఈ రాముని బంటు హనుమంతుని నమస్కారం స్వీకరించు సీతమ్మ తల్లీ... నమస్కరించాడు హనుమంతుడు. మరింతగా ఇరుగుడు చెట్టు ఆకుల మధ్యకెళ్ళి చూస్తూండిపోయాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

తెల్లవారటానికి చాలా కొద్ది సమయమే ఉంది. పక్షులు గూళ్ళలోంచి బద్ధకంగా కదులుతున్నాయి. సీతాదేవి వెయ్యి స్తంభాల భవనం మధ్యలోని ఓ చెట్టు క్రింద కూర్చొని ఉంది. మహా సముద్రంలో మునిగిపోబోతున్న నౌకలా ఉంది. దుఃఖసాగరాన్ని మదిలో పెట్టుకొని చూస్తోంది.

చుట్టూ రాక్షసులు అటూ, ఇటూ తిరుగుతూ పహారా కాస్తున్నారు. పెద్ద పెద్ద పొట్టలతో, స్తనాలు ఆ పొట్టల మీదకు జారిపోయి కానవస్తున్నారు. ఒక రాక్షసికి ఓ కన్నులేదు. మరో రాక్షసికి చెవి ఒక్కటే ఉంది. వారి నోర్లు తాంబూలం





సేవించినట్టు ఎర్రగా ఉన్నాయి. పెదాల మీద అంటిన రక్తపు చుక్కలు ఎండిపోయి కానవస్తున్నాయి. ఇనుప శూలాలూ, గుదిమలూ పట్టుకు తిరుగుతున్నారు

మరొకతి గూనిది. ఒకటి వంకరది. ఒకదానికి గారపాళ్ళు, మరొక దానికి చప్పిడి మొహం. రాక్షసులు దీక్షగా చుట్టూ చూస్తూ పర్యవేక్షిస్తున్నారు.

అప్పుడే లంకాధిపతి రావణుడి అంతఃపురంలో మంగళ ధ్వనులు వినిపించాయి. వేదగానం పూర్తి అయింది. రాత్రి తాలూకూ మధుర, మగువ పారవశ్యాలను నెమరవేసుకుంటూ చెదిరిన పట్టు వస్త్రాలూ, ఆభరణాలనూ సరిచేసుకొని రావణుడు లేచాడు.

సీతాదేవి తలంపుకొచ్చింది. చక్కటి ఆభరణాలూ, దుస్తులూ ధరించాడు. తెలతెల్లవారబోతోంది. రావణాసురుడు మహా వనాలతోనూ, సుందర వృక్షాలతోనూ, జలపాతాలతోనూ, పూలతోనూ, పళ్ళతోనూ ఉన్న అద్భుతమైన అశోకవనానికి బైలుదేరాడు.

దేవేంద్రుడిని దేవతలంతా అనుసరించినట్టు వందమంది ఉత్తమ స్త్రీలు, రావణుడి ఇష్ట భార్యలూ అనుసరించారు రావణుడిని.

అందమైన అపూరూప స్త్రీల మధ్య చుక్కల్లో చంద్రుడిలా వెలిగి పోతున్నాడు. దేవేంద్రుడు కూడా అతని వైభవాన్ని చూసి ఈర్షపడేలా ఉన్నాడు.

నల్లటి ముంగురులతో, అందమైన పిరుదులతో, లేడికళ్ళతో సందులేకుండా రెండు కొండలు ఒకదానితో మరొకటి ఒరుసుకొని పోయినట్టు ఉండే స్తనాలు కలిగిన సీతాదేవిని సమీపించాడు.

ఇరుగుడు చెట్ల ఆకుల నుంచి చూసిన హనుమంతుడు రాత్రి తాను చూసినది రావణుడే అని నిర్ధారించుకున్నాడు.

మహాసాధ్వి సీతాదేవి, వైదేహి రావణుడ్ని చూసి గాలి తాకిడికి కదిలిన అరటి చెట్టులా వణికింది. నిలువెల్లా కామం నిండిన రావణుడి అడుగుల శబ్దం విని విశాలాక్షి కుంచించుకు పోయింది.

జనకరాజపుత్రి తన తొడలతో కడుపునూ, చేతులతో బాహువులను కప్పుకుంది.

కటిక బండ మీద కూర్చున్న వైదేహితో రూప యవ్వన సంపన్నుడు రావణుడు ప్రేమగా బ్రతిమిలాడుతూ చెప్పాడు.

"భయ స్వభావము గలదానా! దశగ్రీవుడు రావణుడును. పంచభూతా లనూ ఆజ్ఞాపించే నేను నీకడ ప్రార్థిస్తున్నాను. నా మాట విను. పంతం మాను. శ్రీరాముడు వచ్చి విడిపించుట కలలో కూడా సాధ్యపడదు. నిన్ను కామించాను. ఇష్టపడ్డాను.

"పరాయి స్త్రీలను తెచ్చుట, నిర్బంధించుట రాక్షస ధర్మం. రాక్షసుడని భీతి చెందవద్దు. సకల శాస్త్రాలనూ చదివి బ్రాహ్మణుడైయ్యాను. బ్రహ్మ, శివుల వరాలు పొందాను.

"మాసి పోయిన చీరను వదలి వేయి, సర్వ ఆభరణాలు ధరించు. సుఖాలూ, సౌఖ్యాలూ వీడి నీవు సాధించేది ఏమీ ఉండదు. ఏనాటికైనా, నీవు నా కౌగిలికి చేరవల్సినదే.

"మత్తు కలిగించు చూపులు గల సీతా! యవ్వనం పారే నదిలాంటిది. ముందుకు పోయిన నీరు వెనక్కి రానట్టు గడిచిన యవ్వనం తిరిగిరాదు. చందనాగరు గంధము పూసుకో... చక్కటి రత్నాల శయ్యమీద పవళించు.

"గాన నృత్య గీతాలతో, సకల అధికారాలతో యథేచ్ఛగా నాతో సుఖాన్ని పంచుకో. నన్ను అర్థం చేసుకో. బ్రహ్మదేవుడు ఇంత అందంగా అతని సృష్టి మొత్తంలోనే మరింకెవ్వరినీ సృష్టించలేదు.

"సీతా! నా పలుకులు విశ్వసించు. అనేక విలువైన రత్నరాసులనూ, సుందరమైన భార్యలనూ నీకు వినియోగిస్తాను. నాకూ, లంకకూ నీవే రాణివి. సుశ్రోణీ! సీతా! రత్నాల హారాలూ, బంగారు పూల దండలూ వేసుకొని సుందరమైన ఉద్యానవనాల్లో కాలం తెలియకుండా నాతో గడుపు. సుఖించు. రమించు. ఏడువేల మంది అందగత్తెలని బానిసలగా నీకు అర్పిస్తాను.

"ఓ సీతా! నీ రామునిపై ఇంత వరకూ చూపించిన ప్రేమ చాలు. ఏ విషయమైనా కావచ్చు. అతిగా చేస్తే కష్టాలని కొని తెచ్చుకొన్నట్టే.

"మంగళ స్వరూపిణీ! మానవుడైన రాముడి గూర్చి, దీనుడైన నీభర్త గూర్చి ఆలోచన మాను. సౌందర్యవంతుడను, శక్తివంతుడను, దేవాధిపతి దేవేంద్రుడను మించిన వాడను. నన్ను ఎదురించుట, యుద్ధం చేయుట అసాధ్యం.

"సుందరమైన చిరునవ్వు నీది. చక్కటి పలువరుస. సర్పాలను ఇష్టపడే గరుత్మంతుడివలె నా మనసు దోచావు. శ్రీరాముడు నా బలంలోగానీ,





ఐశ్వర్యంలోగానీ, శక్తిలోగానీ, ఎందులోనూ కొరగాడు. పర్ణశాలల్లో దుంపాగ్రా తిను ఖర్మ నీకెందుకు. నీవు అవునంటే నీ కోసం ఓ స్వర్గమే సృష్టించి ఇస్తాను. ఏలుకో... ఇచ్చుకో... అనుభవించు... సకల శోకములు నశింపచేయు మద్యం తాగి నాతో సుఖపడు" చెప్పాడు రావణుడు.

## గడ్డి పరక

శుచిస్మిత, వైదేహీ, దేవకన్యా సదృశురాలైన సీతాదేవి ఓ గడ్డి పరకను పట్టుకొని చెప్పింది.

"రాక్షసరాజా! సర్వశాస్త్రాలూ చదివినానని చెప్పావు. ఇటుల చేయుట ధర్మంకాదు. పర స్త్రీ పై మనసు పెట్టుకోవటం తగదు. మంచి వంశంలో జన్మించాను. అంతకు మించిన వంశంలో కోడలనయ్యాను. నాకు భర్త శ్రీరాముడే. స్త్రీ ధర్మాన్నే పాటిస్తాను. లోకం నిందించే పనులు చేయను. అట్టి శ్రీరాముడి భార్యతో నీవు చేస్తున్న పదజాలానికి నీ నాలుగ తెగిపోవాల్సిందే...

"ధర్మపరుల్లా ధర్మాన్ని పాటించు. నీ భార్యలని ఎలా కట్టు దిట్టం చేసుకొని నీవు మాత్రమే సుఖిస్తావో... అట్లే అందరు మగవారూ... నీ కున్న భార్యలతో సుఖించు. నీవు చెప్పినవన్నీ వారికే ఇవ్వు. పరాయి వాడి భార్యని కోరితే, నీ ఐశ్వర్యాన్నీ, నీ సుఖాలనీ పరదారులు అనుభవిస్తారు. స్వభార్యలతో తనవి తీరక పర స్త్రీల కోసం పోయేవాడి ఆయువు క్షీణిస్తుంది.

"రావణా! శ్రీరాముడు లోకనాథుడు. వస్తాడు. నాకీ చెర విడిపిస్తాడు. రామబాణం నీ కంఠానికి తగలక ముందే నా శ్రీరాముడితో నన్ను చేర్చు. అడవిలో ఆడ ఏనుగును వదిలి ఏడుస్తున్న మగ ఏనుగుతో ఆడ ఏనుగును చేర్చినట్టు శ్రీరాముడి దుఃఖాన్ని పోగొట్టు. శరణన్న వాడిని రక్షించే రఘురాముడు. ఇక్ష్వాకు వంశస్థుడు. సకల గుణాభిరాముడు నా రాముడు శ్రీరాముడు.

"శరణన్న వాడికి శరణిచ్చే శరణాగతవత్సలుడేకాదు. లోక భీకర యుద్ధ వీరుడు. అల్లెత్రాటిని మ్రోగిస్తేనే దిక్కులు అదిరిపోతాయి. లంకలో నీ భార్యలతో, హితులతో, పుత్రులతో పదికాలాలు ఉండాలంటే నే చెప్పినది చెయ్యి రావణా! పాపాత్ముడికి స్వర్గం ప్రాప్తించనట్టు ఎన్నటికీ నేను నీకు దక్కను.

"యమ ధర్మరాజు కాలపాశం నిన్ను చూసి బెదర వచ్చు. ఇంద్రుడి వజ్రాయుధం విరిగి పోవచ్చు. రామబాణం నుంచి మాత్రం తప్పించుకోలేవు.

కణుపులతోనూ, మంటలతోనూ వచ్చే రామబాణాలు నిన్నూ, లంకనూ తాకుట తథ్యం.

"గరుత్మంతుడు అనేక సర్పాలను సంహరించినట్టు, రాముడి బాణాలు వేలాది, లక్షలాది, కోట్లాది గరుత్మంతులుగా మారి రాక్షసులను నాశనం చేస్తాయి.

"రావణా! సూర్యుడి వెంట వెలుతురు ఉంటుంది. శ్రీరాముడితోనే సీత ఉంటుంది. మహాజ్ఞానం బ్రాహ్మణుడిని అంటిపెట్టుకున్నట్టు ధర్మజ్ఞాని, వేదవేదాంగ పండితుడైన శ్రీరాముడితోనే నేను ఎల్లప్పుడూ ఉంటాను.

"లంకా ప్రభూ రావణా! నరసింహాల వంటి రామలక్ష్మణులు లేని సమయాన తీసుకొచ్చావు. అంతకు మించిన పిరికి చర్యలేదు. వారు దగ్గరిగా ఉన్నా, నా మాట వినపడే దూరంలో ఉన్నా, వారి ధనుస్సుంకారానికి పెద్ద పులి వాసన చూసి పరిగెత్తే శునకంలా పారిపోయి ఉండేవాడివి.

"రావణా! నీకు రోజులు దగ్గర పడ్డాయి. కుబేరుడి పర్వతము మీదా, కైలాస గిరిలోనూ, వరుణడి మహా సభలో ఉన్నా, పిడుగు పోటు తప్పుకోలేని మహా వృక్షంలా శ్రీరామ బాణం నుంచి నువ్వు తప్పించుకోలేవు."

## రావణుడి గడువు

రావణుడు తన ఎర్రని నేత్రాలను మరింత ఎర్రగా చేశాడు. పాములా బుసలు కొట్టాడు.

"ధనము లేని రాముడిపై మక్కువ గల సీతా! చాలించు. కోరుకున్న మగవాడు ఆడదానికెప్పుడూ లోకువే... నిన్ను మోహించాను. కామంతో రగిలిపోతున్నాను.

"నీ వన్న మాటలు పరులెవ్వరన్నా అని ఉంటే వారి శిరస్సు నేలను తాకేది. సూర్యుడు కాంతితో సంధ్యను నశింపచేసినట్టుగా నేను నిన్ను నాశనం చెయ్యగలను.

"కానీ, నా కోపాన్నీ, అహాన్నీ, మన్మథుడు లాగివేస్తున్నాడు. సహనానికి కూడా హద్దు ఉంటుంది. నే పెట్టిన గడువు రెండు నెలలే ఉంది. ఆపై నీవు నన్ను వరించకున్న, ఉదయపు భోజనం కోసం వంటవాళ్ళు నిన్ను కోసి సిద్ధం చేస్తారు" హుంకరించాడు. శ్రీరాముడి భార్యని అట్లు బెదిరించటం చూసి దేవకన్యలూ, గంధర్వ కన్యలూ దుఃఖించారు.

రావణుడు రాక్షస స్త్రీలతో చెప్పాడు.





"ఓ ఒంటి కన్నుదానా, పెద్ద స్తనాలున్న దానా, సింహం మొహం దానా, గుర్రం కాళ్ళదానా, ఓ ఆవుకాళ్ళ దానా, ఏనుగుపాదాల దానా, పెద్ద పొట్టదానా, లావాటి తొడలు దానా, ఆవు మొహం దానా, గేదె మొహం దానా, పంది మొహం దానా, చెప్పండి. జనకరాజపుత్రికి నా ఐశ్వర్యం గూర్చీ, నా శౌర్యము గూర్చీ, నా బలమూ, బలగముల గూర్చీ చెప్పండి.

"సామదాన దండోపాయాలతో ప్రయత్నించండి. ప్రతికూల, అనుకూల కార్యాలేవైనా సరే చెయ్యండి. కాదూ, కూడదూ అంటే దండోపాయం కూడా ప్రయోగించండి" చెప్పాడు తన క్రూర నేత్రాలతో సీతాదేవిని చూస్తూ...

రావణుడి భార్య ధ్యానమాలిని చప్పున దగ్గరకొచ్చి, రావణుడ్ని కౌగిలించుకొని చెప్పింది.

"ప్రభూ! ఈ సీత మానవ కాంత. ఇష్టంలేని ఆడదానితో మగవాడు దేహతాపాన్ని మాత్రమే పొందగలడు. కోరుకున్న స్త్రీని రమించేవాడు సుఖమైన ఆనందాన్ని పొందుతాడు. నేనున్నాను. నాతో రమించు. శోభించు. మనుష్య స్త్రీతో నీకేమి సుఖం లభించును. మహాబలంతో సంపాదించిన అపురూప నీ దివ్యభోగములు బ్రహ్మదేవుడు ఈమెకి రాసి ఉండలేదు."

దశకంఠుడు రావణుడు ఆమెను సుతారంగా ప్రక్కకి లాగి, భూమి అదిరేటట్టు అంగలు వేసుకుంటూ వెళ్ళాడు. సుందర భార్యామణులు అతన్ని అనుసరించారు.

లంకేశ్వరుడు ఆ దృఢవ్రతను గజగజ వణుకుతున్న సీతను వదిలి వెళ్ళాడేకాని, అతని మోహాన్నీ, కామాన్నీ మాత్రం వీడలేదు.

## రాక్షసుల బోధ

"సీతను లొంగదీయండి" అను రావణుడి ఆజ్ఞతో రాక్షసులు సీతాదేవిని చేరారు.

"లలనా! అందంగా ఉన్నావు. ఆనందంగా ఉండటానికి రావణుడితో జతచేరు. లంకేశ్వరుడైన ఆయన కోరుకుంటే లోకాలకే రాణిని చేస్తాడు"

మరొక రాక్షస స్త్రీ చెప్పింది.

"సీతా! స్త్రీలు అందంగా ఉండాలనుకుంటారు. ఎంతో సౌందర్య పోషణ చేస్తారు. ఎందుకు. మగవాడు మెచ్చాలని. కోరుకోవాలని. అట్టి అందగత్తె సర్వసమర్ధుడికే తన అందాలను అప్పగించి ఐశ్వర్యమూ, కీర్తీ, సుఖమూ

పొందుతుంది. నీ అందం రావణుడి మతి పోగొడుతోంది. మతి పోగొట్టే ఆభరణాలూ, రాజ్యాలూ, సంపదా ఆయన వద్ద ఉన్నాయి. కాన ఆలోచించు."

"రావణుడు మహా వీరుడు. పది తలలు కలవాడు. అతను అడుగుటయే మహా భాగ్యం. మండోదరి రావణుడి ఇష్ట భార్య. ఆమె కన్నా గొప్ప స్థానం ఇస్తానంటున్నాడు. ఇంకేమిటి. అంతఃపురంలో వెయ్యి మందిని బానిసలని చేస్తానంటున్నాడు. కాన సుఖించు.

"ఆరుగురు ప్రజాపతుల్లో పులస్త్యుడు నాలుగోవాడు. అతని మానస పుత్రుడు విశ్రవసుడు. అతని పుత్రుడే రావణుడు. గొప్పవాడు" చెప్పింది ఏకజట అను రాక్షసి.

దుర్ముఖ అను రాక్షసి సీత చెంత చేరి చెప్పింది. భయపెట్టింది. హరిజాట అను రాక్షసి పిల్లి కళ్ళతో కోపంగా చెప్పింది.

"ఓ సీతా! రావణుడి ఆజ్ఞ లేనిదే సూర్యుడు ఉదయించడు. వాయువు వీయడు. పంచభూతాలూ అతని ఆధీనంలో పనిచేస్తాయి. ఎవ్వరికైనా ఆజ్ఞాపించటమేగాని, అడుగుట తెలీదు. అట్టివాడు నిన్ను ప్రార్థిస్తున్నాడు. కాన ఒప్పుకో. సుఖించు" చెప్పింది.

"ముప్పై కోట్ల మంది దేవతలనూ, దేవేంద్రుడినీ జయించిన రాక్షసరాజు రావణుడు" చెప్పింది మరొక రాక్షస స్త్రీ.

★★★ ★★★ ★★★

క్రూర స్వభావములు గల రాక్షసాంగనలు అలా లాలిస్తూ బెదిరిస్తూ చెబుతూ ఉంటే సీతాదేవి వల వలా ఏడ్చింది.

"సీతా! రావణుడి అంతఃపురం మనోహరమైనది. శయనములతో అలంకరింపబడి ఉండును. అట్టి అంతఃపురంలో ఉండవచ్చు కదా!"

పద్మమువంటి సీతాదేవి కన్నీరు కార్చింది.

రామా, లక్ష్మణా, కౌసల్యా... సుమిత్రా అయ్యో! యముని కాలపాశానికి నా మీద దయరాదేమి. జనకరాజ పుత్రిని, దశరథుని కోడలని, శ్రీరాముని భార్యని... ఈ రాక్షసులు అమంగళాలూ, అధర్మలూ చెబుతూ బెదిరిస్తూ ఉంటే వినవల్సివచ్చిందే. ఏ జన్మలో ఏ పాపం చేశానో. నా కెందుకీ శిక్ష.

శ్రీరామచంద్రుడిని వీడి ఇంతకాలం ఎందుకు జీవించాను. ముహూర్త కాలం మించి చూడకుండా ఉండలేని నా రాముడ్ని ఎంత బాధిస్తున్నాను.





రాక్షసులు గదలూ, ఆయుధాలు చూపించి "చెప్పు రావణుడితో జతకూడుతానని చెప్పు" గద్దించారు.

సీత దీనంగా ఏడుస్తూ చెప్పింది.

"లోక విరుద్ధమైన పని ఎటుల చేయగలను. సువర్చల సూర్యుడ్ని ప్రేమించినట్టు, రోహిణి చంద్రుడ్ని ప్రేమించినట్టు, సుకన్య చ్యవనుణ్ణి ప్రేమించినట్టు, సావిత్రి సత్యవంతుని ప్రేమించినట్టు, దమయంతి సౌదాసుని ప్రేమించినట్టు, కేశిని సగర చక్రవర్తిని ప్రేమించినట్టు, దమయంతి నలచక్రవర్తిని ప్రేమించినట్టు శ్రీరాముడ్ని మాత్రమే నేను అనుసరిస్తాను."

"సీతా! నీ హితం కోరి చెబుతున్నాను. రావణుడు భయంకర రాక్షసుడు. సముద్రం దాటి తెచ్చాడు. పోతుటీగ కూడా ఇక్కడికి రాలేదు. యవ్వనం కరిగిపోకముందే సుఖపడు. రాక్షసరాజుతో ఉద్యానవనాల్లో విహరించు" చెప్పింది శూలం గురి పెడుతూ...

చండోదరి అనే రాక్షసి వికటంగా నవ్వి చెప్పింది.

"సీతా! నీ కళ్ళు బాగున్నాయి. స్తనాలు బలంగా బలిసి ఉన్నాయి. రావణుడు తెచ్చినప్పట్నించీ నాకూ సీత మీద కోరికే.

"దీన్ని ముక్కలుగా చేసుకొని మద్యాలతోనూ, భక్ష్యాలతోనూ నంజుకు తినాలని."

"భలేభలే... అయితే పీక కొరికి చంపుదాము. రావణుడికి చనిపోయిందని చెబుదాం. ఎలాగూ తినెయ్యమంటాడు.

"హాయిగా నికుంభిలా దేవత ఎదుట నృత్యం చేసి త్రాగి, తిందాము. వంతులు వారీగా ముక్కలు చేసి పంచుకుందాం" చెప్పింది మరో రాక్షసి.

రాక్షస స్త్రీల బెదిరింపులకూ, చేష్టలకూ సుందరమైన ముఖం గల సీతాదేవి విలవిలలాడిపోయింది. విలపించింది.

## సీతాదేవి దుఃఖం

రాక్షసాంగనల బెదిరింపులూ, చేష్టలూ చూసి ఆత్మాభిమానవంతురాలైన సీత ఆవేదన చెందింది.

"హాయ్యో! రాక్షసుడు పెట్టిన గడువు దగ్గరికొస్తోంది. నా ప్రభువు ఎక్కడ! భూమిని జల్లెడ చేసి శోధించే నా నాథుడెక్కడ! నా జాడ తెలియరాలేదా... ఎక్కడెక్కడో వెదుకుతున్నాడా!

"ఈ రాక్షస స్త్రీల బెదిరింపులూ, చేష్టలూ భరించలేకున్నాను. నా నాథుడ్ని వీడి ఒక్క క్షణమైనా జీవించలేని నేను, ఇంత కాలం ఎలా జీవించి ఉన్నాను" బాధ పడింది. విరక్తిగా చెప్పింది.

"రాక్షస స్త్రీలారా! రండి. నన్ను చంపండి. ముక్కలు ముక్కలుగా కోసుకొని ఆరగించండి. నా రక్తాన్ని బాగా తాగండి. నా భర్తను వదలి ఉండలేకపోతున్నాను. శ్రీరామ వియోగంతో తల్లడిల్లిపోతున్నాను.

"శ్రీరాముడు వీరుడు. జనస్థానములో ఖర, దూషణులనూ, పధ్నాలుగు వేల మంది రాక్షసులనూ సంహరించాడు. అట్టి రాముడు ప్రాజ్ఞుడు. దయామయుడు. సర్వ సమర్థుడైన నా రాముడి ముందు ఈ రావణుడు అల్పుడు.

"రాక్షసులారా! శ్రీరాముడు మహాశక్తి సంపన్నుడు. ఇక్కడికి వస్తాడు. విరాధుడ్ని హతమార్చిన వీరుడు. రామ బాణం ముందు రావణుడెంత... లంక సముద్రం మధ్యన ఉంది. అసాధ్యమైన పని సముద్రం దాటటం. కానీ వీరులకు అసాధ్యం ఏమీ ఉండదు.

"రాముడి ప్రియ భార్యని తీసుకొచ్చిన పాపం లంకను వదలదు. నా లాగే లంకలోని రాక్షసులంతా రోదిస్తారు. శ్రీరామునికి నేను ఇక్కడున్నట్టు ఇంకా తెలిసి ఉండదు. తెలిసిన నాడు లంకలో ఏ దుష్ట రాక్షస స్త్రీ మాంగల్యము నిలవదు. లోకములో రాక్షసులే మిగలరు.

"ప్రియమైన రాముడ్ని వదలి, దుర్మార్గుడైన రావణుడి చెరలో చిక్కాను. యముడా నీకునూ నా మీద జాలి లేదా" దేవకన్యా సదృశురాలైన సీత ఆవేదనగా అంది.

## త్రిజట

సీతాదేవి మాటలతో రాక్షస స్త్రీలు కస్సున లేచారు. లంకనూ, మా మొగుళ్ళనూ అంటావా... అని విరుచుకు పడ్డారు. అనర్థక పరుష వాక్యాలను పలికారు.

"ఓసీ సీతా! నిన్ను పీక్కు తింటాము. రావణుడు దండించినా సరే" అరిచిందో రాక్షసి.

అంతలో త్రిజట అనే రాక్షసి వారించింది. భయంగా గుండెల మీద చెయ్యేసుకొని చెప్పింది.





"దుష్టులైన రాక్షస స్త్రీలారా! ఆపండి. మీరు భక్షించవలిసినది శ్రీరాముని భార్యని కాదు. మిమ్ము మీరు భక్షించుకోండి. నా మాట వినండి. ఈ తల్లిని బాధించవలదు.

"నాకు మహాభయంకరమైన కల తెల్లావారుజామున వచ్చింది. ఉషః కాల మందు వచ్చిన భయంకర స్వప్నం. జనకరాజ పుత్రి సీత మహా ఇల్లాలు. ఆమెనేం చెయ్యద్దు.

"నా కల గూర్చి చెబుతాను. చాలా భయంకరమైనది. ఏనుగు దంతంతో చేసిన పల్లకి, ఇంద్రుడి ఐరావతంలా ఉంది. దాని మీద తెల్లని దుస్తులూ, మెడలో పూలూ ధరించి రామలక్ష్మణులు లంకకు వచ్చారు.

"నాలుగు దంతాల ఏనుగు మహా పర్వతంలా ఉంది. రామలక్ష్మణులు ఎక్కి లంకలో తిరిగారు. సీతను చూశారు. కాంతి సూర్యునితో కలిసినట్టు సీత రాముడితో కలిసింది.

"సీతాదేవి ఆ పర్వతమంతున్న ఏనుగుని ఎక్కి శ్రీరాముడి తొడల మీద కూర్చొని సూర్యుడ్నీ, చంద్రుడ్నీ చేతులతో పట్టుకుంది.

"దేవతలూ, గంధర్వులూ, నాగులూ స్తోత్రం చేస్తున్నారు. వేద గానాలు చేశారు. అభిషేకించారు. ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని కింద పెట్టి తానూ వినయంగా కూర్చున్నాడు. బ్రహ్మ కూడా ఉన్నాడు.

"శ్రీరాముడు మహా విష్ణువులా అగుపించాడు. లోకాలన్నీ అతని చుట్టూ తిరుగుతున్నాయి. బ్రహ్మాండమంత ఎత్తు ఉన్నాడు.

"పురుషోత్తముడు శ్రీరాముడు, విశాలాక్షి సీత, లక్ష్మణుడూ దివ్య రథం ఎక్కి ఉత్తర దిక్కుగా వెళ్ళారు. పాపాత్ములు స్వర్గాన్ని జయించలేనట్టు రావణుడుగానీ, అసురులు గానీ శ్రీరాముడ్ని జయించలేకపోయారు.

"రావణుడని గాంచినాను. ఒంటి నిండా నూనె పూసుకున్నాడు. ఎర్రటి దుస్తులు ధరించాడు. రావణుడే కాదు. కుంభ కర్ణుడూ, ఇంద్రజిత్తూ, రాక్షస వీరులంతా అలానే అగుపించారు.

"రావణుడు గన్నేరు పూల దండలు వేసుకున్నాడు. పిచ్చి పట్టినట్టు గెంతాడు. ఎర్రటి పూల దండలూ, రక్త చందనాన్ని రాసుకొని రక్తాన్ని త్రాగుతున్నాడు.

"రావణుడి తలపై వెంట్రుకలులేవు. గాడిదల రథంపై దక్షిణ దిక్కుగా వెళ్తున్నాడు. ఉన్నట్టుండి క్రింద పడ్డాడు. కట్టు గుడ్డలు కూడా ఊడిపోయాయి.

బురద గుంటలో పడిపోయాడు. నల్లటి స్త్రీ రావణుడికి తాడు కట్టి బురదలోంచి దక్షిణ దిక్కుగా లాక్కెళుతోంది.

"అట్లే కుంభకర్ణుడూ, ఇంద్రజిత్తూ, మన రాక్షస వీరులూ హీనంగా అగుపించారు. వైభవోపేతంగా, తెల్లటి దుస్తులతో, ఆభరణాలతో విభీషణుడు ఒక్కడే నాకు అగుపించాడు. నాలుగు దంతాల ఏనుగుపై లంకా వీధుల్లో ఊరేగుతున్నాడు.

"రాక్షస స్త్రీలు ఎర్రబట్టలు ధరించి నూనె త్రాగుతున్నారు. రాక్షస స్త్రీలు జుట్టు విరబోసుకోని లంకా నగరమంతా పిచ్చి పట్టినట్టు తిరుగుతున్నారు.

"ఓ వానరుడు, ఓ కోతి లంకను తగులు బెట్టుట చూశాను. బహిర్ద్వారాలూ, గోపురాలూ కాలిపోయాయి. కూలిపోయాయి.

"ఓ రాక్షస స్త్రీలారా! అది అంతయూ వాస్తవ రూపం దాల్చునని నా మనసు చెబుతోంది. సీతాదేవితో పరుషంగా మాట్లాడవలదు. ప్రార్థించండి. అన్నీ భోగాలు వదులుకొని శ్రీరాముడితో వచ్చిన ఆమెకు భోగాల గూర్చి చెప్పుట వృథాయే.

"శ్రీరాముడు వస్తాడు. అందర్నీ హతమారుస్తాడు. భీకర బెదిరింపులు వదలి సీత చిత్తం వచ్చినట్టు ప్రవర్తించండి. పరుష వాక్యములు వాడకండి. జనకాత్మజ సీతకు నమస్కరిద్దాము.

"మహా ప్రళయం నుంచి ఈమె మాత్రమే మనలను కాపాడగలదు. దుఃఖములకు తగనది సీతాదేవి. జరగబోవు మహా ప్రళయం నుంచి మిమ్మూ, మీవారలనూ రక్షించుకోండి. మీకే ఆపదా రాకుండా రక్షించగలిగినది వైదేహి మాత్రమే...

"రావణుడి వినాశనమూ, శ్రీరాముడి పరాక్రమమూ త్వరలోనే చూస్తాం. అదిగో ప్రియవార్తను వినబోవుచున్నదని సీతాదేవి ఎడమ కన్ను చూడండి ఎలా పొంగినదో, అదురుతుందో. సీతాదేవి అభీష్టం త్వరలోనే సిద్ధించేటట్టు ఉంది.

"అదిగో సీతాదేవి ఎడమ భుజం అదురుతోంది. ఏనుగు తొండముతో సమానమైనదీ, శ్రేష్టమైనదీ అయిన సుందర సీతాదేవి ఎడమ తొడ ఎంత చక్కగా అదురుతున్నదో... పింగిళ పక్షి గూటిలోంచి సముద్రతీరం వైపు చూస్తూ అరుస్తోంది. ఇవన్నీ శ్రీరాముని రాకను సూచిస్తున్నాయి."





## శుభ శకునాలు

రాక్షస స్త్రీలంతా త్రిజట చుట్టూ చేరి వింటున్నారు. సీతాదేవి రోదిస్తోంది. రామా...రామా... అని కలవరిస్తోంది. నా గుండె ఇంత కఠినమై పోయిందని బాధపడింది.

వజ్రాయుధం తగిలి వెయ్యి ముక్కలైనట్టు శ్రీరాముడ్ని వదిలిన ఈ గుండె ఎందుకు పగులుట లేదని ప్రకృతిని ప్రశ్నిస్తోంది.

"అయ్యో! కాల పురుషుడు మృగరూపంలో వచ్చి నన్ను లోభ పెట్టాడు. ఆ రోజు బంగారు లేడిని కోరకున్నా బాగుండేది. కనీసం లక్ష్మణుడు చెప్పిన దాన్ని ఆచరించినా బావుండేది. రెండు మహా సింహాలనూ దూరంగా పంపించినందుకు తనకీ శిక్ష పడవల్సిందే. ఈ దుఃఖాన్ని భరించవలిసిందే.

"పాపం లక్ష్మణుడు అన్న సేవకే అడవికి వచ్చాడు. శ్రీరామ ఆర్తనాదంతో యుక్తా యుక్తాలు మరిచి స్త్రీ చాపల్యముతో అనరాని మాటలన్నాను. బిడ్డలాంటి మరిదిని అన్నందుకు ఈ శోకం పడవల్సిందే. ఈ దుఃఖాన్ని భరించుట కంటే విషం తీసుకొని మరణించుట మేలు.

"ఆ భాగ్యానికీ నేను నోచుకోలేదు. నాకీ వనంలో విషం కానీ, ఆయుధం కానీ ఎవరు తెచ్చి ఇస్తారు. శ్రీరాముడిని ఎడబాసి ఉండలేను. ఆయన్ని చేరుతాననే ఆశ క్షీణించింది.

"రామా! తండ్రి మాట ప్రకారం వనవాసం పూర్తి చేసి అయోధ్య వెళ్ళండి. రాజ్యాన్ని పాలించండి. అందమైన స్త్రీలతో క్రీడించండి. నన్ను మరచిపోండి. నేను మరణిస్తాను. సీతాదేవి మూగగా పరిపరి విధాలుగా అనుకుంది."

అప్పుడు సీతాదేవికి ధైర్యం కలిగిస్తూ శుభ సూచకంగా శుభ నిమిత్తాలు తెలిసాయి.

ధనం ఉన్న శ్రీమంతుడిని సేవకులూ, అధికారమూ వరించినట్టు సుందరమైన విశాలమైన సీతాదేవి వామనేత్రం ఒక్కటి చేప దెబ్బ తిన్న పువ్వులా అదిరింది. ఎర్రటి కనుకొలనులు పులకించాయి.

☆☆☆ ☆☆☆ ☆☆☆

జనకరాజపుత్రి సీతాదేవికి సంపదలున్న వారిని చేరిన సేవకుల్లా శుభ శకునాలు స్ఫురించాయి. సుందరమైన లేడికళ్ళు గల సీతాదేవికి వంకర తిరిగిన కనురెప్పలు గల వైదేహికి వామనేత్రము అదిరి ఆ గుండ్రటి ఎడమ భుజం...

శ్రీరాముడు స్పర్శించిన వామభుజం జలదరించింది. శ్రీరాముడిని చూడగానే ఏనుగు తొండెము వంటి తొడల్లోని ఎడమ తొడ చిగురుటాకులా వణికింది.

దుమ్ము పట్టిన పసుపు పచ్చ చీర జారింది. అట్టి శుభ సూచికలు నిర్మలమైన నేత్రములూ, కొనలు దేలిన దంతములూ, బంగారు రంగూ, మంచి కనుబొమలూ గల సీతాదేవికి ఎరుకే.

సీతాదేవిని శోకమూ, సంతాపమూ, వదిలాయి. తెల్లటి పలువరుసతో సర్వాంగ సుందరి అయిన సీతాదేవి శుక్లపక్ష చంద్రుడివలె ప్రకాశించింది. ఎండకు ఎండి కానరాకుండా పోయిన విత్తనము వర్షం కురియగానే మొలచినట్టు విలసిల్లింది.

అట్టి సీతాదేవిని హనుమ శింశుపావృక్షం ఆకుల నుంచి చూశాడు. రాక్షసుల హుంకరింపులూ, త్రిజట స్వప్నమూ విన్నాడు. శ్రీరాముని ధ్యాసతోనే రోజులు వెళ్ళదీస్తున్న ఆ తల్లిని ఊరడించుట తన ప్రథమ కర్తవ్యంగా తోచింది.

రాక్షస స్త్రీలు చుట్టూ ఉండటంతో ఏం చెయ్యాలో తోచక అవకాశం కోసం చూశాడు వాయుపుత్రుడు. అన్నింటికీ మించి సీతాదేవి తను ఎదురుపడగానే రాక్షస మాయగా భావించి అరిస్తే... అంతా రసాభాసా అవుతుంది. లెక్కకు మించిన రాక్షసులొచ్చినా పర్వాలేదు. వృక్షాల్ని పెకిలించినట్టు పెకిలించగలను. సీతాదేవి సందేశము పొందలేను కదా!

రామకార్యము చెడకూడదు. నూరుయోజనాలు దాటిన శ్రమ వృథా కాకూడదు. మంచి ఆలోచన చేయాలి అనుకున్నాడు హనుమంతుడు. చిన్న రూపం ధరించి ఎదుటకు వెళతాను. భర్తే దైవంగా ఆరాధిస్తూ మనస్సులో పూజిస్తూ శ్రీరామ నామజపం చేస్తున్న తల్లికి మధురంగా శ్రీరామగాథ చెబుతాను.

తన ఆలోచనకు తనను తానే అభినందించుకొని మనోహరమైన కంఠంతో సరళంగా, సుందరంగా చెప్పుట ప్రారంభించాడు మహాకపి హనుమంతుడు.

## శ్రీరామ చరిత్ర

"ఇక్ష్వాకు వంశస్థుడు దశరథమహారాజు రథాలతోనూ, గుర్రాలతోనూ సమస్త సంపదలుతోనూ తులతూగే కీర్తివంతుడూ, సత్యవంతుడూ, పరాక్రమవంతుడు. ఆయనకు ముగ్గురు భార్యలు. కౌసల్యాదేవీ, సుమిత్రాదేవీ, కైకేయీదేవీ... వారికి రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు జన్మించారు.





"అహింసాపరుడూ, నాలుగు సముద్రాల మధ్యనున్న భూమిని పాలించిన వాడూ, గుణశ్రేష్ఠుడూ, లక్ష్మీవర్ధనుడూ అయిన దశరథమహారాజు కైకేయికి ఇచ్చిన కోరికలు తీర్చుటకు, చందమామ వంటి నగుమోము కలవాడూ, చిరునవ్వు తప్ప కోపించనివాడూ, స్వధర్మం తప్పని వాడైన శ్రీరాముడు సాధ్వీమ తల్లి సీతమ్మతో, తమ్ముడు లక్ష్మణుడితో అడవులకి వచ్చాడు. తాపసులను బాధ పెట్టే రాక్షసులెందరినో సంహరించాడు.

"చిత్రకూట పర్వతము మీద నివశించాడు. దండకారణ్యంలో ప్రవేశించాడు. పంచవటిలో ఆశ్రమం నిర్మించుకున్నాడు.

"శూర్పణఖకు లక్ష్మణుడు ముక్కూ, చెవులూ కోశాడు. జనస్థానం నుండి ఖర, దూషణుల్నీ వేల మంది రాక్షసులని సంహరించాడు.

"క్రూరుడూ, దుర్మార్గుడూ అయిన రావణుడు కపటోపాయంతో మాయలేడిని చూపించి సీతాదేవిని ఎత్తుకొని పోయాడు. అడ్డు వచ్చిన జటాయువుని వధించాడు.

"భార్యా వియోగంతో శ్రీరాముడు చెట్టూ, పుట్టా గాలించి సుగ్రీవ చెలిమి చేసి వాలిని సంహరించి కిష్కింధకి రాజును చేశాడు.

"సీతమ్మ జాడకై వానర వీరులందరూ నలుదిక్కులకి పోయారు. సీతమ్మ జాడ సంపాతి ద్వారా తెలిసింది. శ్రీరామ కార్యమై నూరు యోజనాల సముద్రం దాటి హనుమ లంక చేరి లంకిణిని హతమార్చాడు" హనుమంతుడు చెప్పాడు.

సీతాదేవి సంభ్రమశ్చార్యాలతో చుట్టూ పరికించింది. ముంగురులు సవరించుకొని పరికించింది. శ్రీరాముడ్ని ధ్యానించింది. ఇరుగుడు చెట్టు ఆకుల మధ్య బాలభానుడిలా శోభిస్తున్న హనుమని చూసింది.

బంగారు రంగు దుస్తులు ధరించాడు. ప్రసన్నమైన కనులతో భక్తితో సీతాదేవికి నమస్కరించాడు. ఆకులో ఆకులా రమ్యంగా ఉన్నాడు. పిందెల్లో పిందెవలే చూడ చక్కగా ఉన్నాడు.

లంకలో రాక్షసుల మధ్య శ్రీరామనామస్మరణా.... కలకాదు గదా! పరికించి చూసింది. కలలో వానర రూపం శుభం కాదు. తనేమి కల కనలేదు కదా! పరికించి చూసింది. వాస్తవమే, భ్రాంతికాదు.

సుకేశిని సీతాదేవి సుగ్రీవుని మంత్రినీ, వాయుపుత్రుడనీ, ఉదయాచలముపై నున్న సూర్యుడిలా ఉన్న హనుమని చూసింది.

## శ్రీరాముని దూతను

తప్తకాంచన వర్ణంతో మెరిసిపోతూ, గోరోచనం రంగులో ఉన్న హనుమని విశాలనేత్రి, మంచి కాంతి గల సీతాదేవి మరింతగా పరికించి అంది.

దేవతలరాజు దేవేంద్రునికీ, అగ్నిహోత్రునకూ, సృష్టికర్త బ్రహ్మకూ నమస్కారములు. ప్రియవాక్యాలు చెబుతున్న వానరుడి పలుకులన్నీ సత్యమే అయి ఉండాలి.

పగడమువలే ఎర్రని ముఖం గలవాడూ, మహా తేజశాలీ హనుమంతుడు ఇరుగుడు చెట్టు దిగి వచ్చాడు. తల్లికి నమస్కరించాడు.

"తల్లీ! నీ కనుల నుంచి నీరు తామరాకుల మీద నీటి బొట్లు జారుతున్నట్టు ఉన్నాయి. అనిందితా! మంగళస్వరూపిణీ, మహా స్వర్గం నుంచి నేల మీద పడ్డ అద్భుత నక్షత్రంలా ఉన్నావు. నీ నామధేయమూ, నీ భర్త గూర్చి తెలుసుకొనగోరుతున్నాను.

"మహాసాధ్వీ! నీ అవయవ సౌష్టవమును బట్టీ, సాముద్రికశాస్త్రోక్త లక్షణములు బట్టీ నీవు ఉత్తమ క్షత్రియ కన్యలా గోచరిస్తున్నావు."

"తల్లీ! పలుకు... ఏకాదశరుద్రుల వంశానికి చెందిన దానివా? యక్ష, కిన్నెర, గంధర్వ కన్యవా? వశిష్ఠ మహర్షిని వీడిన అరుంధతి వలే ఉన్నావు. నీ రూప వాలకము నా శ్రీరాముడు చెప్పినట్టే ఉన్నది. అయిననూ అడుగుతున్నాను" అడిగాడు హనుమ.

సీతాదేవి మనసు కుదుట పరుచుకుంది. తన రాముడు పంపిన దూతే.. నిర్ధారించుకుంది. శిరసా నమస్కరించిన హనుమకి చెప్పింది.

"ఈ భూమండలం మీద రాజులందరిలోనూ శ్రేష్ఠుడూ, వీరుడూ అయిన దశరథ మహారాజు కోడలిని. శ్రీరాముడి అర్థాంగిని. జనస్థానం నుంచి రావణుడు తీసుకొచ్చిన జనకరాజ పుత్రిని. సీతాదేవిని.... పన్నెండు సంవత్సరాలు నా రామునితో సమస్త భోగాలు అనుభవించాను. కైకేయీ వరాల వల్ల, దశరథ ధర్మవాక్కునూ, సత్యవాక్కునూ నిలబెట్టుటకై కానలకి బైలు దేరిన నా రామునితో పత్నిధర్మంతో అనుసరించిన విదేహరాజు జనకుడి గారాల పుత్రిని.

"భయంకరమైన దండకారణ్యంలో అయోధ్యలో ఉన్నట్టుగానే సుఖంగా ఉన్న నన్ను మాయోపాయంతో రావణుడు ఎత్తుకొచ్చాడు. వేధిస్తున్నాడు.





రెండు మాసాలు గడువిచ్చాడు. ఆలోగా నా రాముడు నన్ను రక్షిస్తాడు అనే ఆశతోనే జీవిస్తున్నాను" దుఃఖంతో, బాధతో చెప్పింది నల్లని నేత్రములు గల సీత.

★★★ ★★★ ★★★

"మహాసాధ్వీమణీదేవీ! శ్రీరామ ప్రభువు క్షేమమే. నీ గూర్చి నిరంతరం తపిస్తున్నాడు. మల్లెతీగ చూసినా, పూల చెట్టూ, కాయ చెట్టూ, దేన్ని చూసినా నిన్నే తలుస్తున్నాడు" హనుమంతుడు చెప్పాడు.

శ్రీరామ క్షేమము విని మనసు పులకించింది.

హనుమంతుడు లక్ష్మణుడి గూర్చీ, నలు దిక్కులకూ వెళ్ళిన వానరుల గూర్చీ, అంతా వివరంగా సీతాదేవికి చెప్పాడు.

"తల్లీ! నా పేరు హనుమ. సుగ్రీవుని మంత్రిని. మనసులో ఎట్టి సందేహము వలదు. నేను శ్రీరామదూతను. నా తండ్రి వాయుదేవుడు. శ్రీరామకార్యమై సముద్రాన్ని దాటి లంకలో నా ఎడమకాలు మోపాను.

"శ్రీరాముడు సదా నీ వియోగ దుఃఖంతోనే పరితపిస్తున్నాడు. ఆ స్వామి మహావీరుడు, పరాక్రమశాలి, కాంతిమంతుడు, బృహస్పతివంటివాడు, సత్యసంధుడు, చంద్రుటివంటి మనసున్నవాడు. ధనంలో కుబేరునికి మించినవాడు. అట్టి శ్రీరాముని తమ్ముడు మహాబాహువు, సుమిత్రా నందనుడు, ఉర్మిళాపతి లక్ష్మణుడు తమకు అనేక నమస్కారాలు చెప్పమన్నాడు" చెప్పాడు హనుమంతుడు.

సీతాదేవి ప్రియంగా హనుమ మాటలని వింది. అయినా మరికొంత సంశయంతో అడిగింది. హనుమా నా నాథుడి గుణాన్ని చెప్పావు. లోకవిధితమైనవి ఆయన సుగుణాలు. రూపం కూడా వర్ణించు. అడిగింది.

"ధన్యుడను తల్లీ. శ్రీరాముడు కమల పత్రాక్షుడు. ఏక పత్నీవ్రతుడు. సుందరమైన బాహువులు కలవాడు. శీల సంపన్నుడూ, బుద్ధిలో బృహస్పతిని మించినవాడు ఆయన. శ్రీరాముడి భుజాలు విశాలమైనవి. శంఖము వంటి కంఠము. శ్యామవర్ణం కలిగినవాడు.

"కంఠధ్వని దుందుభి స్వరములా ఉంటుంది. కళ్ళ చివరల ఎర్రగా ఉంటాయి. రొమ్ము, మణికట్టు, పిడికిలి పొడవైనది. కనుబొమ్మలూ, అండకోశాలూ, బాహువులూ సమంగా ఉంటాయి.

"దేవీ! శ్రీరాముడి పధ్నాలుగు అవయవాలు సమంగా నిండుగా ఉంటాయి. నాలుగు శుభ లక్షణాలు కానవస్తాయి. ఉరువులూ, పిక్కలూ, హెచ్చు తక్కువలు లేకుండా ఉంటాయి.

"ఆ శ్రీరాముడు నడుస్తుంటే మహాసింహాము నడుస్తున్నట్టుగా ఉంటుంది. అపజయమన్నది తెలియని వీరుడు శ్రీరాముడు. ఆయన తమ్ముడు లక్ష్మణుడు. అతనిది బంగారు ఛాయ. ఇద్దరూ నడుస్తుంటే రెండు సింహాలు సంచరిస్తున్నట్టుగా ఉంటుంది.

"తల్లీ! సీతమ్మా! నీ కోసం ఎంతో వెదికాడు శ్రీరాముడు. ఎన్నో ప్రయత్నాలు చేశాడు. సుగ్రీవుడితో చెలిమి చేసి, ఆయన రాజ్యం ఆయనకు ఇప్పించాడు. ధర్మాన్ని నిలబెట్టాడు.

"నీ కోసం కిష్కింధ యువరాజు, వానరులూ, నేనూ వింధ్య పర్వతం వరకూ వచ్చాము. సంపాతి వల్ల, నూరుయోజనాలు దాటి నిన్ను చేరాను తల్లీ. నా జన్మ తరించింది. అంగదుడూ, వానరవీరులూ ఆవలి సముద్రం వద్ద నా కోసం వేచి ఉన్నారు.

"ఎట్టి దోషములు లేని సీతాదేవీ అంతయు యథాతథంగా చెప్పాను. నాతో మాట్లాడుము. ఆపై సముద్రాన్ని దాటుతాను. శ్రీరామచంద్రునికి నీ జాడ తెలుపుతాను. వర్షించటానికి పరుగులు తీసే మేఘంలా శ్రీరాముడు వస్తాడు. వానజల్లులా లంకంతా రామబాణాలు కురిపిస్తాడు. తల్లీ శ్రీరామచంద్రుడు ఆనవాలుగా ఉంగరం ఇచ్చాడు. పరికించు దేవీ..." చెప్పాడు మహాతేజుడు హనుమంతుడు.

## శ్రీరాముని ఆనవాలు

వంకర రెప్పలు నేత్రములు గల సీతాదేవి ఆ ఉంగరం చూస్తూనే పులకించిపోయింది. భక్తిగా అందుకుంది. కళ్ళకి అద్దుకుంది. రాహువు విడిచిన చంద్రుడిలా మెరిసిపోయింది. విశాలాక్షి నేత్రాలు పువ్వుల వలె వికసించాయి. దొండపండు వంటి అధరాలు, అందమైన నేత్రాలూ సన్నగా ఆనందంగా అదిరాయి. దేహం పులకించిపోయింది.

మారుతాత్మజుడూ, వానరపుంగవుడూ అయిన హనుమ చెప్పాడు.

"దేవీ! దేవేంద్రుని భార్య శచీదేవి, అనుహ్లాదుడి వద్ద ఉన్నట్టు తెలియలేదు. తెలిసిన క్షణం దేవేంద్రుడు తన సమస్త ఆయుధాలతో కదలి వచ్చి శచీదేవిని తీసుకొనిపోయినట్టు, తమ జాడ శ్రీరామునికి విన్నవించుట ఆలస్యం సముద్రాన్ని దాటి లంకకు వచ్చి రావణుడ్ని సంహరించి తమకానందం కలిగిస్తాడు.

"సాక్ష్యాత్తు మృత్యువే రావణుడితో ఉన్నా ఆ మృత్యువును కూడా సంహరించ గల లోకైక వీరుడు. తల్లీ! మేరు పర్వతం పైనా, వింధ్య పర్వతం పైనున్న కందమూల ఫలాల సాక్షిగా, పూర్ణచంద్రుడు వంటివాడు, దొండపండు పెదాలూ, అందమైన కనులూ గల శ్రీరాముడిని నీవు త్వరలోనే చూస్తావు.

"తల్లీ! నీ కోసమే క్షణమొక యుగంలా గడుపుతున్నాడు. నిద్రే మరిచాడు. తపించిపోతున్నాడు. ఎన్నాళ్ళో ఈ చెర ఉండదు తల్లీ" చెప్పాడు హనుమంతుడు.

"ఓ హనుమా! రావణుడు నాకిచ్చిన గడువులో పదవ మాసం గడుచుచున్నది. ఇంకా రెండు నెలలే సమయమున్నది. విభీషణుడు గానీ, అతని పెద్ద కుమారుడు నల గానీ, ఎవ్వరు చెప్పిననూ ఆ రావణుడు కామాన్ని వీడుట లేదు. నా శ్రీరామునకు విన్నవింపుము."

వైదేహి తన నాథుడు తనకై పరితపిస్తున్నాడని మరింత వ్యథ చెందింది. తనపై శ్రీరామునికున్న ప్రేమకు పరవశించింది.

## హనుమంతుని విశ్వరూపము

"హనుమా! శ్రీరాముని క్షేమమూ, దుఃఖమూ చెప్పావు. అమృతములో విషం కలిపి భుజించినట్టు అయింది. మహా దుఃఖ సాగరము నుంచి నా నాథుడు ఎప్పుడు బైటపడతాడో... హనుమా! రావణుడు పెట్టిన గడువు రెండు మాసాలే ఉన్నది. దేవేంద్రుడి ప్రతాపము శచీదేవికి తెలిసినట్టు నా నాథుడి వీరత్వము నాకు సంపూర్ణంగా తెలుసు. కష్టాలకి ఆ పురుషోత్తముడు చలించడు. ధీరుడూ, వీరుడూ, సకల సుగుణాభి రాముడు దుఃఖించుట వినలేక ఉన్నాను" సీతాదేవి వ్యథభరితంగా చెప్పింది.

"తల్లీ! ఓ మహాసాధ్వీ, మంగళ స్వరూపిణీ... నేను కామరూపుడను. మహాకాయుడను. నా వీపు మీద కూర్చో. ఐరావతం మీద కూర్చొన్న దేవేంద్రుడివలె ప్రస్రవణ పర్వతంపై కూర్చున్న శ్రీరాముని వద్దకు వాయు వేగంతో తీసుకెళతాను. సూర్యచంద్రులతో మాట్లాడుతున్నావా అన్నట్టు ఆకాశ మార్గాన తీసుకువెళతాను. రోహిణి చంద్రుడను చేరినట్టు లంకలోని

రాక్షసులంతా కలిసి వచ్చినా నిన్ను శ్రీరాముని కడకు చేరుస్తాను" చెప్పి సీతాదేవికి తన విశ్వరూపం చూపించటానికి సిద్ధమయ్యాడు. 'రాం' 'రాం' 'రాం' అంటూ పలికాడు ప్లవంగసత్తముడు.

మహా మేరు పర్వతమంత ఎదిగాడు. మహాతేజస్సుతో ఎర్రటి కోరలతో మహా పులివంటి గోరులతో, వజ్రంలాంటి దంతాలతో, పగడంలాంటి మొహంతో కానవచ్చాడు.

"మంగళ స్వరూపిణీ! తల్లీ! ఈ మహాలంకాపట్టణాన్ని నుగ్గు నుగ్గు చేయగలను. ఇట్టే లంకను పెకిలించుకొని పోయి శ్రీరామ పాదాల వద్ద ఉంచగలను. తల్లీ వూరడిల్లు. శ్రీరాముడు నీ దుఃఖాన్ని పోగొడతాడు. నా లాంటి వీరులెందరో వానర సైన్యంలో కోటాను కోట్లు మంది ఉన్నారు. నన్ను మించిన వారూ ఉన్నారు" వాయుపుత్రుడైన హనుమ విశ్వరూపాన్ని చూసింది సీతాదేవి. శాంతించమని చెప్పింది.

మహావీరుడు హనుమ మాములు రూపం ధరించాడు.

"శత్రువినాశకుడవైన హనుమా! నూరు యోజనాలు దాటి వచ్చావు. అది చాలు నీ శక్తి నాకు తెలియటానికి. మహావేగ గమనం నీది... నన్ను క్షణాల్లో శ్రీరాముడి చెంత చేర్చగలవు.

"కానీ ఆ లోకైక వీరునకు అది గౌరవం కాదు. నా నాథుడు లేని సమయాన దొంగతనంగా చెర పట్టిన రావణుడునకు బుద్ధి చెప్పి నన్ను సగౌర్వంగా తీసుకెళతాడు. మదించిన దిగ్గజం లాంటి నా రాముడి బాణాలు వాయువుచే ప్రజ్వలింపచేయుతూ, ప్రళయకాల సూర్యునితో పోటీపడుతూ రావణుడినీ, అతని సేననూ తాకాలి" చెప్పింది సీత.

"తల్లీ! మంగళప్రదమైన దర్శనము గల సీతా! నీ పతిభక్తి అనన్యం. శెలవిప్పిస్తే శ్రీరామ చరణాల వద్ద ఉంటాను. నీ ఆనవాలు ఏదైనా ఇస్తే స్వామికి సమర్పిస్తాను" అడిగాడు హనుమ.

## చిత్రకూట పర్వత సందర్భము

"వాయుపుత్రా! హనుమా! అరణ్యావాస సమయాన కొద్ది రోజులు సుందరమైన చిత్రకూట పర్వతంపై నున్నాము. పండ్లూ, పూలూ, సెలయేళ్ళు, జలపాతాలతో అద్భుతంగా ఉండే ఆ ప్రాంతమంటే ఆయనకూ, నాకూ అత్యంత ఇష్టం.





"ఓ రోజు... ఈశాన్యంగా మందాకినీ సమీపాన సిద్ధాశ్రమంలో ప్రకృతి అందాలను చూస్తూ నా స్వామి నా ఒడిలో పడుకొని ఆస్వాదిస్తున్నాడు. పూలసువాసనలతో కలిసిన చల్లటిగాలి. మత్తెక్కించే సెలయేటి గలగలలు. సుందరమైన పక్షుల సంగీత ధ్వనులు. మైమరిచిపోయాము.

"ఎక్కడ్నించి వచ్చిందో... ఓ కాకి... నా వైపు వచ్చి పొడవబోయింది. నేను ఎంతో ప్రయత్నించాను. స్వామి స్వాంతన చెంది ఉన్నారు. భంగం కలగకూడదని అలాగే ఉన్నాను. తనవాడి గోళ్ళతో గీరింది. బాధగా అరిచాను.

"శోభావంతుడు, శత్రుసంహారి నా నాథుడు దిగ్గున లేచాడు. నన్ను చూశాడు. దానికి కారణమైన కాకిని చూసి రుద్రుడయ్యాడు. కోపించిన సర్పమయ్యాడు.

"ఆ కాకి దేవేంద్రుడి పుత్రుడు. పక్షుల్లో మహాబలశాలి అట. శీఘ్ర గమనంలో వాయుదేవునితో సరిసమానమట. శ్రీరాముడు పచ్చటి గడ్డి పరక లాగాడు. తన ప్రియురాలిని గాయపర్చినందుకు దాని మీదకి వదిలాడు. అది బ్రహ్మాస్త్రమై పోయింది. లక్షల కొద్ది నిప్పుకణికలు వెదజల్లుతూ ఆ కాకి మీదకు వెళ్ళింది.

"దానితో భయపడి రక్షణ కొరకు దేవేంద్రుడి వద్దకు వెళ్ళాడు. తనేమీ చెయ్యలేనన్నాడు. మహర్షులు, మహాత్ములు వద్దకు వెళ్ళాడు. వెంటబడే ఆ మహా మృత్యువుని ఆపుట సాధ్యంకాదని చెప్పారు. బ్రహ్మలోకం వెళ్ళి బ్రహ్మదేవుడిని శరణు వేడాడు. సృష్టికర్తా ఏం చెయ్యలేనన్నాడు.

"కాకి పరుగున వచ్చి నా నాథుడ్ని శరణు వేడాడు. శరణన్న వారికి శరణాగతిని ప్రసాదించే స్వామి. అయితే ఆ బ్రహ్మాస్త్రం ఏం చెయ్యాలని అడిగాడు. అప్పుడ కాకి తన కుడి కంటిని దహించమని అడిగింది. బ్రహ్మాస్త్రం కుడి కంటిని దహించి శాంతించింది.

"హనుమా! ఆ సందర్భం స్వామికి విన్నవించు. కాకి మీదకే బ్రహ్మాస్త్రం వదిలాడు. అట్టి నా నాథుడు శ్రీరాముడు రావణుడిపై భూమండలమంత అగ్నిభాండాన్ని వేస్తాడు" గద్గద కంఠంతో చెప్పింది వైదేహి.

వాక్యవిశారదుడూ, మహా తేజోవంతుడూ అయిన హనుమంతుడు సీతాదేవిని అడిగాడు.

"తల్లీ! విశాలాక్షీ! వైదేహీ! లక్ష్మణుడికీ, సుగ్రీవునకూ, వానరవీరులకూ ఏం చెప్పమని శెలవు."

"కౌసల్యాదేవి తనయుడు శ్రీరామునకు నా సాష్టాంగ నమస్కారం తెలుత తెలియచేయి. మహా ఐశ్వర్యానీ, అధికారాన్నీ, భోగాలనూ, సుఖాలనూ వదలి అన్న బాట నడిచిన ఉత్తమ మనస్సు కలవాడైన లక్ష్మణుడను కుశల మడుగు.

"రాముడ్ని తండ్రిగానూ, నన్ను తల్లిగానూ చూసుకునే లక్ష్మణుడునది వెన్నెవంటి మనసు. అతన్ని మాటలతో గాయపరిచినందుకు మన్నించమను. రాజ్యలక్ష్మిని పాతాళలోకం నుండి శ్రీ మహా విష్ణువు తీసుకొచ్చినట్లుగా, మహా క్రూరుడూ, కాముకుడూ అయిన రావణుడు చెరపట్టిన నన్ను శ్రీరామచంద్రుడను త్వరలోనే తీసుకువెళ్ళమను.

"నా రాముడ్ని పదే పదే అడిగానని చెప్పు. రెండు మాసములు మాత్రమే గడువని చెప్పు" అని సీతాదేవి సిగలోంచి చూడామణి తీసింది. హనుమకి ఇచ్చింది.

"ఈ చూడామణి స్వామి స్వయంగా నాకు అలంకరించినది. హనుమా... మా ఇరువురి దుఃఖాన్ని పోగొట్టటానికి నీవు కర్తవు అయ్యావు. శ్రీరామ సన్నిధికి త్వరగా చేరు నాయనా" చెప్పింది సీత.

చూడామణిని అందుకున్నాడు. ఏదో మహాశక్తి తనకి వరమిచ్చినట్టు హనుమలో పరాక్రమం రెట్టింపయ్యింది. హనుమ ఆమెకి ప్రదక్షిణం చేశాడు. నమస్కరించాడు. తన దేహాన్ని పెంచాడు. శ్రీరాముడు వద్దకు ఎంత వేగిరంగా పోవాలో ఆలోచించాడు.

## అశోకవనము ధ్వంసము

సముద్రాన్ని దాటాను. సీతమ్మను చూశాను. సుగ్రీవునకూ, వానర వీరులకూ ఆనందం కలగచేస్తాను. నాపై రాముడు పెట్టిన నమ్మకాన్ని నిలబెట్టాను. తల్లి సీతమ్మకూ, శ్రీరామునకూ ఇన్ని కష్టాలు పెట్టిన వానికి ఏదో ఒకటి చెయ్యవలెను. ఒక వానరుడు లంక కొస్తేనే ఇంత జరిగితే... కోటాను కోట్ల వానరులు లంక మీద పడితే ఏం అవుతుందో రావణుడికి రుచి చూపించాలి. దండోపాయము ప్రయోగించాలి. వాయుపుత్రుడు హనుమ తనలో అనుకున్నాడు.

అనుకోవటమే తరువాయి... దేవేంద్రుడి నందనోద్యానవనంలా ఉన్న అశోక వనము ద్వారాలను ఒక్క తన్ను తన్నాడు. పెద్ద శబ్దం చేస్తూ విరిగి





పడింది. మహా వృక్షాలను పెకిలించి గిరగిర తిప్పి విసిరేశాడు. జలపాతాలు పడుతున్న కొండలను నేల మట్టం చేశాడు.

హనుమంతుడి భీకర విధ్వంసానికి పక్షులూ, జంతువులూ కకావికలమై పరుగులు తీశాయి. మహాకార్చిచ్చుతో అడవి మీదకు అగ్ని పడ్డట్టు పడ్డాడు. వీర విహారం చేసి లతలూ, తీగెలూ పీకి ముక్కలు చేశాడు. మూకుమ్మడిగా మానభంగం జరిగిన స్త్రీలా చేశాడు అశోకవనాన్ని.

ఆ మహాధ్వనులూ, విధ్వంసమూ లంకానగరంలోకి వినిపించాయి. అశోకవనంలోని రాక్షస స్త్రీలు గగ్గోలుగా అరిచి పరుగు తీశారు. కొంత మంది సీత ప్రక్క చేరారు. ఆ మహాకాయుడ్ని చూస్తూ ఎవడు వీడు అని ఒకరితో ఒకరు భయంగా ప్రశ్నించుకుంటున్నారు.

సీతాదేవి ఉన్న ప్రాంతం తప్ప మొత్తం సర్వమూ విధ్వంసము చేశాడు. రావణుడికి ప్రియమైనది అశోకవనము. రావణుడు తన ప్రియరాళ్ళతోనూ, భార్యలతోనూ సుఖించే సుందర వనము.

వికృత ముఖములు గల రాక్షసస్త్రీలు రావణుడి చెంతకెళ్ళి మహాకాయుణ్ణి గూర్చీ, వన ధ్వంసము గూర్చీ చెప్పారు భయం భయంగా....

"లేడి నేత్రములు గల సీతతో మాట్లాడాడు. అశోకవనాన్ని చిందర వందర చేసి పాడుచేశాడు. ఎవడా వానరుడు పట్టుకురండి" ఆజ్ఞాపించాడు. రావణుడు అగ్నిహోత్రము వలె మండిపడ్డాడు.

రావణుడి ఆజ్ఞతో రాక్షసులు పట్టిసాలూ, ఇనుప గదలూ, శూలాలూ ధరించి వెళ్ళారు. హనుమంతుడిని చుట్టు ముట్టారు.

కాంతిమంతుడూ, వజ్రశరీరంకలవాడూ, కపివీరడూ తన దేహాన్ని మరింత పెంచాడు.

"శ్రీరామునకు జయం. సీతమ్మకు నమస్కారం. లక్ష్మణునకు జయం. సుగ్రీవునికి జయం" అంటూ తన తోకతో ఒక్క చరుపు చరిచాడు. ఆ దెబ్బకి రాక్షసులు ఆర్తనాదాలు చేసి మరీ హతమయ్యారు. హనుమంతుడు తన పర్వతమంత కాలిని రాక్షసుల మీద వేసి అదిమాడు. రాక్షసులు తమచేతిలోని ఆయుధాలను గురి చూసి విసిరారు. హనుమంతుడు బలమైన ఆ ఆయుధాలను గాలిలోనే పట్టుకొని మధ్యకి విరిచి వేసినవారి మీదే వేశాడు. జబ్బలు చరిచాడు. ఆ ధ్వనికి దిక్కులు మారుమ్రోగాయి.

మిగిలిన రాక్షసులు బెదిరి రావణుడి వద్దకు వెళ్ళారు.

"ప్రభూ! మహా పర్వతమంతున్నాడు. మన రాక్షసులను నల్లులను నలిపినట్టు నలిపేశాడు. తమరే రక్ష" వేడుకున్నారు.

రావణుడు దీపము నుంచి మంటతో రాలిపడే నూనె బిందువులా ఎగిరి పడ్డాడు.

"మహాపరాక్రమవంతా! దుర్జముడా! ప్రహస్తుడి పుత్రుడా! జంబుమాలీ... వెళ్ళు ఆ కోతి సంగతి చూడు" ఆజ్ఞాపించాడు.

## జంబుమాలి

రాక్షసులు పారిపొయ్యాక హనుమంతుడిని చైత్రప్రాసాదం ఆకర్షించింది. వింధ్య పర్వతంలా, మేరు పర్వతంలా ఉన్న దాని మీదకి ఎగిరాడు. పిడి గుద్దులతోనూ, ముష్టిఘాతాలతోనూ, కాళ్ళతోనూ తన్ని పగలకొట్టాడు. ఆ మహాకాయంతో ఆ ప్రాసాదం పై నుంచి వికటాట్టహాసం చేశాడు. లంకంతా ప్రతిధ్వనించింది. ప్రాసాదాన్ని కావలి కాస్తున్న రాక్షసులు మూకుమ్మడిగా హనుమంతుని మీద పడ్డారు. ఆయుధాలను విసిరారు.

హనుమంతునకి అవి తగిలికింద పడ్డాయి. హనుమంతుడు భీకరంగా అరిచి ఆ రాక్షసులని తోకతో చుట్టి ప్రాసాదానికేసి బాదాడు. మళ్ళీ తన ప్రదేశానికి వచ్చి తోకను చూసుకొని  మురిసి పోయాడు.

రావణుడి ఆజ్ఞతో జంబుమాలి మహాసైన్యంతో అశోక వనానికి వచ్చాడు. భయంకరంగా గర్జిస్తున్న కోతినీ, నాశనమైన వనాన్నీ చూసి మండిపడ్డాడు. ఎర్రటి వస్త్రాలూ, ఎర్రటి పూలూ ధరించాడు. అంతకు మించిన ఎర్రదనం జంబుమాలి మొహంలో కానవచ్చింది.

గాడిదలు పూనిన రథంపై, ఉదయించే సూర్యుడిలా ఉన్న జంబుమాలి ధనుస్సు అల్లెత్రాడుని మోగించాడు.  దిక్కులు దద్దరిల్లి పోయాయి. హనుమ చివ్వున లేచాడు. జంబుమాలి అనేక కణుపులున్న బాణాన్ని హనుమంతుడి మీదకి వేశాడు. ఆ బాణం హనుమంతుడ్ని తాకింది. పెద్దరాయి వచ్చి తగిలినట్టు అనిపించింది. 'వూ' హుంకరించాడు హనుమ.

జంబుమాలి ఈ సారి పది ఇనుపబాణాలు హనుమంతుడి వక్షస్థలం కేసి వదిలాడు. మహా పర్వతానికి సూది గుచ్చుకున్నట్టు గుచ్చుకున్నాయి. హనుమంతుడు వాటిని తీసి అవతల పరేశాడు.





ప్రక్కనున్న మహా వృక్షాన్ని పెకిలించాడు. గిరగిర తిప్పి జంబుమాలి గుండె మీద బాదేశాడు. గాడిదలు ఓండ్ర పెట్టాయి. పచ్చడైపొయ్యాడు రథంతో సహా.

జంబుమాలి నుజ్జు నుజ్జు అయిపోవటంతో రాక్షసులు ప్రాణభయంతో రావణుడి వద్దకు పరుగులు తీశారు.

జంబుమాలి హతమవ్వట విని రావణుడు కోపంతో ఊగిపోయాడు. కళ్ళు ఎర్రబడ్డాయి. మహాబలవంతులూ, పరాక్రమవంతులూ అయిన అమాత్య పుత్రులను ససైన్యంగా వెళ్ళమని ఆదేశించాడు.

## అమాత్య పుత్రుల వధ

రోష రావణుడి ఆజ్ఞతో అస్త్ర శస్త్ర కోవిదులూ, మహా కాంతి వంతులూ, బలవంతులూ అయిన ఏడుగురు అమాత్య పుత్రులు హనుమంతుని మీదకు సింహాల్లా వెళ్ళారు. అపార సైన్యంతో విరుచుకు పడ్డారు.

తప్తకాంచన భూషణాలూ, ధనస్సులూ, గుదియలూ ధరించారు. వారి రథాలు కదులుతుంటే పిడుగులు పడ్డట్టుగా ఉంది.

తేనె తుట్టె నుంచి వచ్చే తేనెటీగల్లా బాణాలు కురిపించారు. ఝుమ్మని ధ్వని చేస్తూ వేలాది బాణాలు హనుమ వైపు వచ్చాయి. బాణాలన్నింటికీ మంచి కణుపులున్నాయి. కొన్ని నిప్పులు కక్కుతున్నాయి. మరికొన్ని భయంకర రూపాలతో కోరలతో నవ్వుతున్నాయి.

హనుమంతుడు ఊపిరి బిగపెట్టి 'వుఫ్' మని ఊదాడు. మహా వాయు వేగానికి తెగిన గాలి పటాల్లా ఎటో దూరంగా వెళ్ళిపోయాయి.

మహా పర్వతంలా ఉన్న హనుమ తన తోకని ఝుళిపించాడు. ఇంద్రుడి వజ్రాయుధం తగిలినట్టు చివరి ఆర్తనాదాలు చేశారు రాక్షసులు. హనుమంతుడు పిడికిలి బిగించి రథాల మీద గుద్దాడు. సారథితో సహా ముక్కలు ముక్కలై పొయ్యారు. రెండు వృక్షాలను పెకిలించి గిరగిర తిప్పి రథాల మీద కొట్టాడు. కొందరిని పాదాలతో తొక్కాడు. తన గోళ్ళతో గీరాడు. మహాధ్వనులతో గుండెలు పగిలేలా చేశాడు.

ఏనుగులు గీ పెట్టాయి. గుర్రాలు నేలకూలాయి. రథాలు పగిలి, ధ్వజాలు విరిగాయి. రక్త మాంసాల శరీర భాగాలతో ఆ ప్రదేశం అల్లకల్లోలంగా ఉంది.

కపివీరుడు వానర నాయకుడు మళ్ళీ శిఖరం మీద కూర్చున్నాడు.

## సేనా నాయకుల మరణము

హనుమంతుని చేతిలో వారూ హతులయ్యారని విని రావణుడు మండిపడ్డాడు. ఆ వానరుడు సామాన్యుడు కాదని భావించాడు. మహావీరులైన సేనా నాయకులని రప్పించాడు.

విరూపాక్షుడూ, యూపాక్షుడూ, దుర్ధరుడూ, ప్రఘసుడూ, భాసకర్ణుడూ వీరంతా మహావీరులు. ఎన్నోసార్లు రావణుడితో కలిసి అనేక మేటి వారందరినీ చిత్తు చేసిన ధీరులు.

"వీరులారా! ఓ కోతి మన వనమంతా చెరిచింది. సీతతో సంభాషించింది. వాడు రూపమునకు కోతిగాని మహాశక్తి భూతమని తలుస్తున్నాను. ముల్లోకాలూ, దేవతలూ, యక్షులూ, గంధర్వులూ, నాగులూ, మీ ముందు నిలువ జాలరు. మీ శూరత్వంతో విజయం సాధించుకురండి" చెప్పాడు రావణాసురుడు.

లంకేశ్వరుడి ఆదేశంతో గుర్రాల మీదా, రథాల మీదా సేనా నాయకులు అపార సైన్యంతో జయజయ ధ్వనులు చేసుకుంటూ వెళ్ళారు. తోరణం మీద దరహాసం చేస్తూ కూర్చున్న హనుమంతుడిని చూడగానే ఆవేశంతో బాణాలు ప్రయోగించారు.

మహావాడి అయిన బంగారు బాణాలను వదిలాడు దుర్ధరుడు. హనుమ తన కాయాన్ని పర్వతంలా పెంచాడు. మరెన్నో బాణాలు వేశాడు దుర్ధరుడు. బాణాల శక్తికి మించిన కాయంతో పెరిగాడు. అంతా పెరిగి ఒక్క ఎగురు ఎగిరి దుర్ధరుడి రథం మీద దూకాడు. హనుమంతుడి దూకుడికి రథం నుగ్గు అయ్యింది. రథానికున్న ఎనిమిది గుర్రాలు పచ్చడయ్యాయి.

దుర్ధరుడి మరణం చూసి విరూపాక్షుడూ, యూపాక్షుడూ ఆకాశం మీదకు శరవేగంతో ఎగిరారు. పర్వతాలను పిండి చెయ్య గల ఇనుప గుదియలతో హనుమంతుడిని బాదటం ప్రారంభించారు.

ఆ ఇనుప గుదియల దెబ్బలకి హనుమ 'రాం...రాం' అంటూ ఓర్చుకున్నాడు. ముద్గరాలతో తలపై బాదారు. ఉక్కిరి బిక్కిరి చేశారు. హనుమంతుడు దగ్గరిలోని మహా ఊడల మద్ది చెట్టును చూశాడు. దాని మొదలు మహా పర్వత శిఖరంలా ఉంది.

ఒక్క ఉదుటున పెకిలించి గిరగిరా తిప్పి, తనను బాదుతున్న ఇద్దరి మీద చరిచాడు. నడుములు విరిగి కుప్పకూలిపోయారు. మహావేగుడూ,





ప్రఘసుడూ పొలికేకలు పెట్టారు. తమ కనుల ముందే కూలిపోయిన సహోదర వీరుల ఆత్మలకు శాంతి చేకూరాలని సింహనాదాలు చేశారు.

పట్టసంతోనూ, శూలంతోనూ దాడి చేశారు. హనుమంతుడితో యుద్ధం చేశారు. హనుమంతుడి శరీరాన్ని గాయాలపాలు చేశారు. దొరికిన చోటల్లా కుళ్ళ బొడిచారు.

మహా వృక్షాలతో బాదినా చలించుటలేదు ఇద్దరు. హనుమంతుడు దగ్గరిలోని కొండను చూశాడు. దాని శిఖరం వత్తుగా మొనగా ఉంది. ఒక్క ఉదుటున గెంతి ఆ శిఖరాన్ని పెకిలించాడు.

ఆ శిఖరంతో ఇద్దర్నీ మార్చి మార్చి బాదాడు. శిఖర దెబ్బలకు తాళలేక ఆయుధాలు విడిచి గగ్గోలు పెట్టారు. హనుమంతుడు ఆ శిఖరం ముక్కలైయ్యేంత వరకూ కొట్టాడు. శిఖరం ముక్కలైంది. వారి శరీరాలు ముక్కలైయ్యాయి.

మిగిలిన రాక్షసులను తన్నాడు. వారి ఆయుధాలతో వారిని పొడిచాడు. మహా పాదాలతో తాకాడు. తోకతో వందమందిని చుట్టి ఆకాశంలోకి గిరాటు వేశాడు.

అశ్వముల మీదా, గజముల మీదా, రథాల మీదా వచ్చిన వారందరినీ దేవేంద్రుడు అసురులను సంహరించినట్టు సంహరించాడు.

మొత్తాన్నీ నాశనం చేసి మళ్ళీ రాక్షసుల ప్రాణాల కోసం ఎదురు చూసే యముడిలా తోరణం ఎక్కి కూర్చున్నాడు హనుమంతుడు.

## అక్ష కుమారుని వధ

మహాసేనలనూ, అయిదుగురు వీరులనూ వానరుడు హతమార్చాడని తెలియగానే తన కుమారుడు అక్షుణ్ణి చుశాడు. తండ్రి అనుజ్ఞ కోసం ఊవ్విళ్ళూరుతున్నాడు. రావణుడి మనోభావాన్ని అర్థం చేసుకున్నాడు. అగ్నిలా భగ్గున మండాడు. బంగారపు విల్లు పట్టుకున్నాడు. తండ్రి ఆశీర్వాదం తీసుకున్నాడు.

మహా తపస్సులు చేసి సాధించిన రథాన్ని అధిరోహించాడు. రత్నాలు తాపడం చేసిన రథమది. మనోవేగంతో భూమి మీదా, ఆకాశం మీదా ప్రయాణిస్తుంది. రథంలో కత్తులూ, గదలూ, తోమరాలూ సమృద్ధిగా ఉన్నాయి. రంగు రంగుల పూలతో ఎనిమిది గుర్రాలతో హనుమంతుడున్న ప్రదేశంలో

వాలింది. అక్ష కుమారుడు మహాతేజస్సుతో వెలిగిపోతున్నాడు. వెనుక, ముందు ఉన్న రాక్షస సేన జయజయ ధ్వనులు చేశారు.

మహా అగ్ని గుండంలా ఉన్నాడు హనుమంతుడు. అక్ష కుమారుడు మహాశక్తి వంతమైన మూడు బాణాలు వేశాడు. హనుమంతుడిపై వాన చినుకులు పడ్డట్టు పడి క్రింద పడిపోయాయి.

సూర్య ప్రభలతో మెరిసిపోతున్న రథం పై నున్న అక్ష కుమారుడు మరో మూడు బంగారు బాణాలు వదిలాడు. మహాకాల సర్పాల్లా వెళ్ళి హనుమంతుని తాకాయి. శిరముని చిధ్రం చేశాయి. రక్తం కారింది. హనుమ చలించకుండా తల విదిల్చాడు. బాణాలు నేల రాలాయి.

తన మహాధనుస్సుతో బాణ వర్షం కురిపించాడు. వాయుపుత్రుడు సింహనాదం చేస్తూ తన చేతులతోనే బాణాలను ముక్కలు చేస్తున్నాడు. మరింతగా ఆకాశానికి ఎగిరి మేఘం వలే తిరుగుతూ అస్త్రాలను వదులుతున్న అక్ష కుమారుణ్ణి చూసి హనుమ గట్టిగా అరిచి తొడకొట్టి ఆకాశానికి ఎగిరాడు.

దేవతలతో సమానమైన పరాక్రమం గల అక్ష కుమారుడు విలు విద్యలో అతనికి అతనే సాటి. నాగులూ, యక్షులూ, కిన్నెరులూ అతని ముందు ఆగలేరు. వాయుపుత్రుడు పరిపరి విధాలుగా అతని బాణ పరం పర నుంచి తప్పుకుంటూ తిరుగుతూ, ఉన్నట్టుండి ఒక్క ఉదుటున అక్షకుమారుడి రథం ముందు వాలి, రథ సారథిని అరచేతులతో గుద్ది చంపాడు. గుర్రాలకీ, రథానికీ ఉన్న ఇరుసుని విరగ్గొట్టాడు. స్వర్గానికి వెళ్ళే తాపసిలా యుద్ధములో నివారింప శక్యము గాని అక్ష కుమారుడు మరింతగా ఆకాశానికి ఎగిరాడు. హనుమ వెంబడించాడు.

అక్ష కుమారుడి రెండు కాళ్ళు పట్టుకొని గిరగిర తిప్పాడు. గరుత్మంతుడు మహా సర్పాన్ని తిప్పినట్టు తిప్పి నేలకేసి విసిరాడు. అక్ష కుమారుడి మెడ, నడుమూ, కాళ్ళూ, చేతులూ విరిగిపోయాయి. అక్ష కుమారుడు పరలోక ప్రాప్తిని పొందాడు. పై నుంచి చూస్తున్న సిద్ధులూ, దేవతలూ, హనుమంతుడి శౌర్యానికి విస్తుపోయారు.

యథావిధిగా మళ్ళీ అశోకవనము చైత్రప్రాసాదానికి పోయి కూర్చున్నాడు.

## బ్రహ్మాస్త్రం

అక్ష కుమారుడు అస్తమించాడని తెలియగానే రావణుడు పుత్రశోకంతో దుఃఖించాడు. దేవేంద్రుడిని కూడా ఓడించ గల తన పుత్రుడు వానరుడి





చేతిలో హతమవ్వటంతో సాక్షాత్తు ఇంద్రుని జయించిన తన పుత్రుడు ఇంద్రజిత్తుని పంపాడు.

సురాసురలందరూ కలిసినా ఇంద్రజిత్తును జయించలేరు. భుజబలమూ, వరబలమూ, మాయా యుద్ధంలోనూ అతనికి అతనేసాటి. ముల్లోకాల్లోనూ అతని శక్తిని అడ్డగించు ధీరులు లేరు.

రావణుడికి ప్రదక్షిణం చేసి తన సైన్యంతో మహా వేగంతో ఇంద్రజిత్తు కపివీరుడున్న ప్రదేశానికి వచ్చాడు.

మాంసఖండాలతోనూ, విరిగిన పగిలిన రథాలతోనూ, చనిపోయిన గుర్రాలతోనూ, మహా యుద్ధరంగాన్ని తలపిస్తోంది ఆ ప్రదేశం. ఇంద్రజిత్తు ఉగ్రుడయ్యాడు. మహాసముద్రపు కెరటం వలే హనుమ మీదకు వెళ్ళాడు.

ఇంద్రజిత్తు రథధ్వనీ, అల్లెత్రాడు ధ్వనినీ హనుమ విన్నాడు. అదే సమయాన అనేక ములుకులున్న బంగారు బాణాలు అమిత తేజస్సుతో రావటం చూశాడు. బ్రహ్మాండమైన వెలుగుతో నిప్పులు రాలుస్తూ వస్తున్న బాణాలు దగ్గరికి రాగానే చప్పున వంగి తప్పుకున్నాడు.

ఇంద్రతేజస్సుతో, గరుత్మంతుడి వేగంతో ఉన్న ఇంద్రజిత్తు హనుమని తేరిపారా చూశాడు. వజ్రాయుధం వంటి బాణాలూ, వంగిన మొనల బాణాలు తగిలి కూడా చలించుటలేదు.

అతనెంత వేగంగా బాణాలు వదులుతున్నా, మధ్యలో ఆపటమో, తప్పించుకోవటమో చేస్తున్నాడు. దేవతలతో సమానమైన వారిద్దరూ ఒకొరి కొకరు లొంగకుండా యుద్ధం చేస్తున్నారు.

"ఓరీ కపివీరుడా! నీ ఆటకట్టు. ఇదిగో బ్రహ్మాస్త్రం. ఎదురులేదు దానికి. ఇక నీ ఆటకట్టు" గట్టిగా అరిచి చెప్పి మంత్రించి వేశాడు. ప్రళయకాలంలో భూమి పగిలి, సూర్యచంద్రులు నేల రాలుతున్నట్టు బ్రహ్మాండమైన విస్ఫోటనం జరిగి మహాసముద్రం ఎగిసినట్టు వస్తున్న బ్రహ్మాస్త్రాన్ని చూడగానే హనుమంతుడు చప్పున చేతులు జోడించి దానికి నమస్కరించాడు. దేహచేష్టలు వదిలి వినయంగా నిల్చున్న వాయుపుత్రుడిని బ్రహ్మాస్త్రం బంధించింది.

రాక్షసులు ఇంద్రజిత్తుకు జయజయ ధ్వనులు చేశారు. గదలూ, పట్టిసాలూ ఎత్తి ఎగురుకుంటూ వచ్చి వాడి అయిన తాళ్ళతో కట్టివేశారు. బ్రహ్మాస్త్రం బంధనం తొలిగిపోయింది.

వేరొక బంధం వేస్తే బ్రహ్మాస్త్రం శక్తి నిలవదు. మూర్ఖులైన రాక్షసులు తెలియక బంధించటంతో ఇంద్రజిత్తు చేయునిది లేక హనుమంతుడ్ని తీసుకొని రావణాసురుడి వద్దకు బైలు దేరాడు.

రాక్షసులు మహాదానందముతో కొడుతూ, గిల్లుతూ, అరుస్తూ మధించిన ఏనుగువలె ఉన్న హనుమంతుడని బంధించి రావణ సముఖానికి తెచ్చారు.

మహా వైభవంతో వెలిగిపోతూ సింహాసనంపై కూర్చున్న రావణుడినీ మంత్రులనీ హనుమ చూశాడు. మహా తేజస్సుతో వెలిగిపోతున్నాడు. సర్వశ్రేష్ట మణులతో చేసిన బంగారు కిరీటాన్ని ధరించాడు. దర్దర్షుడూ, ప్రహస్తుడూ, మహాపార్శ్వుడూ, నికుంభుడూ మొదలైన మంత్రులని చూశాడు. వారందరి మధ్య రావణాసురుడు దేవతల రాజు దేవేంద్రుడిలా సభ తీరి ఉన్నాడు.

మహాకాంతీ, ధైర్యమూ, వైభవమూ, సకల శాస్త్రాలూ చదివిన జ్ఞాన సంపదా, మొహంలో కొట్టుచ్చేటట్టు కనిపించే శుభలక్షణాలూ, జగత్తు మొత్తాన్నీ సముద్రంలో నెట్టవేయగల వీరుడూ అయిన లంకేశ్వరుడని చూశాడు హనుమ.

ఆహా చెడు కాంక్షతో స్త్రీ వ్యామోహంతో సర్వమూ నాశనం చేసుకున్నాడు కదా! అంతటి కామమే లేనిచో ఇంద్రుని కంటే గొప్పవాడగుదుడు. దేవలోకానికి ప్రభువు అయ్యేవాడు.

రావణుడికి గతంలో నందీశ్వరుడు ఇచ్చిన శాపం గుర్తొచ్చింది. హనుమంతుడిని తేరిపారా చుశాడు. ఉత్తమోత్తమ మంత్రి పుంగవుడు ప్రహస్తుడు అడిగాడు.

“ఓరీ కోతి! అశోక వనాన్ని ధ్వంసం చేశావు. రాక్షస వీరులను హతమార్చావు. నీవు సాధారణ కోతివి కాదు. ఎవరు పంపగా వచ్చావు. వరుణుడా, ఇంద్రుడా, యముడా, లేక కుబేరుడా... ” అడిగాడు.

హనుమంతుడు శ్రేష్ఠమైన పట్టుబట్టలు ధరించి, ముత్యాల బంగారు హారాలతో ప్రకాశిస్తున్న రావణుడిని చూస్తూ చెప్పాడు.

“కిష్కింధరాజు సుగ్రీవుడి మంత్రిని. హనుమను. వాయుపుత్రుడను. బ్రహ్మవరాలున్న వాడిని. నన్ను మీరడిగిన వారెవరూ పంపలేదు. దేవాది దేవుడు మహావిష్ణువూ, బ్రహ్మదేవుడూ ఎవరూ పంపలేదు.

శ్రీరాముడు. ఆ రాముడి దూతను. శ్రీరామ కార్యంకై వచ్చాను. శ్రీరామ ప్రభువు దూతగా నూరు యెజనాల సముద్రాన్ని దాటి లంకకు వచ్చాను. వనమంతా చెరిచాను. నన్ను బంధించపోయి భంగపడ్డ రాక్షసులను హతమార్చాను. రామయ్య మాటకూ, బ్రహ్మయ్య బాణానికీ కట్టుబడి ఉన్నాను.





## హనుమంతుని హితము

“లంకాధిపతి రావణా! సకల శాస్త్రాలూ చదివిన మహా విద్వాంసుడవని చెప్పగా విన్నాను.

“ఇట్టి పనులేమిటయ్యా. కిష్కింధరాజు సుగ్రీవుడి హితవాక్యాలు విను. ఇహపరమైనా ధర్మసహితమైనది.

“సుగ్రీవుడు నీకు సోదరుని వంటివాడు. దశరథ పుత్రుడు శ్రీరాముడు సకల శాస్త్ర కోవిదుడు. ధర్మాత్ముడు. సత్యసంధుడు. తండ్రి మాట కోసం ఐశ్వర్యమూ, సుఖాలూ వదిలి అడవికి వచ్చాడు. అన్న బాటనే అనుసరించి వచ్చాడు లోకోత్తముడైన లక్ష్మణుడు.

“కందమూల ఫలాలు తింటూ వనవాస దీక్షలో ఉన్న శ్రీరాముడి ధర్మపత్ని సీతాదేవిని రామలక్ష్మణులు ఇంటలేని సమయాన కపటోపాయంతో తీసుకొచ్చావు. ధర్మం కాదు. వీరమూ కాదు.

“పరమ సాధ్వీమణీ, లోకైక మంగళ స్వరూపిణీ, వైదేహి, అయిదుతలల మహాసర్పం వంటి సీత జాడ తెలియక శ్రీరాముడు సతీ దుఃఖంతో చెట్టూ, పుట్టా వెతుకుతూ సుగ్రీవుడితో చెలిమిచేశాడు.

“వాలిని చంపి భార్యనూ, సుఖాలనూ, రాజ్యాన్నీ సుగ్రీవునికి కట్టబెట్టాడు. వానరరాజు మైత్రీ బంధంతో వానరులను నాలుగు దిక్కులూ సీత జాడకై పంపాడు.

“అంగదుడూ, జాంబవంతుడూ, వానరవీరులతో అష్టకష్టాలు పడి సంపాతి సాయంతో సీతమ్మ జాడ తెలుసుకున్నాము. నూరు యోజనాలు దాటి లంకకొచ్చాను.

“రావణా! స్త్రీ వ్యామోహంతో నీ మహా ఆయుష్షుని తుంచుకుంటున్నావు. నీ ఇంట ఉన్నది సౌందర్యవంతమైన స్త్రీ కాదు. కామపు చూపులు తప్పించి చూడు. అయిదు తలల మహాసర్పం.

“మహాతపఃశాలివి. పండితుడివి. పర స్త్రీ వ్యామోహం ఎంతటి అనర్థానికి హేతువో నీకు తెలియనిది కాదు. విషం కలిపిన అన్నం మూర్ఖుడు మాత్రమే తింటాడు.

"రాజా! నీ అపర ఐశ్వర్యాన్నీ, నీ భార్యలనీ, నీవు చిరకాలం అనుభవించాలనుకుంటే సీతాదేవిని శ్రీరామునికి అర్పించు. శరణువేడు.

"శ్రీరాముని శక్తి నీకు తెలియనిది కాదు. జనస్థానంలో ఎంత మంది రాక్షసులను సంహరించాడో గమనం చేసుకో. శ్రీరాముడితో యుద్ధానికి దేవేంద్రుడినీ, రుద్రుడనీ, బ్రహ్మదేవుడినీ తెచ్చుకున్నా నీవు గెలవలేవు. నీ మిత్రులూ, సైన్యమూ, మంత్రులూ, నీ వరాలూ ఎందుకూ కొరగావు.

"రావణా! నా మాటలు విశ్వసించుము. ధర్మంతో అధర్మం హతమవుతుంది. నీవు ఎవరి చేత మరణం లేకుండా వరాలు పొందావో గుర్తుకు తెచ్చుకో. శ్రీరాముడు మానవుడు. ధర్మపరుడు" వాయుపుత్రుడు నిర్భయంగా, స్పష్టంగా చెప్పాడు. ప్రియవాక్యాలకి లంకేశ్వరుడు ఒంటి మీద కారం చల్లినట్లు అరిచాడు.

## విభీషణుడి ధర్మ బోధ

సకల లోకాలనీ నాశనం చేసి, మళ్ళీ సృష్టించ గల శ్రీరాముడ్ని గూర్చి హనుమ చెప్పటంతో రావణుడు మండి పడ్డాడు.

"ఈ వానరుడ్ని చంపెయ్యండి" అంతా విని క్రోధావిష్టుడై రావణుడు ఆజ్ఞాపించాడు. రాజు ఆజ్ఞ వినగానే విభీషణుడు లేచాడు. వాక్యవిశారదుడూ, ధర్మపరుడూ అయిన విభీషణుడు రావణునితో చెప్పాడు.

"అన్నా! మన్నించు. దూతను చంపుట రాజధర్మంకాదు. లోకాచారానికి వ్యతిరేక కార్యము. ఓ దూతని చంపాడన్న అపఖ్యాతి నీకు రారాదు."

ఇంద్రజిత్తు కోపంగా, రోషంగా అరిచాడు.

"చిన్నాన్నా! దూత మన వారినెందరిని చంపాడో మర్చిపోయి ధర్మ పన్నాలు పలుకుతున్నావు. యుక్తాయుక్తాలకూ, ధర్మాధర్మాలకూ ఈ వానరుడు అనర్హుడు."

"అవును విభీషణా! ఈ దూత క్షమార్హుడుకాదు. వంధితో శత్రువుని పొగడుట, నన్ను నిందించుట దూత లక్షణమా! వనాన్ని ధ్వంసం చేయుట దూత లక్షణమా!"

"రాజా! ప్రశాంత చిత్తంతో ఆజ్ఞాపించు. బుద్ధిలో నీవు శ్రేష్ఠుడవు. రాజు ఎట్టి స్థితిలోనూ దూతను చంపరాదని నీతి శాస్త్రంలో స్పష్టంగా ఉంది. వానరుడు చేసినది తప్పే. సరైన దండన విధించు. చంపుట కూడదు.





"దూత తల గొరిగించవచ్చు. పాదముద్రను వక్షస్థలంపై వేయవచ్చు. అంగ వికృతం చేయవచ్చు. శూరులూ, వీరులూ, ధీరులూ ఎవ్వరూ దూతని చంపినట్టు చరిత్రలో లేదు.

"ప్రభూ! ఇతన్ని శిక్షించి వదిలితే, లంకవైభవమూ, పరాక్రమమూ, నీ బలమూ, తన నాథుడికి చెప్పుకుంటాడు.

"సురాసురులలో నీ కన్నా ఉత్తమోత్తముమైన వాడు లేడు. ఎదిరించిన వారెవ్వరినైనా చంపవచ్చు. దూతను చంపుట మహావంశంలో జన్మించిన నీవు చేయతగ్గ పని కాదు.

"ఈ పరాధీనుడ్ని శిక్షించి వదిలివేయి. సముద్రపు ఆవల గట్టునున్న తన వారికీ, తన ప్రభువుకీ మహాబలవంతుడైన ఈ నిశాచరరాజు గూర్చి విన్నవించుకుంటాడు" చెప్పాడు విభీషణుడు.

## తోకకి నిప్పు పెట్టండి

ఉత్తమమైన వాక్యాలు చెప్పిన విభీషణుడ్ని మెచ్చుకున్నాడు రావణుడు.

"నిజమే! ఈ కోతిని చంపితే ఏమొస్తుంది. నా ప్రతాపమూ, నా బలమూ, బలగమూ, ఆ రాముడికెలా తెలుస్తుంది. కోతికి తోకే అలంకారము. తోకకి నిప్పు పెట్టండి. చిందులేస్తుంది. అంతా వినోదం చూడండి. లంకంతా తిప్పండి" ఆజ్ఞాపించాడు రావణుడు.

రాక్షసులు గుడ్డ పీలికలకి నూనె పట్టించారు. అలా పట్టించిన గుడ్డలను తోకకి చుట్టారు. హనుమంతుడు రాక్షసుల చేష్టలకి నవ్వుతూ చూస్తున్నాడు.

లంకలోని రాక్షసులూ, వారి పిల్లలూ అంతా హనుమ చుట్టూ గుమిగూడారు. ప్రధాన వీధి అంతా రాక్షసుల వికృత నవ్వులతో మారుమ్రోగిపోతోంది.

మండుతున్న కాగడాని తెచ్చాడు ఒక రాక్షసుడు. తోకకి నిప్పు అంటించాడు. భగభగమండింది తోక. డప్పులూ, శంఖాలూ, వాయిస్తూ లంకానగర వీధులు తిప్పారు.

హనుమ లంకంతా పరీక్షగా చూసి ఏది ఎక్కడుందో ఎన్ని ద్వారా లున్నాయో చూసి ఒళ్ళు విరుచుకున్నాడు. మట్టి తాళ్ళు తెగినట్టు తెగిపోయాయి.

మహా సింహనాదం చేశాడు. తన శరీరాన్ని పెంచాడు. రాక్షసులు గోలగోలగా అరుస్తూ పరుగులు తీశారు.

హనుమంతుడు మండుతున్న తోకను చూసుకున్నాడు. తననేమీ అగ్నిహోత్రుడు బాధించుటలేదు.

రామకార్యార్థమై సముద్రాన్ని దాటి వస్తున్నప్పుడు మైనాకుడు సహాయపడినట్టు, జాడ చెప్పి సంపాతి సాయం చేసినట్టు అగ్నిహోత్రుడు కూడా శ్రీరామ కార్యంలో పాలుపంచుకుంటున్నాడు. హనుమ భక్తిగా శ్రీరాముడిని తలుచుకున్నాడు. తన తోకతో రాక్షసులని బాదాడు.

## లంకా దహనము

"వైదేహీ! చూశావా... ఆ కోలాహలము. నీ జాడకై వచ్చిన కపికి జరిగిన సన్మానము. తోకకి నిప్పు పెట్టించారు. లంకంతా చిందులేస్తున్నాడు" సీత చుట్టూ ఉన్న రాక్షస స్త్రీలలో ఒకామె సంబరంగా చెప్పింది.

సీత విలవిలలాడిపోయింది. పాపం హనుమ అగ్నిహోత్రుని బాధ ఎలా భరిస్తున్నాడో... వ్యథ చెందింది.

"అగ్నిహోత్రుడా! దశరథ మహారాజు కోడలిని, శ్రీరాముని ధర్మపత్నిని, జనకరాజు పుత్రిని. నేను పతిధర్మాన్నీ, పతి సేవనూ పాటించినట్లైతే కపివీరుడని, సదాచార సంపన్నుడని, ఎట్టి బాధా పెట్టరాదు" వేడుకుంది వైదేహి.

హనుమంతుడు రివ్వున పైకెగిరాడు. మండుతున్న తోక వెలుగు నీడ మహాభవనాల మీదా, విమాన గృహాల మీదా పడింది. కాంతిమంతుడు హనుమంతుడు తనని బాధించని అగ్నిహోత్రునకు మంచి విందు భోజనం పెట్టి ఋణం తీర్చుకోవాలనుకున్నాడు.

అంతే రివ్వున ఓ పెద్ద గృహం మీద వాలాడు. భగభగమండుతున్న తోకని అంటించాడు. మెరుపు వేగంతో మరో భవనం పైకి ఎగిరి దానికీ నిప్పు పెట్టాడు. దినాలుగా భోజనం దొరకనివాడు ఆత్రంగా తిన్నట్టు అగ్నిహోత్రుడు తన సమస్త నాలుకలతో విజృంభించాడు.

హనుమంతుడు ఆ భవనం మీద నుంచి ఈ భవనం మీదకూ... ఈ భవనం మీద నుంచి ఆ భవనం మీదకూ... గెంతుతూ అంటించాడు. లంకా నగరమంతా మంటలు. రాక్షసుల కేకలూ, అరుపులూ... విభీషణుడి గృహం తప్ప అంతా అంటించాడు.

హనుమంతుడు మహా సుందరమైన రావణుడి భవనానికీ నిప్పు పెట్టాడు. ముత్యాలూ, రత్నాలూ, బంగారలూ, మంగళ ద్రవ్యాలూ, మొదలైన వాటితో





మేరు పర్వతమంతున్న రావణుడి భవంతికి నలువైపులా చిచ్చుపెట్టాడు. తన తండ్రి వాయుదేవుడిని, అగ్నిహోత్రుడికి చేదోడు వాదోడుగా ఉండమని ప్రార్థించాడు.

హనుమ ఏ భవనాన్నీ వదలలేదు. రశ్మికేతువు, ప్రహస్తుడు, సూర్య శత్రువు, మహాపార్శ్వుడు, హ్రస్వకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడు, నరాంతుకుడు, కుంభుడు, నికుంభుడు అలా ఎందరో రాక్షస సేనా నాయకుల భవనాలకి నిప్పు పెట్టాడు. మహోగ్ర అగ్ని జ్వాలలకి ఆహుతి చేశాడు.

అంతే అగ్నికి, వాయువు చేరువయ్యాడు. లంకా నగరంలో సముద్ర కెరటాల్లా మంటలు లేచాయి. రుద్రుడు త్రిపురమును కాల్చినట్టు కాల్చాడు. హనుమంతుడు అప్పుడు శాంతించాడు. మండుతున్న తోకని సముద్రపు ఒడ్డు కెళ్ళి ఆర్పుకున్నాడు.

అప్పుడు కలిగింది హనుమ మనసులో సందేహం. సీతాదేవి గుర్తుకు వచ్చింది. ఆందోళనతో అశోకవనాన్ని చేరాడు. గుండెలు ఉగ్గబెట్టుకొని చూశాడు. సీతాదేవి క్షేమంగా ఉండటంతో తేలికపడ్డాడు.

## లంక నుంచి హనుమ ప్రయాణం

"మహాబాహూ! స్వామి నన్ను చూసి రమ్మన్నారా? కాల్చి రమ్మన్నారా?" అడిగింది సీతాదేవి. వాయుపుత్రుడు ఆమెకు నమస్కారం చేశాడు.

"తల్లీ! నీవు సౌభాగ్యవతివి. రాక్షసులు వారి బలమూ, శక్తీ చూపించారు. నేనూ నా స్వామి భక్తీ, వానర వీరుల వీరత్వమూ చూపాను.

"పూజ్యురాలా! నాకు శెలవిప్పించిన వెళ్ళి వస్తాను. రామ ప్రభువుకు సర్వమూ నివేదిస్తాను.

"సుగ్రీవునితో, వానరులతో, భల్లూక వీరులతో భూమి మీదున్న సమస్త వానరులతో శ్రీరామలక్ష్మణులు నీ చెర విడిపించుటకు అతి త్వరలోనే వస్తారు" అని సీతాదేవి నుంచి ఆశీర్వాదం తీసుకొని ఎగిరాడు. అరిష్టము అనే పర్వతాన్ని చేరాడు.

ఆ పర్వతమంతా మహా వృక్షాలతోనూ, జంతువులతోనూ, సర్పాలతోనూ నిండి ఉంది. చిన్న చిన్న కొండలతో, గుహలతో, రాతి బండలతో నిండి ఉంది.

హనుమ ఆ పర్వతం మీద ఉన్నాడు. మహాకాయంతో అతని బరువుకి రాళ్ళు పిండి అయిపోతున్నాయి. మహాకాయం చూసి జంతువులూ, పక్షులూ, అరుచుకుంటూ పరుగులు తీస్తున్నాయి.

పూల చెట్లూ, వృక్షాలూ విరిగి పడిపొయ్యాయి. కొండ గుహల్లో ఉన్న మహా సింహాలు తాము గుహ నుండి రాకపోయినా ఈ వైపరీత్యమేమిటి అనుకొని గుహ అంతర్భాగంలోకి వెళ్ళిపోయాయి.

హనుమంతుడు శ్రీరాముడ్ని తలుచుకొని దక్షిణ దిక్కు నుంచి ఉత్తర దిక్కు వైపు ఎగిరాడు. మహావృక్షాలతో, పది యోజనముల వైశాల్యము ముప్పై యోజనాల ఎత్తు ఉన్న ఆ పర్వతం హనుమ ఎగిరిన వేగానికి నేల మట్టం అయింది. హనుమంతుడు ఆకాశాన రివ్వున దూసుకెళ్తున్నాడు.

## సీతను కనుగొన్నాను

గరుత్మంతుడివలే, మహావేగమైన రెక్కల పర్వతంలా హనుమ ఆకాశ మార్గాన మహేంద్ర పర్వతానికి బైలు దేరాడు. మేఘాల్లో మహా మేఘంలా దూసుకెళ్ళాడు. సూర్యుడినీ, చంద్రుడినీ మ్రింగి వెయ్యటానికి వెళ్తున్నాడా అనిపించేలా గాలిని చీల్చుకొని మహేంద్ర పర్వతం చేరి సింహనాదం చేశాడు.

హనుమంతుడి రాక కనుచూపులోనే తెలుసుకున్న అంగదుడూ, జాంబవంతుడూ వానర వీరులంతా హనుమని చేరారు. ఉత్సాహంతో మొత్తం వానర వీరులు ఉత్కంఠతతో హనుమ పలుకుల కోసం చెవులు రిక్కించారు. కొంత మంది వానరులు చెట్లెక్కి, శిఖరాలెక్కి మరీ హనుమని చూశారు. జాంబవంతుడు హనుమకు కందమూల ఫలాలూ, తియ్యటి మగ్గిన పండ్లూ ఇచ్చాడు.

వాయుపుత్రుడు హనుమంతుడు అంగదునకూ, జాంబవంతునకూ నమస్కరించాడు. అమృతంతో సమానమైన పలుకులు పలికాడు.

"సీతాదేవిని కనుగొన్నాను. లంకలో రాక్షస స్త్రీల మధ్య అశోకవనంలో ఉంది. దుమ్ము కొట్టుకొనిపోయి, పసుపు పచ్చ చీరలో దుమ్ము పట్టిన వజ్రంలా ఉంది.

"శ్రీరాముని రాకకై ఎదురు చూస్తోంది. వేదన పడుతోంది. దుష్టుడైన రావణుడి చెర నుంచి వదిలే మంచి రోజు కోసం నిరీక్షిస్తుంది" చెప్పాడు హనుమంతుడు.





వానర వీరులు కేకలు వేశారు. అరిచారు. గెంతులు వేశారు. హనుమంతుడు సీతను చూశాడు.

తామంతా గర్వంగా సుగ్రీవుని వద్దకు వెళ్ళవచ్చు. భార్యా పిల్లలనూ, స్నేహితులనూ, బంధువులనూ చూడొచ్చు. రామలక్ష్మణులకు నమస్కారం చేయవచ్చు.

అంగదుడు హనుమంతుడ్ని అక్కున చేర్చుకున్నాడు.

"నీ ప్రభు భక్తి అపారం. స్వామి భక్తి అనితరమైనది. కార్యం సాధించుకొని వచ్చావు. మహా అదృష్టవంతుడవి. సీతమ్మను చూడగలిగావు.

"జనకాత్మజను చూశావు. శ్రీరాముని దుఃఖం నేటితో సరి. పరాక్రమమూ, ధైర్యమూ, శక్తితో శ్రీరాముని ఆశీస్సులతో రామపత్నిని చూశావు. వానర వీరుల అందరిదీ అదృష్టము" చెప్పాడు జాంబవంతుడు.

దేవతల మధ్య కూడిన దేవేంద్రుడిలా హనుమంతుడు వానర వీరులందరికీ బైలు దేరిన దగ్గర్నించి వచ్చే వరకూ విపులంగా చెప్పాడు.

## చూసి రమ్మంటే కాల్చి వచ్చాను

కామరూపిణి సురస దగ్గర్నించి లంకిణిని హడలెత్తించటమూ, లంకంతా వెతుకటమూ, రావణుడి భోగాలనూ, అశోక వనంలో సీతా సందర్శనమునూ, రావణుడు జనకాత్మజతో చెప్పిన బెదిరింపులూ, సేనా నాయకులతోనూ, సేనాధిపతులతోనూ, అక్ష కుమారులతోనూ, ఇంద్రజిత్తుతోనూ చేసిన యుద్ధమూ, బ్రహ్మాస్త్రానికి కట్టు బడటమూ, రావణుడి హిత వాక్యాలూ, విభీషణ ధర్మబుద్ధీ, తోకకి నిప్పు, లంకాదహనమూ, సీతమ్మ నుంచి శెలవూ అంతా చెప్పాడు హనుమంతుడు.

"అంగదా! సీతాదేవి ఉత్తమ ఇల్లాలు. ఆ మహా తల్లి పేరుకి తగ్గట్టే ఉంది. సౌమ్యురాలు. శ్రీరామునికి తగ్గ ఇల్లాలు. మహాపతివ్రత. ఆమెకి కోపం వస్తే భూమి మండిపోతుంది.

"ఆమె బాధా, ఆక్రోషమూ, శ్రీరాముని వియోగ దుఃఖం చూసి లంకలోని రాక్షసులందరినీ చంపేసి సీతని చెర విడిపించాలనిపించింది. సీతాదేవి తన భర్త శ్రీరాముడే వచ్చి విడిపించాలని చెప్పింది.

"అంగదా! జాంబవంతా! మీరు చెప్పండి. వానరవీరులంతా వెళ్ళి లంకను పెళ్ళగించి సముద్రంలో పారేసి సీతమ్మని శ్రీరామునికి సమర్పిద్దామా....!

"అంగదా, జాంబవంతా, నీలుడా, ఐందుడా, ద్వివిదుడా, పనసుడా... ఇరుగుడు చెట్టు క్రింద వైదేహి దుఃఖంతో కృశించిపోతూ ఉంది. శ్రీరాముడ్నే జపిస్తుంది. ఆ సర్వాంగ సుందరి ఒక్క చీరతోనే ఉంది. దుమ్ము, ధూళితో ఉన్న చీరతో శ్రీరామునికై ఏకధాటిగా రోదిస్తోంది.

"ఒంటి జడతో హేమంత ఋతువులోని తామర చెరువులా ఉంది. పులి గుహలో ఉన్న లేడిలా శింశుపా వృక్షము క్రింద కూర్చొని బెదురుతోంది మృగశాబాక్షి, యశస్వినీ సీతాదేవి. ఏం చేద్దామో చెప్పండి."

## శ్రీరాముడిదే నిర్ణయము

"మారుతాత్మజుడా! వాయుపుత్రా! ఆవేశం తగదు. రావణుడు తపః శక్తి సంపన్నుడు. ముల్లోకాలనూ గడగడలాడించినవాడు. దేవతలనూ, ప్రకృతినీ ఆజ్ఞాపిస్తున్న మహాశక్తి వంతుడు. అట్టి వానితో ఆచి తూచి యుద్ధానికి పోవలెను" చెప్పాడు జాంబవంతుడు.

"జాంబవంతా! దేవతలకు కూడా మనతో ఎగిరి వెళ్ళే సామర్ధ్యము లేదు. సముద్రం చెలియలి కట్టదాట వచ్చును. మందర, వింధ్య పర్వతాల నలించవచ్చు.

"యుద్ధంలో నిన్ను సమీపించ గల వీరుడు లేడు. ఇక వాలి కుమారుడను అంగదుడను నేను ఉన్నాను. నా తండ్రి వాలితో సమానమైనవాడిని. అనేక వానర వీరులున్నారు. స్వామి కార్యము పరిపూర్ణంగా పూర్తి చేద్దాము" చెప్పాడు అంగదుడు.

"కిష్కింధ యువరాజా! అంగదా! శ్రీరామప్రభువూ, సుగ్రీవుడూ మనకి చెప్పింది సీతాదేవి అన్వేషణ వరకే. దాటి ప్రవర్తించరాదు. హనుమ, అంగద, వానర వీరులతో రాక్షస సంహారం అయ్యేపని కాదు. సీతమ్మ జాడతెలుసుకున్న ఉత్సాహముతో ఈ పలుకులు సహజం. తదుపరి కర్తవ్యము శ్రీరామునిదీ, సుగ్రీవునదే" చెప్పాడు జాంబవంతుడు.

"అవును యువరాజా! రాక్షసరాజు రావణుడి పరివారములో వీరాధి వీరులున్నారు. ఒక్క ఇంద్రజిత్తు దగ్గరే లెక్కకి మించిన దేవతాస్త్రాలు ఉన్నాయి. వానరసేనంతా కలిసి వెళ్ళినా కోట్లాది మంది రాక్షసులనూ, రావణుడ్నీ హతమార్చలేం. శ్రీరాముడే రావాలి. ధనుస్సు చేత బూనాలి" చెప్పాడు హనుమంతుడు.





ఆ మహేంద్ర పర్వతం మీద నుంచి వానరులంతా మదపుటేనుగుల్లా, శత్రువులని చీల్చి చెండాడిన సింహాల్లా నడిచారు. హనుమంతుడు ఎగరగానే అంతా అనుసరించారు.

రామకార్యము పూర్తి చేసుకొన్నామన్న ఆనందం వారికి రెట్టింపు శక్తినిస్తోంది. ఆనంద పారవశ్యంతో ఎగురుతూనే అరుస్తున్నారు. మేఘాలను చరుస్తున్నారు. కేకలతో, అరుపులతో తోకలు ఆడిస్తున్నారు.

అప్పుడు కనపడింది మధువనము.

## మధువనము

సర్వభూత సుందరమైన మనోహరమైన మధువనము అనేక వృక్షాల తోనూ, పూలూ, పండ్లూ, కాయల చెట్లతోనూ, రుచికరమైన మధువుతోనూ ఉండే ఆ అద్భుత వనము సుగ్రీవుని ఆనంద సామ్రాజ్యము.

వానరులంతా అంగదునితో మొరపెట్టుకున్నారు. వేడుకున్నారు. ప్రార్థించారు. మధువును మధువనంలో త్రాగవలెనని కోరికను వెళ్ళబుచ్చారు. జాంబవంతుడూ, నీలుడూ, హనుమంతుడితోనూ, వానరసేనా నాయకుల తోనూ చెప్పించారు. ఒత్తిడి తెచ్చారు.

అంగదుడు ఒప్పుకోగానే ఆకాశం మీద నుంచి ఉల్కలు పడ్డట్టు రివ్వున మధువనం వైపు దూసుకువెళ్ళారు. చెట్టా పట్టా లేసుకున్నారు. స్నేహ బంధువులుగా మారి సరసమాడుకున్నారు.

మధువన సంరక్షణ బాధ్యత సుగ్రీవుని మేనమామ దధిముఖుడిది. ఆ మహా పరాక్రమవంతుడు ఆ సమయాన వనంలో లేడు. అంగదుని ఆజ్ఞతో వనంలోకి ప్రవేశించారు. కావలి వాండ్లను త్రోశారు. వానరులంతా వనం మీద పడి చెట్లు ఎక్కారు. ఆ చెట్టు మీద నుంచి ఈ చెట్టు మీదకి గెంతారు. తోకలతో వృక్షాలని ఊపారు.

మధువు కడుపారా త్రాగారు. ఎక్కువైంది నేలపాలు చేశారు. పూల మొక్కలు పీకి పూలను నెత్తిన జల్లుకున్నారు. తాగి తాగి నడవలేక తప్పటడుగులు వేస్తు దభేలున పడ్డారు. కాపలా వాళ్ళు ఎంత వారించినా వినలేదు. పిడి గుద్దులు కురిపించారు. తోకలతో చరిచారు.

కాపలా వాళ్ళు తలో దిక్కుకి పోయి దధిముఖునికి విన్నవించారు. ఆయన ఆగ్రహంతో మధువనానికి నడిచాడు. దూరం నుంచి అంగదుడు

చూస్తునే వేగంగా వెళ్ళి పిడికిలి బిగించి గుద్దాడు. మత్తులో తనకి తాత అని కూడా ఆలోచన రాలేదు.

యువరాజు అలా చేయగానే వానరులు మరింతగా విజృంభించారు. మదావేశముతో దధిముఖుడినీ, కావలి వాళ్ళనీ నేల మీద పడేసి కొట్టారు. దధిముఖుడు, కావలి వాళ్ళు ఎలాగో తప్పించుకొని సుగ్రీవుని దగ్గరికి పారిపోయారు.

## సుగ్రీవుని అభయం

"దధిముఖుడా! ఏం అయినది. వీరాధివీరుడవు నీవు. ఈ దెబ్బలేంటి నీకు అభయం ఇస్తున్నాను" చెప్పాడు సుగ్రీవుడు.

"ప్రభూ! నీ తండ్రి ఋక్షరజుడి పాలనలోగానీ, వాలి పాలనలోగానీ మధువనము జోలికెవరూ రాలేదు. అట్టి నేడు మన వానరవీరులే, అంగద, హనుమంత, జాంబవంతాది వీరులతో కలిసి విధ్వంసము చేశారు. త్రాగినంత త్రాగి, పారబోసేంత పారబోశారు. వృక్షాలూ, పూల చెట్లూ విరగగొట్టారు. పండ్లన్నీ నేల రాల్చారు.

"నీటి యంత్రాలను విరగ కొట్టారు. కావలివాండ్లను కొట్టారు. ప్రభూ! కోతులంతా కలిసి వనమంతా చెరిచారు" చెప్పాడు దధిముఖుడు. అదంతా చూస్తున్న మహాప్రాజ్ఞుడు లక్ష్మణుడు సుగ్రీవుడ్ని అడిగాడు. శ్రీరాముడు అల్లేత్రాటిని సవరిస్తున్నాడు. సుగ్రీవుడు లక్ష్మణుడితో చెప్పాడు.

"పూజ్యుడా! లక్ష్మణా! అంగద, హనుమంతాది వీరులంతా, వానరులతో కలిసి మధువనం మీద పడి అల్లరి చేస్తున్నారట. చెట్లనూ, లతలనూ విరిచేస్తున్నారట. అడ్డం చెప్పబోయినందుకు మత్తులో దెబ్బలు కూడా తినిపించారు.

"లక్ష్మణా! చూడబోతే సీతమ్మ జాడ తెలిసి ఉంటుంది. శ్రీరామ కార్యము సాధించుకొని వచ్చి ఉంటారు. ఆనందంతో, సంతోషంతో మధువనం మీద పడి సంతోషాన్ని పండగలా జరుపుకుంటున్నారు. మధువనము బ్రహ్మదేవుడిచ్చినది. ఆ విషయం తెలిసినా వానరవీరులు ఆ వనములోకి వెళ్ళి వీర విహారము చేస్తున్నారంటే ఖచ్చితంగా సీతమ్మ జాడ తెలిసి ఉంటుంది. లేదంటే ఆ వన ఛాయలకు పోయే సాహసము కూడా చేయరు" చెప్పాడు సుగ్రీవుడు.





శ్రవణ మనోహరమైన పలుకులని శ్రీరాముడు విన్నాడు. మహా పద్మంలా వికసించింది మోహంలో దరహాసరేఖ. శరీరం పులకించి వణికింది.

లక్ష్మణుడది అదే స్థితి. కార్యసిద్ధి అయినది. అన్న రామన్న నగుమోములో ఉత్సాహం చూసి తన్మయుడయ్యాడు.

సుగ్రీవుడు వికసించిన కన్నులతో చెప్పాడు.

"దధిముఖుడా! కార్యసిద్ధి అయినది. సందేహంలేదు. శుభ నిమిత్తాలు అదే చెబుతున్నాయి. వేగంగా వెళ్ళి వెంటనే వారిని ఇక్కడికి రమ్మను. సుగ్రీవుని ఆజ్ఞగా చెప్పు."

రాజాజ్ఞతో దధిముఖుడు వేగంగా మధువనాన్ని చేరాడు. అంగదుడ్ని చేరాడు. నమస్కరించాడు.

"యువరాజా! అన్యథా భావించవలదు. మధువనానికి నీవు ప్రభువువని తెలియక కావలి వాండ్లు అడ్డు చెప్పినారు. పినతండ్రి సుగ్రీవుడు క్షణాలలో తన ముందు ఉండాలని శెలవిచ్చారు. రామలక్ష్మణులు అక్కడే ఉన్నారు."

అంగద, హనుమంత, జాంబవంతాది వీరులంతా ఆకాశ మార్గాన ఎగిరారు. వానరులంతా అనుసరించారు.

"శ్రీరామా! సందేహంలేదు. మనం పెట్టిన గడువు కూడా తీరిపోయింది. లేకపోయిన వానరులు ఇంత ధైర్యంగా కిష్కింధకు రాలేరు. వచ్చినా మధువనం పై పడరు. మహా వీరుడైన అంగదుడు కానీ, హనుమంతుడు కానీ, విషయ పరిజ్ఞానం ఉన్న జాంబవంతుడు కానీ, లేదా అందరూ కూడా సీతమ్మని చూసి ఉండొచ్చు."

సుగ్రీవుడు శ్రీరామునకు చెబుతూనే ఉన్నాడు. వానరులంతా జయ జయ ధ్వనులు చేసుకుంటూ దిగారు.

శ్రీరామునికి జయం... సుగ్రీవునికి జయం... అంగద, జాంబవంతులకి జయం... హనుమంతునికి జయం...

హనుమంతుడు చప్పున దిగి రెండు చేతులతో సుగ్రీవునికి నమస్కరించి శ్రీరాముని వైపు తిరిగాడు. శిరసా నమస్కరించాడు.

"స్వామీ! పద్మలత సీతమ్మను కనుగొన్నాను. తల్లి కుశలంగా ఉంది. లంకలో రావణుడి చెరలో అశోక వనంలో రాక్షస స్త్రీల మధ్య శోకదేవత వలె సదాచార నిష్ఠతో మీ కోసం చూస్తోంది"

సృష్టిలోని సమస్త సుగంధాల పూలతో వర్షం కురిసినట్లైయింది రామలక్ష్మణ సుగ్రీవులకు. ఉప్పొంగిపోయారు, పులకించి పోయారు.

## సీతాదేవి చూడామణిని శ్రీరామునికి ఇచ్చుట

వాక్యకోవిదుడూ, మారుతాత్మజుడూ, వాయుపుత్రుడు హనుమంతుడు శ్రీరాముని ముందు ఒంటి మోకాలితో కూర్చొని నమస్కరించి, సీతాదేవి ఉన్న దక్షిణ దిక్కుకి మళ్ళీ నమస్కరించి చెప్పాడు.

“స్వామీ! నూరు యోజనాల సముద్రాన్ని దాటి లంక చేరాను. లంకలోని వైభవ మందిరాలన్నీ చూశాను. ఎక్కడా లేదు. ఆ మహాపతివ్రత ఏకధారగా నిన్నే తలుచుకుంటూ అశోక వనంలో ఇరుగుడు చెట్టు క్రింద రాక్షస స్త్రీల మధ్య ఉంది. తల వెంట్రుకలు ఉండ చుట్టుకుపోయాయి.

“ఇక్ష్వాకు వంశం గూర్చి కీర్తించాను. నన్ను నేను పరిచయం చేసుకున్నాను. ఆ మహాభాగనూ, జనకనందినినీ చూశాను. ఆమె మహాసాధ్వి. జ్ఞానవంతురాలు. ధర్మవంతురాలు. దృఢవ్రత... ఆమె గూర్చి సుగుణాలెన్ని చెప్పినా ఇంకా మిగిలే ఉంటాయి ప్రభు.

“చిత్రకూట పర్వతంపై కాకిని మీరు దండించినప్పుడు, తన పై నున్న ప్రేమకి పులకించుట గూర్చి చెప్పి తమకి విన్నవించమన్నది. చూడామణిని తన ఆనవాలుగా ఇచ్చింది.

“ప్రభూ! శ్రీరామా! నేను ఎన్నో జన్మలు తపస్సు చేసి ఉంటాను. సీతమ్మను వానరులలో తొలిగా నేనే చూశాను. ధర్మవ్రత... రావణుడి గడువు కాలం లోపే లంక చెర విడిపించమని కోరింది. మంచి వర్ణము గల జానకీదేవి, సీతమ్మ మాటలన్నీ శోకంతో కలిగి ఉన్నాయి. ఆ గడువు పూర్తి అయిన పిదప తను ప్రాణాలతో రాక్షసుల మధ్య కాముకుల మధ్య ఉండనని చెప్పింది” అని భక్తిగా కళ్ళకద్దుకొని చూడామణినిచ్చాడు.

శ్రీరాముడు అపురూపంగా అందుకున్నాడు. కళ్ళు చెమ్మగిల్లాయి. సీతకి చూడామణిని అలంకరించిన సందర్భం మదిలో మెదిలి విలవిలలాడి పోయాడు. హృదయం ద్రవించి పోయి లక్ష్మణుడిని పట్టుకున్నాడు.

“హనుమా! దాహంతో అల్లాడిపోయే వాడికి ఒక మహాసరస్సు కానవచ్చినట్లుంది నిన్ను చూస్తుంటే. నా సీత ఏమంది? రోగి ఔషధంతో కోలుకున్నట్టు నా సీత మాటలతోనే నేను కోలుకుందును” అడిగాడు శ్రీరాముడు.





“ప్రభూ! శ్రీరామా! సీతాదేవి ఎంతో దుఃఖిస్తోంది. నీ జపమే చేస్తోంది. పెద్ద పులులవంటి రామలక్ష్మణులు వస్తారని రాక్షసాంగ స్త్రీలకి చెబుతోంది. లంకా పట్టణం భస్మం అయిపోతుందని, గడ్డి పరక అడ్డు పెట్టుకొని రావణుడ్ని హెచ్చరించింది.

“లక్ష్మణుడని కుశలమడిగింది. సుగ్రీవుడినీ, అంగదులనూ అడిగినట్టు చెప్పమంది. తల్లీ! నా వీపు మీద అధిరోహించు. శ్రీరాముని వద్దకు చేరుస్తానని చెప్పినా రానని చెప్పింది.

“లోకైక వీరుడైన నా రామునికి అది పరువు కాదని, లోక విరుద్ధమైన పని తాను చెయ్యనని చెప్పింది. తన బాధ, తన కోరికా నా స్వామికి విన్నవించమని చెప్పింది ఉత్తమమైన అర్థములూ, వినయ సంపన్నమూ కలిగిన దుఃఖభాగిని సీతాదేవి.

“ప్రభూ! శ్రీరామా! నీవూ, లక్ష్మణుడూ నా వీపు మీద కూర్చోండి. సుగ్రీవుడూ, అంగదుడూ, జాంబవంతుడూ, ముఖ్య వానర వీరులంతా కలిసి లంకకి వెళదాం. నీ అక్షయ తూణీరం నుంచి బాణాలు లంకపై వదులు” చెప్పాడు హనుమంతుడు.

శ్రీరాముడు మనసు నిబ్బరం చేసుకున్నాడు. ధనుస్సు పై నున్న పిడికిలిని బిగించాడు. పంచభూతాలూ తత్తర పడ్డాయి.

*శ్రీమద్రామాయణములోని సుందరకాండము సమాప్తము*

# యుద్ధకాండము





## మహాబహూమతి

హనుమంతుడు చెప్పినదంతా శ్రీరాముడు విన్నాడు. దుర్లభమైన కార్యాన్ని సాధించిన హనుమంతుడి వంక చూశాడు. ప్రశంసించాడు.

"వానరవీరులారా! హనుమ అపురూపమైన కార్యాన్ని సాధించాడు. నాలోని క్షోభని తగ్గించాడు. మహావేగవంతులైన గరుత్మంతుడూ, వాయువూ, హనుమంతుడూ వీరు మాత్రమే ఈ కార్యాన్ని సాధించగలరు.

"మహా మహా వీరులూ, శూరులూ, యక్షులూ, గంధర్వులూ, నాగులూ, చూడలేని, వెళ్ళలేని లంకా పట్టణానికి వెళ్ళాడు. దేవ, దానవ, యక్ష, ఉరగ, గంధర్వులు సైతం ఎదిరింప శక్యముకాని రావణుడి నగరాన్ని అల్లకల్లోలం చేసి సీతాదేవి యోగక్షేమాల సమాచారంతో వచ్చాడు.

"తన రాజు సుగ్రీవుని మాట చెల్లించటమే కాదు, తన బలాన్నీ, పరాక్రమాన్నీ చూపాడు. రాజు చెప్పిన కార్యం మహాకష్టమైనది అయిననూ చేసిన వాడు ఉత్తముడు. చెయ్యగలిగీ, చేతనై కూడా చెయ్యనివాడు మధ్యముడు. సర్వ సమర్థతలు ఉండి కూడా శ్రద్ధగా కార్యాన్ని చెయ్యనివాడు అధముడు.

"తనకప్పగించిన పనిని పరిపూర్ణంగా చేసుకొని వచ్చాడు హనుమంతుడు. సుగ్రీవుడ్నీ, లక్ష్మణుడ్నీ, నన్నూ ఇంత సంతోష పెట్టిన హనుమంతునకు నేనేమివ్వగలను. అక్కున చేర్చుకోవటం తప్ప" అంటూ హనుమంతుడిని కౌగిలించుకున్నాడు శ్రీరాముడు.

హనుమంతుడికి శ్రీరాముని స్పర్శతో ఒళ్ళు పులకరించింది. శ్రీరామ సర్వస్వమైన ఆలింగనమునకు హనుమ పరమానందభరితుడైయ్యాడు.

ఆ మహాబహుమతికి తన్మయుడయ్యాడు. సుగ్రీవుడూ, లక్ష్మణుడూ సంతోషించారు.

"రామా! హనుమ ద్వారా సీత జాడా, లంకేశ్వరుడి అనుపాలూ తెలిసాయి. మహా సముద్రాన్ని దాటి దక్షిణపు ఒడ్డుకు వానర వీరులంతా ఎలా చేరగలం" అడిగాడు సుగ్రీవుడు.

శత్రుసంహారకుడూ, మహాబాహువూ అయిన శ్రీరాముడు కలత చెందాడు. ఇంతమంది వానరులతో లంకపై ఎటుల దండెత్తవలెను. సుగ్రీవుడు శ్రీరాముని చెంతకొచ్చాడు.

"రామా! దిగులు చెందకు. కృతజ్ఞత మరిచినవాడు స్నేహాన్ని ఎలా వదిలేస్తాడో నీవు అటులనే దిగులు వదిలివేయ్. నిరుత్సాహం వల్ల దైన్యమూ, శోకమూ పుడతాయి. సర్వ శాస్త్రకోవిదుడవు. నీవు ఆజ్ఞాపిస్తే వానరులంతా అగ్నిలో దూకటానికైనా సిద్ధమే. నీ పరాక్రమంతో లంకాధిపతిని మట్టు పెట్టుట తథ్యం.

"రఘువీరా! అందులకు ఒక్కటే దారి. పెద్ద మొసళ్ళతో నిండి ఉన్న ఘోర మహాసముద్రం మీద సేతువు నిర్మించటమే. ఇంత మందిమి ఉన్నాము. త్రికూట పర్వతం మీదున్న లంక వరకూ వారధి కడదాము. వానరులంతా వారధి మీద వస్తుంటే, ఆ రావణుడు సగం మరణించినట్టే.

"మహానదులన్నీ కలిసే సముద్రం మీద వారధి నిర్మిద్దాము. వీరాధి వీరులైన వానర వీరులు బండలనూ, చెట్లని పెకలించి సేతువు నిర్మించి దాని మీద వెళ్ళి రాక్షసులను సంహరిస్తారు. లంకానగరాన్ని పెకిలిస్తారు.

"ధనుర్ధారుడవై నీవు యుద్ధరంగంలో నుల్చుంటే రావణుడు నీ తేజస్సుకి కకావికలమవుతాడు."

సుగ్రీవుడు చెప్పినది సబబుగానే అనిపించింది మహాబుద్ధిశాలి శ్రీరామునకు.

వాయుపుత్రుడు హనుమని అడిగాడు శ్రీరాముడు.

"హనుమా! సేతువు నిర్మించటమో, సముద్రాన్ని చుక్క లేకుండా బాణ పరంపరతోనో నీటిని మళ్ళించటమో ఏదో ఒక పద్ధతిలో లంక చేరవచ్చు. లంకా పట్టణం ఎలా ఉంది.

"కోటలూ, కాపలా, సైన్యమూ, రాక్షసుల శక్తీ నీకు తెలిసినంత వరకూ, చూసి నంతవరకూ చెప్పు" అడిగాడు శ్రీరాముడు.





"ప్రభూ! శ్రీరామా! లంకా పట్టణము కుబేరుడి నివాస స్థలంలా ఉంది. రాక్షసులంతా పూర్తి సుఖాల్లోనే తేలియాడుతున్నారు. పండ్లు చెట్లకు గుత్తులు గుత్తులు కాయాలు కాసినట్టు ఏ వైపు చూసినా రాక్షసులే. లంకకి నలు దిక్కులా నాలుగు ద్వారాలున్నాయి. వాటి దగ్గర పెద్ద ఉక్కు గుదియలున్నాయి. అవి ప్రయోగించితే కనీసం వంద మంది అయినా దాని క్రిందపడి నలిగిపోయేంత ఉన్నాయి.

"మరో ప్రక్క ద్వారాల దగ్గర బాణ యంత్రాలున్నాయి. లంకా పట్టణం చుట్టూ బంగారు ప్రహరీ ఉంది. అది రత్నాలతోనూ, ముత్యాలతోనూ, మంచి మంచి రంగు రాళ్ళతోనూ నిర్మించారు.

"దాన్ని ఎక్కుట అసాధ్యం... నునుపుగా ఉంది. జారుతూ ఉంది. దాని క్రింద అగడ్త ఉంది. ఆ నీళ్ళలో మహా క్రూరమైన నీటి జంతువులు ఉన్నాయి.

"లంకలో ఎప్పుడూ చతురంగ సేనలు సిద్ధంగా ఉంటాయి. త్రికూట పర్వతం చాలా నునుపుగా ఉంది. దాని మీదున్న లంకా పట్టణానికి వెళ్ళుటకు దేవతలకి కూడా సాధ్యంకాదు.

"ఓడల ద్వారా వెళ్ళే ప్రదేశముకాదు. అశ్వాలూ, ఏనుగులూ వెళ్ళే గిరి దుర్గము కాదు. మహాభయంకర ములుకులు గల ఆయుధాలతో వెళ్ళి ఛేదించుటకు కృత్రిమ దుర్గం కాదు.

"తూర్పు ద్వారంలో లక్షల మంది రాక్షసులు పొడవైన కత్తులతో ఉన్నారు. అట్లే దక్షిణ ద్వారంలోనూ, ఉత్తర ద్వారంలోనూ, లక్షలాది మంది రాక్షసులు విచ్చు కత్తులతో అగుపించారు.

"కానీ శ్రీరామా! నేను అగడ్తలనూ, ప్రహరీని నాశనం చేశాను. వంతెనలు విరగ కొట్టాను. అనేక రాక్షసులను తుత్తు తుత్తు చేశాను. మనం సముద్రాన్ని దాటుదాం.

"మదించిన ఏనుగులతోనూ, అనేక రథములతోనూ ఉన్న లంకలో రాక్షస గణములు కడు ప్రభు భక్తి కలవారు. లంకానగరము ధనముతోనూ, శక్తులతోనూ అతివిశాల మైన పర్వతం మీదున్నది. లంకావాసులు ఎప్పుడూ సంతోషానందములలో సుఖిస్తుంటారు.

"అంగదుడూ, మైందుడూ, ద్వివిదుడూ, జాంబవంతుడూ, అనలుడూ పనసుడూ, నీలుడూ వీరు చాలు. శ్రీరామా! లంకా నగరాన్ని విచ్ఛిన్నం చేసి

సర్వం నాశనం చేసి రాగలరు. ఆజ్ఞాపించు రామా..... మహాముహూర్తం నిర్ణయించు...." చెప్పాడు వాయుపుత్రుడు.

## యుద్ధానికి సిద్ధం

తేజస్సు, సత్యపరాక్రమం గల శ్రీరాముడు చెప్పాడు.

"సుగ్రీవా! మనం బైలుదేరవలెను. ఇది విజయమను ముహూర్తం. నాది పునర్వసూ నక్షత్రం. ఈ రోజు ఉత్తర ఫల్గుణీ నక్షత్రము. రేపు హస్తానక్షత్రం. కాన మనమంతా ఇప్పుడే బైలుదేరవలెను. శుభ శకునాలు కాన వస్తున్నాయి.

"సుగ్రీవా! సారము లేని సైన్యాన్ని కిష్కింధలో ఉంచు. నీలుడను లక్షమంది సైన్యంతో ముందుగా సముద్ర తీరం చేరమను.

"సుగ్రీవా! నా నేత్ర పైభాగము అదురుతున్నది. విజయానికి సూచిక. సకల సైన్యముతో నేడే బైలు దేరవలెను.

"నీలుడా! నీవు సుగ్రీవాజ్ఞ ప్రకారం ఫలాలూ, దుంపలూ, కాయలూ సమృద్ధిగా దొరికే ప్రాంతం గుండా ముందు నీ సేనతో తరలి వెళ్ళు. రాక్షసులు కడు మోసకారులు. మీరు వెళ్ళే దారిలో పండ్లూ, ఫలాలను విషపూరితం చేస్తారు.

"ఏమరుపాటుగా ఉండు. పల్లపు ప్రదేశాల్లోనూ, కిక్కిరిసిన వన దుర్గాల్లోనూ జాగ్రత్తగా ఉండు. ఎటూ దారి లేని ప్రాంతాలలోకి వెళ్ళవద్దు. శత్రువులు నలువైపులా కమ్మే అవకాశం ఇవ్వరాదు.

"మీ వెనుకగా మహాసముద్రమంత వానరసేన కదలుతుంది. మహా ఆంబోతు వంటి గజుడూ, బహాబలుడైన గవయుడూ, గవాక్షుడు ముందు నడవాలి. ఋషభుడు కుడి వైపు, గంధమాదనుడు ఎడమ వైపు ఉండి సైన్యాన్ని వెయ్యి కళ్ళతో చూసుకుంటూ ఉండాలి.

"అమరావతినేలే దేవేంద్రుడి ఐరావతం వంటి హనుమంతుడి మీద నేను వస్తాను. యక్షుల ప్రభువైన కుబేరుడి మహాదిగ్గజమైన సార్వభౌమం వంటి, ఏనుగుల్లో కెల్లా దిగ్గజంవంటి అంగదునిపై లక్ష్మణుడు వస్తాడు."

శ్రీరాముడు చెప్పగానే సుగ్రీవుడు ఆజ్ఞాపించాడు. రాముడి మాటా, సుగ్రీవుడి ఆజ్ఞా అయింది.

కొండల మీద, శిఖరాల మీద, గుహల్లోనూ ఉన్న వానరులంతా గదలు పైకెత్తి జేజేలు పలికారు. గెంతులు వేశారు. సింహనాదాలు చేశారు.





ఆపై సుగ్రీవుడూ, లక్ష్మణుడూ ధర్మాత్ముడైన శ్రీరాముడ్ని పూజించారు. దక్షిణ దిక్కుగా ప్రయాణమయ్యారు.

కిష్కింధరాజు సుగ్రీవుడూ, రాముడూ, లక్ష్మణుడూ సేనల మధ్య ఠీవిగా నడిచారు. జాంబవంతుడు తన సేనతో సుగ్రీవుని వెనుభాగమంతా పరిరక్షిస్తున్నాడు.

వానరసేనా నాయకుడు నీలుడు ముందు భాగంలో ఉన్నాడు. వానర సైన్యం కదలికలకు భూమి మీదున్న దుమ్ము లేచింది. ఆకాశం కనపడకుండా పోయింది. కొంత మంది వానరులు నడుస్తున్నారు. మరికొందరు ఎగురుతున్నారు. ఇంకొందరు ఆ చెట్టు మీద నుంచి ముందు చెట్టు మీదకు గెంతుతూ వస్తున్నారు.

హనుమంతుడూ, అంగదుడూ శ్రీరామలక్ష్మణులను మోసుకుపోతుంటే రాహుకేతువులు సూర్య చంద్రులను సగం మింగినట్టుగా కానవచ్చారు.

పెద్ద పెద్ద చెట్లను విరుచుకుంటూ, ఫలవృక్షాలొచ్చినప్పుడు కడుపు నిండా తిని సెలయేళ్ళలో నీరు త్రాగి ఉత్సాహంగా, తోకలను తిప్పుతూ, నేలకేసి కొడుతూ వానరులంతా ముందుకు సాగారు.

పర్వతాలూ, నదులూ, సెలయేళ్ళు దాటుతున్నప్పుడు ఆ మహా కార్యసిద్ధికి వెళుతున్న వానరులపై పూల చెట్లు పూలు కురిపించాయి. దూరం నుంచి పండ్ల చెట్లు చూసి చకచకా ఫలాలు కాశాయి. చెట్టుకు పట్టిన తేనె తుట్టికి పట్టిన తేనెటీగలు వానరులు వెతుక్కోకుండా శబ్దాలు చేసి చూపించాయి.

తేనెలు జుర్రుకుంటూ, లతలను తెంపి వేస్తూ, సెలయేళ్ళలో గెంతులేస్తూ... అడవిలోని మొల్ల చెట్లూ, గానుగు చెట్లూ, ఇప్పచెట్లూ, నీలాశోక చెట్లూ, ఉలిమిరి చెట్లూ, ఊడుగు చెట్లూ లాంటి అనేక చెట్లను కదిలిస్తూ, ఊపుతూ... అశోక, కరంజప్లక్ష, న్యగోధ, జంబుక, ఆమలక వృక్షములు సేవిస్తూ సాగి మహేంద్ర పర్వతానికి చేరారు.

పదికోట్ల వానరులతో కూడిన సైన్యాన్ని శతబలి ఒక్కడే నియంత్రిస్తున్నాడు. నూరుకోట్ల వానరులు గల కేసరీ, మహా బలవంతుడు పనసుడూ, మధగజ బలుడు గజుడూ, తమ తమ సేనలకి సూచనలిస్తూ నడిపిస్తున్నారు. వలీముఖుడు, ప్రజంఘుడు, జంభుడు, రభసుడు నలువైపులా తిరుగుతూ వానరులకు ఉత్సాహాన్నిస్తున్నారు.

మహాసముద్రం కెరటాలతో భయంకర ధ్వనితో బండరాళ్ళను కొడుతోంది.

శ్రీరాముడు లక్ష్మణుడు, సుగ్రీవునితో కలిసి పర్వతం దిగాడు. సముద్రం వద్దకు వెళ్ళాడు.

"నదులన్నింటికి భర్త సముద్రుడు. సమస్త సైన్యాన్ని సముద్రం దాటించు కార్యము చేయవలెను. అంతవరకూ సైన్యమంతా సముద్రతీరానే ఉండాలి. చుట్టు ప్రక్కల శత్రువులు కాపుకాసి దాడి చేయవచ్చు. సేనా నాయకులు అప్రమత్తులై ఉండాలి" చెప్పాడు శ్రీరాముడు.

వాయువేగానికి అలలు ఒక దానితో ఒకటి కొట్టుకుంటున్నాయి. లంకపై శ్రీరాముడు మ్రోగించిన యుద్ధభేరీల్లా మారుమ్రోగుతున్నాయి. అవతల గట్టు ఎక్కడుందో కానరాని సముద్రం వంకే చూశాడు శ్రీరాముడు.

## సముద్ర ఘోష

ఒక ప్రక్క మహాసముద్రం. మరోప్రక్క వానరసేనా సముద్రం నీవా, నేనా అన్నట్టు ఉన్నాయి. చంద్రోదయం అయింది. మీద కొస్తున్న ప్రతి కెరటంలోను చంద్రుడు కానవస్తున్నాడు.

శ్రీరామునకు సీత తలంపుకొచ్చింది.

"లక్ష్మణా! మీ వదిన సీత లంకలో ఎలా ఉందో! నా కోసం వెయ్యి కళ్ళతో వెతుకుతూ ఉంటుంది. సముద్ర దిక్కు వైపే చూస్తూ ఉండి ఉంటుంది. ఈ వాయుదేవునికి నా మీద జాలి లేనట్టుంది. తనతోపాటు లంకకి తీసుకెళ్ళి సీత ముందు వదిలెయ్యవచ్చు కదా!

"లక్ష్మణా! సీతను ఎప్పుడు చూస్తానో... రావణుడని చంపి తామర కళ్ళు గల సీతను... వైదేహిని... జనకరాజ పుత్రిని ఎప్పుడు చూస్తానో... మాసినబట్ట వదిలేసినట్టు సీతా వియోగం ఎప్పుడు వదిలేస్తానో...

"లక్ష్మణా! నన్ను వదిలేయ్. సముద్రంలో నిదురిస్తాను. అప్పుడైనా నా వ్యధ చల్లారుతుందేమో... సీత లంకలో ఉంది. ఆ మాటే నన్ను బ్రతికిస్తోంది. నీరు బాగా ఉన్న పొలము ప్రక్క పొలము నీరు లేకున్నా పైరు పండుతుంది. అట్లే నేను..." అని కణతలు నొక్కుకున్నాడు. తనలో తాను అనుకున్నాడు.

"దొండపండు వంటి పెదాలు సీతవి. ఆ సుశ్రోణి సీతనెప్పుడు చూస్తానో, సర్వసుగుణ అవయవ సంపన్నమైన సీత పెదవుల అధరామృతాన్ని ఎప్పుడు





ఆస్వాదిస్తానో... తాటి పండ్లు వంటి స్తనాల గల సీత తానూ వాటిలా వణకుతూ నన్ను ఎప్పుడు కౌగిలించుకుంటుందో...

"జనకరాజపుత్రి, దశరథమహారాజు కోడలు, దేవకన్య, లక్ష్మీదేవి ఎప్పుడు నన్ను చేరి ఆనందభాష్పాలు రాలుస్తుందో..."

శ్రీరాముడు క్షోభపడ్డాడు. అది చూసి లక్ష్మణుడు శ్రీరాముడను ఓదార్చాడు.

"అన్నా! రామన్నా! అనతి కాలంలోనే సీత నిన్ను చేరుతుంది. రావణుడి వక్షస్థలమంతా నీ బాణ ధాటికి ఛిద్రం అవ్వక తప్పదు. అది జరగబోవు వాస్తవమని భూమి మీదా, ఆకాశం మీదా ఎన్నో శుభ శకునాలు కానవస్తున్నాయి. మన ఇక్ష్వాకువంశ నక్షత్రం విశాఖ చూడు ఎంత ధగధగ మెరుస్తున్నదో, సప్తర్షులు ధ్రువునకు ప్రదక్షిణం కూడా కావిస్తున్నారు.

"రాక్షసుల నక్షత్రాలు కాంతి హీనంగా కానవస్తున్నాయి. ధూమకేతువు నిప్పులూ, పొగలూ రాలుస్తున్నది. కాన రామా! రాక్షస వినాశనం తప్పదు. మహావీరులూ, శూరులూ, సమస్త వానరసేనా దేవాసుర యుద్ధానికి బైలుదేరిన దేవతల సైన్యంలా ఉంది" చెప్పాడు లక్ష్మణుడు.

చంద్రోదయం వల్ల పొంగుతున్న మహాసముద్రాన్నీ, అంతం కానరాని సముద్రాన్ని అందుకుంటున్న ఆకాశాన్నీ చూశాడు శ్రీరాముడు.

## రావణుని మంత్రాంగము

రావణుడు మండే నిప్పు కణికలా ఉన్నాడు. అభేద్యమైన లంకాపురిని ఓ వానరుడు చిన్నా భిన్నం చేయటమా.... వనాలూ, ఉద్యానవనాలూ పాడు చెయ్యటమా, లంకను తగలబెట్టుటయా... రావణుడు ఒకింత సిగ్గు పడ్డాడు. వెనువెంటనే క్రోధంతో మండిపోయాడు.

"మంత్రులారా! రాక్షస వీరాధివీరులారా! ఎవ్వరికీ సాధ్యం కాని లంకాపురిలోకి ఓ కోతి వచ్చింది. వైదేహిని చూసి, మాట్లాడి, సర్వమూ కల్లోలము చేసింది. ఇక ఉపేక్షించరాదు. చిన్న కోతి కదా అని జాలి తలిస్తే వనమంతా చెరిచింది. కోతి బుద్ధి చూపించింది.

"రాక్షస వీరులారా! బాగుగా ఆలోచించండి. మంత్రాంగము వల్లనే విజయం సిద్ధిస్తుంది. లంక మేలూ, రాక్షసుల మేలూ కోరే మీరంతా ఆలోచన చెయ్యండి. శ్రీరాముడు వీరుడు, శూరుడు. సముద్రాన్ని తోడేసైనా సరే లంకను

సమీపిస్తాడు. భూమి మీద వానరులతో కలిసి రాముడూ, లక్ష్మణుడూ ధనుస్సులు చేతబూని లంకకి రావుట తథ్యం. చెయ్యవలిసిన వ్యూహం ఏమిటో నిర్ణయించండి.

"ముఖ్యులతోనూ, ఉత్తములతోనూ, మేలుచేసేవారితోనూ, రాజ్యాంగ భాగస్వాములతోనూ ఆలోచన చేసినవాడు ఉత్తమరాజు అవుతాడు. ఒంటరి ఆలోచనతోనూ, ఒంటరి పనులతోనూ కార్యాన్ని తలపెట్టిన వాడు మధ్యముడు అవుతాడు. ఎవరికివారూ వేరు వేరు అభిప్రాయాలతో మాట్లాడి ఐక్యమత్యం పాటించరో అట్టి వాడి కార్యం అధమము.

"లంకకూ, రాక్షసులకూ కీడు లేకుండా శత్రు నాశనం చేసే హితకరమైన ఆలోచన చేయండి" చెప్పాడు రావణుడు.

మహాబలశాలులూ, నీతిధర్మాలు తెలియనివారూ, బుద్ధిహీనులూ అయిన రావణ మంత్రులు ఆసాంతమూ విని తాపీగా చెప్పారు.

"రాజా! నీవు సర్వలోకాలకీ వీరుడవు. నీ ముందు నిలవగలవారు ఎవ్వరూ లేరు. పరమశివుడు మెప్పు పొందావు. వరాలు సాధించావు. కైలాస శిఖరాన్నే ఎత్తి పట్టావు.

"యక్షులతో, కిన్నెరలతో ఉన్న కుబేరుడి మీదకే యుద్ధానికి వెళ్ళి సునాయాసంగా ఆక్రమించుకున్నావు. మహా శివుడి మిత్రుడని విశ్రవిగే నీ సవతి కొడుకు కుబేరుడి పుష్పక విమానం తీసుకొని వెళ్ళగొట్టావు. భోగవతి పట్టణాన్ని జయించి నాగుల కోరలు పీకావు. మయుడ్ని భయకంపితుడని చేశావు.

"రసాతలంలోని నాగుల్నీ, తక్షకునీ, శంఖునీ, జట్టినీ నాలుగు చెరువుల నీళ్ళు త్రాగించావు. వీరులైన కాలకేయులతో సంవత్సరం ఏకాఏకిన పోరాడావు. దేవేంద్రుడ్ని దాసుడని చేసుకున్నావు. యముడ్నీ, యమలోకాన్నీ ముట్టడించావు. వరుణ పుత్రులను యుద్ధంలో చెల్లాచెదురు చేశావు.

"రాజా! వీరత్వమంటేనే నీవు. బలమున్నవాడు ఏ లోకంలో ఉన్నా వెతికి ఏరిపారేశావు.

"కాన రావణా నీ ముందు రాముడెంత? వానరసేనెంత? ఒక్క ఇంద్రజిత్తు చాలు. ప్రభూ సమస్త వానర సైన్యాన్నీ సమూలంగా పరిసమాప్తి చెయ్యటకు..." రాజప్రియం కోసం చెప్పారు భజనపరులూ, సుఖపరులూ అయిన మంత్రులు.





## రాక్షస సేనాధిపతి ప్రహస్తుడు

మితిమీరిన అహంతోనూ, బుద్ధి మాంద్యంతోనూ చెప్పిన ఆ మాటలు ప్రియంగా తోచాయి రావణుడనకు. నల్లని మేఘం వంటి రాక్షస సేనాధిపతి ప్రహస్తుడు వినయంగా చెప్పాడు.

"మహారాజా! నిన్ను యక్షులూ, కిన్నెరలూ, కింపురుషులూ, నాగులూ, గంధర్వులూ, సర్పములూ, పిశాచములూ, పక్షులూ ఎవ్వరూ ఏమీ చెయ్యలేక శరణు వేడారు. వానరులెంత? కోతులెంత? ఇద్దరు మానవులెంత? లంకా పట్టణంలో అమంగళం జరగదన్న ధీమాతో అదమరచి ఉన్నారు రాక్షసులు. అందులకే లంకను ఆ కోతి తగల బెట్టగలిగాడు. ఆగడాలు చెయ్యగలిగాడు. నేనూ ఆ సమయాన లేను.

"లంకాధిపతి రావణా! ఆజ్ఞాపించు. కొండలూ, కోనలూ, గుహలూ, పర్వతాలు శోధించి వానరుడనేవాడు లేకుండా గొంతు పిసికి చంపుతాను. భోగాలలోనూ, సుఖాలలోనూ మునిగి ఉన్న మన రాక్షస వీరులను ఏమార్చినందుకు తగిన శిక్ష విధిస్తాను."

దుర్ముఖుడు తోకత్రొక్కిన పాములా లేచాడు.

"ప్రభూ! హనుమ లంకలో చేసిన దానికి ప్రతీకారం చేయవలెను. తమ ఆజ్ఞ అయితే వెనువెంటనే పోతాను. వానరసేనకి నా వీర ప్రతాపాలు చూపిస్తాను. ఆకాశంలో ఎగిరినా, పాతాళంలోకి వెళ్ళినా, పర్వత శిఖరాలు ఎక్కినా వదలను."

వజ్రదంష్ట్రుడు లేచాడు. నిప్పులవలె మాటలు కురిపించాడు. పరిఘా యుధాన్ని చూపించాడు.

"రాజా! ఆ కోతి పనేమిటి. రాజును చంపితే వానరులంతా దిక్కులేని వారవుతారు. రక్త, మాంసాలు పూనిన ఈ పరిఘాయుధంతో శ్రీరాముడ్నీ, లక్ష్మణుడ్నీ, సుగ్రీవుడ్నీ ఒక్కదెబ్బకి కైలాసానికి పంపుతాను.

"రాజా! నీ ఇష్టమైతే ఇంకొటి విన్న విస్తాను. మన రాక్షసవీరులు కామరూపులు. మునివేషాలు ధరించి శ్రీరాముడి వద్దకు వెళ్ళి భరతునికి అపాయమని చెబుదాము.

"రాముడూ, లక్ష్మణుడూ అయోధ్య వెళతారు. వారొచ్చేలోగా వానర సైన్యాన్ని నమిలి మింగేద్దాం. రాక్షసులంతా ఆకాశ మార్గాన గుంపులు గుంపులుగా వెళ్ళి ఆయుధాలతో వానరులను సంహరిద్దాము."

కుంభకర్ణుడి పుత్రుడు నికుంభుడు లోకములన్నింటిని చికాకు పెట్టిన రావణుడితో క్రోధంతో చెప్పాడు.

"లోకవీరా! మీరూ, వీరూ స్థిమితంగా లంకలోనే ఉండండి. ఏ యుద్ధ ఉపాయం లేకుండా ఒక్కడినే వెళ్ళి నా శౌర్యంతో రామలక్ష్మణులనూ, సుగ్రీవ, హనుమ, అంగదులనూ మట్టి కరిపిస్తాను."

వజ్రహనుడు తానేమీ తక్కువ కాదన్నట్టు చెప్పాడు.

"నేనే వెళతాను. మీరంతా హాయిగా మద్యం త్రాగుతూ, భోగాలను అనుభవిస్తూ ఉండండి. సమస్త వానరులనూ, నాయకులనూ చంపి శత్రు సంహారం సంపూర్ణంగా చేసి మీ దర్శనం చేసుకుంటాను."

రాక్షసులంతా పరిపరి విధాలుగా ప్రతిజ్ఞలు చేస్తూ గుదియలూ, పట్టిసాలూ, ఈటెలూ, గండ్రగొడ్డళ్ళూ, ధనుస్సులూ, బాణాలూ పట్టుకొని వూగిపోయారు.

## విభీషణుని ధర్మనిర్ణయం

నికుంభుడూ, రభసుడూ, సుప్తఘ్నుడూ, మహాపార్శ్వుడూ, మహోదరుడూ, రశ్మికేతువూ, దుర్ధర్షుడూ, రావణ పుత్రులు ఇంద్రజిత్తూ, ప్రహస్తుడూ, విరూపాక్షుడూ, మహా బలశాలులు వజ్రదంష్ట్రుడూ, ధూమ్రాక్షుడూ, నికుంభుడూ దుర్ముఖుడూ వీరంతా నీటి రంగు గల గండ్రగొడ్డళ్ళూ, పరిఘలూ, ప్రాసములూ అనేక భయంకర ఆయుధాలను ధరించారు. వారంతా రావణుడితో చెప్పారు.

"లంకను కాల్చిన హనుమను వెనువెంటనే సంహరించవలెను" ముక్త కంఠంతో అరిచారు.

రావణుని సోదరుడూ, ధర్మశాస్త్రపారంగతుడూ అయిన విభీషణుడు అందరికీ అంజలి ఘటించి ఆపి కూర్చోమన్నాడు.

"దానవేంద్రా! సామ, దాన, దండోపాయాలన్నారు. తొలి రెండు ఫలించనప్పుడే దండోపాయానికి వెళ్ళాలి. శత్రువుని తక్కువ చేసి ఆలోచన చెయ్యటము యుద్ధనీతి కాదు. శత్రువు బలమూ, బలగమూ, తెలుసుకోకుండా వెళ్ళుట వల్ల మనకే నష్టం.

"ఒక వానరుడు సముద్రాన్ని దాటి లంకలోకి ప్రవేశించాడు. యథేచ్ఛగా విహరించాడు. చెయ్యవలిసినదంతా చేసి చేరాల్చిన చోటకి చేరాడు. ఒక్క వానరుడే ఇంత దుష్కరమైనది చేసి సముద్రాన్ని దాటి వెళ్ళాడంటే, ఆలోచించండి. శత్రువుని తక్కువ అంచనా వెయ్యరాదు.





"శ్రీరాముడు మహావీరుడు. బలవంతుడు. ఖరుణ్నీ, దూషణుడ్నీ, రాక్షస సేననూ సంహరించుట మరువరాదు. జనస్థానం నుంచి తమరు లోకపావని వంటి సీతను తీసుకు వచ్చారు. అదియే ఈ అనర్థాలకు కారణం. పరాయివాడి భార్యని తీసుకురావుట ధర్మం కాదు. ధర్మశాస్త్ర కోవిదుడవై నీకు తెలియనిది కాదు.

"కాన అన్నా! స్త్రీ వల్లే ధనమూ, కీర్తీ వస్తాయి. అట్టి స్త్రీవల్లే కూడా సర్వమూ తుడుచుకు పెట్టుకుపోతాయి. శ్రీరాముడు ధర్మం కలవాడు. దివ్యాస్త్ర సంపన్నుడు. వాలిని ఒక్క బాణంతో చంపిన వాడు. కాన అన్నా! వద్దు. శ్రీరాముడితో వైరం వద్దు. సీతమ్మ తల్లిని సగౌరవముగా శ్రీరామచంద్రునికి సమర్పిద్దాము.

"రాజా! సమస్త ధన కనక వస్తు వాహనాలతో, దేవతలకి కూడా లభ్యంకాని అమర సుఖాలతో ఉన్న లంకా నగరాన్ని కాపాడు. మన రాక్షస స్త్రీల మాంగళ్యాలు నీ చేతిలో ఉన్నాయి. ఒక్క స్త్రీ కోసం ఇంత మంది స్త్రీల వైధవ్యాన్ని చూచుట తగదు.

"రాజా! నేను నీకు ఆప్తుడను. సోదరుడను. నా వినతి మన్నించు. శ్రీరాముడి బాణాలు సూర్యకిరణాలు. అహాన్ని వీడు. అది కీర్తినీ, ధనాన్నీ, అయినవార్నీ దూరం చేస్తుంది.

"అన్నా! సుఖాలనూ, ధర్మాలనూ నశింప చేసే కోపాన్ని విడనాడు. ఆనందాన్నీ, కీర్తిని, ఇచ్చేది... వృద్ధి చేసేది... అయిన ధర్మాన్ని ఆచరించు. మనమంతా పుత్రులతోనూ, భార్యలతోనూ, బంధువులతోనూ కలిసి ఉండుటకు శ్రీ రాముని ప్రియ భార్య సీతాదేవిని స్వయంగా తీసుకెళ్ళి అప్పగిద్దాం. లేదంటే లంకాపురమూ, రాక్షసులందరూ నశింపక తప్పదు. నేను నీకు సోదరుడను, మంత్రిని, బంధువును. బ్రతిమిలాడుతున్నాను. నా హిత, సత్య వాక్యములు మన్నించుము. సీతను రామునికి అప్పగిద్దాము" చెప్పాడు విభీషణుడు.

రావణుడు మాట్లాడలేదు. తన పెద్ద కనులను మరింత పెద్దవి చేసి ఆ నాటికి సభ చాలించాడు.

## హితబోధ

రాత్రి గడిచింది. తెల్లారింది. విభీషణుడు పర్వత సముదాయము వలే, పర్వత శిఖరము వలే ఉండే రావణ గృహానికెళ్ళి దర్శనం చేసుకున్నాడు.

కోపాన్నీ, అహాన్నీ, మైథిలీనీ వదిలేసి రావణుడు కీర్తినీ, సుఖాన్నీ పొందుతాడని ఆశించాడు. రావణుడు అధర్మాన్ని వీడి, ధర్మమార్గంలో నిర్ణయం తీసుకుంటాడని భావించాడు విభీషణుడు.

లంకాధిపతి రావణుడి గృహంలోకి వచ్చాడు విభీషణుడు. రావణుడి మంత్రులూ, ఆప్తులూ, సచివులూ, వేదవేదాంగాలు చదివినవారూ, బంధువులూ, మిత్రులూ అంతా ఉన్నారు.

లంకేశ్వరుడి విజయం కోసం మంత్ర ధ్వనులు వినవస్తున్నాయి. లోకోత్తరమైన ఆభరణాలు ధరించి, బంగారు భవనంలో, రత్న సమూహాల మండపాలతో మహాకక్షలు గల భవనంలో దేవేంద్రుడి సింహాసనం కూడా దిగదుడుపే అయిన వజ్ర, వైఢూర్య, మరకత మణులతో నిర్మించిన సింహాసనం పై లంకాధిపతి రావణుడు ఠీవిగా కూర్చున్నాడు. మహా తేజస్సుతో వెలిగి పోతున్నాడు. అక్షితలూ, పూలతో వేదవేత్తలు విజయంకై ఆశీర్వదిస్తున్నారు.

సభ మర్యాద ప్రకారం విభీషణుడు సామ్రాట్టుకు వినయంగా నమస్కరించాడు. రావణుడు కను సైగతోనే కూర్చోమన్నాడు. మంత్రవేత్తల మంగళకరమైన స్తోత్రాలూ, పుణ్యాహ మంత్రాలు పూర్తి అయ్యాయి.

విభీషణుడు హితమైన పలుకులు మళ్ళీ చెప్పటానికి లేచాడు. రావణుడి శక్తులనూ, వీరత్వానీ, లంకా పట్టణ వైభవాన్ని వివరించాడు. హితమైన విషయాలతో రావణుడ్ని సంతృప్తి పరిచాడు.

దేశకాల స్థితులూ, ఆచార మర్యాదలూ సంపూర్ణంగా ఎరిగిన విభీషణుడు "దశకంఠా! మహారాజా! నే చెప్పునది సావధానంగా విను. మైథిలిని దండకారణ్యం నుంచి తెచ్చింది మొదలు లంకా పట్టణమంతా అశుభాలే గోచరిస్తున్నాయి.

"అగ్నిహోత్ర గృహాల్లోనూ, ఇండ్లలోనూ సర్పాలు కాన వస్తున్నాయి. హవిస్సుకు చలి చీమలు పడుతున్నాయి. మన అశ్వశాలలోని గుర్రాలూ, ఏనుగులూ ఉట్టినే సకిలిస్తున్నాయి. ఘీంకారాలు పెడుతున్నాయి. లంకా పట్టణానికి దగ్గరిగా వచ్చి నక్కలు అరిచి పరుగు లంకించుకుంటున్నాయి.

"రాక్షస స్త్రీల మాంగళ్యాలు సాగుతున్నాయి. గుంపులు గుంపులుగా కాకులు మన భవనాలపై వాలి అరుస్తున్నాయి. గెద్దలు లంకా గగన వీధుల్లో తిరుగుతున్నాయి.





"ఈ దుర్నిమిత్తాలన్నీ సీతాదేవిని చెరపట్టి తెచ్చినప్పట్నించే. లంకలోని హితులనూ, సన్నిహితులనూ విచారించు. మంత్రులూ, అంతఃపుర స్త్రీలూ ఎరుగుదురు. భయం కారణంతోనూ, నీ అపార శక్తుల వల్లనూ జంకక, చెప్పక గంభీరంగా ఉంటున్నారు.

"అన్నా! నీ తమ్ముడిని, లంకాపురి హితుడను. హితమైన వచనాలెప్పుడూ మనసుకు కఠినంగానే తోస్తాయి. సర్వస్వతంత్ర సార్వభౌముడవు. రాక్షస క్షేమం కోసం నీవే నిర్ణయించు."

రాక్షసశ్రేష్ఠుడు రావణుడు విభీషణుడి హిత వాక్యాలు విన్నాడు. భూత, భవిష్యత్యాధికాలానికి తగిన మాటలు చెప్పినందుకు కోపించాడు.

"విభీషణా! నా వీరత్వమూ, శక్తులూ, తెలిసే మాట్లాడుతున్నావా? శ్రీరాముడు ఇంద్రాది దేవతలతో కలిసివచ్చినా సీతను తీసుకెళ్ళటమన్నది జరగని పని. ముల్లోకాలనూ, పంచభూతాలనూ, భూమిక్రిందా, భూమి పైనా ఉన్న సమస్త లోకాలనూ ఆజ్ఞాపించే ఈ లంకేశ్వరుడి ముందు ఆ శ్రీరాముడెంత? కోతులెంత? ఇక నీవు మాట్లాడరాదు. మహాసభలోనే నా నిర్ణయం" చెప్పాడు రావణుడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

రావణుడు మహా కొలువుకి బైలుదేరాడు. మంత్రులతోనూ, సేనా నాయకులతోనూ ఆలోచించుటకై కామమోహితుడై సిద్ధమయ్యాడు. తన బంగారు రథానికి నమస్కరించి ఎక్కాడు. దండనాయకులూ, సేనానీ, సైన్యమూ వెంట నడిచింది. రాక్షస యోధులు గుర్రాల మీదా, మదపు టేనుగుల మీదా రావణుడిని అనుసరించారు. జయ జయ ధ్వనులు చేశారు.

సమస్త సంపన్నమైన లంకానగరపు మహావీధిలో రావణుడి రథం కదిలింది. సభా ప్రాంగణం చేరింది. మంగళకరమైన వాద్య ధ్వనులు మ్రోగాయి. రావణుడు తన బ్రహ్మాండమైన సభా స్థలానికి పోయాడు. కాంతిలీనే నవరత్న ఖచిత బంగారు సింహాసనముపై ఆశీనుడయ్యాడు.

దూతలచే కబురందిన రాక్షస వీరులంతా వచ్చారు. మహాసింహాలన్నీ గిరి దుర్గంలో చేరినట్టు చేరారు. రావణుడికి నమస్కరించారు. ఎవరి స్థాయికి తగ్గట్టు వారు కాంచనాసనాల మీదా, దర్భాసనాల మీదా, నేల మీదా ఆశీనులయ్యారు.

సభంతా బంగారు మయం. కాంతి మయం. చందన, అగరు సువాసనల మయం. గుణవంతులూ, పండితులూ, సేనానాయకులూ, మిత్రులూ, హితులూ అందరినీ చూశాడు రావణుడు. ప్రహస్తుడితో భద్రతా ఏర్పాట్లు గూర్చి చెప్పాడు.

లంకాసేనాని ప్రహస్తుడు రావణుడి ఆజ్ఞ ప్రకారం సభా మంటపం చుట్టూ చతురంగ సేనలని కావలి ఉంచాడు.

"సభా సదులారా! మీతో మంత్రాగం చేయుటకై ఈ సభను ఏర్పాటు చేశాను. మీరంతా పండితులు. వీరులు. శూరులు. రాజు కోసం, లంకానగరం కోసం ఏం చెయ్యమన్నా చెయ్యుటకు వెనుకాడని ధీరులు. మంచీ, చెడూ, హితమూ, అహితమూ, లాభమూ, నష్టమూ, ప్రియమూ, అప్రియమూ, సుఖమూ, దుఃఖమూ చెప్పగలరు. అందులకే ఏ కార్యమైనా మీతో చర్చించి ఆపై ఆరంభించాను. అన్నీ సఫలమూ, విజయమూ పొందాయి.

"హితులారా! మిథిలా రాజు జనకమహారాజు పుత్రిక, శ్రీరాముడి ధర్మపత్నిని నేను చెరపట్టి తెచ్చాను. ఆమె అసమాన సౌందర్యవతి. మయుడు సృష్టించిన అపరంజి బొమ్మ. చూచుటకు రెండు కనులు చాలవు. కందరీగలాంటి నడుము, విశాల జఘనం, నేలపై బహుచక్కగా ఆనుపాదములు. నెయ్యి పోస్తే భగ్గుమనే అగ్నిలా, సూర్యకాంతిలా ఉంటుంది సీత. బంగారు ప్రతిమ సీత, నా కోరిక మన్నించ లేదు.

"సంవత్సరం గడువిచ్చాను. ఎంతో ఓపిక పట్టాను. ఎంతో భయంకరమైన మహా సముద్రాన్ని దాటి ఎవరొస్తారులే అనుకున్నాను. నా  ఆధీనంలో ఉన్న ఆడది ఎక్కడికి పోతుందిలే అనుకున్నాను.

"ఒక వానరుడొచ్చాడు. చెయ్యవలిసిన కోతి పనులు చేశాడు. వెళ్ళి శ్రీరాముడికి సీత జాడ చెప్పాడు. ఇప్పుడు శ్రీరాముడు సముద్రపు ఒడ్డున అపారమైన వానరసేనతో లంకకొచ్చే మార్గంకై అన్వేషిస్తున్నాడు. సీతని ఇవ్వకుండా శత్రునాశనం చేసే మంత్రాంగము చేయవలెను. చంద్రగ్రహ నక్షత్రములూ, దేవతలూ చుట్టూ ఉన్న మహేంద్రుడివలే మీరంతా చుట్టూ ఉన్న నాకు ఐశ్వర్యమూ, జయం తప్పక కలుగుతుంది" కామపీడితుడైన, మహావిద్యావిశారుదుడైన రావణుడు చెప్పాడు.

ఆరు మాసాల నిద్ర అనంతరము లేచిన కుంభకర్ణుడు నిలబడి రావణుడితో చెప్పాడు.





"అన్నా! రావణా! మందగామిని సీతాదేవిని చెరపట్టినప్పుడు మాతో చర్చించలేదు. ఖర,దూషణులను యుద్ధానికి పంపినప్పుడూ మాకు తెలీదు. ఇప్పుడెందుకు ఈ చర్య. చివరకు ఏదైనా నీ ఇష్టమొచ్చిన రీతిలోనే జరుగుతుంది కదా! ముందుగానే చర్చించి ఉంటే సీతను తేవద్దని చెప్పి ఉండేవాళ్ళము. అంతా అయ్యాక ఇప్పుడెందుకు ఆలోచన, చర్చ.

"అన్నా! అయినదేదో అయినది. నీ తమ్ముడ్ని... నీ వెనుకే నేను. పాడు పాత్రలో నెయ్యి పోస్తే అది పాడవటంతో పాటు తిన్నవాడ్ని చంపుతుంది. ముందు కార్యం వెనుకా, వెనుక కార్యము ముందూ చేసినవాడు ఎంత బలవంతుడైనా ఓటమి పాలవ్వక తప్పదు. కుమారస్వామి చేసిన రంధ్రం కనిపెట్టే కదా క్రౌంచ పర్వత రంధ్రములోంచి పక్షులు అవతలకి వెళ్ళి వస్తున్నాయి.

"అన్నా! రావణా! నీవు నిశ్చింతగా లంకలో ఉండు. ఇంద్రసూర్యులైనా, వరుణకుబేరులైనా, అగ్నివాయువులైనా సరే నా ఇనుప గుదియతో ఇప్పుడే రామలక్ష్మణ, సుగ్రీవుల వద్దకెళ్ళి కడతేర్చి వస్తాను. వానరులను నమిలి చప్పరిస్తాను" చెప్పాడు కుంభకర్ణుడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

కుంభకర్ణుడు చెప్పిన తొలి విషయాలని వదలి, చివర చెప్పిన విషయాలని పరగణలోకి తీసుకున్నాడు రావణుడు. మహాపార్శ్వుడు చెప్పాడు.

"రాజా! మహా క్రూరజంతువులూ, విషసర్పాలూ ఉన్న చోటకెళ్ళి రుచి గల తేనెని తెచ్చి త్రాగకుండా ఉండే వాడ్ని మూర్ఖుడనే అంటారు. శత్రువు గూర్చి ఆలోచన వద్దు. వైదేహితో నీవు సుఖంగా సుఖిస్తావు. వశపరుచుకొని ఆనందించు.

"ఇంద్రుడి వజ్రాయుధానికి కూడా లొంగని కుంభకర్ణుడూ, ఇంద్రజిత్తు, నేనూ ఎంతోమంది ఉన్నాము. దండోపాయంతో వానరులనూ, రామలక్ష్మణ సుగ్రీవులనూ వశపర్చుకొని నీ ముందుకు తెస్తాం" చెప్పాడు.

రావణుడు మహాపార్శ్వుణ్ణి మెచ్చుకున్నాడు.

"పార్శ్వుడా! నీకు బ్రహ్మ శాపం తెలీదు. చెబుతాను విను. అగ్నిశిఖవంటి పుంజికస్థల అనే మహాసౌందర్యవతి ఆకాశ మార్గాన బ్రహ్మలోకానికి బ్రహ్మ దర్శనానికై వెళుతోంది.

"ఆమెని చూసిన నేను మోహం ఆపుకోలేక మీద పడి పూర్తి వివస్త్రని చేసి తనవితీరా అనుభవించాను. తృప్తిపడ్డాను. ఒడిలిపోయిన ఆ పద్మలత, ఆ అప్సరస బ్రహ్మదేవుడికి మొరపెట్టుకుంది. ఆ బ్రహ్మ నన్ను కోపంతో శపించాడు.

"మరింకెప్పుడైనా ఇష్టపడని ఆడదాన్ని బలాత్కారంతో వశం చేసుకోవటానికి ప్రయత్నిస్తే నా తల నూరు వక్కలౌతుందని శాపం ఇచ్చాడు. అందువల్లే విదేహ కన్యను బలాత్కరించుట లేదు. నా శయ్యాగారానికి లాక్కొని రావుటలేదు.

"ఇక రాముడంటావా రానీయ్. సముద్రమంతటి వేగవంతుడను. నా గమనము వాయువుతో సమానం. మహాసర్పాల వంటి నా బాణాలను ఎప్పుడూ చూసి ఉండడు. వెయ్యి నేత్రముల దేవేంద్రుడూ, వరుణుడూ పారిపోయినట్టు పారిపోతాడు. కుబేరుడని ఈ నగారాన్నించి తరిమికొట్టినట్టు శ్రీరాముడనీ లక్ష్మణుడనీ, సుగ్రీవుడనీ, వానర సైన్యాన్నీ దిక్కులు తెలియకుండా పరుగు పెట్టిస్తాను."

## విభీషణుడి చివరి ప్రయత్నము

రావణుడి గర్జనలకు హిత, అర్థాలతో మళ్ళీ చెప్పుటకు విభీషణుడు లేచాడు.

"అన్నా! రావణా! ఆవేశంతో అనర్థం తెచ్చుకోకు. ఈ సమస్త సంపదా, సుఖాలూ, అధికారాన్నీ మమకారం తీరే వరకూ అనుభవించే రాత లేకుండా చేసుకోవద్దు.

"నీవు ఎప్పుడో నీకు నీవుగా దుర్మార్గపు ఆలోచనలతో మహా కాలకూట సర్పమైన సీతను మెడలో వేసుకున్నావు. ఆమె రెండు బాహువుల మధ్య భాగమే పడగ. ఆమె చింతనే విషం. ఐదు వేళ్ళే ఐదు తలలు, చిరునవ్వే కోరలు.

"గోళ్ళూ కోరలతో లంకనూ, రాక్షసులనూ ఆ వానరులు చీల్చక ముందే రఘురామునికి సీతనివ్వు.. శ్రీరాముడి శక్తి తెలుసుకొని మాట్లాడు. శ్రీరాముడి బాణాలు వజ్ర సమానంతో, వాయువేగంతో వక్షస్థలాన్ని చేధించనంత వరకే ఎవ్వరి ప్రగల్భాలైనా... సీతను వదలకున్నా, నీవు దేవేంద్రుడి ఒడిలో ఉన్నా శ్రీరామ బాణం విడవదు" చెప్పాడు విభీషణుడు.





ప్రహస్తుడు లేచాడు. విభీషణుడి వైపు చూసి నవ్వాడు.

"విభీషణా! యుద్ధంలో రావణుడికి దేవదానవుల వల్లా యక్ష, కిన్నెర, నాగుల వల్లా, మరెవరి వల్లా మరణం లేదు..." చెప్పాడు ప్రహస్తుడు.

"కానీ మానవుని వల్ల, కోతి వల్ల ఉందిగా... కాన రావణా! కంకిపక్షి రెక్కలతోనూ, నునుపైన సూదులవంటి కణుపుల గల రామ బాణాల నుంచి సమస్త రాక్షస రాజ్యాన్ని రక్షించు. సీతను అప్పగించు."

హితముకాని మాటలు చెప్పిన ప్రహస్తుడిని కోపంగా చూశాడు. తిరిగి సభనుద్దేశించి చెప్పాడు విభీషణుడు.

"మంత్రులారా! హితులారా! రాజుకెప్పుడూ హితమైన మాటలే చెప్పవలెను. రాజుకి అవి అప్రియమైనా సరే. అప్పుడే రాచ ధర్మాన్ని నిర్వర్తించినట్టు. కామంతోనూ, మోహంతోనూ రాక్షస వినాశనాకి తెచ్చిన పనిని సమర్థించట మంటే మృత్యువు దగ్గరికి అందరమూ వెళ్ళినట్లే...

"అన్నా రావణా! విను. శ్రీరాముని సన్నిధికి వెళ్ళి సగౌర్వంగా సముద్రం దాటించి సీతను అప్పచెబుదాం" చెప్పాడు విభీషణుడు.

రావణుడు ఇంద్రజిత్తు వంక చూశాడు. ఇంద్రజిత్తు లేచి తండ్రికి నమస్కరించాడు. ఆపై విభీషణుడి వైపు తిరిగి-

"చిన్నాన్నా! ఎవరితో ఎవరి గూర్చి మాట్లాడుతున్నావో అర్థమవుతుందా! లంకేశ్వరుడి ప్రతాపాలతో ఓ మానవుడు సాటా... పులస్త్య వంశంలో పుట్టి, రావణుడి తమ్ముడైన నీవా... ఈ మాటలంటున్నది.

"నీవు పిరికి వాడివి. మన రాక్షసకులంలో వీర్యమూ, పరాక్రమమూ, ధైర్యమూ, శౌర్యమూ, బలమూ లేనిది నీ ఒక్కడికే... మనుష్య మాత్రులకి భయపడితే రాక్షస లోకాలకీ, మన పూర్వీకులకీ అవమానం. అపచారం.

"ఇంద్రుడ్ని తీసుకొచ్చి చెరసాలలో వేశాను. ఐరావతాన్ని నిలవరించాను. దేవతలంతా చెట్టు కొకరూ పుట్ట కొకరూ పారిపోయేలా చేశాను. అట్టి నేను ఒక్కడ్ని చాలనా వారందరినీ కడతేర్చుటకు... దేవేంద్ర తుల్యుడను, ఇంద్రజిత్తును నే ఉన్నాను" చెప్పాడు.

"నాయనా! ఇంద్రజిత్తూ, నీవు చిన్నవాడివి. మంచీ, చెడులకు తేడా తెలియని వాడివి. ఆవేశంతోనూ, అహంతోనూ నీ తండ్రిగారికి ఆపదలు కొనితేవద్దు. అనుభవరాహిత్యుడవు. వయసు స్వభావరీత్యా తీక్షణ కలిగి

ఉన్నావు. శ్రీరాముడి బాణాలు యమదండములు వలే లక్షలు, కోట్లు వచ్చి లంకనూ, రాక్షసులనూ తాకుతున్నప్పుడు దిక్కులు తెలియక మృత్యువు దిక్కే కానవస్తుంది" అని తిరిగి విభీషణుడు రావణుడితో చెప్పాడు.

"దశకంఠా! రావణా! నా మాటలు విశ్వసించుము. సమయం మించిపోతుంది. రత్నాలనూ, ధనాన్నీ, వస్త్రాలనూ, సీతనూ శ్రీరాముడికి అర్పించు... శ్రీరాముడ్ని శరణు వేడు..." చెప్పాడు.

రావణుడు విసురుగా చెప్పాడు.

"విభీషణా! అటుల చేసినచో తలకొట్టినట్టే కదా! శత్రువు కాళ్ళు పట్టుకొన్నట్టే కదా!"

"అటుల కానిచో రామబాణం నీ తలను కొట్టును కదా!" చెప్పాడు విభీషణుడు.

"విభీషణా!" రావణుడు సింహాసనము మీద నుంచి లేచి అరిచాడు. దిక్కులు దద్దరిల్లిపోయాయి. సభాప్రాంగణం గజగజ వణికిపోయింది.

"ఛీ" నీవూ ఒక తమ్ముడవేనా! రాజునూ, అన్ననూ, వీరుడనూ నా ముందు ఓ మానవుడిని పొగుడుటయే కాక నన్ను తూలనాడుతావా? ద్రోహీ! ధర్మవచనాలతో, ధర్మం గూర్చి చెప్పిన నీకు, రాజు ముందూ, అన్న ముందూ ఎటుల మాట్లాడవలెనో, ఎటుల ప్రవర్తించవలెనో తెలియదా" అరిచాడు.

ఇంద్రజిత్తు కోపంతో కత్తి దీశాడు. విభీషణుడి మీదకెళ్ళాడు. రావణుడు వారించాడు ఇంద్రజిత్తును.

"విభీషణా! పాములతోనూ, క్రూరమృగాలతోనూ స్నేహం చెయ్యచ్చు. శత్రువు మీద పక్షపాతంతో మాట్లాడే నీ వంటి నీచుడితో సావాసం చెయ్యరాదు. ద్రోహివి నీవు. ద్రోహులెప్పుడూ ద్రోహ బుద్ధే చెబుతారు.

"సమర్ధుడూ, ధనవంతుడూ, శక్తివంతుడూ, కీర్తివంతుడైన దాయాదంటే కన్ను కుడుతుంది. జ్ఞాతి బుద్ధి బైటికొస్తుంది. కడుపులో విషం పెట్టుకొని పైకి తియ్యని మాటలు చెబుతారు. నీవూ అంతే.

"పూర్వం పద్మవనంలో తాళ్ళూ, కర్రలూ, పట్టుకొని వస్తున్న మనుష్యుని చూసి ఏనుగులు ఏమన్నాయో తెలుసా.. మనల్ని పట్టుటకూ, బంధించుటకూ ఉపాయాలు చేప్పేవి మన జ్ఞాతి ఏనుగులే. మానవుల స్వప్రయోజనాలకి బాసట చేస్తున్నది మన జ్ఞాతి ఏనుగులే.





"సర్వభయాలకంటే జ్ఞాతి భయమే మహాఘోరమైనది. ఆవుల దగ్గర సంపద ఉంటుంది. ఇంద్రియాలను నిగ్రహించే శక్తి వేదవేదాంగులను పుక్కిట పట్టిన వారికి ఉంటుంది. చాపల్యం స్త్రీలలో ఉంటుంది. అపకారమంతా జ్ఞాతిలలో నిండి ఉంటుంది.

"విభీషణా! నీవూ అంతే. నా వల్లా, నా రాజ్యం వల్లా సమస్త సుఖాలు అనుభవించావు. మకరందం త్రాగిన తుమ్మెద వలే మరో చోటు చూసుకుంటున్నావు. తామరాకుల మీద నీటి బొట్లు కలవనట్టు...ఎంత గొప్పగా చూసినా నీవంటి దుష్టుడు జ్ఞాతి బుద్ధి చూపిస్తాడు.

"మదపుటేనుగు తొండంతో స్నానం చేసి ఆపై మళ్ళీ బురద పూసు కుంటుంది. నీ వంటి స్నేహితుడూ అంతే. స్నేహం నటిస్తాడు ముందు, తర్వాత జ్ఞాతి బుద్ధి బైటపెట్టుకుంటాడు.

"శరత్కాలంలో మేఘాలు ఉరుముతాయి. కానీ వర్షపు చుక్క కూడా రాల్చదు. నీవూ అంతే. మాటలు మాత్రమే. చేతల వరకూ రావు. ఇన్ని మాటలు అన్యులు అంటే శిరస్సు ఖండించే వాడిని.

"తమ్ముడవు. అందుకే క్షమించి వదిలి పెడుతున్నాను. పో. ద్రోహులకు ఈ లంకలో స్థానం లేదు. నీ దిక్కున్న దగ్గరికి పో" చెప్పాడు రావణుడు.

విభీషణుడు అన్నకి నమస్కరించాడు.

"అన్నా! రావణా! మండుతున్న ఇంటిలో ఉన్నావని చెప్పాను. వినలేదు. ప్రియమైన దాన్ని అప్రియం అనుకుంటున్నావు. ఆయువు చెల్లినవార్నీ, రోగం ముదిరిన వార్నీ రక్షించుట దుర్లభం. నాకు శెలవు" చెప్పాడు విభీషణుడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

మహేంద్రుడు వజ్రాయుధం పట్టుకున్నట్టు ఆయుధాన్ని పట్టుకొని విభీషణుడు తన నలుగురు సహచరులతో వస్తున్నాడు. మహాతేజస్సుతో పర్వతంలా వస్తున్న వారిని సుగ్రీవుడు చూశాడు. రాక్షసులు యుద్ధానికి వస్తున్నారని వానరులు వృక్షాలనూ, బండరాళ్ళనీ పట్టుకున్నారు.

మేరుశిఖరమువలే, మెరుపువలే ప్రకాశిస్తున్న విభీషణుడు ఆకాశాన నిలబడి చెప్పాడు.

"శరణు శ్రీరామా! శరణు... శరణు... నేను విభీషణుడను. రాక్షసరాజు రావణుడి తమ్ముడను. అధర్మంగా తెచ్చిన సీతమ్మని ఇచ్చి సంధి చేసుకోమని

చెప్పినందుకు రావణుడిచే బహిష్కరించిన వాడ్ని. భార్యనూ, సంతానమునూ వదలి సర్వలోక శరణ్యుడను శరణు వేడుతున్నాను."

సుగ్రీవుడు శ్రీరాముడికి చెప్పాడు.

"పగవాడి తమ్ముడు. కుట్రలూ, కుతంత్రాలతో జీవనం సాగించే రాక్షసజాతి విభీషణుడిది. శత్రువు అనుపానులూ, రహస్యాలూ కనుక్కోవటానికి రావణుడు పంపిన గూఢచారి అయి ఉండవచ్చు. మేధావి పగవాళ్ళతో చెలిమి చేసి సమయం వచ్చినప్పుడు దెబ్బతీస్తాడు. శత్రుసైన్యంలో ప్రవేశించి, అవకాశం లభించగానే గూడ్లగూబ కాకులను చంపి తిన్నట్టుగా చంపివేయగల అవకాశమున్నది. కాన మంత్ర, వ్యూహ, నీతి, గుఢచారి ఇత్యాది ప్రయోగముల గూర్చి కూడా అప్రమత్తులమై ఉండవలెను.

సుగ్రీవుని మాటలు రామలక్ష్మణులు అలకించారు. అంగదుడు చెప్పాడు.

"రామా! శత్రుపక్షం నుంచి వచ్చాడు. చప్పున నమ్మదగ్గవాడు కాదు. అనర్థం తెచ్చి పెడతాడు. కోటలో పాగా వేయటమంటే ఇదేనేమో... కుటిలనీతి రావణుడిది. గుణగుణాలను పరిశీలించి గాని శరణు అన్నవాడిని నమ్మరాదు."

హనుమంతుడు చెప్పాడు.

"శ్రీరామా! విభీషణుడు ధర్మపరుడు. లంకలో నన్ను రాక్షసులు అవహేళన చేస్తూ పరాభవానికి గురి చేస్తున్నప్పుడు ధర్మ పన్నాలే చెప్పాడు. దుష్టుడు ఎప్పుడూ దుష్టతనంగానే ప్రవర్తిస్తాడు. సన్మార్గుడెప్పుడూ, సన్మార్గుడుగానే ఉంటాడు. బుద్ధిలో బృహస్పతివి. నీవే నిర్ణయించవలెను. నీ మాటే శిరోధార్యం."

"హితులారా! సన్నిహితులారా! శత్రువైనా సరే శరణన్న వాడికి, శరణాగతి ఇచ్చుట ఇక్ష్వాకువంశ సాంప్రదాయము. మైత్రికి చేయి ఇచ్చిన వాడ్ని గుణపరీక్ష చేయుట ధర్మసమ్మతం కాదు.

"వానరవీరులారా! విభీషణుడు స్నేహ ధర్మంతోనే వచ్చి ఉంటే లంకకు రాజు అవుతాడు. కాదంటే మధ్యలో వచ్చినవాడు మధ్యలోనే పోతాడు. దుర్బుద్ధితో విభీషణుడే కాదు సమస్త రాక్షస పిశాచగణం వచ్చి చేరినా విజయాన్ని పొందలేరు. ధర్మంతో అధర్మం ఎంతోసేపు కలిసి ఉండలేదు.

"సుగ్రీవా! పావురాయిని బోయవాడు వచ్చి శరణు వేడాడు. ఆ బోయవాడు పావురాయి భార్యని చంపాడు. అయినా శరణాగతిని పావురాయి





నుంచి పొందాడు. బోయవాడికి ఆహారంగా తన శరీరంలోని మాంసాన్ని ఇచ్చింది. అట్లే, కణ్వమహర్షి కొడుకు కండుముని ధర్మపరుడు. ఆ మహా పురుషుడు ఏమన్నాడో తెలుసా?

"శరణు అన్నవాడు శత్రువైనా, ద్రోహి అయినా, గర్వి అయినా, శత్రుపక్షం నుంచి వచ్చినా, శరణాగతిని అడిగినవాడ్ని కాదనుట పాపము. అటుల కాదన్నవాడి సమస్త పుణ్యమును శరణన్నవాడు గైకొని పుణ్యలోకాలకి వెళతాడు.

"కాన విభీషణుడే కాదు రావణుడొచ్చిన నా నిర్ణయంలో మార్పు ఉండదు" చెప్పాడు శ్రీరాముడు.

## విభీషణ పట్టాభిషేకం

ధర్మాత్ముడైన విభీషణుడు తన నలుగురు మంత్రులతో ఆకాశము నుంచి దిగి శ్రీరాముని దగ్గర నేలని స్పృశించి నమస్కరించాడు.

గరుత్మంతుడితో దేవేంద్రుడిలా విభీషణుడితో సఖ్యం చేసుకున్నాడు శ్రీరాముడు.

"రామా! ధర్మం చెప్పాను. ప్రియమైన మాటలను అప్రియ మాటలుగా తలచాడు. మా అన్న రావణుడు నా మాటలు వినలేదు. సరికదా నన్ను లంక నుంచి బహిష్కరించాడు. సంపదనూ, స్నేహితులనూ, భార్యాపిల్లలనూ వదిలేసి నీ శరణు వేడుతున్నాను. ఇక నేనూ, నా మంత్రులూ నీ ఆధీనం."

శ్రీరాముడు విభీషణుడికి అభయం ఇచ్చాడు.

"శ్రీరామా! సీతమ్మ తల్లి సేవకై నా కూతురు త్రిజటను వినియోగించాను. ఆ తల్లి కుశలమే. నీ గూర్చే క్షణమొక యుగంగా గడుపుతున్నది.

"రావణుడు గంధర్వ, నాగుల, సమస్త భూతాల చేత మరణించకుండా బ్రహ్మదేవుడి వరం పొందాడు. ఆ వర గర్వంతోనే అడ్డూ, ఆపూ లేకుండా అకృత్యాలు చేస్తున్నాడు.

"అపార సంపదా, అనితర సాధ్యమైన అనుచరగణమైన ఇంద్రుడంతటి ఇంద్రజిత్తూ, మహావీరుడు కుంభకర్ణుడూ, రావణుడి అహాన్నీ, దర్పాన్నీ, పెంచాయి. రాక్షసుల వినాశనానికి దారితీశాయి.

"రావణుడి సేనాధినాయకుడు ప్రహస్తుడు కుబేరుడి సేనానాయకుడు మాణిభద్రుణ్ణి జయించాడు. అతనితో సమానమైనవారు మహోదరుడూ, మహాపార్శ్వుడూ, అకంపనుడు. వీరంతా శక్తి మంతులు, కామరూపులు.

"రామా! అట్టి వీరులతోనూ, రాక్షసులతోనూ కలిసి సమస్త లోకాలనీ జయించాడు. ప్రభూ! ఈ విభీషణుడు ఇక మీ దాసుడు. మీ చిత్తం వచ్చినట్టు ఆజ్ఞాపించవచ్చు. లంకలోని రాక్షసులందరితోనూ నా శక్తి యుక్తులతో పోరాడుతాను" చెప్పాడు విభీషణుడు.

శ్రీరాముడు విభీషణుడిని కౌగిలించుకున్నాడు.

"లక్ష్మణా! సముద్ర జలాలు తీసుకురా! ఇప్పుడే లంకకి విభీషణుడ్ని పట్టాభిషక్తుడని చేద్దాం" చెప్పాడు.

శ్రీరామ ఆదేశంతో లక్ష్మణుడు జలాలను తెచ్చాడు. మహాప్రాజ్ఞుడూ, ధర్మవేత్త అయిన విభీషణుడ్ని శ్రీరాముడు పంచభూతాల సాక్షిగా, లంకకి రాజుగా పట్టాభిషేకం చేశాడు.

వానరులంతా లంకాధిపతి విభీషణునకు జయజయ ధ్వనులు చేశారు.

"రామా! ఆలోచించవలదు. ఈ మహాసముద్రం దాటుట బహుకష్టం. పూర్వం మీ ఇక్ష్వాకు వంశస్థుడైన సగర చక్రవర్తి తన పుత్రులచే భూమిని త్రొవ్వించాడు. దానితో ఈ మహాసముద్రం అంతూ పొంతూ లేకుండా సాగిపోయి ఉంది. సముద్రుడని శరణు వేడుటయే మార్గము."

సముద్రుడు అలలతో భయంకరంగా ఊగిపోతున్నాడు. సేతువు నిర్మించకుండా దేవతలు సహితం లంకను చేరలేరన్నట్టు అనంతంగా కానవచ్చింది.

## రావణుడి దూత

లంకేశ్వరుడి దూత పరాక్రమవంతుడైన శార్దూలుడు సముద్ర తీరానికి వచ్చి వానర సైన్యాన్ని చూశాడు. అంతటి వానరులని చూసి ఖంగు తిని పెనువేగంతో లంక చేరాడు. రావణుడికి విన్నవించుకున్నాడు.

"ప్రభూ! వానర సైన్యము పరిధి నా కనుచూపు దాటి అగాధము వలె ఉన్నది. లవణ సముద్రంతో పాటు మరో రెండు సముద్రాలు ఉన్నట్టు ఉన్నాయి.

"ప్రభూ! వానరుల సముద్రం, భల్లూకాల సముద్రం, లవణ సముద్రం మహా సముద్రాలవలే కాన వస్తున్న ఆ వానర, భల్లూక సేనల మధ్య రామలక్ష్మణులు తేజస్సుతో వెలిగిపోతున్నారు.

"బ్రహ్మ దండముల వంటివీ, యమ దండముల వంటివీ... ప్రకాశ కిరణాలతో ఉండే బాణాలు ధరించి ఉన్నారు. రాజా! వెనువెంటనే నిర్ణయించవలెను. సామదానదండోపాయాల్లో, దండోపాయం ఉత్తమమైనదిగా కానరావుట





లేదు. కాన ప్రభూ! మరి కొందరిని దూతలను పంపి నా మాటలు విశ్వసించుము."

వేగులలో దిట్ట అయిన దూత శుకుడను పిలిచి చెప్పాడు లంకేశ్వరుడు.

"శుకుడా! నా మాటగా సుగ్రీవునికి చెప్పు. బ్రహ్మపుత్రుడు ఋక్షరజస్సుడి పుత్రుడవి. మంచి వంశంలో పుట్టావు. జ్ఞానమూ, తర్కమూ తెలిసినవాడవి. శ్రీరాముని భార్యని నేను చెరపట్టినది. నీకూ, కిష్కింధకూ ఎట్టి సంబంధము లేదు. నీకే యుద్ధంలో లాభము ఏమీ లేదు.

"దేవతలూ, గంధర్వులూ, నాగులూ మరెవరూ సముద్రం దాటి నన్ను జయించలేరు. వానరులతో, మానవులతో నన్ను జయించుట కల్ల. కిష్కింధ వెళ్ళు. నీవు నీ సైన్యమూ హాయిగా సుఖించండి. ఈ వాక్యాలు తూ.చ. తప్పక చెప్పవలెను" చెప్పాడు రావణుడు శుకుడితో...

రావణుడి ఆజ్ఞతో శుకుడు పక్షి రూపం ధరించి రివ్వున ఎగురుకుంటూ వెళ్ళాడు. సముద్రతీరాన ఉన్న సుగ్రీవుడ్ని చేరి ఆకాశ మార్గానే రావణ దూతగా పరిచయము చేసుకొని రావణుడి మిత్రభేద వాక్యాలన్నీ విపులంగా చెప్పాడు.

వానర వీరులకు తిక్క రేగింది. దూతను శుకుడను చటుక్కున పట్టుకొని పిడికిళ్ళుతోనూ, గోళ్ళుతోనూ బుద్ధి చెప్పారు. శుకుడు శ్రీరాముడ్ని శరణువేడాడు.

"రామా! దూతకి దుస్థితి తెచ్చుట ధర్మంకాదు. అదియూ నీ సమక్షమున. కాన రామా! నన్ను కాపాడు.

"దూత అనువాడు ప్రభువు యొక్క మాటలే చెబుతాడు. స్వంతంగా ఏ ఒక్క మాట మాట్లాడినా చంపుటకు అర్హుడు. కాన శ్రీరామా లంకేశ్వరుడు చెప్పినవే నేను సుగ్రీవునకు చెప్పినాను."

శ్రీరాముడు వానరులను శాంతింప చేశాడు. శ్రీరామ అభయాన్ని ఇచ్చాడు.

శుకుడు ఆకాశం మీద నుంచి సుగ్రీవుడ్ని అడిగాడు.

"కిష్కింధరాజా సుగ్రీవా! నా ప్రభువుకి ఏం చెప్పమంటావు"

"శుకుడా! నా యీ మాటలు బాగా విను. స్పష్టంగా రావణుడికి విన్నవించు.

"ఓ రావణా! నీవు నాకు మిత్రుడవు కావు. నాకు ఎట్టి ఉపకారం నీవు చెయ్యలేదు. శ్రీరాముడు నాకు ఇష్టుడు, ప్రియుడు. నా బద్ధ విరోధి వాలికి నీవు మిత్రుడవు. అనగా నాకూ శత్రువ్వే.

"చంపుటకు తగిన వాడివైనా రావణా! నా మిత్రుడికీ, నాకూ నువ్వు విరోధివే. ముసలివాడైన జటాయువుని చంపావు. వైదేహిని భర్త, మరిది లేనప్పుడు దొంగచాటుగా పిరికివాడిగా తీసుకెళ్ళావు.

"రామలక్ష్మణులతో, నా అపార సైన్యంతో లంకకి వస్తాం. నీ సైన్యాన్నీ శక్తులనూ, సిద్ధం చేసుకో. అరివీర భయంకరమైన రామ బాణాలు నిన్నూ, నీ పరివారాన్ని తాకుతుంటే విలవిలలాడిపోయే ఆ హాహాకారాలు వినుటకు సిద్ధంగా ఉండు.

"గంధర్వులు కానీ, పిశాచములు కానీ, రాక్షసులు కానీ, ముల్లోకములలో ఎవరూ నిన్ను రక్షించలేరు" చెప్పాడు సుగ్రీవుడు. అప్పటికే వానరులు శుకుని రెక్కలు విరిచారు. శ్రీరామ ఆదేశంతో చంపకుండా ఉంచారు. దూతనెపంతో మిత్రభేద పాచిక వెయ్యటానికి వచ్చిన శుకుణ్ణి బంధించారు వానరులు.

## శ్రీరాముడు మహాసముద్రుడను ప్రార్థించుట

రఘువంశీయుడు శ్రీరాముడు సముద్ర తీరాన తూర్పువైపు మొహం పెట్టుకొని తన బాహువు తలగడగా చేసి సర్ప శరీరమువలే దర్భల మీద పడుకున్నాడు.

సుందర ఆభరణాలు ధరించిన హస్తం. సీతాదేవికి తలగడగా ఉన్న హస్తం. భూములూ, గోవులూ, గుర్రాలూ, ధనమూ, రత్నాలనూ విరివిగా దానమిచ్చిన హస్తం. సర్వలోకాలకీ అభయ హస్తం. అల్లెత్రాటిని మ్రోగించి దిక్కులను దద్దరిల్లేలా చేసిన హస్తం. నీతి, ధర్మములు తెలిసిన శ్రీరాముడు త్రికరణ శుద్ధిగా సముద్రుడిని ప్రార్థించాడు.

రత్నాకరుడు మూడు రాత్రుళ్ళు అయినా సాక్షాత్కారించలేదు. కన్నులు పెద్దవయ్యాయి. శ్రీరాముడ్ని అస్తమించే సూర్యుని రంగు పులుముకుంది.

మహాక్రోధంతో సముద్రాన్ని స్థంబింపచేయటానికి లక్ష్మణుడిని ధనుస్సు తెమ్మన్నాడు. శ్రీరాముడు కోదండము పుచ్చుకున్నాడు.

"లక్ష్మణా! శాంతమూ, మంచి ప్రియమైన వాక్కులూ, ఓర్పూ, గుణహీనుడు అసమర్ధ లక్షణాలుగా భావిస్తాడు. మహాసర్పాలవంటి బాణధాటితో సముద్రాన్ని చిన్నా భిన్నం చేస్తాను. నీటి జంతువులన్నీ చిన్నా భిన్నం అవుతాయి. సముద్రంలోని రత్నాలూ, మణులూ కుప్పలు కుప్పలుగా బైటపడతాయి" చెప్పి శ్రీరాముడు ప్రళయకాల రుద్రుడయ్యాడు.





ధనుస్సు నడుమ పట్టుకున్నాడు. వెనక్కి కదలి అల్లెత్రాటిని లాగి వదిలాడు. ధనుష్టంకారానికి సముద్ర జలాలు అల్లల్లాడాయి. శ్రీరాముని బాణాలు కుప్పలు కుప్పలుగా సముద్రాన్ని తాకాయి.

సమస్త జలచరాలూ, వింధ్య పర్వతమంత ఎత్తు లేచాయి. సముద్రం మహా తుఫాను వచ్చినట్టు కకావికలమైపోయింది. పాతాళంలోని దానవులు గగ్గోలు పెట్టారు.

శ్రీరాముడు బ్రహ్మాస్త్రాన్ని గురి పెట్టాడు. సముద్రాన్ని ఎండ గొట్టడానికి నిర్ణయించుకున్నాడు. మేటి వింటిని ఎక్కించి లాగాడు. భయంకరమైన శబ్దాలు, వందల కొద్ది పిడుగులు పడ్డట్టు భువనాంతరాలు దద్దరిల్లినవి. సరస్సులూ, నదులూ క్షోభించాయి. చంద్రసూర్యులు గతులు తప్పారు. కనపడని పిశాచాలు భయంకర ధ్వనులు చేశాయి. ఆకాశం భయంతో పగిలినట్టు నలు దిక్కుల మెరుపులు.

సూర్యుడు భయపడి అస్తగిరి వైపు పరుగులు తీశాడు. లోకం చీకటిలో పడింది. మేరు పర్వతం నుంచి సూర్యుడు ఉదయించినట్టు సముద్రుడు లేచాడు. వైఢూర్యమణి వలే ఉన్నాడు. శ్రీరాముడిని శరణువేడాడు. ఎర్రటి దుస్తులూ, ఎర్రటి పూల దండలూ ధరించాడు. విశాలమైన నేత్రాలతో గైరికాది ధాతువులతో ఉన్న హిమాలయంలా ఉన్నాడు. గంగా, సింధులాంటి మహా నదులతో తరలి వచ్చాడు. ధనుస్సు ధరించిన శ్రీరాముడికి అంజలి ఘటించాడు.

"శ్రీరామచంద్రా! శాంతించు... సౌమ్యమూర్తివి. పంచభూతాలు భూమీ, ఆకాశమూ, నీరూ, గాలీ, తేజస్సూ అవన్నీ వాటి ధర్మం అవి నెరవేర్చుతాయి. నేనూ అంతే. అగ్ని చల్లగా ఉంటుందా? అట్లే నా సహజ స్వభావం. ఆ ధర్మనిరితితోనే ఆగాను. కాన శ్రీరామా ధర్మం తెలిసినవాడివి. నేను ధర్మాన్ని తప్పుట ధర్మమా? నీవు చెప్పుము.

"కాన శ్రీరామా! మీరు సముద్రాన్ని దాటుతున్నప్పుడు భయంకర జలచరాలన్నింటిని నియంత్రించి వానర సైన్యాన్ని కాపాడగలను. సముద్ర జలాన్నంతటినీ గడ్డ కట్టించు ప్రయత్నం వల్ల సమస్త జలచరాలన్నీ నిర్జీవం అయిపోతాయి. సముద్రంలో సేతువు నిర్మించుకుంటే మెరక వేస్తాను" చెప్పాడు సముద్రుడు.

"రత్నాకరా! ఎక్కు పెట్టిన బ్రహ్మాస్త్రాన్ని వదలక తప్పదు. ఏం చెయ్యను?"

"ప్రభూ! శ్రీరామా! ఇక్కడికి ఉత్తరం వైపు ద్రుమకుల్యమను ప్రదేశము ఉన్నది. అక్కడి వారు కిరాతకులు. దుర్మార్గులు. దొంగలు. ఎన్నో పాపాలతో వారు చేసే చర్యలతో నేను ఎంతో వ్యథ చెందుతున్నాను. ఆ ద్రుమకుల్యము మీద వదులు" చెప్పాడు నదీపతి సముద్రుడు.

శ్రీరాముడు బ్రహ్మాస్త్రాన్ని వదిలాడు. మంటలు మండుతూ, పిడుగులు వర్షిస్తూ, భీకర ధ్వనులతో వెళ్ళి పడింది. భూమిని చీల్చుకొని రసాతలంలోకి వెళ్ళింది. ద్రుమకుల్య ప్రదేశంలోని దస్యువులూ, ఆభీరులూ పూర్తిగా హతమయ్యారు.

ఆ బాణం పోయిన కలుగు నుంచి పాతాళ గంగ పైకి లేచింది. ఆ ప్రదేశమే వ్రణకూపంగా పేరుపొందింది.

శ్రీరామ బాణ వేడితో ద్రుమకుల్యంలోని నీరంతా ఇంకిపోయింది. మరుకాంతారం అని పేరు పడిన ఆ ప్రాంతం అంతా పచ్చికబయళ్ళతోనూ, దివ్య ఔషధులతోనూ విరాజిల్లింది.

సముద్రుడు సంతోషించాడు. శ్రీరామునకు నమస్కరించాడు.

"శ్రీరామా! ధన్యుడనయ్యాను. సుగ్రీవుని సైన్యంలోని నలుడు విశ్వకర్మ ఔరస పుత్రుడు. తండ్రితో సమానమైనవాడు. సేతువును నిర్మించే బాధ్యతను అతని భుజస్కంధాలపై మోపుము. అంతా శుభం" చెప్పి సముద్రుడు అంతర్ధానమయ్యాడు.

## లంకకు సేతువు నిర్మించుట

శ్రీరాముని ఆజ్ఞ మీద నలుడు వానర వీరులను ఆదేశించాడు. వానరులందరూ మహాదానందంగా అడవిలోకి వెళ్ళారు. మహా వృక్షాలు పెకిలించారు. వేళ్ళను పీకేశారు. కొమ్మలను వేరు చేశారు. ఆకులను విదిలించారు. కాయలని తిన్నారు. పెద్ద కర్రల్లా చేశారు. గుట్టలు గుట్టలుగా కర్రలను సముద్రతీరానికి తెచ్చి సముద్రంలో వేశారు.

ఏరుమద్ది చెట్లూ, ఇనుమద్ది చెట్లూ, తాటి చెట్లూ, తిమిశ చెట్లూ, మాండు చెట్లూ, అశోక చెట్లూ, బొట్టుగు చెట్లూ, ఇలా ఏది దొరికితే అది పెకిలించటము, తీసుకొచ్చి పడేయటము.

మరికొంత మంది వానరులు పర్వతాల మీదకి ఎగిరి పెద్ద పెద్ద బండరాళ్ళని తీసుకొచ్చి వేస్తున్నారు. వాటి అదురుకి నీరు చెదరి దభీ, దభీ





మని దిక్కులు మారుమ్రోగిపోతున్నాయి. నీరు మహాపర్వతమంత ఎత్తు లెగుస్తోంది.

కొందరు వానరులు నూలుతాడు పట్టుకొని ముందు కెళుతున్నారు. మరికొందరు వానరులు పడేసిన రాళ్ళనూ, చెట్లనూ క్రమ బద్ధం చేస్తున్నారు. ఎగుడు దిగుడు లేని ప్రాంతంగా సరిదిద్దుతున్నారు.

ఇంకొందరు వానరులు చదును చేసిన దారంతా మంచి పూలు చల్లుతున్నారు. దగ్గరిలోని పర్వతాలన్నీ రాయీ, రప్పా లేక బోసిపోయాయి. తొలిరోజే వానర సైన్యం పధ్నాలుగు యోజనాల సేతువు నిర్మించారు. రెండో రోజు ఉత్సాహవంతమైన ఏనుగుల వంటి వానరులు ఇరవై యోజనాల దూరం. పెద్ద దేహం గల వానరులు మూడవ రోజు ఇరవై ఒక్క యోజనాల దూరం. నాలుగోరోజు మహాకాయులూ, వానరులూ, ఇరవై రెండు యోజనాల దూరం. శీఘ్రముగా కార్యములు చేయు వానరులు అయిదోరోజు మిగిలిన ఇరవై మూడు యోజనాల సేతువు కట్టేశారు.

అవతలి ఒడ్డు సువేలాద్రి వరకూ శ్రీరామబంటులు... వానరులు మహోన్నతమైన సేతువు నిర్మించారు. శ్రీరామునకు జయ జయ ధ్వనులు పలికారు.

విశ్వకర్మ పుత్రుడూ, శ్రీమంతుడూ అయిన నలుడు శ్రీరామునికి నమస్కరించాడు. దేవతలూ, సిద్ధులూ, చారణులూ, యక్షులూ, గంధర్వులూ, ఆ సేతువు చూసి నివ్వెరపోయారు.

తేజోవంతమైన ధనుస్సూ, బాణాలతో రామలక్ష్మణులు సుగ్రీవ, అంగద హనుమలతో కలిసి నడిచారు. వానరులూ సేతువుపై కదిలారు.

మరికొంత మంది ఆకాశంలో ఎగిరారు. ఎగిరినంత ఎగిరి మళ్ళీ సేతువు మీద నడిచారు. నడిచిన వారు చప్పున పై కెగిరి ఆకాశ మార్గాన ప్రయాణిస్తున్నారు.

రామదండు కదిలింది. వారి కోలాహలంలో సముద్ర ఘోష మరుగున పడింది. మహా వానర సేన అవతలి ఒడ్డు చేరింది. సువేలాద్రి పర్వత ప్రాంతము పండ్లూ, కాయలకీ ప్రసిద్ధి. వానర సేన వాటి మీద పడింది.

☆☆☆ ☆☆☆ ☆☆☆

లోకాభిరాముడు, యుద్ధంలో శత్రువులను జయించువాడు అయిన శ్రీరాముడు చెప్పాడు.

"లక్ష్మణా! ఫలమూలాలూ, సేలయేళ్ళు సమృద్ధిగా ఉన్నాయి. సమస్త సైన్యాన్ని గరుడ వ్యూహంగా ఉంచుదాము. అదిగో చూడు శుభశకునాలు ఎలా కానవస్తున్నాయో.

"మంచి మాటలతో రావణుడు మాట వినడు. తప్పు అని తెలిసినా సరిదిద్దుకోడు. యుద్ధానికీ, నాశనానికీ సిద్ధమవుతాడు. అప్పుడు వానరులూ, రాక్షసులూ ఒకరి మీద ఒకరు గుదియలతోనూ, గండ్రగొడ్డళ్ళతోనూ, శూలాలతోనూ అనేక రకాల ఆయుధాలతో చంపుకుంటారు.

"అది జరిగేదే అన్నట్టు చూడు సూర్యునిలో మచ్చ. అనేక పక్షులు పరిసరాలని దీనంగా చూస్తున్నాయి. మేఘాలు కారణం లేకుండా ఉరుముతున్నాయి. ఈ భూమంతా రక్తంతోనూ, శరీర మాంసఖండాలతో నిండిపోక తప్పదు" చెప్పాడు శ్రీరాముడు.

★★★ ★★★ ★★★

సముద్రం వంటి వానరులతో ఆ ప్రాంతమంతా నిండిపోయింది. వారందరి మధ్య శ్రీరాముడు శరత్కాల పున్నమి చంద్రుడిలా వెలిగిపోతున్నాడు. వానరులు సింహనాదాలు చేశారు. ప్రతిగా రాక్షసులు మృందగ భేరీలను మ్రోగించారు.

వానరుల మథించిన గర్జన భీకర ధ్వనులకు లంకా పట్టణమంతా మారుమ్రోగింది. ఉరుముతున్న మేఘాల్లా అరిచారు ప్రతిగా రాక్షసులు. ఇద్దరి రోష ధ్వనులతో భూమి అదిరింది. శ్రీరాముడు త్రికూట పర్వతం పైనున్న లంకా నగరాన్ని చూశాడు. సీత తలంపుకు వచ్చింది. అంగారకుడు రోహిణీ నక్షత్రాన్ని పీడించినట్టు విశాలక్షిని ఎన్ని బాధలు పెడుతున్నాడో... బాధ పడ్డాడు శ్రీరాముడు. లక్ష్మణుడితో చెప్పాడు.

"లక్ష్మణా! త్రికూట పర్వతం పై నున్న ఈ లంకను విశ్వకర్మ స్వయంగా నిర్మించాడు. మహాధ్వజాలతో, విమాన గృహాలతో, వనాలతో ఉద్యాన వనాలతో, మంగళకరమైన మందవాయువులతో, సెలయేళ్ళతో, జలపాతాలతో, అనేక సాధు, పక్షు జంతువులతో నయనందకరంగా నిర్మించాడు.

"కుబేరుడి, ఇంద్రుడి వనాలతో పోటిపడే ఈ లంకలోని ఫలాలూ, కాయలూ అమితమైన శక్తి కలవి. అవి తిన్న పక్షులు రాగాలను ఆలపిస్తాయి" చెప్పాడు శ్రీరాముడు. ఆపై సుగ్రీవునికి ఆదేశాలు ఇచ్చాడు.





రామాజ్ఞా ప్రకారం సైన్యాన్ని విభజించి... నలు దిక్కులలో పెట్టాడు. గరుడాకారంలో ఉన్న వ్యూహము వక్షస్థలము నందు తమ సేనలతో అంగదుడూ, నీలుడూ నిలిచారు. ఋషభుడు వానరసేనలతో కుడి పార్శ్వము నందు, మదగజము వంటి గంధమాదనుడు ఎడమ పార్శ్వము నందు, తమ సేనలతో సిద్ధంగా ఉన్నారు.

శ్రీరాముడు లక్ష్మణుడితో కలిసి శిరఃస్థానమందు నిలిచాడు. భల్లూక నాయకుడైన జాంబవంతుడూ, సుషేణుడూ, వేగదర్శీ, కుక్షిప్రదేశం నందు నిలిచారు. వానర రాజు సుగ్రీవుడూ, వరుణుడూ పశ్చిమ దిక్కును రక్షించునట్లు పుచ్చ భాగమున రక్షణగా ఉన్నారు. అప్పుడు శుకుణ్ని వదిలి పెట్టమని చెప్పాడు శ్రీరాముడు.

"శుకుడా! వెళ్ళు... నీకు స్వేచ్ఛనిస్తున్నాను. నీవు దూతగా రాలేదు. అనుపానులు కనిపెట్టుటకూ, మిత్ర భేదాన్ని సృష్టించుటకు వచ్చావు. అందులకే బంధించి, ఇప్పుడు వదిలి వేస్తున్నాను. నీ ప్రభువు వద్దకు నిరాటంకంగా వెళ్ళవచ్చు" చెప్పాడు శ్రీరాముడు.

వానరులు పెట్టిన భయం కంటే, రావణుడి భయం ఎక్కువైంది శుకుడుకి. తను కార్యం పూర్తి చెయ్యకుండా వచ్చినందుకు రావణుడి కోపం ఏ స్థాయిలో ఉంటుందో తలుచుకొని వంగి వంగి నమస్కరించి వెళ్ళాడు.

రావణాసురుడ్ని చేరాడు. శుకుడు రూపం చూసి రావణుడు నవ్వాడు.

"శుకుడా! ఆ కోతులకి చిక్కినావా! నీ రెక్కలన్నీ తెగి ఉన్నాయి" అడిగాడు.

"రాజా! ఉత్తరపు ఒడ్డుకు వెళ్ళాను. అంతా పరికించాను. సుగ్రీవునితో మీరు చెప్పినట్టే తూ.చ. తప్పక చెప్పాను. వానరులు కోపిష్ఠులు. నన్ను కొరికారు. గీరారు. రెక్కలు విరిచారు. శ్రీరాముడి ఆదేశంతో సేతువు నిర్మించి, లంక దరిదాపులకి వచ్చి నన్ను వదిలారు.

"ప్రభూ! ఖరుణ్ణీ, విరాధుణ్ణీ, కబంధుణ్ణీ, చంపిన శ్రీరాముడు తేజోవంతమైన ధనుస్సూ, బాణాలతోనూ, వానర సైన్యముతోనూ వచ్చి ఉన్నాడు. ఆ కోతులన్నీ లంకా పట్టణంలోకి రాకముందే సీతను అప్ప చెప్పుట మంచిది" చెప్పాడు శుకుడు. రావణుడు తన కన్నుల నుంచి నిప్పులు కక్కాడు.

"శుకుడా! దేవదానవ, కింపురుషులూ, పంచభూతలూ ఒక్కటై వచ్చినా రావణుడి ముందు నిలువ జాలరు. మృత్యుపాలకుడైన యముడ్ని గడగడ

లాడించిన వాడ్ని. అఖండమైన నా తేజస్సుకే వారి కన్నులు మూతలు పడుతాయి. నా సముద్ర, వాయు గమన వేగంతో వానరసైన్యాన్నీ, రామలక్ష్మణులనూ చికాకు పరుస్తాను. ఉదయించుతున్న సూర్యుడు సమస్త నక్షత్రాల కాంతిని హరించినట్టు వానర సైన్యాన్ని కానరాకుండా చేస్తాను. మహామహులే నిలువలేని నా విష సర్పాలవంటి బాణాలను శ్రీరామునిపై వదులుతాను.

"అసలైన పరాక్రమమూ, వీరత్వమూ, శస్త్రాలనూ శ్రీరాముడు ఎప్పుడూ చూసి ఉండడు" చెప్పాడు రావణుడు.

## శుక సారణులు

దశకంఠుడు యుద్ధ సమయం ఆసన్నమైనదని శుకసారణులైన మహాగూఢచారులను పిలిపించాడు. లంకేశ్వరుడు ఎంతో ముఖ్యమైనదయితే తప్ప తమని పిలవడు.

"శుకసారణులారా! శ్రీరాముడు సేతువు నిర్మించాడు. అపారమైన వానరులతో లంకను సమీపించాడు. శత్రువుని తక్కువ అంచన వేయుట వీరుల లక్షణము కాదు. మీరు వెళ్ళండి.

"రామలక్ష్మణుల అనుపానులూ, సైన్య వివరాలూ, సేతువు నిర్మించటానికి ఎవరు సహకరించారో తెలుసుకోండి. వానరుల శక్తులూ, వారి బలహీనతలూ, ఆయుధాలూ దేన్నీ వదలొద్దు. అన్నీ ఉన్నవి ఉన్నట్టుగా నాకు తెలియాలి" చెప్పాడు రావణుడు.

రాజ్ఞాతో వీరులైన గూఢచారి మంత్రులిరువురూ వానర రూపాలు ధరించి వానర సైన్యంలో ప్రవేశించారు.

ఆ అపార సైన్యాన్నీ, ఊహించశక్యము గాని రోమాంచజననమైన వానరులనూ శుకసారణులు చూసి బెంబేలెత్తారు. వానర, భల్లూకాలలో ఉత్సాహం, పరాక్రమములు పెల్లుబుకుతున్నాయి.

దగ్గరిలోని పర్వతాల మీదా, కొండల శిఖరాల మీదా, చెట్లు మీదా, నేలపై ఆకాశంలోనూ ఎటు చూసినా వానరులే... వారి అరుపులతో, కేకలతో ఆ ప్రదేశం దద్దరిల్లిపోతోంది.

సగం తిన్న కాయలూ, పండ్లూ చిందర వందరగా ఉన్నాయి. పెద్ద పెద్ద వృక్షాలను పోటీలు పెట్టుకుంటూ మరీ భూమి నుంచి పెకిలిస్తున్నారు. క్షోభింప





శక్యము గాని సేనా మహా సముద్రాన్ని ఇద్దరూ చూశారు. శుకసారణులు యథేచ్ఛగా తిరిగారు.

సుగ్రీవుడూ, అంగదుడు ముందు కూడా మసిలారు. విభీషణుడి ముందు మాత్రం దొరికిపోయారు. ఆ మహాత్ముడు వారిద్దరినీ శ్రీరాముడి ముందు ఉంచాడు.

"ప్రభూ! వీరు రావణాసురుడి భక్తులు. గూఢచారులు. మన సేనలో వానరులవలె ప్రవేశించారు."

శుకసారణులు వణికిపోయారు. నిజరూపం ధరించి శ్రీరాముడ్ని వేడుకున్నారు.

"ప్రభూ! సౌమ్యుడైన శ్రీరామా! సర్వప్రాణికోటిని కాపాడేవాడివి అని చెప్పుకుంటే విన్నాము. లంకాధిపతి ఆజ్ఞ. మేం కింకరులము. రాజు చెప్పినదే చేశాము" చెప్పారు చేతులు జోడించి.

శ్రీరాముడు వార్ని ప్రసన్నంగా చూశాడు.

"రాక్షసులారా! పొండి. ఆయుధము లేకుండా వచ్చి దొరికి పోయినారు. కాన మీ ప్రాణముల గూర్చి భయపడాల్సిన పనిలేదు. మీ ప్రభువుకి మీరు చూసినదంతా, తెలుసుకున్నదంతా వివరించండి. మీకు ఇంకనూ సందేహముంటే మీ ఇష్టానుసారంగా అంతా కలియ తిరగండి. సుగ్రీవ, హనుమ, అంగద, జాంబవంతాది వీరులను అడిగి మరీ తెలుసుకోండి" శ్రీరాముడు చెప్పాడు.

ప్రాణాలు లేచి వచ్చినట్లైయింది వారికి. శ్రీరాముడికి మొక్కారు. జయ విజయీ భవ! అని అభినందించారు.

"రాక్షసులారా! నా మాటగా మీ ప్రభువుకి తూ.చ. తప్పక చెప్పండి. ఏ శక్తులు చూసుకొని సీతాదేవిని చెరపట్టి తెచ్చాడో, అవన్నీ సిద్ధం చేసుకోమనండి. అపార సేనలతో యుద్ధానికి సిద్ధమవ్వమనండి. దేవేంద్రుడి వద్ద వజ్రాయుధం ఒక్కటే... వజ్రాయుధాల్లాంటి అనేక నా బాణ పరంపరకు అడ్డు కట్టువేయ మహా కవచాలను సిద్ధం చేసుకోమనండి.

"సూర్యుడు ఉదయించుటే ఆలస్యము. లంకాపట్టణ ప్రధాన ద్వారాలు చెక్కలు చేస్తాను. రాక్షస సేనను అతలాకుతలం చేస్తాను" చెప్పాడు శ్రీరాముడు.

గూఢచారులిద్దరూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని లంక చేరారు. రావణుడి ముందు మోకరిల్లారు. జరిగినదంతా చెప్పారు. విరోధము వద్దని

సంధే మేలని చెప్పారు. సీతాదేవిని తిరిగి ఇచ్చుటే ప్రథమ కర్తవ్యమని తెలియ చెప్పారు. రావణుడు కృద్ధుడయ్యాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

"శుకసారణులారా! ప్రగల్భాలు పలుకుట శ్రీరాముడి వంతు. చేతలలో చూపుట ఈ రావణుడి వంతు. సమస్త లోకాలు కట్టగట్టుకు వచ్చినా సీతను ఇవ్వను.

"అంత మంది శత్రువుల మధ్య చిక్కుట వల్ల మీరు చాలా భీతి చెందినారు. సహజం కూడా. ఇంతకీ వెళ్ళి ఏం తెలుసుకొచ్చారు. శత్రువు బలమూ, బలగమూ భేరీజు వేశారా... లేదా" గద్దించాడు రావణుడు.

"ప్రభూ! అంతా గమనించాం" చెప్పారు మంత్రులు. రావణుడు వారిని తీసుకొని మహాప్రాసాదం పైన నిల్చున్నాడు. అక్కడ్నించి మహాసముద్ర తీరమూ, పది ఆమడల వెడల్పుతో నూరు యోజనాల దూరం గల సేతువు కానవస్తోంది.

సారణుడు దశకంఠునకు చూపిస్తూ చెప్పాడు.

"అదిగో ప్రభూ! అతనే నీలుడు. సర్వసేనాధిపతి. అడవులూ, కొండలూ అదిరిపోయేటట్టు లంక వైపు తిరిగి అరుస్తున్న ఆ వానరుల ముందు ఉన్నది అతనే...

"కొండ శిఖరంలా ఉన్న అతనే అంగదుడు. యుద్ధ ప్రీతితో అతని తోకచూడు ప్రభూ... ఎలా క్రిందకు కొడుతుందో... అతనే వాలి పుత్రుడు.

"సుగ్రీవుడు ఆజ్ఞ ప్రకారం సేనను విభజన చేస్తున్నాడే అతనే శ్వేతుడు. వీరత్వంలోనూ, యుద్ధతంత్రాల్లోనూ ప్రసిద్ధికెక్కినాడు.

"రోషంతో రంకెలు పెడుతున్నవాడు కుముదుడు. వాడు మహా ఘోరకర్ముడు. సంకోచక రాజ్య మతడిదే. ప్రచండుడు. యుద్ధమంటే విందు భోజనంలా ఉరికే వీరుడతడు. వదిలితే లంకను నలిపేస్తానని చెబుతున్నాడు.

"కపిల వర్ణ కనుల గలవాడు రంభుడు. వింధ్యా పర్వతం మీద, కృష్ణగిరి మీద, సహ్యాపర్వతము మీద, సుదర్శన పర్వతము మీద వానరులందరికీ రాజు. లక్షలాది వానరుల్ని శ్రీరాముడి సేవకే సమర్పితము చేశాడు.

"మృత్యువు ఎదురొచ్చినా భీతి చెందని అతను శరభుడు. మాటి మాటికీ తోకనూ, లంకనూ చూసుకుంటూ రాముడి ఆజ్ఞ కోసం ఎదురు చూస్తున్నాడు.





అతను మహాబలుడు. వేగవంతుడు. శ్రీరాముడి కోసం నలభై లక్షల సైన్యంతో వచ్చాడు.

"అతను పనసుడు. యాభై లక్షల సైన్యంతో లంక మీదకు ఉరకటానికి సిద్ధంగా ఉన్నాడు.

"రెండో సముద్రంలా తన సేనతో ఉన్నవాడు క్రోధనుడు. డెబ్బై లక్షల సేనకి నాయకుడు గవయుడు. ప్రభూ! వారంతా శ్రీరాముడి ఆజ్ఞకై వేచి ఉన్నారు. లంకానగరాన్ని కూల్చెయ్యాలనీ, కాల్చెయ్యాలనీ, మట్టం చెయ్యాలనీ, వనాలనూ, ఉద్యానవనాలనూ, ఉక్కిరి బిక్కిరి చెయ్యాలనీ వేగిరపడుతున్నారు.

"ప్రభూ! అటు చూడండి. సూర్యుడి కిరణాల వంటి తోక గల హరుడు. అతని సేన వెయ్యి కోట్లు, నల్లగా కనిపిస్తున్న వారు ఎలుగులు, ఎలుగుల సేనకు అధిపతి ధూముడు.

"ఎలుగులు కోరలూ, గోళ్ళు సానపట్టుకొని మరి సిద్ధంగా ఉన్నారు ప్రభూ... రావణాసురుడి రాక్షసులకు ఆయుధాలు కూడా కావాలా! అనుకుంటూ కోరలనూ, గోళ్ళనూ చూసుకుంటూ మూలుగుతున్నారు.

"అతడి సోదరుడే జాంబవంతుడు. మహా పర్వతంలా ఉన్నవాడు సన్నాదుడు. ఈ పర్వతం మీద నుంచి ఆ పర్వతం మీదకు ఒక్క అడుగుతో చేరగల పర్వతాకారుడు.

"అదిగో క్రంథనుడు. దేవతల కోసం గంధర్వ కన్య గర్భంలో అగ్నిహోత్రునికి పుట్టాడు. నేరేడు చెట్ల మధ్య నివశించే ఆ వీరుడు వెయ్యి కోట్ల వానరులతో వచ్చాడు.

"అదిగో మహాతేజస్సుతో కానవస్తున్నాడే అతనే కేసరి. లంకని కాల్చి చిన్నా భిన్నం చేసిన హనుమంతుడి తండ్రి. మేరు పర్వత కొండల్లో ఉంటాడు. శ్రీరామ కార్యం కోసం అరవై వేల బంగారు కొండల నుంచి జబ్బలు చరుచుకుంటూ వచ్చాడు.

"ఓ లంకాధిపతీ! రావణ ప్రభూ! పింగళి వర్ణంతోనూ, గుండ్రటి కళ్ళతో ఉన్నవాడు శతవలి.

"రాజా! వానర వీరులు కోటాను కోట్లతో నిండి ఉన్నారు. కొండలని పిండి చేసేవాళ్ళూ, మదపుటేనుగులతో సమానమైనవారూ, వేగవంతులు, కోతులు, వారంతా లంకా నగరం వైపు ఆశగా చూస్తున్నారు.

"ప్రజ్వలించుతున్న గ్రహములతో సమానమైన వానరసేనను చూసి, రాక్షసులకు జయము కలుగునట్టు చేసి, పరుల నుండి పరాభవం కలుగుకుండా చేయవలెను" చెప్పాడు సారణుడు.

లంకేశ్వరుడైన రావణబ్రహ్మకు నమస్కరించి శుకుడు తన వంతుగా చెప్పాడు.

"రాజా! వీరంతా దేవతలకీ, గంధర్వులకీ పుట్టినవారు. మహాశక్తితోనూ, గమన వేగంతోనూ ఉన్నవారు. కొందరు కామరూపులు కూడా ఉన్నారు.

ఇరవై కోట్లమంది వానరులు, వెయ్యి శంకువుల వానరులు, నూరు బృందముల వానరులున్నారు.

"ఎంతో అందంగా పురివిప్పిన నెమలి అందంతో పోటిపడే వాడే మైదుడు, రెండోవాడు ద్వివిదుడు. అమృతాన్ని సేవించినవారు. వాళ్ళి జయంచుట అసాధ్యం. యుద్ధంలో వాళ్ళతో సమానులు లేరు.

"వారికి ఇరువైపుల ఉన్న ఇద్దరూ యముడి పుత్రులు. ప్రభూ! వీరు పదికోట్ల సైన్యంతో వచ్చారు.

"అదిగో అక్కడ ప్రభూ! మహా తేజస్సుతో ఉన్నాడే... అతనే హనుమ. వాయుపుత్రుడు. లంకను కిష్కింధను చేసిన కోతి. మహాబలశాలి. కామరూపుడు. పసితనాన మూడువేల యోజనములు ఎగిరి సూర్యున్ని దరిచేరి సూర్యోదయ పర్వతంపై పడిపోయినవాడు.

"అన్నింటికీ మించి శ్రీరామభక్తుడు. రాముడే అతని శ్వాస. శ్రీరాముడి మాటంటే బ్రహ్మవాక్కే. ఈ సృష్టిలోనే హనుమంతుడి వంటి సేవకుడు లేడు. అట్టి శ్రీరామ సేవకు నూరు యోజనాలు ఎగిరొచ్చి, సీత జాడ తెలుసుకొని శ్రీరామునకు చెప్పినవాడే హనుమ.

"అదిగో... శ్రీరాముడు. ఇక్ష్వాకువంశ తిలకుడు. అతిరథుడు. రఘురాముడు. శత్రువుని కూడా క్షమించే హృదయం కలవాడు. బాణములచే ఆకాశాన్ని బద్దలు కొట్టగలవాడు. బ్రహ్మాస్త్రాలు అతని అక్షయ తూణీరంలో ఉంటాయి. అతని క్రోధము మృత్యువు వంటిది. పరాక్రమం ఇంద్రునికి మించినది.

"కనుసైగతోనే పంచభూతాలను ఆజ్ఞాపిస్తాడు. కనులెర్ర చేస్తే సముద్రుడు కూడా శరణాగతి పాలవ్వక తప్పదు. దేవేంద్రుడు కూడా అధర్మం చేస్తే బాణాన్ని సంధించే ధర్మపరుడు. ప్రభూ రావణా! అట్టి జగదేకవీరుని భార్యని, సీతాదేవిని నీవు చెరపట్టి తెచ్చింది."

రావణుడకు దూరం నుంచి కానవస్తున్నారు కానీ, స్పష్టతలేదు. వానర సైన్యంతో నిండిపోవటంతో ఇసుక వేస్తే రాలనంతగా ఉంది సముద్ర తీరం.

"శ్రీరామ చంద్రుడికి ప్రక్కనున్నదే లక్ష్మణుడు. అన్న మీద ప్రేమతో అడవులకి వచ్చాడు. నీతిజ్ఞుడు, యుద్ధకుశలుడు. కోపిష్టి. శ్రీరాముడికి బహిప్రాణం. సకల శాస్త్రాలూ, శస్త్రాలూ తెలుసు. అతని అక్షయ తూణీరం నుంచి బాణాలు కుప్పలు కుప్పలుగా వస్తాయి. తేనెతుట్టె కదిలి కందిరీగలు కమ్ముకున్నట్టుగా అతను బాణలు వెయ్యగలడు.

"అదిగో ఆ ప్రక్కనున్నది విభీషణుడు. తనతో పాటు తీసుకెళ్ళిన మంత్రులు. శత్రువు పక్షం చేరిన బంధువు. విభీషణుడ్ని లంకాధిపతిగా పట్టాభిషేకం చేశాడు శ్రీరాముడు.

"మహావానరులందరికీ ఆజ్ఞలు ఇస్తున్న అతడు సుగ్రీవుడు. సుగ్రీవుడు వానరవంశంలోనే మహా తేజోవంతుడు. హిమ పర్వతమంతటి శక్తి కలవాడు. భూమి మొత్తాన్నీ ఎగిరినవాడు. ఎరిగినవాడు.

"అదిగో ప్రభూ! సుగ్రీవుని మెడలోని కాంచనమాల. మహాశోభతో బంగారు, వజ్ర శిఖరంలా మెరిసిపోతోంది. లక్ష్మీప్రదమైనది. నూరు కమలాలు కలది.

"వాలిని చంపి, అతని రాజ్యాన్ని, కాంచన మాలనూ, వాలి భార్య తారనూ, ఆ మహావానర రాజ్యాన్ని సుగ్రీవునకు కట్టబెట్టింది శ్రీరాముడే. ప్రభూ! రావణా! కాంచనమాల ధరించిన వాడికి అపజయము లేదు.

"ఓ రాజా! ఈ మహావానర సైన్యాన్నీ, శక్తి యుక్తులనూ తెలుసుకున్నావు. ఇంతకు మించిన శక్తులతోనూ, సైన్యంతోనూ శ్రీరాముడి మీదకు పోవలెను" చెప్పాడు శుకుడు.

శుకుడు చెప్పినదంతా సావధానంగా విన్నాడు రావణుడు. కఠినమైన వాక్కులతో చెప్పాడు.

"ఓయీ శుకుడా! నిగ్రహానుగ్రహ సమర్థుడైన రాజు వద్ద మాట్లాడుట కూడా తెలీదా! శత్రువు గూర్చి వివరిస్తున్నావా? స్తోత్రం చేస్తున్నావా? ఎంతో మంది గురువులనూ, జ్ఞానులనూ, పండితులనూ సేవించి తెలుసుకున్నది ఇదేనా? నీతి శాస్త్రము వంటబట్టినట్టు లేదు.

"రాజాశ్రయంతో బ్రతుకుతున్న మీరు రాజు నొచ్చుకునేలా మాట్లాడ వచ్చా? చిలుకలా జ్ఞానాన్ని వల్లించి ప్రయోజనం ఏమున్నది. శత్రు పక్షం వీరత్వాన్ని పొగుడుతున్న మిమ్మలను ఏం చేసినా పాపం లేదు. ఇంతటి మూర్ఖులతోనా నేను పాలన చేస్తున్నాను. ఇట్టి వారిని చుట్టూ ఉంచుకోబట్టే లంకకు ఈ స్థితి వచ్చింది.

"అడవి చెట్ల దావాగ్ని నుంచి తప్పించుకోగలవేమోగానీ, రాజు కోపానికి గురైనవాడు బ్రతికి ఉండుట ఉత్తది.

"మిమ్ము చంపుటకు మనసు రావుటలేదు. మీ వంటి వారి మొహం చూడకపోవటమే మీకు మహాదండన. నా ముందు నుంచి పొండి" అరిచాడు రావణుడు.

రావణుడికి స్తోత్రం చేసి వారు వెళ్ళారు. మహోదరుణ్ణి పిలిచాడు.

"చురుకైన, వేగులవాండ్లను రమ్మను" చెప్పాడు. క్షణాల మీద వచ్చి రావణుడి ముందు నిలుచున్నారు.

"రాజా! శార్దూలుడూ, ఈ గూఢచారులు ఉత్తములు. రాజభక్తి కలవారు. శత్రువులంటే భయపడని వారు" చెప్పాడు మహోదరుడు.

"రాముడి వానరసైన్యంలో ప్రవేశించి కలిసిపోండి. ఆజ్ఞలనూ, ఆచరణాలనూ క్షుణ్ణంగా పరిశీలించండి. బలమూ, బలహీనతలూ, తెలుసుకోండి. శ్రీరాముడి ప్రతి చర్య కనిపెట్టండి" చెప్పాడు రావణుడు.

చారులు రావణుడి ఆజ్ఞపై సువేల పర్వతం పైనున్న సుగ్రీవ, విభీషణలతో కలిసి ఉన్న రామలక్ష్మణులను చూశారు. వానరసైన్యంలో కలిశారు. విభీషణుడు వార్ని కనుగొని శ్రీరాముడి ముందు శార్దూలుణ్ణీ, గూఢచారులనూ పెట్టాడు. శ్రీరాముడు విడిచిపెట్టమని చెప్పాడు.

శార్దూలుణ్ణీ, మిగతా గూఢచారులనీ శ్రీరాముడు వానరుల నుంచి విడిపించాడు. అనేక దెబ్బలతో ప్రాణాలరచేతిలో పెట్టుకొని రావణుడి ముందు వాలారు.

★★★ ★★★ ★★★

"రాజా! మీ ఆనతి ప్రకారము వానరసైన్యంలో కలిసాము. మంచీ, చెడ్డా బేరీజు వేస్తున్నాము. విభీషణుడు కనుగొని వానరులకు అప్ప చెప్పాడు. వారు మమ్ము చిత్రహింసలు చేశారు. రాముడి ఆజ్ఞతో విడిచారు.





"రాజా! శ్రీరాముడు మహాసముద్రంలో రాళ్ళు వేసి సేతువు కట్టాడు. సువేల పర్వతంపై రణానికి సిద్ధంగా ఉన్నాడు. సైన్యం మొత్తాన్నీ గరుడాకారంలో ఉంచాడు. సీతని ఇచ్చుట లేదా యుద్ధము. రెంటిలో ఒకటే దారి.

"గూఢచారుల్లో శ్రేష్ఠుడైన శార్దూలా! శ్రీరాముడి సైన్యంలో మహాబల పరాక్రములు ఉన్నవారి గూర్చి చెప్పు" అడిగాడు రావణుడు.

"ఋక్షరజస్సు పుత్రుడు వానరరాజు సుగ్రీవుడు. వాలితో సమానమైన ధీరుడు. అట్లే జాంబవంతుడు... గద్గదుని పుత్రుడు మహా విష్ణువు వామనావతారం ఎత్తినప్పుడు ప్రదక్షిణం చేసిన శక్తివంతుడు.

"గద్గదుని మరో పుత్రుడు ధూమ్రుడూ, యమధర్మరాజు పుత్రుడు సుషేణుడూ, చంద్రుని కుమారుడు దధిముఖుడు ఉన్నారు.

"లంకకు వచ్చి సర్వమూ బూడిద చేసినవాడు హనుమంతుడు. వాడి తండ్రి కేసరి. ఆ కేసరి గురువు బృహస్పతి.

"సుముఖుడూ, దుర్ముఖుడూ, వేగదర్శీ అనే ఆ ముగ్గురనూ మృత్యుదేవతలతో సమానంగా సృష్టించాడు బ్రహ్మ.

"ఇంకా నీలుడు అగ్నిహోత్రానికి జన్మించిన వాడు. వాలికి జన్మించినవాడు అంగదుడు, వీరులైన గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, వరభుడూ, గంధమాదనుడూ యముడికి పుట్టారు. మైంద, ద్వివిదులు అశ్వినీ దేవతలకు జన్మించారు.

"నలుడు విశ్వకర్మకు జన్మించాడు. రాజా! వారంతా వాలి జన్మకు కారణమైన వారికంటే వీరులు. ఇక సుందరకారుడైన శ్రీరాముడు తమ్ముడు లక్ష్మణుడు విల్లు పట్టుకుంటే అగ్నిశిఖలా మారిపోతాడు. మదపుటేనుగులనైనా వధించగల వీరుడని వానరసైన్యంలో చెప్పుకుంటుండగా విని ఉన్నాను.

"దేవతలకూ, గంధర్వులకూ, యక్షులకూ, కిన్నెరలకూ జన్మించినవారు అంతా. కోటాను కోట్ల మంది ఉన్నారు.

"ఇక శ్రీరాముడు మృదుస్వభావి. ఆవేశం ఇసుమంతా కూడా లేనివాడు. రఘురాముడి గుణాలు భూమి మీద మరెవ్వరికీ లేవు. సింహం లాంటి కళ్ళు. ఖరుడ్నీ, దూషణుడ్నీ, త్రిశురుణ్ణీ, విరాధుణ్ణీ, కబంధుణ్ణీ, పద్నాలుగు వేలమంది రాక్షసులనూ సంహరించిన రాముడి అక్షయ తూణీరంలో చూచుటకు కొన్ని బాణాలే ఉంటాయి. తీస్తున్న కొద్దీ కోటాను కోట్లు ఉద్భవిస్తాయట.

"సూర్య కుమారులు శ్వేత, జ్యోతిర్ముఖులు, వరుణ కుమారులు హేమకూటుడు ఇలా దేవతల పుత్రులంతా ఉన్నారు. కోటాను కోట్ల వానరులూ, భల్లూకాలూ ఉన్నారు. కాన ప్రభూ! సువేల పర్వత మీదున్న వానర సేన, ముఖ్యనాయకుల వివరాలు ఇవి. మా ధర్మం పూర్తి చేశామని భావిస్తున్నాము" చెప్పారు.

## మాయా శిరస్సు

రావణుడు దూతలను పంపించాడు. దీర్ఘంగా ఆలోచించాడు. అమిత శక్తితో ఉన్న శ్రీరాముడ్ని గెలవాలంటే తొలుత సీతను గెలవాలి. గెలిచిన సీతను చూపించి శ్రీరాముడ్ని అచేతునుడ్ని చెయ్యాలి.

రావణుడు అనుకున్నదే తడువు. మహామాయావి విద్యుజ్జిహ్వుని పిలిచాడు.

"సీతాదేవిని మాయ చెయ్యాలి. మన వశం చేసుకోవాలి. నీ మాయా విద్యతో శ్రీరాముడిని పోలివున్న శిరస్సూ, ధనుస్సూ, బాణాలూ సిద్ధం చేయి" ఆజ్ఞాపించాడు రావణుడు.

రావణుడు సీతాదేవి ఉన్న అశోకవనాన్ని చేరాడు. శ్రీరాముని ధ్యానముతోనూ, తీపి గుర్తులతోనూ ఉన్న సీత ఉలిక్కిపడింది.

"సీతా! ఇక నీ మౌనం విడు. వస్తాడు. రక్షిస్తాడు. అన్న నీ నాథుడు ఇక రాడు. నీ ఆశలనూ, నీ నమ్మకాన్నీ వమ్ము చేసి నా చేతిలో మరణించినాడు. వీరాధివీరులను చంపిన నీ శ్రీరాముడు నా రాక్షసవీరుల చేతిలో గుదియ పోటుతో తనువు చాలించినాడు.

"సీతా! ఇక నీవు శ్రీరాముని కోసం ఏడ్చుట వృథా. పోయిన భర్త గూర్చి నీ వెంత ఏడ్చిననూ, మరెంత ప్రార్థించిననూ జీవించి రాలేడు. వృత్రాసురుణ్ణి దేవతలు సంహరించినట్టు సంహరించారు రాక్షస వీరులు.

"కళ్యాణీ! సుగ్రీవుడితో వానర సైన్యంతో తరలి వచ్చాడు. వేగులవాండ్లు ముందే చేరవేశారు. రాక్షస సేనాధిపతి ప్రహస్తుడు అపార సైన్యంతో ఆయుధాలతో వెళ్ళాడు.

"పట్టిసాలూ, చక్రాలూ, కత్తులూ, ముద్గరాలూ, తోమరాలూ ఒక్కటేమిటి దొరికిన ఆయుధాలతో వానరసేనను కుళ్ళబొడిచారు. దాడి ఊహించని నీ రాముడు నిదురిస్తున్నాడు.





"ప్రహస్తుడు తన గండ్ర గొడ్డలితో నరికాడు. శరీరం రెండు ముక్కలైంది. ఇదిగో చూడు" అని అనుచరుడికి ఆజ్ఞాపించాడు. సీత గుండెలదరి పోయాయి. భయవిహ్వలంగా తిరిగింది. శ్రీరాముడి తల... తననే దీనంగా చూస్తూ... ఆ బాణాలూ, ధనుస్సూ శ్రీరాముడివే....

"మంగళప్రదురాలైన సీతా! సుగ్రీవుడు పారిపోయాడు. హనుమంతుడి ముఖం చితక్కొట్టారు. జాంబవంతుడి నడ్డి విరిచారు. వారే అలా అయితే మిగతావారి గూర్చి చెప్పేదేముంది. మహాసింహాలు తరిమితే ఏనుగుల మంద ఏమవుతుంది.

"సీతా! జరిగిందేదో జరిగింది. మర్చిపో. నే ఉన్నాను. ఇకనైనా నన్ను చేరు. లంకకు రాణివికా....నా భార్యలపై ఆధిపత్యాన్ని పొందు."

సీతాదేవి నివ్వెరపోయింది. లేడి పిల్లలా అరిచింది. సీతాదేవి కనుల నుంచి కన్నీరు పల్లంలోకి పారే నీటిలా ప్రవహిస్తోంది.

"రామా! ఇందుకోసమా నేను బ్రతికి ఉన్నది. సుగుణాలు లేని స్త్రీ భర్త ముందే పోతాడని లోకప్రతీతి. నేనేమి అపచారం చేశాను. శ్రీరామా! అరటి చెట్టు వలే సాధారణ వ్యక్తి వలే ఎలా మరణించావు.

"ఇక్ష్వాకు వంశకీర్తి ఏమౌతుంది? శ్రీరామా! ధర్మపరులూ, జ్యోతిష్యాదులూ పరి పూర్ణ ఆయుష్ష కలవాడవి చెప్పారే. వారి మాటలు బూటకమా. శాస్త్రం బూటకమా!

"కమలలోచనా! పురుషపుంగవా! నీ కోసం నేలను కౌగిలించుకొని వేడుకొని నిరీక్షించాను. అందులకు ఇదేనా ప్రతిఫలం" సీత జాముహుర్త సేపటికి తెప్పరిల్లింది.

"రాక్షసరాజా! శ్రీరాముడి వీడి నేను జీవించజాలను. నన్ను ఖండించు. అడవికి వెళ్తున్న నా భర్తను అనుసరించినట్టు, పుణ్యలోకాలకి వెళుతున్న నా రాముడ్ని అనుసరిస్తాను. దయతో ఈ పని చేయుము" వేడుకుంది.

అంతలో ద్వారపాలకుడు వచ్చాడు.

"ప్రభూ! ప్రహస్తుడు అత్యవసర రాచకార్యంకై తమ కోసం వేచి ఉన్నాడు. ఎంతో ముఖ్యమైన పని అట. క్షమించవలెనని చెప్పి మనవి చెయ్యమన్నాడు." చెప్పాడు.

రావణుడు హుటాహుటిన వెళ్ళాడు తన మందిరానికి.

ప్రహస్తుడు చెప్పింది విని ఆజ్ఞాపించాడు.

"సర్వవేళలా సిద్ధంగా ఉండండి. మహావీరులను కవచాలు ధరించమని చెప్పండి. సైన్యాలను ఆయుధాలతో సిద్ధమవ్వమని చెప్పండి. దృఢ దండనముతో మహాభేరిని మ్రోగించండి."

## విభీషణుడి భార్య ఊరడింపు

రావణుడు వెళ్ళిపోగానే వైదేహి దుఃఖంతో స్పృహ తప్పిపోయింది. రావణుడు వెళ్ళగానే మహాత్ముడైన విభీషణుడి భార్య సఖురాలైన సరమ చప్పున సీతాదేవి వద్దకు వెళ్ళింది. దుమ్ము కొట్టుకుపోయి, అలసిపోయి నేల మీద వాలిపోయిన ఆడ గుర్రంలా ఉన్న వైదేహిని లేపింది.

"ఉత్తమవ్రతము గల కళ్యాణీ! ఊరడిల్లు... రావణుడు మోసకారి. అబద్ధాల కోరు. నేను అంతయూ ఆ చెట్టు చాటునుంచి విని ఉన్నాను. శ్రీరాముడు సువేల పర్వతంపై క్షేమంగా ఉన్నాడు.

"ఒక కోతి వస్తేనే లంకలో ఇంతచేసి వెళ్ళాడే. అట్లాంటిది అన్ని కోతులొచ్చాయంటే, లంకేశ్వరుడు రావణుడు కూడా భయపడుతున్నాడు. గాంభీర్యం నటిస్తున్నాడు.

"శ్రీరాముడు మహావీరుడు. ఆజానుబాహుడు. నీతి శాస్త్రము తెలిసిన శ్రీరాముడు యుద్ధరంగాన నిద్రిస్తాడా?

"జగతిలోనే పరాక్రమవంతుడు. ప్రసిద్ధమైన బుద్ధి గలవాడు. మహాసముద్రం పైనే సేతువు నిర్మించాడు. సముద్రంలో ఇసుకంత మంది ఉన్న వానరుల మధ్య ప్రహస్తుడు వెళ్ళేపాటివాడా.

"శ్రీరాముణ్ని సంహరిస్తుంటే లక్ష్మణుడు పారిపోయాడా... పిచ్చి రావణుడు లక్ష్మణుడి, హనుమంతుడి భక్తి తెలియక ఏదో చెప్పాడు. భయంతో దిక్కుతోచక తనని శరణ వేడుతావని రావణుడి దుష్ట ఆలోచన.

"సీతా! నీ రాముడు జగమెరిగిన వీరుడు. విశాలమైన రొమ్ముతో తనవాళ్ళ పాలిట కల్పవృక్షము. శత్రువుల పాలిట అగ్ని దండం.

"అదిగో విను, వినపడుతున్నాయా... మహా భేరీలు మహా మేఘాలు ఉరిమినట్టు. ఆకాశంలో దూరంగా మేఘాలు చూడు. మహాయుద్ధానికి తరలివస్తున్న దేవతల్లా ఉన్నారు. సిద్ధుల్లా ఉన్నారు.

"రావణుడి పాపం పండింది. అయినవాణ్ని, నా భర్త విభీషణుణ్ని కూడా వెళ్ళగొట్టాడు. నా భర్త ద్వారా విని, తెలుసుకొని చెపుతున్నాను. సీతా





రాక్షసులందరి ఆయువు మూడింది. వీరాధివీరుడూ, ధర్మపరుడూ అయిన శ్రీరాముడు రావణుణ్ని సంహరించి నీకీ చెర విడిపిస్తాడు తల్లీ.

"శ్రీరాముణ్ని చూస్తావు. నీ లేడి కళ్ళు ఆనందంతో మెరిసిపోతాయి. విష్ణుమూర్తి ప్రక్కనే దేవేంద్రుడున్నట్టు, నీ భర్తనూ, లక్ష్మణుడినీ చూస్తావు. ఆ మహావీరుడి వక్షస్థలంలో నీవు సేద తీరుతావు.

"వర్షానికి పైరు ఆనందించినట్టు ఊహింపశక్యముగాని బలపౌరుషములు గలవాడు అయిన శ్రీరాముణ్ని చూసి మైమరచిపోతావు. అయోధ్యలో చిరకాలం సుఖంగా సుఖాలను అనుభవిస్తావు.

"మేరు పర్వతం చుట్టూ తిరిగే ఆ సూర్యభగవానుడి సాక్షిగా... ఆ కాంతినిచ్చే భాస్కరుని సాక్షిగా శ్రీరాముడు వస్తాడు. కళ్యాణీ! పది మాసాల నుంచి నీ జఘనాల వరకూ జడకట్టుకుపోయిన నీ తల వెంట్రుకల చిక్కుముడులు విడిపోతాయి.

"శ్రీరాముడు వానర సైన్యంతో సముద్రమును దాటి, సముద్ర దక్షిణ తీరంలో విడిది చేశాడు" చెప్పింది మృదుభాషిణి, స్నేహలత అయిన విభీషణుడి ధర్మపత్ని సరమ.

సూర్యుని ప్రతాపానికి వేడెక్కిన భూమి మహావర్షానికి చల్లదైనట్టు సీతాదేవి ఊరడిల్లింది.

"వైదేహీ! నీవు దశరథ మహారాజు కోడలివి. జనకరాజు పుత్రివి. మంచి వంశంలో జన్మించావు. మరెంతో మంచి వంశానికి కోడలవయ్యావు. నేను రాక్షస స్త్రీను. రాక్షసుల బుద్ధే అంత. మోసం, అబద్ధం, అధర్మం అని నీవు అనుమానిస్తే చెప్పు.

"మహావాయు గమన విద్య నాకు తెలుసు. క్షణకాలంలో నిన్ను కమల పత్రము వంటి నేత్రములు గల శ్రీరాముడి వద్దకు తీసుకెళ్ళి, మరుక్షణంలో తీసుకువస్తాను. నీ రాముని వక్షస్థలము మీద ఆనందాశ్రువులను చిందించేలా చేస్తాను" చెప్పింది.

పద్మములు లేని లక్ష్మీదేవి వలే ఉన్న సీతాదేవి సరమతో చెప్పింది.

"మనోహరమైన నీ పలుకులతో నేను సేద తీరాను. దాహంతో ఎండిపోతున్న వాడికి మహానది కనిపించినట్టు నీవు కనిపించావు. నీ వాయు గమన విద్యతో నేను శ్రీరాముడి వద్దకు వెళ్ళుట ఆ వీరాధి వీరునకు పరువు

కాదు... ఆ రావణుడు మరల ఏ మాయోపాయము చేయబోతున్నాడో. నన్ను ఎంత వేదనకు గురి చెయ్యబోతున్నాడో తెలుసుకొనవలెనని ఉంది. దుష్ట రావణుడు ఏ కుతంత్రం పన్నుతున్నాడో తెలుసుకు రావలెను" అడిగింది.

స్నేహాతిశయంతో సరమ తన విద్యతో రావణుడి మంత్రాంగ మందిరానికి వెళ్ళింది.

అంతా విన్నది. మళ్ళీ సీత దగ్గరికొచ్చింది. సరమని ఆత్మీయంగా పలకరించి తన ప్రక్కన కూర్చోమంది.

"కళ్యాణీ! రావణుడు తన మంత్రులతోనూ, హితులతోనూ అతని తల్లి కేకసితోనూ మంత్రాగం చేస్తున్నాడు. రావణుడి తల్లి కేకసి ఎన్నో విధాలుగా కొడుక్కి నచ్చచెపుతోంది. సీతమ్మని సగౌర్వంగా ఇచ్చి శ్రీరాముడితో సంధి చేసుకోమని...

"అట్లే జన స్థానంలో రాక్షసుల వినాశనమూ, లంకిణీ హతమూ, హనుమ చేసిన మహానష్టమూ మంత్రులూ వివరించారు.

"లోభి తను అనుభవించలేనిది, తనది కానిది అయిన ధనాన్ని వదలనట్టు రావణుడు కైలాసనాథుడే వచ్చి చెప్పినా విడవనంటున్నాడు.

"సీతా! ఎవరు ఎన్ని చెప్పినా వినని రావణుడి కంఠంలో కణుపులతో ఉన్న రామబాణం దిగుట తథ్యం. మరణించే వాడికి పథ్యం నచ్చనట్టు ప్రియాలు రావణుడికి మింగుట పడుటలేదు" చెప్పింది సరమ. ఈలోగా భూమి కంపించినట్టు మహాధ్వనులూ, భేరీనాదాలు వినిపించాయి.

## మాల్యవంతుడి సద్బోధ

శంఖాలూ, భేరీలూ లంక అదిరేలా మ్రోగిస్తూ లంకాపట్టణం మీదకి దండెత్తింది వానర సైన్యం. రావణుడు కోపితుడైపొయ్యాడు.

"మీరంతా వీరులూ, శూరులూ, మహా యుద్ధప్రియులు. అయినా రాముడు సేతువు కట్టాడు. సముద్రం దాటి వచ్చాడు. ఏం చేస్తున్నారు మీరంతా?" రాక్షసేశ్వరుడైన రావణుడు మంత్రులపై నిప్పులు కురిపించాడు.

అప్పుడు లంకేశ్వరుడి పినతండ్రి మాల్యవంతుడు కలగచేసుకున్నాడు.

"రాజా! నీవు మహా ప్రాజ్ఞుడవు. అన్వీక్షకీ త్రయీ, వార్తా, దండనీతి. ఆ నీతి శాస్త్రాల ప్రకారం రాజు నడుచుకున్ననాడు, రాజ్యమూ, ప్రజలూ, ధనాగారమూ, మిత్రులూ సుఖిస్తారు. శత్రువులనీ జయిస్తారు.





"దేవతలూ, సిద్ధులూ, యక్షులూ, గంధర్వులూ అంతా శ్రీరాముడి పక్షానే ఉన్నారు. రావణా! నీవు అధర్మం వైపు ఉన్నావు. ధర్మం వైపు శ్రీరాముడున్నాడు. అందులకే అతనికి బలమెక్కువ.

"తాపసులనూ, స్త్రీలనూ, బలహీనులనూ ఎవ్వరినీ నీవు వదిలి పెట్టలేదు. కొట్టావు, అనుభవించావు. దాసులుగా చేసుకున్నావు. దేవదానవుల చేత మరణంలేని వరాలు పొందావు. మనుష్యులను తేలికగా తీసుకున్నావు. చూడపోతే అదే లంక కొంప ముంచేలా ఉంది.

"ఎండాకాలం మేఘాల్లా, రాక్షసులు కనిపించకుండా పోయే ప్రమాదాన్ని నీవే నివారించాలి. ఇన్ని అనార్థలకీ కారణం నీ స్త్రీ వ్యామోహం. సీతాదేవిని శ్రీరాముడికి అప్పగించు.

"లంకలో ఆడపడుచుల మాంగళ్యాలు సాగిపోతున్నాయి. జంతువులూ, పక్షులూ కన్నీరు కారుస్తున్నాయి. ఉన్నట్టుండి లంకలో రక్త వర్షాలు కురుస్తున్నాయి. పిల్లులు పులులతో కలిసి ఆడుకుంటున్నాయి. ఎర్ర కాళ్ళ తెల్ల పావురాళ్ళు లంక నాశనం సూచిస్తూ మృత్యు దిక్కులు చూపిస్తున్నాయి. సూర్యుడి వైపు చూసి ఏడుస్తున్నాయి. గజాశ్వాది వాహనములు రోదిస్తున్నాయి.

"కోతులూ, భల్లూకలూ సింహనాదాలు చేస్తున్నాయి. రాక్షస స్త్రీలు భయపడుతున్నారు. శ్రీరాముడిని సాక్ష్యాత్తు శ్రీ మహావిష్ణువుగా చెప్పుకుంటున్నారు. మహా మృత్యువు శ్రీరాముని రూపం ధరించి తమపైకి వస్తున్నదని ఆందోళన చెందుతున్నారు.

"ఈ ఉత్పాతాలన్నీ నీవూ చూస్తున్నావుగా రావణా! సమయానుకూలంగా ప్రవర్తించటం రాజ ధర్మంలో భాగం" చెప్పాడు ఉత్తమోత్తముడైన మాల్యవంతుడు.

రావణుడు అగ్నికి ఆజ్యం పోసినట్టు మండిపడ్డాడు. ముఖవర్ణాదులు భయంకరంగా మారిపోయాయి.

"ఓహో! శ్రీరాముడి గూర్చా నీవు చెప్పునది. తండ్రి వెళ్ళగొడితే అడవిపాలైన మనిషి... భార్యని స్వంతంగా తెచ్చుకొలేక వానరుల సాయం అడిగిన మానవుడు శ్రీరాముడు నన్ను జయించగలడా!

"మాల్యవంతా! ఒక మనిషికి భయపడి సీతని అప్పగిస్తే ముల్లోకాలు నన్నెంతో అవహేళనకి గురిచేస్తాయి. సూర్యచంద్రులు నా మాట వింటారా? లంకలో పండితులు సైతం స్తోత్రం చేస్తారా?

"శ్రీరాముడు సముద్రం దాటాడు. తిరిగి వెళ్ళడు. దంద్వయుద్ధంలో గానీ, మాయా యుద్ధంలో గానీ, ఎందులోనైనా లోకైకవీరుడిని. నా సహజ స్వభావమే నన్నీ స్థితికి తెచ్చినది. దాన్ని ఎలా వదులుకోగలను. అంతకన్నా మరణమే కీర్తి... శ్రీరాముడిపై యుద్ధం తప్పదు. వానర సైన్యం సమస్తం రాక్షసుల చేతిలో బలవ్వటం తథ్యం" చెప్పాడు రావణుడు.

మాల్యవంతుడు తలవంచుకున్నాడు. రావణుడు మంత్రులకి ఆజ్ఞాపించాడు. లంకాపట్టణానికి నలు వైపులా రక్షణవలయాల్ని కట్టుదిట్టం చేశారు.

తూర్పు ద్వారం వద్ద ప్రహస్తుడునీ, దక్షిణ ద్వారం వద్ద మహాపార్శ్వుడునీ, మహోదరుడునీ ఉంచాడు. పడమరవైపు మహామాయావి ఇంద్రజిత్తుని నియమించాడు.

ఉత్తర ద్వారంలో శుకసారణులని నియమించాడు. శుకసారణులతో మహాసైన్యముతో తాను అక్కడే ఉంటానని చెప్పాడు. మంత్రులంతా రావణుడి యుద్ధ తంత్రానికి అభినందించి స్తోత్రించారు.

రావణుడు తన అంతః పురానికి వెళ్ళాడు.

## ఇంటి గుట్టు

హనుమంతుడూ, సుగ్రీవుడూ, అంగదుడూ, విభీషణుడూ, శరభుడూ, సుషేణుడూ, మైందుడూ, ద్వివిదుడూ, గజుడూ, గవాక్షుడూ, కుముదుడూ, నలుడూ, పనసుడూ, వానర వీరులంతా శ్రీరామునితోనూ, లక్ష్మణుడితోనూ కూడి ఉన్నారు. శ్రీమంతుడు విభీషణుడు చెప్పాడు.

"ప్రభూ! శ్రీరామా! దేవతలు సైతం తేరిపారా చూడటానికి సాహసించలేని లంకాపట్టణంలోనికి కామరూపులైన నా మంత్రులైన అనలుడూ, సంపాతీ, పనసుడూ, ప్రమతీ పక్షిరూపాల్లో వెళ్ళి వచ్చారు. రావణుడి బలమూ, బలగమూ గూర్చి తెలుసుకున్నారు.

"రఘువీరా! లంక నలువైపులా ప్రహస్తుడూ, మహాప్వారుడూ, మహోదరుడూ, ఇంద్రజిత్తులతో రక్షణ వలయాన్ని ఏర్పాటు చేశాడు. ఉత్తర ద్వారం వద్ద శుకసారణులతో తానే స్వయంగా ఉన్నాడు.

"మహాఆయుధాలైన శూలాలూ, పట్టసాలూ, ఇనుప గుదియులతో విరూపాక్షుడు సేనా మధ్యమున నడి ఒడ్డున ఉన్నాడు.





"కమలపత్రాక్షా శ్రీరామా! రావణుడు కుబేరునితో యుద్ధానికి వెళ్ళినప్పుడు పది లక్షల మంది మహాయోధులతో వెళ్ళాడు. వారంతా పరాక్రమంలోనూ, యుద్ధంలోనూ వారికి వారే సరిసాటి...

"ప్రభూ! రావణుడి శక్తీ, యుక్తీ, బలమూ నీకు తెలుపుటయే నా మాటల్లోని భావం. మొత్తం దేవతలూ, రాక్షసులూ ఓ ప్రక్క ఉన్నా జయించ గల వీరుడవు. ఈ మహాసేన నీ ఆజ్ఞకై ఎదురు చూస్తోంది" చెప్పాడు విభీషణుడు. శ్రీరాముడు సుగ్రీవుని వైపూ, వానరవీరుల వైపూ చూస్తూ చెప్పాడు.

"దైత్యులకూ, తాపసులకూ అపకారం చేసిన రావణుడు సంహరించ దగ్గవాడు. పాపాలు చేస్తూ సమస్త లోకాల శాంతికి భంగం కలిగించే రావణుడి చేష్టలే మృత్యుపాశాలై అతన్ని కబళించబోతున్నాయి.

"వానర వీరా నీలుడా! నీవు లంక తూర్పు ద్వారం వద్ద ప్రహస్తుడితో నీ సైన్యంతో సహా తరలి వెళ్ళి పోరాడు.

"వాలి పుత్రుడూ, కిష్కింధ యువరాజు అంగదుడు తన సేనతో కలిసి, మహోదరుడితోనూ, మహాపార్శ్వుడితోనూ దక్షిణ ద్వారం వద్ద యుద్ధం చేయాలి.

"వాయుపుత్రుడు హనుమంతుడు పడమర ద్వారం వద్దనున్న రాక్షస సైన్యాన్ని చెల్లాచెదురు చేయాలి. ఇక నేనూ, లక్ష్మణుడూ, క్షుద్రుడైన రావణుడున్న ఉత్తర ద్వారం వద్ద పోరాడుతాం. బలవంతుడైన వానరరాజు సుగ్రీవుడూ, జాంబవంతుడూ, విభీషణుడూ, తన సైన్యంతో ఆకాశ మార్గాన పోయి సేనా మధ్యనున్న విరూపాక్షుడి సేనతో పోరాడాలి.

"వానరవీరులారా! ఈ మహాయుద్ధంలో కామరూపులైన వానరవీరులు మనుష్యరూపం ధరించరాదు. అదియే మనకు ఆనవాలు. నలుడూ, అంగదుడూ, హనుమంతుడూ, సుగ్రీవుడూ, విభీషణుడూ అయిదుగురు మనుష్యరూపంలోనూ, వారి వారి సహజ రూపాల్లోనూ యుద్ధం చేస్తారు" చెప్పాడు శ్రీరాముడు.

## సువేల పర్వతం

"విభీషణా! మహాధాతువులతో ఉన్న సువేల పర్వత శిఖరం పైకి వెళదాం. లంకా పట్టణాన్ని సమూలంగా పరికిద్దాం" చెప్పాడు శ్రీరాముడు. శ్రీరామునితో అంతా సువేల పర్వత శిఖరాన్ని చేరారు.

త్రికూట పర్వతంపై ఉన్న లంకా పట్టణం దేదీప్యమానంగా వెలిగి పోతోంది. భవనాలతోనూ, ఉద్యాన వనాలతోనూ, విశాలమైన రాజ వీధుల తోనూ, బహురమ్యద్వారాలతోనూ మెరిసిపోతోంది. రాక్షసులతో నిండి ఉంది.

వానరవీరులు సింహనాదాలు చేశారు. రాత్రి అయింది. వెన్నెల వర్షం కురుస్తోంది. ఆ రాత్రి అంతా అక్కడే విశ్రమించారు. తెల్లవారింది. ఉదయపు సూర్య కిరణాల వెలుగులో లంకా నగరం బహు చక్కగా కానవచ్చింది.

ఎగుడు దిగుడులేని సమాంతార ప్రదేశము. వనాలూ, ఉద్యాన వనాలూ, సెలయేళ్ళూ, జలపాతాలూ, అనేక చెట్లూ, లతలూ, చిత్ర విచిత్రమైన రంగురంగుల పూలూ, నందనోద్యానవనమువలే, చైత్రవనమువలే తోచింది. తుమ్మెదలు మత్తెక్కి పాడుతున్నాయి. ఎంతో దూరంలో ఉన్నా కమ్మటి పూల ఘుమ ఘుమలూ, పండి మగ్గిన పండ్ల వాసనలూ వానరులకి తగిలాయి.

కోకిలలు కూ అంటున్నాయి. కాటుక పిట్టలూ, బెగ్గురు పక్షులూ, చెట్టా పట్టాలేసుకు తిరుగుతున్నాయి. సుగ్రీవుని ఆజ్ఞతో వానర వీరులు లంకకి పోయిరావుటకు ఎగిరారు.

మహాబలంతో వారు పర్వతాన్ని అదిమి పెట్టి ఎగిరిన ఎగురునకు పర్వత ధూళి పైకి లేచి ముహూర్తకాలం ఏమీ కనిపించలేదు. పక్షులూ, మృగాలూ కలవర చెంది దిక్కులు తెలియకుండా పరుగులు తీశాయి.

సువేల పర్వతం నుంచి రెండు యోజనాల దూరంలో ఉన్న రావణుడి రాజ ప్రాసాదాన్ని చూపించాడు సుగ్రీవుడు. త్రికూట పర్వతం శిఖరం మీద విశ్వకర్మ నిర్మించిన ఆ అద్భుత మహా నగరపు రాజ ప్రాసాదముపై రావణుడు కనిపించాడు.

తెల్లచామరలతో పరిచారికలు వీస్తున్నారు. జయ సూచికైన తెల్ల ఛత్రము పట్టారు. రక్త చందనాన్ని పూసుకొని ఉన్నాడు. రత్నాభరణాలతో నీలమేఘమువలె కనిపించాడు. బంగారు జరీ ఉత్తరీయమును ధరించిన రావణుడ్ని చూడగానే సుగ్రీవుడు కోపం ఆపుకోలేకపోయాడు.

ఒక్క ఉదుటున పైకి లేచాడు. రావణుడి ప్రాసాదపు శిఖరం మీదకి వెళ్ళాడు. రావణుడ్ని పై నుంచి క్రిందకి చూశాడు. లంక చుట్టూ మహా సముద్ర జలదుర్గం. దాటితే సువేల పర్వతం. అది దాటితే వన దుర్గం. వన దుర్గం దాటితే త్రికూట పర్వతం పై నున్న లంకానగరం.





"ఓయీ రావణా! నా పేరు సుగ్రీవుడు. శ్రీరామునికి ఆప్తుడనీ, సన్నిహితుడనీ, స్నేహితుడనీ" అని చెప్పి ఒక్క ఉదుటున రావణుడి కిరీటాన్ని ఎగర కొట్టాడు. నేలపాలు చేశాడు. వికటంగా నవ్వాడు.

రావణుడు మహోగ్రరూపం ధరించాడు.

"ఓరీ సుగ్రీవా! నీ తల ఇంత వరకు బాగుగానే ఉన్నది. ఇకపై నీకు ఆ తల ఉండదు. నా ముందు వచ్చు వరుకే సుగ్రీవుడవు. ఇకపై హీనగ్రీవుడవు" అంటూ సుగ్రీవుడి మీదకు వెళ్ళాడు.

మహా కొండలు పిండి అయ్యే పిడి గుద్దులను సుగ్రీవునికి రుచి చూపించాడు. మహావీరుడూ, బలవంతుడైన సుగ్రీవుడు మహాతుఫానుకి అల్లాడి పోయిన నౌకవలే అదిరిపోయాడు. రోషంతో రావణుడి మీద పడ్డాడు. ఇద్దరూ ద్వంద యుద్ధానికి దిగారు. ఒకరి మీద ఒకరు పిడి గుద్దులు గుద్దుకుంటున్నారు.

రెండు కొండలు పోరాడుతున్నట్టుగా ఉంది. మహా పర్వతాలు పోరాడుతుంటుంటే పెద్ద పెద్ద రాళ్ళు దొర్లినట్టు, వారి శరీరాల నుంచి స్వేద బిందువులు జారుతున్నాయి.

సింహమూ సింహమూ, ఏనుగూ ఏనుగూ పోరాడుతున్నట్టు మహా తొండాల్లాంటి చేతులతో ఒకరి గుండెల మీద మరొకరు చరుచుకుంటూ మల్ల యుద్ధం చేసుకున్నారు.

వంకర టింకరగా నడుస్తూ శత్రువుని దెబ్బ తీశాడు సుగ్రీవుడు. సవ్యాపసవ్యముగా తిరుగుతూ తన కాయాన్ని సంకోచింపచేసి, ఉన్నట్లుండి ఎగిరి శత్రువుకి సమాధానమిస్తున్నాడు రావణుడు. భక్ష్యము కొరకు పోరాడుకునే మహా జంతువుల్లా పోరాడుతున్నారు.

ఇద్దరూ మహా యుద్ధ వీరులు. వైష్ణవమూ, వైశాఖమూ, మండలమూ, ప్రత్యాలీఢమూ, ఆలీకమూ రకరకాల స్థానాలలో ఉండి పోరాడుతున్నారు. రావణుడు తన మహాశక్తితో సుగ్రీవుడిని అంతం చెయ్యాలని భావించాడు.

సుగ్రీవుడు రావణుడి అంతరంగం తెలుసుకున్నాడు. ద్వంద యుద్ధం వదలి తన వరాల శక్తి ప్రయోగిస్తున్నాడని తెలిసి చప్పున గెంతాడు. ఏ మాత్రం అలసట లేనట్టు ఎగిరి శ్రీరాముడి ముందు వాలాడు. రావణుడి చూపు పడనంత దూరం వెళ్ళిపోయాడు. శ్రీరామ సమూహము వద్దకు సుగ్రీవుడు అనేక గాయాలతో వచ్చి చేరాడు.

# అంగదుని రాయబారం

శ్రీరాముడు సుగ్రీవుడి ఒంటి మీద యుద్ధ గుర్తులు చూశాడు. వానరరాజును దగ్గరికి తీసుకున్నాడు.

“సుగ్రీవా! సాహసం అన్ని వేళలా ఆచరణీయం కాదు. అనాలోచితంగా ఆవేశంగా చేయుట యుద్ధనీతి కోవిదుడవై నీకు తెలియనిది కాదు. ఏదైనా అయితే యుద్ధంలో నేను జయించినా ఓడినట్టే.

“నీవు వీరుడవు. దేవేంద్రుడితోనైనా యుద్ధం చేయగలవాడవు. అయిననూ మేమంతా ఎంతో ఆందోళనకు గురి అయ్యాము. దుస్సాహసము తగదు.”

“ప్రభూ! శ్రీరామా! రావణుడు కనపడగానే కోపం ఆపుకోలేకపోయాను” చెప్పాడు మహాబాహువు సుగ్రీవుడు సంజాయిషీగా.

శోభాసంపన్నుడైన లక్ష్మణుడితో చెప్పాడు శ్రీరాముడు.

“లక్ష్మణా! నీరూ, పండ్లూ సమృద్ధిగా ఉన్న ఈ వనములోని మన సేనను వ్యూహాత్మకంగా తీర్చి దిద్దుకోవాలి. లక్ష్మణా! సూర్య మండలంలో నల్లటి మచ్చ కానవస్తోంది. మహా ప్రళయానికి నాంది.

“నక్కలు అమంగళంగా కూస్తున్నాయి. కాకులూ, డేగలూ, గ్రద్దలూ క్రింద ఎగురుతున్నాయి. నక్షత్రాలలో వెలుగు తగ్గినది. దుశ్శకున సముదాయములు లోకానికి ప్రళయ అర్థాలు శెలవిస్తున్నాయి. అవన్నీ రావణుడికి అశుభాలు” చెప్పాడు శ్రీరాముడు.

శ్రీరామ ఆదేశంతో మహా మహాబలవంతులైన వానరువీరులు నాలుగు ద్వారాల వైపుకి వెళ్ళారు. పెద్ద పులుల్లాంటి వానరులు యుద్ధ ఉత్సాహంతో దూసుకువెళ్ళారు. ఏనుగుల కంటే బలమైన వానరవీరులు లంకా పట్టణం నాలుగు ద్వారాల వద్దకు శ్రీరాముడు చెప్పిన విధంగా వెళ్ళారు. ఆ మహా వానర సేనలతో లంకా నగరం జల దుర్గంగా కాక వానర దుర్గంగా అగుపించింది.

శ్రీరాముడి ఆదేశం కోసం చూస్తున్నారు. ‘వూ’ అనటం ఆలస్యం సింహాల్లా దూకటానికి సన్నిద్ధులై ఉన్నారు. లక్ష్మణ విభీషణులు ద్వారం వద్ద కోటి వానరులతో సిద్ధంగా ఉన్నారు.

శ్రీరాముడు ముప్పది ఆరుకోట్ల వానర సైన్యంతో ఉన్న విభీషణుడ్ని సంప్రదించాడు.





“విభీషణా! రాజధర్మము, యుద్ధ ధర్మం ప్రకారము జనక్షయం జరగకుండా దూతను రాయబారం పంపుట ధర్మం” అని చెప్పి అంగదునితో చెప్పాడు.

“కిష్కింధ యువరాజా! అంగదా! నీవు ఆకాశ మార్గాన లంకాధిపతి రావణుడ్ని చేరాలి. మరణించాలన్న కోరికతో అయిన వార్నెందరినో ఇప్పటికే పొగొట్టుకున్నవాడూ, కామంతో నిండిపోయినవాడూ అయిన దశకంఠుడు రావణుని వద్దకు దూతగా వెళ్ళి రావలెను. దూత కార్యం నిర్వహించవలెను.

“రావణా! బ్రహ్మ ఇచ్చిన వరాలతో అకార్యాలన్నీ చేస్తున్నావు. రాక్షస హితంకోరే వాడివే అయితే సీతను సగౌర్వంగా అప్పగించు. శరణు వేడు. కాదంటే మదాంధుడివై మహా మునులనూ, దేవతలనూ, అనేక లోకాల వారినీ బాధ పెట్టిన పాపం నిన్ను వెంటాడక మానదు. సీతాదేవిని అప్పగిస్తే సరి. లేదంటే లంకనూ, నీ భార్యలనూ, హితులనూ కళ్ళారా తనవి తీరా చూసుకో. వ్యక్తిగత బలహీనతల కంటే, ధర్మ, అధర్మాలకంటే రాజుకు ప్రజాక్షేమమే ముఖ్యం.

“అంగదా! నా యీ పలుకులు రావణునకు చేరవేయి” చెప్పాడు శ్రీరాముడు. అంగదుడు ఆకాశ మార్గాన రావణుడి ముందు వాలాడు. మహామంత్రులతో ఉన్న రావణాసురుడు అంగదుడ్ని చూశాడు.

మండుతున్న అగ్నివలే ఉన్న అంగదుడు దూతగా తనని తాను పరిచయం చేసుకున్నాడు.

“ఓ అంగదా! నీవా! నీ తండ్రి వాలి నాకు మిత్రుడు. ఆ మానవుడి దాస్యం నీకేలయ్యా” అడిగాడు.

“రావణా! మిత్రభేద వాక్యాలు వినుటకు రాలేదు. నా రాముడు పంపిన సందేశాలు చెప్పుటకు వచ్చాను. శ్రీరాముడు చెప్పినట్టు ఉత్తమమైన శ్రీరామ సందేశాన్ని చెప్పింది చెప్పినట్లుగా చెబుతున్నాను” అని కోసలాధిపతియైన శ్రీరాముడు చెప్పినదంతా చెప్పాడు.

అంగదుడు చెప్పింది విని రావణుడు మండి పడ్డాడు. కోపంతో రుసరుసలాడాడు.

“ఈ బుద్ధిహీనుడిని పట్టుకొని చంపి పారేయండి” ఆజ్ఞాపించాడు. రాక్షసులు అంగదుని మీదకి వెళ్ళారు. నలుగురు రాక్షసులు పెడ రెక్కలు

విరిచి పట్టుకున్నారు. అప్పుడు ఎగిరాడు అంగదుడు. ఆ నలుగురి రాక్షసులతో ఎగిరి అంత ఎత్తునుంచి ఆ రాక్షసులని క్రిందకి తోశాడు.

ఆపై ప్రాసాద శిఖరం మీదకు వెళ్ళాడు. రావణుడు నిప్పులు కక్కేలా చూస్తూనే ఉన్నాడు. అంగదుడు తన బాహువులతో ప్రాసాదాన్ని ముక్కలు ముక్కలు చేశాడు. ప్రాసాదాన్ని అంగదుడు హిమవత్పర్వత శిఖరాన్ని వజ్రాయుధంతో కొట్టినట్టు కొట్టి శ్రీరాముడికి జయం పలికి ఎగిరి ఆకాశమార్గాన శ్రీరాముడ్ని చేరాడు. శ్రీరాముడికి తలవంచి నమస్కరించాడు.

వానరులు కోలాహలము చేశారు. ప్రళయకాల ఝంజామారుతులై వానరులంతా సంచరించారు. ప్రాసాదం విరగకొట్టడం అశుభంగా తలచాడు రావణుడు.

## యుద్ధం

మహారాక్షస వీరులు రావణుడి మందిరానికి వెళ్ళారు.

"మహాప్రభూ! శ్రీరాముడి వానర సేన లంకను చుట్టు ముట్టింది" చెప్పారు. రావణుడు రాక్షస వీరులకి రెట్టింపు సందేశాలు పంపి తన ప్రాసాదం మీదకు వెళ్ళాడు.

అక్కడ్నించి వానరసేనను చూశాడు. శైల-వన అరణ్యారహితమైన లంకను చూశాడు. ఎక్కడా నేల కనిపించుటలేదు. అంతా తోకలతో ఉన్న వానరులే. వారంతా ప్రాకారాలు ఎక్కుతున్నారు. మద్ది చెట్లూ, తాడి చెట్లూ, మర్రి చెట్లూ పెకిలించి ఆయుధాలుగా మలుచుకున్నారు.

అగడ్తలో చెట్లూ, రాళ్ళూ, కర్రలు వేసి పూడుస్తున్నారు. మరికొంత మంది వానరులు ప్రాకారాలు ఎక్కి కనకపు బహిర్ద్వారాలు కూలగొడుతున్నారు.

రావణుడు యుద్ధ భేరి మ్రోగించాడు. రాక్షస వీరులను ముందుకు ఉరకమన్నాడు. కవచాలు ధరించి పెద్ద పెద్ద కత్తులతో వారంతా ముందుకు వురికారు. భేరీలు మ్రోగాయి.

రాక్షస వీరులు శంఖాలు పూరించారు. రావణుడి ఆజ్ఞతో రాక్షసులు వరుణదేవుడి ఆజ్ఞతో కురిసే మేఘాల్లా దూసుకెళ్ళారు. మహాసముద్రం పొంగినట్టు తరలి వెళ్ళి వానర సైన్యంపై పడ్డారు.

వానర వీరులు రాక్షస వీరులను చూస్తూనే వారికంటే వేగంగా ఉరికి సింహనాదాలు చేశారు.





ఏనుగుల ఘీంకారాలు... వానరుల కేకలు... రాక్షసుల వికటాట్ట హాసాలు... రథచక్రాల చప్పుళ్ళు... గుర్రాల సకిలింపులూ... భూమి, ఆకాశం బద్దలయ్యేలా శబ్దాలు... ఆకాశంలో యుద్ధం చేసే వానర, రాక్షస వీరులు... కొండలపై, శిఖరాలపై యుద్ధం చేసే వానర, రాక్షస వీరులు. మహా ఉరుములు మెరుస్తున్నాయో, ఆయుధాలు మెరుస్తున్నాయో అర్థం కానంతగా... ఆకాశంలో బ్రహ్మాండమైన వెలుగులు.

రాక్షసుల చేతిలో ధగధగలాడే కత్తులూ, పట్టిసాలూ, ఇనుప గుదియలూ, శూలాలు. వానర వీరులకి మహా వృక్షాలూ, పర్వతాల మీది పెద్ద రాళ్ళే ఆయుధాలు. రాక్షసులను వానరులు గోళ్ళతో గుండెలు చీల్చారు. రాళ్ళతో మొహాల్ని పచ్చడి చేశారు. రాక్షసులు వానరుల తోకలు కోశారు. కంఠాలు నరికారు. గుర్రాలూ, ఏనుగుల తలలు తెగి, పొట్టలు చీలి పోయాయి... వానరుల, రాక్షసుల రక్త మాంస ఖండాలతో ఆ ప్రాంతమంతా రక్తమయం, ఛిద్రమైన మాంస ఖండాల మయం అయింది. యుద్ధం చేస్తున్న ఇరు వీరులకు శరీర భాగాల నుంచి వచ్చే రక్తం జలధారలా కారుతూనే ఉంది.

## మహా యుద్ధం

వానర, రాక్షస సేనలు ఆవేశంగా వీర విహారం చేశారు. కత్తులూ, గొడ్డళ్ళూ, పట్టిసాలకి పని చెప్పారు. వెచ్చటి రక్తాన్ని వాటికి రుచి చూపించారు. ఉభయులూ ఘోరంగా కొట్టుకున్నారు.

మహాయముడూ, రుద్రుడూ యుద్ధం చేస్తున్నట్టు, ఇంద్రజిత్తు అంగదుడు యుద్ధం చేస్తున్నారు. సంపాతి ప్రజంఘుడుతోనూ, హనుమంతుడు జంబుమాలితోనూ, విభీషణుడు మిత్రఘ్నుడుతోనూ, గజుడు తపనుడుతోనూ, నీలుడు నికుంభుడుతోనూ, సుగ్రీవుడు ప్రఘసునితోనూ, లక్ష్మణుడు విరూపాక్షుడుతోనూ, భయంకరమైన బాణాలతో, గదలతో యుద్ధం చేస్తున్నారు.

వందలాది సూర్యులు ఆకాశంలో ఉన్నట్టు, లక్షలాది మెరుపులు మెరిసినట్టు, కోట్లాది పిడుగులు పడ్డట్టు యుద్ధం జరిగింది.

భయంకరమైన ఆకారం గల రాక్షస వీరులు వానరులతో ఆయుధాల తోనూ, వట్టి చేతులతోనూ యుద్ధం చేశారు.

రక్తం వరదలై పారింది. శరీర మాంస ఖండాలతో బలి ప్రదేశమైంది. రక్త మాంసాలతో ఉండే సముద్రాన్ని మరిపిస్తోంది.

దేవేంద్రుని వజ్రాయుధంతో ఇంద్రజిత్తు అంగదుడ్ని కొట్టాడు. అంగదుడు ఇంద్రజిత్తు రథాన్ని ముక్కలు చేశాడు. గుర్రాలనీ, సారథినీ వధించాడు.

ప్రజంఘుడు సంపాతి మీద మొన తేలిన కణుపుల గల బాణాలు వేశాడు. వాటి నుంచి సంపాతి తప్పుకొని ఇనుప గుదియతో మోది చంపేశాడు. వీరాధివీరుడూ, బలవంతుడూ అయిన జంబుమాలి పిడికిలి బిగించి హనుమంతుడి వక్షస్థలంపై కొట్టాడు. వాయుపుత్రుడు అరచేతులతో చరిచాడు.

ప్రతపనుడు నలుడి మీదకి సింహనాదం చేస్తూ వచ్చాడు. నలుడు అంతకంటే వేగంగా పోయి వాడి కనులు ఊడబెరికాడు.

ప్రఘసుడిని కిష్కింధరాజు సుగ్రీవుడు మహా సప్తవర్ణ వృక్షాలతో చితక బాదాడు.

అగ్నికేతువూ, రశ్మికేతువూ, సుప్తఘ్నుడూ, యజ్ఞకోపుడూ రఘురాముడి మీద బాణ వర్షం కురిపించారు. శ్రీరాముడు అగ్ని కీలకాల వంటి నాలుగు బాణాలు వేశాడు. మహా అగ్ని పర్వతాల్లా వెళ్ళి వాళ్ళని ఢీ కొన్నాయి. ఏం జరిగిందో తెలిసే లోపే వాళ్ళు భస్మం అయ్యారు.

విద్యున్మాలి బంగారు ములుకుల బాణాలు వేశాడు సుషేణుడి మీదకు. సుషేణుడు రాళ్ళ వర్షం కురిపించి విద్యున్మాలి రథాన్ని వక్కలు చేశాడు. విద్యున్మాలి రథం దిగి ఓ పెద్ద శిఖరం వంటి గద తీసుకొని సుషేణుడి మీదకి వచ్చాడు. వక్షస్థలం మీద ఒక్కటిచ్చాడు. మహాభయంకరమైన ఆర్తనాదాన్ని చేసి, సుషేనుడు ఓ పెద్ద రాయితో విద్యున్మాలిపై మోదాడు. విద్యున్మాలి నేల కొరిగాడు.

వానర సైన్యాలని తన అపార బాణ సంపదతో చిందర వందర చేస్తున్న నికుంభుణ్ణి నీలుడు ఎదిరించాడు. ముష్టి ఘాతాలతో కొట్టి శిరస్సు ఖండించాడు.

దేవాసుర యుద్ధంలో దేవతలు, రాక్షసులు యుద్ధం చేసినట్టు మహోగ్ర యుద్ధం చేశారు. విరిగిపోయిన ఆయుధాలూ... తలలూ... చేతులూ... కాళ్ళూ... రక్తమూ... కూలి పోయిన రథాలూ... గుర్రాలూ...

ఆ యుద్ధ ప్రాంతంలో నక్కలు చనిపోయిన వార్ని పీక్కుతింటున్నాయి. వానర రాక్షసుల శరీరాల నుంచి స్రవించిన రక్తం రక్తనదిలా ప్రవహించింది. ఆ ప్రవాహములో ఉభయుల మాంసఖండాలూ తేలిపోతున్నాయి.





# రాత్రి యుద్ధం

కామరూప విద్యలు తెలిసిన రాక్షసులు రాత్రి కోసం వేచి చూశారు. రాత్రి అయింది. రెట్టించిన ఉత్సాహంతో అరిచారు. నల్లటి వికృత శరీరాలపై కవచాలు ధరించారు.

రణచీకటిలో కలిసిపోయిన రాక్షసులు చిత్ర విచిత్ర యుద్ధ పద్ధతుల్లో వానరులని తిప్పలు పెట్టారు.

వానరులు వారి కందక తిక్క తిక్క పనులు చేస్తూ అదను చూసి పీక పిసికి, ముష్టిఘాతాలతో, తోకలతో చుట్టి చంపేశారు. గోళ్ళతో గుండెలు చీల్చారు. పళ్ళతో పీక కొరికారు. ఎగిరెగిరి గుర్రాల మీద వారినీ, ఏనుగుల మీద వారినీ క్రిందకి పడవేసి మరీ చంపారు.

రామలక్ష్మణులు ఆ కటిక చీకటిలో వెలుగు బాణాలు వేస్తూ, ఆ వెలుగులో రాక్షసుల స్థానాన్ని గమనించి హతమారుస్తున్నారు.

సముద్రాలన్నీ ఘోషించినట్టు అరిచారు రాక్షసులు. శ్రీరాముడు తన బాణాలని అరుపులు వినిపించిన వైపుకి వేసి అందరినీ సంహరించాడు.

శూలాయుధాలతో, గొడ్డళ్ళతో కామరూపులైన రాక్షసులు వానరసేనను కబళిస్తున్నారు. శ్రీరాముడు రావణవీరులైన మహోదరుడూ, మహా పార్శ్వుడూ, యజ్ఞశత్రువూ, మహాకాయుడూ, దుర్ధర్షుడూ, వజ్రదంష్ట్రుడూ ఈ ఆరుగురి పై ఒకేసారి ఆరు బంగారు ములుకుల బాణాలని వేశాడు.

ఆ బాణాలు భేరి మృదంగ ధ్వనులు చేస్తూ, వెలుగులు చిమ్ముతూ వారి మర్మస్థానంలో గుచ్చుకున్నాయి. ప్రాణభయంతో చల్లగా జారుకున్నారు.

శ్రీరాముడు వానరులతో చెప్పాడు.

"రాత్రి యుద్ధంలో రాక్షసుల బలం హెచ్చు. ఇంద్రజిత్తు వరములున్న వాడు. ముల్లోకాలనూ ఎదిరించగల వీరుడు. అంగదుడు ఇంద్రజిత్తు రథాన్ని ధ్వంసం చేశాడు. ప్రతీకారంగా ఏ వైపునుంచైనా విరుచుకు పడగలడు. కపిరాజును కనిపెట్టుకు ఉండండి" హెచ్చరించాడు శ్రీరాముడు వానరులనూ, సేనా నాయకులనూ.

శ్రీరాముడు అన్నట్టుగానే ఇంద్రజిత్తు మాయా రూపంలో సర్ప ఆయుధాన్ని ప్రయోగించాడు. మహాకాల సర్పాలు బుసలు కొడుతూ ఆకాశం నుంచి పడసాగాయి. వానరులంతా బెంబేలెత్తిపోయారు.

## ఇంద్రజిత్తు

ఇంద్రజిత్తు కనపడకుండా యుద్ధం చేస్తుండటంతో ఏ వైపున ఉన్నాడో, ఎక్కడ్నించి బాణాలు వేస్తున్నాడో అర్థం కాలేదు.

శ్రీరామ లక్ష్మణుల మీదకు విషం కక్కుతున్న బాణాలు వేశాడు.

హఠాత్తుగా ఆకాశంలో ప్రత్యక్షమై నవ్వాడు ఇంద్రజిత్తు.

"శ్రీరామా! రాత్రి యుద్ధంలో కాని, పగటి యుద్ధంలో కాని నన్ను దేవేంద్రుడు సైతం జయించలేడు. ముల్లోకాలకి నేనే వీరుడని" గర్వంగా చెప్పాడు. శ్రీరాముడు చిద్విలాసంగా నవ్వాడు.

ఇంద్రజిత్తు వరాల గర్వంతో, శక్తులతో వానర సేనకు ముచ్చెమటలు పట్టించాడు. ఎర్రని నేత్రములు కలవాడూ, కాటుక కుప్పతో సమానమైన ఇంద్రజిత్తు సర్పబాణాలతో నాగపాశ బంధనం వేశాడు. శ్రీరామ, లక్ష్మణుల మీద మహా కాల సర్పం విషపు జ్వాలలు కురిపిస్తూ వచ్చింది. రామలక్ష్మణులని తన నాగపాశ బంధంతో కట్టి వేసింది.

వానరవీరులైన నీలుడూ, మైందుడూ, ద్వివిదుడూ, జాంబవంతుడూ, గవాక్షుడూ, శరభుడూ వీరందరి మీద బాణాలు వేసి స్థంభింపచేశాడు.

ఆకాశాన కనిపించి మరుక్షణమే మాయమై, మళ్ళీ కనిపిస్తూ విజయ వికటాట్టహాసం చేశాడు. రాక్షసులు మహాభేరి మ్రోగించారు. యుద్ధ విరామ భేరి మ్రోగింది.

ఇంద్రజిత్తు వెంట రాక్షసులు జయజయ ధ్వనులు చేసుకుంటూ లంకకెళ్ళారు.

ఇంద్రజిత్తు తండ్రికి నమస్కరించి విజయం గూర్చి చెప్పాడు.

"రామలక్ష్మణులతో సహా వానర సేనా నాయకులని స్థంభింపచేశాను. ఊపిరాడకుండా చేశాను. పర్జనుడు వర్షించి శ్రమించి తన పని పూర్తి చేసి విరమించినట్లుగా కార్యాన్ని పూర్తి చేసి మీ ముందుకు వచ్చాను" చెప్పాడు.

రావణుడు ఇంద్రజిత్తుని ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు. రావణుడు విజయోత్సవంలో మునిగిపోయాడు.

## విమోచనము

నాగపాశబద్ధులైన శ్రీరామలక్ష్మణులను చూసి విభీషణుడు చింతించాడు. వానర వీరులంతా వ్యథ చెందుతూ ఉన్నారు. విభీషణుడు పరీక్షించి చెప్పాడు.





"సుగ్రీవా! చింతించకు. యుద్ధంలో కొంతసేపు శత్రువులూ విజయం సాధించవచ్చు. కానీ అంతిమంలోనే అసలు విజయము ఎవరిదో తెలుస్తుంది. ఇంద్రజిత్తు బాణపాశం కడు శక్తివంతమైనది. బ్రహ్మదేవుని వరం. రామలక్ష్మణులది కేవలం మూర్ఛే... మహాశక్తిసంపన్నులైన రామలక్ష్మణులని మేషకాలమే బంధించగలదు. వారి మొహాల్లో కాంతి ఇసుమంతైనా తగ్గలేదు. సుగ్రీవా! శాంతనపడు. వానరులారా చింతించవలదు" చెప్పాడు.

శ్రీరాముడు నాగపాశ బంధనం విడిపించుకొని కనులు తెరిచాడు. లక్ష్మణుడు మాత్రం అలానే ఉన్నాడు. శ్రీరాముడు తమ్ముడిని చూసి దుఃఖించాడు.

సుషేణుడు వచ్చి లక్ష్మణుడిని పరికించాడు.

"సురులూ, అసురులూ, ఋషులూ ఎవ్వరూ ఈ నాగ పాశబంధము నుండి బైటపడలేదు. మహాశక్తివంతుడైన శ్రీరాముడు లాంటివారు మాత్రమే ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగపాశ బంధాన్ని తెంచుకోగలరు. లక్ష్మణుడికి ఆ శక్తి లేదు.

శ్రీరాముడ్ని చూసి చెప్పాడు సుషేణుడు.

"శ్రీరామా! పూర్వం రాక్షసుల, దేవతల యుద్ధంలో ఎంతోమంది దేవతలని రాక్షసులు చంపారు. అప్పుడు బృహస్పతి మృత సంజీవినితో వైద్యం చేసి దేవతల్ని బ్రతికించాడు" చెప్పి హనుమంతుని వైపు తిరిగాడు.

"వాయుపుత్రా! సంజీవిని పాల సముద్రం వద్ద ఉంది. దేవతలూ, రాక్షసులూ అమృతం కోసం చిలికిన ఆ సముద్రం వద్ద చంద్రమూ, ద్రోణమూ అనే రెండు దేవతా పర్వతాలున్నాయి. ఆ పర్వతాల మీద ఉండే విశల్యకరణీ, సంజీవకరణీ కావలెను. అమిత వేగవంతమైన నీ వల్లే ఆ కార్యం సకాలంలో అవుతుంది" చెప్పాడు.

సరిగ్గా అప్పుడే మేఘాలు మెరిశాయి. బ్రహ్మాండమైన గాలి వీచింది. సముద్రంలోని జలము ఉవ్వెత్తున లేచింది. పర్వతములు ఎవరో కుదిపినట్టు కదిలాయి. వినతా పుత్రుడూ, మహాబలశాలి అయిన గరుత్మంతుడు ప్రత్యక్షమైయ్యాడు. గరుత్మంతుడు రావటంతోనే యుద్ధరంగంలోని పాములన్నీ పరుగులు తీశాయి. బాణాకారాలతో వానరులను గుచ్చుకొని బాధిస్తున్న పాములు చప్పున వీడిపడి పారిపోయాయి.

వానరులంతా ఆ మహా తేజోమూర్తిని చూసి సంతోషించారు.

"ప్రభూ! శ్రీరామా! నా పేరు గరుత్మంతుడు. నీ బహిఃప్రాణం లక్ష్మణుడిపై, నీ సేనపై ఇంద్రజిత్తు వేసిన నాగపాశ బాణాలనూ, దేవతలూ, దేవేంద్రుడూ కలిసి వచ్చినా విడిపించలేరు. ఆ శక్తి నా ఒక్కడికే ఉంది. నేను రావటంతోనే నాగపాశ బంధనాలు అందరినీ వీడిపోయాయి" చెప్పాడు గరుత్మంతుడు.

గరుత్మంతుడు అలా చెప్పి లక్ష్మణుడ్ని తడిమాడు. కాంతిమంతుడు లక్ష్మణుడు నిద్రనుంచి లేచిన వాడివలే లేచాడు. శ్రీరాముడు తమ్ముడిని కౌగిలించుకున్నాడు. శ్రీరాముడు గరుత్మంతుడిని ఆప్యాయంగా కౌగిలించుకున్నాడు.

వానరవీరులు రామలక్ష్మణులు మహాకాంతితో వెలుగొందుట చూసి సంతోషంతో సింహనాదాలు చేశారు. కేకలూ, అరుపులతో మహా వృక్షాలను పెకిలించి లంకవైపు చూసి తొడలు చరచి అరిచారు. గ్రీష్మఋతువు గడిచిన పిదప అర్థరాత్రి అరిచే మేఘములవలే భయంకర ధ్వనులు చేశారు. యుద్ధభేరి మ్రోగించారు.

## ధూమ్రాక్షుడు వధ

మహాధ్వనులూ, సింహనాదాలూ రాక్షస రాజు రావణాసురునకు వినిపించాయి. రావణాది మంత్రులు ఆశ్చర్యపోయారు. మహాబలవంతులూ, విషపూరితులైన నాగులను బాణాలగా చేసి వేసిన పాశాలు ఎలా వీడిపోయాయి. అదెలా సాధ్యం. వానరులు దుఃఖించుట పోయి ఎలా సింహనాదలు చేస్తున్నారో తెలుసుకురమ్మన్నాడు. వెళ్ళిన వాళ్ళు, వెళ్ళినంత వేగంగా వచ్చారు.

వార్తాహరులు మారిపోయిన ముఖవర్ణములతో, దిగులుతో వచ్చి రావణుడికి నమస్కరించారు. రామలక్ష్మణులూ, వానరులూ ఎంత కుశలంగా ఉందీ చెప్పారు.

తీక్షణ సర్ప బాణాల నుంచి రామలక్ష్మణులు వానర సైన్యం ఎలా తేరుకుంది. రావణాసురుడు చింతతోనూ, రోషంతోనూ నిండిపోయాడు. అమిత బలసంపన్నుడూ, శౌర్యుడూ అయిన ధూమ్రాక్షుడితో చెప్పాడు.

"ధూమ్రాక్షుడా! ఇంద్రజిత్తు వేసిన కాల కూట విష సర్పాలవంటి బాణాల నుంచి తప్పుకున్నారు. నీ అసమాన బలపరాక్రమాల నుంచి వారు తప్పించు





కోలేరు. భయంకరమైన నీ వీరత్వాన్ని చూపించు. మహాసైన్యంతో కదిలివెళ్ళు" పాములా బుసలు కొడుతూ ఆజ్ఞాపించాడు.

లంకాధిపతి రావణునకు నమస్కరించి బైలు దేరాడు ధూమ్రాక్షుడు. కంచర గాడిదల రథాన్ని ఎక్కి లంకా పట్టణపు పశ్చిమ ద్వారం వద్దకు వెళ్ళాడు. వస్తున్న దారిలోనే రాకూడని పక్షులు అడ్డం వచ్చాయి. రథంపై గద్ద వచ్చి వాలింది. రాక్షసులు భయకంపితులయ్యారు ఆ ఉత్పాతాలని చూసి...

ధూమ్రాక్షుడు మాత్రం నెత్తురు వాన పడ్డా, భూమి కంపించినా పైకి కనపడకుండా లోలోన చింతించాడు. మహాసముద్రంలా ఉన్న వానరసేనని చూశాడు.

రాక్షసులు వానరులని చూస్తూనే కేకలూ, రంకెలూ వేస్తూ పరుగుతీశారు. వానరులూ అంతకు మించి గోలా, అరుపులతో దూసుకెళ్ళారు. రెండు సముద్రాలు ఢీ కొన్నట్టు వానర, రాక్షసుల సైన్యం 'ఢీ' కొంది.

వృక్షాలతోనూ, శిలలతోనూ యుద్ధం చేస్తున్నారు వానరులు. ఆయుధాలతో యుద్ధం చేస్తున్నారు రాక్షసులు. నెత్తురు కక్కేలా గుద్ది మరీ చంపుతున్నారు వానరులు. దొరికిన వాడ్ని దొరికినట్టు విరిచేస్తున్నారు రాక్షసులు.

తమ గోళ్ళతో గీరి మరీ చంపుతున్నారు వానరులు. రాళ్ళు గురి చూసి కొడుతున్నారు వానరులు. తమ రాక్షస బలంతో మధ్యలోనే పిండి చేస్తున్నారు రాక్షసులు.

ధూమ్రాక్షుడు వీర సింహనాదం చేస్తూ తమ రాక్షసుల వైపు వస్తున్న వానరులపై బాణ వర్షం కురిపించాడు. ధూమ్రాక్షుని బాణ పరంపరకు వానరులు అరుస్తూ పరుగులు తీశారు.

రాక్షసులు తరిమి తరిమి కొట్టారు. అనేక మంది వానరుల తోకలను పట్టి గిర గిర తిప్పి నేలకేసి కొట్టారు.

పెద్ద రాతి బండలతో మోదారు. భిందిపాలములతో, పాశములతో ఇనుప రోకళ్ళతో వానరుల మీద పడ్డారు. వానరులు మహావృక్షాలతో, ఎదుర్కొన్నారు.

గాడిద వంటి అరుపు గల ధూమ్రాక్షుడు భయంకరంగా అరుస్తూ వానర సేన మీద పడ్డాడు. వాయుపుత్రుడు హనుమంతుడు చూశాడు. కళ్ళు ఎర్రగా అయ్యాయి. మండుతున్న రెండు సూర్యుల్లా ఉన్నాయి.

ఒక మహా కొండ వంటి బండరాయిని పైకెత్తి వాయుపుత్రుడు విసురుగా ధూమ్రాక్షుడి మీదకు వేశాడు. ఆ మహారాతి కొండను ధూమ్రాక్షుడు చూశాడు. ధనుస్సు చేత బూని చప్పున రథం మీద నుంచి దూకాడు.

రాతి బండ వచ్చి రథం మీద పడింది. పెళ... పెళమంటూ రథం విరిగింది. కంచర గాడిదలూ, సారథితో సహా బండ క్రింద నుజ్జు నుజ్జు అయ్యాయి.

సింహంలాంటి పరాక్రమం, తోడేళ్ళ వంటి క్రూరుడు ధూమ్రాక్షుడు. అట్టి వాడిపై హనుమంతుడు మహా వృక్షాన్ని పెకిలించి బాదాడు. ఆ మహా వృక్షంతోనే వానరులను గదలతోనూ, పట్టిసాలతోనూ, శూలాలతోనూ, ముద్గరాలతోనూ హింసిస్తున్న రాక్షసులని చితక కొట్టాడు. నేరుగా ధూమ్రాక్షుని వద్ద కెళ్ళాడు.

మహాగదతో తన మీదకు వస్తున్న హనుమంతుడిపై ముండ్లతో నిండిన గదను ప్రయోగించాడు.

దాన్ని లెక్కచెయ్యగుండా, చలించకుండా, హనుమ మహాఖాయాన్ని పెంచి పిడికిలి బిగించి ధూమ్రాక్షుని నెత్తి మీద గుద్దాడు.

"టప్"మని పగిలిపోయింది ధూమ్రాక్షుడి శిరస్సు. అది చూసి చావగా మిగిలిన రాక్షసులు పరుగు లంకించుకున్నారు. లంకకి చేరారు.

మహాత్ముడైన హనుమంతుడ్ని స్తుతించారు వానరులు.

## వజ్రదంష్ట్రుడు

ధూమ్రాక్షుణ్ణి వానర వీరుడు హనుమంతుడు సంహరించినట్టు తెలియగానే రావణుడు ఆగ్రహంతో ఊగిపోయాడు. వజ్రదంష్ట్రుడిని పిలిచాడు.

"వజ్రదంష్ట్రా! అపార సేనావాహినితో కదలి వెళ్ళు. సుగ్రీవుడ్నీ, అంగదుడ్నీ, హనుమంతుడ్నీ... రామలక్ష్మణులను సంహరించి విజయలక్ష్మీ పూల మాలతో కనిపించు" చెప్పాడు రావణుడు.

మాయావియైన వజ్రదంష్ట్రుడు మహారాక్షస సేనతోనూ, ఏనుగులతోనూ, కంచర గాడిదలతోనూ, ఒంటెలతోనూ బైలుదేరాడు. విజయ భేరీలు మ్రోగించు కుంటూ కదనరంగానికి కదలి వెళ్ళాడు.

వజ్రదంష్ట్రుడు రథం మీద బైలు దేరగానే దుస్సకునములు కాన వచ్చాయి. ఆకాశం నుంచి కొరవులు పడ్డాయి. నక్కలు అగ్ని జ్వాలలు





వదులుతూ అరిచాయి. వజ్రదంష్ట్రుడు వినాశనము సూచించు వాటిని చూచి కూడా ధైర్యాన్ని తెచ్చుకొని కదిలాడు.

వజ్రదంష్ట్రుడి సైన్యాన్ని చూడగానే వానర సైన్యము సింహనాదాలు చేశారు. విందు భోజనం దొరికినట్టు కేరింతలు కొట్టారు. మహావృక్షాలను పెకిలించి సిద్ధంగా ఉన్నారు. రెండు సింహాలు 'ఢీ' కొన్నట్టు ఆయుధాలు కలిపారు. ఇరు వర్గాలు వారు ఒకరి మీద ఒకరు పడ్డారు.

శూలాలూ, ముసలాలూ, పాశాలాలూ, పట్టిసాలూ, గదలూ, కత్తులూ, విల్లు అమ్ములతో రాక్షసులు వానరుల మీద కొచ్చారు. వాటిని భుజ బలంతోనూ, మహా వృక్షాలతోనూ ఎదుర్కొన్నారు వానరులు.

వేల కొద్దీ రాక్షసులను విరిచేశారు వానరులు. వేల కొద్దీ వానరులను ఆయుధాలతో పొడిచి చంపారు రాక్షసులు.

రాక్షసుల తలలు తెగి పడ్డాయి. కొంతమందిని కాళ్ళూ, చేతులూ నరికి గిరగిర తిప్పి వృక్షాల కేసి, నేల కేసి బాది చంపారు వానరులు.

వానరుల తలలపై గదలతో గుద్ది... కోరలతో గుచ్చి చంపారు రాక్షసులు. యుద్ధ రంగమంతా తెగిపడిన శరీర అవయవాలు... రక్తం... మాంసఖండాలు...

అంగదుడు రాక్షసులపై పెను పరాక్రమం చూపాడు. యుద్ధరంగ మంతా కలియ తిరుగుతూ... రాక్షసుల బలమెక్కడ అగుపిస్తే అక్కడ యుద్ధం చేసి రాక్షసులను చెల్లా చెదురు చేశాడు. సింహము నీచ మృగములను చంపినట్టు చంపాడు.

వజ్రదంష్ట్రుడు అది చూసి అంగదుడి మీదకొచ్చాడు. దేవేంద్రుడి వజ్రాయుధంతో మెరిసిపోయే ధనుస్సు నుంచి బాణ వర్షం కురిపించాడు. ప్రళయ కాలమందు మహాయముడు పాశమును ధరించి సంచరించినట్టు యథేచ్ఛగా తిరిగాడు. అనేక మంది వానరులని సంహరించాడు. అంగదుడు రెండు రెట్ల కోపంతో నిప్పులు కక్కాడు.

వంకీలు తిరిగిన బాణాలతో, కణపుల బాణాలతో వజ్రదంష్ట్రుడు అనేక మంది వానరులని ఇష్టం వచ్చినట్టు దొరికినవాడ్ని దొరికినట్టు సంహరించాడు. వానరులు అంగదుని చుట్టూ చేరారు.

అంగదుడు భయంకర సింహనాదం చేసి వజ్రదంష్ట్రుడి మీదకి ఉరికాడు. మహా సర్పాలు పెనవేసుకొని పోరాడినట్టు పోరాడారు. ఓ ముష్టిఘాతాన్నిచ్చి, వజ్రదంష్ట్రుడు విల్లు అందుకున్నాడు. మహాశక్తివంతమైన బాణాలని వేశాడు.

అవి అంగదుడి శరీరాన్ని తాకి గాయపర్చాయి.

అంగదుడు బాధగా భయంకరంగా అరిచి దగ్గరిలోని మహా వృక్షాన్ని పెకిలించి గిరగిర తిప్పి వజ్రదంష్ట్రుడి తల మీద మోదాడు.

ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. తన గదతో అంగదుడి వక్షస్థలంపై కొట్టాడు వజ్రదంష్ట్రుడు.

పూలతో, పండ్లతో ఉన్న చెట్టుని పెకిలించి ఈడ్చి కొట్టాడు అంగదుడు. ఆకులతో సహా రాలి పడ్డాయి. మళ్ళీ కొట్టాడు. ఈసారి వృక్షం ముక్కలుగా విరిగి పోయింది.

ఇద్దరూ రొప్పుతున్నారు. వజ్రదంష్ట్రుడు గదను అందుకున్నాడు. అదే సమయంలో అంగదుడు తెల్లటి ఖడ్గాన్ని తీశాడు. తళుక్కున మెరిసిందా ఖడ్గం... ఆ మెరుపు మెరిసేలోగానే అంగదుడు ఆకలి గొన్న సింహంలా లేచి గాలిలోనే కత్తి ఝుళిపించాడు. వజ్రదంష్ట్రుడి తల తెగి నేల రాలింది. రెండు ముక్కలైంది.

## అకంపనుడు

వజ్రదంష్ట్రుడు కైలాసవాసానికి చేరాడనగానే రావణుడు గంభీరుడయ్యాడు. సైన్యాధ్యక్షుణితో చెప్పాడు.

"అకంపనుడు సకల శస్త్ర కోవిదుడు. యుద్ధ వీరుడు. యుద్ధమంటే పండగలా భావించే అకంపనుడు మహా పెద్ద పులి. సైన్యాధ్యక్ష ప్రహస్తుడా! నీవూ అకంపనుడూ ఇద్దరూ మహారాక్షస సేనతో కలిసి రామలక్ష్మణ, సుగ్రీవుల మీదకు మహా ఉప్పెనలా వెళ్ళండి" ఆజ్ఞాపించాడు రావణుడు.

రాజాజ్ఞతో తేజస్సులో సూర్యుడివలే ఉండే అకంపనుడు తన సేనతో సంబరాలు చేసుకుంటూ కదిలాడు. గతంలో సేనా నాయకులకి కానవచ్చినట్టు అనేక దుర్నిమిత్తాలు అకంపనుడికీ కానవచ్చాయి.

మేఘాలు లేకుండా పిడుగు ధ్వనులు వినిపించాయి. పక్షులూ, మృగాలూ ఘోరంగా ఏడ్చాయి. అరిచాయి. కుల స్త్రీలు కంగారు పడ్డారు.

సింహంలాంటి అకంపనుడు మాత్రం అదరలేదు. వేటకెళుతున్న రారాజులా కదిలాడు.

మహా తుఫానుతో సముద్రం ఉప్పొంగినట్టు, పెద్దపులి పరాక్రమం కలిగిన అకంపనుడు తన సేనతో రావటం చూసి వానరులు బెంబేలేత్తారు.





శ్రీరాముడ్ని తలుచుకున్నారు. ఎక్కడలేని శక్తీ, ధైర్యమూ వచ్చాయి. లంకలో రావణుడికి వినపడేలా అరిచారు. రాక్షసులూ సమాధానంగా అరిచారు. దిక్కులు ప్రతిధ్వనించాయి.

రాక్షసులూ, వానరులూ, మానవులూ తప్ప సమస్త ప్రాణికోటి ఆ ధ్వనులకూ, అరుపులకూ ప్రాణాలరచేత పెట్టుకొని పారిపోయాయి.

బ్రహ్మాండం బద్ధలైనట్టు భయంకర ధ్వనులు. ఒకరి మీద ఒకరు విరుచుకు పడ్డారు.

మహాబలవంతుడూ, రాక్షస సేనా నాయకుడూ అకంపనుడు బంగారు రథంపై మహోన్నతంగా వెలిగిపోతున్నాడు. రాక్షస సేనకు బలాన్నీ, ఉత్సాహాన్నీ ఇస్తూ కదులుతున్నాడు.

వానరులందరూ మూకుమ్మడిగా మీద పడినా అకంపనుడు సునాయాసంగా చెల్లాచెదురు చేసి దొరికిన వార్ని దొరికినట్టు వధించాడు.

పారిపోతున్న వానరులను తన బాణాలతో మరింత తరిమాడు. విజయ వికటాట్టహాసం చేశాడు.

వానరవీరుడైన కుముదుడూ, నలుడూ, మైందుడూ కోపించారు. ప్రతిగా అకంపనుడు వైపు వెళ్ళి అనేక మంది రాక్షసులను సంహరించారు. అకంపనుడు వానరసేనా నాయకులను ముప్పతిప్పలు పెడుతున్నాడు.

వాయుపుత్రుడు హనుమంతుడు చూశాడు. ఉగ్రుడయ్యాడు. వానర సేనకు అభయం ఇచ్చాడు. మహా పర్వతంలా మారి పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ అకంపనుడి దిశగా వెళ్ళాడు.

అకంపనుడు హనుమని చూశాడు. వేలాది బాణాలని కురిపించాడు. పెద్ద చినుకులు నేలని తాకినట్టు హనుమంతుని తాకాయి ఆ బాణాలు. మండుటెండలో పడ్డ వర్షపు చినుకులని పీల్చేసుకున్నట్టు హనుమంతుడిని తగిలి రాలిపోయాయి ఆ బాణాలు.

హనుమంతుడు సింహనాదం చేసి పండ్లు, పూల వృక్షాలతో నిండి ఉన్న పర్వతాన్ని పెకిలించి ఇంద్రుడు నముచి మీదకు వెళ్ళినట్టు అకంపనుడి మీదకు వెళ్ళి నెత్తి మీద బాదాడు. అగ్నిహోత్రము వలే ఊగిపోయాడు. హనుమ ధాటికి అకంపనుడు తల వక్కలై మరణించాడు.

అకంపనుడు చనిపోవటంతో రాక్షసులు భూకంపం వచ్చినట్టు గజగజా వణికిపోయారు.

ప్రాణభయంతో లంక వైపు పరుగుతీశారు. తమవారినే తొక్కు కుంటూ, తన్నుకుంటూ వెనుక పెద్ద పులులు తరుముతున్నట్టు పరుగు లంకించుకున్నారు.

వానరులు హనుమ చుట్టూ చేరి స్తుతించారు. జే జే ధ్వానాలు పలికారు. కైటభాసురుణ్ణి చంపిన మహావిష్ణువులె ఉన్న కపి వీరుడైన హనుమంతుడిని సుగ్రీవుడు అభినందించాడు.

వాయుపుత్రుడ్ని దేవగణాలూ, విభీషణుడూ, రామలక్ష్మణులు మెచ్చుకున్నారు.

## రావణుడి సర్వసేనాని ప్రహస్తుడు

రాక్షసేశ్వరుడు అకంపనుడి మరణ దుర్వార్త విన్నాడు. కలత పడ్డాడు. పచార్లు చేశాడు. సామాన్య వానరులు తన లంకను ముట్టడించటమా! తట్టుకోలేకపోయాడు.

"యుద్ధ నిపుణుడైన ప్రహస్తా! ఇక లాభం లేదు. నీవూ, నేనూ, ఇంద్రజిత్తూ, కుంభకర్ణుడూ నికుంభుడూ కదలాల్సిందే. మహావీరాధి వీరుడవు. నీ సింహనాదానికే సగం వానరులు గుండెలు పగిలి చస్తారు.

"మహా సింహం గుహలోంచి అరిస్తే మాములు జంతువులు సంగతి అట్లుంచితే మహా మదపుటేనుగులే తారెత్తి పోతాయి. వానరులు చపలులు. యుద్ధ శిక్షణ లేనివారు. సింహా గర్జనలు ఏనుగులు వినలేనట్టు నీ ధ్వనికే పలాయనమవుతారు. వానరసేనను చెదరగొడితే చాలు. రాముడి పని అయిపోయినట్టే..." చెప్పాడు రావణుడు.

సేనానాయకుడు ప్రహస్తుడు శుక్రుడు బలిచక్రవర్తితో చెప్పినట్టు చెప్పాడు.

"ప్రభూ! రావణా! ఈ శరీరం నీది... నీ రాజ్యము కోసం, నీ యశస్సు కోసమే. ఆ తర్వాతే నా భార్యా బిడ్డలూ, సుఖాలూ... లంకేశుడు ఆజ్ఞ ఇస్తే వానరుల శరీరాల్ని రాబందులు తినేలా చిత్రవధ చేసి చంపుతాను."

ప్రహస్తుడి మాటలకి రావణుడు సంతోషించాడు. 'విజయోస్తు' అని చెప్పాడు.

భయంకర రణ భేరి మ్రోగింది. ప్రహస్తుడి సారథి మహోత్సాహంతో పగ్గాలు అదిలించాడు. మహా ఆయుధాలతో కవచాలతో రాక్షసులు సిద్ధమయ్యారు. ప్రహస్తుడి రథం సూర్యచంద్రుల వలే మెరిసిపోతూ కదిలింది. ఆ రథం పై ప్రహస్తుడు దేవేంద్రుడిలా మెరిసిపోతున్నాడు.





రణ దుందుభుల మధ్య, మహాసేనతో మహా సముద్రమే కదలి వస్తోందా అన్నట్టు కదిలాడు రాక్షస సేనాధ్యక్షుడు ప్రహస్తుడు. భయంకర రూపాలతో మహాభారీ ఖాయములతో రాక్షసులు ఘోరాతి ఘోరమైన శబ్దములు చేస్తూ కదలుతున్నారు. నక్కలు అరిచాయి. ఆకాశపు ఉల్కలు నేల రాలాయి. ప్రహస్తుడి రథం చుట్టూ అస్తవ్యస్తంగా మాంసపక్షులు తిరిగాయి. మేఘలూ దీనంగా అరిచాయి.

ప్రహస్తుడు పరికించాడు. పైకి చూశాడు. తన రథ జెండా పాము గుర్తుతో రెపరెపలాడుతోంది. శత్రువు కోసం పుట్టలోంచి వచ్చిన పాములా బుసకొడుతున్నట్టు ఉంది.

అదే సమయంలో నెత్తుటి వాన కురిసింది. ప్రహస్తుడి రథంపై గ్రద్ద వాలింది. ప్రహస్తుడు అదరలేదు. తన నలుగురు మంత్రులైన నరాంతకుడూ, కుంభహనుడూ, మహానాదుడూ, సమున్నతుడులతో సమస్త లోకాలను నాశనం చేసే యముడిలా కదిలాడు.

ఎన్నో యుద్ధాల్లో పాల్గొన్న ప్రహస్తుడి సారథి చేతిలోంచి గుర్రాలను అదిలించే కొరడా జారిపడింది. సమప్రదేశంలో ఉన్న రథానికి కట్టిన గుర్రాలు అదిరాయి. వెనక్కి లాగుతున్నాయి.

ప్రహస్తుడు నిర్భయంగా, ముందుకు కదలమని ఆజ్ఞాపించాడు. మేఘ గర్జనలతో, మహా వేగ స్వర్గ రథంపై వస్తున్న ప్రహస్తుడ్ని శ్రీరాముడు చూశాడు.

"రామా! అతను ప్రహస్తుడు. మహా వీరుడు. రావణుడికి ఎన్నో యుద్ధాల్లో విజయం సాధించిన శూరుడు. లంకాధిపతి రావణుడి సర్వసేనకు సేనాధిపతి. అస్త్రవేత్త" చెప్పాడు విభీషణుడు.

ప్రహస్తుడు వచ్చీరావటంతోనే బాణ వర్షమును వానరుల మీద కురిపించాడు. ప్రతిగా వానరులు రాళ్ళ వర్షం కురిపించారు.

మహా యుద్ధం ప్రారంభమైంది. ఆయుధాలతో వానరుల గుండెలు చీల్చారు రాక్షసులు. కత్తులతో రెండు ముక్కలుగా నరికారు వానరులని రాక్షసులు. వానరులు చెట్లతోనూ, వృక్షాలతోనూ రాక్షసులను బాది నేల కేసి కొట్టి మరీ చంపుతున్నారు. ఒకొరి నొకరు సమీపించి శిలా వర్షమునూ, బాణ వర్షములనూ కురిపిస్తున్నారు. వానరులను శూలములతో పొడిచారు. పరిఘలతో కొట్టారు. గొడ్డళ్ళతో నరికారు. ఖడ్గములతో ముక్కలుగా నరికారు.

వానరులకు చెట్లూ, వృక్షాలే ఆయుధాలు. గోళ్ళే కత్తులు. తోకలే శూలాలు...

ఉభయ సేనల్లో కేకలూ, అరుపులూ....

వానరులు రాక్షసుల పండ్లు ఊడగొట్టి, గుడ్లు పీకేశారు. ప్రహస్తుడి నలుగురు మంత్రులూ వీర గర్జన చేశారు. దొరికిన వార్ని దొరికినట్టే నలిపేశారు. వానరుల శవాలను గుట్టలుగా వేశారు.

వానర వీరుడు ద్వివిదుడు సింహగర్జన చేసి మహా వృక్షం పెకిలించి నరాంతకుణ్ణి బాది చంపాడు. దుర్ముఖుడు పిడి గుద్దులతో హస్తలాఘవము గల సమున్నతుణ్ణి సంహరించాడు. జాంబవంతుడు బాగా పెద్ద రాయిని తీసుకొని మహానాదుడి రొమ్ము పై వేశాడు. రొకలి పోటుకు నలిగిన ఉల్లిగడ్డలా మహానాదుడి రొమ్ము పచ్చడయ్యింది. పెద్ద వృక్షంతో వీర్యవంతుడైన తారుడు కుంభహనుడి నెత్తి మీద బాదాడు. తల పగిలి చనిపోయాడు కుంభహనుడు.

రాక్షసులు బాధతో భీకరంగా పొలి కేకలు పెట్టారు. వానరులు ఎగిరి సంతోషం ప్రకటించారు.

రాక్షసులవి... వానరులవి... కళేబరాలు... రక్తం... రెండుగా తెగిన శరీరాలు... తొండాలు తెగిన ఏనుగులు... కాళ్ళు తెగిన గుర్రాలు... దూసుకెళ్ళిన బాణాలు తగిలి పడి ఉన్న కంచర గాడిదలు... విరిగిన రథాలు...

బ్రతికుండి పోరాడుతున్న రాక్షస, వానర శరీరాలు ఎర్రగా తడిచి పోయి ఉన్నాయి. ఆ రక్త మాంసాల్లో ఈదుతూ ముందుకు కదులుతూ పోరాడుతున్నారు ఉభయులు.

లంకలోని మూడు వంతుల సేనకు నాయకుడైన ప్రహస్తుడు సుడిగాలితో సమంగా బాణాలను వదులుతున్నాడు. వానర సేనా నాయకుడు నీలుడు ప్రహస్తుడ్ని చూశాడు.

ప్రహస్తుడ్ని ఆపకపోతే వానర సేన ఎంతో సేపు మిగలాదు. తన కెదురుగా వచ్చిన నీలుడి మీదకు ప్రహస్తుడు పక్షుల గుంపులా బాణాలు వేశాడు. నీలుడు మహావృక్షంతో గాలిలోనే వాటిని చెల్లాచెదురు చేశాడు. అదే చెట్టుతో ప్రహస్తుడ్ని బాదాడు. పెద్దగా అరిచి తేరుకున్నాడు ప్రహస్తుడు.

విజృంభించిన వాయువు మేఘసముదాయము మీదకు వెళ్ళినట్టు నీలుడు మరో వృక్షాన్ని పెకిలించి సూర్యుని వంటి వర్ణము గల ప్రహస్తుడి రథం మీద వేశాడు. రథం విరిగింది. నీలుడు ఎగిరి ప్రహస్తుడి మీదకు దూకాడు. ఇద్దరూ నేల మీద పడ్డారు.





పాముా, పాముా కొట్టుకున్నట్టు, ఏనుగూ ఏనుగూ ఢీ కొన్నట్టు, పులీ, పులీ పోరాడుకున్నట్టు, సింహమూ, సింహమూ గ్రాండిస్తూ పంజాలు విసురుకున్నట్టు యుద్ధం చేశారు.

వృత్రాసురుడూ, దేవతల రాజు దేవేంద్రుడూ యుద్ధం చేసినట్టు చేశారు. మహా పిడి గుద్దు, కొండ కూడా పిండి అయ్యే దెబ్బ నీలుడి మీద గుద్దాడు ప్రహస్తుడు.

కళ్ళ ముందు నక్షత్రాలు కనపడ్డాయి. తేరుకున్నాడు. కళ్ళల్లో నిప్పులు మెరిశాయి. నీలుడికి ఆగ్రహంతో రొమ్ము ముందుకు వచ్చింది.

సాలవృక్షములతో బాది గుర్రాలను చంపాడు. విల్లును విరిచాడు. ప్రహస్తుడు మదము కారుతున్న ఏనుగువలె ఉన్నాడు. ముసలం పట్టుకున్నాడు. మహావీరుడు, కపి సేనాని నీలుడు ముసలం పట్టుకొని తన మీదకు వస్తున్న ప్రహస్తుడి తలపై నడినెత్తిన బండరాయితో మోదాడు.

దిక్కులు పిక్కటిల్లేలా అరిచాడు ప్రహస్తుడు. తలలోంచి మెదడు బైటికొచ్చింది. మహా పర్వతం నుంచి జలపాతం వచ్చినట్టు ప్రహస్తుడి తల నుంచి రక్తం ఉబికి వచ్చి నేలని తాకింది. ఆ యుద్ధ నేల వైశాఖమాసమందు మోదుగ పూవులు పరిచిన భూమివలే ప్రకాశించింది.

ప్రహస్తుడి మరణంతో రాక్షసుల గుండెలు చెదిరి పోయాయి. ఆనకట్టను దాటలేని నదిలా నిల్చుండిపోయారు. భయంతో కంపించిపోతూ శోక సముద్రంలో మునిగి ప్రాణాలరచేత పట్టుకొని పరుగు లంకించుకున్నారు రాక్షసులు.

గట్టు తెగిన నీరులా జారిపోతున్న రాక్షసులని చూసి వానర వీరులు జయ జయ ధ్వనులు చేశారు. నీలుడ్ని మెచ్చుకున్నారు.

శ్రీరామలక్ష్మణులు నీలుడ్ని ఆశీర్వదించారు.

## లంకేశ్వరుడు రావణుడి ఆగ్రహం

దేవేంద్రుడ్ని జయించిన ప్రహస్తుడు యుద్ధ రంగంలో ఓ వానరుడి చేతిలో హతమయ్యాడా? రాక్షస యోధులు విషయాన్ని తెలియ చెప్పటంతో రావణుడు దుఃఖించాడు. ఆ వెనువెంటనే కోపోద్రిక్తుడయ్యాడు.

దేవతల రాజు దేవేంద్రుడు తన సేనానాయకులతో చెప్పినట్టు గంభీరంగా చెప్పాడు.

"వీరులారా! ప్రహస్తుడు మహావీరుడు. దేవేంద్రుడికి వణుకు పుట్టించిన ధీరుడు. అట్టి లోకైకవీరుడను హతమార్చారంటే మామూలు విషయంగా పరిగణలోకి తీసుకొనరాదు. అపార సైన్యామూ, గజ, అశ్వ, రథ, బలగాలనూ చిత్తు చేసిన వానర సేననూ, వారి నాయకులనూ ఇక ఉపేక్షించుట తగదు.

"సిద్ధం చెయ్యండి. నేనే స్వయంగా బైలుదేరుతాను యుద్ధ భూమికి. మహోకార్చిచ్చు సమస్త అడవినీ కాల్చివేసినట్టు వానరులనూ, రామలక్ష్మణు లనూ దహించి వేస్తాను. బాణాగ్నితో దివ్యాస్త్ర సంపన్నమైన శక్తులతో విజయ పతాకం ఎగుర వేస్తాను" బ్రద్దలైన అగ్ని పర్వతంలా మారి ఆజ్ఞాపించాడు లంకేశ్వరుడు రావణుడు.

ఉరుముల మెరుపులతో ఊగిపోతున్న దేవేంద్రుడి శత్రువైన రావణుడి ఆజ్ఞ కావటం ఆలస్యం మంత్రిపుంగవులంతా క్షణాల్లో దివ్య రథాన్ని సిద్ధం చేశారు.

మహోతేజోవంతమైన రావణుడు తనతో సమంగా వెలిగిపోయే దివ్య రథాన్ని ఎక్కాడు. ఉత్తమజాతి గుర్రాలు పూనిన రథమది. అశ్వాలు విజయ సూచికంగా సకిలించాయి. భేరీలు మ్రోగాయి. ప్రణవాలూ మ్రోగాయి.

రాక్షసవీరులు తొడలు చరిచారు. దిక్కులు దద్దరిల్లేలా అరిచారు. దశగ్రీవుడు రావణుడికి స్తోత్ర పాఠాలు చదివారు.

రాక్షసరాజు రథం కదలింది. జబ్బలు చరుస్తూ ఆయుధాలు పైకెత్తి ఎగురుతూ అనుసరిస్తున్న రాక్షససేనతో మహా శివుడే యుద్ధానికి బైలు దేరడాన్నట్టు కదిలాడు.

భయంకరమైన తుఫాను ముందు కదిలే మేఘాల్లా, ఉప్పెనకి ముందు సముద్ర కెరటల్లా యుద్ధ సన్నిద్ధమైన తన బలగాన్ని చూసుకొని రావణాసురుడు విర్రవీగాడు.

వానరసైన్యాన్ని సమీపించాడు. మహా వృక్షాలూ, పెద్ద బండలూ, చిన్న పాటి పర్వతాలనీ పట్టుకొని ఉన్న వానరసైన్యాన్ని చూశాడు.

శ్రీరాముడు విభీషణుడిని అడిగాడు.

"మిత్రమా! అపార తేజస్సుతో, మహోగ్రమైన రూపంతో, బ్రహ్మజ్ఞానిలా ఉన్న ఆ మహాపురుషుడు ఎవరు? ఏనుగుల్లో ఏనుగులవలే. సింహాల్లో సింహంవలే, రాక్షసుల్లో రాక్షసులవలే, గంధర్వుల్లో గంధర్వులవలే యథేచ్ఛగా వస్తున్న ఆ వీరులెవ్వరు" అడిగాడు.





విభీషణుడు శ్రీరామునకు నమస్కరించి....

"ప్రభూ! శ్రీరామచంద్రా! శుక్రసమాన వీరుడతడు.అప్పుడే ఉదయించిన సూర్యుడిలా అందమైనవాడు. పోటెత్తిన కెరటం వంటివాడు. మధగజ ఆకారుడు. రావణుడి పుత్రుడు ప్రవీరబాహువు.

"శ్రీరామా! అటు చూడు. సింహం వంటి రథంపై వస్తున్నవాడు ఇంద్రజిత్తు. బ్రహ్మవర ప్రసాది. ఇంద్రధనుస్సు వంటి ధనుస్సుతో ఉన్న ఇంద్రజిత్తు రావణుడి ముద్దుల పుత్రుడు.

"మహాపర్వతాలైన వింధ్య పర్వతమూ, మహేంద్ర పర్వతమూ, అస్తగిరితోనూ పోల్చదగ్గ వీరుడు, అతికాయుడు. అదిగో అతని బరువుకి రథ చక్రాలు ఎలా కృంగి పోయాయో. ధనుష్టంకారం చేస్తూ యుద్ధకాంక్షతో ఊగిపోతున్నవాడు అతికాయుడు. సార్థక నామధేయుడు.

"నెత్తుటి ముద్దలా అప్పుడే ఉదయించిన సూర్యుడిలా ఉండే అతను మహోదరుడు. గంటలు కట్టిన గాడిదల గుర్రం మీద వస్తున్న అతను మహా క్రూరుడు.

"రకరకాల బంగారు ఆభరణాలతో మెరిసిపోతున్నవాడు పిశాచుడు. తమ చేతిలో ఉన్నది దేవేంద్రుడి వజ్రాయుధమే అని మిడిసిపడే వాడు కీర్తి మంతుడైన త్రిశురుడు. ఆ ప్రక్కనే పర్వతాకారంలో మబ్బు గుట్టలా ఉన్నవాడు కుంభుడు.

"బంగారముతోనూ, వజ్రాలతోనూ ప్రజ్వరిల్లుతూ పొగలు కక్కుతున్న పరిఘాయుధము ధరించి వస్తున్నవాడు నికుంభుడు. రాక్షస సైన్యానికి మహా నాయకుడు.

"ఆ వెనుక వస్తున్నది నరాంతకుడు. మన వానరుల్లా అతనూ పర్వతాలనీ, కొండలనీ పెకిలించి శత్రువు మీదకు విసురుతాడు.

"ఇక శ్రీరామా! అదిగో రావణుడు. లంకేశ్వరుడు. అఖండ తేజస్సుతో మరో సూర్యుడిలా వెలిగిపోతున్నాడు. ముల్లోకాలనూ, పంచభూతాలనూ తన నోటి మాటతో నుల్చున్న పళంగా శాసించగల లోకైకవీరుడు.

"ఓ రామా! పెద్ద పులీ, ఒంటె, ఏనుగు, మృగాల్లాంటి ముఖాలతో ఘోరాతి ఘోరమైన రాక్షసుల మధ్య దివ్యమైన రథంపై మరింత దివ్యమైన వెలుగుతో, మహా రుద్రుడే యుద్ధానికి వస్తున్నట్టు వస్తున్న అతనే దశగ్రీవుడు.

లంకేశ్వరుడు. జ్ఞాని, సకల శాస్త్రాలూ చదివిన బ్రాహ్మణుడు. అయిననూ వ్యసన పరుడు. స్త్రీ వ్యామోహంతో సర్వం పోగొట్టుకోబోతున్నవాడు... రావణబ్రహ్మ... రావణుడు" చెప్పాడు విభీషణుడు.

శ్రీరాముడు రావణుడ్ని పరికించి చూశాడు.

'ఆహా ఏమి తేజస్సు' నవరత్న ఖచిత కిరీటంతో, కనక కుండలాలతో మధ్యాహ్న మార్తుండుడిలా, అగ్ని హోత్రుడిలా వెలిగిపోతున్న రావణుడ్ని చూసి శ్రీరాముడు అనుకున్నాడు.

దర్పంలో దేవేంద్రుడూ, యముడూ కూడా సాటిరారు. దేహకాంతులలో సూర్య, చంద్రులూ సాటిరారు. మహాకాయుడు, ఆ తేజస్సు దేవదానవుల్లోనే కాదు... ముల్లోకాల్లోనూ ఎవరికీ లేదు. ఇంతటి వీరాధివీరుడూ, జ్ఞానికా అంతటి సంకుచిత నీచ బుద్ధి...

"విభీషణా! ఎంతటి మహాశక్తి గల వీరుడైనా, అధర్మం చేసినప్పుడు అతని శక్తులూ, దర్పమూ, సర్వమూ నేల రాలాల్సిందే. రావణుడి పాపం పండింది. అందులకే వెతుక్కుంటూ వస్తున్నాడు" అని శ్రీరాముడు ధనుస్సుని పట్టుకొని, అక్షయ తూణీరంలోంచి బాణాన్ని తీశాడు.

లక్ష్మణుడు రావణుడ్ని, సేననూ చూస్తూ శ్రీరాముడి వెనుకే నిలిచాడు.

లంకేశ్వరుడు తన సేనల్ని కీలక స్థానాల్లో ఉంచాడు.

ప్రకాశించే ధనుర్బాణములతో ఉన్న రావణుడిని చూస్తూనే సుగ్రీవుడు ఆగలేక పోయాడు. ఓ పెద్ద పర్వతాన్ని రావణుడి మీదకి విసిరాడు. గరుత్మంతుడిలా వస్తున్న చరియల గల ఆ పర్వతాన్ని చూసి రావణుడు ఆ పర్వత శిఖరం పైకి బంగారు ములుకులు కలిగిన బాణాన్ని వేశాడు. ఆ బాణం దూసుకొస్తున్న పర్వత శిఖరాన్ని చిన్న చిన్న మట్టి పెళ్ళలుగా చేసింది.

తన మీదకే పర్వత శిఖరాన్ని వేసిన సుగ్రీవుడిని చూసి తోక తొక్కిన త్రాచులా యమునితో సమానమైన సర్పము వంటి బాణాన్ని సంధించి వదిలాడు.

దేవేంద్రుడి వజ్రాయుధంలా... మంటలూ... నిప్పులూ విరజిమ్ముతూ ఆకలిగొన్న సింహంలా సుగ్రీవుని మీదకు వెళ్ళింది. ప్రాణాంతక, విష సర్ప గుణాలు గల ఆ బాణం కుమారస్వామి వదలిన శక్త్యాయుధము క్రౌంచ పర్వతాన్ని దూసుకెళ్ళినట్టు సుగ్రీవుడ్ని చీల్చుకొని వెళ్ళింది.




కిష్కింధరాజు... శ్రీరాముడి మిత్రుడు... సుగ్రీవుడు ఆర్తనాదం చేసి తెలివి తప్పి పడిపోయాడు. రాక్షసులు అది చూసి నింగినంటేలా హర్ష ధ్వనులు చేశారు. సింహనాదాలు చేశారు. సంతోషంతో రావణుడి రథం చుట్టూ నాట్యం చేశారు.

సుగ్రీవుడు పడిపోవటంతో వానరసేనా నాయకులు గవాక్షుడూ, గవయుడూ, సుదంష్ట్రుడూ, జ్యోతిర్ముఖుడూ, నలుడూ మహా కొండలని పట్టుకొని మహాకాయుడైన రావణుడి మీదకు పరిగెత్తారు. మూకుమ్మడిగా మహా కొండలని వేశారు.

లంకేశ్వరుడు రావణుడు వాడియైన మహా బాణాలతో వాటిని మట్టి రాసులుగా చేశాడు. కరకు బాణాలని గుప్పించాడు. వానరవీరులు దెబ్బలు తిన్నారు. మూర్ఛపోయారు. గగ్గోలు పడిపోయారు.

సర్వలోకరక్షణపరుడైన శ్రీరాముడి వద్దకు వెళ్ళి శరణు వేడారు. ధనుస్సు పట్టుకొని రావణుడు ఉన్న దిశగా కదిలాడు శ్రీరాముడు. లక్ష్మణుడు శ్రీరామునికి నమస్కరించాడు.

"శ్రీరామా! అనుజ్ఞ ఇవ్వు... రావణుడి సేనా నాయకుల సంగతి, లంకేశ్వరుడి సంగతి నేను చూస్తాను."

"జాగ్రత్త లక్ష్మణా! లంకేశ్వరుడు మహా వీరుడు. వరప్రసాది. ముల్లోకాలు కలిసి వచ్చినా పోరాడే శక్తి కలవాడు. నీచుడు. కుటిల యుద్ధ పారంగతుడు. ఏమరుపాటు వలదు" చెప్పాడు శ్రీరాముడు.

లక్ష్మణుడు శ్రీరాముడిని పూజించి నమస్కరించి ఆడుకోవటానికి తల్లి అనుమతి లభించగానే పరుగున వెళ్ళే పిల్లాడిలా యుద్ధరంగంలోకి చొచ్చుకు పోయాడు.

రావణుడు కార్చిచ్చు వలే ముందున్న వానర సేనను కబళించేస్తున్నాడు. ఏనుగు తొండం వంటి ధనుస్సుతో సింహకిశోరంలా రావణుడి మీదకు వెళ్ళబోతున్న లక్ష్మణుడిని చూశాడు హనుమంతుడు.

ఓ స్త్రీని, ఇంటి యజమాని లేనప్పుడు అపహరించిన రావణుడి పైకి లక్ష్మణుడు యుద్ధానికి వెళ్ళుటా... తగదు. రావణుడి మీదకు కింకరుడైన తాను వెళ్ళుటే సబబు... అనుకొని రివ్వున వెళ్ళి రావణుడి రథం మీద వాలాడు.

హనుమంతుడి దాటికి రావణుడి రథం అదిరింది.

"రావణా! నీవు మహావీరుడవే. సందేహం లేదు. దేవదానవులందరిలో వీరుడవే. కానీ వానరులకూ, మానవులకూ కాదు. ఇదిగో నా దెబ్బ నీ పుత్రుడు అక్షయ కుమారుడు రుచి చూశాడు. ఇప్పుడు నీ వంతు" అని పిడికిలి బిగించాడు.

అంతకు ముందే మహాశక్తివంతుడైన రావణుడు ఒక్క చరుపు చరిచాడు హనుమంతుడి ఎదురు రొమ్ముల మీద. దేహం బద్ధలైనట్లైంది.

పుట్టి బుద్ధెరిగిన తర్వాత అంత దెబ్బ ఎవ్వరితోనూ తినలేదు. కళ్ళ ముందు నక్షత్రాలు కనపడ్డాయి. దిక్కులు తెలియరాలేదు. అతి కష్టం మీద హనుమ నిగ్రహించుకున్నాడు. తేరుకున్నాడు.

తన శక్తినంతా చేతిలోకి తీసుకొని రావణుడికి పిడి గుద్దు రుచి చూపించాడు. భూమి భూకంపము వచ్చి గజగజలాడినట్టు రావణుడు వణికాడు. వానరులంతా హనుమంతుడ్ని మెచ్చుకున్నారు. లంకేశ్వరుడు రావణుడ్ని అంత దెబ్బ కొట్టినందుకు పై నుంచి దేవతలూ, సిద్ధులూ వాయుపుత్రుడ్ని మెచ్చుకొని స్తుతించారు.

"భలే వానరా! శత్రువైనా మెచ్చుకుంటున్నాను" చెప్పాడు రావణుడు హనుమంతుడితో...

"ఓరీ నీచ రావణా! ఈ సారి దెబ్బ నిన్ను నేరుగా యమసదనానికే పంపిస్తుంది" అంటూ మీదకి ఉరికాడు. రావణుడు అగ్నిలా భగ్గుమన్నాడు.

"కైలాస పర్వతాన్నే ఎత్తిన హస్తాలివి" అని ఒక్క చరుపు చరిచాడు రావణుడు. భూమి మీద పర్వతాలన్నీ కలిసి మీద పడ్డట్టు హనుమంతుడు విలవిలలాడిపోయాడు. వణికిపోయి ముహూర్తకాలం అచేతనుడయ్యాడు.

వానర వీరుడు నీలుడు రాక్షస సేనను అతలాకుతలం చేస్తుండటం గమనించి రావణుడు హనుమంతుడ్ని వదలి నీలుడి మీదకు వెళ్ళాడు. కాలకూట విషాన్ని కక్కే సర్పబాణాన్ని నీలుడి మీదకి వేసాడు.

అది గట్టు తెగిన ప్రవాహ వేగంతో పోటిపడి వెళ్ళి నీలుడ్ని తాకింది. ఆ బాణం నీలుడ్ని తాకక ముందే నీలుడు తన చేతిలోని పర్వత శిఖరాన్ని రావణుడి మీదకి విసిరాడు. రావణుడు బాణాలతో ముక్కలు చేశాడు.

నీలుడు తనకి తగిలిన బాణపు బాధను ఓర్చుకుంటూ... చప్పున ఎగిరి మద్దిచెట్టునూ, చంద్ర చెట్టును పెకిలించి విసిరాడు. నీలుడు వృక్షాలను వేస్తూనే ఉన్నాడు. రావణుడు బాణాలతో అడ్డుకుంటునే ఉన్నాడు.





నీలుడు లాభం లేదనుకొని ఒక్క ఎగురుతో రావణుడి రథం మీదకు గెంతాడు. రావణుడి రథ ధ్వజం మీద కెగిరి కూర్చున్నాడు. రావణుడు ఉగ్రుడయ్యాడు. ధనుస్సుకు బాణం తొడిగాడు.

నీలుడు చప్పున కిరీటం మీదకు గెంతాడు. ఆ వెనువెంటనే ధనుస్సు మీదకూ... అక్కడ్నించి తూణీరం పైకి... రావణుడు నీలుడి కోతి చేష్టలకి ఉగ్రుడయ్యాడు. చికాకు పడ్డాడు.

ఆగ్నేయాస్త్రం సంధించాడు. ధ్వజం మీదకు గెంతిన నీలుడితో చెప్పాడు రావణుడు.

"నీలుడా! ఆగ్నేయాస్త్రం కాచుకో... నేటితో నీ ప్రాణం హరీ... యమ పురికి పోయి అక్కడ నీ కోతి చేష్టలు చేయి" అంటూ ఆగ్నేయాస్త్రాన్ని వదిలాడు. నీలుడి రొమ్మును 'ఢీ' కొంది. నవనాడులూ స్థంభించి పోయాయి. నీలుడు అగ్ని హోత్రుడి పుత్రుడు. ఆగ్నేయాస్త్రం దహించటం ప్రారంభించింది. మోకాళ్ళు నేలకి ఆన్చి కూలిపోయి మూర్ఛపోయాడు. అగ్నిహోత్రుడు పుత్రప్రేమతో నీలుడి ప్రాణం తియ్యలేదు.

దశకంఠుడు రావణుడు నీలుడు కూలిపోవటంతో యుద్ధ భూమి మధ్య వరకూ ఛేదించుకొని వెళ్ళాడు. భయంకర వికటాట్టహాసం చేశాడు.

లక్ష్మణుడు ధనుష్టంకారం చేశాడు.

"రావణా! నాతో యుద్ధానికి రా!" లక్ష్మణుడి కవ్వింపుతో రావణుడు రథాన్ని లక్ష్మణుడి వైపు మరల్చమని సారథితో చెప్పాడు.

"లక్ష్మణా! వినాశకాలం దాపురించి, విపరీత బుద్ధి పుట్టినవారే నా ఎదురుపడాలని కోరుకుంటారు. కాలం తీరింది లక్ష్మణా ఇక నీకు. యమపురిలో యముడి దర్శనం నీకు తథ్యం."

"రావణా! వీరుడూ, శక్తిమంతుడూ మాట్లాడడు. చేసి చూపిస్తాడు. పాపులూ, అల్పాయుష్కులూ వంటి నీలాంటి వారే మహా గొప్పగా తమకి తాము పొగుడుకుంటారు.

"యుద్ధానికి సిద్ధంగా ఉన్నాను. నీ ప్రతాపమూ, మహా పరాక్రమమూ చూపించు."

రావణుడు శరచాపాలు ధరించిన దైన్యమెరుగని బుద్ధిగల లక్ష్మణుడి వైపు ఉగ్రంగా చూశాడు. ధనుస్సు సంధించి బంగారు ములుకులు గల ఏడు

బాణాలు వదిలాడు. లక్ష్మణుడు ప్రతిగా పొన్నులు గల ఏడు బాణాలు వేసి మధ్యలోనే వాటిని త్రుంచి వేశాడు. రావణుడు మండిపడి మరింత శక్తివంతమైన బాణాలు, తీక్షణ బాణాలు వేశాడు. మహా వెలుగులూ, శబ్దాలూ విరజిమ్ముతూ అవి లక్ష్మణుడి మీదకు వచ్చాయి.

లక్ష్మణుడు క్షురమూ, అర్థచంద్రమూ, కర్లికా, భల్లమూ లాంటి బాణాలతో వాటిని వక్కలు చేశాడు. అది చూసి రావణుడు మండిపడి మహా శక్తివంతమైన బాణాన్ని తీశాడు. దాన్ని మధ్యలోనే త్రుంచేశాడు లక్ష్మణుడు.

దేవతల విరోధి లంకేశ్వరుడు లక్ష్మణుడి కోదండ విద్య చూసి దేవేంద్రుడి వజ్రాయుధం కంటే శక్తి కలది, ప్రళయాగ్ని వంటి అస్త్రాన్ని తీశాడు. ఆ బాణాన్ని సరిగ్గా లక్ష్మణుడికి గురి పెట్టాడు.

రావణుడి మీదకు నిప్పులు కక్కే, మంటలు కక్కే బాణాలు వేస్తున్నాడు లక్ష్మణుడు. అదే సమయంలో రావణుడి అస్త్రం అన్నింటిని చేధించుకొని లక్ష్మణుడిని తాకింది. లలాటమును కొట్టింది. లక్ష్మణుడి చేతిలోని ధనుస్సు జారింది. అయినా బిగించి సర్దుకున్నాడు.

తూణీరం లోంచి బాణాన్ని తీసి మంత్రించి వదిలాడు. గాలిని చీల్చుకుంటూ వెళ్ళి రావణుడి ధనుస్సుని తాకింది. ఆ మరుక్షణమే మరో మూడు బాణాలు రావణుడ్ని తాకాయి.

రావణుడు ప్రళయకాల రుద్రుడయ్యాడు. ఓ మానవుడు తనని నిరోధించటమా! అనుకొని బ్రహ్మ ఇచ్చిన మహోన్నతమైన శక్తిని తీసి వేశాడు. అది మహా అగ్ని పర్వతంలా వానరసేన అదిరిపోయేట్టు బ్రహ్మాండమైన ఎర్రని వెలుగుతో వచ్చి లక్ష్మణుడ్ని తాకింది.

రావణుడి ఆ బ్రహ్మ శక్తి వచ్చి మహేంద్రునితో సమానమైన లక్ష్మణుడి రొమ్ముని తాకటంతో లక్ష్మణుడు ఉత్తర క్షణంలోనే మూర్ఛపోయాడు.

రావణుడు వికటాట్టహాసం చేసి రథం మీద నుంచి దూకి లక్ష్మణుడి దగ్గరికి వచ్చాడు.

లక్ష్మణుడిని బంధీగా తీసుకెళ్ళి రాముడ్ని వంచించాలను కున్నాడు. పైకి ఎత్తబోయాడు... 'ఊహు' సాధ్యపడలేదు.

కైలాస పర్వతాన్ని ఎత్తిన చేతులతో లక్ష్మణుడిని ఎత్తలేకపోయాడు. మందర పర్వతమూ, మేరు పర్వతమునూ ఎత్తే శక్తి గల రావణుడు





మూడులోకలములనూ ఎత్తే శక్తి గల రావణుడు లక్ష్మణుడిని మాత్రం ఎత్తలేకపోయాడు. మళ్ళీ ప్రయత్నించాడు. వాయుపుత్రుడు హనుమంతుడు చూశాడు. రావణుడి ప్రయత్నం అర్థమైంది. క్రుద్ధుడై ఎగిరి రావణుడి ముందుకు దూకి పిడికిలి బిగించి మోదాడు.

రావణుడు ఆ దెబ్బకు చలించి ఆపై తట్టుకొని లేచాడు. హనుమంతుడు ఉగ్రరూపంతో రావటం చూసి రథం మీద కెళ్ళాడు. ఆయుధాన్ని ధరించాడు.

ఈలోగా హనుమంతుడు లక్ష్మణుడ్ని ఎత్తుకొని గాలి కన్నా వేగంగా శ్రీరాముడి వద్దకెళ్ళాడు. హనుమంతుడు లక్ష్మణుడిని ఎత్తుకొనగానే శక్త్యాయుధ శక్తి సన్నగిల్లి, తిరిగి రావణుడి అక్షయ తూణీరాన్ని చేరింది.

లక్ష్మణుడు తేరుకున్నాడు. వానరులంతా రావణుడి వీర విహారం గూర్చి చెప్పారు. మహావానరవీరులంతా భంగపడటంతో శ్రీరాముడు శీఘ్రంగా కదిలాడు. శ్రీరాముడు ధనుస్సు అందుకున్నాడు. హనుమంతుడు శ్రీరాముడితో చెప్పాడు.

"ప్రభూ! శ్రీరామా! గరుత్మంతుడు శ్రీమహావిష్ణువుకి వాహనము. తమకి నేను. నా భుజాలపై అధిరోహించండి. రావణుడ్ని సంహరించండి" చెప్పాడు హనుమంతుడు.

వాయుపుత్రుడ్ని అధిరోహించి యుద్ధరంగంలో మధ్యలో కొచ్చిన శ్రీరాముడు దివ్యరథం నుండి ఎడతెరిపి లేకుండా బాణాలను వేస్తున్న రావణుడ్ని చూశాడు.

బలిచక్రవర్తిని చూసిన విష్ణుమూర్తిలా రావణుడి మీదకు వెళ్ళాడు. మహాపర్వతాలూ, రెండు వజ్రాయుధాలూ, నింగీ, నేలా 'ఢీ' కొంటే వచ్చే శబ్దంతో సమంగా ధనుష్టంకారం చేశాడు. ఆ ధనుష్టంకారానికే కొంతమంది రాక్షసులు గుండెలు పగిలి చచ్చారు. మరికొంత మంది రక్తం కక్కుకున్నారు.

"రావణా! నీ అంతిమ కాలం దగ్గర పడింది. ఇంద్రుడూ, యముడూ, సూర్యుడూ, అగ్ని, రుద్రుడూ ఎవరూ నిన్ను ఇక రక్షించలేరు. విశ్వంలోని దిక్కులలో ఏ దిక్కుకు వెళ్ళినా నిన్ను వదలను."

శ్రీరాముడ్ని రావణుడు చూశాడు. తేరిపారా చూశాడు. శ్రీరాముని ఒక్క ముహూర్తం పాటు చూస్తుండిపోయాడు. మహా తేజస్సు... స్థిరత్వముతో ఖర,దూషణలనూ, జనస్థానంలో పద్నాలుగు వేలమంది రాక్షసులనూ

సంహరించినది ఈ ముగ్ధమోహన సుందరుడా! రావణుడికి ఏదో తెలియని మగత ఆవహించి తన్మయంగా చూస్తుండిపోయాడు. కేవలం క్షణమే... తేరుకున్నాడు.

"దశరథ పుత్రా రామా! ఈ రోజు కోసమే ఎదురు చూస్తున్నాను" అని కాలాగ్ని శిఖల వంటి బాణాలను వేశాడు. అవి చంద్ర నిప్పులు వెదజల్లుతూ శ్రీరాముడి దిశగా వెళ్ళాయి. హనుమంతుడు తన చేతులతో వాటిని త్రోసేశాడు. మహా వెలుగుతో వచ్చిన వాటిని త్రోయగానే హనుమంతుడి తేజస్సు రెండింతలయ్యింది.

శ్రీరాముడు బాణాన్ని సంధించి వదిలాడు. దేవతలూ, సిద్ధులూ, గంధర్వులూ పై నుంచి ఉత్కంఠంతో చూస్తున్నారు. శ్రీరాముడి బాణం వెళ్ళి రావణుడి పతాకాన్ని విరగకొట్టింది. ఆ వెనువెంటనే వచ్చిన బాణాలు రథ చక్రాలనీ, గుర్రాలనీ, గొడుగులను తాకాయి. మరో బాణం సారథి కంఠాన్ని చీల్చింది. అర్ధచంద్ర బాణం నవరత్న ఖచిత కిరీటాన్ని తాకింది. 'ఠంగ్' మని శబ్దం చేస్తూ సూర్యుని వంటి ప్రకాశము గల కిరీటం క్రింద పడింది.

రావణుడు నిశ్చేష్టుడయ్యాడు. వజ్రాయుధాలకీ, పిడుగులకీ చలించని రావణుడు శ్రీరాముని బాణ ధాటికి నిరుత్తురుడయ్యాడు. విషం పిండిన సర్పమయ్యాడు.

"రావణా! సారథి మరణించాడు. శస్త్రాస్త్రాలూ నిరూపయోగమయ్యాయి. నిరాయుధంగా యుద్ధరంగంలో ఉన్నావు. అధర్మంతో చేసిన ఘోరాలకి ఎవ్వరికైనా ఎలాంటి వాడికైనా ఈ రోజు తప్పదు.

"రావణా! పో! అలసిపోయావు. లంకకు పో. ఆయాసం తీర్చుకో... సేద తీరు... రాక్షస రాజా! నేడు పోయి రేపురా!" చెప్పాడు శ్రీరాముడు.

రావణుడు అవమాన భారంతో కృంగిపోయాడు. మహాబలవంతుడూ ముల్లోకాలను గడగడలాడించినవాడూ, తన దర్పముతో పంచభూతాలనూ, వన్యదేవతలనూ శాసించగల లంకేశ్వరుడు మౌనంగా తలదించుకొని లంకకి తిరిగి వెళ్ళాడు.

ఆ దృశ్యాన్ని చూసిన దిక్పాలకులూ, దేవతలూ, నాగులూ, భూతగణాలూ భూమి మీద వారూ, నీటిలోని వారూ అంతా చూసి హర్షం వ్యక్తం చేసి ఆనందించారు.





## రావణుడి అవమాన భారం

రాముని చేతిలో పరాజయమైన లంకేశ్వరుడు రావణుడు తన లంకా నగరానికి వస్తూనే తన సభకి నేరుగా వెళ్ళిపోయాడు. కనకపు సింహాసనాన్ని చూస్తూ దానిపై కూర్చొనక దాన్ని పట్టుకొని వంగాడు. గాయాలతో, విరిగిన కవచాలతో, జుట్టురేగి పోయి గంభీరంగా ఉన్నాడు. మొహం కందగడ్డలా ఉంది. సింహరాజును చూసి పారిపోయిన మదపుటేనుగు వలే వణుకుతున్నాడు.

పొగలతో, నిప్పులతో, భయంకరంగా వచ్చే శ్రీరాముని బాణాలే కనుల ముందు మెదులుతున్నాయి.

రాక్షస వీరులంతా ఊపిరి బిగపట్టి చూస్తున్నారు. ఎవ్వరికీ మాట పెగులుటలేదు. భయంగా రావణుడ్నీ, అతడి ఉద్వేగాన్నీ, ఆవేశాన్నీ గమనిస్తున్నారు.

"వీరాధివీరులైన రాక్షసులారా! లంకేశ్వరుడను. వర ప్రసాద లబ్ధమైన శస్త్రాలు ఉన్న వాడిని. ముల్లోకాలలోనూ వీరాధి వీరుడుగా కీర్తిగడించినవాడను. దేవేంద్రుడూ, నాగులూ, యక్షులూ, గంధర్వులూ, పంచభూతలూ, నా ఆజ్ఞ జవదాటరే. ఒక్క మానవుడి ముందా నా భంగపాటు.

"ఎప్పుడో... గతంలో ఇక్ష్వాకు వంశంలోని అనరణ్యుడని తరిమి తరిమి కొట్టాను. ఆ సమయంలో ఆ రాజు నా చిత్రవధ తట్టుకొలేక, ఓయీ రావణా! నా వంశంలోనివాడే నీ కంఠాన్ని నేల రాల్చేవాడు పుడతాడు. నీ సమస్త సామ్రాజ్యాన్నీ, పుత్రులనూ, అమాత్యులనూ, సైన్యాలనూ కూకటి వేళ్ళతో పెకిలిస్తాడని శపించాడు.

"ఆ అనరణ్యుడు చెప్పిన ఉత్తమమైన పురుషుడే ఈ రాముడా! అట్లే మహాసాధ్వి వేదవతి వద్దకు కామంతో దగ్గరవ్వబోయాను. అందులకూ ఆమె శపించింది. ఆ భాగ్యవతి..... ఆ వేదవతి..... ఈ సీతేనా! జనకుని కూతురు శ్రీరాముడి పత్ని వైదేహి వేదవతి అయి ఉండవచ్చా!

"రాక్షసులారా! అపార శాపగ్రస్తుడను. అన్నీ ఒకేసారి నన్ను చుట్టు కోబోతున్నాయా! మహా రుద్రుని కైలాస పర్వతము పెకిలించినప్పుడు శివుని పత్ని ఉమాదేవి నన్ను శపించింది. ఓ స్త్రీ వల్లే నీవూ, నీ వంశం నాశనమవుతాయని. నందికేశ్వరుడూ శపించాడు. మానవుల వల్ల, కోతుల వల్ల పరాభవం తప్పదన్నాడు.

"అట్టే రంభని కాంక్షించి శాపానికి గురయ్యాను. వరుణ కన్య. మహా సౌందర్యరాశి. సుగుణాల సుందర ముగ్ధ పుంజికస్థల స్త్రీని రమ్యంగా అనుభవించాను. దానికి ప్రతిగా బ్రహ్మ శాపం. ఎంతో మంది తాపసులూ, మహర్షుల శాపనార్థాలు. అన్నీ ఎన్నో... బ్రహ్మరాత... ముని వాక్కు వృధాపోదు.

"రాక్షసులారా! అయిననూ పర్వాలేదు. గత శాపాలతో ఎంతో జాగురూకతతో ఉండాలి. లంకానగర గోపురాల మీదా, ముఖ్య భవనాలపైనా, రహస్య ఆయుధశాలల్లోనూ గిడ్డంగుల వద్దా కాపలాని రెట్టింపు చెయ్యండి.

"మహా వీరుడూ, పర్వతాలకే పర్వతం వంటి వాడూ బ్రహ్మశాపం వల్ల నిద్రపోయేవాడూ, దేవతల అహాన్నీ, దర్పాన్నీ, అణగదొక్కినవాడూ, నా సోదరుడు కుంభకర్ణుడిని నిద్ర లేపండి. దేవేంద్రుడితో సమానమైన పరాక్రమవంతుడు.

"నిద్రపోవటం తప్ప ఎట్టి శాపములు లేనివాడు. మహా భయంకరమైన తన పాదాల క్రింద వానర సేనను నుజ్జు నుజ్జు చేస్తాడు. ఇంతటి భయంకర పరిస్థితిలో వాడు ఉండి కూడా నిద్రపోతుంటే లంకకే భారం. కుంభకర్ణుడు నిద్రపోతే ఆరు నెలలు లెగవడు. తొమ్మిది రోజుల క్రితమే నిద్రకు ఉపక్రమించాడు. మళ్ళీ ఆరు నెలలకి గాని లేవడు. కాని తప్పదు. నిద్రలేపాల్సిందే.

"మహాబాహుడూ, రాక్షసముఖ్యుడూ, మహా ధ్వజమూ అయిన కుంభకర్ణుడిని లేపండి" ఆజ్ఞాపించాడు రావణుడు.

## కుంభకర్ణుడు

లంకేశ్వరుడి ఆజ్ఞతో సేనా నాయకులు కుంభకర్ణుడి మందిరానికి బాగా కాల్చిన మాంసమూ, మృగాల రక్తమూ, తీపి, కారపు పదార్థాలూ, అన్న రసాలనూ పెద్ద పెద్ద గంగాళాల్లోనూ, పెద్ద పెద్ద పళ్ళాల్లోనూ తీసుకెళ్ళారు. సుగంధ ద్రవ్యాలతో ప్రత్యేకంగా చేయటంతో పదార్థాలు సువాసనలను వెదజల్లు తున్నాయి.

కుంభకర్ణుడు భవనం ఒకటిన్నర యోజనము వైశాల్యముతో అత్యద్భుతంగా ఉంటుంది. అందులోకి పదార్థాలతో వెళ్ళిన వారు ఎంతో కష్టం మీద గాని లోనికి వెళ్ళలేకపోయారు.

మహాపర్వతంలా కుంభకర్ణుడు పడుకొని గుర్రుపెడుతున్నాడు. అతడు శ్వాస తీసుకుంటున్నప్పుడు మహాశక్తి లాక్కెళ్తున్నట్టుగా ముందు కెళ్ళటం. శ్వాస వదిలేటప్పుడు పెను అదృశ్యభూతమేదో తమని పట్టి అవతలకి విసిరేసినట్టుగా వెళ్ళిపడుతున్నారు. ఎట్టకేలకు అతని నిద్రా మందిరంలోకి రత్నములతోనూ, బంగారంతోనూ నిర్మించిన పాత్రలతో సమస్త సంభారాలతో వెళ్ళారు పదివేల మంది రాక్షసులు.

గాఢ నిద్రలో కుంభకర్ణుడు గురక పెడుతున్నాడు. బంగారపు కిరీటాన్ని ధరించి సమస్త ఆయుధాలతో బుస కొడుతున్నట్టు నిద్రిస్తున్నాడు. కుంభకర్ణుడి వెంట్రుకలు నిక్కబొడుచుకొని ఉన్నాయి. అలా ఊపిరి పీల్చినప్పుడల్లా బంగారు భుజకీర్తులూ, రత్నాల వజ్రాల కిరీటమూ కదులుతున్నాయి. మహా పాతాళాన్ని గుర్తుకు తెచ్చే అతని నోరు చూసి తెచ్చిన పదార్థాలను సరి చూసుకున్నారు. పాతాళం వంటి అతని నోటిలో ఏ మూలకూ సరిపోవని అర్థమైంది. కుప్పలుగా మాంసాన్ని పోశారు. కడవల కొద్దీ రక్తాన్నీ, కల్లునూ ఉంచారు. మూకుమ్మడిగా నిద్ర లేపటానికి ప్రయత్నించారు.

మహా రుచికరమైన అన్నరసాలను దగ్గరగా ఉంచారు. కొంతమంది దగ్గరికెళ్ళి దివ్యసుగంధాలూ, చక్కటి సువాసనలొచ్చే పూల దండలూ వేశారు. సువాసన గల సుగంధ ద్రవ్యముల వాసన చూపించారు. అయినా కుంభకర్ణుడిలో చలనము లేదు.

జింకల మాంసానికీ, ఏనుబోతుల మాంసానికీ, పందుల మాంసానికీ కుంభకర్ణుడి భయంకరమైన ముక్కు మాత్రం కదిలింది. మేరు పర్వతమంతటి మాంసరాసులను పోశారు.

రాక్షస వీరులు కొంతమంది శూలాలూ, ముద్గలాలూ, పొడవాటి ములుకుల గల బాణాలతో పొడవటం చేశారు. రోకళ్ళతోనూ, మహా వృక్షాలతోనూ బాదారు. కుంభకర్ణుడు లేవలేదు సరి కదా... వారి ఆయుధాలన్నీ, విరిగి పోయి వంకర తిరిగాయి.

ఈసారి భయంకర ధ్వనులొచ్చే మృదంగ నాదాలు చేశారు. పెద్ద పెద్ద శంఖాలతో, భేరీలతో, పణవాలతో చెవులు చిల్లులు పడే శబ్దాన్ని చేశారు.

ఇక లాభం లేదనుకొని అంతా మూకుమ్మడిగా పట్టుకున్నారు. కుదిపారు. లాభం లేదు. కుంభకర్ణుడు శ్వాస పీల్చి వదులుతుంటే ఆ గాలి వేగానికి కొంతమంది గాలి పటాల్లా ఎగిరి క్రింద పడ్డారు. వెయ్యి భేరీలు తెచ్చి బలమైన బంగారు దండములతో ఒకేమారు మ్రోగించారు.

అదీ కుదరక పోవటం వల్ల మదపుటేనుగులను తెప్పించారు. ఘీంకార ధ్వనులు చేయించారు. లంకా నగరమంతా మారు మ్రోగాయి. కుంభకర్ణుడిలో మాత్రం చలనం లేదు.

ఈసారి పెద్ద కుండల నిండా నీళ్ళు తెచ్చి పోశారు. ముక్కులో, చెవుల్లో, పెద్ద శూలాలతో పొడిచారు. వెయ్యి ఏనుగులను కుంభకర్ణుడి మీదకు పంపారు. అవి నడుస్తూ ఘీంకరిస్తుంటే తన మీద ఏదో ఉన్నట్టు అనిపించి కదిలాడు. మహాసర్పాల్లాంటి తన చేతులను లేపాడు. ఆవలిస్తూ వికృతంగా అరుస్తూ నెమ్మదిగా లేచి అడిగాడు.

"ఆకలి... ఆకలి..." మండుతున్న అగ్నిహోత్రంలా అరిచాడు. కుంభకర్ణుడి ముందు అన్నీ మాంసాలనూ, అన్న రసాలనూ, మద్యాలనూ పెట్టారు.

"కుంభకర్ణుడు పాతాళంలాంటి తన నోట్లోకి గంగాళాలలో ఉన్న మాంసాన్నీ, మద్యాలనూ వేశాడు. చప్పరించాడు. దాహం వేయటంతో బానల కొద్దీ ఉన్న కల్లునీ, క్రొవ్వునూ, మద్యమునూ త్రాగేసి బానలను విసిరికొట్టాడు.

తృప్తిగా నిట్టూర్చాడు. ఒళ్ళు విరుచుకున్నాడు. రాక్షసవీరులు సాష్టాంగ నమస్కారాలు చేశారు.

"రాక్షసులారా! నన్ను ప్రయత్న పూర్వకంగా నిద్ర లేపారంటే ఏదో ఒక ఆపద వచ్చి ఉండాలి. లంకేశ్వరునికి నన్ను నిద్రలేపాల్సిన అవసరం వచ్చిందంటే దేవతలంతా కట్టగట్టుకొని లంక మీదకు వచ్చి ఉంటారు. ఎవ్వరైననూ పర్వాలేదు. దేవేంద్రుడినీ, అగ్ని హోత్రుడినీ చేరో చేతితో గుద్ది యమపురికి పంపుతాను. అగ్నిని కూడా చల్లగా చేసేస్తాను" చెప్పాడు కుంభకర్ణుడు.

లంకేశ్వరుడి మంత్రి శ్రేష్ఠుడు యూపాక్షుడు కుంభకర్ణుడికి అత్యంత విధేయంగా నమస్కరించి చెప్పాడు.

"మహావీరా కుంభకర్ణా! లంకకు ఆపద వచ్చింది. మీరన్నట్టు దేవతల వల్ల కాదు. ఒక మనుష్యుడు దశరథ పుత్రుడు శ్రీరాముడి వల్ల. మన రాక్షస సేననూ, మహా నాయకుడైన ప్రహస్తుడ్నీ, వజ్రదంష్ట్రుడ్నీ, ఎందరినో సంహరించారు. లంకా నగరాన్ని ముట్టడించారు.

"పులస్త్య వంశ తిలకమైన రావణుడు యుద్ధరంగాన వెనుకడుగు వెయ్యవల్సి వచ్చింది. ముల్లోకాల్లో ఎవ్వరూ చెయ్యని పరాభవం శ్రీరాముడు రావణునకు చేశాడు. తప్పక తప్పనిసరై తమని నిద్ర లేపమన్నారు లంకాధిపతి రావణుడు."





కుంభకర్ణుడు కోపంతో కళ్ళు తిప్పుతూ కనుగుడ్లు పెద్దవి చేశాడు.

"ఓ మానవుడా! ఇక నేటితో నీ ఆయువు తీరింది. ముందు శత్రుసంహారం ఆపైనే అన్నగారి దర్శనము" లేచాడు.

రాక్షసయోధుడు మహోదరుడు కుంభకర్ణుడికి నమస్కరించాడు.

"గొప్ప బాహువులు కలవాడా! ప్రభూ! ముందు తమరు రావణ దర్శనం చేసుకొని గుణదోష విమర్శలు చేసి పిమ్మట యుద్ధరంగానికి వెళ్ళాలన్నది అన్నగారి అభిమతం."

భయంకర నేత్రుడూ, భయంకర పరాక్రమవంతుడు కుంభకర్ణుడు తలవూపి రెండు వేల కడవల మద్యము మళ్ళీ సేవించి అన్న రావణుడి దర్శనానికి లేచాడు. కుంభకర్ణుడు అడుగు తీసి అడుగు వేస్తుంటే భూమి చలిజ్వరం వచ్చినట్టు వణికింది.

లంకా నగర రాచ వీధిలో నడుస్తుంటే లంక ప్రజలూ, పుర ప్రముఖులూ, రెండు కన్నులార్పి మరీ చూశారు.

దేవేంద్రుడు, చతుర్ముఖుడైన బ్రహ్మని దర్శించటానికి బ్రహ్మలోకం వెళ్ళినట్టు కొండ శిఖరం లాంటి కుంభకర్ణుడు రావణుడి భవనంలోకి వెళ్ళాడు.

ఆ మహాకాయుడ్నీ, తేజోమంతుడ్నీ లంక వెలుపల యుద్ధరంగంలోని వానరులూ, రాక్షసులూ చూశారు. వానరులంతా కళ్ళు పెద్దవి చేసుకొని చూశారు. గుండెలవిసి పోయాయి. భయంగా, బెదురుగా వెళ్ళి శరణాగత రక్షకుడైన శ్రీరాముడి వెనుక చేరారు.

## కుంభకర్ణుడి ప్రతాపము

మహా పర్వతమే కదులుతుందా అన్నట్టు లంకా నగర భవనాలని కూడా సవాలు చేస్తున్నట్టున్న కుంభకర్ణుడిని శ్రీరాముడూ చూశాడు. వానరులను సముదాయించాడు. ప్రాజ్ఞుడు విభీషణుడు శ్రీరామునకు నమస్కరించి చెప్పాడు.

"శ్రీరామా! అతను, ఆ పర్వతాకారుడు రావణుడి సోదరుడు కుంభకర్ణుడు. నాకు రెండో అన్న. సమస్త రాక్షసులలోనూ పెద్ద ఆకారం కలవాడు. దేవేంద్రుడిని సైతం హడలు గొట్టినవాడు.

"యక్ష, గంధర్వ, దేవ, నాగ లోకాలన్నింటితో యుద్ధం చేసిన వాడు. మహా యముడే యుద్ధానికి వచ్చినట్టు శత్రువులు విలవిలలాడిపోయేవారు.

"శ్రీరామా! అందరివలే కుంభకర్ణుడు బ్రహ్మ, రుద్రాదుల వర ప్రసాదాలతో వీరుడు కాదు. ఎట్టి వరాలూ లేవు. కానీ పుట్టుకతో సహజ సిద్ధ వీరాధివీరుడు. కుంభకర్ణుడు జన్మించిన మరుక్షణమే అనేక జంతువులను వేలకు వేలు తిని పారేశాడు. ఆకలి తీరక ఆకలీ... ఆకలీ... అంటూ దేవలోకం మీద పడ్డాడు. దేవేంద్రుడి వజ్రాయుధం దెబ్బ కూడా లెక్క చెయ్యలేదు. ఐరావతం దంతం లాగి దాని తోనే పొడిచాడు దేవేంద్రుడిని.

"దానితో దేవతలంతా బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి ప్రార్థించి మొరపెట్టుకున్నారు. తాపసులూ, మునులూ వచ్చి కుంభకర్ణుడి దౌర్జన్యాలకి ఆశ్రమాల్లోని ఏ ప్రాణీ మిగలటంలేదని చెప్పారు.

దేవేంద్రుడు కుంభకర్ణుడి అకృత్యాలకి ఆనవాలుగా వక్షస్థలం చూపించాడు. వక్షస్థలం మీద ఐరావతం దంతంతో చేసిన గాయాన్ని చూపాడు. కుంభకర్ణుడు చేసిన ధ్వంసములూ, పరదారలను పట్టుకొని పోవటమూ, అంతా బ్రహ్మదేవుడు దివ్యదృష్టితో తిలకించాడు.

"బ్రహ్మదేవా! ఇలానే జరిగితే దుష్టబుద్ధి కుంభకర్ణుడు తమ సృష్టి మొత్తాన్నీ భక్షించి వేస్తాడు. జగత్తులో ప్రాణి అన్నది కానరాదు" చెప్పాడు దేవేంద్రుడు సర్వలోక పితామహునకు.

బ్రహ్మదేవుడు కుంభకర్ణుడిని రమ్మని ఆజ్ఞాపించాడు.

"కుంభకర్ణా! నీ తండ్రి విశ్రవసుడు లోకంలోని ప్రాణి నంతటిని భక్షించుటకే నిన్ను కనినట్లున్నాడు. అది ఎట్టి పరిస్థితుల్లోనూ జరగదు. కాన ఇకపై నీవు చచ్చినట్టు నిద్రపో..."

బ్రహ్మవాక్కుతో కుంభకర్ణుడు నిద్రపోయాడు. అది చూసి రావణుడు బ్రహ్మదేవుడికి మొరపెట్టుకొని వేడుకున్నాడు.

"పితామహా బ్రహ్మదేవా! నీ ముని మనవడి మీదా నీ శాపం. వలదు. తగదు. బంగారు పంట చేతికొచ్చే వేళ నీ చేతులతోనే నరికి వేస్తావా? నీ వాక్కు వృథా కాకుండా, నిద్రలేవటానికీ, తిరిగి పడుకోవటానికీ సమయం నిర్దేశము చేయి."

రావణుడి ప్రార్థన బ్రహ్మదేవుడిని కరిగించింది.

"రావణా! ఆరు మాసాలకొకసారి నిద్రలేస్తాడు. ఒక్కరోజు మేలు కొని భక్షణ చేస్తూనే ఉంటాడు. కానీ... మధ్యలో నిద్రలేపుట శుభం కాదు."





"శ్రీరామా! అలా ఆ రీతిన బ్రహ్మ వాక్కు ప్రకారం నిద్రపోతూనే ఉంటాడు. నిద్రలేచిన వేళ భక్షణే అతని ప్రథమ ధ్యేయం. లంకేశ్వరుడు రావణుడు కుంభకర్ణుడ్ని సమస్త వానరసేననూ భక్షించేందుకే నిద్ర లేపాడు" చెప్పాడు విభీషణుడు.

శ్రీరాముడు ఆసాంతమూ విని సైన్య విభజన చేశాడు. గవాక్షుడూ, శరభుడూ, హనుమంతుడూ, అంగదుడూ లాంటి వీరులను కీలక స్థానాల్లో ఉండమన్నాడు. సైనిక వ్యూహాలని విడమర్చి చెప్పాడు.

శ్రీరాముడి ఆదేశం ప్రకారం ఎవరి స్థానాల్లో వారు మహా వృక్షాలూ, బండలూ, పర్వత శిఖరాలూ, పట్టుకొని శత్రువు కోసం ఎదురు చూడసాగారు. మహా పర్వతాన్ని మేఘసమూహం ఆవరించినట్టు వానరసేన లంక చుట్టూ కమ్ముకొని ఉంది.

## కుంభకర్ణ యుద్ధ రంగానికి తరలి వెళ్ళు

మహావిక్రముడు, పరాక్రమవంతుడు కుంభకర్ణుడు కమలాసనము మీద కూర్చొన్న రావణుడినీ, రాక్షససమూహాలనూ, మంత్రి పుంగవులనూ, సేనా నాయకులనూ చూశాడు. తన భారీ అసనం మీద రావణుడికి నమస్కరించి కూర్చున్నాడు.

రావణుడు కనులు ఎర్రగా ఉన్నాయి. ఏదో దిగులు ఆవరించి ఉంది. మహా తేజో రూపం మసక బారింది. క్రోధావిష్టుడై ఉన్నాడు.

"అన్నా! లంకేశ్వరా! నన్ను నిద్రలేపుటకు కారణం తెలిసినది. ఏమి నీ ఆజ్ఞ. లంక పైకి వచ్చిన వార్ని ఆ పైకి పంపిస్తాను" చెప్పాడు కుంభకర్ణుడు.

"కుంభకర్ణా! నీవు నిదురించి తొమ్మిది దినాలే అయినది. ఈలోగా చాలా జరిగాయి. దశరథ మహారాజు పుత్రులు శ్రీరామలక్ష్మణులూ, కిష్కింధ రాజు సుగ్రీవుడూ తన సమస్త వానరజాతితో లంక పైకి వచ్చారు.

"అనేక వీరాధి వీరులైన మన రాక్షస సేనా నాయకులనూ, ఆప్తులనూ, హితులనూ, సన్నిహితులనూ చంపేశారు. వానర సేనా నాయుకులలో ఇంత వరకూ ఒక్కర్ని కూడా మనం తుదిముట్టించలేకపోయాము.

"తమ్ముడా! కుంభకర్ణా! లంకకు ఆపద వచ్చింది. ధనాగారమంతా శూన్యమైపోయినా పర్వాలేదు. మహాబాహుడవు, మహాబలుడవు నీవు. నీవే గట్టెక్కించాలి. ఆ అపూర్వ దుష్కర కార్యం నెరవేర్చాలి.

"యుద్ధరంగానికి తరలి వెళ్ళు. వానర సైన్యాన్ని నమిలేయ్. శత్రువుల పాలిట మృత్యుదేవతవై కరాళ నృత్యం చేయి. శరత్కాల మేఘం సుడిగాలిని చెదరగొట్టినట్టు... నీ అరివీర పరాక్రమంతో చిందర వందర చేసి పారద్రోలు. ఈ సమస్త భూమండలాల్లో నిన్ను మించిన వీరుడు లేడు. అందులకనే ఆదిలో బ్రహ్మ నిద్ర అను తీపి శాపాన్ని నీకు ఇచ్చాడు."

## కుంభకర్ణుడి వివేక సూక్తులు

బంగారు కిటికీలతో సూర్యమండలంలా మెరిసిపోతున్న ఆ మహాసభలో కుంభకర్ణుడు లేచాడు. అన్నకు అంజలి ఘటించాడు. సభనంతా కలియ చూశాడు. తిరిగి రావణుడితో చెప్పాడు.

"లంకేశ్వరా రావణా! గతంలో ఇదే విషయాన్ని మననం చేసుకున్నాం. వైదేహి విషయంలో ఆనాడూ, ఈనాడూ ఒక్కటే శెలవిస్తున్నాను. పర స్త్రీ వ్యామోహం పతనానికి దారి తీస్తుంది. వంశ నాశనం చేస్తుంది. జనస్థానంలో ఖర, దూషణాదులను సంహరించినప్పుడే శ్రీరాముడు సాధారణ వ్యక్తి కాదు అని తెలిసింది.

"అయినా సీతాదేవిని అపహరించుకు వచ్చావు. రావణా! శత్రువు తన కన్నా బలహీనుడని తెలిసినప్పుడే యుద్ధానికి సిద్ధంకమ్మని యుద్ధనీతి చెబుతోంది. బలమున్నది కదాని ముందు చెయ్యాల్సిన పనులు వెనుక, వెనుక చెయ్యాల్సిన పనులు ముందు చేయుట తగదు. మంత్రులతోనూ, హితులతోనూ చర్చించి రాజు నిర్ణయం తీసుకోవాలి. నీతి శాస్త్ర విరుద్ధంగా నీవు స్వయం నిర్ణయం తీసుకొని సీతను తీసుకొచ్చావు.

"సామ, దాన, భేద, దండోపాయాలను సమ సమయాల్లో ప్రయోగించాలి. మంచి చెడ్డలు భేరీజు వేసుకోవాలి. ధర్మం, అర్థం, కామం, వీటి విషయాల్లో సమతూకం పాటిస్తే ఆపదలు రావు.

"దురాన ఉన్న శత్రువు కన్నా మనతో ఉండే నీతి శాస్త్రం తెలియని మంత్రులే ప్రమాదికారులు. తెలిసీ తెలియని పరిజ్ఞానంతో మెప్పుకోసం, చేయకూడని పనులు చేయిస్తుంటారు కొందరు. కామమే సర్వ ఆపదలకు మూలం. పరాయివాడి ధనమూ, స్త్రీ ఆ రెండూ కాలనాగులతో సమం.

"అన్నా! రావణా! పశువుల వంటి బుద్ధి గల వారికి అవకాశమిచ్చినచో ప్రాగల్భము వల్ల ఇష్టమొచ్చినట్టు చెబుతారు. శాస్త్ర జ్ఞానము లేక అర్థశాస్త్రము





తెలీక ఐశ్వర్యము తమకి వస్తే చాలు అని చెప్పే అట్టి వాళ్ళను రాజు అప్రమత్తంగా ఉంటూ తెలుసుకొని వార్ని దూరంగా ఉంచాలి.

"అన్నా! అన్యధా భావించవలదు. ధర్మార్ధకామాల్లో, ధర్మమే శ్రేష్ఠము. కామం సర్వ వినాశనము. లంకేశ్వరుడవు. మమ్ము పాలించువాడవు. విభీషణుడు చెప్పినట్టు... ఇప్పుడూ సమయం మించి పోలేదు. సీతాదేవిని శ్రీరాముడికి అర్పిద్దాము. కాదు అంటే రాజుగా, అన్నగా నీ ఆజ్ఞను శిరసావహిస్తాను" చెప్పాడు కుంభకర్ణుడు.

రావణుడు కనుబొమలు పైకెత్తాడు. విసురుగా చెప్పాడు.

"కుంభకర్ణా! హితోపదేశాల కోసం కాదు నిన్ను లేపింది. మంచో, చెడో జరిగింది. ఇప్పుడు మీరన్నట్టు తలవంచి సీతను అప్పగిస్తే రాక్షసుల పరువేం కాను. తెలివి గల వాళ్ళు జరిగిన దాన్ని తిరిగి మననం చేసుకోరు. జరగాల్సింది చేస్తారు.

"కుంభకర్ణా! అన్నీ ధర్మలూ పాటించి, అన్నీ సక్రమంగా చేస్తే నీవే కాదు. ఎవ్వరైనా హర్షిస్తారు. మన అంటే అర్థం. పరమార్థం. తప్పు ఒప్పు అనవసరం. మన వాడు చేశాడు. హర్షించాలి. ఏదైనా చెయ్యాలి. సమర్థించాలి. పోరాడాలి. ఇంతకు ముందు ఎంతో మంది స్త్రీలని చెరపట్టి తెచ్చాను. అప్పుడెవరూ మాట్లాడలేదే. అప్పుడున్న చేవ ఇప్పుడు తగ్గిందా!" హుంకరించాడు రావణుడు.

కుంభకర్ణుడు నిదానించి మెల్లగా చెప్పాడు.

"అన్నా! ఆవేశం వలదు. శాంతించు. రోషమును విడిచి స్వస్థుడవు కమ్ము. నే ఇప్పుడే యుద్ధ రంగానికి వెళ్ళి రామలక్ష్మణులనూ, వానరులనూ సమూలంగా నాశనం చేస్తాను. నే ఒక్కడ్నే వెళ్తాను. ఇంద్ర, యమ, అగ్ని, కుబేర, వరుణులు ఎందరొచ్చినా ఈ పుత్తి చేతులు చాలు. పాతాళ గుహలాంటి నా నోటితో వానర సేనను నమిలేస్తాను.

"అన్నా! నేను జీవించి ఉన్నంత వరకూ నీవు కలత చెందవద్దు. ఎవరి వల్ల నీవు దుఃఖిస్తున్నావో వారిని లేకుండా చేస్తాను. ఈ రోజుతో రామలక్ష్మణుల పని అయిపోయింది. ఇక నీవు హాయిగా మద్యం సేవించి, క్రీడించి రమించు. బంధువులు మరణించిన రాక్షసులకు ప్రియమైన వార్త అయిన రామలక్ష్మణుల హతం తెలియ చేస్తాను. ఆనందింప చేస్తాను" చెప్పాడు కుంభకర్ణుడు.

రావణుడు సింహాసనం దిగాడు. రత్నాల పొదిగిన కనకపు పూలహారాన్ని కుంభకర్ణుడి మెడలో వేశాడు. బాహువులకు బాహుపురులూ, చంద్రహారాలూ వేశాడు.

"కుంభకర్ణా! గదగానీ, ఖడ్గముగానీ, బాణములతో గానీ, ఎట్టి ఆయుధంతో గానీ, ఏవీ లేకుండా మహేంద్రుడినే వట్టి చేతులతో సంహరించే వీరుడవు. అయిననూసైన్యంతోనూ, ఆయుధాలతోనూ తరలి వెళ్ళు. నీ మహదాకారాన్ని చూస్తూనే వానరులు గుండెలు పగలి చస్తారు" చెప్పాడు రావణుడు.

బంగారు కాంతులతో మెరిసిపోయే వజ్రాయుధం వంటి శూలాన్ని అందుకున్నాడు కుంభకర్ణుడు. ఆ శూలం అనంతమైన వాయువేగంతో పోటి పడుతూ, శత్రువుల్ని సంహరిస్తుంది. దేవేంద్రుడు వదిలిన పిడుగువలే ధ్వనిస్తుంది. ఆ ధ్వనికే శత్రువు ప్రాణాలు అనంత విశ్వంలో కలిసిపోతాయి.

రావణాసురుడికి ప్రదక్షిణ చేశాడు. విజయ తిలకం దిద్దించుకున్నాడు. శంఖాలు పూరించారు. దుందుభులు మ్రోగాయి. మహాసేన కుంభకర్ణుడి వెంట తరలి వెళ్ళింది. సర్పములూ, ఒంటెలూ, గాడిదలూ, సింహములూ, ఏనుగులూ, లేళ్ళూ, పక్షులను ఎక్కి రాక్షసులు కుంభకర్ణుడిని అనుసరించారు.

చూస్తూనే దడుసుకు చచ్చే ఆకారంతో, పెద్ద రథచక్రాల వంటి కన్నులతో వంద ధనుస్సుల వెడల్పుతో, ఆరు వందల ధనుస్సుల పొడవుతో మహాభూమికి నిలబట్టిన ధ్వజంలా ఉన్నాడు. మండే మహా పర్వతంలా ఉన్నాడు.

సముద్రం అదిరిపోయేలా అరిచారు రాక్షసులు.

పక్షులు గుంపులు కట్టి కనిపించినా, భూమి కంపించినా, ఎడమ కన్నూ, ఎడమ భుజం అదిరినా ఆ దుర్నిమిత్తాలను పట్టించుకోలేదు కుంభకర్ణుడు. యముడి ఆహ్వానం అందుకున్న వాడి వలే వేగంగా అడుగులు వేశాడు.

## కుంభకర్ణుడి యుద్ధం

మహా వానరసేనను చూశాడు. మహా పర్వతాలూ, కొండలూ మధ్యకి చీలిపోయేలా అరిచాడు. బంగారు కవచము ధరించి, మెరుపు వంటి కాంతితో పర్వతరాజులా ఉన్న కుంభకర్ణుడిని చూస్తూనే వానరుల గుండెలు అదిరిపోయాయి. కట్టుత్రాడు తెంచుకొని పారిపోయిన ఎద్దుల్లా పారిపోయి గవాక్షుణ్ణీ, నీలుణ్ణీ, కుముదుణ్ణీ, అంగదుడ్ని శరణు వేడారు.





వానర సేనా నాయకులు వానరుల్లో ధైర్యాన్ని నూరి పోశారు. శక్తినీ, బలాన్నీ తెలియ చెప్పారు. అగ్నిలో మిడత పడి ఎలా బ్రతికి ఉండలేదో యుద్ధరంగంలో శ్రీరాముడు ఎదుట పడినవాడు అంతే... మరణించాల్సిందే.

వానరులు చెట్లూ, బండలూ, శిఖరాలూ పట్టుకొని కనులు పెద్దవి చేసి కుంభకర్ణుడినే చూస్తుండిపోయారు.

పెద్ద దేహము, విశాల ముఖము, కాల్చిన పర్వతంలా ఉన్న కుంభకర్ణుడు నోరు తెరిచి పీల్చాడు. ఆ ఉదుటుకు కుప్పలు కుప్పలుగా వానరులు పైకి ఎగిరి అతని నోట్లో పడిపోయారు. పడిన వారిని కరకర నమిలి మింగి మళ్ళీ నోరు తెరిచి వానరులను భక్ష్యాలగా భావిస్తూ తినేస్తున్నాడు.

అలానే జరిగితే వానరసేన మిగలదు. కుంభకర్ణుడు తన ఇనుప గుదియను వానరులపై ప్రయోగించి నుజ్జు నుజ్జు చేశాడు. సింహనాదము చేశాడు. ఆ సింహనాదానికే ఎంతో మంది వానరులు మరణించారు. కుంభకర్ణుడు పరాక్రమంతో వానరసేనను శివాలెత్తిస్తున్నాడు.

ఋషభుడూ, శరభుడూ, మైందుడూ, నలుడూ, సుషేణుడూ ధూమ్రుడూ, తారుడూ, కుముదుడూ, ద్వివిదుడూ, పనసుడూ, వాయు పుత్రుడూ రంగంలోకి దిగారు.

వారి వారి సేనల్లో ముఖ్యులు మహా వృక్షాలని పెకిలించి కుంభకర్ణుడి మీదకి విసిరారు. పెద్ద పెద్ద బండలని విసిరారు.

కుంభకర్ణుడు తన మీద తమలపాకులు పడ్డట్టు భావిస్తూ తన పొడవాటి చేతులతో చరిచాడు. ఒక్క చరుపుకే వందల మందిని 'ఠప' కట్టించి గుప్పెళ్ళలో చిక్కిన వారిని పట్టుకొని నోట్లో వేసుకున్నాడు.

నీలుడు ఓ కొండ శిఖరాన్ని పెకిలించి కుంభకర్ణుడి మీదకి విసిరాడు. ఋషభుడూ, శరభుడూ, గవాక్షుడూ, గంధమాదనుడూ, కుంభకర్ణుడి మీదకు మూకుమ్మడిగా కలిసి వెళ్ళారు.

పిడి గుద్దులు కురిపించారు. అరచేతులతో చరిచారు. వార్ని ఊది అవతలకి విసిరాడు. కుంభకర్ణుడు మలయ పర్వతం శిఖరానికేసి సుగ్రీవుడిని కొట్టాడు.

దేవేంద్రుడే స్వయంగా యుద్ధం చేస్తున్నట్టు రణ రంగమంతా ఆట స్థలంలా భావించాడు. మద్యం సేవించి మదువనంలో విహరించినట్టు విహరిస్తున్నాడు కుంభకర్ణుడు.

కొంతమంది వానరులు భయంతో ఎత్తు ప్రదేశాల్లోకి వెళ్ళారు. కొందరు పల్లం ప్రదేశాల్లోకి వెళ్ళారు. భల్లూకాలు చెట్లు చూసుకున్నాయి. మరికొన్ని పర్వతాల మీదకు పరుగులు తీశాయి. మరికొందరు ఏ సేతువు మీద వచ్చారో, ఆ సేతువు మీదే పరుగులు తీశారు. కొందరు సముద్రంలో మునిగారు. ఇంకొందరు గుహలను ఆశ్రయించారు.

భయంకరుడైన కుంభకర్ణుడు యుద్ధరంగాన వీర విహారం చేస్తున్నాడు. నీలుడ్ని మోకాలితో తన్నాడు. గవాక్షుడ్ని అరచేతితో చరిచాడు. గంధమాదనుడ్ని పాదంతో కొట్టాడు. ఋషభుడ్ని బాహువులతో నొక్కాడు. అంగదుడు స్పృహ తప్పాడు. కుంభకర్ణుడు శూలముతో సుగ్రీవుడి వైపు వెళ్ళాడు. హనుమంతుడి మీదకు, లక్ష్మణుడి మీదకు ఉరికాడు. కోపించిన దిగ్గజమువలే సంచరించాడు.

వానరులంతా శ్రీరాముని వద్దకు వెళ్ళారు. మహా పరాక్రమముతో ఉన్న కుంభకర్ణుడి అరివీర భయంకర రూపం గూర్చి చెప్పారు.

శ్రీరాముడు ధనుస్సు పట్టుకొని వడివడిగా కుంభకర్ణుడి వద్దకు వెళ్ళాడు. మహా మద్గరంతో వానరులను బాదుతున్నాడు. పురుషశ్రేష్ఠుడైన శ్రీరాముడు మహా తేజోవంతమైన ఏడు బాణాలు వేశాడు. చలించలేదు. రౌద్రాస్త్రం తీశాడు. మంత్రించాడు. వదిలాడు.

బ్రహ్మాండ వేగంతో వెళ్ళింది. కుంభకర్ణుడి రొమ్ముకి తగిలింది. కుంభకర్ణుడు భయంకరంగా అరిచాడు. చేతిలోని మద్గరం జారిపోయింది. ఈసారి శ్రీరాముడు నెమలి రెక్కలు కట్టిన బాణాన్ని వేశాడు. కుంభకర్ణుడి రొమ్మును చీల్చిందది. భూమిని చీల్చుకొని జలధార వచ్చినట్టు రక్తం... కుంభకర్ణుడు శ్రీరాముడ్ని చూస్తూ సింహనాదం చేశాడు.

ఇంద్రాస్త్రం తీశాడు శ్రీరాముడు. కుంభకర్ణుడిని తేరిపార చూశాడు. రెండు కనులు నెమ్మదిగా మూసి మంత్రించాడు. సంధించి వదిలాడు రామ బాణాన్ని.

నిప్పులు కక్కుతూ, బ్రహ్మాండమైన తేజస్సుతో, బ్రహ్మదండంలా, వజ్రాయుధంలా దశదిశలా వెలుగులు విరచిమ్ముతూ దేవాసుర యుద్ధంలో దేవేంద్రుడి వజ్రాయుధం వృత్రాసురుడి తలను తెగకొట్టినట్టు కుంభకర్ణుడి తలని ఎగరకొట్టింది. తల వెళ్ళి లంకా పట్టణపు భవన శిఖరాలని తాకి పడింది. మొండెం వెళ్ళి మహా సముద్రంలో పడింది. ఆ పడిన వేగానికీ, బరువుకీ





సముద్రపు నీరు ఆకాశాన్నంటింది. సముద్రంలో ఎన్నో పర్వతాలూ, కొండలూ ముక్కలైయ్యాయి.

వానరులు జయ జయ ధ్వనులు చేశారు. వానర సేనా నాయకులు వృత్రాసురుడ్ని వధించిన దేవేంద్రుడివలే మెరిసిపోతున్న శ్రీరామునకు నమస్కరించారు.

రాహు ముఖం నుంచి విముక్తుడైన సూర్యుడిలా వెలిగిపోయాయి వానరుల ముఖాలు.

## రావణుడి పుత్రులు

రాక్షస వార్తాహరులు లంకేశ్వరుడు రావణుడి వద్దకు వచ్చారు. అతి భయంకరుడూ మహాకాయుడూ అయిన కుంభకర్ణుడు శ్రీరామ బాణానికి హతమయ్యాడని చెప్పటానికి ముందు సంశయించారు.

"ప్రభూ! మహా కాలాంతకుడు కుంభకర్ణుడు కోట్లాది వానరులని సంహరించినాడు. కొందరిని భక్షించాడు. మరి కొందరిని తుక్కు తుక్కు చేశాడు. వానర సేనా నాయకులందరినీ చితక బాదినాడు. అయిననూ రామ బాణానికి హతమై పోయి సముద్రంలో పడినాడు. శిరస్సు నగరపు భవన శిఖరాలను తాకి నేల రాలినది."

రావణుడి గుండె కలుక్కుమంది కుంభకర్ణుడి మరణం విని. దేవాంతకుడూ, నరాంతకుడూ, త్రిశిరుడూ, అతికాయుడూ వలవల ఏడ్చారు. పిన తండ్రి మరణానికి కుమిలిపోయారు.

సవతి తల్లి పుత్రులైన మహోదరుడూ, మహాపార్శ్వుడూ సోదరుడైన కుంభకర్ణుడుని శ్రీరాముడు సంహరించాడనగానే దుఃఖ మహాసముద్రంలో మునిగిపోయారు. శోక దేవత తిష్ఠ వేసుకొని కూర్చున్నట్టుగా ఉంది రావణుడి మందిరం.

ప్రళయాగ్నిలాంటి వాడివి, బ్రహ్మదేవుడ్నే కలవర పర్చినవాడివి, రుద్రుడంతటివాడివి, మహా మహా ఆయుధాలూ, వజ్రాయుధాలూ కూడా నిన్నేమి చెయ్యలేకపోయాయే. శ్రీరాముడి బాణానికి హతమయ్యావా! రామ బాణం అంత శక్తి వంతమా!

రావణాసురుడు దిగులతో, బాధతో వాలిపోయాడు. ఎంతోసేపటికి గాని తేరుకోలేదు.

రాజ పుత్రులు రావణాసురుడ్ని సమీపించారు.

"రాజా! ఊరడిల్లు! కుంభకర్ణుడు మహా వీరుడు. కాలం కలిసి రాక హతుడైనాడు. నీవు లంకకు ప్రభువువి. పైగా యుద్ధ సమయం. దిగులూ, దుఃఖమూ వంటివి కాన రాకూడదు. మహా బలశాలివి. బ్రహ్మ శక్త్యాయుధమూ, కవచమూ, బాణములూ, ధనుస్సులతో పాటు వెయ్యి కంచర గాడిదలు అతి వేగంగా తీసుకెళ్ళే రథం ఉంది. దాని మీద ఉండి ధనుస్సు సారిస్తే త్రిభువనాలూ వణకాల్సిందే.

"ప్రభూ! మీ పుత్రులము మేం ఉన్నాం. ప్రహస్తుడి మరణానికీ, రాక్షస వీరుల సంహారానికీ, పిన తండ్రి కుంభకర్ణుడి చావుకూ ప్రతీకారం చేస్తాం. మేం నలుగురం మహా మాయా యుద్ధ కౌశల్యం ఉన్న వారం. నీ పుత్రులము. ఆశీర్వదించండి" అడిగారు.

రావణుడు పుత్ర ప్రేమతో వార్ని దగ్గరికి తీసుకున్నాడు. తన సోదరులను మహోదరుణ్ణీ, మహాపార్శ్వుణ్ణీ పుత్రుల విషయమై జాగ్రత్తలు చెప్పి యుద్ధరంగంలో సదా కనిపెట్టుకోమని చెప్పాడు.

మహా మహా బాణ, రాళ్ళ, అగ్ని, మంటల వంటి గాయాల తాలుకూ శరీర బాధలు యుద్ధమున అంతరాయము కలిగించకుండా చెంగల్వకోస్టూ, పెన్నేరుగడ్డా, చందనమూ, లవంగమూ, సంపెంగా లాంటి ఔషధులు రాసుకున్నారు.

ఐరావతం లాంటి మహా మదపుటేనుగును అధిరోహించాడు మహోదరుడు. ఆయుధాలతో నిండిన అశ్వం మీద కూర్చున్నాడు త్రిశిరుడు.

అన్నీ ఆయుధాలు గల మహారథంపై ఉన్నాడు అతికాయుడు. అత్యంత వేగంతో ప్రయాణించే గుర్రం మీద వెలిగిపోతూ ఉన్నాడు నరాంతకుడు. కొండలాంటి మహా గుదియను పట్టుకొని యుద్ధరంగానికి వెళ్ళటానికి సంసిద్ధుడై ఉన్నాడు దేవాంతకుడు. మహా గదతో ఉన్నాడు మహాపార్శ్వుడు.

వృత్రాసురుడి మీదకు కలిసికట్టుగా యుద్ధానికి బైలు దేరిన దేవతల్లా వారంతా కదిలారు.

విజయమో, వీర స్వర్గమో అన్నట్టు ఉన్నారు. మహా ఆవేశంతోనూ, మహా నిర్ణయంతోనూ, పగతోనూ, ద్వేషంతోనూ నిండి ఉన్నారు. కదలి వెళ్ళి చెట్టూ, బండా పట్టుకున్న వానరుల మీదకు ఉరికారు.





మహా సింహనాదాలను చేస్తున్న వానరుల మీద పడ్డారు. బాణాలూ, కత్తులూ, శూలాలూ నాట్యం చేశాయి.

మహా వృక్షాలూ, బండలూ, పర్వత శిఖరాలూ ఎగసి పడ్డాయి. రథాల మీద, గుర్రాల మీద, ఏనుగుల మీద కవచాలు ధరించిన రాక్షస వీరులు వానరులను శూలలలో, గదలతో బాదేస్తున్నారు.

వానరులు తమచేతుల్లోని వృక్షాలతో ఎగిరి ఏనుగుల మీదా, గుర్రాల మీదా ఆయుధాలు ధరించిన రాక్షసుల తలలపై మోది అంతమొందిస్తున్నారు.

మహావృక్షాల నుంచి పాలుకారినట్టు, రాక్షస వానర శరీరాల్లోంచి రక్తం కారుతోంది. ఒక కాలు తెగినా, ఓ చేయి తెగినా వదలక యుద్ధం చేస్తున్నారు ఉభయులు.

మహా వృక్షాలూ, పర్వత శిఖరాలూ, రాళ్ళూ, బండలూ, గుదియలూ, శూలాలూ, ముక్కలైన వివిధాయులతోనూ, చనిపోయిన వానర, రాక్షసులతోనూ యుద్ధ భూమంతా ఎర్రగా మారింది. ఎక్కడ చూసినా కుప్పులు కుప్పులు మృత శరీరాలే.

## నరాంతుకుడు హతం

శత్రుబలైశ్వర్యవినాశకుడైన నరాంతకుడు పదునైన శక్త్యాయుధముతో, వాయువేగ సమానంతో మహా అశ్వాన్ని ఎక్కి ఈటెలతో పొడుస్తూ ఏడు వందల మంది వానరులను తన ఆయుధాలకి ఆహుతి నిచ్చాడు.

వీరుడూ, మహేంద్రుని శత్రువూ అయిన నరాంతకుణ్ణి ఆకాశంలో దేవతలూ, సిద్ధులూ, విద్యాధరులూ, మహర్షులూ సంభ్రమంగా చూశారు.

దేవతా గణములే ఆశ్చర్యపోయే రీతిలో నరాంతకుడు వానరులపై విజృంభిస్తున్నాడు. అతను తిరుగుతున్న ప్రాంతమంతా వానరుల నిర్జీవ శరీరాలతో రక్త మాంసాలతో నిండిపోయి ఉంది.

మహాసముద్రంలోకి చేప దూసుకెళ్ళినంత తేలికగా నరాంతకుడు వానర సేనా వాహినిలోకి చొచ్చుకువెళ్ళి వానరులను కనిపించిన వార్ని కనిపించినట్టు కడతేర్చుతున్నాడు.

అగ్ని తన జ్వాలలతో వనాన్ని కాల్చినట్టు నరాంతకుడు మహోజ్వాలలా వృక్షములతో, పర్వతాలతో తన పైకి దాడికి వస్తున్న వారిని వారు ఊహించనంత వేగంతో కదలి కబళించేశాడు.

నరాంతకుడి ధాటికి ఇంద్రుడి వజ్రాయుధంతో దెబ్బలు తిన్న నముచిలా అరుస్తున్నారు వానరవీరులు.

మహావీరుడూ, శత్రుభయంకరుడూ అయిన నరాంతకుడు వానరులకు కదులుటకూ, మెదలుటకూ, అరుచుటకూ దేనికీ అవకాశం ఇవ్వటం లేదు.

మహేంద్రుడు వజ్రాయుధంతో పర్వతాలను ముక్కలు చేసినట్టు, మహా గాలి ఎడా, పెడా భయంకరంగా వీచినట్టు వానరులను భయకంపితులని చేసి మరీ చంపుతున్నాడు.

మహా యముడిలా, మధ్యాహ్నపు మండుటెండవలే చెలరేగిపోతున్న నరాంతకుడి ధాటికి దిక్కులు తెలియకుండా పారిపోతున్న వానరులను వానరరాజు సుగ్రీవుడు చూశాడు. గర్వమెక్కి, మహా మదమెక్కి, సంచరిస్తున్న నరాంతుకుడ్ని నిప్పులు కక్కేలా చూశాడు.

మహాబలవంతుడూ, దేవేంద్రుడితో సమానమైన ప్రతిభ కలవాడూ, యుద్ధమున ఓటమి ఎరుగనివాడూ అయిన అంగదుడ్ని పిలిచాడు.

"అంగదా! నరాంతుకుడు పెచ్చుమీరిపోతున్నాడు. వాడి ధాటికి వానరవీరులు పలాయనం చేస్తున్నారు. వెంటనే వెళ్ళుము. నరాంతుకుడిని సంహరించు" చెప్పాడు.

సుగ్రీవుడు ఆజ్ఞ కావటం ఆలస్యం మేఘాల నుంచి సూర్యుడు బైటికి వచ్చినట్టు కదలి సైన్యంతో అంగదుడు వెళ్ళాడు.

మహా శిలలా మారాడు అంగదుడు. మహాధాతువులతోనూ, అనేక వృక్షాలతోనూ, పెద్ద పెద్ద రాళ్ళతోనూ, శిఖరాలతోనూ ఉండే పర్వతంలా ఉన్న అంగదుడును చూడగానే నరాంతకుడు వికటాట్టహాసం చేశాడు.

గోళ్ళూ, కోరలూ, చేతులూ, కాళ్ళూ ఇవే అంగదుని మహా ఆయుధాలు.

"ఓరీ నరాంతకా! వానరుల మీద కాదురా నీ ప్రతాపం. ఈ వానరసేనా నాయుకుడి మీద చూపించు. మహా పదునైనదీ, వజ్రాయుధాన్ని నిలవరించే నీ ఈటె శక్తేమిటో చూపించు" అరిచాడు అంగదుడు.

నరాంతకుడు రుద్రుడయ్యాడు. మహా సర్పమువలే బుసలు కొట్టాడు. మహా బలమైన ప్రాసను కిష్కింధ యువరాజు అంగదుడి పైకి వేశాడు.

మహోన్నత వేగంతో, గాలిని చీల్చుకుంటూ వచ్చి వీరుడైన అంగదునికి తగిలింది. వక్షస్థలాన్ని తగలగానే మట్టి ఈటెలా ముక్కలైంది.





మహా బలశాలీ, వేగవంతుడూ అయిన గరుత్మంతుడు కొరికిన సర్పమువలే ముక్కలై నేలని తాకింది.

అంగదుడు పిడికిలి బిగించాడు. మహా పర్వతమంత ఉన్న గుర్రంపై నున్న నరాంతకుడ్ని చూశాడు. కళ్ళు పెద్దవి చేసి ఎగిరి గుర్రం నెత్తి మీద గుద్దాడు. దిక్కులు దద్దరిల్లేలా సకిలించిందా అశ్వము.

దాని తల పగిలింది. పాదాలు విరిగిపోయాయి. కంటి గ్రుడ్లు బద్దలై నాలుక బైటికి వచ్చి చివరిసారిగా సకిలించి దబ్బున నేలపై కూలిపోయింది.

నరాంతుకుడు తన అశ్వము నేలపై పడిపోవటంతో క్రోధావిష్టు డయ్యాడు. పళ్ళు కొరికాడు. పెదవిని నొక్కిపెట్టి కొరికాడు.

దెబ్బకు దెబ్బలా పిడికిలి బిగించి సుడి గుండంలా తిరుగుతూ వచ్చి అంగదుడి నడినెత్తి మీద గుద్దాడు.

పట్టపగలే నక్షత్రాలు కనిపించాయి. దిక్కులు కానరాలేదు. చుట్టూ ప్రపంచం గిర్రున తిరుగుతున్నట్టు అనిపించింది. ముహూర్త కాలంలో అంగదుడు తేరుకున్నాడు. మహా వీరుడైన నరాంతుకుడి శక్తికి అభినందించాడు.

అంగదుడు శ్రీరాముడ్ని తలుచుకున్నాడు. వజ్రం వంటి తన పిడికిలి బిగించాడు. బలంగా శ్వాస తీసుకున్నాడు. భయంకరరూపుడైన నరాంతుకుడి వక్షస్థలంపై గుద్దాడు.

మేరు పర్వతం మీద పడ్డట్టు కదిలిపోయాడు. నరాంతుకుడి వక్షస్థలం బద్ధలైంది.

మహా పర్వతాన్ని వజ్రాయుధం ముక్కలు చేసినట్టు... నరాంతుకుడి వక్షస్థలం వక్కలైంది. రక్తం విరజిమ్మింది. అంగదుడ్ని కనులు పెద్దవి చేసి చూస్తూ నేలకొరిగాడు.

మహా పరాక్రమంతో నరాంతుకుడి పీడ వదలించినందుకు అంగదునకు వానరవీరులు జయ జయ ధ్వనులు చేశారు. వృక్షాలూ, పర్వత శిఖరాలూ పట్టుకొని అంగదుని చుట్టూ కేరింతలు కొడుతూ తిరిగారు.

## దేవాంతకుడు

నరాంతకుడు యుద్ధరంగంలో నేల కూలటం చూసి దేవాంతకుడూ, త్రిశిరడూ, మహోదరుడూ ముగ్గురూ అమిత వేదనకి గురి అయ్యారు. పులస్త్యుని వంశస్థులు అగ్ని జ్వాలలయ్యారు.

మహోదరుడు మహా పర్వతమంతటి మదపుటేనుగు ఎక్కి అంగదుడి మీదకు పోయాడు. దేవాంతకుడు అగ్ని జ్వాలలు కురిపిస్తూ భయంకరమైన పరిఘతో వానర యువరాజు మీదకి వెళ్ళాడు.

మహా అశ్వాల రథాన్ని అధిరోహించి త్రిశిరుడు అంగదుడి మీదకి వెళ్ళాడు.

ముగ్గురూ మహాకాల సర్పాల్లా తనవైపే వస్తుండటాన్ని అంగదుడు చూశాడు. పెద్ద పొలికేక పెట్టాడు. మహా మహా శక్తివంతులైన దేవతల దర్పాన్నే అణిచి వేసిన ఆ వీరులకు ధీటుగా సమాధానమివ్వటానికి ఓ మహా వృక్షాన్ని వేళ్ళతో సహా పెకిలించాడు.

మండే పిడుగువలే మహావృక్షాన్ని దేవాంతుకుడి మీదకి గురి చూసి విసిరాడు. త్రిశిరుడు సర్పాల వంటి బాణాలతో ఆ వృక్షాన్ని ముక్కలు చేశాడు.

మహావృక్షాన్ని త్రిశిరుడు ఛేదించటంతో చటుక్కున ఆకాశ మార్గానకెగిరాడు. మహా వృక్ష వర్షాన్ని కురిపించాడు. రాళ్ళనూ, బండలనూ, పర్వత శిఖరాలనూ వారి పైకి వేశాడు.

కందిరీగల్లా వస్తున్న వాటిని పరిఘతో, బాణాలతో అడ్డుకుంటూ అంగదుడి మీదకు ఆకలిగొన్న సింహాల్లా వస్తున్నారు.

మహోదరుడు మదపుటేనుగు ఎక్కి అంగదుని మీద కెళ్ళి పరిఘతో చరిచాడు. అంగదుడు కోపించి పిడికిలితో ఏనుగు తలపై కొట్టాడు. దంతాలు లాగాడు. కుంభస్థలం బద్దలై కనులు బైటికొచ్చి మహోదరుడ్ని నేలపై పడవేసి చనిపోయింది.

దేవతలూ, యక్షులూ, గంధర్వులూ ముగ్గురికీ ఏక కాలంలో యుద్ధరంగాన సమాధానమివ్వగల ఆ ముగ్గురు యోధులూ మూకుమ్మడిగా తన మీదకు వచ్చినా అంగదుడు జంకలేదు. ఏనుగు నుంచి పెకిలించిన దంతాలతో దేవాంతుకుడి మీదకు వెళ్ళాడు. తనలోని మహాశక్తినంతా చేతుల్లోనికి తెచ్చుకొని చరిచాడు.

దేవాంతకుడు అదిరిపోయాడు. ప్రాణం పోయినంత పని అయ్యింది. యమలోక ద్వారాల దాకా వెళ్ళి వచ్చాడు. అతి కష్టంతో తెప్పరిల్లి తన చేతిలోని ఇనుప గుదియని మహావేగంతో గిరగిరా తిప్పాడు. దానితో అంగదుడ్ని కొట్టాడు.

వందలాది పిడుగులు పడ్డట్టు అదిరిపడి, నేల కూలి మళ్ళీ శక్తి తెచ్చుకొని లేచాడు.





సగం కూలిన అంగదుడ్ని త్రిశిరుడు తన బాణాలతో నిలువరించాడు. అతలా కుతలం చేశాడు.

ఒక్కడ్ని చేసి ముగ్గురూ వీరవిహారం చెయ్యటం హనుమంతుడూ, నీలుడూ చూశారు.

రాక్షస శ్రేష్ఠుడైన త్రిశిరుడి మీదకు నీలుడు ఓ పెద్ద పర్వత శిఖరాన్ని విసిరాడు. త్రిశిరుడు బాణాలతో ముక్కలు చేశాడు.

తనపైకి వస్తున్న హనుమంతుడ్ని చూస్తూనే దేవాంతుకుడు పరిఘతో మీద కెళ్ళాడు. హనుమంతుడు తప్పుకొని పర్వతం పిడికిలి బిగించి కొట్టినట్టు దేవాంతుకుడి నెత్తి మీద గుద్దుతూ మహా భయంకర సింహనాదం చేశాడు.

వాయుపుత్రుడు హనుమ చేసిన సింహనాదంతో దేవాంతుకుడి ఆఖరి అరుపు కలిసిపోయింది.

రాక్షసుల గుండెలు అదిరిపోయాయి.

## మహోదరుడు

రాక్షసరాజైన రావణుడి కుమారుడు అయిన దేవాంతుకుడు హనుమ పిడికిలి దెబ్బకు నాలుక బైటికు వచ్చి దంతాలూ, కళ్ళూ, ఊడిపోయి నేల కూలటం చూసి త్రిశిరుడు చలించిపోయాడు.

మహా ఆవేశంతో తన ధనుస్సు సంధించి బాణ వర్షం కురిపించాడు నీలుడి మీద. సూర్యసమానకాంతివంతుడైన మహోదరుడు బాణ వర్షాన్ని నీలుడిపై కురిపించాడు. రెండు వైపులా వస్తున్న బాణ ధాటికి నీలుడు అసహాయుడై బాణ ధాటిని నిలువరించే ప్రయత్నం మాత్రం చెయ్యగలిగాడు.

వానరసేనా నాయకుడు నీలుడు గాయాలతో మహా తుఫానులో పెను వృక్షంలా ఊగిపోయాడు. చేష్టలుడిగిపోయాడు.

మరికొంత సమయం జరిగితే మహోదరుడు తనని ప్రాణాలతో ఉండనియ్యడని తలచాడు. లోలోన ఉన్న శక్తిని బైటికి తెచ్చుకున్నాడు. ఊపిరి పీల్చి వదిలాడు.

వాయువేగంతో కదిలి దగ్గరిలోని మహా పర్వతాన్ని పెకిలించాడు. అంతకు రెట్టింపు వేగంతో మహోదరుడి వద్దకు వచ్చి సరిగ్గా నడినెత్తి మీద వేశాడు.

ఉగ్రమైన వేగంతో తన మీద పడిన పర్వత బరువుకి మహామదపుటేనుగు క్రింద అడవి జంతువు పడ్డట్టు నలిగిపోయాడు.

ఇదంతా చూస్తున్న మూడు తలల త్రిశిరుడు పిన తండ్రి మహోదరుడు నేల కూలి కైలాసానికి చేరటంతో భయంకర కోపావేశపరుడయ్యాడు.

మహోదరుడి మరణానికి గెంతులేస్తున్న వానరులను మింగేసే సింహంలా చూశాడు.

## మూడు తలల త్రిశిరుడు

వాయుపుత్రుడు హనుమపై త్రిశిరుడు భయంకరమైన నిప్పులు చేలరేగే అగ్రభాగాలు పదునుగా ఉండే బాణాలని వేశాడు. వర్షపు చినుకుల్లా తనకి తగులుతున్న బాణాలను చేతులతో చెదరగొట్టి మహా పర్వతాన్ని త్రిశిరుడి మీదకు విసిరాడు. తన పైకి మృత్యువులా వస్తున్న పర్వతాన్ని త్రిశిరుడు ఓ మహా బాణంతో ముక్కలు చేశాడు. మండుతూ, విరుగుతూ నేల రాలింది ఆ పర్వతము.

మహా పర్వతం వక్కలవ్వటంతో వాయుపుత్రుడు మహా వృక్షాలను పెకిలించుకొని వచ్చి ఒకదాని తర్వాత ఒకటి త్రిశిరుడి మీదకు విసిరాడు.

ఏక ధాటిగా వస్తున్న వృక్షాలను త్రిశిరుడు మార్గమధ్యములోనే వక్కలు చేశాడు. హనుమంతుడు భయంకర సింహనాదం చేసి పైకి ఎగిరాడు. మహా సుడిగాలిలా త్రిశిరుడ్ని సమీపించాడు.

రావణ పుత్రుడు మహా అగ్నిశక్తిని హనుమ మీదకి ప్రయోగించాడు. యముడు మహా కాళరాత్రిని స్వీకరించినట్టు వస్తున్న ఆ శక్తిని హనుమ మధ్యలోనే విరిచేసి త్రిశిరుడి మీదకు వెళ్ళాడు.

మహా కత్తితో హనుమ వక్షస్థలంపై పొడిచాడు. హనుమ భీకరంగా ఆర్తనాదం చేసి త్రిశిరుడి వక్షస్థలంపై కొట్టాడు. మేరు పర్వతమే విరిగిపోయేంత ఆ దెబ్బకు త్రిశిరుడి చేతిలోని ఆయుధం నేల జారింది.

త్రిశిరుడు లేని శక్తిని తెచ్చుకొని హనుమంతుడ్ని గుద్దాడు. వాయు పుత్రుడు కోపించి మహేంద్రుడి త్వష్టపుత్రుడు అయిన విశ్వరూపుని శిరస్సులను ఖండించినట్టు మహావాడియైన ఖడ్గముతో త్రిశిరుడి తలలను నరికి వేశాడు.

గగన మండలం నుంచి నక్షత్రాలు రాలినట్టు త్రిశిరుడి శిరస్సు నుంచి మూడు తలలు మండుతూ, వెలుగుతూ, నిప్పులు రాలుస్తూ నేల రాలాయి.

మహేంద్రుని వీర విక్రమ పరాక్రమంతో సరిసమానుడైన మూడు తలల త్రిశిరుడు మరణించగానే వానరులు ఎలుగెత్తి హర్ష ధ్వనులు చేశారు.





లంకేశ్వరుని సేనా నాయకులూ, రాక్షసులూ తోచిన దిక్కువైపుకి పరుగు తీశారు.

## మహాపార్శ్వుడు

మూడు తలల త్రిశిరుణ్ణి, మహోదరుణ్ణి, నరాంతకుణ్ణి, దేవాంతకుణ్ణి వానర వీరాధివీరులు హతం చెయ్యటంతో అగ్ని వంటి మహాపార్శ్వుడు కోపావిష్టుడయ్యాడు.

సంపూర్ణంగా ఇనుముతో తయారు చేసిన గుదియ తీసుకున్నాడు. మాంస, రక్తాలతో తడిచి ఉన్న గుదియ అగ్ర భాగం మహా వజ్రమేదో ఉన్నట్టు మెరిసిపోతోంది.

ఐరావతాం, మహా పద్మాం, పుండరీకం వంటి మహా దిగ్గజాలతో పాటు అనేక దిగ్గజాలను గుండెలవిసేలా చేసిన గుదియ అది. శత్రువుల రక్తంతోనే దానికి తృప్తి. ఎర్రని పుష్ప మాలలు ధరించి, ఆకలి గొన్న వేల సింహాల్లా ఉంది.

మహాప్రళయానికి యముడు కదిలినట్టు కదిలాడు మహాపార్శ్వుడు. వానికి ఎదురొచ్చాడు వానరసేనా నాయకుడు, మహాబలశాలీ, ధైర్యం తప్ప మరేమి తెలియనివాడైన ఋషభుడు... పుణ్యకార్యానికి వెళ్తుంటే ఎదురొచ్చిన అపశకునంలా కనిపించిన ఋషభుడ్ని మింగేసేలా చూశాడు.

పర్వతం వంటి ఋషభుడిపై మహా పర్వతమంతటి వజ్రసమాన గదను ప్రయోగించాడు మహాపార్శ్వుడు. ఋషభుడు విలవిలలాడిపోయాడు. రక్తం అధికంగా స్రవించింది. అయినా తట్టుకున్నాడు. మహాపార్శ్వుని మీదకు వెళ్ళాడు. పిడికిలి బిగించి ఒక్కటే గుద్దు గుద్దాడు.

మహాపర్వతం మధ్యలో మహాశక్తివంతమైన ప్రేలుడు జరిగినట్టు కదిలిపోయాడు మహాపార్శ్వుడు. రక్త వర్షం పడ్డట్టు అతని శరీరం రక్తంతో తడిచిపోయింది.

ఋషభుడు క్షణమాలస్యం చెయ్యకుండా మహాపార్శ్వుడి చేతిలోని గదను చటుక్కున లాక్కున్నాడు.

మహా యమదండం వంటి గదను గిరగిరా తిప్పి మహాపార్శ్వుని కొట్టాడు. పళ్ళు పగిలిపోయాయి. కళ్ళు బైటికొచ్చాయి. ఇంకా చాలనట్టు పిడికిలి బిగించి ముఖంపై గుద్దాడు.

మహాపార్శ్వుడు మరణించినట్టు ముహూర్తకాలం ఉండి... తోక తొక్కిన త్రాచువలే లేచి ఋషభుడికి ఓ భయంకర ముష్టిఘాతాన్నిచ్చాడు.

ఋషభుడు మండిపోయి ఆ మహా గదతో వక్షస్థలంపై కొట్టాడు. సాక్షాత్తు మృత్యుపాశంలా వెళ్ళి మహాపార్శ్వుడ్ని తాకింది. దేవ యజ్ఞ శత్రువైన మహాపార్శ్వుడు గైరికాధి ధాతువులు గల పర్వతం చిక్కటి ద్రవాన్ని కార్చినట్టు రక్తాన్ని కార్చాడు.

చివరిసారి లంకేశ్వరుడ్ని తలుచుకొని ప్రాణాలు విడిచాడు. మహాపార్శ్వుడు నేల కూలగానే మహా సముద్రం వంటి రాక్షస సేన చెల్లాచెదురైంది. గట్టు తెగిన ప్రవాహంలా ఎవరు ఏ ప్రక్కకి వెళుతున్నారో, ఏ వైపుకి వెళుతున్నారో కూడా చూసుకోకుండా పరుగులు తీశారు.

## అతికాయుడు

బ్రహ్మవరప్రసాదీ, మహా తేజస్సు కలవాడూ, ఇంద్రునితో సరిసమాన పరాక్రమవంతుడూ, రాక్షస శ్రేష్టుడూ అయిన అతికాయుడు సోదరులూ, పినతండ్రులూ యుద్ధరంగాన నేల కొరగుట చూసి కలత చెందాడు. వ్యథ చెందాడు.

మహా యుద్ధప్రియులూ, ఓటమి తెలియనివారైన, మహోదరుడూ, మహాపార్శ్వులను అత్యంత హేయముగా వానరులు హతం చెయ్యటం గాంచి నిప్పుల కుంపటిలా మారాడు.

దేవతలను తరిమి కొట్టినవాడూ, ఇంద్రుని శత్రువూ అయిన అతికాయుడు వెయ్యి సూర్యుల వెలుగుని కూడా మరిపించే అపూర్వ రథాన్ని అధిరోహించి వానరుల మీదకు మహా ఉప్పెనలా వెళ్ళాడు.

ధగధగలాడే కిరీటాన్ని ధరించి మెరిసిపోయే కుండలాల్ని ధరించిన అతికాయుడు అల్లెత్రాడుని మ్రోగించాడు. దిక్కులు దద్దరిల్లి అదిరిపోయేలా సింహనాదం చేశాడు.

మహా వీరులైన వానరవీరులు కూడా భయంకర ఆ రూపాన్నీ, పర్వతాకారాన్నీ చూసి మహాపర్వతాకారుడు కుంభకర్ణుడే తిరిగి వచ్చాడేమోనని భయకంపితులయ్యారు.

ఎదిరించటం అటుంచి... దరిదాపుల్లో కూడా వెళ్ళలేనంత భయం ప్రవేశించింది. త్రివిక్రమావతారమున మహా విష్ణువు విశ్వరూపంలా ఉండే





అతికాయుడ్ని చూసి వానరులు బిగ్గరగా అరుస్తూ లక్ష్మణ, సుగ్రీవుల వద్ద ఆగను కూడా ఆగకుండా శ్రీరాముడు ఉన్న ప్రదేశానికి వెళ్ళి శరణు కోరారు.

మృత్యుదేవత నాలుకలా, అగ్ని హోత్రుడి నోరులా ఉన్న అతికాయుడ్ని శ్రీరాముడు చూశాడు. రావణ సోదరుడు విభీషణుడు శ్రీరాముడికి విన్నవించాడు.

"ప్రభూ!శ్రీరామా! అతని నామధేయం అతికాయుడు. వెయ్యి గుర్రాల రథంపై, తేజస్సుతో వెలిగిపోతున్న వానికి బ్రహ్మవరాలున్నాయి. అతని రథంలో సర్వాయుధాలు కోకొల్లలుగా ఉంటాయి. రావణ పుత్రుడు. రాక్షసులకు ఎదురు తిరిగిన అందరి దర్పమును అణిచినవాడు.

"మహా వెలుగుతో వెలిగిపోయే ఆ రథంలో నున్న కత్తులను చూడు శ్రీరామా! పది చేతుల పొడవు గల కత్తులు, వాటి పిడులు నాలుగు హస్తములంత...

"మహామహితాత్ముడైన పర్వతరాజు హిమంతుడిలా కదలి వస్తున్న అతని నగుమోము పునర్వసు నక్షత్రాల మధ్యనున్న పూర్ణచంద్రుడిని మరిపిస్తుంటుంది. ధాన్యమాలిని పుత్రుడు.

"సురాసురుల చేతిలో చావులేకుండా వరం పొంది ఉన్నాడు. మెరిసే కవచాన్నీ, రథాన్నీ బ్రహ్మదేవుడి నుంచి పొందాడు.

"తన బాహుబలం చేత లంకా రాజ్యాన్ని సుస్థిరం చేశాడు. సర్వనీతి విషయపరిజ్ఞానం కలవాడు.

"అశ్వికుడు, రథికుడు, విలుకాడు. చతురోపాయాలు సమయాన్ని బట్టి చేయు జ్ఞాని.

"శ్రీరామచంద్రా! అతికాయుడు బహు ప్రమాదికారి. నిర్లక్ష్యంగా నున్న వానర సైన్యాన్ని దహించి వేయగల సమర్థుడు. శీఘ్రముగా తగు ఆదేశంతో ఆజ్ఞాపించవలెను" చెప్పాడు విభీషణుడు.

## అతికాయుడి హతం

శ్రీరామునితో విభీషణుడు చెప్పటం పూర్తికాకుండానే మహోగ్ర భయంకర అవతారంతో అతికాయుడు ధనుష్టంకారం చేస్తూ వానరులపై విరుచుకు పడ్డాడు.

పై నుంచి మహా నిప్పుగడ్డలు పడుతున్నట్లు వానరులు బెంబేలెత్తి పోయారు. పెద్ద దేహం గల అతికాయునిపైకి కుముదుడూ, ద్వివిదుడూ,

మైందుడూ, నీలుడూ, శంభుడూ మహా వృక్షాలనూ, పర్వత శిఖరాలనూ పెకిలించి ఒకేసారి అతికాయుని మీదకు వేశారు.

ఆ మహా ఎదురు ధాటిని అతికాయుడు తనవాడి అయిన బంగారు ములుకుల బాణాలతో ఛిద్రం చేశాడు. వేలాదిగా ఉక్కు బాణాలు వానరులపై ప్రయోగించాడు. అవి వానరుల కంఠాల్లోనూ, మెడల్లోనూ, వక్షస్థలాల్లోనూ గుచ్చుకొనటం వల్ల వారు విలవిలలాడుతూ ప్రాణాలు వదిలారు. రాక్షసులు భీకరంగా అరుస్తూ అతికాయుడికి జయ జయ ధ్వనులు చేశారు.

మంచి యవ్వనంలో ఉన్న మగ సింహం అడవిలోని మృగాలపై పడినట్టు పడ్డాడు. లేళ్ళ గుంపుని తరిమినట్టు తరిమి తరిమి చంపాడు. మొత్తం వానర సైన్యానికే భయాన్ని కలిగించాడు. యుద్ధ సమాప్తికి యముడే యుద్ధభూమికి వచ్చినట్టు మదహంకారంతో విర్రవీగుతూ అరిచాడు.

"వీరుడైన వాడెవ్వడైనా నా ముందుకు రావచ్చు. అల్పులతో యుద్ధం వీరులకి అవమానం. పారిపోతున్నవారినీ, భయపడుతున్న వారినీ కొట్టను. ధైర్యముంటే నాకూ, నా ధనుర్బాణాలకూ ఎదురు నిలవగలిగే ధీరులుంటే రండి."

అతికాయుని భీకర శపథాలకీ, వీర పలుకులకీ శత్రుసంహారుకుడైన లక్ష్మణుడు క్రుద్ధుడయ్యాడు. అన్నగారి ఆజ్ఞ తీసుకున్నాడు. వేగంగా అతికాయుని ముందుకొచ్చాడు.

లక్ష్మణుడు తన ధనుస్సు అల్లెత్రాడు మ్రోగించాడు. చెవులు బద్దలైయ్యేలా వచ్చిన ఆ శబ్దానికి అతికాయుడు ఉగ్రుడయ్యాడు.

"ఓయీ... చూడుటకు బాలుడువలే ఉన్నావు. యముడంతటి వారే నాతో సమరం చేయుటకు భయకంపితులవుతారు. మహా వేగంతో నిప్పులా మంటలూ కక్కుతూ వచ్చే నా బాణ ధాటికి పర్వత రాజు హిమవంతుడు కూడా తట్టుకోలేడు. ఈ అఖండ భూమి కూడా అడ్డు రావుటకు సందేహిస్తుంది. వెళ్ళు. ప్రాణాలు దక్కించుకో.

"ఇదిగో పరమేశ్వరుని ఆయుధంతో సమానమైంది. పసిడితో చేసిన ములుకుల బాణం. సిద్ధంగా ఉండు. మొండితనంతో చెప్పినా వినకుండా నా ఎదురుగుండా ఉన్న నీవు ఇకపై యముడికి ఎదురుగా వెళ్ళుము" అని బాణాన్ని ధనస్సుకి సంధించాడు.





లక్ష్మణుడు చిరునవ్వు నవ్వాడు. ఆ వెనువెంటనే ఉత్తముడైన లక్ష్మణుడు చెప్పాడు.

"అతికాయుడా! యుద్ధరంగమున కావలసినది మాటలు కాదు. చేతలు. యుద్ధానికి సిద్ధంగా ఉన్నాను. వ్యర్ధ పలుకులు మాను. నీ వంధిగా వల్లించిన నీ బల ప్రతాపాలు నా మీద చూపించు. తొలత నీ అరివీర పరాక్రమం చూపుము. ఆపై కాలం చెల్లి పక్వమైన తాటిపండు తొడిమ నుంచి విడిపోయినట్టు నీ శిరస్సు నుంచి నీ మొండాన్ని వేరు చేస్తాను."

అతికాయుడు లక్ష్మణుడిని తినేసేలా చూసి బాణాన్ని వదిలాడు. ఆ మహాపోరాటాన్ని పైనుంచి దేవతలూ, విద్యాధరులూ, మహర్షులూ, యక్షులూ ఉత్కంఠతగా చూస్తున్నారు.

అతికాయుడు వదలిన బాణం భూ భువనోంతరాలనూ ధ్వనింప చేస్తూ మహా వెలుగుతో మహాకాల సర్పము ఎర వైపు వచ్చినట్టు వచ్చింది.

లక్ష్మణుడు అర్ధచంద్ర బాణాన్ని తీశాడు. ఆ నిశితబాణానికి గురిపెట్టి వదిలాడు. సృష్టిలోని మహా పదునైన ఆయుధంలా మారి అతికాయుడి బాణాన్ని రెండు ముక్కలు చేసింది.

రెండు ముక్కలుగా తెగిపడ్డ సర్పంలా ఉన్న బాణాన్ని చూస్తూనే అతికాయుడిలో పిచ్చి ఆవేశం వచ్చింది. రథంపై నుంచి బాణాలను మేఘం వర్షించినట్టుగా వేస్తున్నాడు.

లక్ష్మణుడు అంతకు మించిన వేగంతో బాణాలను వదిలి వాటిని మధ్యలోనే నిర్వీర్యం చేశాడు.

లక్ష్మణుడు భగభగమండే అగ్ని పర్వతం వంటి బాణాన్ని వేశాడు. దిక్కులు తెలియనంతగా వెలుగును విరజిమ్ముతూ అతికాయుడ్ని చేరి సరిగ్గా అతని లలాటాన్ని తాకింది.

అతికాయుడు ఖంగుతిని ఆ బాణాన్ని లాగి అవతల పడేసి మృత్యుదేవత వంటిది బంగారు పొన్నులగల బాణాన్ని లక్ష్మణుడి మీదకు వదిలాడు. దాన్ని మధ్యలోనే త్రుంచేశాడు లక్ష్మణుడు. యమదండం లాంటి బాణాన్ని వేశాడు లక్ష్మణుడు.

మహేంద్రుడినే గడగడలాడించిన అతికాయుడు సూర్యసమాన తేజస్సుతో ఆగ్నేయాస్త్రమును ప్రయోగించాడు.

రెండు సింహాలు కొట్టుకున్నట్టు గగనంలో ఆ రెండు ఢీ కొన్నాయి. మహా అగ్ని పుట్టింది. దిక్కులు అదిరాయి. రెండూ నేల కూలాయి.

అతికాయుడు త్వాష్ట్రాస్త్రము వేశాడు. శత్రుసంహారకుడు లక్ష్మణుడు ఐంద్రాస్త్రము ప్రతిగా వదిలాడు. ఆ రెండూ ఒకదానితో ఒకటి పాముల్లా పోరాడి రాలిపోయాయి.

అతికాయుడు దీర్ఘంగా నిట్టూర్చి మహోజ్వాల రూపమైన బాణాన్ని వేశాడు. లక్ష్మణుడు దాన్ని వక్కలు చేసి తన బాణ పరంపరతో ఉక్కిరి బిక్కిరి చేశాడు. అయినా అతికాయుడు చెక్కు చెదరలేదు.

అప్పుడు వాయుదేవుడు లక్ష్మణుడితో చెప్పాడు.

"సుమిత్రా పుత్రా! లక్ష్మణా! అతికాయుడు బ్రహ్మవరాలు పొందినవాడు. కవచమూ, రథమూ ఉన్నంత వరకూ అతడ్ని ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. బ్రహ్మాస్త్రమే ఇతని మృత్యువు."

వాయువుని పలుకులతో లక్ష్మణుడు బ్రహ్మాస్త్రాని తీశాడు. భక్తిగా నమస్కరించి మంత్రించి వదిలాడు.

భూమీ, ఆకాశాలూ దద్దరిల్లాయి. ప్రకృతి వణికిపోయింది. వాయు వేగంతో ప్రజ్వరిల్లుతూ యమునితో సమానమైన ఆ బాణం హిమపర్వతమంతటి అతికాయుడ్ని తాకింది.

మహా విస్ఫోటనం జరిగింది. కవచమూ, రథమూ వక్కలైపోయాయి. వాటితో పాటు అతికాయుడూ నేల కొరిగాడు.

రాక్షసులు గగ్గోలు పెట్టారు. లంకకు అభిముఖంగా పరుగులు తీశారు. వికసించిన మహాపద్మమువంటి లక్ష్మణుడను వానరులు పూజించి జయ జయ ధ్వనులు చేశారు.

## లంకను కాపాడండి

దశరథపుత్రుడు లక్ష్మణుడి చేతిలో అరివీర భయంకరుడూ, బ్రహ్మ వరాలు పొందినవాడూ అయిన అతికాయుడు మరణించాడు అని వార్తహరుల ద్వారా తెలియగానే రావణుడు కుచించుకుపోయాడు.

పరమకోపిష్ఠి, యుద్ధ విశారదుడు అయిన ధూమ్రాక్షుడనూ, ప్రళయకాల జంఝామారుతమైన అకంపనుడనూ, రాక్షస సేనా నాయకుడు ప్రహస్తుడనూ, కుంభకర్ణుడనూ, మహా మహా వీరాధి వీరులనూ, శూరులనూ అరివీర పరాక్రమంతో ముల్లోకాలనూ గడగడలాడించు రాక్షస వీరులెందరినో శ్రీరాముడి సేన హత మార్చింది.

"ఆహా! ఏమి రాముడి వీరత్వం... అంతటి బలపరాక్రమములు ఎక్కడివి. బ్రహ్మ, శివుల వరాలతో పొందిన బాణాలకు ధీటైన బాణాలెక్కడివి.

"దేవతలూ, యక్షులూ, కిన్నెరలూ, తపస్సంపన్నులూ ఎవ్వరూ విడిపించు కోలేని ఇంద్రజిత్తు శర బంధాన్ని రామలక్ష్మణులు సునాయాసంగా ఎలా విడిపించుకున్నారు.

"నా కోసం... లంక కోసం... రాజాజ్ఞతో యుద్ధానికి వెళ్ళిన వారెవ్వరూ ప్రాణాలతో తిరిగిరాలేదు. వానరసేనలో ఒక్క వీరుడ్ని కూడా హతమార్చ లేకపోయారు.

"ఈ సమయాన రామలక్ష్మణ సుగ్రీవ అంగదులను సంహరించే వీరుడెవ్వడు?... అసలు శ్రీరాముడెవ్వడు?... శ్రీరాముడెవ్వడు?..."

రావణుడు ఆలోచనలతో ఉడికిపోయాడు. తన బలగాలకీ, సేనా నాయకులకీ ఆజ్ఞాపించాడు.

"వీరులారా! లంక జాగ్రత్త! నా ఆజ్ఞ లేనిదే అశోకవనంలో నున్న సీతాదేవి కడకు ఎవ్వరూ వెళ్ళరాదు.

"అన్నీ దిక్కులలోనూ సేనలను రెట్టింపు చెయ్యండి. ఉదయ, మధ్యాహ్న, సాయంకాల రాత్రులందు అప్రమత్తులై ఉండండి" అని ఆజ్ఞాపించి తన అంతః పురానికి వెళ్ళాడు. మథన పడసాగాడు.

ఓ ప్రక్క దుఃఖము... మరో ప్రక్క అవమాన భారం... రెండిటికీ మించి పుత్ర శోకం. రావణుడు పరిపరి విధాలుగా దుఃఖించాడు. క్షోభించాడు.

## రథ శ్రేష్ఠుడు ఇంద్రజిత్తు

శోకసముద్రంలో మునిగిపోయి దీనంగా నిట్టూరుస్తున్న రావణుడిని ఇంద్రజిత్తు సమీపించాడు.

"తండ్రీ! వ్యథ చెందకు. నే ఇంకా జీవించే ఉన్నాను. తండ్రిగారూ ఆజ్ఞాపించండి. తక్షణమే యుద్ధరంగానికి తరలి వెళ్ళి రామలక్ష్మణులను నేల కూలుస్తాను.

"లంకేశా! ఇదే నా ప్రతిజ్ఞ. రామలక్ష్మణులను సంహరించి నీ ముందుకు వస్తాను. నా పరాక్రమ విశ్వరూపాన్ని చూపిస్తాను."

మహాయుద్ధ నిపుణుడైన ఇంద్రజిత్తు తండ్రి రావణుడి అనుమతీ, ఆశీర్వాదమూ తీసుకొన్నాడు... మహావాయు వేగంతో సమానమైన గాడిదలు కట్టిన రథాన్ని రాక్షసులు సిద్ధం చేశారు.

ఇంద్రజిత్తు వెంట మహాభయంకర ఆకారులూ, వికార స్వరూపులూ, మహాశక్తివంతులూ అయిన రాక్షసులు ధనుస్సులూ, ప్రాస, ముద్గర, గొడ్డళ్ళతో అనుసరించారు. శంఖ భేరీ ధ్వనులు లంకలో మారుమ్రోగాయి. రాక్షస శ్రేష్ఠుడూ, యుద్ధ విశారదుడూ అయిన ఇంద్రజిత్తు విజయం కొరకై హోమాలు చేశారు.

హవిస్సులనూ, పేలాలనూ, పుష్పాలనూ, సుగంధాలనూ హోమములో వేసి ఇంద్రజిత్తు కదిలాడు. ధనుర్బాణాలతో, ఖడ్గాలతో ఇంద్రజిత్తు ఆకాశానికి ఎగిరి, రాక్షసులను నేలపై నుంచి రమ్మని అదృశ్యమయ్యాడు.

గుర్రాలతోనూ, రథాలతోనూ సముద్రంలా కదలి వానరుల మీద పడ్డారు రాక్షసులు. శూలాలకీ, తోమరములకీ, అంకుశములకీ పని చెప్పారు. వానరులను దొరికిన వార్ని దొరికినట్టు చంపసాగారు.

ఆకాశాన ఇంద్రజిత్తు నాలీక, నారాచబాణములను కుప్పలు తెప్పలుగా వానరులపై వదిలాడు. వాటి ధాటికి హతమవుతున్న వానరులను చూసి ఇంద్రజిత్తు వికటాట్టహాసం చేశాడు.

వానరసేనా నాయకులు మహాపర్వతాలనూ, వృక్షాలనూ ఇంద్రజిత్తు మీదకు విసిరారు. వాటిని ఛేదిస్తూ వానర సైన్యాన్ని కకావికలం చేశాడు ఇంద్రజిత్తు.

తీక్షణబాణాలతో, సూర్యుని వద్దనున్నంత వేడి గల బాణాలతో, కాల సర్పము వంటి బాణాలతో వానరులను వందలు కొద్దీ సంహరిస్తున్నాడు.

మహా వాడి మొన గల బాణాలతో గంధమాదనుణ్ణీ, అగ్ని గుండాల్లాంటి తొమ్మిది బాణాలతో నలుణ్ణీ కొట్టాడు.

పదిబాణాలతో జాంబవంతుడ్నీ, నీలుడ్నీ ముప్పై బాణాలతో నిశ్చేష్టులని చేశాడు. సుగ్రీవ, ఋషభ, అంగదులను, ద్వివిర, నీల, గవాక్ష, కేసరి, విద్యుద్దంష్ట్రులను, దధిముఖునీ ఎవ్వరినీ వదిలి పెట్టలేదు. సూర్య కిరణముల వంటి బాణాలతో గుచ్చాడు. మహాశక్తి వంతులూ, మహా పురుషుల పుత్రులూ కావటంతో ప్రాణాలు దక్కించుకున్నారు.

మహా వెలుగుల గల బాణాలకి కొంతమంది వానరులకు కనులే పోయాయి. అవి వస్తున్న శబ్దానికి గుండెలే ఆగిపోయాయి.





ఇంద్రజిత్తు, రామ లక్ష్మణుల వైపుకి వచ్చి బ్రహ్మాస్త్రాన్ని వదిలాడు. సమస్త లోకాల్లో ఎవ్వరిపైన ప్రయోగించినా విఫలం కాని ఆ మహా శక్తి ఆయుధం కనులు మిరిమిట్లు గొలుపుతూ వచ్చి లక్ష్మణుడిని తాకింది. శ్రీరాముడ్ని బ్రహ్మాస్త్రం కాంతి ఆవహించింది. రాముడూ, లక్ష్మణుడూ నేలపై పడిపోయారు. వివశులయ్యారు.

ఇంద్రజిత్తు విజయ సింహనాదం చేశాడు. లంకకి చేరాడు.

## దివ్యౌషధుల కొరకై హనుమ పయనం

ఆ మహా యుద్ధ భూమిలో కాగడాలు పట్టుకొని తిరిగాడు విభీషణుడు. తోకలు తెగి, తలలు తెగి, వక్షస్థలాలు బద్దలై భయంకరంగా ఉంది రణ భూమి.

ఇంద్రజిత్తు పరాక్రమంతో అగ్ని దహించిన అడవిలా ఉంది. యుద్ధంలో దెబ్బలు తిన్న సుగ్రీవుడనీ, ద్వివిదుణ్ణీ, నలుణ్ణీ, నీలుణ్ణీ, మైందుణ్ణీ, గంధమాదనుణ్ణీ, జాంబవంత, అంగదులనూ విభీషణుడు చూశాడు. అందరినీ స్వాంతన పరిచాడు.

రామలక్ష్మణులు మాత్రం బ్రహ్మాస్త్రం తీక్షణతకు కదలటలేదు. నిశ్చలంగా ఉన్నారు. మహా శక్తివంతమైనదీ ఎన్నడూ వ్యర్ధము కానిదీ అయిన బ్రహ్మాస్త్రం శక్తితో స్థంభించిపోయి ఉన్నారు.

బ్రహ్మదేవుడి శక్తికి ఆయనపై భక్తితో వానరవీరులంతా ఎంతో సేపు అలా ఉండిపోయారు.

వాయుపుత్రుడు హనుమంతుడు బంధము విడిపించుకొని విభీషణుడి వద్దకు వచ్చాడు. మిగతా వానర వీరులూ బంధనాలను విడిపించుకున్నారు. భల్లూకములలో శ్రేష్ఠుడైన జాంబవంతుడు విభీషణుడితో చెప్పాడు.

"విభీషణా! ఇంద్రజిత్తు యుద్ధ ధాటికి నీ కంఠస్వరమును బట్టి మాత్రమే గుర్తుపట్టగలగుతున్నాను.

"మళ్ళీ మామూలు స్థితి వచ్చుటకు కొంత సమయం అవసరం. వాయు పుత్రుడు హనుమ క్షేమమే కదా!" అడిగాడు.

"భల్లూక వీరా! నీవు రామలక్ష్మణుల క్షేమం వదలి హనుమ విషయమే అడుగుటలో ఆంతర్యం అవగతమగుటలేదు. వానర వీరులు క్షేమమే. రామలక్ష్మణులే నిద్రా స్థితిలో ఉన్నారు."

"విభీషణా! హనుమ వాయువుతో సమానమైనవాడు. అగ్నితుల్యుడు హనుమ క్షేమంగా ఉంటే వానరసేనంతా క్షేమంగా ఉన్నట్టే" చెప్పాడు జాంబవంతుడు.

హనుమ జాంబవంతుడ్ని సమీపించి నమస్కరించాడు. హనుమ కంఠం గుర్తు పట్టి ఆనందంగా చెప్పాడు.

"వానరశ్రేష్ఠుడా! హనుమా! నీ అరివీర మహా పరాక్రమాన్ని మరోసారి చూపాల్సిన తరుణమిది. రామలక్ష్మణులు బ్రహ్మాస్త్రాన్ని గౌరవించారు. ఎంతటి వారికైనా తప్పదు. కేవలం స్థంభన మాత్రమే. ఎక్కువ సేపుండుట మంచిది కాదు. రామలక్ష్మణుల శల్యములను తొలగించాలి.

"హనుమా! నీవు వాయు వేగంతో సువర్ణ మయమూ మహా పర్వత శ్రేష్ఠమూ అయిన ఋషభ పర్వతానికి వెళ్ళాలి. కైలాసశిఖరం కాన వచ్చే రెండు మహా పర్వతముల మధ్య మహా వెలుగుతో, కాంతితో నిండిన ఓషధి పర్వతము చేరాలి. ఆ పర్వతంపై మహా మహా దివ్యౌషధులు నాలుగు మెరుస్తూ ఉంటాయి. అన్నీ దిక్కులు వాటి తేజస్సుతో ప్రకాశిస్తుంటాయి.

"మృత సంజీవినీ, విశల్యకరణీ, సువర్ణకరణీ, సంధానకరణీ అనే అపూర్వ దివ్య ఔషధులను నీవు తేవాలి. వాటితో చనిపోయిన వారు సైతం బ్రతుకుతారు. విశల్యకరణి ద్వారా గాయాలు మానిపోతాయి. సావర్ణకరణీ ద్వారా ఎంతటి గాయాలైన దేహమూ మళ్ళీ వజ్రసమానమవుతుంది. సంధానకరణి కంఠం తెగిపోయినా అతికిస్తుంది.

"హనుమా! రామలక్ష్మణులకూ, వానరులకూ ఆ ఔషధులు ఎంతో అత్యవసరం. కాన వెళ్ళి రావలెయును."

మహా పర్వతమైన మలయ పర్వతాన్ని చేరి హనుమంతుడు తన దేహాన్ని మహా పర్వతంలా పెంచాడు. దాని మీద నుంచి ఎగిరాడు. హనుమ పాదనకు పర్వతం మీద మహా వృక్షాలు వేళ్ళతో సహా పెకిలించుకొని వచ్చి నేల కూలాయి.

పర్వతంపై నున్న ప్రాణులన్నీ కకావికలయ్యాయి. మహా శిఖరాలు విరిగి పోయాయి.

హనుమంతుడు హిమవత్పర్వత దిశగా ఉత్తర దిక్కుగా వేగంగా వెళుతున్నాడు. సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు చక్రాయుధం వదిలినట్టు గగన మార్గాన సాగిపోతున్నాడు.





మార్గ మధ్యమున ఉన్న మహా పర్వతాలనూ, సుందర జలాశయాలనూ, మహారణ్యాలనూ చూసుకుంటూ ముందుకు సాగుతున్నాడు.

జాంబవంతుడు చెప్పిన హిమవత్పర్వతాన్ని చూశాడు. మహా వృక్షాలతో మనోహరంగా ఉన్న హిమవత్పర్వతాన్ని చేరి శిఖరాల మీదగా ప్రయాణించాడు. అనేక తాపసుల ఆశ్రమాలూ, మహానుభావులూ, పుణ్యపురుషుల ఆశ్రమాలూ చూశాడు.

వాయు పుత్రుడు హనుమంతుడు బ్రహ్మ స్థానాన్నీ, హయగ్రీవునీ స్థానాన్నీ, బ్రహ్మ దేవుడి శిరస్సు ఖండించిన స్థానాన్నీ, భూమి నుంచి పాతాళమునకు వెళ్ళే స్థానాన్నీ, కైలాస పర్వతాన్నీ, ఇంద్రస్థానాన్నీ, ఇంద్రుడికి వజ్రాయుధం ఇచ్చిన స్థానాన్నీ, కుబేరస్థానాన్నీ, శివుని ధనుస్సు ఉండు స్థానాన్నీ చూశాడు.

వానర శ్రేష్ఠుడు హనుమ కైలాస పర్వతాన్నీ, ఋషభ పర్వతాన్నీ, మేరు పర్వతాన్నీ చూశాడు.

సమస్త ఔషధి పర్వతాన్ని చూశాడు. దాని మీదే దిగాడు. ఎటు చూసినా ధగధగలే. వేలాది యోజనాల పరిధిలో ఉన్న ఆ పర్వత ప్రాంతమంతా ఔషధీలతో వెలిగిపోతోంది.

హనుమ ఔషధిల కోసం వెదుకుటతో, ఆ పర్వతంపై నున్న ఔషధులు తమని తీసుకొని పోవుటకే ఆ మహాకాయుడు వచ్చినాడని చప్పున అదృశ్యములు అయ్యాయి.

కపి వీరునకు కోపం వచ్చింది.

"ఓ! ఔషధీ పర్వతమా! ఈ చర్య నీకు తగదు. శ్రీరామలక్ష్మణుల సేవకు వెనుకడుగు వెయ్యుట తగదు.

"దానికి శిక్షగా నా బాహువులతో పెకిలించి, శ్రీరాముడున్న ప్రదేశానికి తీసుకెళ్తాను" అని కనులెఱ్ర చేసి చెప్పాడు.

మహా వృక్షాలతోనూ, గైరికాధాతువులతోనూ, మహా శిఖరాలతోనూ ఉన్న ఔషధీ పర్వతాన్ని పెకిలించాడు.

ఆ ఔషధీ పర్వతాన్ని చేతిలో ధరించి సూర్య మార్గాన ఎగిరాడు. సూర్యసమాన కాంతిమంతుడు హనుమ ఆకాశమున మరో సూర్యుడిలా అగుపించాడు. గరుత్మంతుడి వేగంతో ముందుకు సాగుతున్నాడు.

పర్వతాకారుడు హనుమ ఆ మహా పర్వతంతో వెయ్యి అంచుల చక్రాయుధం ధరించినట్టు అపూర్వకాంతితో కానవచ్చాడు. వానరులు చెట్లు, వృక్షాలు పైకెత్తి జయ జయ ధ్వనులు చేశారు.

హనుమంతుడు వానరులను చూసి ధ్వని చేశాడు. ఆ ధ్వనులకు లంకలోని రాక్షసులు ఉలిక్కిపడ్డారు.

ఆ దివ్య ఔషధీ పర్వత వాసన సోకినంతనే వానరులు దిగ్గున లేచారు. ఎవరికోసమైతే హనుమ ఔషధీ పర్వతాన్ని తెచ్చాడో వారందరూ ఔషధీ వాసన తగలగానే నిద్రించి లేచినట్టు అంతా లేచారు.

యుద్ధం జరిగింది మొదలు అంతవరకూ వానరుల చేతిలో చనిపోయిన రాక్షసులను, రావణుడు ఎప్పటి కప్పుడు లెక్కతెలియకుండా ఉండుటకు తన సైన్యంలో భీతి కలుగకుండా ఉండుటకై సముద్రంలో పారవేయించాడు. దానితో యుద్ధంలో చనిపోయిన వానరులంతా తిరిగి బ్రతికారు.

ఆపై హనుమ తిరిగి ఔషధీ పర్వతాన్ని హిమవత్పర్వతానికి యథావిధిగా చేర్చాడు.

## లంకను మళ్ళీ దహనం చేద్దాం

"రావణుడు పుత్రులనూ, వీరసేనా నాయకులనూ, సోదరులనూ పోగొట్టుకున్నాడు. యుద్ధానికి వచ్చే స్థితిలో లేడు. లంకను ముట్టడిద్దాం. లంకను తగల బెట్టేద్దాం" చెప్పాడు సుగ్రీవుడు.

వానరులు మహోగ్రంగా మండుతున్న కొరవులు పట్టుకున్నారు. లంక వైపు దూసుకుపోయారు. ఉల్కలు ధరించి వస్తున్న వానరులను చూస్తూనే రాక్షసులు ఎదిరించారు. నలువైపుల నుంచి కమ్మకురావటంతో రాక్షసులు పారిపోయారు.

వానరులు పురద్వారములకీ, ప్రాకారములకీ, రాక్షసుల గృహాలకీ నిప్పు పెట్టారు. తమ చేతిల్లోని కొరవులను గిరగిరా తిప్పి విసిరారు.

భగ్గున మంటలు... ఆకలి గొన్న సింహపు నాలుకుల్లా మహాప్రాసాదాల మీద పడ్డాయి.

పట్టు వస్త్రములు కాలిన వాసన... సుగంధ అత్తరులు మండుతున్న వాసన... బంగారు రత్నాలు కాలిపోతున్న వాసన... మహా ఆయుధాలు కరిగిపోతున్న వాసన... అగ్ని కీలకాలు లంకంతా వ్యాపించటంతో రాక్షసులు





భయవిహ్వలైపోయారు. కొంత మంది రాక్షసులు భార్యా, పిల్లలతో పరుగు తీస్తున్నారు.

మరికొందరు రాక్షసులు తమప్రాణాలు దక్కితే చాలని సర్వమూ వదిలేసి పిక్కబలం చూపిస్తున్నారు.

వందల వేల కొలది భవనాలనూ, రాక్షసులనూ, ఆయుధాలనూ, రథాలనూ, సమస్త ఐశ్వర్యాన్నీ అగ్ని దేవుడు ఆకలిగా జుర్రుకున్నాడు.

త్రికూట పర్వతంపై నున్న లంకానగరం మండుతుంటే ఆ మంటల వెలుగు ప్రతిబింబించుటచే సముద్రమంతా ఎర్రగా, ఎర్ర సముద్రంలా కానవచ్చింది.

వానరులు కాల్చిన లంకానగరం మహాప్రళయ మందు మండిపోయిన భూమి వలే అయింది.

గుర్రాలు భయపడి పరిగెత్తాయి... అది చూసి ఏనుగులు భయపడ్డాయి... ఏనుగుల్ని చూసి గుర్రాలు భయపడ్డాయి... లంకంతా పొగ వ్యాపించింది. అరుపులూ, పెడ బొబ్బలూ ఎన్నో యోజనాల వరకూ వినిపించాయి. శ్రీరాముడు ధనుష్టంకారం చేశాడు. ఆ భయంకర ధ్వనికి లంక దద్దరిల్లిపోయింది. పది దిశలూ మారుమ్రోగిపోయాయి.

శ్రీరాముడు బాణం సంధించి వదిలాడు. కైలాసశిఖరమంతున్న లంకాపురి ద్వారం తునాతునకలయ్యింది.

శ్రీరాముడి ధనుస్సు నుంచి బాణాలు వస్తూనే ఉన్నాయి. సుగ్రీవుని ఆజ్ఞతో వానరులు రావణ అంతఃపురాన్ని ముట్టడించారు.

లంకేశ్వరుడు రావణుడు క్రుద్ధుడయ్యాడు. సింహనాదం చేశాడు. విచ్చల విడిగా వీర విహారం చేస్తున్న వానరుల మీదకు ప్రళయకాల రుద్రుల వంటి కుంభకర్ణుని కుమారులను కుంభుడు, నికుంభుడులను వెళ్ళమన్నాడు.

వారితో పాటు యూపాక్షుడూ, శోణితాక్షుడూ, ప్రజంఘుడూ, కంపనుడూ వెళ్ళారు.

"వీరులారా! వానరుల పని పట్టండి" ఆజ్ఞాపించాడు రావణుడు. మహా వెలుతురు మంటల్లో రాక్షస సైన్యాలూ, వానర సైన్యాలూ మెరిసిపోతున్నారు.

శూలాలూ, గదలూ, తోమరాలూ, ప్రాసలూ, కార్ముకాలూ లాంటి ఆయుధాలతో వానరుల మీదకు వెళ్ళారు రాక్షసులు.

పెద్ద పెట్టున అరుస్తూ వారి మీదకు వురికారు వానరులు. ధగధగ మెరిసే ఆయుధాలతో వానరుల మీద పడ్డారు రాక్షసులు. మహా వృక్షాలతో బాదారు వానరులు.

గోళ్ళతో, కోరలతో పీకి పెట్టారు. ఒకరు ఒకడ్ని చంపగానే వాడ్ని మరొకడు చంపసాగారు. ఈటెలతోనూ, శూలాలతోనూ పొడుస్తున్నారు రాక్షసులు. రాళ్ళతో బాదుతున్నారు వానరులు.

వానరుల వస్త్రాలు ఊడిపోయేంత వరకూ బాదుతున్నారు రాక్షసులు. రాక్షస ధ్వజాలనూ, వారి తలలనూ విరగ్గొడుతున్నారు వానరులు.

## రాక్షస యోధులు

మహోగ్రవేగంతో సాగిపోతున్న ఆ యుద్ధంలో ఉభయ పక్షాల్లోనూ ఎంతో మంది మరణించారు. రణోత్సాహంతో అంగదుడు కంపనుడి మీద కొచ్చాడు.

కవ్వించి, ఆహ్వానించి రప్పించిన అంగదుడ్ని వచ్చీరాగానే మహా గదతో కొట్టాడు కంపనుడు. అంగదునికి కళ్ళు బైర్లుకమ్మాయి.

రోషంతో అంగదుడు మహా పర్వత శిఖరాన్ని పెకిలించి, కంపనుడి వక్షస్థలంపై వేశాడు. అంతటి శిఖరం అంతటి వేగంతో వచ్చి తగలటంతో కేక కూడా పెట్టకుండా మరణించాడు కంపనుడు.

కంపనుడ్ని అంగదుడు చంపటం చూసి శోణితాక్షుడు సింహనాదం చేశాడు. రథాన్ని వేగంగా అంగదుడి వైపు మరల్చాడు.

మహాకాలాగ్ని వంటి బాణాలు వరసపెట్టి వేశాడు అంగదుడి పైకి. క్షురములూ, నారాచములూ, వత్సదంతములూ శిలీముఖములూ, కర్ణులూ, విపాఠములు ఇలా ఎన్నో, ఎంతో శక్తి వంతమైన బాణాలను అంగదునిపై ప్రయోగించాడు.

ఆ మహా బాణాలు వాలిపుత్రుడూ, మహా బలవంతుడూ అయిన అంగదుడి శరీరాన్ని ఛిద్రం చేశాయి.

అంగదుడు భయంకరంగా అరిచి, ఆ బాణాలను లాగి అవతల పారేసి, ఉన్నట్టుండి ఎగిరి శోణితాక్షుడి చేతిలోని ధనుస్సునూ, బాణాలనూ లాగి విరగ్గొట్టాడు.

శోణితాక్షుడు కోపంతో కత్తి తీసుకొని ఆకాశానికి ఎగిరాడు. అంగదుడు రివ్వున అతనితో పాటు ఎగిరి పిడిగుద్దులు కురిపించి, శోణితాక్షుడి చేతిలోని





కత్తిని తీసుకొని దానితోనే చరిచాడు. భుజం నుంచి క్రింది వరకూ కత్తితో చీరటంతో యజ్ఞోపవీతంలా గాటు పడింది. శోణితాక్షడు మూర్ఛపోయాడు.

ఆ కత్తితో అంగదుడు రాక్షసుల మీదకు ఉరికాడు. వానరులను ఈటెలతో పొడుస్తున్న రాక్షసుల తలలను ఖండించాడు.

శోణితాక్షుడు తేరుకొని ఓ మహా ఇనుప గుదియ తీసుకొని అంగదుడి వెంట పడ్డాడు.

బలవంతుడైన యూపాక్షుడు ప్రజంఘునితో కలిసి అంగదుని మీదకు వెళ్ళారు. ముగ్గురూ మూడు వైపులా ఉన్నారు. శోణితాక్షుడు, యూపాక్షుడు ప్రజంఘునుల మధ్య వానర యువరాజు అంగదుడు విశాఖా నక్షత్రాల మధ్య నున్న పూర్ణచంద్రుడి వలే శోభించాడు.

అంగదునికి రక్షణగా ఉన్న మైంద, ద్వివిదులు అంగదుడ్ని చేరారు. ఆ రాక్షసులని చూశారు. ముగ్గురూ, ముగ్గురి మీద పడ్డారు. రోమాంచమును కలిగించే భయంకర పోరాటం చేశారు.

వృక్షాలనూ శిలలనూ ప్రజంఘుడూ, యూపాక్షుడూ బాణాలతో వక్కలు చేశారు.

శోణితాక్షుడు వానరులు విసిరిన శిఖరాలనూ, వృక్షాలనూ తన దరికి చేరకుండా తన ఖడ్గంతో ముక్కలు చేశాడు.

ప్రజంఘుడు సింహనాదం చేస్తూ అంగదుని మీదకు మహాఖడ్గముతో వెళ్ళాడు. అంగదుడు ఇనుమద్ది చెట్లతో ప్రజంఘుణ్ని బాదాడు. మర్మస్థానములు చీల్చే ఆ ఖడ్గాన్ని ప్రజంఘున్ని పిడికిలితో గుద్ది చేజిక్కించు కున్నాడు.

ముసలము వంటి ఖడ్గం చేజారగానే ప్రజంఘుడు వజ్రాయుధం వంటి పిడికిలి దెబ్బను అంగదునికి రుచి చూపించాడు.

ప్రచండ యుద్ధ వీరుడు ప్రజంఘుడు కొట్టిన దెబ్బకు అంగదునకు చుక్కలు కనపడ్డాయి. నిల దొక్కుకొని నల్లకలువరేకు వంటి ఖడ్గముతో ప్రజంఘుడి శిరస్సు ఖండించాడు.

పినతండ్రి ప్రజంఘుడు మరణించటంతో యూపాక్షుడు దుఃఖించాడు. మహా కోపావేశంతో భయంకరమైన ఖడ్గాన్ని తీసుకొని అంగదుని మీదకు వెళ్ళాడు.

మహా అగ్ని శిఖలా వస్తున్న యూపాక్షుణ్ని చూసి ద్వివిదుడు ఎగిరి రొమ్ము మీద గుద్దాడు. తన బాహువులతో బంధించాడు. మహా బల వీరుడైన

తన సోదరుడు యూపాక్షుడను ద్వివిదుడు పట్టుకోవటంతో శోణితాక్షుడు ద్వివిదుడి వక్షస్థలంపై పిడుగులాంటి పిడి గుద్దు గుద్దాడు.

శోణితాక్షుడి దెబ్బకు ద్వివిదుడు తూలాడు. మహా గదతో ద్వివిదుడ్ని శోణితాక్షుడు కొట్టబోయాడు. శోణితాక్షడు ఎత్తిన గదను ద్వివిదుడు మీద పడి లాక్కున్నాడు. గదతో బాదాడు. శోణితాక్షుడి ముఖాన్ని ద్వివిదుడు గోళ్ళతో గీరాడు. మైందుడు కొండల వంటి చేతులతో శోణితాక్షుడ్ని నేల మీద పడవేసి గుద్ది గుద్ది చంపాడు.

అది చూసిన రాక్షసులు గగ్గోలు పెడుతూ కుంభకర్ణుని పుత్రుడు కుంభుడు వద్దకి వెళ్ళి విన్నవించారు.

## కుంభుడు

తన వద్దకు వచ్చిన రాక్షస సేనను సముదాయించాడు కుంభుడు. అగ్నిలా భగ్గుమన్నాడు. మహాశక్తి వంతమైనదీ, ఎంతటి వజ్ర శరీరాన్నైనా చీల్చి వేయగల బాణాన్ని అందుకున్నాడు.

మహా పర్వతం వంటి బాణాన్ని అందుకున్నాడు. కుంభుడు తన ఇంద్ర ధనుస్సు వంటి ధనుస్సుతో బంగారు ములుకుల గల బాణాన్ని ద్వివిదుడి మీదకు పంపాడు. ఆ మహాశక్తివంతమైన బాణ ధాటికి ద్వివిదుడు నిరుత్తురుడయ్యాడు. అవయవాలు స్వాధీనం తప్పి పడిపోయిన తమ్ముడిని చూడగానే మైందుడు ఉగ్రనరశింహుడయ్యాడు. పెద్ద రాతి బండను తీసుకున్నాడు. కుంభుడు ముఖాన్ని తాకేలా వేశాడు.

యుద్ధ విశారదుడు కుంభుడు ఆ రాతి శిలను బాణాలతో ముక్కలు చేశాడు. కాల కూట విషాన్ని కక్కే బాణాన్ని వేశాడు మైందుడి మీదకు. ఆ బాణ ధాటికి మైందుడు మూర్ఛపోయాడు.

వానర వీరులైన తన మేనమామలిద్దరూ అలా పడిపోవటం చూశాడు అంగదుడు. ఒక్క ఉదుటున కుంభుడి మీదకు వెళ్ళాడు. వాడియైన ఇనుప బాణాలను అంగదుని మీద ప్రయోగించాడు. మహా ఏనుగును తోమరములతో కొట్టి పరిగెత్తించినట్టు పరిగెత్తించాడు.

అంగదుడు ఓర్చుకుంటూనే రాళ్ళ వర్షాన్నీ, మహా వృక్షాల వర్షాన్నీ కురిపించాడు. కుంభుడు వాటిని నిర్వీర్యం చేస్తూ మహా అగ్ని వంటి బాణాలను అంగదుని కనుల మీదకు పంపాడు. ఆ బాణాలు అంగదుడ్ని గాయపర్చాయి.





బాధను ఓర్చుకుంటూ మహా సాల వృక్షాన్ని పెకిలించి గిరగిరా తిప్పి కుంభుడి మీదకు వేశాడు.

కుంభుడు దాన్ని విరిచేసి అంగదుని మీద వాడి ములుకుల బాణాలని వేశాడు. అంగదుడు అతలాకుతలమయ్యాడు. అంగదుని స్థితి చూసి వానరులు శ్రీరాముని వద్దకు వెళ్ళి చెప్పారు.

జాంబవంతాది వీరులను తక్షణమే అంగదుడున్న యుద్ధ ప్రదేశానికి వెళ్ళమని శ్రీరాముడు చెప్పాడు. జాంబవంతుడూ, సుషేణుడూ, వేగదర్శీ ముగ్గురూ కుంభుడి మీదకు వెళ్ళారు. మహేంద్రుడిలా యుద్ధం చేస్తూనే ఉన్నాడు కుంభుడు.

ప్రళయకాల ఝంజామారుతంలా వానరసేనా నాయకులపై విరుచుకు పడుతున్న కుంభుడ్ని నిలవరించాలని సుగ్రీవుడు విరుచుకు పడ్డాడు. పర్వత శిఖరాలనూ, మహా వృక్షాలనూ విసిరాడు.

వాటినీ సునాయాసంగా విరిచేశాడు. సుగ్రీవుడు తెగించి, కుంభుడి బాణాలకు ఎదురుగా వెళ్ళి వాటిని చేతులతో ఆపుతూ వెళ్ళి కుంభుడి రథం మీద పడ్డాడు. మహా శక్తివంతమైన ధనుస్సును లాగాడు. తన శక్తినంతా చూపించి విరిచేశాడు.

ఊహించని ఆ సంఘటనతో కుంభుడు దంతాలు పీకిన ఏనుగయ్యాడు.

"కుంభుడా! నీవు వీరాధి వీరుడవు. ప్రహ్లాద, బలి, కుబేర, వరుణులతో సమానమైన వాడవు. రావణుడితో సరిసమాన ధైర్యసాహసాలు చూపించావు" మెచ్చుకున్నాడు సుగ్రీవుడు.

కుంభుడు అసహనంగా తల విదిల్చి సుగ్రీవుడ్ని తన బాహువుల మధ్య అదిమి పెట్టాడు. సుగ్రీవుడు కూడా కుంభుడ్ని బాహువులతో చుట్టేసి అదిమాడు రెండు కొండలు పెనవేసుకున్నట్టుగా ఉంది.

వారి పాదాల ఘట్టనకు నేల వక్కలైంది. సుగ్రీవుడు తన శక్తినంతా చేతుల్లోకి తెచ్చుకొని శ్రీరాముడ్ని తలుచుకొని కుంభుడ్ని ఎత్తేశాడు. ఏ మాత్రం ప్రతిఘటనకు అవకాశం ఇవ్వకుండా గిరగిరా తిప్పి సముద్రంలో పడవేశాడు.

కుంభుడు సముద్రం నుంచి ఎగిరి వచ్చి సుగ్రీవుడి వక్షస్థలం మీద తన్నాడు. సుగ్రీవుడు క్రుద్ధుడయి వజ్రసమానమైన పిడికిలితో కుంభుడి వక్షస్థలం మీద గుద్దాడు. సరిగ్గా తగలాల్సిన చోట తగిలింది.

మహారుద్రుడు కొట్టిన సూర్యుడిలా విలవిలలాడి కుంభుడు నేలరాలాడు. రాక్షసులు భయవిహ్వలైయ్యారు. అంతటి వీరాధి వీరుడు మరణించగానే భూమి అదిరింది. పర్వతాలు కదిలాయి.

## నికుంభుడు

తన అన్నను సుగ్రీవుడు చంపివేయుట చూసి నికుంభుడు చూపులతోనే కాల్చేసేలా చూశాడు సుగ్రీవుడి వైపు. మహా పర్వతమంతటిదీ, మంగళ ప్రదమైనదీ, చందన కుంకుమాదులతో అయిదు వేళ్ళ ముద్ర ఉన్నదీ అయిన పరిఘను అందుకున్నాడు.

యముని దండమువలే నున్న ఆ పరిఘను తీసుకొని, ఇంద్ర ధ్వజములా కదిలి వెళ్ళే మేఘమువలే గర్జించాడు. పరిఘ ఆయుధాన్ని గిరగిరా తిప్పాడు. ఆ ధాటికి ఏడు వాయువుల గ్రంథులు బ్రద్దలైయ్యాయి.

నికుంభుని పరిఘ వేగ గాలి ధాటికి  అలకా పట్టణమూ, గంధర్వ నగరమూ, తారాగ్రహ నక్షత్రమండలమూ, చంద్రునితో సహా అంతా గిరిగిరా తిరుగుతున్నట్టు అనిపించాయి వానరులకు.

మహోగ్రరూపంతో ఉన్న నికుంభుడ్ని వానరులు తేరిపారా కూడా చూడలేకపోయారు.

ఎదుటకు కూడా వెళ్ళుటకు సాహసించని వానర సేనా నాయకులను చూసిన వాయుపుత్రుడు హనుమంతుడు నికుంభుడికి ఎదురెళ్ళాడు. రొమ్ము విరిచి సవాలు విసిరాడు.

నికుంభుడు తన ఎదుట నిల్చిన హనుమని చూసి ఆ మహా పరిఘను హనుమ వక్షస్థలంపై వేశాడు. పడీపడటంతోనే ఆ పరిఘ ముక్కలు ముక్కలైంది. హనుమ సింహనాదము చేశాడు.

పరిఘ దెబ్బ తిన్న హనుమ భూకంపం వచ్చినప్పుడు అదిరిపోయే పర్వతంలా అదిరాడు. నిల దొక్కుకొని పిడికిలి బిగించి నికుంభుడ్ని గుద్దాడు.

ఆ మహా వాయువేగ దెబ్బకు నికుంభుని కవచం వక్కలైపోయింది. నికుంభుడు రోషంగా ఎదురెళ్ళి హనుమంతుడ్ని ఎత్తాడు.

వాయుపుత్రుడైన హనుమని ఎత్తటం చూసి నికుంభుడికి జేజేలు పలికారు రాక్షసులు. హనుమ వజ్రము వంటి పిడికిలితో గుద్దాడు. ఆ దెబ్బకు హనుమని వదిలేశాడు.





హనుమ వీరావేశముతో నికుంభుని తలపట్టుకొని చటుక్కున లాగేశాడు. కొమ్మనున్న కాయను లాగినట్టు లాగాడు.

రాక్షసులు భయంకర గర్జనలు చేశారు. వానరులు దిక్కులు మారుమ్రోగేలా హనుమంతుడికి జేజేలు పలికారు.

## మకరాక్షుడు

కుంభుడు, నికుంభుడు మరణించారనగానే రావణుడు కోపంతో అగ్నిహోత్రములా, తోక తొక్కిన త్రాచులా అయ్యాడు.

విశాల నేత్రములు గల ఖరపుత్రుడు మకరాక్షుడ్ని ఆజ్ఞాపించాడు.

“పుత్రా! వెళ్ళు... యుద్ధరంగానికి తరలి వెళ్ళు. రామలక్ష్మణులనూ, వానరులనూ సంహరించు. సైన్యాన్ని తీసుకెళ్ళు.”

మకరాక్షుడు రావణుడికి ప్రదక్షిణం చేశాడు. అభివాదం చేశాడు. రథాన్ని అధిరోహించాడు. సారథిని తొందరగా యుద్ధరంగానికి కదలమన్నాడు.

“రాక్షసులారా! విజయం మనదే. అగ్ని ఎండు కట్టెలను కాల్చినట్టు వానరులను కాల్చివేద్దాము.”

మకరాక్షుడి మాటలతో రాక్షసులు ఎగిరి సంతోషం వెళ్ళబుచ్చారు. భయంకర రూపాలతో, ఊడిపోయిన జట్టు ముడులతో కామరూపులైన రాక్షసులు బైలుదేరారు.

రథ సారథి చేతిలోని కొరడా జారిపోయింది. గుర్రాలు అదిరాయి. గాలి దుమారంగా లేచింది. ఆ దుర్నిమిత్తాలను రాక్షసులు పట్టించుకోలేదు.

భేరీ, శంఖాలు పూరిస్తూ దిక్కులు దద్దరిల్లేలా వానరసేనను సమీపించారు. ఒకరి మీద ఒకరు విరుచుకుపడ్డారు. దేవదానవ యుద్ధంలో దేవతలూ, రాక్షసులూ కొట్టుకున్నట్టు కొట్టుకున్నారు.

రాత్రి యుద్ధంలో నేర్పరులైన రాక్షసులు శక్తి, ఖడ్గ, గదా, పట్టిశములతో పాశ, ముద్గర వంటి ప్రేలుడు ఆయుధాలతో వానరుల మీద పడ్డారు. ఆ ఆయుధ ధాటికి వానరులు పరుగులు తీశారు.

ఆ మహాశక్తి వంతమైన ఆయుధాలను శ్రీరాముడు పడగొట్టి వానరులకి ధైర్యానిచ్చాడు. దానితో వానరులు రెట్టించిన ఉత్సాహంతో రాక్షసుల మీద పడ్డారు.

శ్రీరాముడ్ని చూడగానే మకరాక్షుడికి పాతవైరం గుర్తుకు వచ్చింది.

"శ్రీరామా! ఆగు! దండకారణ్యమున నా తండ్రిని చంపావు. దానికి ప్రతీకారం చేయుటకై నీ కోసమే వచ్చాను. ఇప్పటికి నా కనులకు కానవచ్చినావు. నా తండ్రి ఋణము తీర్చుకుంటాను.

"రామా! కాచుకో! గతంలో నీవు చంపిన రాక్షసులున్న చోటకే నిన్ను పంపుతున్నాను" అని బాణాన్ని సంధించాడు మకరాక్షుడు.

శ్రీరాముడు మకరాక్షుని పలుకులకి సన్నటి దరహాసము చేశాడు.

"మకరాక్షుడా! దండకారణ్యమున పధ్నాలుగు వేల మంది రాక్షసులనూ ఖర, దూషణులనూ చంపాను. అధర్మ పద్ధతిలో ఎవరు ఎదిరించబోయినా వారికి అదే గతి..." చెప్పాడు శ్రీరాముడు.

మకరాక్షుడు మహాశక్తి గల బాణాన్ని వేశాడు. శ్రీరాముడు ధనుస్సు సంధించి బాణాన్ని వదిలాడు. మహా అగ్ని చక్రంలా వెళ్ళి మకరాక్షుడి బాణాన్ని త్రుంచి, ఆపై రథసారథినీ, గుర్రాలనూ చీల్చి వేసింది.

మకరాక్షుడు నేలపై దూకి జగత్తును సంహరించేలా మండుతున్న మహా శూలాన్ని శ్రీరాముడి మీదకు వేశాడు. దేవతలంతా భయపడే శూలమది.

శ్రీరాముడు తన బాణాలతో ఆకాశాన్నే ఛేదిస్తాడు. ఆ మహా శూలాన్ని మధ్యలోనే బూడిద చేశాడు. శ్రీరాముడు తన అక్షయ తూణీరాన్నించి ఆగ్నేయాస్త్రము తీశాడు. మంత్రించి వదిలాడు.

భయంకర వెలుగుతో, దిక్కులు ధ్వనింప చేస్తూ, మహా ధ్వనులు చేస్తూ వచ్చి మకరాక్షుడికి తగిలింది.

మకరాక్షుడి వక్షస్థలం ఛిద్రమై నేలకొరగటంతో రాక్షసులు మళ్ళీ మాములుగా అరుచుకుంటూ లంకదారి పట్టారు.

## ఇంద్రజిత్తు

పొందశక్యము కాని మహా శూలమును పొందిన మకరాక్షుడు, మహా ప్రకాశమైనదైన శూలాన్ని పొందిన ఆ వీరుడు మకరాక్షుడు శ్రీరాముని చేతిలో హతమవ్వటం రావణుడిని కలచి వేసింది.

ఎన్నో యుద్ధములలో సునాయాసంగా విజయలక్ష్మిని లంకకు తెచ్చిన వీరుడు మకరాక్షుడు. అట్టి రాక్షసశ్రేష్ఠుడు చనిపోవటంతో లంకేశ్వరుడు రావణుడు దంతాలను కోపంతోనూ, కసితోనూ కొరికాడు.

పుత్రుడు ఇంద్రజిత్తును పిలిచాడు.





"కుమారా! ఇంద్రజిత్తూ! నీ అపూర్వ మాయా యుద్ధంతో శత్రువులను అల్లకల్లోలము చెయ్యి... బల పరాక్రమాలతో శత్రువుల గుండెలని చీల్చు... రామలక్ష్మణులను సంహరించు..." చెప్పాడు రావణుడు.

తండ్రి ఆజ్ఞతో ఇంద్రజిత్తు యజ్ఞ భూమికెళ్ళాడు. అగ్నిలో హోమం చేశాడు. రెల్లుగడ్డి, తోరములు పరిచి పూర్తిగా కాటుకవలే ఉన్న నల్లమేకను బలి ఇచ్చాడు. రాక్షసులు దేవతా మంత్రాలను వల్లించారు.

అంతర్ధాన రథం సిద్ధమయ్యింది. నాలుగు గుర్రాలు కట్టిన దివ్యంథాన్ని ఇంద్రుడ్ని జయించిన ఇంద్రజిత్తు అధిరోహించాడు. సూర్యకాంతితోనూ, బ్రహ్మాస్త్రముతోనూ రణ రంగానికి సిద్ధమయ్యాడు. అంతర్ధానమయ్యాడు.

మహా సముద్రవాహినిలా ఉన్న వానర సైన్యాన్ని ఆకాశాన్నించి చూశాడు. మహాబ్రహ్మాస్త్రాన్ని పొందిన మహా బలశాలి ఇంద్రజిత్తు వికటంగా నవ్వాడు.సేనను తనను అనుసరించమని ఆదేశించాడు. మహా యుద్ధరంగాన్ని సమీపించాడు.

యుద్ధశీలి ఇంద్రజిత్తు అదృశ్యంగానే ఉండి మహాశక్తి వంతమైన బాణాలను రామలక్ష్మణుల మీదకి వేశాడు. ఎటు నుంచి వస్తున్నాయో తెలియని సూర్యసమాన బాణాలను రామలక్ష్మణులు ఎదుర్కొన్నారు. గగన మధ్యంలోనే వక్కలు చేశారు.

ఇంద్రజిత్తు తన మాయా శక్తితో ఆకాశాన్నంతా పొగ చీకటి కల్పించాడు. దిక్కులు కూడా కానరావటం లేదు. రణ చీకటి ఆవహించింది.

ఇంద్రజిత్తు రథ గుర్రాల డెక్కల చప్పుడు కానీ, బాణాలను వదులుతున్నప్పుడు వచ్చే ధనుష్టంకారం కానీ వినిపించుట లేదు.

తమపైకి వచ్చే ఆయుధాలను రామలక్ష్మణులు భల్లాయుధాలతో నిర్వీర్యం చేస్తున్నారు. ఆ కటిక చీకటిలో ఇంద్రజిత్తు బాణ వర్షాన్ని వానరులపై ప్రయోగిస్తున్నాడు. వేలాదిగా వానురులు మరణించటంతో లక్ష్మణుడు ఉగ్రుడయ్యాడు.

బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించటానికి ఉద్యుక్తుడయ్యాడు.

"లక్ష్మణా! బ్రహ్మాస్త్రం ఒక్క ఇంద్రజిత్తునే కాదు... సమస్త రాక్షసులనూ సంహరిస్తుంది. లంకలో స్త్రీలూ, పిల్లలూ, యుద్ధానికి భయపడి ఉన్నవారినీ, ముసలివాళ్ళనూ సంహరిస్తుంది. బ్రహ్మాస్త్రం బంధనం నుంచి విడిపించుకొనే శక్తి వారెవ్వరికీ లేదు. బంధ విముక్తులను చేయు నాయకుడూ లేడు.

"కాన లక్ష్మణా! నమస్కరించు వానినీ, శరణు వేడినవారినీ, పారిపోతున్న వారినీ, మద్యము తీసుకొని ఉన్న వారినీ చంపుట యుద్ధ నీతి కాదు.

"మహా కాలసర్పముల వంటి బాణాలతో ఇంద్రజిత్తును నిలవరించు. ఏడేడు లోకాలు తిరిగినా వదలిపెట్టని దివ్యాస్త్రాన్ని వదులు" చెప్పాడు శ్రీరాముడు.

వానరసేనా నాయకులతో శ్రీరాముడు చర్చించాడు. క్రూరకర్మలు చేయువాడూ, అహంకారంతో ఎన్నో అరాచకాలు చేసినవాడూ, సాధుహింసా పరుడూ అయిన ఇంద్రజిత్తును చంపటానికి శ్రీరాముడు సంకల్పించాడు.

## మాయా సీత

మహా మాయా నిపుణుడైన ఇంద్రజిత్తు శ్రీరాముడి మంత్రాంగాన్ని గమనించాడు. వెనువెంటనే లంకకి చేరాడు. మాయలకే మాయగాడైన ఇంద్రజిత్తు ఓ ఉపాయాన్ని ఆలోచించాడు.

తన పినతండ్రులూ, మిత్రులూ, హితుల మరణాన్ని తలుచుకున్నాడు. క్రోధంతో ఉడికిపోయాడు. మహా ద్యుతిమంతుడూ, పులస్త్య మహర్షి మహావంశంలో జన్మించిన దేవతల శత్రువు ఇంద్రజిత్తు మహా రాక్షస సేనతో లంకానగరపు పశ్చిమ ద్వారం నుంచి రథంపై వెళ్ళాడు.

మహాప్రకాశవంతమైన దివ్యరథంపై ఇంద్రజిత్తు తన మాయచే మాయా సీతను సృష్టించి ఉంచాడు.

రథాన్ని రామలక్ష్మణుల వైపు మరల్చమని సారథికి చెప్పాడు. లంక పశ్చిమ ద్వారం నుంచి ఆశేష రాక్షసులతో వస్తున్న ఇంద్రజిత్తు పైకి వానరులు మహావృక్షాలూ, పర్వత శిఖరాలూ విసిరారు.

వాయుపుత్రుడూ, వానర సేనా నాయకుడూ, సుగ్రీవుడి ఆప్తుడూ అయిన హనుమ ఇంద్రజిత్తును చూడగానే మహా పర్వతశిఖరాన్ని చేతబూని ఇంద్రజిత్తు రథానికి ఎదురుగా వెళ్ళాడు.

వెళ్తూనే సీతను చూశాడు. దీనంగా, దిగులుగా, దయనీయమైన స్థితిలో ఇంద్రజిత్తు రథం మీద వైదేహి... సీతాదేవి కనపడింది. హనుమంతుడు ఖిన్నుడయ్యాడు.

ఇంద్రజిత్తు సూర్యకిరణాలతో మెరిసిపోయే ఖడ్గం తీసి శోకార్తైన సీతాదేవి కేశములు పట్టుకొని చెప్పాడు.





మారుతాత్మజుడు విలవిలలాడిపోయాడు. శ్రీరామచంద్రుడి పట్ట మహిషి... దశరథుని కోడలు... జనకరాజ పుత్రి... శ్రీరాముడి ప్రియభార్య వైదేహి... అట్టి సీతను చూసి ఏం చెయ్యాలో, ఏం చెయ్యకూడదో తెలీక కన్నీరు పెట్టాడు.

"ఓరీ! నీచ ఇంద్రజిత్తూ! నీది బ్రహ్మర్షుల వంశం. దానికే అపకీర్తి తెచ్చావు. మహాతల్లి సాధ్వీమణీ సీతమ్మ కేశాలను పట్టుకున్న నీ దుర్బుద్ధికి తగిన ప్రతిఫలం అనుభవిస్తావు. సీతమ్మ తల్లికి నమస్కరించుటకే అనర్హుడవైన నీవు ఇంత నీచానికి ఎలా వొడిగట్టావు.... నీవు బ్రతికి ఉండుట ఇక కల్ల" అని హనుమంతుడు దూకుడుగా ముందుకెళ్ళాడు.

"రా హనుమా! ముందు నా ఖడ్గానికి సీతను, ఆ తర్వాత నిన్నూ, ఆపై రామలక్ష్మణ సుగ్రీవ అంగదులనూ అందరినీ బలితీసుకుంటాను. దాని కోసం ఎంతటి ఘాతకానికైనా ఒడిగడతాను" అని మాయా సీతాదేవిపై కత్తిని ఝుళిపించాడు.

దీనురాలు, విశాల సుందరకటి ప్రదేశం గల మాయా సీతా... 'రామా...రామా...' అంటూ కనులు మూసింది.

"రామా! లక్ష్మణా! సుగ్రీవా! అంగదా! చూడండి. ఎవరికోసమైతే సేతువు నిర్మించారో... ఎవరికోసమైతే నూరు యోజనములు దాటి వచ్చారో ఆ సీత మరణించింది" అరిచి చెప్పాడు.

యుద్ధరంగమంతా దిగ్భ్రాంతి చెందింది. వానరులు యుద్ధాన్ని ఆపి కన్నీరు కారుస్తూ విలపిస్తూ చూశారు. విషణ్ణ ముఖాలతో పరుగుతీశారు.

హనుమంతుడు మహా భూతం ఆవహించినట్టు పెద్ద శిలను తీసుకొని ఇంద్రజిత్తు రథంపై వేశాడు. మహాఖాయంతో రాక్షసుల మీదపడి దొరికిన వార్ని దొరికినట్టే చంపసాగాడు.

వానరవీరులు కొంతమంది అప్రియమైన ఆ విషయాన్ని శ్రీరామునికి చేరవేసేందుకు పరుగున వెళ్ళారు. హనుమంతుడు కూడా శ్రీరాముని దగ్గరికి వెళ్ళటానికి ఎగిరాడు.

ఇంద్రజిత్తు గమనించి నికుంభిల దేవాలయానికి మరలాడు. ఆ మహారాక్షస దేవతామూర్తి ముందు కూర్చొని అగ్నితో హోమము చేశాడు. మాంస, రక్తాలను నివేదించాడు.

నికుంభిలాదేవి ఆ రక్త, మాంసాలను స్వీకరించింది. ఆగమ విధులు తెలిసిన ఇంద్రజిత్తు పూజను స్వీకరించి హోమగుండం తీవ్రంగా జ్వలించింది.

## మాయా సీతాదేవి వధ వృత్తాంతము

మహాభయంకర ధ్వనులు వినవస్తుండటంతో శ్రీరాముడు చెప్పాడు.

"లక్ష్మణా! అదిగో పశ్చిమ ద్వారం నుంచి మహోగ్రంగా గర్జనలు వినవస్తున్నాయి. మన హనుమ ఏదో మహాకార్యం చేసి ఉంటాడు."

లక్ష్మణ, జాంబవంతులు వానరులతో వస్తున్న హనుమను చూశారు. హనుమంతుడు పరుగున వచ్చి శ్రీరాముడి పాదాలపై పడ్డాడు.

"రామా! అకార్యం జరిగిపోయింది. మేఘనాథుడు ఇంద్రజిత్తు... రావణుడి పుత్రుడు ఇంద్రజిత్తు...

"నీ ప్రియభార్యను, సీతమ్మ తల్లిని తన ఖడ్గానికి బలి చేసినాడు. నేను చూస్తుండగానే జరిగింది. అశక్తుడనయితిని శ్రీరామా!..."

హనుమంతుడు చెబుతూనే ఉన్నాడు. శ్రీరాముడు నిరుత్తురుడయ్యాడు. మహా పిడుగు పడిన వృక్షమే అయ్యాడు. లక్ష్మణుడు అన్నగారిని పట్టుకున్నాడు. ఆవేదనగా చెప్పాడు.

"ధర్మముగా ఉంటే ధర్మఫలం పొందుతామని చెప్పావు. అధర్మంతో ఉంటే అధర్మఫలమే అందుతుందని చెప్పావు. కానీ శ్రీరామా! జరిగింది వేరు. అధర్మమే గెలిచింది.

"ధర్మ మన్నది ఉన్నదా! ఉన్నచో ఇట్టి అధర్మం ఎలా జరుగును. కాన ధర్మం లేదు.

"అన్నా!శ్రీరామా! ధర్మ, అధర్మ మన్న ప్రశక్తి లేదు. అవసరార్థం కార్యాలని చేయుటే ధర్మం.

"శ్రీరామా! ఇకనైనా ఆజ్ఞాపించు నా అస్త్రాలతో మొత్తం లంకనూ, సమస్త రాక్షసులనూ క్షణంలో ఆహుతి చేస్తాను."

శ్రీరాముడికి లక్ష్మణుడు ఆవేశంతోనూ, బాధతోనూ చెబుతున్నాడు. విభీషణుడు శ్రీరాముడ్ని సమీపించాడు.

"శ్రీరామా! స్వాంతన చెందు. అట్టి అకార్యము జరగదు. లంకలోని రావణుడికి ఎన్నోసార్లు సీతాదేవిని ఇచ్చివేయమని చెప్పాను. ప్రాణాలైనా వదులుతాను గాని సీతను ఇవ్వనన్నాడు.





"అట్టి వాడూ, అట్టి కాముకుడూ తన కామం కోసం పుత్రులనూ, బంధువులనూ, హితులనూ, స్నేహితులనూ ఇంత మందిని పోగొట్టుకున్నవాడు సీతాదేవిని చంపుటకు ఎందుకు ప్రయత్నిస్తాడు.

"కాన శ్రీరామా! ఇది సత్యంకాదు. ఇంద్రజిత్తు ఎంత యుద్ధ వీరుడో... అంతటి మాయావి. దేవతలని కూడా మోసం చేతనే గెలిచినవాడు.

"ఓ నరశార్దూలమా! ఓ వీరుడా! ధర్మపరుడవు. అట్టి నీకు సమస్తమూ అనుకూలంగా ఉంటుంది. దయనీయ స్థితి వలదు. సుశిక్షితమైన బుద్ధి గలవాడవు. దోషములు లేని శ్రీరామా...

"నా పలుకులు విశ్వసించుము. ఇక్ష్వాకు వంశానికి ఆనందమిచ్చువాడా! శ్రీరామా... సముద్రం ఎండి పోవుట సత్యమా... పశ్చిమాన సూర్యుడు ఉదయించుట సాధ్యమా... ఇంద్రజిత్తు వానరులను మాయ చేశాడు. అది సత్యం....

"రాక్షస మాయలూ... రాక్షస తంత్రాలూ అన్నీ తెలిసిన వాడిని...కాన శ్రీరామా! నీ సత్య వాక్కంత సత్యం... సీతాదేవి జీవించే ఉంది. అట్లు కానిచో నే ఇక్కడే రక్తం కక్కుకొని చావవలెనని శపిస్తున్నాను" చెప్పాడు విభీషణుడు.

శ్రీరాముడికి విభీషణుడి మాటలకు స్వాంతన చేకూరింది.

"శ్రీరామా! ఇంద్రజిత్తు నికుంభిల దేవాలయంలో మహా హోమం చేస్తున్నాడు. ఆ హోమం పూర్తి అయితే దేవేంద్రుడూ, దేవతలూ వచ్చి మనతో చేరినా ఇంద్రజిత్తు సమూలంగా నాశనం చేయగల శక్తివంతుడవుతాడు.

"ఇంతటి మనోవేదనకు గురి చేసిన ఇంద్రజిత్తు రక్తాన్ని తీక్షణమైనవీ, పక్షుల రెక్కల వేగం కల లక్ష్మణుడి బాణాలు రుచి చూడగలవు.

"నరశ్రేష్ఠుడైన రఘువీరా! నీ ఆజ్ఞకై వేచి ఉంటిమి... నీ ఆదేశంతో ఇప్పుడే వెళ్ళి ఇంద్రజిత్తునూ అతని సమస్త రాక్షస పరివారాన్నీ వారి వారి బంధు, హితుల దగ్గరికే పంపిస్తాము" చెప్పాడు విభీషణుడు. శ్రీరాముడి ఆజ్ఞతో విభీషణుడు తన నలుగురు మంత్రులతో పాటు హనుమంతుడూ, జాంబవంతుడూ శుభ లక్షణములు గల లక్ష్మణుడితో కదిలారు.

నికుంభిలా దేవాలయమునకు పోయి ధనుస్సు అల్లెత్రాటిని మ్రోగించాడు లక్ష్మణుడు.

నికుంభిలా దేవాలయ ప్రాంగణం మహా రాక్షససేన చుట్టు ముట్టి ఉంది. మహా గజాలతోనూ, రథాలతోనూ, అన్నీ ఆయుధాలతోనూ రాక్షసులు నికుంభిల

ఆలయాన్ని కావలి కాస్తున్నారు. ఇంద్రజిత్తు ఎచ్చట ఉన్నాడో వానర వీరులకు తెలియరాలేదు.

అపార రాక్షస సేనతో ప్రవేశించుటకు వీలుకాని ఆ ప్రదేశంలో ఆ చీకటిలో లక్ష్మణుడు యుద్ధసన్నద్ధుడై సిద్ధంగా ఉన్నాడు.

## మహా యుద్ధము

"లక్ష్మణా! ఆ మహా రాక్షస సైన్యాన్ని చెల్లా చెదురు చేయుటకై వానరులు మహా వృక్షాలని విసిరి చిందర వందర చేస్తారు. పుట్టలోని పాములా ఇంద్రజిత్తు బైటికి రాకతప్పదు" అని విభీషణుడు చెప్పి వానర సేనకు ఆజ్ఞాపించాడు.

వానరులు మూకుమ్మడిగా కదిలి వృక్షాలనూ, శిలలనూ వేశారు. వాడి అయిన గోళ్ళతో కోరలతో కదిలారు.

రాక్షసులూ ఖడ్గాలతోనూ, శూలాలతోనూ వానరుల మీదకు వెళ్ళారు. రణ ఘోషతో నికుంభిలా దేవాలయ ప్రాంగణం మారుమ్రోగిపోయింది.

పర్వతాకారుడు హనుమ రాక్షసుల మీద పడి వేలాది రాక్షసులను హతం చేశాడు. వికృత ముఖాలు కలిగిన వారూ, మహా బాహువులు కలిగిన రాక్షసులు గగ్గోలుగా అరుస్తూ ప్రాణాలు వదులుతున్నారు.

ఆ మహా రణ ఘోష ఇంద్రజిత్తుకు వినిపించింది. హోమం పూర్తి చెయ్యకుండానే లేచాడు. కటిక చీకటి గల హోమ ప్రదేశం నుంచీ, ఆ చెట్ల మధ్య నుంచీ వచ్చాడు. రథాన్ని ఎక్కాడు. ఆయుధాలను ధరించి సారథిని కదలమన్నాడు.

కటిక చీకటిని పోలిన ఆ ప్రాంతం నుంచి ఇంద్రజిత్తు వస్తూనే బాణ ప్రయోగం మొదలు పెట్టాడు. యముడే యుద్ధరంగానికి వచ్చినట్టు కనిపించిన వానరులను కడతేరుస్తున్నాడు.

తన వజ్రము వంటి పిడికిళ్ళతో రాక్షస యోధులను హతం చేస్తుండటం చూసిన ఇంద్రజిత్తు హనుమంతుడి మీదకు, అగ్ని మీదకు వరుణుడు వెళ్ళినట్టు వెళ్ళాడు.

మహా గొడ్డళ్ళనూ, ఖడ్గాలనూ, పట్టిసాలనూ వేశాడు. హనుమంతుడు వాటిని తన భుజాలతో విరగ్గొట్టాడు.

"ఓయీ! రావణ పుత్రా! ఇంద్రజిత్తూ! నేను వాయు పుత్రుడను హనుమను... చూపించు నీ ప్రతాపము."





విభీషణుడు లక్ష్మణుడితో చెప్పాడు.

"లక్ష్మణా! హనుమంతునిపై పోరుకు సిద్ధమైయ్యాడు. ఇంద్రజిత్తు ఇక ఎంత మాత్రమూ ప్రాణాలతో ఉండుటకు అర్హుడుకాడు. మహా ఘోరములైన శరములతో ఇంద్రజిత్తుని వధించాలి" చెప్పాడు విభీషణుడు.

భయంకర రూపుడూ, శత్రువుల పాలిటి మహాయముడూ అయిన ఇంద్రజిత్తుని చూశాడు లక్ష్మణుడు.

## ఇంద్రజిద్విభీషణులు

శాంతమూర్తుడూ, స్నేహశీలీ అయిన విభీషణుడు లక్ష్మణుడను దగ్గరిలోని వనములోకి తీసుకెళ్ళాడు. మహా మర్రిచెట్టును చూపించాడు.

"లక్ష్మణా! ఈ మర్రిచెట్టు వద్దే భూత బలి ఇచ్చి సంపూర్ణ యుద్ధం చేస్తాడు. ఆపై సమస్త భూతకోటికీ కానరాక మహా ఆయుధాలను శత్రువుల పైకి ప్రయోగించి విజయాన్ని కైవసం చేసుకుంటాడు.

"అదిగో ఇంద్రజిత్తు. అతని దృష్టింతా ఈ మర్రిచెట్టు వైపే ఉంది. ఇక్కడికి రాకముందే ఇంద్రజిత్తును సంహరించాలి."

హనుమంతుడితో పోరుకు సిద్ధమైన ఇంద్రజిత్తు తన కర్తవ్యం గమనం చేసుకొని మర్రిచెట్టు వైపుకి వచ్చాడు. ధనుర్ధారుడై అగ్నిహోత్రంవలే ప్రకాశిస్తూ లక్ష్మణుడు కనిపించాడు.

మహా కవచమునూ, ఖడ్గమునూ ధరించిన ఇంద్రజిత్తు లక్ష్మణుడి ప్రక్కనే ఉన్న విభీషణుడ్ని చూశాడు. జరిగింది తెలుసుకున్నాడు.

"ఓయీ! విభీషణా! నాకు పినతండ్రివి. నీ పుత్రుడను నేను. నాకూ, నీ అన్నకూ ద్రోహం చేయు నీచుడవేల అయ్యావు. స్వజనము వదిలినావు. పరులకు భృత్యుడవయ్యావు. సత్పురుషులు నిన్ను నిందించగలరు.

"నీవన్నట్టు శత్రువులు గుణవంతులే కావచ్చు. నీ వాళ్ళు అయిన మేము గుణహీనులమే కావచ్చు. స్వజనము లెక్కడా? నీచ పరులెక్కడ? స్వజనాన్ని వదిలిన నీ వంటి వాడి వల్లే స్వజనమంతా నాశనమయ్యేది. ఇంత చేసిన నిన్ను లోకాన ఎవ్వరూ నమ్మరు. అవసరార్థం వాడుకుంటారు. ఆపై తొలగిస్తారు" ఇంద్రజిత్తు విభీషణుడ్ని అసహ్యంగా చూసి చెప్పాడు.

"ఇంద్రజిత్తూ! ధర్మా ధర్మాముల గూర్చి నీవు మాట్లాడుట తగదు. పినతండ్రినంటివి. అట్టి పినతండ్రిని పౌరుష వాక్యాలతో నిందించవచ్చునా?

పౌలస్త్య వంశంలో పుట్టినప్పటికీ నాది రాక్షస అంశ కాదు. కులము కన్నా గుణం ముఖ్యం.

"చెడు నడకకు అలవాటు పడినవాడవైన ఇంద్రజిత్తూ! అధర్మమును సహింపజాలను. అధర్మ నిరతితో, పాపాలు చేసిన వార్ని పామును విదిలించుకొని వచ్చినట్టు ప్రక్కకి రావాలి. పరుల ధనాన్ని ఆశించే వాడ్నీ, పర భార్యలని కోరే వాడ్నీ విడిచెయ్యాలనీ దూరంగా ఉండాలనీ ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. ధర్మపరులు శెలవిస్తున్నారు.

"పర ధనమూ, పర భార్యా, పర నిందా... ఈ మూడు మహా దోషములు. సాధు హింసా... దేవతలతో వైరమూ... అహమూ... రోషమూ... కామమూ.. సర్వదోషాలూ నీ తండ్రిని కప్పివేశాయి.

"ఓ నిశాచరుడా! ధర్మాన్ని తప్పిన వార్ని వదిలినప్పుడే సుఖమూ, శాంతీ లభిస్తాయి. నేనూ అదే చేశాను.

"ఇంద్రజిత్తూ! నీవు గర్వముతోనూ, మదంతోనూ విర్రవీగుతున్నావు. తండ్రి కోసం అకార్యానికి సిద్ధపడ్డావు.

"దానికి ప్రతి ఫలం. అదిగో యముడి మహిషపు లోహగంటలు, నీ కొరకే మ్రోగుతున్నాయి. నీవు మర్రిచెట్టు సమీపించజాలవు.

"హనుమ వీపుపై కూర్చున్న లక్ష్మణుడితో యుద్ధము చేయి. ఆపై యమలోకంలో యమ భటులూ, యమదూతలూ చెప్పు ఆజ్ఞలు శిరసావహించు" చెప్పాడు విభీషణుడు.

## లక్ష్మణ, ఇంద్రజిత్తుల ఘోర యుద్ధము

కాటుక వంటి నల్లని గుర్రములు కట్టి బహు సుందరంగా అలంకరించిన రథంపై నుంచి ఇంద్రజిత్తు ప్రళయకాల రుద్రునిలా ధనుస్సు అల్లెత్రాడు మ్రోగించాడు.

కరుకు బాణాలను వదిలాడు. అవి మహా విషసర్పాలై లక్ష్మణుడి వైపు దూసుకు వచ్చాయి. ఆ వెనువెంటనే మహా వాయువేగ సమానమైన ములుకుల బాణాల్ని వేశాడు లక్ష్మణుడి మీదకు...

మహాకాంతివంతుడూ, శుభలక్షణములు కలవాడూ అయిన లక్ష్మణుడ్ని తేనెటీగల్లా బాణాలు చుట్టు ముట్టాయి. లక్ష్మణుడు అగ్ని వంటి బాణాల్ని వేశాడు. అవి ఇంద్రజిత్తు బాణాలను చెల్లా చెదరు చేశాయి.





శత్రుసంహారకుడూ, మహాబలశాలీ అయిన ఇంద్రజిత్తు వాడి గల బాణాల్ని వేశాడు. దానికి ప్రతిగా రెక్కలు కట్టినవీ, అంచుల గల బాణాలను వేశాడు లక్ష్మణుడు.

"లక్ష్మణా! కాచుకో... ఈ బాణంతో నీవు ఇక సరి. ఆపై నీ మాంసము డేగలకూ, గెద్దలకూ ఆహారం కాగలదు"

"ఓరీ దుర్మతీ! ఇది యుద్ధ రంగము. మాటలు కాదు. చేతలు కావలెను. అంతర్ధాన రూపుడై దొంగదెబ్బ తీసి లంక చేరుట కాదు యుద్ధమన్న" చెప్పాడు ఇంద్రజిత్తు గర్జనలకి సమాధానంగా...

ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ... దేవేంద్రుడూ, వృత్రాసురులు పోరాడినట్టు పోరాడారు. ఒకరి మీద ఒకరు బాణ వర్షం కురిపించుకున్నారు. పరుషముగా మాట్లాడుకున్నారు. శపథాలు చేసుకున్నారు.

మహా వెలుగు గల సూర్యులిద్దరూ పోరాడుకున్నట్టు సృష్టిలోని మహా అగ్ని పర్వతాలు 'ఢీ' కొన్నట్టు వారి బాణాలు గగన మార్గాన 'ఢీ' కొని మహా విస్ఫోటనం సృష్టిస్తూ నేలరాలుతున్నాయి.

దిక్కులు వెలిగిపోతున్నాయి. పది దిశలూ మారు మోగిపోతున్నాయి. పురుషుల్లో అధముడు ఇంద్రజిత్తు. మానవ శ్రేష్టుడు లక్ష్మణుడు. ఇద్దరూ సకల శాస్త్రకోవిదులే. ఎంతటి యుద్ధములో నైనా ఎదిరింప సాధ్యపడని శూరులు. మహా సింహాలవలే పోరాడుతున్నారు.

లక్ష్మణుడు ఇంద్రజిత్తుపై వజ్రాయుధం వంటి బాణాన్ని వేశాడు. ఆ బాణం ఇంద్రజిత్తు ఇంద్రియాలను స్థంభింప చేసింది. ముహూర్తకాలంలో తేరుకొని ఎర్రని రోషనేత్రాలతో వాడి అంచులు గల పది బాణాలను వేశాడు.

ఆ మరుక్షణంలోనే మరో నూరు బాణాలు విభీషణుడి మీద వేశాడు. లక్ష్మణుడు అగ్నిలా భగ్గుమన్నాడు. మహాస్త్రాన్ని తీసి వదిలాడు.

ఆ మహా నారాచబాణము అడ్డు వచ్చిన ఇంద్రజిత్తు బాణాలను దగ్ధం చేస్తూ వెళ్ళి తగిలింది.

దేవాసుర యుద్ధంలో శంబరాసురుడ్ని తగిలిన వజ్రాయుధంలా ఇంద్రజిత్తు కవచాన్ని వక్కలు చేసింది.

అయిదు తలల విష సర్పంలా బుసలు కొట్టాడు ఇంద్రజిత్తు. ఉదయపు సూర్యుడివలే మారాడు.

మహోన్నతమైన వాడి గల వెయ్యి బాణాలను లక్ష్మణుడిపై వేశాడు. మహా పిడుగుల్లా లక్ష్మణుడి వైపు దూసుకు వచ్చాయి.

బంగారు పింజల గల వెయ్యి బాణాలతో వాటిని లక్ష్మణుడు ఎదుర్కొన్నాడు.

లక్ష్మణుడూ, ఇంద్రజిత్తులూ ఒకరిపై ఒకరు వేసుకున్న బాణాలు మహా పర్వతాల్లా రెండు కుప్పలుగా రాసులు పోసినట్టుగా పడి ఉన్నాయి.

యుద్ధం చేస్తూనే ఉన్నారు. సూర్యుడు కూడా ఎప్పుడో వెళ్ళిపోయాడు. చంద్రుడు దర్శనమిచ్చాడు.

అలుపు సొలుపు లేకుండా బాణాలు వేసుకుంటూనే ఉన్నారు. ఆ మహా యుద్ధాన్ని ఉత్కంఠతగా ఆకాశాన్నించి దేవతలూ, సిద్ధులూ, యక్షులూ వీక్షిస్తున్నారు.

అస్త్రవేత్తలలో శ్రేష్ఠులైన ఇద్దరూ రక్తగాయాలతో అగ్ని పర్వతాల్లా బాణల వెలుగులో కనిపించారు.

బుద్ధివంతుడూ, ధర్మగుణం కలవాడూ అయిన విభీషణుడు లక్ష్మణుడి చెంత చేరాడు.

☆☆☆ ☆☆☆ ☆☆☆

మహా ఏనుగుల్లా పోరాడుతున్న ఎవరినీ విజయం వరించుట లేదు. ఒకరి కంటే మరొకరు వాడి గల బాణాలను వేసుకుంటున్నారు.

యుద్ధ విశారదుడు..... ఏనుగుల మధ్య నున్న మహా ఏనుగువలే ఉన్న విభీషణుడు వానరులతో చెప్పాడు.

“వానరులారా! ఈ మహా పోరాటంలో మిగిలింది ఇంద్రజిత్తు ఒక్కడే. ఈ దుర్మార్గుడిను చంపితే రాక్షస హోమం చాలా వరకూ పూర్తి అయినట్టే. రణరంగమున ఈ రాక్షసుణ్ని చంపితే లంకేశ్వరుడు ఒక్కడే మిగులుతాడు.

“వానరులారా! ఇంద్రజిత్తు చుట్టూ ఉన్న రాక్షస సైన్యంపై విరుచుకు పడండి. ప్రహస్తుడూ, నికుంభుడూ, కుంభకర్ణుడూ, ధూమ్రాక్షుడూ, జంబుమాలీ, మహామాలీ, సుప్తఘ్నుడూ, యజ్ఞకోపుడూ, వజ్రదంష్ట్రుడూ, శత్రుసంహారకుడైన వికటుడూ, తపనుడూ, మందుడూ, ప్రఘాస, ప్రజంఘుడూ, జంఘుడూ వంటి ఎంతో మంది వీరులను సంహరించాం. దుష్ట బుద్ధి గల రాక్షస రాజును చేరిన రాక్షసులందరినీ సంహరించి ఉంటిమి.





“ఇక వీడొక్కడే బ్రతికి ఉండుట తగదు. నా పుత్రుడు ఇంద్రజిత్తుపై ఆయుధాన్ని వదులుటకు చేతులు రావుట లేదు. అట్లు చేయుట ధర్మంకాదు. వెళ్ళండి. మహా ఏనుగులు చెరకు తోట మీద పడ్డట్టు పడండి. రాక్షసులను సమూలంగా నాశనం చేయండి.

“వీరాధి వీరులైన రాముని సోదరుడు లక్ష్మణుడు, ఇంద్రజిత్తును తప్పక సంహరించగలడు” చెప్పాడు విభీషణుడు.

వానరులు మేఘాలను చూసిన నెమళ్ళ వలే ఎగిరారు. కోరలనూ, గోళ్ళనూ చూసుకున్నారు. చెట్లతోనూ, రాళ్ళతోనూ, పర్వత శిఖరాలతోనూ వానరులూ, భల్లూకాలూ రాక్షసుల మీద పడ్డారు.

ఇంద్రజిత్తు నాలుగు గుర్రాలు పూనిన తన బంగారు రథాన్ని లక్ష్మణుడి వైపు మరల్చాడు.

లక్ష్మణుడు నాలుగు బాణాలు వేశాడు. మహాప్రళయంతో సముద్రుడు ఎగిరిపడి ఒడ్డును కొసేసినట్టు ఆ బాణాలు వెళ్ళి సారథిని ఛిద్రం చేశాయి.

ఇంద్రజిత్తు ఆ వెనువెంటనే రథ సారథి నుంచి పగ్గాలు అందుకున్నాడు. తానే రథాన్ని నడిపాడు. లక్ష్మణుడి చెంత కొచ్చాడు.

అదే సమయాన మహా బలశాలులైన వానరులు నలుగురు ఇంద్రజిత్తు రథానికి పూనిన నాలుగు గుర్రాల మీద పడ్డారు. గోళ్ళతో పీకారు. రక్తం కక్కుకొని చనిపోయాయి.

ఇంద్రజిత్తు నిర్ఘాంతపోయాడు. దేవేంద్రుడినే జయించిన ఇంద్రజిత్తు బాణాలను సంధిస్తూ నిశితంగా చూశాడు లక్ష్మణుడను.

ఇంద్రజిత్తుపై లక్ష్మణుడు విష సర్పాలవంటి అయిదు బాణాలు వేశాడు. ఇంద్రజిత్తు చేతిలోని ధనుస్సు విరిగిపోయింది. అయినా భీతి చెందక శూలాల్నీ, పట్టిసాలనీ ప్రయోగించాడు.

లక్ష్మణుడు వారుణాస్త్రమును ప్రయోగించాడు. ఇంద్రజిత్తు రౌద్రాస్త్రమును ప్రతిగా వేశాడు.

సమస్త భూతకోటి ఆకాశాన్నించి చూస్తోంది. లక్ష్మణుడు ఇంద్రాస్త్రాన్ని తీశాడు. దేవతలూ, గంధర్వులూ, మహా ఋషులూ ఆశీర్వదించారు.

బంగారంతో చేసిన మహాస్త్రం.... రెక్కలు గలది... దేవ సమూహాలు పూజించినది... దానవుల మీద ప్రయోగించినది... ఎదురన్నది లేనిది... తాకితేనే

మరణాన్ని ప్రసాదించేది... సర్ప విషముతో సమానమైనది... అయిన ఇంద్రాస్త్రాన్ని వేశాడు.

మంత్రించాడు. శ్రేష్ఠమైన ధనుస్సుకు శ్రేష్ఠమైన ఇంద్రాస్త్రమును సంధించాడు.

"ఓ మహా శక్తి గల బాణమా! శ్రీరాముడు ధర్మాత్ముడు. సత్యసంధుడు. పృథ్విలోనే పరాక్రమవంతుడు. నేను అన్నది సత్యమే అయితే... ఇంద్రజిత్తును వధించు" సుమిత్రా పుత్రుడు లక్ష్మణుడు అని మంత్రించి వదిలాడు.

దిక్కులు దద్దరిల్లాయి. ఆకాశం పగిలింది. మహా అగ్ని గోళం వెళుతున్నట్టు ఎర్రని వెలుగు ప్రసరించింది. సూటిగా వెళ్ళి ఇంద్రజిత్తును తాకింది. శిర కవచాన్ని ఛేదించి చక్కటి సుందర కుండములూ, చక్కని రూపమూ గల ఇంద్రజిత్తు శరీరాన్నించి తలని వేరు చేసింది.

ఆకాశాన్నించి దేవతలూ, గంధర్వులూ, ఋషులూ హర్షధ్వనులు చేశారు. అప్సరసలు నాట్యం చేశారు. గంధర్వులు గీతాలాలపించారు. విభీషణుడి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆరిపోయిన అగ్నిహోత్రంలా, కాంతి పోయిన సూర్యుడిలా పడి ఉన్నాడు ఇంద్రజిత్తు.

దేవతలను పీడించిన వాడూ, లోకశత్రువూ, మహర్షులను నానా బాధలు పెట్టినవాడూ, అనేక అకార్యాలు చేసినవాడూ అయిన ఇంద్రజిత్తు మరణించగానే రాక్షసులు చెల్లా చెదురయ్యారు. ప్రాణాలు ఒగ్గ పెట్టుకొని లంకకు పరుగు తీశారు. ఒక్క రాక్షసుడు కూడా లేకుండా పారిపోయారు.

రణ రంగమంతా గాయాలతోనూ, రక్తంతోనూ తడిసిన వానరులు. మరణించిన రాక్షస, వానర విగత శరీరాలే.

లక్ష్మణుడు శ్రీరాముడి వద్దకు వచ్చి నమస్కరించాడు. మంగళకరమైన కార్యాన్ని చేసినందుకు శ్రీరాముడు తమ్ముడ్ని దగ్గరికి తీసుకున్నాడు. మహా గాయాలతో ఒళ్ళంతా రక్తంతో ఉన్న లక్ష్మణుడనూ, మిగతా వానరులనూ చూసిన శ్రీరాముడు వైద్య విశారదుడైన సుషేణుడ్ని పిలిచాడు.

శ్రీరాముడి ఆజ్ఞతో సుషేణుడు లక్ష్మణునకూ, వానర, భల్లూకములకూ నాసిక ద్వారా ఉత్తమోత్తమమైన ఔషధాల్నిచ్చాడు.

అందరికీ గాయాలూ మానిపోయి, అలసట తగ్గింది. క్షణ కాలంలోనే పూర్వములా ఉత్సాహంగా మారారు.





# పుత్రశోకము

లంకేశ్వరుని మంత్రులు హుటాహుటిన రావణాసురునికి ఇంద్రజిత్తు మరణం గూర్చి తెలియచేశారు.

"లంకేశా! అనర్థం జరిగింది. విభీషణుడి సహాయంతో ఓటమి తెలియని ఇంద్రజిత్తును లక్ష్మణుడు కైలాసానికి పంపాడు. వానరసేనను కల్లోలం చేసిన ఇంద్రజిత్తు లేడు."

రావణాసురుడు నిల్చున్నవాడు సింహాసనంపై కూలిపోయాడు. పుత్రశోకం గుండెలను చీల్చుకొని బైటికొచ్చింది.

దేవేంద్రుడిని జయించిన వాడివి... ముల్లోకాలనూ ముప్పతిప్పలు పెట్టిన వాడవు... నేను పోతే నాకు కర్మ చెయ్యాల్సినవాడవు...

హయ్యో! కనుబొర్ర చేస్తే కాలాంతకుడే మరణిస్తాడే... ఎలా వీర మరణం పొందావు... వానరులంతా క్షేమంగానే ఉన్నారే...

ఈ లంకనూ, ఈ సమస్త సంపదనూ ఏం చేసుకోను. ఎవరికివ్వను. నీ మరణాన్ని తీసుకున్న యముడు కూడా నీ అంత బలవంతుడు కాడే. చూడగా అతడే బలవంతుడనిపిస్తోంది. మహా పర్వత గుహల్లో రోదిస్తున్న ఏనుగులవలే విలపిస్తున్న అంతఃపురంలో రాక్షస స్త్రీల ఏడ్పులకు నేను ఏం బదులు చెప్పగలను.

లంకేశ్వరునకు శోకం స్థానంలో కోపం అవహించింది. వృత్రాసురుని వలే రావణుడి ముఖం నుంచి మంటలతో కూడిన పొగలొచ్చాయి. ఎర్రని రక్తపు ముద్దలు వంటి కనులు మరింత ఎర్రగా మారాయి.

మహా రుద్రుని శరీరంలా వణికింది. కాగడాల మంటల నుంచి తైల బిందువులు రాలినట్టు అగ్ని ముద్దల్లాంటి స్వేద బిందువులు నేలరాలాయి.

"రాక్షసులారా! దేవాసుర యుద్ధంలో బ్రహ్మదేవుడిచ్చిన ఆ భయంకర ధనుస్సును మంగళ వాద్యములతో సిద్ధం చేయండి. బ్రహ్మ దేవుడిచ్చిన కవచముతో, మంగళకరమైన ధనుస్సుతో, అపార శక్తులు గల అస్త్రాలతో యుద్ధరంగానికి కదులుతాను. రామలక్ష్మణులను హతం చేస్తాను" గర్జించాడు రావణుడు.

ఆ వెనువెంటనే సీత గుర్తుకు వచ్చింది. నాభిలో అగ్నిపర్వతం పగిలినట్టు మారాడు.

"మహా దుష్ట క్షత్రియుడైన శ్రీరాముడి ప్రియభార్యను నిజంగానే చంపి వేస్తాను" అని ఖడ్గము తీశాడు. మహా వేగంతో బైలు దేరాడు.

ప్రళయకాల రుద్రుడిలా వెళుతున్న రావణుడ్ని చూసి రాక్షసులు సింహనాదం చేశారు. చంద్రుడు లేని సమయం చూసి అంగారక గ్రహము రోహిణి మీదకు వెళ్ళినట్టు వెళ్ళాడు.

అంతటి విషమ స్థితి చూసిన అమాత్యుడూ, మంచి నడవడిక కలవాడూ అయిన సుపార్శ్వుడు రావణుడితో చెప్పాడు.

"ప్రభూ! లంకేశా! రావణా! మహా సంపన్నుడైన కుబేరుని తమ్ముడవు. ధర్మాన్ని వదలి ఆవేశంగా, ఆనాలోచితంగా ఈ చర్య చేయుట తగదు. వేద విద్యా విశారదుడవు. సమస్త రాక్షస లోకాలకే రాజువు. స్త్రీ వధ సబబు కాదు.

"రాజా! నీవు శూరుడవు. రథికుడవు. మహా ధనుస్సుతోను, ఖడ్గధారి అయ్యి శ్రేష్ఠాతిశ్రేష్ఠమైన రథాన్ని అధిరోహించి దశరథ పుత్రులను సంహరించి సీతను పొందుము.

"అప్పుడే నీకూ, మాకూ, లంకకూ రాక్షస లోకానికీ గౌరవం" చెప్పాడు హితవచనాలను సుపార్శ్వుడు. రావణుడు సావధానంగా ఆలోచించి సీత మనోహర రూపం గుర్తొచ్చి వెనక్కి మరిలాడు.

## రాక్షస సేన

మహా దుఃఖితుడై దీనంగా, సింహాసనముపై కూర్చున్నాడు రావణుడు.

"రాక్షసులారా! అశ్వ, గజ రథాలతో తరలి వెళ్ళండి. చతురంగబలాలన్నీ ఒక్కసారిగా శ్రీరాముడ్ని చుట్టు ముట్టాలి. అంతిమ దశ కొచ్చిన ఈ యుద్ధంలో రాక్షసులే విజయం సాధించాలి."

లంకేశ్వరుడి ఆజ్ఞతో మహా రాక్షస సేన కదిలింది. పరిఘలతోనూ, ఖడ్గములతోనూ, పట్టిసములతోనూ వానరుల మీద పడ్డారు.

వానరులు మహా వాడియైన కోరలతో, దంతాలతో, గోళ్ళతో రాక్షసులను గిరిగిరి చంపుతున్నారు. వృక్షాలూ, శిలలూ శిఖరాలే వానరుల ఆయుధాలు.

మహా రాక్షస సైన్యము వానరుల మీద పడి తోకలూ, గొంతులూ కోసి చంపుతున్నారు.

శ్రీరాముడు ధనుస్సుకి బాణాన్ని సంధించాడు. త్రిలోచనుడికి మాత్రమే తెలిసిన మహా బాణాన్నీ, గాంధర్వాస్త్రాన్ని వదిలాడు.





మహా పెను గాలి వీచింది. వృక్షాలే వేళ్ళతో సహా పెకిలించుకొని వచ్చేంత గాలి... సకల శోక శరణ్యుడు, మహా తేజోవంతుడు శ్రీరాముడు రాక్షసులకి కనిపించలేదు.

కానీ ఆ మహాప్రళయానికి రాక్షసులు తత్తర పడిపోయి, బిత్తరపోయి చేష్టలుడిగి పోయారు.

తమ ముందున్నది శ్రీరాముడే అని తలచి తమలో తామే కొట్టుకో సాగారు. రణ రంగమంతా రామ మయం. శ్రీరాముని ధనుస్సు అలాత చక్రమే దాని అగ్రభాగమే కాన వచ్చింది.

శ్రీరాముడు ఒక జాము కాలంలో పదివేల రథాలనూ, పద్దెనిమిది వేల ఏనుగులనూ, పధ్నాలుగు వేల గుర్రాలనూ, రెండు లక్షల మంది రాక్షసులనూ అగ్ని శిఖల వంటి తన బాణాలకి ఆహుతి చేశాడు.

మహేంద్రుడి కన్నా పరాక్రమవంతుడూ, మహాత్ముడూ, అస్త్రశస్త్రా లెన్ని వేసినా అలసట తెలియనివాడూ అయిన శ్రీరాముడ్ని సర్వ దేవతా లోకమూ, ఋషి లోకమూ స్తుతించి స్తోత్రాలతో గానం చేశారు.

## రాక్షస స్త్రీల మహా రోదనం

శ్రీరాముడు చంతురంగ బలాలను నాశనం చేశాడని తెలియగానే లంకలోని రాక్షస స్త్రీలు రోదనలు చేశారు.

బిడ్డపోయి, తమ్ముడు పోయి, భర్తపోయి, బంధువులూ, హితులూ, స్నేహితులూ పోయి ఘొల్లుమన్నారు.

హయ్యో! ఆ గూనిది కైకేయి కేల నూరి పోయాలి. ఆ తండ్రి దశరథుడు మరెందుకు వరాలివ్వాలి. శ్రీరాముడు వనవాసమెందుకు రావాలి. పతి అడుగు జాడలే సతికి ఆదర్శమని సీతాదేవి శ్రీరాముడ్ని ఎందుకు అనుసరించాలి.

చుప్పనాతి శూర్పణఖకి రామలక్ష్మణులు ఎందుకు కనపడాలి. రావణుడు సీతనెందుకు తేవాలి.

అంతా అన్నీ తమ కోసమే... వెయ్యి కళ్ళ దేవేంద్రుడి కొడుకు వాలిని శ్రీరాముడు ఒక్క బాణంతో పడగొట్టాడే. అప్పుడైనా రావణుడు సీతనిచ్చి ఉంటే తమకి ఈ గర్భశోకమూ, భర్త శోకమూ తప్పేది కదా!

పది తలల రావణాసురుడు మహా బుద్ధిశాలి. విద్యాపారంగుతుడే. ఈ చిన్న సూక్ష్మం తెలుసుకోలేక లంకకే చేటు తెచ్చాడే.

రాముడు మానవుడు కాదు. లక్షల, లక్షల రథాలనూ, రాక్షసులనూ, వీరాధి వీరులైన రాక్షస సేనా నాయకులనూ సంహరించిన శ్రీరాముడు మానవ మాత్రుడు కాదు.

దేవుడో.. యముడో... శివుడో.. విష్ణువో... బ్రహ్మో అయి ఉంటాడు. రాక్షస స్త్రీలు మొత్తుకున్నారు. జుట్టు విరబోసుకున్నారు. శోకాలు పెట్టి శాపనార్థాలు పెడుతున్నారు. ఒక్కొక్కరు ఒక్కొక్కరిని కౌగిలించుకొని ఓదార్చుకుంటూ రోదిస్తున్నారు.

రాక్షస పురుషుల్లో విభీషణుడు మాత్రమే మిగిలేలా ఉన్నాడు. చివరిలో విభీషణుడు చెప్పిన ధర్మార్థ సహిత వాక్యాలైనా రావణుడు విని ఉంటే ఈ లంక దుఃఖంతో స్మశానములా మారి ఉండేది కాదు గదా!

బ్రహ్మదేవుడిచే సర్వభూతకోటిలో మానవుడి చేతిలో తప్ప మరెవ్వరి చేత మరణం లేకుండా రావణుడు వరం పొంది ఉన్నాడు. అట్టి రావణుడు మానవుడితో వైరం పెట్టుకొనవచ్చునా?

వినయ విషయ పరిజ్ఞానం కామం వల్ల లోపించి లంకకు రావణుడు శోకమునూ, ఘోర వినాశనమునూ ప్రాప్తించేలా చేశాడు. రాక్షస స్త్రీలు బాహువులతో ఒకరు నొకరు కౌగిలించుకుంటూ శోక, భయాలతో నట్టింట కూర్చొని రోదిస్తున్నారు.

## దశగ్రీవుని యుద్ధము

రాక్షసాంగనల ఏడుపులూ, పెడ బొబ్బలూ రావణుడు విన్నాడు. ప్రతి గృహములోని శోకమంతా కలిసి లంకేశ్వరుడిలో మహోగ్ర కోపంగా మారింది.

రావణుడు మహా తుఫానుకు ఊగే నౌకలా ఊగిపోయాడు. కనులెర్ర చేశాడు. సమస్త వానర సైన్యాన్నీ కనులతోనే కాల్చేసేలా కనులు పెద్దవి చేశాడు. దంతాలను కొరికాడు. భాస్కరుడిని ఉదయించమని ఆజ్ఞాపించాడు. పిడుగుల వలే మాటలు పలికాడు.

మహోదరుడ్నీ, మహాపార్శ్వుడ్నీ, విరూపాక్షుడ్నీ రణ రంగానికి సిద్ధంకమ్మని ఆజ్ఞ జారీ చేశాడు. రాక్షస సేనా నాయకులూ, రాక్షసులూ యుద్ధరంగానికి సిద్ధమయ్యారు. యుద్ధ నియమాల ప్రకారం పూజ చేశారు.

"సేనా నాయకులైనా మహోదరా, మహాపార్శ్వా, విరూపాక్షులారా, మహా యుద్ధమున నా సోదరులైన మహోదర, మహాపార్శ్వ, కుంభకర్ణాదులనూ,





హితులనూ, సన్నిహితులనూ, బంధువులనూ కోల్పొయ్యాను. అంతకు అంత చెయ్యవలెను. రాముని సేనలో ప్రతివారూ ఆహుతి కావలెను. సర్వ ఆయుధా లతో దశగ్రీవుడ్ని అయిన నేనే సమరానికి కదులుతున్నాను.

"ప్రళయకాల సూర్యుని కిరణాల్లా నేను సంధించి వేసే బాణాల ధాటితో వానర సైన్యమూ, రామలక్ష్మణ, సుగ్రీవాది అంగద హనుమంతులు కకావికులై ఈ లంకేశ్వరుడ్ని ప్రాణాలకై వేడుకొనేలా చేస్తాను.

"మహా ఆకాశము కానీ, సాగరము కానీ, దిక్కులూ, దిశలూ గానీ కాన రాకుండా చేసి రెక్కల గల మహా బాణాలతో శత్రుసంహారం చేస్తాను. అన్నింటికీ కలిపి పగ తీర్చుకుంటాను" చెప్పాడు రావణుడు.

రాక్షసేంద్రుడి ఆజ్ఞతో సేనా నాయకులు రథం సిద్ధం చేశారు. శూలాలూ, ముసలాయుధాలూ, గదలూ, చక్రాయుధాలూ, గండ్ర గొడ్డళ్ళూ, శతఘ్నులూ, భిండివాలాలూ లాంటి అనేక ఆయుధాలు ధరించి రాక్షసులు సమరోత్సాహంతో అరిచారు.

మహో తేజవంతమైన దివ్యకాంతితో ఎనిమిది గుర్రాలు పూన్చిన రథాన్ని సారథి తీసుకు వచ్చాడు. దశగ్రీవుడు సమస్త ఆయుధ ఆభరణాభూషితుడై రథాన్ని అధిరోహించాడు.

రాక్షసులు జయ జయ ధ్వనులు చేశారు. రామలక్ష్మణులు ఉన్న ఉత్తర ద్వారం వైపు సాగింది ఆ మహా సేన...

దేవతల శత్రువూ, సీతను అపహరించినవాడూ అయిన లంకేశ్వరుడు బైలుదేరిన సమయాన పక్షులు అమంగళంగా కూశాయి. ఎర్రటి చిక్కటి నెత్తుటి వాన కురిసింది. లంకేశ్వరుడి ఎడమ కన్నూ, ఎడమ భుజమూ అదిరింది.

గగన తలం నుంచి అగ్ని ముద్ద ఒకటి నేలరాలింది. కాకులూ, గెద్దలూ ఎదురొచ్చాయి.

ఆ దుర్నిమిత్తాలకూ, అపశకునములకూ రావణుడు కించిత్తు కూడా జంక లేదు. ప్రళయకాల యముడిలా మెరిసిపోతూ కదిలాడు.

రావణుడి రథ ఘోషను వానరులు విన్నారు. ఒక్కసారిగా ఊరిని ముంచిన ఉప్పెనలా రాక్షసులు వానరులపై పడ్డారు. చేతికొచ్చిన పంటని కోసే రైతులా కనిపించిన వార్ని కనిపించినట్టు నరికారు.

లంకేశ్వరుడు తనున్న పరిధిలో వానరులన్న వారు కాన రాకుండా సంహరిస్తున్నాడు. తోకలు తెగాయి. గుండెలు బ్రద్దలైయ్యాయి. కంఠాలు

తెగిపోయాయి. అంత వరకూ జరిగిన యుద్ధంలో చనిపోయిన మహారాక్షస, వానరులు గుట్టలు గుట్టలుగా చనిపోయి పడి ఉన్నారు.

మహా అగ్ని హోత్రుడిలా మారి వానరులను మిడతలవలే కబళించాడు రావణుడు. రావణుడి వీరావేశానికీ, బాణ ధాటికీ తట్టుకోలేక వానరులు శ్రీరాముడి వద్దకు వెళ్ళారు. మహా భూతం వస్తున్నట్టు వానరులు వెనక్కి పరుగు తియ్యటం చూశాడు సుగ్రీవుడు.

పెను కోపంతో మహా వృక్షాన్ని తీసుకున్నాడు. రాక్షసుల మీద కెళ్ళి చేతికి అందేంత మందిని ఏక కాలంలో బాదేశాడు. మహా వాయువులా తిరుగుతూ శిలా వర్షాన్ని కురిపించి, హింసించి ఎంతో మంది రాక్షసులను కడతేర్చాడు.

## విరూపాక్షుడి మరణము

మహా దేహం గల సుగ్రీవుడు రాక్షస సేనను చికాకు పెడుతుండటం విరూపాక్షుడు చూశాడు. మేఘం పక్షుల మీద వడగళ్ళ వాన కురిపించినట్టు శిలా వర్షము కురిపించి రాక్షస సేనను బలి తీసుకోవటం సహించలేకపోయాడు.

విరూపాక్షుడు ఏనుగును ఎక్కి సుగ్రీవునికి ఎదురెళ్ళాడు. మహా శక్తి గల బాణాలను సంధించి సుగ్రీవుని మీదకు పంపాడు.

వాడియైన బాణాలు తగిలి సుగ్రీవుడు అరిచాడు. ఆ బాధను తట్టుకొని తన చేతిలోని మహా వృక్షాన్ని తిప్పి వేగంగా విరూపాక్షుడి ఏనుగు కుంభ స్థలంపై కొట్టాడు.

భయంకరంగా గర్జించి నేల కూలింది. విరూపాక్షుడు నేలపైకి గెంతి మహాఖడ్గాన్నీ, ఎద్దు చర్మంతో చేసిన డాలూ ధరించి, సుగ్రీవుని చూసి భీకర పొలికేక పెట్టాడు. ఎదురించ సాధ్యం కాని ధనుష్కుడు విరూపాక్షుడు.

సుగ్రీవుడు మహా మేఘమంతటి శిలను తీసుకున్నాడు. విరూపాక్షుడి మీదకు విసిరాడు. విరూపాక్షుడు తప్పుకొని ఖడ్గముతో సుగ్రీవుడ్ని గాయపర్చాడు. విరూపాక్షుని ఖడ్గప్రవాహానికి సుగ్రీవుడి కవచం విరిగింది. సుగ్రీవుడు ముహూర్త కాలం స్థంభించిపోయాడు. దిక్కులు కూడా కానరాలేదు. తేరుకున్నాడు.

మహోగ్రరూపం ధరించాడు. అరచేయి చాచి చరిచాడు. విరూపాక్షుడు తప్పించుకున్నాడు. సుగ్రీవుడు కోపావిష్టుడై దేవేంద్రుడి వజ్రాయుధానికి సాటి వచ్చే తన పిడికిలితో విరూపాక్షుడి వక్షస్థలంపై కొట్టాడు. మగ్గిన పండు





నేలరాలి ఛిద్రమైనట్టు విరూపాక్షుడి వక్షస్థలం వక్కలైంది. నెత్తురు కారుతూ నేలకూలాడు.

కాళ్ళూ, చేతులూ గిలగిలా కొట్టుకొని శ్వాస విడిచాడు. మహా వీరుడైన విరూపాక్షుడ్ని సుగ్రీవుడు సంహరించటంతో వానరసైన్యం రెట్టించిన ఉత్సాహంతో ముందుకు వెళ్ళింది.

## మహోదరుని వధ

ఆ మహా యుద్ధమున వానరులూ, రాక్షసులూ మహా సర్పాల్లా పోరాడుకుంటున్నారు. విరూపాక్షుడ్ని సుగ్రీవుడు వధించటంతో, రాక్షస సేన క్షీణిస్తుండటంతో లంకేశ్వరుడు మహోదరునితో చెప్పాడు.

"మహోదరా! నా జయాశ తీర్చు కార్యం నీదే.. శత్రువులను సంహరించి రాజ భక్తిని చాటుము" ఆజ్ఞాపించాడు రావణుడు.

రావణుని ఆదేశంతో అగ్నిలోకి మిడత వెళ్ళినట్టు వానరసేనలోకి ఉరికాడు మహోదరుడు. బంగారు ములుకుల బాణాలు వేసి వానరులను సంహరించాడు. బాణాలనూ, ఖడ్గాలనూ వర్షపు చినుకుల్లా వానరుల మీదకు వేసి వానరులను నరికి కుప్పలు పెట్టాడు.

మహోదరుని కోసం సుగ్రీవుడు ఓ పెద్ద రాతి శిలను తీసుకొని విసిరాడు. మహోదరుడు తన బాణంతో పిండిలా చేశాడు. ఈ సారి సుగ్రీవుడు ఓ సాల వృక్షాన్ని పెకిలించి వక్షస్థలం దిశగా వేశాడు.

దాన్ని మహోదరుడు నిలవరించి నేలపాలు చేశాడు. సుగ్రీవుడు పరిఘను అందుకున్నాడు.

ఇనుమూ, బంగారమూ కలిపి చేసిన ఆ ఆయుధాన్ని మహోదరుని మీద వేశాడు. మహోదరుడు అటువంటి పరిఘనే వేశాడు. రెండు ఒకదానితో ఒకటి తగిలి కింద పడిపోయాయి.

మహా వృషభముల వలే ఒకరి మీదకు ఒకరు ఉరికారు. మెరుపూ, మేఘాల్లా కలియ పడ్డారు. ముష్టిఘాతాలిచ్చుకున్నారు.

తేజోవంతుడూ, ఎన్ని దెబ్బలు తిన్నా చలించని వాడూ అయిన సుగ్రీవుడు బంగారంతో అలంకరించిన రోకలిని తీసుకున్నాడు. దాన్ని మహోదరుని మీదకు విసిరాడు. మహోదరుడూ ఓ గదను వేశాడు. రెండూ తగిలి పెను శబ్దాన్ని సృష్టించి భగ్గుమన్నాయి.

మహోదరుడు దగ్గరిలో ఉన్న కత్తినీ, డాలునీ అందుకున్నాడు. సుగ్రీవుడూ కత్తినీ, డాలునీ తీసుకున్నాడు. ఇరువురూ ప్రదక్షిణంగా, అప్రదక్షిణంగా తిరుగుతూ ఆయుధాలను ఝుళిపిస్తున్నారు.

మహోదరుడు మెరుపులా గెంతి సుగ్రీవుడ్ని తన ఖడ్గంతో పొడిచాడు. అదే సమయంలో సుగ్రీవుడు డాలు అడ్డు పెట్టాడు. మహోదరుడి ఖడ్గము సుగ్రీవుడి డాలులో దిగి వెనక్కి రాలేదు.

అదే అదునుగా సుగ్రీవుడు మతిహీనుడూ, రావణ సేనా నాయకుడూ, మహావీరుడూ ధగధగ లాడే ఆభరణాలతో కాంతివంతుడైన మహోదరుడ్ని తన ఖడ్గంతో అరిటి మొదలును నరికినట్టు నరికాడు.

రావణ సైన్యం నిర్ఘాంత పోయింది. రాక్షసులు తెల్లపోయారు. ఆ వెనువెంటనే కంటికి కనిపించక పారిపోయారు.

రావణునకు ఆవేశమూ, కోపమూ శ్రీరామునికి సంతోషమూ, ఆనందమూ కలిగించే ఆ చర్యకి ఆకాశాన దేవతలు సంతోషించారు. మహా తేజస్సుతో విజయకళతో మెరిసిపోతున్న సుగ్రీవుడ్ని అభినందించారు.

## మహాపార్శ్వుడి వధ

మహోదరుడ్ని సుగ్రీవుడు నరకటం చూసి మహాపార్శ్వుడు కోపంతో ఊగిపోయాడు. కనులెర్ర చేశాడు. దగ్గరిలో ఉన్న అంగదునిపై తన సేనను ఉసికొల్పాడు. చుట్టు ముట్టి చికాకు చెయ్యమని శాసించాడు.

మహాభూతం ఆవహించినట్టు వానరుల మీదపడి తొడిమల నుంచి కాయలను వేరు చేసినట్టు వానరుల తలలని తెంపాడు.

కొందరివి చేతులు నరికాడు. మరి కొందరివి కాళ్ళు నరికాడు. వానరులు మూకుమ్మడిగా వెళ్ళి అంగదుడ్ని వేడుకున్నారు.

కిష్కింధ యువరాజు అంగదుడు మహాకాంతివంతమైన పరిఘను అందుకున్నాడు. ఎర మీదకు దూకే సింహంలా దూకాడు. మహా గర్జన చేశాడు. పరిఘతో మహాపార్శ్వుడి రథాన్ని విరిచాడు. మహాపార్శ్వుడిని నేలపాలు చేశాడు.

వృద్ధుడూ, వీరుడైన జాంబవంతుడు పెద్ద శిలను తీసుకొని దానితో రథ గుర్రాలను చంపేశాడు.

మహాపార్శ్వుడు ఆగ్రహంతో వాడియైన బాణాలతో జాంబవంతుడ్ని గాయపరిచాడు. మరికొన్ని బాణాలను గవాక్షుడి మీదకూ వేశాడు.





ఆ బాణ శక్తికి జాంబవంతుడూ, గవాక్షుడూ విలవిలలాడిపోయారు. అచేతునులైయ్యారు. అంగదుడు నిప్పులు కక్కాడు. మహా పరిఘను అందుకున్నాడు.

గురి చూసి విసిరాడు. ఆ పరిఘ బలానికి మహాపార్శ్వుని చేతిలోని ధనుస్సు విరిగింది. శిరస్త్రాణము నేల రాలింది. అంగదుడు మహా సముద్రం వలే రెచ్చిపోయాడు. దగ్గరి కెళ్ళి అరచేతితో చరిచాడు.

మహాపార్శ్వుడు పెద్ద గండ్రగొడ్డలిని అందుకున్నాడు. అంగదుడి శిరస్సు పైకి వేశాడు. అంగదుడు తప్పుకొని వజ్రాయుధం వంటి పిడికిలిలో తన సమస్త శక్తిని తెచ్చుకొని మహాపార్శ్వుడిని గుద్దాడు. ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా మరోసారి పిడికిలితో వక్షస్థలం మీద కొట్టాడు.

నేలరాలిన గుడ్డులా వక్షస్థలం బద్దలైంది. నాసిక రంధ్రం నుంచి రక్తం కారింది. అరిటి చెట్టు వలే నేల కొరిగాడు.

మహాపార్శ్వుని మరణం చూసి రావణ సేన భీతిల్లింది.

## రామ రావణుల యుద్ధం

దేవతల రాజు దేవేంద్రుడూ, దేవతలూ, వానరులూ చేసిన విజయ ధ్వనిని విన్న రావణుడు కోపితుడయ్యాడు. మహోదర, మహాపార్శ్వులూ, విరూపాక్షుడూ యుద్ధరంగంలో వీర స్వర్గాన్ని పొందుట చూసి రావణుడిలో క్రోధావేశము రెట్టింపు అయ్యింది.

లంకేశ్వరుడూ, మహాతేజోవంతుడూ, సమస్త భూమండలాన్నీ, లోకాలనీ గడగడ లాడించిన రాక్షస శ్రేష్ఠుడు రావణుడు పది దిక్కులు తన రథ ఘోష చేత ధ్వనింప చేస్తూ శ్రీరాముడికి అభిముఖంగా వెళ్ళాడు.

మహాపర్వతాలూ, అడవులూ, నగరాలూ కలిగిన భూమి అదిరి పడింది. సమస్త జంతుజాలము కలవరపడ్డాయి.

లంకేశ్వరుడు సుగ్రీవ, జాంబవంత, కుముద, నీల, ద్వివిద, మైంద, అంగద, గంధమాదన, హనుమ, సుషేణాదులనే శాఖలు గల మహావృక్షమనే రామ వృక్షమును నరికి వేయాలని తీర్మానించుకున్నాడు.

రావణుడు మహా భయంకర శక్తి గల తామసాస్త్రమును ప్రయోగించాడు. వానరులెందరో దగ్ధం అయ్యారు. బ్రహ్మదేవుడిచ్చిన తామసాస్త్రానికి కాలిన వారు కాలిపోగా మిగిలిన వారు పరుగులు తీశారు.

వారి పరుగుల వేగానికి ధూళి లేచి పొగ మంచులా కట్టింది.

శ్రీరాముడు కదిలాడు. లంకేశ్వరుడు దశగ్రీవుడు ధనుర్బాణాలతో కనిపించాడు.

లంకాధిపతి రావణుడు శ్రీరాముడ్ని చూశాడు.

పద్మపత్రములు వంటి నేత్రములతో, దీర్ఘబాహువులతో, అరవింద దళాక్షుడు జగదేకసుందర రూపంతో, చూసిన కొద్దీ చూడాలనిపించే ముగ్ధత్వముతో, ధర్మానికి ప్రతిరూపముగా, వీరత్వానికి అర్థంగా కాంతిమంతుడైన శ్రీరాముడ్ని చూశాడు.

మహాసూర్యుని వెలుగుతో, అరివీర పరాక్రమశోభతో అనుకున్న దానికోసం సర్వం పోయినా ఏ మాత్రం తగ్గనివాడూ, వెలుగున్నవాడూ అయిన రాక్షసశ్రేష్ఠుడైన రావణుడ్ని శ్రీరాముడూ చూశాడు.

ఇద్దరూ ఒకరి నొకరు చూసుకున్నారు.

శ్రీరాముడు భూమిని బ్రద్ధలు కొట్టుతున్నాడా అన్నట్టు అల్లెత్రాడును మ్రోగించాడు.

లంకేశ్వరుడు మహా పర్వతంలా నిల్చున్న శ్రీరాముడ్ని చూశాడు.

ఎర్రని తన నెత్తుటి నేత్రముల వంటి బాణాలను శ్రీరాముడి మీదకు వేశాడు. శ్రీరాముడు రావణుడు వేసిన విషసర్పాల వంటి బాణాలను తన బాణాలతో ఖండించాడు.

శ్రీరాముడు వేసిన బాణాలను రావణుడు ఖండించాడు. ఒకరి మీద ఒకరు బాణప్రయోగాలు చేసుకున్నారు.

సూర్యాస్తమయము అయింది. కటిక చీకట్లు ఆవరించుకున్నాయి. అయినా వారిద్దరి బాణాల వెలుగుకి యుద్ధరంగమంతా పట్టపగల్లా మారింది.

గెద్దల రెక్కల వంటివి, వందలాది, వేలాది ములుకులు గలవి అయిన బాణాలు ఒకరి మీద ఒకరు వేసుకున్నారు. ఒకరివి మరొకరు, మరొకరివి ఒకరు బాణాల్ని మధ్యలో నిలువరిస్తున్నారు.

ఆ మహా రామరావణ సంగ్రామాన్ని సమస్త దేవలోకాలూ, భూతలోకాలూ, ఋషిలోకాలూ ఉత్కంఠతగా చూస్తున్నాయి.

దేవేంద్రుడూ, వృత్రాసురుల్లా ఇరువురూ అలుపెరగక పోరాడుతున్నారు. ఇద్దరూ సకల శాస్త్రకోవిదులు. యుద్ధ విశారదులు. ఉత్తమోత్తమమైన విలుకాండ్రు. అస్త్ర విద్యల్లో ఎవరికి వారే సాటి.





యమునితోనూ, మృత్యుదేవతతోనూ సమానులు. ఇద్దరి వద్ద ఉన్నవి గొప్ప ధనుస్సులే.

లోకాలని పీడించిన రావణుడు శ్రీరాముడిపై నారాచబాణాలని వేశాడు. నల్లకలువల దళముల వంటి వెలుగు గల ఆ నారాచ బాణములు శ్రీరాముడి శిరస్సును రాసుకుంటూ వెళ్ళాయి.

శ్రీరాముడు రౌద్రాస్త్రమును ప్రయోగించాడు. ఆ అస్త్రము రావణుడి దుర్భేధ్యమైన కవచాన్ని తాకి మాయమైంది.

రావణుడు కోపంతో అసురాస్త్రమును ప్రయోగించాడు. అసురాస్త్రం అనేక బాణాలయ్యింది. అందులో కొన్ని సింహపు ముఖాలుగా, కొన్ని పెద్ద పులి ముఖాలుగా మరి కొన్ని పాముల్లా, రాబందుల్లా, గెద్దల్లా, డేగల్లా, వరాహముల్లా, కుక్కల్లా మారాయి.

ఆ భయంకర అసురాస్త్రం మీద శ్రీరాముడు ఆగ్నేయాస్త్రం వేశాడు.

శ్రీరాముడు వేసిన ఆగ్నేయాస్త్రం అనేక బాణాలుగా మారింది. కొన్ని బాణాలు అగ్ని ముఖాల్లా, సూర్యముఖాల్లా, చంద్రముఖాల్లా, ధూమకేతుముఖాల్లా, అగ్ని ముద్దల్లా, మెరుపుల్లా మారి 'ఢీ' కొన్నాయి.

రెండు అస్త్రాలూ కలిసి భగ్గున మండి మాయమయ్యాయి.

☆☆☆ ☆☆☆ ☆☆☆

అసురాస్త్రము వ్యర్థమగుటచే రావణుడు ప్రళయకాల వాయువు వంటి రౌద్రాస్త్రాన్ని వేశాడు. శ్రీ రాముడు ప్రతిగా గంధర్వ దేవతాంకము అయిన పరమాస్త్రాన్ని వేశాడు.

రెండూ 'ఢీ' కొన్నాయి. విస్ఫోటనం సృష్టించి మాయమయ్యాయి. రావణుడు శ్రీరాముడిపై సౌరాస్త్రాన్ని వదిలాడు. సౌరాస్త్రాన్ని శ్రీరాముడు నిలవరించాడు.

అదే సమయాన లక్ష్మణుడు తన వాడిమైన బాణాలతో సారథి శిరస్సు ఖండించాడు. విభీషణుడు ఎగిరి వెళ్ళి నల్లని మేఘముల వంటి పర్వతము వంటి రథ అశ్వాలను గదతో చంపాడు.

రావణుడు ఆగ్రహించి విభీషణుడిపై మహాశక్తి ప్రతాపము గల ఆయుధాన్ని ప్రయోగించాడు. లక్ష్మణుడు ఆ శక్తి బాణాన్ని విభీషణుడ్ని చేరక మునుపే ధ్వంసం చేశాడు.

లంకేశ్వరుడు కోపావిష్టుడై యముడు కూడా తప్పుకోలేని మహాశక్తిని లక్ష్మణుడి మీద ప్రయోగించాడు. అది గమనించి విభీషణుడు అడ్డు వెళ్ళాడు. రావణుడిపై బాణ వర్షాన్ని కురిపించాడు.

అయినా రావణుడు వదలిన బాణం లక్ష్మణుడికి తగిలింది. వాసుకి నాలుకలవలే ఉన్న ఆ బాణానికి లక్ష్మణుడు నేలపై పడ్డాడు.

శ్రీరాముడు సోదర ప్రేమతో దుఃఖితుడయ్యాడు. లక్ష్మణుడి చుట్టూ సమర్ధ వానరులని ఉంచాడు.

గరుత్మంతుడి కంట పడిన సర్పము ఎటుల జీవించి ఉండదో అట్లే రావణుడు భూమిపై ఉండకూడదని నిర్ణయించుకున్నాడు.

★★★ ★★★ ★★★

లంకేశ్వరుడు రావణుడి శక్తి ఆయుధంతో లక్ష్మణుడు మూర్ఛపోవుట గాంచి శ్రీరాముడు వ్యధ చెందాడు.

బంధుజనుల యందు ప్రేమగలవాడూ, నాకు అత్యంత సన్నిహితుడూ, సుఖాలకంటే కష్టాల్లో ప్రక్కనుండే వాడూ, నియమము కలవాడూ, శూరులలో గొప్పవాడూ అయిన నా లక్ష్మణుడు ఇటుల ఉంటే యుద్ధ మేల చెయ్యగలను. ధనుస్సునూ, బాణాన్నీ పట్టుకొను శక్తి కూడా నాకు ఉండుట లేదు.

శ్రీరాముడి మనో దుఃఖము చూసి సుషేణుడు చెప్పాడు.

“శ్రీరామా! కలత చెందకు లక్ష్మణుడనకు ఏమీ కాదు. కాంతితో ఎంతో ప్రసన్నంగా ఉన్న ముఖం చూడు. అర చేతులు పద్మములవలే ఉన్నాయి” అని హనుమకు కావలిసిన ఔషధుల గూర్చి చెప్పాడు.

వాయుపుత్రుడు హనుమంతుడు సుషేణుడు అడిగిన విశల్యకరుణి, సావర్ణ్యకరణి, సంజీవకరణి, సంధాని వంటి ఔషధులు గల పర్వతాన్ని వేగిరంగా వెళ్ళి తెచ్చాడు.

సుషేణుడు లక్ష్మణుడికి ఆ ఔషధులను పగల కొట్టి వాసన చూపించాడు. లక్ష్మణుడు శల్యములు తొలిగిపోయి లేచాడు. వానరులు జయ జయ ధ్వనులు చేశారు. శ్రీరాముడు లక్ష్మణుడిని ఆర్తిగా దగ్గరికి తీసుకున్నాడు.

“అన్నా! శ్రీరామా! రావణ సంహార ప్రతిజ్ఞ చెయ్యి. ఇక ఎంత మాత్రం ఆలస్యం చేయుట తగదు. సింహం బారిన పడిన ఏనుగువలే రావణుడు ప్రాణములతో పోరాదు.





“అన్నా! సూర్యభగవానుడు తన కర్తవ్యాన్ని నిర్వర్తించి అస్తాద్రిని చేరే లోపు దుర్మార్గుడూ, కాముకుడూ, సర్వరాక్షస నాశనము చేసినవాడూ అయిన రావణుడు మరణించాలి” చెప్పాడు లక్ష్మణుడు.

★★★ ★★★ ★★★

అరివీర పరాక్రవంతుడు శ్రీరాముడు లక్ష్మణుడు పలికిన మాటలు విని ధనుస్సు అందుకున్నాడు.

లంకేశ్వరుడు రాహువు సూర్యుని వద్దకు వెళ్ళినట్టు శ్రీరాముడికి ఎదురుగా వచ్చాడు.

రావణుడు కాంతులూరే రథంపై యుద్ధం చేయటం శ్రీరాముడు నేలపై ఉండి యుద్ధం చేయటం చూశారు దేవతలు. గంధర్వులూ, కిన్నెరలూ నొచ్చుకున్నారు. దేవేంద్రుడు గమనించాడు.

దేవేంద్రుడు మహారథాన్ని శ్రీరాముడి కోసం పంపాడు. దేవహితంకై ఇంద్రుని ఆదేశంతో దేవసారథి మాతలి ఆకు పచ్చని గుర్రాలు కలిగిన రథాన్ని తీసుకొని వెళ్ళాడు.

దేవేంద్రుడు పంపిన ఆ దివ్యరథాన్ని శ్రీరాముడు చూశాడు. రథ చక్రాలను బంగారంతో నిర్మించారు. వందలాది చిరుగంటలతో అలంకరించారు. లేత సూర్యుని వలే బంగారు శిరోభూషణాలతోనూ, తెల్లని చామరములతోనూ ఉన్న ఆ రథ ధ్వజము వెదురు రూపం గల బంగారు దండంపై ఎగురుతోంది.

శోభాయుక్తుడు, మహాబలశాలి అయిన శ్రీరాముడు విజయం కోసం దేవేంద్రుడు పంపిన రథాన్ని అధిరోహించాడు. మాతలి సారథిగా రథాన్ని కదిలించాడు. రావణుడు గాంధర్వాస్త్రమునూ, దైవాస్త్రమునూ శ్రీరాముడిపై ప్రయోగించాడు. శ్రీరాముడు అవే అస్త్రాలతో వక్కలు చేశాడు.

మహాసర్పాలైన బాణాలు శ్రీరాముని మీదకు వచ్చాయి. రావణుడు పంపిన ఆ సర్పబాణాలకు ప్రతిగా బంగారు పొన్నులు గల గరుత్మంతుడి వంటి బాణాలు వేశాడు.

రావణుడు మాతలి మీద, ఆకు పచ్చని అశ్వముల మీద బాణాలు వేశాడు. వాటికి శ్రీరాముడు సమాధానం చెప్పాడు. మహాసముద్రంలో మైనాక పర్వతం లేచినట్టు లేచాడు రావణుడు. పది తలలతో, మహా ధనుస్సు ధరించి ఇరవై చేతులతో మహా విశ్వరూపంతో ఉన్న రావణుడి బాణాలకు శ్రీరాముడు

అంతకు మించిన దివ్యరథంపై మహా సూర్యుడిలా వెలిగిపోతూ కిరణాలవంటి బాణాలను వేస్తున్నాడు.

ఒక దశలో రావణుడి అరివీర పరాక్రమం చూసి దేవతలూ, యక్షులూ, గంధర్వులూ కలతపడ్డారు. మహా దుర్నిమిత్తాలు శ్రీరాముడికి అనుకూలంగా కానరావటంతో భయం చెందారు. సర్వప్రాణి కోటి భయపడింది.

సింహాలతోనూ, మహా పెద్ద పులులతోనూ, సర్పాలతోనూ ఉండే పర్వతాలు కూడా వణికి పోయేలా ధనుష్టంకారం చేశాడు శ్రీరాముడు.

రాముడు విజయం సాధించాలని దేవతలూ, రావణుడే జయించాలని అసురులూ, వేడుకొన్నారు. కోరుకుంటున్నారు. ప్రార్థిస్తున్నారు.

శ్రీరాముడు ఎడతెరపి లేకుండా బాణాలు వేశాడు. శ్రీరాముడి బాణాలు తనని చికాకు పెడుతుంటే కర్తవ్యాన్ని మాని హుంకరించాడు. రావణుడి సారథి రక్షణకై ప్రక్కకి తిప్పాడు రథాన్ని.

కుబేరుడి తమ్ముడూ, మహాశూరుడూ అయిన రావణుడు సారథిని తిట్టి శ్రీరాముడి ముందుకు పొమ్మన్నాడు.

సారథి మన్నించమని చెప్పి, సందర్భానుసారంగా తాను రథాన్ని ప్రక్కకి మళ్ళించినట్టు పలికి రావణుడు చెప్పినట్టు శ్రీరాముడి రథానికి ఎదురుగా తీసుకెళ్ళాడు.

దేవతలతో కలిసి రామరావణ యుద్ధాన్ని చూస్తున్న మహాత్ముడైన అగస్త్యుడు శ్రీరాముడి దగ్గరికి వచ్చాడు.

## ఆదిత్య హృదయం

“శ్రీరామా! శత్రుసంహారం కోసం ‘ఆదిత్య హృదయం’ ను నీకు నేను ఉపదేశిస్తాను. యుద్ధంలో సర్వ శత్రువులనూ తుద ముట్టించే శక్తి నీకు వస్తుంది.

“శ్రీరామచంద్రా! ఆదిత్య హృదయం పరమ పవిత్రం. మంత్ర జపం వల్ల ఖచ్చితంగా విజయం సిద్ధిస్తుంది. రహస్యమైన ఈ ఆదిత్య హృదయం ద్వారా అనేక వ్యథలనూ, వ్యాధులనూ పోగొట్టుకోవచ్చు.

“వాటితో పాటు ఆయుష్షుని వృద్ధి చేస్తుంది. మహా ప్రశస్తమైన కిరణాలతో ఉదయ పర్వతంపై ఉదయించు సూర్యుని ఆరాధించటం ద్వారా సకల శుభాలు నీకు జరుగుతాయి” అని చెప్పి మంగళ ప్రదమైన స్తోత్రాదులలో





అత్యధిక మంగళకరమైన ఆదిత్య హృదయాన్ని శ్రీరాముడికి ఉపదేశించాడు అగస్త్యుడు.

శ్లో॥ *తతో యుద్ధ పరిశ్రాంతం సమరే చింతయా స్థితమ్*
*రావణం చాగ్రతో దృష్ట్వా యుద్ధాయ సముపస్థితమ్* 1

శ్లో॥ *దైవతైశ్చ సమాగమ్య ద్రష్టు మభ్యాగతో రణమ్*
*ఉపాగమ్యాఽ బ్రవీద్రామ మగస్త్యో భగవాన్ ఋషిః* 2

సాక్షాత్తు శ్రీరామచంద్రునితో యుద్ధము చేయుటకు వచ్చినపుడు రావణుని ఆజ్ఞపై రథసారథి శ్రీరామచంద్రుని ఎదుటగా రావణుని రథమును నిలిపియున్నాడు. రామరావణుల యుద్ధము చూచుటకై దివి నుంచి దేవతలతో కూడి వచ్చిన అగస్త్య మహాముని, రామచంద్రుడు రావణుడిని ఏ విధముగా సంహరించాలా అని ఆలోచన చేస్తున్న సమయమున శ్రీరాముడ్ని సమీపించి ఈ విధముగా పలికినాడు.

శ్లో॥ *రామ! రామ! మహాబాహో!శృణుగుహ్యం సనాతనమ్*
*యేన సర్వానరీన్ వత్స! సమరే విజయిష్యసి.* 3

అగస్త్యమహాముని శ్రీరామచంద్రునితో “శ్రీరామచంద్రా! శ్రీరామ చంద్రా! బహుభుజ బలముతో నీవు యుద్ధరంగమున శత్రువులను గెలుపొందగలవో అట్టి సనాతనమైన పరమ రహస్యమును వినుము.

శ్లో॥ *ఆదిత్యహృదయం పుణ్యం సర్వశత్రు వినాశనం,*
*జయాఽవహం జపేన్నిత్య మక్షయ్యం పరమం శివమ్* 4

పవిత్రమైనది, అనంతమైన శత్రుసేనను నశింపచేయగలిగినది, ఎల్లవేళల విజయమును సిద్ధింప చేయునది, నాశనము లేనిది, అత్యంత శ్రేష్ఠమైనది, పరమ మంగళకరమయినది అత్యంత రహస్యమయిన మంత్ర రాజము ఆదిత్య హృదయమును నీవు భక్తి శ్రద్ధలతో జపించుము.

శ్లో॥ *సర్వమంగళ మంగళ్యం సర్వపాప ప్రణాశనం,*
*చింతాశోక ప్రశమన మాయుర్వర్ధన ముత్తమమ్.* 5

మంగళములకే మంగళప్రాయమైనది, సమస్తములయిన పాపములను నశింపచేయునది, సకల వ్యాధి నివారణమయినది, ఆయుష్షు పెంచునది, సర్వములయిన స్తోత్రములలో అత్యంత ఉత్తమమయినది చింతలను, శోకములను పారద్రోలెడిది ఈ ఆదిత్య హృదయం.

శ్లో॥ రశ్మిమంతం సముద్యంతం దేవాసుర నమస్కృతం
పూజయస్వ వివస్వంతం భాస్కరం భువనేశ్వరమ్ 6

పరమపవిత్రమైన, అత్యంత ప్రశస్తమైన బంగారు కిరణములను ప్రసరింపచేయువాడును, నిత్యనూతనమైన పరిణామములతో ఆనంద మయముగా ఉదయించువాడును.

రాక్షసాది దేవతలచే నమస్కరింప బడెడివాడును, అనంతమైన తన దివ్య తేజస్సుతో ఇతరములైన తేజములను అణచి వేయగలవాడును, అత్యంత ధనమును కలిగి నవాడు, అనంత జ్ఞానముతో వ్యవహారములను నెర వేర్చెడివాడును, సకలలోకములకు అధిపతి అయిన పరబ్రహ్మమును భక్తితో నీ యొక్క స్తోత్రముచే ఉపాసింపుము.

శ్లో॥ సర్వదేవాత్మకో హ్యేషతేజస్వీ రశ్మిభావనః,
ఏష దేవాసురగణాన్ లోకాన్ పాతి గభస్తిభిః. 7

సూర్యమండలమున పరబ్రహ్మమయిన వాడూ, సకలదేవతలకు శరీరముగా ఉండెడివాడూ, మిరుమిట్లు గొలిపే తేజస్సు కలిగి శత్రు నాశనము చేసెడివాడూ, అపారజ్ఞానమును కిరణాలచే యోగి పుంగవులను బ్రహ్మ లోకమున చేరవేసెడివాడూ అయిన సూర్యభగవానుడు దేవతలనూ, రాక్షసులనూ, మనుషులనే కాక విశ్వమందలి సకల జనులనూ తన కిరణములచే ఎల్లవేళలా కాపాడుచుండును.

శ్లో॥ ఏష బ్రహ్మాచ విష్ణుశ్చ శివస్స్కందః ప్రజాపతి,
మహేంద్రో ధనదఃకాలోయమస్సోమో హ్యపాంపతిః, 8

చతుర్ముఖ బ్రహ్మదేవుని దేహమునందు అంతర్ముఖంగా ఉన్నవాడు, శివస్వరూపమునందు నిర్వికార స్వరూపుడుగాను, నారాయ ణుడి యందు ఆనందస్వరూపుడు గానూ, మరియు తొమ్మిది మంది ప్రజాపతుల యందునూ, మహేంద్ర మూర్తియందునూ, కుబేరుడుయందునూ, యమధర్మ రాజు, చంద్రుడు, సముద్రుడు,వరుణుడు వంటి వారందరి యందునూ అంతర్గత స్వరూపుడయి ఉన్నాడు.

శ్లో॥ పితరో వసవ స్సాధ్యా హ్యశ్వినౌ మరుతో మనుః
వాయుర్వహ్నిః ప్రజాప్రాణా ఋతుకర్తా ప్రభాకరః 9





శ్లో॥ సర్వయోనిషు కౌన్తేయ! మూర్తయ స్సమ్భవన్తియాః,
తాసాం బ్రహ్మమహద్యోని రహం బీజప్రదః పితా.

శ్రీ సూర్యభగవానుడు అష్టవసువుల యందునూ పితృదేవతలు, సాధు పుంగవులు, అశ్వనీదేవతల యందునూ, పాణి అపాన, సమాన ఉదాన వ్యానములనెడి వాయువు యందునూ, మనువూ, అగ్నీ మొదలగు వారి యందునూ అంతర్యామియై ఉండియున్నాడు. అంతేగాక ప్రకృతియైన వసంతాది ఋతువులకు కారకుడైనవాడు ఈ సూర్యభగవానుడు.

శ్లో॥ ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్,
సువర్ణ సదృశో భానుర్హిరణ్య రేతా దివాకరః 10

జీవాత్మ పరమాత్మలను నిర్దేశించు నటువంటి రెండు మంచి రెక్కలు గలవాడూ, ఔషధ వ్యుత్పత్తి చేత సకల విషయములను అవగాహన కలిగినవాడూ, లోకమును సృజించి సకల జాతులకు ప్రేరణను కలిగించెడివాడూ, జగత్తునకే ఆత్మగా వేదములను చెప్పబడినవాడూ, ఉపాసనచే హృదయ మునందు సాక్షాత్కారము ఇచ్చెడివాడూ, మంచి కిరణములను ప్రసరింప చేయువాడూ, శరీరమంతా బంగారముతో ఉండి బంగారు రేతస్సు గలవాడూ, లోకోపకారమునకై ఆకాసమునందు సంచరించువాడూ, భక్తులలో అజ్ఞాన మనే చీకటిని పారద్రోలు జ్ఞానమనే వెలుతురును ప్రసరింప చేసెడివాడూ సూర్యుని గూర్చి తెలియచేసెదను.

శ్లో॥ హరిదశ్వ స్సహస్రార్చి స్సప్తసప్తి ర్మరీచిమాన్,
తిమిరోన్మథనశ్శంభు స్త్వష్టా మార్తాండ అంశుమాన్ 11

వృషభ గరుడాది మనోహరములైన వాహనములు కలిగినవాడూ, పూజనీయ మంగళకరమైన గుణములు వేలాదిగా కలవాడూ, సప్త అనెడి అశ్వమును గలిగినవాడూ, మిరుమిట్లు గొలిపే కిరణములు ప్రసరింప చేయువాడూ, లోకమునందు చీకట్లను పారద్రోలువాడూ, జ్ఞాన ప్రసాదీ, సుఖమును ప్రసాదించెడి వాడూ, ప్రళయానంతరము బ్రహ్మాండమును తిరిగి జీవింపచేయువాడూ, విశ్వమంతటా వ్యాపించి యున్నవాడూ శ్రీ సూర్యభగవానుడు.

శ్లో॥ హిరణ్యగర్భ శ్శిశిరస్తపనో భాస్కరో రవిః,
అగ్ని గర్భోఽ దితేఃపుత్రః శంఖ శ్శిశిరనాశనః. 12

సమస్త జగత్సృష్టి చేయుటకు తగినంత జీవసమూహమనెడి బంగారములైన అండములను అంతఃకరణమున కలిగినవాడూ, శిశిర, ఋతువు వంటి చల్లని దయ గలవాడూ, అన్యములయిన తాపత్రయము లను నశింప చేసి సుఖము గలిగించువాడూ, భక్తితో ఆశ్రయించెడి భక్తులకు శాంతి కలుగచేయువాడూ, సర్వులచే స్తుతింపబడెడివాడూ, అగ్నిని గర్భమునుంచుకున్న వాడూ, అదితి పుత్రుడు, హృదయ మనెడి ఆకాశములో ఆనందాన్ని కలిగిన వాడూ, మంచును సూర్యరూపముగా కరిగింప చేసెడివాడూ, కాన ఓ రామా ఆ ఆదిత్యుడను స్మరించు.

శ్లో॥ *వ్యోమనాథ స్తమోభేదీ ఋగ్యజు స్సామపారగః*
*ఘనవృష్టి రపాంమిత్రోవింధ్య వీథీ ప్లవంగమః* **13**

ఆకాశమును పుట్టించి ఆకాశమునకు ప్రభువు అయినావు. తన భక్తులలోని అజ్ఞానమనే చీకటిని పారద్రోలినావు. ఋగ్వేద, యజుర్వేద సామవేదములు అనెడి మూడు వేదములచేత ఆకా శమును పొందినవాడవు అనగా ఋగ్వేదముచే ప్రాతఃకాలమును, యజుర్వేదముచే మధ్యాహ్న కాలమును, సామవేదముచే సాయంకాలములో కూడి యున్న వాడవు, జలమునకు మిత్రుడవు, అధికవర్ష కారకుడవు, సుషుమ్నానాడీ మార్గమును కలిగి ఆ మార్గము నందు చేరే భక్తులను బ్రోచెడివాడవు.

శ్లో॥ *ఆతపీ మండలీ మృత్యుః పింగళ స్సర్వ తాపనః,*
*కవిర్విశ్వో మహాతేజా రక్త స్సర్వ భవోద్భవః.* **14**

సూర్యదేవా! నీవు జగన్నిర్మాణ సంకల్పము కలిగినవాడవు. కౌస్తుభము మొదలగు వాటిని ఆభరణములుగా కలిగినవాడవు, మృత్యు శరీరము కలిగినవాడవు, ఉదయకాలమున గోరోజ నపు వన్నెతో మెరిసెడివాడవు, మధ్యాహ్నకాలమున జగత్తును తపింపచేయువాడవు, ఏకకాలమున ఈ జగత్తునంతటినీ నాశనము చేయగలిగిన వాడవు, జ్ఞానివి, విశ్వమంతటి శరీరము కలవాడవు, మిరమిట్లు గొలిపే కాంతిని వెదజల్లెడివాడవు, రక్తవర్ణముతో ప్రకాశించెడివాడవు, సర్వకార్యములకు కారణమైన వాడవు.

శ్లో॥ *నక్షత్ర గ్రహతారాణా మధిపో విశ్వభావనః*
*తేజసామసి తేజస్వీ ద్వాదశాత్మ న్నమోస్తుతే.*
*ఇంద్రోధాతా భగః పూషా మిత్రోథ వరుణోర్యమా,*
*అర్చిర్వివస్వాన్ త్వష్టాచ సవితా విష్ణురేవచ.* **15**





అశ్వనీ, ఆశ్లేష మొదలగు నక్షత్ర మండలములకూ, గ్రహములకూ, తారలకూ నీవు అధిపతివి. స్వర్గము, ఆకసము, దిక్కులు మొదలు భూమి, సముద్రము వంటి వాటితో నిండిన విశ్వమంతటిని నిలుపువాడవు, తేజస్సుకే తేజోవంతుడైన వాడవు, పండ్రెండు మాసములకు పన్నెండు రూపములను కలిగిన అపురూప రూపధారివైన నీకు నమస్సుమాంజలులు.

శ్లో॥ *నమఃపూర్వాయ గిరయే పశ్చిమే గిరయే నమః,*
*జ్యోతిర్గణానాం పతయే దినాధిపతయే నమః.* **16**

తూర్పు పడమటి దిక్కులయందున్న పర్వతములపై ప్రకాశించుతూ అంతర్యామివై ఉన్న నీకు నమస్కారములు. జ్యోతిర్గణములకు నాథుడవు, ముక్తి నిచ్చెడి స్వరూపుడవు నీకు నమస్కారములు. పగటి దినమును జగత్తుకు నిచ్చు నీకు నమస్కారము, సూర్యమండలాధిపతివైన నీకు నమస్సులు.

శ్లో॥ *జయాయ జయభద్రాయ హర్యశ్వాయ నమోనమః,*
*నమోనమ స్సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః.* **17**

అనంతమైన పరాక్రమము కలిగినవాడవు, భక్తులకు సంసార నౌకను విజయ వంతముగా నడిపించెడి శక్తినిచ్చెడివాడవు, ఉపాసించు వారి యొక్క సర్వరోగములనూ, పాపములను హరింపచేసెడి వాడవు, ఆకుపచ్చని అశ్వ ములను వాహనములుగ కలిగినవాడవు, సహస్ర కిరణములతో భాసిల్లెడి సూర్యుని యందు అంత ర్యామియైనవాడవగు నీకు అనంతములైన ప్రణామములు.

శ్లో॥ *నమ ఉగ్రాయ వీరాయ సారంగాయ నమోనమః,*
*నమః పద్మప్రబోధాయ మార్తాండాయ నమోనమః.* **18**

దుష్టులకు నీవు భయంకరాకారుడవు. సమస్త ప్రాణుల పూర్వకర్మల ననుసరించి ప్రస్తుత కర్మలను ప్రేరేపించెడివాడవు, అర్థనిమిషములో రెండువేల యోజనములు ప్రయాణించగలవాడవైన నీకు ప్రణామములు. ప్రళయానంతరమున బ్రహ్మాండమున తిరిగి సృజించుటకై సిద్ధముగా నుండెడి నీకు అనంతకోటి నమస్కారములు.

శ్లో॥ *బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్య వర్చసే,*
*భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయ వపుషే నమః.* **19**

సృష్టి స్థితి లయలకు కర్తలయిన బ్రహ్మవిష్ణు మహేశ్వరులకు అధిపతివి, సకలప్రాణ కోటి కర్మలను ప్రేరేపించెడివాడవు, పరబ్రహ్మ స్వరూపుడవు, సూర్యమండల తేజస్సునకు కారణమయినవాడవు, శత్రుసంహారము కొరకు రౌద్రరూపములు ధరింపగలిగిన వాడవు అయిన నీకు నమస్కారములు.

శ్లో॥ *తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామి తాత్మనే,*
*కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయేనమః.* **20**

అజ్ఞానమనెడి చీకటిని పారద్రోల గలిగిన వాడవు, మంచును కరిగింప చేయగలిగినవాడవు, నీ భక్తుల యొక్క శత్రు సమూహమును నశింప చేయగలిగినవాడవు, అరిషడ్వర్గములను నిగ్రహించు శక్తిని ప్రసాదించెడి నీకు నమస్కారములు. దేశ, కాల, వస్తు కృతములైన మూడు విధములైన విభాగములు లేని అనంత మహిమాన్వితుడవు, కృతఘ్నులను శిక్షించెడి వాడవు, చిదానంద స్వరూపుడవు, చంద్ర, నక్షత్ర, జ్యోతిర్వర్గమునకు ప్రకాశాన్నిచ్చెడి స్వయంప్రకాశకుడవైన నీకు నమస్కారములు.

శ్లో॥ *తప్తచామీ కరాభాయ వహ్నయే విశ్వకర్మణే*
*నమస్తమోఽభినిఘ్నాయ రుచయే లోకసాక్షిణే* **21**

బంగారువర్ణముతో ప్రకాశించెడివాడవు, సమస్తలోకములను దహించెడి అగ్ని స్వరూపుడవు, సర్వలోకములకు ఆధారభూతుడవు, అజ్ఞానమనెడి అంధకారములోనున్న వారికి వెలుగును ప్రసాదించెడివాడవు, సకలములందు ప్రకాశించెడి స్వయం ప్రకాశకుడవు, సకల ప్రాణికోటి చేసెడి వివిధములైన కర్మములకు సాక్షిభూతుడవగు నీకు సాష్టాంగ వందనములు.

శ్లో॥ *నాశయత్యేషవై భూతం తదేవ సృజతి ప్రభుః*
*పాయత్యేష తపత్యేష వర్షత్యేష గభస్తిభి ః,* **22**

సమస్తములకు ప్రభువుగా నియామకుడవగు సూర్యభగవానా ఈ జగత్తును నాశనము చేయునుగలవు తిరిగి ఈ జగమునే సృజించ గలవు. నీ కిరణములతో మేల్కొలిపి తపింప చేసి, వర్షింప చేయు నీకు శత సహస్ర కోటి నమస్కారములు.





శ్లో॥ *ఏష సుప్తేషు జాగర్తి భూతేషు పరినిష్ఠితః,*
*ఏవ చైవాగ్నిహోత్రంచ ఫలం చైవాగ్నిహోత్రిణామ్.* **23**

జగత్తునందలి ప్రాణులు నిద్రించు సమయమునకు ఆ ప్రాణులకు అంతర్యామియై వారిలో నీవు మేల్కొని ప్రకాశిస్తావు. అగ్నిహోత్రమును కార్యమును అంతర్యామిగా ఉండి ఫలితమును భక్తులకు ప్రసాదించే ఓ సూర్యదేవా నీకు నమస్కారములు.

శ్లో॥ *వేదాశ్చ క్రతవశ్చైవ క్రతూనాం ఫలమేవచ,*
*యాని కృత్యాని లోకేషు సర్వ ఏష రవిః ప్రభుః.* **24**

ఓ రఘుకుల తిలకా? వేదసారముల యొక్క ఫలితములను, యజ్ఞ యాగాదుల యొక్క ఫలితములను ఈ సూర్యమండలాధిపతియగు శ్రీ సూర్యభగవానుడే ప్రసాదించుచున్నాడు. లోకమునందు ప్రాణులు చేయు సకల కార్యములకన్నింటికీ శ్రీ సూర్యభగవానుడే ఫలప్రదాతగా ఉండు చున్నాడు.

శ్లో॥ *ఏన మాపత్సు కృచ్ఛ్రేషు కాంతారేషు భయేషుచ,*
*కీర్తయన్ పురుషః కశ్చిన్నావసీదతి రాఘవ!.* **25**

శ్రీరామచంద్రా! ఏ పురుషుడైనను ఆపదలయందు, కష్టముల యందు, భయముగొల్పెడి సందర్భమునందు, కారడవులయందు చిక్కుకుని ఉన్నప్పుడు ఈ ఆదిత్యహృదయ స్తోత్రమును పఠించిన సర్వభయములు, ఆపదలు తొలగించటమే కాక సౌఖ్యమును కలిగించును.

శ్లో॥ *పూజయస్వైన మేకాగ్రో దేవదేవం జగత్పతిమ్,*
*ఏతత్త్రిగుణితం జప్త్వా యుద్ధేషు విజయిష్యసి,* **26**

ఓ శ్రీరామచంద్రా! దేవతలకూ, జగత్తునకూ అధిపతి అయిన శ్రీ సూర్యభగవానుని నీవు నిశ్చల మనస్సుతో పూజించి ఈ ఆదిత్య హృదయమను రహస్య స్తోత్రమును మూడు పర్యాయములు జపించిన యుద్ధమునందు విజేయుడవు కాగలవు.

శ్లో॥ *అస్మిన్ క్షణే మహాబాహో! రావణం త్వం వధిష్యసి,*
*ఏవముక్త్వా తదాఽగస్త్యో జగామచ యథాగతమ్,* **27**

"అజానుబాహుడవయిన శ్రీరామచంద్రా! నేను నీకు ఉపదేశించిన ప్రకారముగా ఆదిత్యహృదయమును పఠించిన ఈ నిమిషమునందే నీవు

రావణాసురుని వధించగలవు" అని అగస్త్యమహర్షి శ్రీరామచంద్రప్రభువుతో పలికి దేవతలతో కూడి తిరుగు ముఖము పట్టెను.

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా మహాతేజా నష్టశోకోఽ భవత్తదా,
ధారయామాస సుప్రీతో రాఘవః ప్రయతాత్మవాన్. 28

అనంతరమే తేజోవంతుడయిన శ్రీరామచంద్రుడు వేరే ఆలోచనను దరిచేరనీయక అగస్త్యమహాముని తెలిపిన ఆదిత్యహృదయమును మనస్సునందు తలచి పవిత్ర హృదయముతో శ్రీసూర్యభగవానునికి పలుమార్లు ధ్యానించ సిద్ధమయ్యెను.

శ్లో॥ ఆదిత్యం ప్రేక్ష్య జప్త్వాతు పరం హర్ష మవాప్తవాన్,
త్రిరాచమ్య శుచిర్భూత్వా ధనురాదాయ వీర్యవాన్. 29

నీలమేఘశ్యాముడు, బాహుభుజబలము కలిగిన శ్రీరామచంద్ర ప్రభువు శుచుడై ఆచమనము చేసి పవిత్రమైన మనస్సుతో బంగారు వర్ణముతో ప్రకాశించుచున్న సూర్యుని తిలకించి మూడు పర్యాయములు అగస్త్యుడు ఉపదేశించిన ఆదిత్యహృదయమును జపించి ఆనందచిత్తుడై ధనస్సును చేతబూని యుద్ధమునకు సిద్ధుడయ్యెను.

శ్లో॥ రావణం ప్రేక్ష్య హృష్టాత్మా, యుద్ధాయ సముపాగమత్,
సర్వయత్నేన మహతా, వధేతస్య ధృతోఽ భవత్. 30

యుద్ధమునందు శ్రీరాముడు రావణాసురుని తిలకించి అతనితో యుద్ధము చేయ తలంచి రావణుని సమీపించి యుద్ధము చేయసాగినాడు.

శ్లో॥ అథ రవి రవదన్ని రీక్ష్య రామం, ముదితమనాః
పరమం ప్రహృష్యమాణః,
నిశిచరపతి సంక్షయం విదిత్వా, సురగణ
మధ్యగతో వచస్త్వరేతి. 31

శ్రీరాముడు పఠించిన స్తోత్రమునకు శ్రీ సూర్యభగవానుడి హృదయము ఆనందమయమైనది. సంతుష్టుడైన సూర్యదేవుడు సురగణ దేవగణ మధ్యమున పులకితదేహముతో వాహనా రూఢుడై ఆకాశము నందుండి శ్రీరాముని గాంచుతూ "రామా! రాక్షసరాజయిన రావణునకు అంత్య కాలము సమీపించినది. ఏ విధములయిన అనుమానములతో ఆలసింపక త్వరపడుము" అని శ్రీరామునికి సహకరిస్తూ స్వామిని ఉత్తేజితుడిని చేసెడి పలుకులను పలికినాడు.





# రావణుడి వధ

దేవేంద్రుడి సారథి మాతలి శ్రీరాముడితో చెప్పాడు.

"ప్రభూ! రావణుడి రథం ప్రదక్షణంగా వేగంగా వస్తోంది. మృత్యుదేవత వద్దకే వస్తున్నట్టు శకునాలు చెపుతున్నాయి" అని రావణుడి రథం వైపు మళ్ళించాడు. శ్రీరాముడి రథ కదలికకు దుమ్మురేగి, రావణుడికి కొద్ది సేపు ఏమీ కనిపించలేదు.

రావణుడు చికాకు పడ్డాడు. ఇష్టం వచ్చినట్టు కోపంగా బాణాలు వేశాడు. మహాపిడుగులవంటి నిప్పుల ముద్దలు వంటి రావణుడి బాణాలకు ధీటుగా శ్రీరాముడు తగు బాణాలను వేస్తున్నాడు.

రావణుడి రథం కదిలినప్పుడల్లా భూమి కంపిస్తోంది. లంకేశ్వరుడు రావణుడు శ్రీరాముడి ధ్వజాన్ని కూల్చటానికి బాణాలు వేశాడు. ఆ బాణాలు ఇంద్ర ధ్వజం చేరకుండానే శ్రీరాముడు నిలవరించాడు.

శ్రీరాముడు మహానిశితాస్త్రంతో రావణుడి ధ్వజాన్ని విరగగొట్టాడు. ఆ మహా యుద్ధానికి ఆకాశమంతా వెలుగుతో నిండింది. పర్వతాలూ, నదులూ, సముద్రం అల్లాడిపోయాయి.

అరణ్యాలూ, అరణ్య జంతువులూ కకావికలమై దిక్కులు చూసుకోకుండా పరుగెత్తాయి. పాతాళ లోకాన నివశించేవారూ, పన్నగులూ భయభ్రాంతులయ్యారు.

ఆకాశాన వేలాది బాణాలు... క్రింద వానరుల్లా, రాక్షసుల్లా 'ఢీ' కొంటున్నాయి.

శ్రీరామచంద్రుడు మహాసర్ప బాణాన్ని సంధించి వదిలాడు.

కుండలములతో చక్కని శోభతో ఉన్న రావణుడి తలని ఖండించింది. ఆ వెనువెంటనే శిరస్సు ఉద్భవించింది. శ్రీరాముడు మళ్ళీ బాణం వేశాడు. శిరస్సు తెగింది. ఆ వెనువెంటనే మళ్ళీ ఉద్భవించింది.

రావణుడు వికటాట్టహాసం చేశాడు.

శ్రీరాముడు వజ్రాయుధం వంటి మహా శక్తి గల బాణాన్ని వేశాడు. శిరస్సును ఖండించింది ఆ బాణం. అయినా మళ్ళీ శిరస్సు మొలిచింది.

కౌసల్యా నందవర్ధనుడు మహాశస్త్రాలున్న శ్రీరాముడు ఎడతెరపి లేకుండా తలలను కూలుస్తూనే ఉన్నాడు. అవి మొలుస్తూనే ఉన్నాయి.

విభీషణుడు శ్రీరాముడి చెంతకొచ్చాడు. నాభిలో అమృత భాండం గుర్చి చెప్పాడు.

దేవేంద్రుడి సారథి మాతలి శ్రీరాముడి వంక చూశాడు. బ్రహ్మాస్త్రమే రావణుడికి సరైనదని చెప్పాడు. శ్రీరాముడు బ్రహ్మాస్త్రం తీశాడు.

ఆకాశంలో బ్రహ్మాండమైన మెరుపు మెరిసింది. భూమి గజగజలాడింది. బ్రహ్మనిర్మితమైనది. వాయువూ, అగ్ని, సూర్యుడూ ఆ అస్త్రంలో నిక్షిప్తమై ఉంటారు. ఆకాశపు రంగుతో పొగలు చిమ్మే ప్రళయాగ్ని.

శ్రీరాముడు బ్రహ్మాస్త్ర మంత్రం పఠించి ధనుస్సుకి సంధించి వదిలాడు. హనుమంతుడు తన తండ్రి వాయుదేవుడిని ప్రార్థించాడు. దేవతలూ, సిద్ధులూ, మహర్షులూ, గంధర్వులూ ఊపిరి బిగపట్టి చూస్తున్నారు.

సర్వసమర్థుడూ, రావణుడి వినాశనం కొరకు వదిలిన ఆ బ్రహ్మాస్త్రం బుసలు కొట్టే పాములా బైలుదేరింది. ఇంద్రునికై నిర్మించినదీ, మూడులోకాలనూ జయించునదీ అయిన ఆ అస్త్రం బ్రహ్మాండమైన వెలుగును ప్రసరిస్తూ దూసుకెళ్ళింది. ఆ మహా వెలుగును చూడలేక రావణుడు తన కనులకు చేతులు అడ్డుపెట్టుకున్నాడు.

మహా యముని రూపం... గరుత్మంతుడి రెక్కలు కట్టినదీ అయిన బ్రహ్మాస్త్రం రావణుడి మీద కెళ్ళి మర్మస్థానాన్ని చీల్చి వేసింది. రావణుడి ప్రాణాలను హరింప చేసింది.

ఆ మహాకార్యం పూర్తి చేసి మళ్ళీ రాముడి అంబుల పొదిలోకి వచ్చి చేరింది.

ముల్లోకాలనూ గడగడ లాడించిన వాడూ, మహాక్రూర కర్మలు చేసిన వాడూ అయిన రావణుడు దేవేంద్రుడు కొట్టిన వృత్రాసురుడిలా నేలపై పడ్డాడు.

రావణుడి మరణం చూసి రాక్షసులు ఆక్రోషాలు చేశారు. దీనులై కన్నీరు కార్చారు. యుద్ధాన్ని ఆపి తమ రాజు వైపు చూశారు.

భయంతో లంకకు పరుగు తీశారు.

శ్రీరాముడు ధనస్సు దించాడు. వానరులు మహోన్నతమైన ధ్వనులు చేశారు. ఆకాశంలోంచి దేవతలు పూలవాన కురిపించారు.

సకల దేవతాగణాలూ, ఋషీ లోకములూ శ్రీరాముడ్ని స్తుతించాయి. దిక్కులు సేద తీరాయి. భూమి స్వాంతన చెందింది.





పంచభూతాలు తమ ధర్మాన్ని యథాప్రకారం సావధానంగా నిర్వర్తించాయి. లక్ష్మణ, సుగ్రీవ, అంగద, హనుమ, జాంబవంతాది వానర వీరుల ఆనందానికి అవధి లేకుండా పోయింది. వానరుల హర్ష ధ్వనులతో సముద్రమే అల్లల్లాడింది. విజయంతో వానరులు నృత్యాలు చేశారు. ఒకరి నొకరు కౌగిలించుకున్నారు.

శ్రీరామునకు జై కొట్టారు.

## విభీషణుడి వ్యథ

నీతి శాస్త్రము తెలిసినవాడూ, మహా వీరుడూ, సకల ధర్మశాస్త్ర కోవిదుడూ, పట్టు పాన్పులు తప్ప తెలియని వాడూ అయిన రావణుడు అట్లు నేల మీద పడి ఉండుట చూసి విభీషణుడు మదన పడ్డాడు. వ్యథ చెందాడు. కన్నీరు కారుస్తూ రావణుడి శరీరం వద్దకి వెళ్ళాడు.

"అన్నా! రావణా! అనుకున్నదంతా అయ్యింది. స్త్రీ వ్యామోహం నిన్ను పతనం చివరి మెట్టుపై పడవేసింది. మహా సుఖాలను అనుభవించినవాడవు... ముల్లోకాలలో ఎదురులేని వాడవు... గ్రహాలనూ, నక్షత్రాలనూ, సూర్య, చంద్రాదులనూ ఆజ్ఞాపించిన వాడవు... మహా వృక్షానివి... మదపుటేనుగువంటి వాడివి...

"రాక్షస లోకానికి సింహానివి... నేడు రాక్షస లోకానికి చీకటి దినం. మహా సూర్యుడే నేలరాలినట్టు ఉంది. ఒక్క స్త్రీ కోసం సోదరులనూ, భృత్యులనూ, హితులనూ, సన్నిహితులనూ అందర్నీ యమలోకానికి పంపి చివరకు నీవూ అక్కడికే వెళ్ళావు.

"అన్నా! రావణా! నా మాట విని ఉంటే లంకలో సకల ఐశ్వర్యాలతో, అనేక మంది భార్యలతో, మిత్ర, హిత, బంధువులతో సుఖంగా ఉండేవాడివే..." అంటూ విభీషణుడు ఏడ్చాడు.

శ్రీరాముడు విభీషణుడి చెంతకొచ్చి ఓదార్చాడు.

"విభీషణా! వ్యథ చెందకు. యుద్ధంలో నీ అన్న వీర మరణం పొందాడు. వీర మరణం పొందిన వార్ని గూర్చి దుఃఖించుట తగదు. రావణుడు మహా పరాక్రమవంతుడు. శూరుడు. శూర ధర్మం నిర్వర్తించాడు.

"కాన విభీషణా! దిగులు మాని మీ అన్నగారికి అంతిమ సంస్కారం చేయి" చెప్పాడు శ్రీరాముడు.

"రామా! నా అన్న రావణుడు అడిగిన వారికి అడిగినంత దానం ఇచ్చాడు. ఎన్ని యుద్ధాలు చేసినా ఓడిపోలేదు.

"సమస్త భోగాలూ అనుభవించాడు. వేదాలని చదివిన వేద పండితుడు. మహా తపఃశ్శాలి. మహాశివుడూ, బ్రహ్మదేవుడూ లాంటి మహా దేవాది దేవుళ్ళ నుంచి వరాలు పొందిన వాడు.

"అట్టి నా అన్న లంకకి రాజు. లంకేశ్వరుడు. కేవలం నీ స్త్రీని అపహరించి నందుకు సర్వమూ కోల్పోయాడు. లంకను అనాధని చేశాడు. అంతఃపుర స్త్రీలకి ఆవేదన మిగిల్చాడు."

"విభీషణా! నీ అన్న రావణుడి సద్గతులకై అంత్యక్రియలు జరిపించు. మరణం వరకే విరోధం.

"మరణించిన తర్వాత ఎంతటి శత్రువైనా అప్పుడి క్రింద లెక్కే. నీ అన్నపై మమకారం నీకెంతో, నాకూ అంతే... కాన జరపాల్సిన తంతు జరుపు" చెప్పాడు శ్రీరాముడు.

## అంతఃపుర స్త్రీలూ, మండోదరి రోదనలు

లంకేశ్వరుడు రావణుడు శ్రీరాముడనే మానవుడి చేతిలో హత మయ్యాడని తెలియగానే లంకలోని రావణ అంతఃపురం ఏడ్పులతో దద్దరిల్లింది.

లంకలోని రాక్షస స్త్రీలు తమ భర్తల కోసం రణ రంగానికి ఉరుకుల పరుగుల మీద వచ్చారు. ఆ రక్త మాంసాల్లో తమ భర్తలకై వెతికారు.

కంఠాలు తెగి, చేతులు తెగి, ప్రేగులు బైటికొచ్చి మరణించిన భర్తలపై పడి ఆకాశం పగిలేలా ఏడ్చారు. పోతు ఏనుగులు పోతే ఏడ్చే ఆడ ఏనుగుల్లా రోదించారు.

అంతఃపురం స్త్రీలు అంతా రావణుడు పడి ఉన్న చోటికి వచ్చారు. రావణుడి స్థితి చూసి ఓ రావణపత్ని మూర్ఛపోయింది. మరొక రావణపత్ని నేల మీద పడి మట్టి ఎత్తి పోస్తూ శాపనార్థాలు పెట్టింది.

మరొక అంతఃపుర స్త్రీ తెగిన పూల మొక్కలా నిశ్చలంగా రావణుడి మృత శరీరాన్నే చూస్తోంది.

దేవేంద్రుడ్ని జయించిన వాడూ, కుబేరుడ్ని తరిమి కొట్టి ఆయన పుష్పక విమానంలో లోకాలన్నింటిలోనూ విహరించినవాడూ అయిన రావణుడ్ని చూసి భోరుమన్నారు. బావురమన్నారు. గగ్గోలు పెట్టారు.





విభీషణ హితమైనా విని ఉంటే ఇంత దాకా వచ్చేదా! సీతాదేవి, ఓ స్త్రీ నీ పాలిట మృత్యుదేవత అయ్యింది. ఐదు తలల సర్పమై కాటు వేసింది.

శ్రీరాముడి నుంచి సీతను మాత్రమే దూరం చేసి తెచ్చావు. ఒక్క శ్రీరాముడే బాధపడ్డాడు. కానీ ఆ పనికి, ఆ కార్యానికి ఇప్పుడు నీవు శాశ్వతంగా దూరమయ్యి వేలాది మంది నీ భార్యలం విలపిస్తున్నాము. ఇక మాకు సుఖాలెక్కడివి. మేం ఏం అయిపోవాలి.

రావణుడి పట్టమహిషి, ప్రియ భార్య మండోదరి విచారవదనంతో అక్కడికి వచ్చింది. మహా వైభవంతోనూ, అహంతోనూ, గర్వంతోనూ, బలంతోనూ శౌర్యంతోనూ మహా వెలుగు వెలిగిన భర్తను చూసింది.

రావణుడిపై పడి వెక్కి వెక్కి ఏడ్చింది.

"ప్రభూ! రావణా! నీకా ఈ దుస్థితి. దేవేంద్రుడూ, దేవతలూ, గంధర్వులూ, యక్షులూ అంతా నీ మాట వింటేనే హడలిపోతారే... అట్టి నిన్ను ఒక్క మానవుడు సంహరించటమా?

"హయ్యో! ప్రభూ! సర్వధర్మ నీతి శాస్త్రాలూ తెలిసినవాడివే... శ్రీరాముడు జనస్థానంలో ఖరుడ్ని, పధ్నాలుగు వేలమంది రాక్షసులనూ సంహరించిన వాడే... రాముడు మానవుడు కాదని తెలుసుకుని ఉంటే ఇంతటి ఉపద్రవం జరిగేది కాదు గదా!

"మహా సేతువు కట్టినప్పుడు గానీ, విభీషణుడు చెప్పినప్పుడు గానీ, కుంభకర్ణుడు మరణించినప్పుడు గానీ, ఆఖరికి నీ పుత్రుడు ఇంద్రజిత్తు తల తెగిననాడు గానీ సీతను శ్రీరామునికి అర్పిస్తే ఈ నీ స్థితి నా కనులకు కానవచ్చేది కాదు గదా!

"మంచి పని చేస్తే చక్కటి ఫలమూ, చెడ్డ పని చేస్తే చెడ్డ ఫలమూ వస్తుందని నీతి శాస్త్రంలో తొలుతే ఉంది కదా! నీతి శాస్త్ర సూక్ష్మాన్ని చెప్పే నీవు ఇంత చిన్న విషయాన్నెలా మరిచావు.

"కామంతో ఉన్న వాడికి జ్ఞానమూ, బుద్ధీ మందగిస్తుందని కూడా ఉందే.. అయినా చావు కొని తెచ్చుకున్నావు. సీతాదేవి పుణ్యవంతురాలు. పతివ్రత. అందులకే కష్టాలు పడ్డా శ్రీరాముడ్ని చేరింది. సుఖిస్తుంది.

"నేనేం పాపం చేశాను. నా కెందుకీ కర్మ. ప్రేమాతిశయంతో ఎన్నో సార్లు వద్దని చెప్పినా విన్నావు కాదు. భార్య ఎప్పుడూ భర్త సుఖం కోసమే,

హితం కోసమే చెబుతుందని ఎందుకు నమ్మి ఆచరించ లేదు. నేలపై పడిన పతివ్రతల కన్నీరు వూరికినే ఇంకిపోవని ఎన్నోసార్లు మొత్తుకున్నాను.

"చక్కటి ముఖం... ఎర్రటి పెదవులు... తామర పూల కుండలాలతో మహా సూర్యుని కాంతితో వెలిగి పోయేవాడివే. ఇలా కాంతి విహీనమై నేలపై... అయ్యో... ఈ ఘోరం నేను చూడలేను.

"నీవు వీర స్వర్గం పొందావు. నాకు మాత్రం దుఃఖాన్ని మిగిల్చావు" మండోదరి వెక్కి వెక్కి ఏడుస్తోంది.

శ్రీరాముడి ఆదేశానుప్రకారం రావణుడికి విభీషణుడు అంతిమ కార్యాలను మొదలు పెట్టాడు.

మాల్యవంతుడితో పట్టు బట్టలు రావణుడికి కట్టించాడు. బంగారు పల్లకిలో పరుండ బెట్టారు.

రాక్షసులంతా కన్నీరు కార్చారు. గంధపు కర్రలతో చితి పేర్చారు. ఋత్వికులు బంగారు పల్లకి నుంచి రావణుడి శరీరాన్ని చితి మీదకు చేర్చారు.

గంధమూ, పూలూ, అనేక పరిమళాలతో, వస్త్రాలతో అలంకరించి చితి మీదకి చేర్చిన రావణుడికి విభీషణుడు మంత్రానుసారంగా చితికి నిప్పు పెట్టాడు. ఆ చితి కాలుతూనే ఉంది.

ఆపై విభీషణుడు గరక పోచలు వేసి తిలోదకాలిచ్చాడు. ఉదక దానం చేశాడు.

అంతఃపుర స్త్రీలను అంతఃపురానికి దగ్గరుండి సగౌరవంగా పంపాడు.

అన్నీ పనులు నిర్వర్తించి శ్రీరాముడి చెంత కొచ్చి నమస్కరించాడు.

## విభీషణుడి పట్టాభిషేకము

మహాభాగ్యవంతులైన దేవతలూ, గంధర్వులూ, దానవులూ రావణ వధ అయ్యాక వారివారి స్వస్థలాలకి వెళ్ళిపోయారు.

శ్రీరాముడు దేవతలనీ, సారథి మాతలినీ సత్కరించాడు. మాతలిని దివ్యరథంతో పంపేసి సుగ్రీవుణ్ని ఆత్మీయంగా కౌగిలించుకున్నాడు.

సుమిత్రా పుత్రుడు లక్ష్మణుడిని పిలిచి చెప్పాడు.

"శుభ లక్షణమైన లక్ష్మణా! విభీషణుడు మన స్నేహితుడు, ఆప్తుడు, భక్తుడు. ఎంతో ఉపకారం చేశాడు. ఈ మహానీయుణ్ణి లంకా నగరానికి రాక్షసులందరి మధ్య పట్టాభిషక్తుడిని చేయవలెను."





అన్న రామన్న ఆదేశంతో లక్ష్మణుడు వానరులకు ఆజ్ఞాపించాడు. ఆగమేఘాల మీద వెళ్ళి సముద్ర జలాలని తెమ్మన్నాడు. బంగారు ఘటముతో విభీషణుడ్ని కనకపు సింహాసనంపై కూర్చుండబెట్టి వేదోక్త ప్రకారం శ్రీరామాజ్ఞానుసారం సమస్త రాక్షసకోటి వానరవీరుల జయ జయ ధ్వనుల మధ్య పట్టాభిషక్తుడిని చేశాడు.

విభీషణుడి పట్టాభిషేకంతో వానరులూ, ఎల్లప్పుడూ విభీషణుడితో ఉండే నలుగురు మంత్రులూ సంతోషించారు.

రాక్షసులు తెచ్చిన పేలాలూ, పుష్పాలూ, సుగంధ ద్రవ్యాలూ లాంటి మంగళకరమైన ద్రవ్యాలూ గ్రహించి, వాటిని భక్తిగా శ్రీరామలక్ష్మణులకు సమర్పించాడు లంకాధిపతి విభీషణుడు.

వాయు పుత్రుడు హనుమంతుడితో చెప్పాడు జగద్విఖ్యాతి శ్రీరాముడు.

"నాయనా! హనుమా! విభీషణ అనుమతితో అశోకవనంలో ఉన్న వైదేహికి విషయమంతా చెప్పవలెను. ఆమె సందేశాన్ని తీసుకు రావలెయును" చెప్పాడు శ్రీరాముడు ఉద్వేగంగా...

## ప్రియాతి ప్రియమైన మాట

శ్రీరాముడి అనుజ్ఞ పొంది హనుమంతుడు అశోకవనం వెళ్ళాడు. దారి పొడవునా రాక్షసులు వినయంతో, విధేయతతో హనుమకి మొక్కారు.

స్నానాది సంస్కారాలు లేకుండా, దీనంగా, దిగులుగా ఉన్న దీనమూర్తి సీతాదేవికి హనుమ నమస్కరించాడు. వినమ్రతగా వొదిగి చెప్పాడు.

"తల్లీ! సీతాదేవీ! రాక్షస సంహారం సంపూర్ణంగా జరిగింది. శ్రీరాముడు తన అసమాన పరాక్రమంతో రావణుడి పది తలలు ఖండించాడు. లోకానికీ, నీకూ రాక్షస పీడ వదిలించాడు.

"తల్లీ! వైదేహీ! శ్రీరాముడు నీ కోసం సేతువు నిర్మించాడు. మహా యుద్ధం చేశాడు.

"యుద్ధంలో ఎంతో సహాయం చేసిన విభీషణుడికి లంకను కట్టబెట్టాడు. ఇప్పుడు లంక నీ గృహం వంటిది" చెప్పాడు హనుమంతుడు.

సీతాదేవి గద్గదమైన స్వరంతో పలికింది.

"హనుమా! సంతోషంతో నాకు మాట రావుట లేదు. ఇంతటి శుభవార్తను చెప్పినందుకు నీకు లోకంలోని బంగారమూ, రత్నాలూ అన్నీ ఇచ్చినా సరితూగవు.

ఇంతటి ప్రియ వాక్కుకు బహుమతిగా ఇచ్చు వస్తువేదీ ఈ భూమిపై ఉన్నట్టు నాకు తోచుటలేదు."

ధర్మ మార్గమందున్న సీతాదేవికి అంజలి ఘటించి హనుమ చెప్పాడు.

"తల్లీ! నీ మాటే నాకు త్రిలోకాధిపత్యమంత... శ్రీరాముడి సేవకి మించిన వరమేమున్నది. నీ ఈ మాటలు చాలును. సమస్త సంపదలకూ సమానం.

"జనకరాజ పుత్రీ! ఈ చుట్టూ రాక్షసాంగనులు నిన్ను ఎంతో వేదనకు గురిచేశారు.

"ఇట్టి వీరు బ్రతికి ఉండుటకు తగదు. తమరు అనుమతిస్తే ఈ రాక్షస స్త్రీలను సంహరిస్తాను. అనేక గుద్దులతో, దెబ్బలతో వికృతమైన అవయవాలు గల రాక్షస స్త్రీలను అనేక రకాలుగా సరళంగా హింసించి చంపుతాను."

జాలీ, దయా అపారంగా ఉన్న యశస్విని సీతాదేవి అంది.

"వాయుపుత్రా! ఈ రాక్షస స్త్రీలు నిమిత్త మాత్రులు. రాజు ఆజ్ఞ చేయు సేవకులు. రాజాజ్ఞను పాటించారు. వారి ధర్మం వారు చేశారు.

"మహాబాహూ! పూర్వము ఓ వేటగాడ్ని పెద్ద పులి తరుముతోంది. పులి భయంతో వేటగాడు ఓ చెట్టు ఎక్కాడు. ఆ చెట్టు మీద ఎలుగుబంటు కూడా ఉంది.

"క్రిందున్న పులి ఎలుగుబంటితో వీడు అడవికి శత్రువు మన జంతు జాలాల్ని వేటాడి తినే కిరాతకుడు. కాన వాడ్ని క్రిందకు తోయుము అని చెప్పింది.

"దానికి ఎలుగుబంటు ఒప్పుకొనక, వేటగాడికి అభయమిచ్చి నిద్ర పోయింది.

"ఆ సమయంలో పెద్ద పులి వేటగాడితో ఆ ఎలుగుబంటును క్రిందకు తోయుము నిన్ను వదిలేస్తాను అని చెప్పింది.

"దానికి ఆ వేటగాడు నిదురిస్తున్న ఎలుగుబంటును క్రిందకు తోసేశాడు. ఎంత నిద్రలో ఉన్నా, సహజ ప్రాణరక్షణ లక్షణంతో ఏమరుపాటుగా కొమ్మపట్టుకొని తనని తాను రక్షించుకుంది.

"చూశావా! ఆ మానవుడు నీచుడు. ఆశ్రయం ఇచ్చి, అభయం ఇచ్చిన నిన్నే మృత్యువుకి ఎర వేశాడు. కాన ఇకనైనా వాడ్ని కింద పడేయ్ అడిగింది పులి.





"దానికి ఎలుగుబంటు, నాకెంత అపకారం చేసినా తిరిగి నేను ఇతనికి అపకారం చెయ్యను. ఎదుటి వారు మంచివారో, చెడ్డవారో మనకి అపకారం చేస్తారో, ఉపకారం చేస్తారో అది వారి విజ్ఞత.

"విజ్ఞత కలవారు ఎవ్వరికైనా ఉపకారమే చేస్తారు. అపకారం చేసినవారు ఆపై ఎవరి కర్మ ఫలాలను వారు అనుభవించక తప్పదు" అని చెప్పింది ఎలుగుబంటు.

"చూశావా! హనుమా! అంత కీడు జరిగినా ఎలుగుబంటే అంత ధర్మంగా ప్రవర్తిస్తే మానవులం మనమెంత ధర్మంతో మెలగాలో...."

వాక్యకోవిదుడు హనుమ సీతాదేవితో చెప్పాడు.

"తల్లీ! సమస్త సద్గుణాల రాశివి. శ్రీరాముడికి తగిన ఇల్లాలివి" అన్నాడు భక్తిగా.....

"నాయనా! హనుమా! మహావీరుడూ, స్థిరులైన మిత్రులు కలవాడూ, పూర్ణచంద్రుని ముఖం వంటి నా భర్తను చూడవలెనని వేగిర పడుతున్నాను."

"తల్లీ! శచీదేవి దేవేంద్రుడ్ని చూసినట్టు ఎడబాసిన మహా విష్ణువును లక్ష్మీదేవిని చేరినట్టు చేరగలవు" చెప్పాడు మాటల కోవిదుడు హనుమంతుడు.

## సీతారాములు

వాయుపుత్రుడు హనుమ శ్రీరాముని వద్దకు వచ్చి సీతతో జరిగిన సంభాషణ యావత్తు విన్న వించాడు.

"ప్రభూ! లక్ష్మణసమేతుడవై ఉన్న నిన్ను వెంటనే చూడాలని సీతమ్మ తల్లి కోరింది."

శ్రీరాముడి ఆదేశం అయింది.

మహా సాధ్వీమణి సీతాదేవి శ్రీరాముడి వద్దకు వస్తోంది. వానరులంతా సీతమ్మ తల్లిని చూడటానికి వేగిరపడుతున్నారు. విభీషణుడు అందర్నీ వెళ్ళిపొమ్మని చెప్పాడు.

శ్రీరాముడు వారించాడు.

"విభీషణా! వీరంతా నా స్వజనము. రాజ గౌరవాలు ఎంత మాత్రం వద్దు. వారి వారు పోయినప్పుడూ, రాజ్య క్షోభమూ, సంకట, యుద్ధ, వివాహ, శుభకార్యాలలో స్త్రీలు పర పురుషులకు అగుపించుట దోషము కాదు. కాన అందర్నీ ఉండ నివ్వు" చెప్పాడు.

పతినే దైవంగా పూజించే సీతాదేవి నీళ్ళు నిండిన కళ్ళతో, విస్మయంతో, అనురాగముతో, ఆనందంతో వైదేహి మెల్లగా నడుచుకుంటూ వచ్చి శ్రీరాముడ్ని చూసింది.

ఎంతో కాలం నుంచి ఉదయించని చంద్రుడు ఒక్కసారిగా ఉదయించినట్టు సీతాదేవి మనోహరమైన తన భర్తని తనివి తీరా చూసింది.

శ్రీరాముడు పెడముఖమై ఉన్నాడు.

లక్ష్మణ, సుగ్రీవ, హనుమ, జాంబవంతాది వానర వీరులకూ, విభీషణుడికీ అర్థం కాలేదు. దూరాన మహా కెరటాల సముద్ర ఘోష మాత్రమే వినవస్తోంది.

శ్రీరాముడు తన గంభీర కంఠంతో చెప్పాడు. సముద్ర ఘోష పెద్దదయ్యింది. కెరటాలూ ఉద్వేగంతో ఎగిసిపడుతున్నాయి.

"సీతా! నిన్ను అపహరించి తెచ్చిన రాక్షసుడ్ని సంహరించాను. నీకు స్వేచ్ఛనిస్తున్నాను. కామంతో నిండిన వాడి ఇంట ఉన్న దానవు. నిన్ను స్వీకరించిన నన్నూ కాముకుడంటుంది లోకం. పర గృహంలో ఉన్న భార్యని స్వీకరించలేను. నిన్ను పరిగ్రహించలేను.

"మంగళప్రదురాలా! రాజ ధర్మం, భర్త ధర్మం నిర్వర్తించాను. లోకాపవాదు పడకుండా, ఇక్ష్వాకు వంశచరిత్ర కళంకమవ్వకుండా నిన్ను చెర విడిపించాను.

"సీతా! నీవు స్వేచ్ఛా జీవివి. ఈ పది దిక్కుల్లో ఏ దిక్కుకైనా నీవు నిరభ్యంతరంగా వెళ్ళవచ్చును. నీ కిష్టమైన చోటులో ఉండవచ్చు" శ్రీరాముడు స్పష్టంగా సీతాదేవితో చెప్పాడు.

మగ ఏనుగు తొండముతో లతను పెకిలించితే విలవిలలాడే లతలా కన్నీరు కార్చింది సీతాదేవి.

లక్ష్మణ, హనుమ, సుగ్రీవ, జాంబవంత, అంగదాదులు నిర్ఘాంత పోయారు. పూవు కన్నా మెత్తనైన శ్రీరాముడేనా ఆ పలుకులన్నది.

## అగ్ని ప్రవేశము

సీతాదేవి భర్త మాటలతో క్రుంగిపోయింది. విలవిలలాడిపోయింది. కొంత సేపటి తర్వాత కన్నీరు తుడుచుకుంది.

"నాథా! సామాన్య స్త్రీ వలే నన్ను ఇట్లు అనరాని మాటలంటున్నారు. మీ నిర్ణయం ఇదే అయితే...





"ఏనాడో ప్రాణత్యాగం చేసేదాన్ని. పరాధీననైన నేను ఏం చెయ్యగలను. మీ కోసం ఎదురు చూడటం తప్ప.

"ఆనాడే లంకకొచ్చిన హనుమంతుడితో నన్ను పరిగ్రహించలేనని, విడిపిస్తానని చెప్పి ఉంటే, అక్కడే, అప్పుడే ప్రాణాలు వదిలేదాన్ని, సేతువు కట్టడమూ, రాక్షస వధ తప్పేది.

"ఇప్పుడైనా మించి పోయింది లేదు. మిమ్మల్ని చూశాను. అది చాలు. అగ్నిలో ఆహుతి అయి నా తల్లి భూదేవిని చేరుతాను" అని మౌనంగా, దీనంగా ఉన్న లక్ష్మణుడికి చెప్పింది.

"లక్ష్మణా! నిన్ను అనరాని మాటలన్నాను. దానికి ప్రతిఫలం అనుభవిస్తున్నాను.

"ఈ కష్టాలకు ఔషధం ఒక్కటే. అపవాదు పడ్డ నేను జీవించి, దోషం గల దానినై ఉండలేను. ఉత్తమగతి అగ్ని ప్రవేశము" చెప్పింది.

లక్ష్మణుడు వ్యధ చెందుతూ శ్రీరాముని వంక చూశాడు. శ్రీరాముడు తలవంచుకున్నాడు. లక్ష్మణుడు చితి పేర్చాడు.

శ్రీరాముడు ప్రళయకాలమందు యముడిలా గంభీరంగా ఉన్నాడు. ఎవ్వరూ పలుకరించే ధైర్యం కూడా చెయ్యలేకపోయారు.

సాధ్వీమతల్లి సీతాదేవి శ్రీరామునకు ప్రదక్షిణం చేసింది. చితి భగభగ మండుతోంది. సీతాదేవి చితికి అంజలి ఘటించింది. సమస్త వానర సేనా కన్నీరు కార్చారు.

సీతాదేవి సూర్యునకూ, వాయువునకూ, దిక్కులకూ, చంద్రునకూ, పగలూ, రాత్రీ, సంధ్యలకూ, సర్వదేవతా కోటికీ సమస్కరించింది. అగ్నిలో ప్రవేశించింది.

సమస్త భూతకోటి విలవిలాడిపోయింది. శ్రీరాముడి కనులలో కన్నీరు చుట్టుముట్టింది. రాక్షస స్త్రీలంతా బిగ్గరగా ఏడ్చారు.

## బ్రహ్మాది దేవతలు

సీతాదేవి అగ్ని ప్రవేశంతో శ్రీరాముడు వ్యధ చెందాడు. కనులు మసకబారి ముందు ఏమీ కనిపించలేదు.

శ్రీరఘురాముని వద్దకు బ్రహ్మదేవుడూ, యముడూ, ఇంద్రుడూ, సహస్రాక్షుడూ, వరుణుడూ, వాయువుతో పాటు దేవతా శ్రేష్ఠులంతా వచ్చారు.

"శ్రీరామా! నీవు జ్ఞానవంతుడవు. లోక కళ్యాణం కోసం జన్మించిన వాడవు. మూడు లోకముల సృష్టి కర్తవు. లోకాలన్నీ నాశనమైనా నీవు మాత్రం జీవించి ఉండు శక్తి గలవాడవు. నీ భార్య ఇటుల అగ్ని ప్రవేశం చేయుట సబబు కాదు" చెప్పారు.

శ్రీరాముడు దేవతలతో చెప్పాడు.

"నేను దశరథ కుమారుడను, శ్రీరాముడను, మానవుడను. ధర్మమే నా ధర్మం. ఆ ధర్మంతో ఈ పని చేశాను."

అప్పుడు మహాదేవుడైన బ్రహ్మదేవుడు శ్రీరామునకు చెప్పాడు.

"శ్రీరామా! నీవు మానవుడవు కాదు. సాక్షాత్తు శ్రీమహా విష్ణువువి. నీ భార్య సీతాదేవి లక్ష్మీదేవి.

"నాలుగు భుజములు కలవాడవు. స్వప్రకాశ స్వరూపుడవు. లక్ష్మీపతివి. సర్వసమర్ధుడైన నారాయణుడవు. వరాహమూర్తివి. నాభియందు పద్మమున్నవాడవు.

"సకలప్రాణుల్లోనూ, గోవుల్లోనూ, మానవుల్లోనూ, సమస్త దిక్కుల యందూ, చెట్టూ, పుట్టా యందున్న శ్రీమహావిష్ణువువి.

"శ్రీరామా! నేనే నీ హృదయం. నాలుకే సరస్వతీదేవి. నీ కనురెప్పపాటు రాత్రి, తిరిగి కన్ను తెరుచుట పగలు. రామా! నిన్ను భక్తిగా కొలిచిన వారు, ఇహ, పర లోకాలనందు తమ కోరికలు తీర్చుకొనగలరు" చెప్పాడు బ్రహ్మదేవుడు.

## సీత పరమ పవిత్రురాలు

తప్తకాంచన బంగారు ఆభరణాలు ధరించి, అగ్ని దేవుడు అగ్ని గుండంలో సీతాదేవితో ప్రత్యక్షమయ్యాడు. అగ్నిలో దూకే ముందు ఎలా ఉందో అలానే ఉంది సీత.

అగ్నిదేవుడు వినయంగా శ్రీరాముడి వద్దకు వచ్చి చెప్పాడు.

"ప్రభూ! శ్రీరామా! సీతాదేవి పరమ పవిత్రురాలు. జగదేక మాత స్పర్శతో నాలోని మలినము పోయింది.

"నీ యందే చిత్తము నిలిపిన సీతను స్వీకరించుము" చెప్పాడు అగ్నిదేవుడు.

శ్రీరాముడు సీతను చూశాడు.





"అగ్నిదేవా! సీత పరమ పావని అని నాకు తెలుసు. ఓ కాముకుడి ఇంట ఉన్న స్త్రీని నేను త్వరపడి స్వీకరిస్తే లోకం అనేక రకాలుగా అంటుంది. అది నాకూ, సీతకూ, ఇక్ష్వాకు వంశానికీ గౌరవం కాదు.

"సీతాదేవి పరమ సాధ్వి, మహా పతివ్రత, నిర్దోషురాలు అయిన వైదేహి... సీత... కాంతి సూర్యుడ్ని వీడి ఉండనట్టు నాతోనే ఉంటుంది.

"జనకరాజ పుత్రి అయిన సీతాదేవితో సమానమైన మహాసాధ్వీమణి, పవిత్రురాలూ, పతివ్రత, దృఢవ్రత ముల్లోకాల్లోనూ లేదు అని నిరూపించటం కోసమే ఈ అగ్నిపరీక్ష. ఆత్మాభిమానం గలవాడు కీర్తిని వదులుకోనట్టు నేను నా ప్రియభార్యను వదలజాలను" చెప్పాడు శ్రీరాముడు.

రఘువంశ తిలకుడూ, మహా వీరుడూ అయిన శ్రీరాముడ్ని సీతాదేవి చేరింది. వానర, రాక్షసులు ఆనందంలో జయ జయ ధ్వనులు చేశారు.

## దశరథుడ్ని రామలక్ష్మణులు చూచుట

దేవతాశ్రేష్ఠులంతా పరమానంద భరితులయ్యారు.

పరమశివుడు శ్రీరాముడితో చెప్పాడు.

"శ్రీరామా! పుండరీకాక్షా! మహా యుద్ధం చేశావు. లోకానికి రావణ బాధను తొలగించావు. ఇక అయోధ్య చేరు.... భరతుడ్ని కలుసుకో... నీ తల్లులైన కౌసల్యా, సుమిత్రా, కైకేయీదేవీలను సంతోష పెట్టు... భార్యతో సకల ఐశ్వర్యాలూ, సుఖాలూ అనుభవిస్తూ రాజ్యపాలన చెయ్యి. అశ్వమేధ యజ్ఞం చెయ్యి. ఎంతో కీర్తిని సంపాదించి వైకుంఠాన్ని చేరు.

"రామా! నీ తండ్రి దశరథుడు ఆ దివ్య విమానంలో ఉన్నాడు. నీ కోసమే చూస్తున్నాడు. వెళ్ళండి వెళ్ళి చూడండి" చెప్పాడు మహాశివుడు.

శ్రీరామలక్ష్మణులు దివ్య విమానంలోకి వెళ్ళారు. తండ్రి దశరథుడ్ని చూశారు.

దశరథుడు శ్రీరాముడ్ని దగ్గరికి తీసుకున్నాడు. ఒళ్ళంతా తడిమాడు. అక్కున చేర్చుకున్నాడు. లక్ష్మణుడ్ని, సీతనూ తనివి తీరా చూశాడు.

నిర్మల వస్త్రాలు ధరించి, చెమ్మగిల్లిన కళ్ళతో చెప్పాడు.

"రామా! నిన్ను వదలి స్వర్గంలో ఉన్నా, నాకు సుఖంగా లేదు. రామా! శత్రుసంహారం చేశావు. లోకానికి మంచి చేశావు. ఇక్ష్వాకు వంశానికి ఘన కీర్తిని తెచ్చావు.

"నాయనా! రామా! నీ వనవాస కాలం తీరిపోయింది. కైక కోరికలకు సార్థకత చేకూరింది. లక్ష్మణుడితో, కోడలితో నీవు తక్షణమే అయోధ్య చేరు. పది వేల సంవత్సరాలు అయోధ్యని పాలించు.

"నూరు అశ్వమేథ యాగాలు చేయి నాయనా! అందర్నీ సుఖపెట్టు నాయనా! నందిని శాస్త్రవాదముతో ఏకపాదుడి పుత్రుడు అష్టావక్రుడిని ఓడించి, తండ్రికి ఆనందం కలిగించినట్టు నాకు పరమానందం కలిగించావు. చాలు నాయనా!

"ఇక అయోధ్య వెళ్ళండి. భరతుడనూ, శత్రుఘ్నుడనూ, తల్లులనూ మీ ముగ్గురూ వెళ్ళి కలుసుకోండి. అట్టి ఆ దృశ్యాన్ని పైనుంచే చూసి సంతోషిస్తాను" అని సీతమ్మ వైపు తిరిగాడు.

"తల్లీ! లోకపావనీ! నీ స్త్రీ ధర్మం ముల్లోకాల్లోనూ తలమానికం. నీ పతిభక్తీ, నీ పాతివ్రత్యమూ అనన్యసామాన్యం.

"నీ పవిత్రతను లోకానికి చాటుటకై శ్రీరాముడు నిన్ను అగ్నిప్రవేశం చేయించాడు. కాన తల్లి... అంతా శుభమే" అని చెప్పి ఆశీర్వదించి దివ్య విమానంలో దేవలోకం వెళ్ళిపోయాడు.

## వానరులకు దేవేంద్రుడి వరాలు

పాకాసుర సంహారకుడు దేవేంద్రుడు శ్రీరామునికి నమస్కరించాడు.

"శ్రీరామా! నిన్ను దర్శించాను. ఎంతో సంతసిస్తున్నాను. నేను చెయ్యవలసిన ఏ కార్యమైనా ఉన్నదా? చెప్పిన చెయ్యగలవాడను" అడిగాడు దేవేంద్రుడు.

శ్రీరాముడు ప్రసన్నంగా చెప్పాడు.

"దేవేంద్రా! నా కోసం భార్యలనీ, పుత్రులనీ, బంధువులనూ వదలి వచ్చి ఈ మహా యుద్ధంలో మరణించిన వానరులను బ్రతికించు. వారంతా వీరాధి వీరులు. ప్రభు భక్తులు.

"వానరులకూ, భల్లూకములకూ ఎట్టి శరీర బాధలూ లేకుండా నిండు ఆరోగ్యముతో చూడవలెనని ఆశిస్తున్నాను.

"మహేంద్రా! అట్టే వానరులు జీవించే అరణ్యాలూ, పర్వతాలూ, నగరాల్లో జలాలూ, మధుర ఫలాలూ, కందమూలములూ సమృద్ధిగా, మధుర రుచులతో పండాలి... పూలూ, ఫల వృక్షాలు నిండుగా ముత్తైదువుల్లా కళకళలాడాలి."





శ్రీరాముడి మనోరథం ప్రకారము యుద్ధంలో రాక్షసుల చేత సంహరించబడిన వానరులనందరినీ లేపాడు. వారంతా మహాసంతోషముతో ఎగిరారు. గోల చేశారు.

"శ్రీరామా! కాలంతో సంబంధం లేకుండా అకాలంలో కూడా ఫల, వృక్ష, కందమూల ఫలాలు సమృద్ధిగా ఉండేలా, పంచభూతాలనూ ఆదేశించాను" చెప్పాడు దేవేంద్రుడు.

దేవేంద్రుడూ, దేవతలూ, శ్రీరాముడి నుంచి శెలవు తీసుకొని తమతమ లోకాలకి వెళ్ళారు.

## అయోధ్యకు పయనము

లంకా పురాధీశుడు విభీషణుడు రాత్రి గడిచి తెల్లవారగానే శ్రీరాముడ్ని దర్శించుకున్నాడు. జయ శబ్దాల్ని పలికాడు.

"రామా! మంగళ స్నానం ఏర్పాటు చేశాను. కాన తమరు రావలెయును."

"మిత్రమా! విభీషణా! వలదు. నా తమ్ముడు భరతుడ్ని చూడాలి. నాకై పరితపిస్తుంటూ ఎదురు చూస్తుంటాడు. మహా ప్రతిజ్ఞాపరుడ్ని నేను వెంటనే చూడాలి" చెప్పాడు శ్రీరాముడు.

"శ్రీరామా! కుబేరుని పుష్పక విమానం ఉంది. నీవు కోరిన సమయానికి అయోధ్య చేరుస్తుంది. కాన శ్రీరామా! నా మాట మన్నించు. ఒక్కరోజు నా ఆతిథ్యాన్ని స్వీకరించు....."

"విభీషణా! మిత్రుడవు... పరంతపుడవు... లంకకు రాజువు... ఉత్తమమైన స్నేహితుడవు. కాదనుట తగదు.

"కానీ అక్కడ భరతుడు వనవాసకాలం పూర్తి అయిన పిదప నేను కానరాకపోతే అనర్థం చేసుకొనగలడు. నేను భరతుడ్నీ, తల్లులనూ చూడాలి. అయోధ్యా పౌరులను కలుసుకోవాలి.

"రాక్షసరాజా! తక్షణమే పుష్పక విమానం తెప్పించు. ఇక్కడ ఇంకేమియు పనిలేదు. పనిలేని చోట ఉండుట, యుక్తం కాదు" చెప్పాడు శ్రీరాముడు.

శ్రీరామునికి నమస్కరించాడు విభీషణుడు. సూర్యసమానమైనదీ, బంగారు పద్మములతో, చక్కటి ధ్వజములతో, చక్కటి ఆసనములతో, వజ్ర, వైఢూర్యమణులతో, అరుగులతో ఉండే పుష్పక విమానాన్ని శ్రీరాముడి కోసం సిద్ధం చేశాడు.

# పుష్పక విమానం

అత్యుత్తమమైన సుందర రెక్కల పుష్పక విమానం సిద్ధంగా ఉంది. చక్కని ప్రతిమలతో శోభాయమానంగా ఉంది. వినయంగా ఉన్న విభీషణుడితో చెప్పాడు శ్రీరాముడు.

"లంకాధిపతి విభీషణా! వానరులంతా ఎంతో శ్రమకోర్చి, నా కార్యాన్ని తమ కార్యంలా భావించి మహా యుద్ధం చేసి అలసి పోయారు. వారు సేద తీరేలా ఏర్పాట్లు చెయ్యి. రత్నాలూ, ధనమూ ఇచ్చి సంతోషపెట్టు, సంతోష పరుచు.

"విభీషణా! తన గుణాలతో సహచరులను ఎవరెక్కువ సంతోష పెడతారో, వాడే గొప్పరాజు అవుతాడు. అట్లా చెయ్యనిచో ఆపదలొచ్చినప్పుడు సహచరులూ, మంత్రులూ దూరంగా ఉంటారు. తద్వారా అపజయము మాత్రమే మిగులుతుంది" అని చెప్పి పుష్పక విమానంలోకి ప్రవేశించాడు శ్రీరాముడు.

సీతాదేవి ఒద్దికగా భర్త శ్రీరాముని ప్రక్కన కూర్చుంది. మహా వీరాధి వీరులైన వానర వీరులంతా శ్రీరాముడ్ని వేడుకున్నారు. అయోధ్యకి వస్తామని చెప్పారు.

"శ్రీరామా! విభీషణ, అంగద, జాంబవంత, హనుమంతాది వీరు లందరూ నీ అయోధ్య చూడాలని కోరుతున్నారు. నీ అనుమతితో సుందర అయోధ్య వనాల్లోనూ, ఉద్యావనాల్లోనూ తిరిగి చూడాలని నాకూ ఉంది" చెప్పాడు సుగ్రీవుడు.

శ్రీరాముడు అప్యాయంగా అందరినీ ఆహ్వానించాడు. అందరితో పుష్పక విమానం కదిలింది.

మిథిలా నగర రాకుమార్తె సీతదేవికి ఆకాశ మార్గాన విహరిస్తూ వెళ్తున్న పుష్పక విమానం నుంచి త్రికూట పర్వతం మీదున్న సుందర లంకానగరాన్ని చూపించాడు.

"సీతా! అదిగో చూడు. బంగారు కొండలా ఉన్న లంకానగరం. అదిగో ఆ మధ్యన పచ్చలహారంతో పచ్చగా కనిపించే అశోకవనం...

"విశాలనేత్రి సీతా! ఇదిగో ఇక్కడే దశగ్రీవుడు రావణుడు పదితలలు తెగి మరణించినది. అదిగో అక్కడ కుంభకర్ణుడు మరణించాడు. ఈ వైపున హనుమ చేతిలో ధూమ్రాక్షుడు మరణించాడు.





"సుషేణుడి చేతిలో విద్యున్మాలి ఇక్కడే మరణించింది. అదిగో ఈ ప్రాంతములోనే ఇంద్రజిత్తు, లక్ష్మణుడి బాణంతో కైలాసానికి వెళ్ళాడు.

"ఓ విశాలాక్షీ! ఇక్కడ అంగదుని చేతిలో వికటుడు మరణించాడు. మహా భయంకర రాక్షసులైన విరూపాక్షుడూ, మహాపార్శ్వుడూ, మహోదరుడూ, అకంపనుడూ, దేవాంత నరాంతకులు ఇక్కడ మన వానర వీరులు చేతిలో హతులయ్యారు.

"సీతా! ఇదిగో సముద్రం దాటిన తర్వాత ఇక్కడే విడిది చేశాము. అదిగో మహాసముద్రంపై కట్టిన సేతువు.

శ్రీరాముడు చెబుతుంటే సీతాదేవి పులకిస్తూ చూస్తోంది.

"అదిగో మైనాక మను సుందర పర్వతము. వాయుపుత్రుడు హనుమకై సముద్ర గర్భం నుంచి చొచ్చుకొని వచ్చి స్థిరంగా నిలిచి ఉన్నది.

"అదిగో అక్కడ సేతు బంధనము మహా పుణ్య ప్రదేశం. ఇక్కడ్నించే త్రికూట పర్వతం వరకూ నూరు యోజనాలు వానరులు సేతువు నిర్మించారు.

"మైథిలీ అదిగో అదే కిష్కంధా నగరం. సుగ్రీవుల, అంగదుల రాజ్యం. ఇక్కడే మహావీరుడైన వాలిని సంహరించింది.

సీతాదేవి కిష్కింధను చూసింది.

"నాథా! కిష్కింధలో ఆగి తారనూ, సుగ్రీవుడి ప్రియభార్యనూ తీసుకు వెళదాం" అడిగింది.

శ్రీరాముడు సుగ్రీవుడితో చెప్పాడు.

"మిత్రుడా! నీవూ, నీ కుటుంబమూ, బంధుమిత్ర, మంత్రులతో లంకలోని వానరులనూ, వారి కుటుంబాలనూ అయోధ్యకి నా మాటగా ఆహ్వానించి తీసుకు రావలెను" అని చెప్పాడు సుగ్రీవాదులకు.

సుగ్రీవాదులు కిష్కింధలో దిగి చల్లటి శుభవార్తను సుందర తారకూ, మిగతా వారికీ చెప్పాడు.

అంతా అయోధ్యకి వెళ్ళటానికి సన్నాహాలు మొదలు పెట్టుకున్నారు. తొందరగా సిద్ధమయ్యారు. మహా పుష్పక విమానంలోకి ఎక్కారు.

పుష్పక విమానం కదిలింది. ఋష్యమూక పర్వతాన్ని సమీపించింది.

"సీతా! ఇదియే ఋష్యమూక పర్వతం. ఇక్కడనే సుగ్రీవునితో చెలిమి చేసినది. అదిగో శబరి ఆశ్రమం. సుందర పంపా సరస్సు. అందమైనది.

అద్భుతమైనది. వసంతకాలంలో చూస్తే అయోధ్య లాంటి మరో నగరం ఇక్కడ నిర్మిద్దామంటావు.

"అదిగో ఈ వైపు చూడు కబంధుణ్ణి చంపింది అక్కడే. ఇదిగో ఇక్కడే నిన్ను అపహరించబోతున్న రావణుడ్ని జటాయువు అడ్డుకున్నదీ... మరణించినదీ...

"అదిగో మన పర్ణశాల... అదిగో సుతీక్ష్ణుని ఆశ్రమం. ఇక్కడే మనం దేవేంద్రుడ్ని చూశాం. అదిగో యమునా తీరం. భరద్వాజుని ఆశ్రమం. వనవాస కాలం పూర్తి అయ్యి తిరిగి అయోధ్య వెళ్ళేటప్పుడు వస్తామని చెప్పాం" అని పుష్పక విమానాన్ని భరద్వాజుని ఆశ్రమం వైపు పోనిమ్మన్నాడు.

## భరద్వాజుని ఆశ్రమం

చక్కటి పక్షులతో పుష్పించిన అడవులతో త్రిలోకాల్లో ప్రవహించే గంగానదినీ, తన మిత్రుడు గుహుడి రాజ్యం శృంగిబేరపురాన్నీ చూపించాడు సీతకు. సకల విషయాలు చెప్పి, దూరంగా కనిపిస్తున్న అయోధ్యని చూపించాడు.

సీతాదేవి కనిపిస్తున్న అయోధ్యకి నిండు మనస్సుతో నమస్కరించింది. పుష్పక విమానం భరద్వాజుని ఆశ్రమం వద్ద ఆగింది.

సీతారామలక్ష్మణులు భరద్వాజుని పరామర్శించారు. నమస్కరించారు. కుశలములయ్యాక అడిగాడు.

"మునీశ్వరా! అయోధ్య సర్వసంపదులతో తులతూగుతున్నాదా? భరతుడు ధర్మబద్ధంగానే పాలిస్తున్నాడు కదా! తమ యజ్ఞ, యాగాదులు ఎలా ఉన్నాయి" అడిగాడు.

"శ్రీరామచంద్రా! అంతా సవ్యంగానే ఉన్నది. సర్వసంగతులూ తపోబలంతో తెలుసుకున్నాను.

"శ్రీరామా! ఎన్నో కష్టాలనూ, దుఃఖాలనూ భరించావు. ఎంతో ధర్మనిరతితో మానవ ధర్మాన్ని సంపూర్ణంగా నీ భార్య సీతాదేవీ, నీ తమ్ముడు లక్ష్మణుడూ పాటించారు.

"సృష్టిలో శ్రీరాముడంతటి ధర్మపురుషుడు, సీతవంటి భార్య, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులవంటి తమ్ముళ్లూ పుడతారా! అన్న సందేహం కలుగుతోంది. భావి పౌరులకూ, సమస్త భూమండలానికీ బిడ్డగా, భర్తగా, రాజుగా, అన్నగా ఎట్లుండాలో చెప్పిన ఆదర్శమూర్తివి.





"శ్రీరామా! నా సంతోషం కోసం ఏదన్నా అడుగు. కోరిన వరమిస్తాను" చెప్పాడు భరద్వాజుడు.

శ్రీరాముడు నమస్కరించి చెప్పాడు.

"స్వామీ! అయోధ్య వరకూ ఆ ప్రాంతమంతా ఫల, పూల, కందమూల వృక్షాలు కాలం కాని కాలంలో కూడా పుష్పించాలి. కాయాలి. అదే నా కోరిక."

శ్రీరాముడ్ని ఆశీర్వదించాడు భరద్వాజుడు.

శ్రీరాముడు చేరాల్సిన అమరావతి వంటి అయోధ్య వరకూ, మూడు యోజనముల వరకూ ఎండివాడి వాలిన చెట్లు కూడా లేచి పుష్పించి, కాయలను కాచాయి.

వానరులు మధుర ఫలాలను ఆనందంగా తిన్నారు.

## భరతుడ్ని హనుమ కలుయుట

శ్రీరాముడి ఆదేశంతో హనుమ అయోధ్యకి బైలుదేరాడు. మధ్యలో శృంగిబేర పురం వెళ్ళి నిషాదరాజు గుహుడికి శ్రీరాముడి కుశలాన్నీ, క్షేమాన్నీ చెప్పాడు. అయోధ్యకి రమ్మని ఆహ్వానించాడు.

ఆపై అయోధ్యకి వెళ్ళి సీతారామలక్ష్మణులు వస్తున్నారన్న తీపి వార్తను అంతఃపురానికి చేర వేశాడు. నందిగ్రామం చేరాడు. భరతుడ్ని కలిశాడు.

భరతుడ్ని సర్వకుశలములూ అడిగి శ్రీరాముని రాక గూర్చి చెప్పాడు. అయోధ్యకి క్రోసు దూరంలో నందిగ్రామములో ఉన్న భరతుడు ఆనందంతో ఉక్కిరి బిక్కిరయ్యాడు.

వాయుపుత్రుడు హనుమ భరతునకు వనవాసకాలములో భరతుడు పాదుకలు తీసుకెళ్ళిన తర్వాత జరిగిన విషయాలన్నీ చెప్పాడు.

శ్రీరాముడు రావణుడ్ని సంహరించి, వానర సేనా నాయకులతోనూ లంకాధిపతి విభీషణుడితోనూ నీకడకు వచ్చుచున్నాడని తెలిపాడు.

శ్రీరాముడు వస్తున్నాడని హనుమ చెప్పటంతో భరతుడు పొంగి పోయాడు. హనుమంతుడ్ని కౌగిలించుకున్నాడు. శత్రుఘ్నుడు ఆనంద పరవశుడయ్యాడు.

భరతుడు శత్రుఘ్నుడితో ఉద్వేగంగా చెప్పాడు.

"శత్రుఘ్నా! శ్రీరాముడు వస్తున్నాడు. నందిగ్రామం నుంచి అయోధ్య వరకూ ఎట్టి మిట్ట పల్లాలూ ఉండరాదు. దారంతా పూలతో అలంకరించేలా

చూడు. అయోధ్య అంతా పూలతోనూ, తోరణాలతోనూ అలకరించేలా ఆజ్ఞాపించు" చెప్పాడు భరతుడు.

తెల్లవారితే శ్రీరాముడు అయోధ్య వస్తాడని అయోధ్య మొత్తం తెలిసింది. నంది గ్రామము క్రోసుడు దూరమే కదాని అనుకోకుండా తెలిసిన క్షణం నుంచే స్త్రీలు చక్కగా అలకరించుకున్నారు. వీధుల్లో పతాకాలు ఎగుర వేశారు. ముగ్గులు వేశారు. రంగులు దిద్దారు.

పురుషులు చక్కటి దుస్తులు ధరించారు. కోలాహలంగా మహా పండగలా నందిగ్రామం చేరారు. సత్య పరాక్రమం గల శత్రుసంహారకుడైన భరత, శత్రుఘ్నులూ, దశరథుని భార్యలూ, మంత్రులూ, సేనా నాయకులూ, హనుమా అంతా శ్రీరాముడి కోసం ఆకాశం వంక చూస్తున్నారు.

ఎంతో సేపటికి వానరుల అరుపులు వినిపించాయి. రాముడి కోసం ఎదురు చూస్తున్న అందరి శరీరాలు పులకించాయి. భరతుడికీ, శత్రుఘ్నుడికీ, శ్రీరాముడి తల్లులకీ కన్నీళ్ళతో కనులు మసకబారి పోయాయి.

ఆనందంతో ఉద్వేగం ఎక్కువై కనులలో ఆనంద భాష్పాలు సుడులు తిరిగి నేలరాలాయి.

ఆ ఆనంద క్షణం రానే వచ్చింది. శ్రీరాముని పుష్పక విమానం కానవచ్చింది. భూమి అదిరిపోయేలా శంఖ, దుందుభులతో ధ్వనులు చేశారు.

మహా సుందర, సుగంధ పూవులని విసిరారు. శ్రీరాముడు పుష్పక విమానం దిగాడు. వెనుకనే ఒద్దికగా సీతాదేవి దిగింది.

బ్రహ్మదేవుడు నిర్మించిన ఆ అద్భుత పుష్పక విమానంలోంచి దేవేంద్రుడిలా శ్రీరాముడు దిగగానే భరతుడు వేగంగా వెళ్ళి శ్రీరాముడ్ని కౌగిలించుకున్నాడు. సీతాదేవి అత్తగార్ల వద్దకు వెళ్ళింది.

భరత, శత్రుఘ్నులను లక్ష్మణుడు ఆలింగనము చేసుకున్నాడు. తనివి తీరా చూసుకున్నారు. వానరవీరులను పరిచయం చేశాడు లక్ష్మణుడు భరత, శత్రుఘ్నులకు.

భరతుడు వానరవీరులైన సుగ్రీవ, అంగద, జాంబవంత, విభీషణ, మైంద, ద్వివిద, నీల, ఋషభులను స్వాగతించి ఆత్మీయ ఆహ్వానం చేశాడు.

"సుగ్రీవా! మా నల్గురికి నీవు సోదరుడవు, అయిదవ వాడవు" అని కౌగిలించుకున్నాడు భరతుడు.





శ్రీరాముడు కౌసల్యాదేవీ, సుమిత్రాదేవీ, కైకేయీదేవి వద్దకు వెళ్ళి ముగ్గురికీ పాదాభివందనము చేశాడు. మహా మహితాత్ముడు వశిష్ఠుని వద్దకు వెళ్ళి వినమ్రతగా నమస్కరించాడు. శ్రీరామునకు భరతుడు పాదుకలు తొడిగాడు.

"రామా! ఈ రాజ్యం నీది. నేను కావలివాడను మాత్రమే. నీవు వచ్చావు. నీది నీకే అప్పగిస్తున్నాను" అని చెప్పాడు.

శ్రీరాముడు అయోధ్య పౌరులనూ, మంత్రులనూ పలకరించాడు. క్షేమ సమాచారలు అడిగాడు.

పుష్పక విమానాన్ని తిరిగి కుబేరుడి వద్దకు వెళ్ళమని ఆజ్ఞాపించాడు. శ్రీరామ ఆదేశంతో పుష్పక విమానం ఉత్తరం వైపుకి కైలాస పర్వత దిశగా వెళ్ళింది.

సూర్య మండలంలా మెరిసి పోతున్న రథాన్ని ఎక్కి అంతా అయోధ్య చేరారు. సీతాదేవి సుగ్రీవుని భార్యలకు సకల సదుపాయలనూ, అలంకరణలనూ చేసింది.

లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు వానరసేనా నాయకులకూ, విభీషణులకూ సమస్త భోగలూ అందుబాటులో ఉంచారు.

## శ్రీరామ పట్టాభిషేకం

భరతుడు శ్రీరామ పట్టాభిషేకానికై సుగ్రీవునికి చెప్పాడు.

"సుగ్రీవా! సుందర నగుమోము కలవాడు, మహా పరాక్రమవంతుడు శ్రీరాముడ్ని పట్టాభిషక్తుడ్ని చెయ్యవలెను. సముద్ర జలాలు తెప్పించాలి" చెప్పాడు.

సుగ్రీవుడు నలుగురు వానరులని పిలిచాడు. భరతుడిచ్చిన నాలుగు బంగారు కలశాలు తీసుకొని తెల్లవారేలోగా నాలుగు సముద్రాల నుంచి జలాలను తెమ్మన్నాడు.

సుగ్రీవుడి ఆదేశంతో మహావీరులైన ఆ నలుగురు వానరవీరులూ గరుత్మంతుడిలా వెళ్ళారు. మిగతా వానరులకూ పవిత్ర జలాలను తెమ్మని చెప్పాడు సుగ్రీవుడు.

జాంబవంతుడూ, హనుమంతుడూ, ఋషభుడూ, వేగదర్శీ ఐదు వందల నదుల జలాలను తెచ్చారు.

సుషేణుడు తూర్పు సముద్రం నుంచి రత్నాలు అలకరించిన కలశములో జలాన్ని నింపి తెచ్చాడు. ఋషభుడు దక్షిణ సముద్రం నుంచీ, నలుడు ఉత్తర సముద్రం నుంచీ, గవయుడు పశ్చిమ సముద్రం నుంచీ పవిత్ర జలాలను తెచ్చారు.

భరతుడు భక్తిగా వశిష్ఠునికి నమస్కరించి సకల ఏర్పాట్లు పూర్తి అయ్యాయని చెప్పాడు.

సర్వాంగ సుందరుడైన శ్రీరాముడ్ని, చూడచక్కని శ్రీరాముడ్ని, మహా సాధ్విమణి సీతమ్మ తల్లినీ వశిష్ఠుడు రత్నాల సింహాసనంపై కూర్చొండ బెట్టాడు.

అష్టవసువులు మహేంద్రుడ్ని అభిషేకించినట్టుగా వశిష్ఠుడూ, వాయుదేవుడూ, జాబాలి, కాశ్యపుడూ, కాత్యాయనుడూ, సుయజ్ఞుడూ, గౌతముడూ, విజయుడూ సుంగధ యుక్తమైన జలాలతో శ్రీరాముడికి అభిషేకం చేశారు.

ఆకాశం నుంచి పూల వాన కురిసింది. దేవతలు దుందుభులు మ్రోగించారు. ఋత్వికులూ, కన్యలూ, వారితో పాటు వచ్చిన దేవతల చేతా, వానర సేనా నాయకుల చేతా సముద్ర జలాలతోనూ, ఔషధుల జలాలతోనూ శ్రీరాముడ్ని అభిషేకించి పట్టాభిషక్తుడ్ని చేశారు.

సుగ్రీవుడూ, విభీషణుడూ శ్రీరాముడికి వింజామరలని పట్టారు. అప్సరస స్త్రీలు నాట్యం చేశారు.

వాయుదేవుడు ఇంద్రుడు పంపిన నూరు పద్మముల గల బంగారు మాలను బహూకరించాడు.

శ్రీరామ పట్టాభిషేకంతో భూమి సస్యశ్యామలమైంది. ఫల, పుష్ప, వృక్షాలు పోటిపడి కాశాయి. శ్రీరాముడు ఇవ్వాల్సిన దానాలు ఇచ్చాడు. సుగ్రీవునికి బహుమతిగా దివ్యమాల ఇచ్చాడు. వైఢూర్యమణులతో కూడిన బాహువులను అంగదుడికి ఇచ్చాడు.

శ్రీరాముడు చక్కటి ముత్యాల హారాన్నీ, వస్త్రాలనూ సీతాదేవికిచ్చాడు. మణులతో కూడిన ముత్యాల హారాన్ని చూసింది సీత.

ఆ సుందర హారాన్ని... శ్రీరాముడు ఇచ్చిన ఆ హారాన్ని నల్లని నేత్రములు గల సీతాదేవి హనుమకు ఇచ్చింది. వాయుపుత్రుడు హనుమ పరమానంద భరితుడయ్యాడు.

శ్రీరాముడు భరతుడ్ని యువరాజుగా చేశాడు.





సమస్త వానర వీరులకూ, విభీషణులకూ అపూర్వమైన ఆశ్చర్యకరమైన బహుమతులు ఇచ్చాడు.

ఎంతో కాలం ఉండి, ఆపై ఎవరి స్థానాలకి వాళ్ళు వెళ్ళారు. ప్రియ తమ్ముళ్ళతో, ప్రియ భార్యతో శ్రీరాముడు అయోధ్యని పాలించాడు. పౌండరీకము, అశ్వమేధము, వాజపేయములతో పాటు నూరు యజ్ఞములు చేశాడు.

శ్రీరాముని పాలనలో వృక్షములు ఎండలేదు. రోగాది భయాలు లేవు. ధనము ఏం చేసుకోవాలో తెలినీ స్థితి, పంచభూతాలూ ధర్మమూర్తి శ్రీరాముడి ధర్మగుణంతో మెలిగాయి.

యజ్ఞాలు చేసి బ్రాహ్మణులకు భూమినీ, గోవులనూ, ధనముతో పాటు రత్నాలను దానాలుగా ఇచ్చాడు.

పదివేల సంవత్సరాలు పరిపాలించాడు. ఆజానుబాహుడూ, ప్రతాప వంతుడూ, ధర్మవత్సలుడూ, సమస్త ధర్మాలూ తెలిసినవాడూ, పూజ్యుడూ, జగద్విఖ్యాతుడూ, ధర్మాత్ముడూ, పరంతపుడూ, భూనాథుడూ అయిన జగదభి రాముడు శ్రీరాముడు.

## ఫలశ్రుతి

రామాయణం ఆదికావ్యం. మహా కావ్యం. పుణ్యకావ్యం. చదివినా, విన్నా సమస్త పాపాలూ తొలిగిపోతాయి.

ధనం కావలిసిన వారికి ధనమూ, కీర్తి కావల్సిన వారికి కీర్తీ లభిస్తాయి. వేద సమానమైన వాల్మీకి రామాయణము చదివినా, విన్నా పుత్రులు కావాలంటే పుత్రులూ, పుత్రికలు కావలనుకుంటే పుత్రికలూ జన్మిస్తారు.

రామాయణ కావ్యాన్ని పూజిస్తే సకల ఐశ్వర్యాలు సిద్ధిస్తాయి. కౌసల్యా సుమిత్రా, కైకా, లక్ష్మణ భరత శత్రుఘ్న, సుగ్రీవ, అంగద, జాంబవంత, హనుమంతాదులతో వైభవంగా జరిగిన శ్రీసీతారామ పట్టాభిషేకం వరకూ అపాంతమూ చదివిన వారికి దీర్ఘాయువు కలుగుతుంది.

రామాయణాన్ని చదివితే వచ్చిన ఆపదలూ, రాబోయే ఆపదలూ తొలిగిపోతాయి.

కోపమూ, ద్వేషమూ, అహమూ, స్వార్థమూ, మదమూ తొలిగి ప్రశాంతతకు మారు పేరుగా నిలుస్తారు.